# తెలుగులో ఉద్యమ గీతాలు

డా॥ ఎస్వీ సత్యనారాయణ



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001

# TELUGU LOO UDYAMA GEETHALU
(Telugu Songs Based on Various Movements)
Ph.D Thesis
by **Dr. S.V.Satyanarayana**

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 1991

ముఖచిత్రం : మోహన్

**వెల : రూ. 90-00**

ప్రతులకు :

**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
4-1-435, విజ్ఞానభవన్, బ్యాంక్‌స్ట్రీట్,
హైదరాబాదు - 500 001

**విశాలాంధ్ర బుక్ హౌస్**
విజయవాడ, హైదరాబాదు, అనంతపురం, విశాఖపట్నం,
హన్మకొండ, గుంటూరు, తిరుపతి, కాకినాడ.

తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రితం.

ISBN : 81-7098-265-0

ముద్రణ : **పద్మావతి ఆర్ట్ ప్రింటర్స్** 1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380. ఫోన్: 68418.

**ఆచార్య ఎస్వీ రామారావు**
తెలుగు శాఖాధ్యక్షులు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

హైదరాబాదు,
23-8-1991.

# సత్యాన్వేషణ

ఈనాడు విశ్వవిద్యాలయాల్లో జరుగుతున్న పరిశోధన కేవలం డిగ్రీల నిమిత్తం సాగుతున్నది. అందుకే సిద్ధాంతవ్యాసాల స్థాయి గురించీ, ప్రమాణాల గురించీ విజ్ఞులు సందేహాలు వెలిబుచ్చుతున్నారు. డా॥ ఎస్వీ సత్యనారాయణ రచించిన ''తెలుగులో ఉద్యమగీతాలు'' మాత్రం ఇందుకు పూర్తిగా అపవాదం. పరిశోధనలో ఆసక్తి, పరిశోధనాంశంపై అభిరుచితో పరిశ్రమించి వెలువరించిన ఇటువంటి పరిశోధన గ్రంథాలే విశ్వవిద్యాలయ పరిశోధనపై వస్తున్న విమర్శలకు సరియైన సమాధానాలు.

ఇరవయ్యో శతాబ్దిలో తెలుగునాట ప్రజ్వరిల్లిన వివిధ ఉద్యమాలను, వాటి ప్రభావంతో వెలువడిన గీతాల స్వరూప స్వభావాలను విస్పష్టమైన రీతిలో వివేచించింది ఈ సిద్ధాంత గ్రంథం. సామాజికఅస్తిత్వం సామాజికచైతన్యాన్ని నిర్ణయిస్తుందని, దీనికి భిన్నంగా కూడా అప్పుడప్పుడూ సామాజిక అస్తిత్వం మీద సామాజికచైతన్యం ప్రభావం చూపుతుందనీ భావించిన రచయిత ఈ దృష్టితోనే జాతీయ స్వాతంత్ర్యోద్యమాలు, ఆంధ్రోద్యమం, తెలంగాణా పోరాటం, వామపక్ష ఉద్యమాల ప్రభావంతో ప్రభవించిన గీతాలను పరిశీలించాడు నిరసన, ఆందోళన, పోరాటం, విప్లవం మొ॥నవి ఉద్యమ దశలుగా గుర్తించాడు. దళితుల సమస్యలను చిత్రిస్తూ వస్తూన్న గీతాలు కూడా స్పృశించాడు. చివరగా ఉద్యమగీతాలలోని ఛందస్సు, భాషాస్వరూపం పరామర్శించాడు.

పరిశోధకుని యధార్థ దృష్టికి, నిజాయితీకి ఈ గ్రంథం నిదర్శనం. అభ్యుదయ రచయితల సంఘంతో సాన్నిహిత్యం కలిగిన సత్యనారాయణ ఏ విధమైన పక్షపాతాలు లేకుండా వాస్తవాలను స్పష్టంగా పేర్కొన్నాడు. ఈ క్రింది పంక్తులే అందుకు సాక్ష్యం - ''సికింద్రాబాద్ కుట్రకేసులో రాజకీయ కార్యకర్తలతో పాటు కె. వి రమణారెడ్డి, వరవరరావు, త్రిపురనేని మధుసూదనరావు చెరబండరాజు మొ॥ వారిని కూడా ''ఇరికించారు.'' (పు. 328)

''అందులోంచి (కమ్యూనిస్టుపార్టీ) 1964 లో చీలిన ఒక వర్గం 1969 లో మరిన్ని వర్గాలుగా చీలి చీలికల సిద్ధాంతానికి బీజాలు వేసింది.'' (పు. 321)

''ఇవ్వాళ సరిగ్గా ఎన్ని విప్లవకారుల వర్గాలున్నాయో, ఎన్ని ఉపవర్గాలున్నాయో, ఇందులో ఏ వర్గంద్వారా విప్లవం నడుస్తున్నదో ప్రత్యేకంగా పరిశోధన చేయాల్సిన అంశం.'' (పు. 330)

1930 తర్వాత తాను తెలుగు సాహిత్యాన్ని నడిపించానని చెప్పుకున్న శ్రీశ్రీ తెలుగు నేలను కుదిపేసిన ఏ ఉద్యమంలోనూ స్పందించినట్లుగానీ, ఉద్యమ గీతాలు రాసినట్లుగానీ కనబడకపోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నదని పరిశోధకుడు నిర్ద్వంద్వంగా ఉగ్గడించాడు.

సత్యనారాయణ సూక్ష్మ పరిశీలన ద్వారా కొత్త విషయాలు వెలుగులోనికి వచ్చాయి. తొలి తెలుగు మహిళా రాజకీయ ఖైదీ శ్రీమతి రావూరి అలువేలమ్మ (పు. 35), తెలుగులో తొలి ఎర్రజెండా గీతాన్ని రచించినవారు తుమ్మల వెంకటరామయ్య (పు. 344) మొ॥నవి ఇందుకు తార్కాణాలు

భావ ప్రకటనలో స్పష్టత, భాషా శైలిలో సారళ్యం ఈ సిద్ధాంత గ్రంథంలోని గుణాలు. సత్యాన్వేషణ దృష్టితో పరిశోధనరంగంలో కృషి సలిపి సత్యనారాయణ నామసార్థక్యం పొందాలని ఆకాంక్షిస్తున్నాను.

డా॥ ఎన్. గోపి
ప్రొఫెసర్,
తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

హైదరాబాదు,
18-9-1991.

# పర్యవేక్షక వాక్యం

ఎస్వీ. సత్యనారాయణ రచించిన ఈ గ్రంథం నా పర్యవేక్షణలో వెలువడిన మొట్టమొదటి సిద్ధాంత వ్యాసం. పీఠిక రాయమని ఎస్వీ కోరితే కొంచెం తటపటాయించాను. తన మార్గదర్శకత్వంలో వచ్చిన పుస్తకానికి పీఠిక రాయటం పర్యవేక్షకుడికి యిబ్బందే. మెచ్చుకున్నా, లోపాలు ఎత్తిచూపినా బాగుండదు; ఆ రెండింటిలో తనకూ కొంత భాగస్వామ్యం ఉంటుంది కాబట్టి.

నిజానికి ఈ పర్యవేక్షక బాధ్యత నాకు యాదృచ్ఛికంగా సంక్రమించింది కాదు. ఎస్వీ మొదట స్వర్గీయ గోపాలకృష్ణారావు గారికి allot అయ్యాడు. వారి మరణానంతరం నా పర్యవేక్షణలోకి వచ్చాడు. అప్పటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య కులశేఖరరావుగారు ఎస్వీ అభ్యర్థన మేరకు ఇతన్ని నాకు కేటాయించారు. యోగ్యతనుబట్టి అభ్యర్థుల ఇష్టాయిష్టాలను పరిగణించే కులశేఖరరావుగారిని ఈ సందర్భంగా స్మరిస్తున్నాను.

ఎస్వీ అంటే నాకూ సరదాయే. కవి, వ్యాసరచయిత, అభ్యుదయ సాహిత్యోద్యమంలో ఉన్నవాడు, అందుకనే కులశేఖరరావుగారి ఆదేశాన్ని ఆనందంగా అంగీకరించాను.

పిహెచ్.డి పరిశోధనకు వచ్చేవాళ్ళలో రెండు రకాలుంటారు. ఎం.ఏ లేదా ఎం.ఫిల్ తర్వాత పిహెచ్.డిలో చేరాలనుకునేవాళ్ళు ఒకరకం. అప్పటికే అభిరుచి ఉండి, రచనా వ్యాసంగంలో కొంత ప్రవేశం ఉండి పిహెచ్.డి ద్వారా తమ రచనా పాటవాన్ని నిరూపించుకోవాలనుకునే వాళ్ళు రెండోరకం. ఎస్వీ రెండో రకానికి చెందినవాడు.

ఎస్వీ నాకు allot అయినప్పుడు ఈ సిద్ధాంత విషయానికి సంబంధించి తెల్లకాగితంలా వచ్చినవాడే. తొలి మురిపెంలో ఉన్నాను కాబట్టి ఇతనిపట్ల నేను అమితమైన శ్రద్ధ తీసుకున్నాను. Work Culture పట్ల విశ్వాసం కలవాణ్ని కాబట్టి అతని వ్యక్తిగత పరిమితులను గమనించకుండా విషయ సేకరణ కోసం ఆంధ్రదేశంలోని వివిధ ప్రాంతాలకు నిర్దాక్షిణ్యంగా తరిమాను. అననుకూల పరిస్థితుల్లో ఎన్నో సుదూరప్రాంతాలకు వెళ్ళి అపురూపమైనగీతాలెన్నో సేక

రించాడు. ఎస్వీలో అందిస్తే అల్లుకుపోయే స్వభావాన్ని గమనించాను. అందుకే అతనితో కొంత కఠినంగా వ్యవహరించి పని చేయించాను. ఎస్వీ దానికి తట్టుకున్నాడు.

ఈ సందర్భంగా నేనొకటి చెప్పదల్చుకున్నాను. కొంతమంది సాహిత్య వేత్తలు యూనివర్సిటీలను విమర్శిస్తూనే అవిచ్చే డిగ్రీల కోసం యమ తాపత్రయ పడతారు. ఇదొక విచిత్రమైన పరిస్థితి. మౌలికంగా యూనివర్సిటీ వ్యవస్థలో ఉన్న లోపాలను ఎత్తిచూపి సంస్కరించాలనే దృష్టిని అర్థం చేసుకోవచ్చు. అయితే సభాకాశాల్లో విశృంఖల విహంగంలా విహరించే ఎస్వీ ఆశ్చర్యంగా యూనివర్సిటీ వ్యవస్థలోకి గువ్వలా వొదిగిపోయి చేసినపని ఇది. అందుకనే ఎస్వీని నేను సీరియస్‌గా తీసుకున్నాను. యేడాదిన్నరపాటు ప్రతిశనివారం సాయంత్రాలు, ఆదివారం ఉదయాలు అతనికే కేటాయించాను. పరిశోధనాంశం గట్టిది కాబట్టి, అభ్యర్థి ఉత్సాహవంతుడు కాబట్టి, పరిశోధన అంటే నాకూ వ్యసనమే కాబట్టి నేనాపని చేశాను. తిరుగులేని నా సమయ పాలనకూ, పనిలో నా కర్కోటకత్వానికి నిలవడంవల్ల ఎస్వీలో క్రమశిక్షణకు సంబంధించిన గుణాత్మకమైన మార్పులు రావటం గమనించాను.

ఏ మాట కామాటే. ఎస్వీ పరిశోధనకోసం నిరంతరం శ్రమపడ్డాడు. ఇటువంటి అంశాన్ని ఎన్నుకోవడమే సాహసం. ఈ సాహసానికి తగిన సాధన సంపత్తి అతని జీవితంలో వ్యాసంగంలో వుంది. అందుకే ఇంతటి బృహత్కార్యాన్ని చెయ్యగలిగాడు. పనికి సంబంధించినంతవరకు అరలు లేనివాన్ని కాబట్టి దేశంలోని వివిధ రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక రంగాలకు సంబంధించిన వ్యక్తులతో చర్చించమని సూచన చేశాను. దానివల్ల ఈ వ్యాసంగం సుసంపన్నమైంది.

వద్దనుకున్నాను గాని ఈ గ్రంథం గురించి ఒకటి రెండు మాటలు చెప్పకుండా ఉండలేకపోతున్నాను.

జాతీయోద్యమం నుండి ఈనాటి దళితఉద్యమం దాకా దాదాపు తొమ్మిది దశాబ్దాల ఉద్యమగీతాల పరిశీలన ఈ గ్రంథంలో జరిగింది. పరిశోధకుడు మూడు వేలకు పైగా పాటలు సేకరించి సామగ్రీ పుష్కలత్వాన్ని సాధించాడు. ఇది సామాన్యమైన పనికాదు. అపారమైన ఈ పాటలపేటికలో ఎస్వీకి కొన్ని అనర్ఘరత్నాలే లభించాయి. తొలికార్మికగీతం, తొలి కర్షకగీతం, తొలి ఎర్రజెండాగీతం, తొలితరం విప్లవగీతాలు మొదలైన వాటిని గుర్తించాడు.

ఈ సిద్ధాంత వ్యాస విషయం కేవలం సాహిత్యానికే సీమితమైంది కాదు. దీనిపై పరిశోధన చేయడమంటే సమాజానికీ సాహిత్యానికీ, సమాజానికీ ఉద్యమానికీ, ఉద్యమానికీ సాహిత్యానికీ మధ్యన ఉండే అంతర్గతసంబంధాలు తెలుసుకోవాలి. వీటిని అవగతం చేసుకోడానికి ఎస్వీ బాగానే కష్టపడ్డాడు. అతనికి అభ్యుదయ సాహిత్యోద్యమంతో ఉన్న సంబంధం కూడా దీనికి తోడ్పడింది. కాబట్టి జాతీయోద్యమం స్వాతంత్ర్యోద్యమంగా పరిణమించిన తీరును ఎస్వీ నిపుణంగా విశ్లేషించాడు. జాతీయోద్యమం, ఆంధ్రోద్యమాల కంటే, తెలంగాణా సాయుధ పోరాటం, ఇతర వామపక్ష ఉద్యమగీతాల విశ్లేషణలో ఎస్వీ అవగాహన మరింత ఎక్కువగా కనిపిస్తుంది. దీనికి అతనికి వామపక్ష ఉద్యమాలతో ఉన్న సంబంధం ఒక కారణం. అయితే విప్లవగీతాల పరిశీలనలో తన స్వీయ నిబద్ధైకదృష్టిని అణచుకొని పరిశోధనకు సంబంధించిన objectivity ని చాలావరకు పాటించాడనే నా ఉద్దేశం.

మొట్టమొదటిసారి దళితగీతాలను తన పరిశీలనలోకి తీసుకొని వాటికొక అస్తిత్వాన్ని కల్పించడం ఈ సిద్ధాంతగ్రంథంలోని విశేషం. ఈ పరిశోధన ద్వారా విస్మృతులైన కుసుమధర్మన్నకవి, పెండ్యాల లోకనాథం, శెట్టిపల్లి వెంకటరత్నం, మద్దూరి అన్నపూర్ణయ్య, అలువాల మాచయ్య, అవుల పిచ్చయ్య, గంగారాం, అప్పన్న వంటి అలనాటి ప్రజాకవులు వెలుగులోకి రావడం సంతోషదాయకం.

ఉద్యమ గీతాల్లోని భాషా, ఛందస్సుల పరిశీలనకు కావలసిన సంబారాన్ని ఎస్వీ ఇంకా సమకూర్చుకోవలిసే వుంది. ముందు ముందు ఆ దృష్టితో మరింత కృషి చేస్తాడని నా ఆకాంక్ష. పిహెచ్.డి డిగ్రీ అనేది ప్రారంభమే కాని గమ్యం కాదనీ ఈ పరిశోధన వల్ల సమకూడిన అనుభవోత్సాలతో ఎస్వీ మరింత లోతైన కృషి కొనసాగించాలనీ ఆకాంక్షిస్తున్నాను.

# నివేదన

ఆబ్బూరి రామకృష్ణారావు రచనలపై ఎం.ఫిల్ పరిశోధన పూర్తి కాగానే, ఉద్యమ గీతాలమీద నాకున్న మక్కువతో ఈ అంశంపై పరిశోధన చేయాలన్న సంకల్పం కలిగింది. అప్పటి (1983) తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య గోపాల కృష్ణారావుగారు ఉత్సాహపరిచి, భుజం తట్టడమేకాక పరిశోధనకు అవకాశం కల్పించారు. 1987 మేలో వారు కన్నుమూసేవరకు పర్యవేక్షకులుగా ఉన్నారు.

ఉత్సాహంగా ఉద్యమ గీతాలపై పరిశోధనకు పూనుకున్నానే గానీ, ఏ ఉద్యమంతో ప్రారంభించాలి? ఉద్యమమంటే ఏమిటి? ఏ రకమైన ఉద్యమాల గీతాలు నా పరిధి??——మొదలైన ప్రశ్నలతో పనిచేయకుండానే కాలయాపన జరిగింది. నా స్తబ్దతను గమనించిన పర్యవేక్షకులు డా॥ ఎన్. గోపిగారు మొదట ఆప్త వాక్యాలతో, పిదప కొంత కఠినవైఖరితో తట్టిలేపారు. చైతన్యపరిచారు.

1987 డిసెంబర్ మాసంలో వేటపాలెం వెళ్ళాను. అపురూపమైన జాతీయోద్యమ,స్వాతంత్ర్యోద్యమ గీతాల సంపుటులు కనబడ్డాయి. కొన్ని గీతాలను ఎత్తి రాసుకున్నాను. చాలావరకు పుస్తకాలు, పుస్తకాలే జిరాక్స్ తీయించాను. కొన్ని గీతాల నోట్స్ రాసుకున్నాను. కొత్త ఉత్సాహం కలిగింది. తరువాత కుముదవల్లిలోని శ్రీ వీరేశలింగ కవి సమాజ గ్రంథాలయానికి వెళ్ళాను. రాజమండ్రి,విజయవాడలు తిరిగాను. కొందరు ప్రముఖ రాజకీయ, సాహిత్యవేత్తలతో చర్చించాను. పరిశోధనాంశంపై అవగాహన కుదిరింది డా॥ ఎన్. గోపిగారి ఆత్మీయ పర్యవేక్షణ గీతాలను విశ్లేషించడానికి చక్కని మార్గ నిర్దేశం చేసింది.

ఉద్యమగీతాలను, ఉపయుక్త గ్రంథాలను సేకరించడానికి నాకు తోడ్పడిన గ్రంథాలయాలు ఈ విధంగా ఉన్నాయి - వేటపాలెం సారస్వత నికేతనం; కుముదవల్లి వీరేశలింగకవి సమాజ గ్రంథాలయం; రాజమండ్రి శ్రీ గౌతమీ ప్రాంతీయ గ్రంథాలయం; విజయవాడ-విశాలాంధ్ర గ్రంథాలయం, వెలిదండ్ల హనుమంతరాయ, శ్రీ రామమోహన గ్రంథాలయాలు; హైదరాబాదు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు, మఖ్దూం భవన్ లైబ్రరీ, అభ్యుదయ రచయితల సంఘ నార్ల చిరంజీవి గ్రంథాలయం, ఉస్మానియా విశ్వవిద్యాలయ గ్రంథాలయం, స్టేట్ సెంట్రల్ లైబ్రరీ, సిటీ

సెంట్రల్ లైబ్రరీ — పై గ్రంథాలయాల నిర్వాహకుల తోడ్పాటు మరువరానిది. ఇవేకాక శ్రీయుతులు తమ్మారెడ్డి సత్యనారాయణ, కె. ప్రతాపరెడ్డి, డా॥ ఏటుకూరి ప్రసాద్, సౌభాగ్యగార్ల ఇంటి గ్రంథాలయాలను యధేచ్ఛగా కొల్లగొట్టాను. వారి సహకారం కృతజ్ఞతలతో తీరేదికాదు.

ఉద్యమగీతాల ముళ్ళు విప్పడానికి అనేకమంది ప్రముఖులు తోడ్పడ్డారు. వారికి నా కృతజ్ఞతాభివందనాలు.

పరిశోధన సందర్భంగా సహకరించిన డా॥ బి.ఆర్. అంబేద్కర్ కళాశాల ప్రిన్సిపాల్ కె సుమతిగారికి, కళాశాల యాజమాన్యానికీ ధన్యవాదాలు.

పరిశోధనకు పరీక్షకులుగా వ్యవహరించిన ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, ఆచార్య మాదిరాజు రంగారావు, ఆచార్య కొలకలూరి ఇనాక్ గార్లకు నమస్సులు.

పరిశోధనా వ్యాసాన్ని ఉన్నది ఉన్నట్లుగా కాక కొంత కుదించి ప్రచురించడం జరిగింది. గ్రంథపరిమితి దృష్ట్యా 111 ఉపయుక్త గ్రంథాల సూచి, 23 పత్రికల జాబితాను ఇక్కడ పొందుపరచడం జరుగలేదు. **ఈ సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించిన విశాలాంధ్ర ప్రచురణాలయం వారికి; ఆర్థికసహాయాన్ని అందించిన తెలుగు విశ్వవిద్యాలయం వారికి నా కృతజ్ఞతలు.**

పుస్తకానికి 'సత్యాన్వేషణ'తో కూడిన పరిచయ వాక్యాలు రాసిన ఆచార్య ఎస్వీ రామారావు గారికీ; పర్యవేక్షక వాక్యాలు రాసిన ఆచార్య ఎన్. గోపి గారికీ కృతజ్ఞతాభివందనాలు.

పుస్తకానికి భావస్ఫోరకమైన ముఖచిత్రాన్ని గీసిన చిత్రకారుడు, మిత్రుడు మోహన్‌కీ, అక్షరాలను కూర్చి అచ్చొత్తిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ కార్మికులకూ నా ధన్యవాదాలు.

అలాగే ఈ పరిశోధనా వ్యాసాలకు తొలిశ్రోత నా శ్రీమతి భారతి. శుద్ధ ప్రతిని సిద్ధంచేయడంలోనూ, దాదాపు ఏడాదిన్నరకాలం నా నిమగ్నతనూ, చిరాకునూ భరించడంలోనూ ఆమె చూపిన సహనం అభినందనీయం.

వీరితో బాటు ఈ పరిశోధన సందర్భంగానూ, నా సాహిత్యకృషిని కొనసాగించడంలోనూ అడుగడుగునా తోడ్పడిన మిత్రులెందరో... అందరికీ నా అక్షరాంజలి.

**18-9-1991**
**హైదరాబాద్** **ఎస్వీ సత్యనారాయణ**

## సూచిక

# 1
# ఉద్యమ నిర్వచనం, ప్రపంచ ఉద్యమాల పరిశీలన

"మనిషి జీవితం అతని చైతన్యాన్ని నిర్ణయిస్తుంది' కానీ చైతన్యమే అతని జీవితాన్ని నిర్ణయించదు" అంటూ మార్క్స్, ఏంగెల్స్‌లు జీవిత ప్రాధాన్యాన్ని నిర్వచించారు.[1] అయితే ఈ జీవితం వ్యక్తి జీవితంతో పాటు సామాజిక జీవితం కూడా అవుతుంది. అయినప్పుడు సామాజిక జీవితమే సామాజిక చైతన్యాన్ని నిర్ణయిస్తుందనేది తాత్పర్యం.

మనిషి ఎప్పుడూ ఒంటరిగా లేడు. సమాజంలో ఉన్న ఇతర మనుష్యులతో అనివార్యంగానే కొన్ని సంబంధాల నేర్పరుచుకుని ఉన్నాడు. అతనికి ప్రకృతితో కొన్ని సంబంధాలు ఏర్పడి ఉన్నాయి. తన మనుగడకు కావలసిన సకల సంపదలను మనిషి ప్రకృతి నుండి స్వీకరిస్తాడు. తనకు కావలసిన రీతిలో వాటిని మలుచుకుంటాడు. మార్చుకుంటాడు. ఉపయోగించుకుంటాడు. అయితే ఈ ప్రకృతి సంపదను వ్యష్టిగా తనంత తానుగా సాదించుకోవడం సాధ్యం కాదు. దాని కోసం ఇతరులతో కొన్ని సంబంధాలు 'పెట్టుకోక' తప్పదు. తినడానికి తిండీ, తాగడానికి నీరూ, కట్టుకోడానికి బట్టా, ఉండటానికి ఇల్లూ సమకూర్చుకోవడం కోసం ఇతరుల సహకారాన్ని అపేక్షిస్తాడు. తాను కూడా ఇతరులకు సహకరిస్తాడు. దీని కోసమై ఉత్పత్తి సాధనాలను సృష్టించుకోవడం తనొక్కడితో అయ్యే పని కాదు. ఇతరులపై ఆధారపడతాడు. దీనితో తనకూ, ఇతరులకూ మధ్య ఏర్పడే సంబంధాన్ని 'ఉత్పత్తి సంబంధం' అంటారు. ఇది అత్యంత కీలకమైనది. దీనినే పునాది అంటున్నారు. దీని ఆధారంగా మనుషుల్లో ఆలోచనలు పుడుతున్నాయి.

అలాగే మనుగడకు సంబంధించిన మరో సంబంధం .... మనిషికే కాదు, సకల ప్రాణికోటికి మనుగడ ముఖ్యం. ఆ మనుగడ వ్యక్తిదే కాదు జాతిది

---

1. K. Marx, F. Engles: Collected Works Vol. 5, Page : 37 (German Ideology)

కూడా. కాబట్టి ఆ జాతి నిలవడానికీ, పెరగడానికీ మనుషుల మధ్య అనివార్యమైన స్త్రీ - పురుష సంబంధం ఏర్పడుతుంది. దీనినే 'పునరుత్పత్తి సంబంధం' లేదా 'సంతాన సంబంధం' అంటారు.

పై రెండు (ఉత్పత్తి, పునరుత్పత్తి) సంబంధాల సమాహారాన్ని 'సామాజిక అస్తిత్వం'గా పరిగణిస్తారు.[2]

సామాజిక అస్తిత్వం సామాజిక చైతన్యం ద్వారా వ్యక్తమవుతుంది. సామాజిక చైతన్యంలో మనిషి భావాలు, అభిప్రాయాలు, నైతిక, రాజకీయ సైద్ధాంతిక దృక్పథాలు, సౌందర్య దృష్టి, తాత్త్విక, మత భావాలు, సాహిత్యాది కళలు అంతర్భాగాలుగా ఉంటాయి.[3] వీటిలో దేని ద్వారానైనా మానవ మనోగత భావాలు వ్యక్తమవుతాయి. మానవుని ఆలోచనలు, ఆవేశాలు, ఆవేదనలకు అభివ్యక్తి లభిస్తుంది.

సామాజిక చైతన్యం ప్రధానంగా ఏడురూపాల ద్వారా వెలువడుతుంది. ఈ రూప సప్తకాన్ని హరివిల్లులోని ఏడు రంగులతో పోల్చవచ్చు. అవి 1. రాజకీయ సిద్ధాంతాలు, 2. న్యాయ సంబంధమైన చైతన్యం, 3. నీతి, 4. మతం, 5. విజ్ఞాన శాస్త్రం, 6. సౌందర్యాత్మక భావాలు (సాహిత్యం - కళలు), 7. తత్త్వశాస్త్రం.[4]

ఈ సామాజిక చైతన్య రూపాలు ఆయా సమాజాల ఆధ్యాత్మిక, బౌద్ధిక జీవితాన్ని ప్రతిబింబిస్తాయి. ఇవి సమాజానికి సంబంధించిన వేర్వేరు అవసరాలను తీరుస్తూ, అభివృద్ధి చెందుతాయి. వీటి మధ్య అక్కడక్కడా అంతర్గత సంబంధాలు కనబడినా దేని లక్షణాలు దానివే. ఒక్కొక్క సామాజిక దశలో ఒక్కొక్క సామాజిక చైతన్యరూపం అగ్రిమం గానూ, మిగతావి ఆనుషంగికంగానూ కనిపిస్తాయి.

ఇంతకు ముందు చెప్పిన సంబంధాలను పునాది అన్నాం. ఇది ఆర్థిక పరమైన అంశాలతో ముడివడి ఉంటుంది. అంటే అంతిమంగా ఆర్థిక భూమిక నిర్ణాయక పాత్ర వహిస్తుందని అర్థం. అయినప్పటికీ కొన్నిసార్లు ఈ సమాజ జన్యమైన చైతన్య రూపాలు సమాజాన్ని కూడా ప్రభావితం చేస్తాయి. అంటే

2. రాంభట్ల వ్యాసం 'ఆలోచనామృతం' - "సాహిత్యాభ్యుదయం" శ్రీశ్రీ స్మారక సంస్థ ప్రచురణ, పుట: 16

3. Dictionary of Philosophy: Progress Publishers, Moscow Page : 383

4 Historical Materialism : An outline of Marxist Theorys of Society - Ed. by V. Kelle & M. Kovalson, Progres Publishers, Moscow. Pages : 237, 238.

సామాజికచైతన్య రూపాలైన సాహిత్యాది కళలకు సమాజం పైన కొంత పట్టు ఉన్నమాట నిజం. ఈ కళలు పునాదికి అతీతంగా కాదు గానీ కొంత మీరి తమ స్వతంత్రమైన పాత్రను నిర్వహిస్తాయి.

ఈ విషయాన్నే ప్రముఖ మార్క్సిస్టు విమర్శకులు వై. విజయకుమార్ గారు వివరిస్తూ -

> 'విభిన్న వర్గాలు గల సమాజంలో సాధారణంగా ఆయా వర్గాల సామాజిక జీవితం, వారి సిద్ధాంతాలు కళలలో ప్రతిబింబించే మాట నిజమే అయినా మరీ మక్కీకి మక్కీగా ప్రతిబింబించక పోవడమే గాక కొన్ని ప్రత్యేక లక్షణా లను కూడా ప్రదర్శిస్తాయి. కళల మొదటి ప్రత్యేక లక్షణం వాటికి కొంత స్వతంత్ర పాత్ర ఉంటుంది. వాటి ప్రభావం సమాజంపై ఉంటుంది' అన్నారు.[5]

అంటే సామాజిక అస్తిత్వం సామాజిక చైతన్యాన్ని నిర్ణయిస్తుందనీ, దీనికి భిన్నంగా అప్పుడప్పుడూ సామాజిక అస్తిత్వం మీద సామాజిక చైతన్యం తన ప్రభావాన్ని చూపుతుందనీ తెలుస్తున్నది.

ఈ దృష్టితో ఇరవయ్యవ శతాబ్దంలో తెలుగునాట ప్రజ్వరిల్లిన ఉద్యమాలు, వాటి ప్రభావంతో వెలువడిన గీతాలను పరిశీలించడం జరుగుతున్నది. అయితే ఈ గీతాలు ఉద్యమ ప్రేరణతో ఆవిర్భవించినప్పటికీ, ఉద్యమాలకు అవి చేకూర్చిన స్ఫూర్తినీ, ప్రచారాన్నీ ప్రధానంగా అధ్యయనం చేయడం ఈ పరిశీలన లక్ష్యం. ఉద్యమ అవసరాన్ని తెలిపే గీతాలు కొన్ని అయితే, ఉద్యమ ఆదర్శాలను వర్ణించేవి మరికొన్ని. ఉద్యమ ప్రభావంతో వెలువడేవి కొన్ని అయితే, ఉద్యమానికి ఊపిరులూదేవి మరికొన్ని. ఇవన్నీ ఉద్యమ గీతాలే.

## ఉద్యమ నిర్వచనం

ఉద్యమ గీతాలన్నప్పుడు 'ఉద్యమం' అనే మాటకు ఉన్న వివిధ అర్థచ్ఛాయలను పరిశీలించడం అవసరం.

'యమ్' ధాతువుకు 'ఉత్' ఉపసర్గ చేరి 'ఉద్యమం' ఏర్పడింది. యమ్' అంటే 'స్వాధీనంలో ఉంచుకొను' అనీ, 'యమం' అంటే 'పట్టుదల' అనీ అర్థం. 'ఉత్' ఉపసర్గ ఆధిక్యతను సూచిస్తుంది. ఉద్గాత, ఉత్తమ, ఉత్పాత, ఉత్థిత మొదలైన మాటలు ఈ ఉపసర్గతో ఏర్పడినవే.

---

5. 'మార్క్స్ - ఏంగెల్స్ దృష్టిలో సాహిత్యం, కళలు' - వై. విజయ కుమార్, "సాహిత్యాభ్యుదయం" శ్రీశ్రీ స్మారక సంస్థ ప్రచురణ. పుట. 6

'ఉద్యమం' అనే మాటకు 'పై కెత్తుట, శ్రమము, ప్రయత్నము, సిద్ధమగుట, గట్టి పూనికతో చేసే ప్రయత్నము' వంటి నైఘంటికార్థాలు కనిపిస్తున్నాయి.[6]

ఆంధ్ర మహాభారతంలో కూడా ఈ అర్థాలతో ప్రయోగాలు కనిపిస్తున్నాయి.

శా. దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాప
స్ఫుర ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన పారగుల్.[7]

శా. ధరిత్రీనాథుండు రణోచితోద్యమము సంధిల్లంగ
శస్త్రాస్త్రవ, ర్మానీతి క్రమ దక్షులం బనిచె
నయ్యే వారికిన్ గ్రక్కునన్.[8]

క. అనుటయు నాతడు దగనూ, ల్కొనిదా
నుదిత నినద కోదం
డుండై యనితర సులభోద్యమమున,
ధనంజయుం
డిట్టులను నతనితో మదియన్.[9]

ఈ పద్యాల్లో పూనిక, ప్రయత్నము, సన్నాహము, సిద్ధమగుట వంటి అర్థాలతో ఉద్యమ పద ప్రయోగం కనబడుతుంది.

పోతన'మహా భాగవతం'లో' ప్రారంభించు' అనే అర్థంలో 'ఉద్యమించు'ను వాడినట్లు ఈ క్రింది ప్రయోగం వల్ల తెలుస్తుంది.

'పృథు చక్రవర్తి ఇంద్రుని మీద బాణంబునేయ
నుద్యమించిన....'[10]

నాచన సోముడు 'ఉత్తర హరివంశం'లో-
'సూత్ర హస్తులై మునుకొని, కోవిదస్థపతి ముఖ్యులు
శిల్పము లుద్యమింప....'[11] అనే పద్యంలో

---

6. సూర్యారాయాంధ్ర నిఘంటువు, పుట : 637
7. ఆంధ్ర మహాభారతము - విరాట పర్వము- 2-55
8. ఆంధ్ర మహాభారతము - విరాటపర్వము- 3-143
9. ఆంధ్ర మహాభారతము - విరాటపర్వము- 5-155
10. ఆంధ్ర మహాభాగవతము - ప్రథమ స్కంధము- 525
11. నాచన సోముని' ఉత్తర హరివంశము' 2-150

ఉద్యమించుటను ప్రారంభించుట అనే అర్థంలోనే ప్రయోగించాడు.

మొత్తం మీద పై ఉదాహరణల్లో పూనికగానూ' ప్రయత్నపరంగానూ, ప్రారంభించుటగానూ ఉద్యమ శబ్దాన్ని వాడినట్లు తెలుస్తున్నది.

## ఆధునిక కాలంలో 'ఉద్యమం' అంటే ఏమిటి?

ఇంతకూ 'ఉద్యమం' అంటే ఏమిటి? ఆధునిక కాలంలో దీనిని ఏ అర్థంలో వాడుతున్నామో పరిశీలిద్దాం.

ఉద్యమాన్ని ఇంగ్లీషులో 'Movement' అనే పదానికి సమానార్థకంగా వాడుతున్నాం.

**Movement** అంటే 'నిర్దిష్ట లక్ష్యంతో క్రమబద్ధంగా చేసే కారశీకలాపాల సమాహారం', 'ఒకే గమ్యం వైపు పనిచేసే సాపేక్ష సంఘటనల ద్వారా ఒక లక్ష్యాన్ని రూపొందించడం' అనీ,[12] 'ఒక నిర్దిష్ట లక్ష్యాన్ని సాధించడం కోసం జనం సామూహికంగా చేసే ప్రయత్నం' అనీ, 'ఒక లక్ష్యాన్ని సాధించడం కోసం జరిగే వ్యవస్థీకృత ప్రయత్నం' అనీ అర్థాలు కనబడుతున్నాయి.[13]

> 'ఒక ఉదాత్త లక్ష్యాన్ని అందుకోవాలంటే, అందుకు దృఢమయిన దీక్ష కావాలి. వ్యక్తిగత దీక్ష అయితే, అది 'యమం' అవుతుంది. సాముదాయిక దీక్ష అయితే, 'ఉద్యమం' అవుతుంది. 'యమం' అంటే పట్టుదల. 'ఉద్యమం' అంటే గొప్ప పట్టుదల. వ్యక్తి కన్నా సముదాయం గొప్పది. వ్యక్తి పట్టుదల కన్నా సాముదాయికమైన పట్టుదల మరీ గొప్పది' అంటూ ఉద్యమ పదాన్ని నిర్వచిస్తున్నారు ప్రముఖ సాహిత్య విమర్శకులు రాంభట్ల కృష్ణమూర్తిగారు.[14]

గత రెండు మూడు శతాబ్దాలుగా మానవ జీవితం అనేక మార్పులకు లోనయింది. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతికాది రంగాల్లో మౌలికమైన పరిణామాలు సంభవించాయి. అయితే ఈ మార్పులు యాదృచ్ఛిక ఘటనలు కావు. అప్రయత్నంగా అవతరించినవి కావు. జనులు అనేక రకాల రూపాలలో మార్పును కోరి ఉద్యమించడం ద్వారా జరిగినవే. మారక తప్పని

---

12. Webster's Third New International Dictionary Page : 1480

13 Chamber's Mini Dictionary - Page : 324

14. 'ఉద్యమం' పాటలకు 'రాంభట్ల' పల్లవి (ముందుమాట) ఆంధ్రప్రదేశ్ ప్రజా నాట్యమండలి ప్రచురణ, 1982

పరిస్థితులు కొన్ని అయితే, మార్చక తప్పని పరిస్థితులు కొన్ని ఏర్పడినప్పుడు ప్రజలు ఉద్యమిస్తారు. మార్పును సాధిస్తారు. ఏ మార్పు అయినా ప్రజాభీష్టం మేరకో, ప్రత్యేక ప్రయత్న ఫలితంగానో ఏర్పడుతుందే తప్ప ఆకాశం నుండి ఊడి పడదు. ఈ ప్రజా ప్రయత్నాలు - దశలను బట్టి, తీవ్రతలో తారతమ్యాలను బట్టి రకరకాల పేర్లను సంతరించుకుంటాయి. నిరసన, ఆందోళన, పోరాటం, విప్లవం వంటి మాటలు ఉద్యమ దశలను, స్థాయినీ సూచిస్తాయి.

> 'వేళ్ళూనుకుని ఉన్న పాత సంబంధాలు, పాత పద్ధతులు ఇక ఏ మాత్రం కొనసాగడానికి వీల్లేని పరిస్థితులాసన్నమయి, పాత వాటి మీద క్రమంగా అసంతృప్తి ప్రారంభమై, ఆ అసంతృప్తి రాను రానూ పెరిగి పెద్దదవుతుంది. తద్వారా పాత - కొత్త సంబంధాల మధ్య సంఘర్షణ ఉద్యమాలకు దారి తీస్తుంది.'[15]

అంటే సమాజంలో, మతంలో, సాహిత్యంలో, భాషలో అప్పటికే వేళ్ళూనుకొని ఉన్న భావాలు, ఆలోచనలు, వ్యవస్థలు పాతబడిపోయి కాలం చెల్లినవైనప్పుడు, అవి ఇక ఏ మాత్రం కొనసాగే పరిస్థితులు లేనప్పుడు, క్రమంగా వాటి మీద నిరసన తలెత్తుతుంది. అది రాను రానూ ఆందోళనగా మారుతుంది. ఆ ఆందోళన పెరిగి, పెద్దదై ఉద్యమ రూపం దాలుస్తుంది.

> 'ఒక సామాజిక వ్యవస్థ దైవ నిర్మితం కాదు. మానవ నిర్మితం. మానవుల ఆకాంక్షలు - అభీష్టాల మేరకు దాన్ని మార్చడానికి వీలున్నదనే దృక్పథమే ఉద్యమాలను సాగిస్తున్నది'[16]

ఉద్యమాల ద్వారా పాత వ్యవస్థ గర్భాన్ని చీల్చుకుని కొత్తది ఆవిష్కృతమౌతుంది. పాత-కొత్తల మిశ్రమరూపం కొంతకాలం కొనసాగి, క్రమంగా ఒక నూతన వ్యవస్థ ఆవిర్భవిస్తుంది; లేదా ఉద్యమ విజయంతోనే సమూలమైన మార్పులతో సరికొత్త వ్యవస్థను ప్రసవిస్తుంది. ఇది ఆ ఉద్యమ ఉధృతి, విస్తృతి, లక్ష్యాలపైన ఆధారపడి ఉంటుంది. పాతవి అనవసరమైన

---

15. International Encyclopedia of the Social Sciences
Editor : David L. Sills (Volume 14)
The Macmillon Co. & The free Press (Pages;438 to 450)

16. International Eecyclopedia of the Social Sciences (Vol. 14)
Editor : David L. Sills (Pages; 438 to 450)

స్థితి ఏర్పడినప్పుడే సామాజికోద్యమాలు, మతోద్యమాలు, సాహిత్యోద్యమాలు' భాషోద్యమాలు ఉవ్వెంగుతున్నట్లు చరిత్ర చెప్తున్నది. వీటిలో కొన్ని స్వతంత్ర ఉద్యమాలైతే, మరికొన్ని పరస్పరాశ్రితాలు. ఆయా ఉద్యమాల మధ్య పరస్పరానుబంధం ఉండే అవకాశాలే ఎక్కువ. 'సామాజిక అస్తిత్వం సామాజిక చైతన్యాన్ని నిర్ణయిస్తుంది' అని ముందే చెప్పుకున్నాం. సామాజిక అస్తిత్వాన్ని కుదిపేసే సామాజికోద్యమాలు ప్రజ్వరిల్లినప్పుడు సహజంగానే సామాజిక చైతన్య రూపాలైన మతం, సాహిత్యం, రాజకీయాలు, కళలు మొదలైన వాటిలో ప్రకంపనలు మొదలౌతాయి. క్రమంగా ఉద్యమ రూపం దాలుస్తాయి. ఇవి పరస్పరం ప్రభావితం చేసుకుంటూ ఒక సంక్లిష్ట సంబంధంతో ముందుకు సాగుతాయి.

ఒక ఉద్యమం దాని లక్ష్యాలన్నింటినీ సంపూర్ణంగా ఒకేసారి సాధించుకోలేక పోయినప్పటికీ, మారుతూ ఉన్న సామాజిక వ్యవస్థలో ఉద్యమ లక్ష్యాలను ప్రజలచేత అంగీకరింపచేస్తూ, స్వీకరింపజేస్తూ ముందుకు పోతుంది. ఇది ఉద్యమాల ప్రధాన లక్షణం. ఉద్యమం విస్తరిస్తున్న కొద్దీ దానిలో కొన్ని అనుషంగిక లక్షణాలను కూడా మనం గమనించవచ్చు. ఉద్యమాలు వాటి ఆశయాలూ ఆదర్శాలతో ప్రజలను ప్రభావితం చేస్తాయి. ఉద్యమాలకు హేతువులైన సామాజిక, రాజకీయ, ఆర్థిక సమస్యలను గురించి ప్రజలు ఆలోచించేట్టు చేస్తాయి. చర్చలకు దోహదం చేస్తాయి. ఆయా సంఘటనల ద్వారా క్రమంగా ఉద్యమ భావాలు ప్రజల మనోభావాలుగా రూపు దాల్చుకుంటాయి. అలాగే కొన్ని ఉద్యమాలు నాయకులు ఆవిర్భవించడానికి కూడా కారణమవుతాయి.

> 'రాజకీయాల్లో క్రియాశీలమైన పాత్రను వహించగలిగే వ్యక్తులను, అంతిమంగా రాజ్యపరిపాలనకు పనికొచ్చే పాలనాదక్షులైన నాయకులను కూడాఉద్యమాలు సృష్టించుకుంటాయి. సోషలిస్టు కార్మికోద్యమాలు, జాతీయ విమోచనోద్యమాలు ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా అనేక దేశాల అధినేతలను సృష్టించడం చరిత్రలో కనిపిస్తున్నది.'[17]

కేవలం వ్యక్తులు ఉద్యమాలను సృష్టించరనీ, ఉద్యమాలే వాటికి నాయకత్వం వహించే వ్యక్తులను సృష్టించుకుంటాయనీ తెలుస్తుంది. అలా సృష్టింపబడిన వ్యక్తులు నాయకులై ఉద్యమాలను నడిపిస్తారు.

---

17. International Encyclopedia of the Social Sciences.

పై చర్చను బట్టి సామాజికోద్యమాలకు సమాజ వ్యవస్థలో అలుముకున్న ఆర్థిక-రాజకీయ-సాంస్కృతిక సంక్షోభాలు ప్రధాన కారణాలుగా నిర్ధారింప వీలున్నది.

## ప్రపంచ ఉద్యమాలు

చరిత్రలో ప్రముఖంగా కనిపిస్తున్న 'అమెరికన్ విప్లవం', 'ఫ్రెంచి విప్లవం', 'రష్యన్ బోల్షివిక్ విప్లవం' వంటి వాటిని పరిశీలిస్తే ఈ క్రింది విషయాలు తెలుస్తున్నాయి.

## అమెరికన్ విప్లవం

బ్రిటన్‌కూ, ఉత్తర అమెరికాలోని అట్లాంటిక్ సముద్రతీరాన ఉన్న వలసదేశాలకూ మధ్య 18 వ శతాబ్దంలో జరిగిన సంఘర్షణను 'అమెరికన్ విప్లవం' లేదా అమెరికా స్వాతంత్ర్యపోరాటం, అని పిలుస్తున్నారు. దీన్నే విప్లవయుద్ధంగా అమెరికన్ చరిత్రకారులు వ్యవహరిస్తున్నారు. దాదాపు 150 సంవత్సరాల పాటు పాలించిన బ్రిటిష్ పాలకవర్గం తమ సంస్కృతినీ, తమ స్వతంత్ర జీవనాన్ని అణచివేస్తుందన్న అమెరికనుల ఆగ్రహం; సాంస్కృతిక స్పృహ రగిలించిన చైతన్యం అమెరికన్ విప్లవానికి ఊపిరులూదాయి. దీనికి తోడు లండన్ ఆధిపత్యం కింద క్షీణించిన సామాజిక, ఆర్థిక స్థితిగతులు అమెరికా విప్లవానికి కావలసిన భౌతిక పునాదిని ఏర్పరిచాయి. అమెరికనులు ప్రతిఘటించారు. ఎదురు తిరిగారు. పోరాడారు. స్వాతంత్ర్యాన్ని సాధించారు.[18]

## ఫ్రెంచి విప్లవం

ఫ్రాన్స్‌లో బలపడిన పెట్టుబడిదారి బూర్జువావర్గం ఒకవర్గంగా స్వీయ చైతన్యంతో పరిపక్వమై, అక్కడి రాజరిక ఫ్యూడల్ సమాజాన్ని-దాని సమస్త వ్యవస్థల్నీ నాశనం చేసింది. దాని స్థానంలోనే పెట్టుబడిదారి వ్యవస్థకు అనుకూలమైన బూర్జువా అధికారాన్ని నెలకొల్పింది.[19]

నెలకొని ఉన్న భూస్వామ్య-అర్ధభూస్వామ్య ఆర్థిక, రాజకీయవ్యవస్థకూ అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారి ఉత్పత్తివ్యవస్థకూ మధ్య పెరిగిన వైరుధ్యాల సంజనితం ఈ ఫ్రెంచివిప్లవం. పెట్టుబడిదారి విధానం అభివృద్ధి చెందడానికి ఆటంకంగా ఉన్న అన్ని అంతరాయాలను తొలగించడమే దీని

18. Encyclopedia Americana (page No: 714)
19. Dictionary of Philosophy C page No. 361) Progress Publishers

ప్రధాన చారిత్రిక కర్తవ్యం. ఉత్పత్తిసాధనాలమీద ప్రైవేటు యాజమాన్యాన్ని పరిరక్షించే బూర్జువా సమాజాన్ని నెలకొల్పడం ఈ విప్లవం లక్ష్యం. ఫ్రెంచి రాచరికానికి వ్యతిరేకంగా అక్కడి బూర్జువా వర్గం నాయకత్వం కింద సాగిన పోరాటమిది. ఈ ఫ్రెంచి విప్లవం అక్కడి ఫ్యూడల్ వ్యవస్థను నిర్మూలించి, బూర్జువా వర్గానికి ఆర్థిక-రాజకీయ ఆధిపత్యాన్ని కట్టబెట్టింది.

## రష్యన్ బోల్షివిక్ విప్లవం

మానవజాతి చరిత్రను ఒక కొత్త మలుపు తిప్పిన మహోద్యమమే 'రష్యన్ బోల్షివిక్ విప్లవం'. దీనినే 'అక్టోబర్ సోషలిస్టు విప్లవం' అని అంటున్నారు.

పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాలను సమూలంగా మార్చివేసి, ఉత్పత్తిపై ప్రైవేట్ యాజమాన్యాన్ని రూపుమాపి, ప్రజలమధ్య సహకారం పరస్పర సహాయంపై ఆధారపడిన కొత్త సంబంధాలను రూపొందించడం ఈ బోల్షివిక్ విప్లవలక్ష్యం. మనిషిని మనిషి దోచుకునే దోపిడిని రద్దు చేయడం, వర్గాలు లేని సమసమాజాన్ని నిర్మించడం దీని ఆశయం.

1917 ఫిబ్రవరిలో రష్యన్ కార్మికవర్గం, అక్కడి రైతాంగంతో కలిసి నిరంకుశ 'జార్' చక్రవర్తి పరిపాలనను అంతమొందించింది. రాజరిక వ్యవస్థను నిర్మూలించినప్పటికీ 'స్టేట్ డ్యూమా' ద్వారా రష్యన్ బూర్జువా వర్గం అధికారాన్ని చేజిక్కించుకుంది. దీనికి వ్యతిరేకంగా 'లెనిన్' నాయకత్వంలో 'బోల్షివిక్ పార్టీ' మార్గనిర్దేశంలో, 'మార్క్సిస్టు సిద్ధాంతం' వెలుగులో రష్యన్ శ్రామిక వర్గం 1917 అక్టోబర్ 24వ తేదీ* అర్థరాత్రి, అక్కడి బూర్జువా వర్గ పరిపాలనను రూపుమాపింది. శ్రామికవర్గ నియంతృత్వంతో కూడిన నూతన వ్యవస్థను నెలకొల్పింది. తద్వారా దోపిడికీ, పీడనకూ అవకాశంలేని 'సోషలిస్టువ్యవస్థ'ను నిర్మించే దిశగా సమాజాన్ని పరిణమింపజేసింది. అందుకే ఈ రష్యన్ బోల్షివిక్ విప్లవాన్ని సోషలిస్టు విప్లవమని వ్యవహరిస్తున్నారు.

'అమెరికన్ విప్లవం'-అక్కడి వలస పరిపాలనను తరిమికొట్టి స్వాతంత్ర్యాన్ని సంపాదించిపెట్టింది.

'ఫ్రెంచి విప్లవం'-అక్కడి ఫ్యూడలిజాన్ని నిర్మూలించి, పెట్టుబడిదారి వ్యవస్థను నెలకొల్పింది.

---

* అప్పటి రష్యన్ క్యాలెండర్ తేదీ అది. కొత్త కేలండర్ ప్రకారం నవంబర్ 7.

'రష్యన్ విప్లవం'-అక్కడి రాజరిక, భూస్వామ్య, పెట్టుబడిదారి విధానాలను అంతమొందించి సామ్యవాద వ్యవస్థను స్థాపించింది.

ఇలా సామాజిక వ్యవస్థ పునాదులనే కదిలించి, మరో నూతన వ్యవస్థను నిర్మించిన వాటిని "విప్లవాలు," లేదా "విప్లవోద్యమాలు" అంటున్నారు.

'విప్లవం అనే పదం ఒక ఆకస్మిక, గుణాత్మకమైన మార్పు అనే అర్థాన్ని స్ఫురింపజేస్తుంది. పాలకవర్గం మరియు పాలితవర్గం యొక్క అభిరుచులకు, ఆకాంక్షలకు మధ్యజరిగే సంఘర్షణ వల్ల జనించే ఉద్రిక్తత విప్లవానికి ప్రధానాంశం. విప్లవ ప్రాధాన్యం కేవలం అది సృష్టించే ఉత్పాతంలోనో, అది సాంఘిక వ్యవస్థలో కలిగించే రూపాంతరంలోనో లేదు; సామాజిక వర్గాల సంబంధాల్లో, అది తెచ్చే ప్రముఖమైన మార్పులో ఉంది. పాలకవర్గ ఆధిపత్యాన్ని పూర్తిగా నాశనం చేయాలి. పీడితవర్గం తనను తాను ఆర్థికదోపిడి నుండి విముక్తం చేసుకోవాలి. దుర్భరమైన రాజకీయ బానిసత్వాన్ని బద్దలు కొట్టాలి. విప్లవ పరిణామక్రమంలో పాత సామాజికవ్యవస్థ పూర్తిగా నిర్మూలింపబడాలి. దాని స్థానంలో కొత్తవ్యవస్థ నెలకొల్పబడాలి. ఫ్రెంచి విప్లవంలో బూర్జువా విప్లవలక్షణాలు స్పష్టంగా వ్యక్తీకరింపబడినాయి. బూర్జువా వర్గం సామాజిక విముక్తిపొందింది. ఫ్యూడల్ పాలనావ్యవస్థను భూస్థాపితం చేసింది. పెట్టుబడిదారి బూర్జువా సామాజిక వ్యవస్థను సుస్థాపితం చేసింది. అలాగే సోషలిస్టు విప్లవంలో శ్రామికవర్గం పాలనాధికారాన్ని చేజిక్కించుకుంది. పాలకవర్గం స్థాయికి చేరుకుంది. ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయడం మూలంగా పెట్టుబడిదారి వ్యవస్థను నాశనం చేయ కలిగింది.[20]

## ఉద్యమం ఎంతకాలం నిలుస్తుంది?

ఉద్యమం సఫలమయ్యే పర్యంతం అది జ్వలిస్తూనే ఉంటుంది. తాత్విక భూమిక, నిర్మాణాత్మక కృషి, నిబద్ధ నాయకత్వం కింద సామూహికంగా ఒక మౌలికమైన మార్పును కాంక్షిస్తూ జనం సుదీర్ఘకాలం జరిపే పోరాటాల సముచయమే ఉద్యమం. ఉద్యమ సాఫల్యంతోనే అది ముగుస్తుంది. దీనికి కొంతకాలం పట్టినా, ఎంతోకాలం పట్టినా అంతిమలక్ష్యం సాధించేదాకా ఇది కొనసాగుతుంది.

---

2). Encyclopedia of Social Sciences(Vol : 13) The mae-millan Co. Newyork c page No. 367)

## ఉద్యమాల్లో వ్యక్తుల పాత్ర

ఆయా ఉద్యమాల్లో వ్యక్తులు నిర్వహించే పాత్రను అవగాహన చేసుకోవడంలోనూ, అంచనా కట్టడంలోనూ అనేక దృక్కోణాలు కనబడు తున్నాయి. సామాజిక అస్తిత్వాన్ని గుర్తించని చరిత్రకారులు వ్యక్తుల వల్లనే ఉద్యమాలు నిర్మింపబడతాయని అభిప్రాయపడతారు. ఇది శాస్త్రీయమైన అవగాహనకాదు. ఇప్పటిదాకా వచ్చిన ఉద్యమాల తీరు తెన్నుల్ని పరిశీలిస్తే ఉద్యమాలు వ్యక్తిప్రాతిపదికపైగానీ, సమిష్టిప్రాతిపదికపైగానీ సాగవనీ, ఉద్యమాలు తాత్త్విక ప్రాతిపదికపై కొనసాగుతాయనీ తెలుస్తుంది. దానిలో వ్యక్తులు-గుంపులు-సమూహాలు పాల్గొనటం జరుగుతుంది. ఇది కార్యాచరణ లేదా క్రియ. ప్రాతిపదిక దాని అంతర్లయ.

వ్యక్తి తీవ్ర సంకల్పం ఉద్యమంగా రూపుదాలుస్తుందనే అభిప్రాయం కొందరు పరిశోధకుల్లో కనబడుతున్నది. కాని ఈ వ్యక్తి సంకల్పమనేది కూడా వ్యక్తిగతంకాదు. సమాజనిష్టం. ఈ సంకల్పానికి కావలసిన పరిస్థితులు అప్పటికే సమాజంలో బీజప్రాయంగా ఉంటాయి. దానికి అనుకూలమైన నేలగా సామాజిక స్థితిగతులు పరిపక్వమై ఉంటాయి. అలాంటి స్థితిగతుల్లో రూపొందే ఉద్యమంలో వ్యక్తులు ప్రధానమైన పాత్ర నిర్వహిస్తారు. నిజమే. ఆ పాత్ర ప్రామాణికమైనది, చరిత్రాత్మకమైనది. అంత మాత్రంచేత 'ఉద్యమం' ఆ వ్యక్తులవల్ల నిర్మితమయిందని అంచనా కట్టడం సరైన పద్ధతికాదు. ఆ ఫలానావ్యక్తి లేదా వ్యక్తులు కాకపోతే, అదే చారిత్రిక దశలో వేరొకరు ప్రవేశి స్తారు. ఉద్యమంలో తమ పాత్రను నిర్వహిస్తారు. వ్యక్తుల కోసం ఉద్యమాలు ఆగవు. కేవలం ఒక వ్యక్తితోనో, ఒకరిద్దరు వ్యక్తులతోనో ఉద్యమాలు నిర్మితం కావు. ప్రజాశ్రేణులు ఉద్యమాలను నిర్మిస్తారు. నిర్వహిస్తారు. విజయా లను సాధిస్తారు.

## నిరసన-ఆందోళన-ఉద్యమం

నిరసన-ఆందోళన-ఉద్యమం-విప్లవం వంటి మాటలు పోరాట దశలను, స్థాయీభేదాలను సూచిస్తాయని లోగడ చెప్పుకోవటం జరిగింది. ఈ మాటల అర్థాలను కూడా పరామర్శించటం అవసరం.

### నిరసన

సమాజంలో అప్పటి వరకు నెలకొని ఉన్న వ్యవస్థ- దాని పద్ధతులు పాత విధానంలోనే కొనసాగటానికి వీలులేని పరిస్థితులు ఆసన్నమైనప్పుడు,

ఆ వ్యవస్థపట్ల క్రమంగా నిరసన మొదలౌతుంది, ఇది తొలిదశ. పాతవాటి మీద అసంతృప్తి, అసహనం ఈ దశలో వ్యక్తమౌతూ ఉంటుంది. అక్కడక్కడా కొద్దిమంది వ్యక్తులు మాత్రమే ఈ దశలో ముందుకువచ్చి తమ 'నిరసన'ను వ్యక్తం చేస్తుంటారు. అప్రయత్నమైన అసంతృప్తిని వ్యక్తపరచటం ఈ దశలో ప్రధానం. మొదట్లో కొందరిలో పెల్లుబుకుతున్న నిరసనను అశేష ప్రజానీకం ఈ తొలిదశలో అర్థం చేసుకోనూవచ్చు, లేదా అవహేళన చేయవచ్చు. అంటే నిరసించడానికి కారణభూతమైన పరిస్థితుల పట్ల చాలా కొద్ది మందికి మాత్రమే అప్పటికి అవగాహన ఏర్పడిందన్నమాట. అల్ప సంఖ్యాకంగా ఉన్న ఈ వ్యక్తుల చైతన్యాన్ని 'వ్యక్తిచైతన్యం' అనవచ్చు.ఇది క్రమంగా తన నిరసనల ద్వారా, భావప్రకటనలద్వారా, పరిస్థితుల నగ్నత్వాన్ని ఎత్తి చూపడంద్వారా, ఇతరులకు అర్థం చేయించడం ద్వారా మరి కొంత మందిని ప్రభావితం చేస్తుంది.

ఉదాహరణకు బ్రిటిష్ పాలకులపై మనదేశంలో 1857 నాటికి ఆయా ప్రాంతాల్లో జరిగిన తిరుగుబాట్లు; 1930-40 మధ్యకాలంలో తెలంగాణాలోని అనేక ప్రాంతాల్లో భూస్వాముల పీడనకు వ్యతిరేకంగా రైతులు జరిపిన తిరుగుబాట్లను ముందు ముందు జరుగనున్న మహోద్యమ తొలిదశలుగా భావింపవచ్చు. భారత స్వాతంత్ర్యానికి పూర్వం ఆంధ్ర ప్రాంతంలోనూ, తెలంగాణా ప్రాంతంలోనూ సాంస్కృతిక గుర్తింపుకోసం పెల్లుబికిన ఆంధ్రోద్యమ ప్రారంభఘట్టాలన్నీ నిరసనలే.

## ఆందోళన

'వ్యక్తి చైతన్యం' ప్రజలను ప్రభావితం చేయడానికి అనువైన భౌతిక పునాది సమాజ గర్భంలో ఉన్నందువల్ల 'నిరసన'ను వ్యక్తం చేసే వ్యక్తుల సంఖ్య క్రమక్రమంగా గణనీయంగా పెరగడం మొదలౌతుంది. దీనినే 'గుంపు చైతన్యం' అంటారు. ఈ గుంపు చైతన్య స్థాయిని బట్టి 'నిరసన' క్రమంగా 'ఆందోళన'గా పెంపొందుతుంది. ఇది రెండో దశ. ఇందులో పాల్గొనే వ్యక్తుల సంఖ్య పెరుగుతుంది. అసంతృప్తినీ, అసహనాన్నీ వివిధ రూపాల్లో వ్యక్తీకరించడం ఎక్కువవుతుంది. కానీ ఒక నిర్దిష్ట లక్ష్యం, ఆ లక్ష్యాన్ని సాధించడానికి కావలసిన నిర్మాణాత్మక కృషి, దానికోసం పాటుబడే నిబద్ధ నాయకత్వం ఈ దశలో రూపొందనూ వచ్చు. రూపొందక పోనూవచ్చు. కాబట్టి ఈ దశలోనే అది ఇంకా ముందుకు కొనసాగుతుందా? లేదా?

అది నిర్మాణాత్మక రూపాన్ని ధరించి.... పెరిగి.... పెద్దదై.... ఉద్యమ స్థాయికి ఎదుగుతుందా? లేదా ఈ దశలోనే బలహీన పడిపోతుందా? దీని భవితవ్యం ఏమిటి? మొదలైన ప్రశ్నలు ఎదురవుతాయి.

నిర్దిష్టమైన తాత్విక ప్రాతిపదిక ఈ 'ఆందోళన' దశలో ఏర్పడక పోతే... తాత్కాలికమైన ఆవేశం, అసంతృప్తిని ప్రకటించి ఊరుకోవడం, విధ్వంస కార్యక్రమాలు కొనసాగించడం, తద్వారా ఎదురయ్యే పరిణామాల వంటివి ఆందోళన పరాజయానికి దారితీయవచ్చు. కేవలం ఉద్రేక-ఉత్సాహా లపై ఆధారపడిన 'ఆందోళనలు' ఒక్కోసారి స్వార్థచింతనగల నాయకుల చేతుల్లో పడి అర్ధాంతరంగా ఉపసంహరింప బడతాయి. అసంతృప్త జనాన్ని ఆకర్షించ గలిగేవారు నాయకులైపోతారు. రాజకీయ పరిజ్ఞానం, సమస్యల్ని విశ్లేషించగల సామర్థ్యం, సరైన అనుభవం లేని వ్యక్తులు ఆందోళనల నుండి ఉద్భవించి నాయకత్వ స్థాయికి చేరుకుంటారు. ఈ కారణం వల్లనే ఒక్కోసారి కొన్ని ప్రలోభాలకు, వ్యక్తిగత లాభాలకు ఆందోళనల్ని తాకట్టు పెట్టే పరిస్థితికి కూడా కొందరు నాయకులు దిగజారిపోతుంటారు.

1969లో ఇటు తెలంగాణా ప్రాంతంలోనూ' 1970 తర్వాత అటు ఆంధ్రప్రాంతంలోనూ చెలరేగిన 'ప్రత్యేక తెలంగాణా', 'జై ఆంధ్ర' వంటి వేర్పాటు వాద ఆందోళనల్ని దీనికి ఉదాహరణలుగా చూపవచ్చు.

దీనికి భిన్నంగా పెరిగే ఆందోళనలు ఉద్యమాలుగా రూపొందుతాయి· 'గుంపు చైతన్యం' క్రమంగా 'సామూహిక చైతన్యం'గా పరిణమిస్తుంది.

## ఉద్యమం

ఆందోళనలకు నిబద్ధ నాయకత్వం, ప్రజల పట్ల బాధ్యతగల రాజకీయ పార్టీ మార్గ నిర్దేశం, సరైన సైద్ధాంతిక దిక్సూచి మొదలైనవి లభ్యమైతే ... ఈ ఆందోళనలు ఉద్యమస్థాయిని అందుకుంటాయి. ఉధృతమౌతాయి.

పలురకాల నిరసనల ద్వారా, ఆందోళనల ద్వారా ఉద్యమానికి కావలసిన నేపథ్యం ఏర్పడుతున్నప్పుడు, ఆ నేపథ్యంలో తమ ప్రతిభని- విశిష్టమైన నాయకత్వ లక్షణాలను ప్రదర్శించి, జనచైతన్య స్థాయికి సరిపడే పోరాట రూపాలను నిర్దేశించ గలిగేవారు ఉద్యమ నాయకులౌతారు. ఉద్యమ విజయం పట్ల తమ నిజాయతినీ, నిబద్ధతనూ వీరు ప్రకటిస్తారు. ప్రజా సమూహాలను ముందుకు నడిపించగల సామర్థ్యాన్ని ప్రదర్శిస్తారు.

సమాజంలో నెలకొని ఉన్న పద్ధతులు కాలం చెల్లినవై, ఏ మాత్రం కొనసాగడానికి వీల్లేని పరిస్థితులు ఆసన్నమైనప్పుడు.... పాలితులకే కాదు పాలకులకు కూడా పాత పద్ధతులు దుర్భరంగా మారినప్పుడు.... అంటే పీడితులను పీడకులను కూడా ప్రభావితం చేసే దేశవ్యాప్త సంక్షోభం ఏర్పడి నప్పుడు.... ఉవ్వెత్తున ఉప్పొంగిన ఉద్యమాలు సాఫల్యమవుతాయి. సాధారణ స్థాయి కష్ట నష్టాలు అనేక రెట్లు అధికం కావడం వల్ల ప్రజల సహనం సన్నగిల్లుతుంది. శాంతికాలంలో కష్ట నిష్ఠురాలను ఏదో రకంగా భరించిన జన సమూహాలు తిరుగుబాటుకు ఆయత్తమవుతాయి. సంక్షోభ పరిస్థితుల మధ్య తమ చారిత్రిక మైన స్వతంత్ర చర్యను కొనసాగిస్తాయి. అంటే ఉద్యమానికి అనువైన సామా జిక, ఆర్థిక, రాజకీయ భౌతిక పునాది ఎంత అవసరమో.... దానికి అనుకూ లంగా ఎప్పటికప్పుడు ప్రతిస్పందించగల సామూహిక ప్రజల చైతన్య స్థాయి కూడా అంతే అవసరం. ఈ రెండూ ఏ ఉద్యమానికైనా ప్రాణ భూతాలన్న మాట. భౌతిక పునాది ఉన్నా అందుకు అనుగుణంగా ప్రజల చైతన్య స్థాయి పెరగకపోతే 'ఉద్యమం' విజయాన్ని సాధించలేదు. అలాగే దీనికి భిన్నంగా... అనేక చారిత్రిక కారణాల వల్ల ప్రజల చైతన్య స్థాయి పెరిగి ఉండి, దానికి అనుగుణంగా ఆర్థిక-సామాజిక- రాజకీయ భౌతిక పునాది సిద్ధంగా లేనప్పుడు కూడా 'ఉద్యమం' సఫలం కాదు. ఒక కెరటాన్ని మాత్రమే సృష్టించి వెనక్కి తగ్గుతుంది. అందుకే ఏ ఉద్యమానికైనా భౌతిక పరిస్థితులూ, ప్రజల చైతన్య స్థాయీ రెండూ ముఖ్యం.

# 2
# జాతీయోద్యమం

భారతదేశంలో జనజీవితాన్ని అన్ని రకాలుగా ప్రభావితం చేసిన ఉద్యమాలు 20 వ శతాబ్దంలోనే వచ్చాయి. ఆర్యసంస్కృతి ప్రభావం, మహమ్మదీయుల ప్రవేశం, యూరపియన్ వలస పాలకుల కొత్త విధానాలు - వంటి సమాహార సంక్లిష్ట పరిస్థితుల నేపథ్యం ఈ శతాబ్దాన్ని ఉద్యమాల శతాబ్దంగా మలిచింది.

యూరపియన్ల ప్రవేశంతో భారతదేశ చరిత్రలో గణనీయమైన మార్పులు మొదలైనాయి. 1740 నాటికి బ్రిటిష్, ఫ్రెంచి వాళ్ళు మనదేశ రాజకీయ రంగం మీద ప్రభావం వేయడం మొదలుబెట్టారు. వారి ప్రాబల్యానికి వారి నౌకాబలమే ప్రధాన కారణం.

బ్రిటిష్ వారి కంటే ముందు ఈ దేశాన్ని ఆక్రమించుకున్న విజాతీయులు ఇక్కడే స్థిరపడిపోగా, ఆంగ్లేయులు మాత్రం మొట్టమొదటి సారిగా మన దేశాన్ని వలసదేశంగా మార్చి, ఆరువేల మైళ్ళ దూరం నుండి పరిపాలించ గలిగారు. భారతీయ సంస్కృతితో ఏ మాత్రం మమేకం కాకుండా, పరాయి జాతిగానే వ్యవహరించారు. ఈ దేశ సంపదనంతా కొల్లగొట్టుకు పోవడమే తమ ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్నారు. ఇక్కడి హిందువులను, ముస్లిములను, సిక్కులను, స్థానిక మతస్థులందరినీ తమకన్నా తక్కువ వారుగా పరిగణించ సాగారు.

పూర్వం నుండి పలుదేశాలకు నూలు వస్త్రాలను తయారు చేసి పంపిన భారతదేశం, క్రమంగా ఇంగ్లాండు నూలుబట్టలతో నిండిపోయింది. 1813 వరకూ ప్రధానంగా ఎగుమతి దేశంగా ఉన్న భారతదేశం, క్రమంగా దిగుమతి చేసుకునే దేశంగా మారిపోయింది. 1850 నాటికి .... ఇంగ్లాండ్ మొత్తం ప్రపంచ మార్కెట్టుకు ఎగుమతి చేసే వస్త్రంలో నాలుగోవంతు కేవలం భారతదేశానికే ఎగుమతి చేయసాగింది. ఇదంతా మన చేనేత పరిశ్రమ వినాశ నానికి దారితీసింది. లక్షలాది మంది చేనేత కార్మికులు నిర్వాసితులయ్యారు.

అదే విధంగా భారీయంత్రాలతో ఇంగ్లాండ్ తయారు చేసి పంపిన సరుకులతో పోటీ పడలేక మనదేశంలోని చేతి వృత్తుల వస్తువులు వెలవెల బోయాయి. ఈ విధంగా గ్రామీణ స్వయం సమృద్ధికి పట్టుగొమ్మలైన చేతి వృత్తులు నాశనమై, లక్షలాది చేతి వృత్తుల వారు నిరుద్యోగులయ్యారు. వీరితో తీవ్రమైన నిరాశా నిస్పృహలు, పరాయి పాలకులపట్ల అసంతృప్తి అలుము కోవడం ప్రారంభమయింది.

బ్రిటిష్ వలసపాలకులు పబ్లిక్ వర్క్స్‌ను నిర్లక్ష్యం చేయడం వల్ల నీటి పారుదలపై ఆధారపడిన వ్యవసాయ రంగం క్షీణించసాగింది. కరువు కాటకాలు స్వైరవిహారం చేశాయి. జమీందారీ, రైత్వారీ భూమిపన్ను విధానా లను ప్రవేశపెట్టిన వలసపాలకులు రైతులపై దుర్భరమైన పన్నుల భారాన్ని మోపారు. పన్నులు వసూలు చేసే సందర్భంగా అనేక ప్రాంతాల్లో బ్రిటిష్ అధికారులు చేసిన దౌర్జన్యాలు, పెట్టిన చిత్రహింసలు భారతీయ రైతాంగంలో బ్రిటిష్ వ్యతిరేక భావాలను పురిగొల్పాయి.

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం (1857 - 1859)

ఈ నేపథ్యంలో రాజ్యాలు కోల్పోయిన రాజులు, నవాబులు; వృత్తులు కోల్పోయిన చేతి వృత్తులవారు, పన్నుల భారంతో నడుములు విరిగిన రైతులు దేశంలోని అనేక ప్రాంతాల్లో బ్రిటిష్ ఆధిపత్యంపై తిరుగుబాట్లు లేవదీశారు.

'మధుసూదన సరస్వతి' నాయకత్వాన బెంగాల్, మహారాష్ట్రలలో సైన్యంలో భర్తీ అయిన సన్యాసులు ఆంగ్లేయుల పీడనపై తిరగబడ్డారు. వీరిని గురించే 'బంకించంద్ర చటర్జీ' 'ఆనంద మఠం' నవల రాశారు. 'వందేమాతరం' గీతం ఈ నవల లోనిదే.

ఉత్తర భారతదేశంలో వహాబీ, ఫరాజీ తెగల నాయకులు తిరుగుబాట్లు చేశారు. సహరాన్‌పుర్‌లో రైతులు ఎదురు తిరిగారు. దక్కన్, మలబార్, మైసూర్ మొదలైన అనేక ప్రాంతాల్లో రైతులు, సంతాలులు, కోయలు, భిల్లులు తిరుగుబాటు పోరాటాలు నడిపారు.

ఆర్థిక, రాజకీయ కారణాలతో బాటు విదేశీయ సంస్కృతి - సంప్ర దాయాలపై వ్యతిరేకత; తమ కుల కట్టడులకు - మత విశ్వాసాలకు ప్రమాద మేర్పడుతుందన్న అభద్రతాభావం ఈ తిరుగుబాట్లకు ఆజ్యం పోసింది.

1806 లోనే వెల్లూరులో సిపాయీల తిరుగుబాటు జరిగింది.

బ్రిటిష్ వైస్రాయ్ లార్డ్ డల్ హౌసీ ప్రవేశపెట్టిన రాజ్యాంగ సవరణలకు వ్యతిరేకంగా నానాసాహెబ్, ఝాన్సీలక్ష్మీబాయి, బహదూర్ షాలు బ్రిటీష్ పాలనపై ఎదురు తిరిగారు. తమ సైనికులతో కలిసి, వీరు కూడా యుద్ధ రంగంలో బ్రిటిష్ సేనలతో తలపడ్డారు. యుద్ధంలో ఓడిపోయినా ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామ వీరులుగా చరిత్రకెక్కారు.

1857 జనవరి 22 నుండి సిపాయీల తిరుగుబాట్లు ప్రారంభమయ్యాయి. బరంపురం లో ఉన్న దేసాయ్ రెజిమెంట్ తిరుగుబాటు చేసింది. మార్చిలో బారక్‌పూర్ సైనికులు ఆఫీసర్లపై దాడి చేశారు. ఏప్రిల్ నెలంతా అలహాబాద్, ఆగ్రా, అంబాలాలలో సిపాయీల తిరుగుబాట్లు జరిగాయి. మే 9న మీరట్ సైనికులు ఆంగ్లేయ అధికార్లపై తిరగబడి, వారిని చంపేశారు. సైనిక కంటోన్మెంట్లను తగులబెట్టారు. మీరట్ నుండి సుమారు 36 మైళ్ళ దూరాన ఉన్న ఢిల్లీ దిశగా బయలుదేరారు. 'ఛలో ఢిల్లీ' నినాదం అప్పుడే పుట్టింది. దారిలో ఎదురైన ఆంగ్లేయులందర్నీ ఈ మీరట్ సైనికులు హతమార్చారు. మే 10 న ఢిల్లీ చేరి గతించిన మొగల్ పాదుషా వారసుడు 'బహదూర్ షా జఫర్' ను 'భారత చక్రవర్తి'గా ప్రకటించారు.

పంజాబ్ నుండి నర్మద వరకు, తూర్పున బిహార్ నుండి పశ్చిమాన రాజ్‌పుతానా వరకు ఈ తిరుగుబాటు విస్తరించింది.

ఇలా తిరగబడిన సిపాయీలను 'యూనిఫారమ్ ధరించిన రైతులు' గా కార్ల్ మార్క్స్ అభివర్ణించాడు.[1]

'ఇదొక తిరుగుబాటు కాదు, విప్లవం' అంటూ అప్పటి పత్రికలు రాశాయి.[2]

మొదటి స్వాతంత్ర్య సంగ్రామం విజయాన్ని సాధించలేకపోయింది. పాటియాలా మహారాజు జింద్ మహారాజు ఈ సంగ్రామానికి వెన్నుపోటు పొడిచాడు. భారతదేశపు రాజ్యాల విభజన, తిరుగుబాటుకు నాయకత్వం వహించిన ప్రభువుల్లో కొందరు చేసిన విశ్వాస ఘాతుకం, తిరుగుబాటుకు కావలసిన కేంద్రీకృత నాయకత్వం లేకపోవడం, పోరాట దిశను సూచించగల కేంద్రీకృత సైనిక స్థావరం లేకపోవడం, బ్రిటిష్ ఆయుధాల ఆధిక్యత మొదలైన అనేక కారణాల వల్ల ఈ పోరాటం వీగిపోయింది. అయినా భారతీయులకు అనేక గుణపాఠాలు నేర్పింది. తిరుగుబాటు బాటను చూపింది.

---

1. ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం: మార్క్స్, ఏంగెల్స్.
2. 'Hindu patriot' — 21.5.1857.

## సంస్కరణోద్యమాలు

ఆధునిక జాతీయ విముక్తి పోరాటావిర్భావానికి, అభివృద్ధికి దోహదం చేసిన సంస్కరణోద్యమాల పాత్ర భారత జాతీయోద్యమంలో విశిష్టమైనది. 1828 లో రాజా రామమోహన్‌రాయ్ 'బ్రహ్మసమాజం' స్థాపించారు. 1875లో దయానంద సరస్వతి 'ఆర్యసమాజం' స్థాపించారు. ఆ తరువాత శ్రీ రామకృష్ణ పరమహంస, ఆయన శిష్యుడు వివేకానందుడు 'జాతీయ పునరుజ్జీవనోద్యమం' ప్రారంభించారు. మేడం బ్లావెట్స్కీ, కల్నల్ ఆల్కాట్ అనే పాశ్చాత్య పండితులు 'దివ్యజ్ఞాన సమాజం' స్థాపించారు.

ఇవన్నీ వ్యక్తి చైతన్యాన్ని రగిలించడానికి కృషి చేసిన సంస్థలే. పందొమ్మిదో శతాబ్దాన్ని కుదిపేసిన సంస్కరణోద్యమాలు మొదట్లో రాజకీయ కార్యకలాపాల వైపు దృష్టిని సారించలేదు; కానీ క్రమంగా రాజకీయ చైతన్య స్ఫూర్తిని పొంది, జాతీయోద్యమ దిశగా పయనించాయి.

## జాతీయోద్యమం - జాతీయత

ఆంగ్ల విద్యావ్యాప్తి, పాశ్చాత్య సాహిత్య ప్రభావం వల్ల భారతీయుల్లో వలస పాలనపై వ్యతిరేకత ప్రారంభమయింది. ఈ వ్యతిరేకత నుండి 'జాతీయత' పుట్టింది.

తెలుగులో దేశం, జాతి, జాతీయత అను పదాలకు సమానార్థకాలుగా ఆంగ్లంలో Nation, Nationality, Nationalism అను పదాలు వ్యవహారంలో ఉన్నాయి.

ప్రజలు తాము నివసిస్తున్న నేలమీద భక్తిని ప్రకటించడం, స్వజాతి జనుల మీద ప్రేమను పెంపొందించుకోవడం 'జాతీయత'గా భావించవచ్చు.

'Nationalism is a political creed that underlies the cohesion of modern soceties and legitimizes their claim to authority. Nationalism enters the supreme loyalty of the overwhelming majority of people upon the nation-state, either existing, or desired.

The Form of Nationalism is conditioned by the social structure, the intellectual traditions and cultural history, and the geographic location of the society, in which Nationalism asserts itself'[3]

---

3. International Encyclopaedia of the social sciences (Vol. 11)

'Demand of people for a government of the same ethnic complexion as the majority. Every people awakened to Nationalism sees political self determination, and the cultural self determination as its goals'[4] అని జాతీయత నిర్వ చించబడింది.

'Nationalism is a state or condition of mind characterstic of certain peoples with a homogeneous culture, living together in close association on a given territory, and sharing a belief in a distinctive existence and a common destiny'[5] అంటూ కూడా 'జాతీయత' అభివర్ణించ బడింది.

'Nationalism is a state of mind, in which a supreme loyalty of the individual is felt to be due to the Nation-State. A deep attachment to one's native soil, to local traditions and to establish territorial authority has existed in varying strength throughout history'[6] అంటూ 'హాన్స్‌కోన్' అనే రచయిత జాతీయతను నిర్వచించాడు.

తను పుట్టిన నేలమీద, తరతరాలుగా కొనసాగుతున్న స్థానిక సత్సంప్రదాయాల మీద ప్రగాఢమైన అభిమానం; నిర్దిష్ట పాలనా వ్యవస్థ కనుగుణంగా మనుగడ సాగించే మానసికస్థితి 'జాతీయత'. రాజకీయ- సాంస్కృతిక స్వయం సమృద్ధిని సాధించాలన్న జాతిజనుల వాంఛ 'జాతీయత'గా రూపొందుతున్నట్లు పై నిర్వచనాలను క్రోడీకరిస్తే తెలుస్తుంది.

ప్రపంచ చరిత్రలో 'జాతీయత' అనే భావానికి పునాదులు వేసిన తాత్వికుడు 'రూసో'. ఒక జాతికి సంబంధించిన అన్ని విషయాల్లోనూ ఆ జాతికి స్వేచ్ఛ ఉండాలనీ, ఒక జాతి భవిష్యత్తును తీర్చిదిద్దుకోవలసింది ఆ జాతియే కానీ, పరజాతి కాదని రూసో ప్రతిపాదించాడు.

ఈ జాతీయతా సిద్ధాంతంతో మానవజాతి చరిత్రలోనే ఒక నూతనశకం ఆరంభమయింది. బానిస సంకెళ్ళను తెంచుకొని స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో బతకాలనే ప్రగాఢమైన వాంఛతో దాదాపు అన్ని దేశాల్లోనూ ప్రజలు ఉద్యమించారు. అనేక పద్ధతుల్లో పోరాటాలు నిర్వహించారు. తమదైన ప్రభుత్వ సాధనకు జాతి యావత్తును కదిలించగల పోరాట రూపమే జాతీయోద్యమం

4. International Encyclopaedia of the social science (Vol. 11)
5. Encyclopaedia of Americana (Vol. 19)
6. Nationalism - Its meaning and history (Revised Edition) 1965 : Hans Kohn (Page : 9)

'స్వాతంత్ర్యం-సౌభ్రాతృత్వం' ప్రాతిపదికలుగా పరప్రభుత్వంపై ప్రజలు జరిపే తిరుగుబాటే జాతీయోద్యమం.

## జాతీయోద్యమంలో కాంగ్రెస్ పాత్ర

భారత ప్రజలకు, బ్రిటిష్ ప్రభుత్వానికి మధ్య అవినాభావ సంబంధాన్ని ఏర్పరచడానికి 1885లో సర్ 'ఆలన్ అక్టేనియన్ హ్యూం' రూపకల్పన చేసిన సంస్థ' జాతీయ కాంగ్రెస్'.

చట్ట నిర్మాణంలో భారతీయులకు ప్రాతినిధ్యం; భారతీయ పరిశ్రమలకు ప్రోత్సాహం, రక్షణ; ప్రభుత్వంలో భాగస్వామ్యం మొదలైన డిమాండ్లతో జాతీయ కాంగ్రెస్, కార్యక్రమాలు ప్రారంభించింది. ఇది చాలాకాలం పాటు పిటిషన్లు, మహజరు సమర్పించే మితవాద సంస్థగా కొనసాగినప్పటికీ దేశంలోని విద్యాధికుల్లో అనేకమంది సమరశీల భావాలను ప్రకటించడం కోసం కూడా ఈ వేదికను వాడుకున్నారు. ఈ సంస్థ ఏర్పడిన నాటినుండీ దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించేవరకూ ఇది అతివాద, మితవాద, ఉదారవాద, విప్లవ వాదులకు ఉమ్మడి వేదికగా ఉపయోగపడింది. విభిన్న దృక్పథాలు కలిగినవారు ఈ సంస్థలో కలిసి పనిచేశారు. ఒక్కోసారి కాంగ్రెస్ అధ్యక్ష-కార్యదర్శుల్లోనూ ఏకరూపత ఉండేది కాదు; వైరుధ్యాల వైవిధ్యాల పుట్టగానే అది కొనసాగేది. కాంగ్రెస్ వేదికనుండి 1886 లోనే స్వరాజ్యం కావాలని ఉద్బోధించిన ఘనత దాదాభాయి నౌరోజీది.

ఉమేశ్‌చంద్రబెనర్జీ, దాదాభాయినౌరోజీ, సురేంద్రనాథ్ బెనర్జీ, మహదేవ గోవిందరానడే, గోపాలకృష్ణ గోఖలే, అనీబిసెంట్ వంటి సంస్కరణవాద, మితవాద నాయకుల నాయకత్వంలో 1906 దాకా జాతీయ కాంగ్రెస్ కొనసాగింది. పారిశ్రామికీకరణ జరగాలనీ, ఆధునిక సాంకేతిక విజ్ఞానం అభివృద్ధి చెందాలనీ, బ్రిటిషువారి అజమాయిషీ కిందే దేశానికి 'అధినివేశ ప్రతిపత్తి' కావాలనీ ఈ తొలితరం జాతీయ నాయకులు వాంఛించారు.

## స్వాతంత్ర్యోద్యమంగా మారిన జాతీయోద్యమం

బాల గంగాధరతిలక్ రాజకీయ రంగప్రవేశంతో భారత జాతీయోద్యమం', స్వాతంత్రోద్యమంగా పరిణమించింది. 1906 నాటి 'కలకత్తా కాంగ్రెస్' వేదికనుండి 'స్వరాజ్యం నా జన్మహక్కు' అన్న ఉద్రేకపూరిత నినాదాన్ని జాతికి అందించిన అతివాది 'తిలక్.' జాతీయవిద్య 'స్వదేశీ పరిశ్రమల స్థాపన' విదేశీవస్తు బహిష్కరణ- ఆయన చూపిన కార్యక్రమాలు. 1908లో **బ్రిటిషు** ప్రభుత్వం తిలక్‌ను అరెస్టుచేసి మాండలే జైలులో **నిర్బంధించింది. దీనికి**

నిరసనగా వేలాదిమంది బొంబాయి కార్మికులు మూడురోజులపాటు సార్వత్రిక సమ్మె చేశారు. మరోవైపు 'పంజాబ్ కేసరి' లాలా లజపతిరాయ్ 1905 లో కాశీలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో విదేశీ వస్త్రాలను బహిష్కరించాలన్న తీర్మానాన్ని బలపరిచి, అమలుజరిపాడు. 1907లో ఆయన రైతాంగ ఉద్యమాన్ని నడుపుతుంటే బ్రిటిష ప్రభుత్వం అరెస్టుచేసి మాండలే జైల్లో నిర్బంధించింది. సైమన్ కమీషన్ వ్యతిరేక ప్రదర్శన (1928) సందర్భంగా పంజాబ్ పోలీసులు కొట్టిన దెబ్బలతో గాయపడి 1928 నవంబర్ 17న తుదిశ్వాస విడిచారు. తిలక్, లజపతిరాయ్‌ల ప్రేరణతో బెంగాల్‌లో గర్జించిన వీరకిశోరం బిపిన్ చంద్ర పాల్. 1904-05 నాటి బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో జాతీయస్థాయి నాయకుడుగా ఎదిగాడు. ఆసేతుహిమాచలం పర్యటించి, అనర్గళ గంభీరోపన్యాసాలతో చైతన్య స్రవంతులు ప్రవహింపజేశాడు. 'వందేమాతరం' ఉద్యమం బ్రిటిషు ప్రభుత్వాన్ని గంగ వెర్రులెత్తించింది.

భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్న రెండవతరం నాయకులు ఈ బాల్-లాల్-పాల్. అతివాద రాజకీయోద్యమ నిర్మాతలుగా, బ్రిటీషు ప్రభుత్వం పాలిటి సింహస్వప్నాలుగా ఉద్యమించిన ఈ నాయకత్రయం ప్రజల చైతన్యస్థాయిని పెంచారు. ప్రగాఢమైన స్వరాజ్యకాంక్షను జాగృతం చేశారు. వీరినాయకత్వంలోనే జాతీయోద్యమం 'స్వాతంత్ర్యోద్యమం'గా పరిణామం చెందింది.

## స్వాతంత్ర్యోద్యమం గాంధీజీ

గాంధీగారి ప్రవేశంతో మూడవతరం నాయకత్వం భారత రాజకీయ రంగస్థలంపై ప్రారంభమయింది. బ్రిటిషు వ్యతిరేకతతోబాటు బ్రిటిషు విద్యావిధానాన్ని, సాంకేతిక పరిజ్ఞానాన్ని , పారిశ్రామికీకరణను కూడా వ్యతిరేకించడం వల్ల చేతివృత్తులు వికసించాయి. ఇది పారిశ్రామిక పురోగతికి గొడ్డలిపెట్టయ్యింది. పెట్టుబడిదారీ వ్యవస్థ అభివృద్ధి చెందాల్సినంత త్వరితగతిన వృద్ధి చెందలేకపోయింది అతివాద స్వాతంత్ర్యోద్యమ జ్వాలలు శాంతియుత సత్యాగ్రహాలుగా, సహాయ నిరాకరణలుగా చల్లారాయి.

అయితే గాంధీగారి నాయకత్వంలో సామాన్యప్రజలు స్వాతంత్ర్య సమరంలోకి దూకారు. విద్యాధికులకు పరిమితమయిన భారత రాజకీయ రంగం సామాన్య ప్రజల పరమయింది. దీనికి ప్రధానకారణం ప్రజల చైతన్య

స్థాయికి తగిన పోరాట రూపాలను గాంధీగారు ఎన్నుకోవడంతో బాటు ప్రజా హిత నిర్మాణ కార్యక్రమాలను ఉద్యమంతో ముడిపెట్టడమే.

1893లో న్యాయవాదిగా దక్షిణాఫ్రికా వెళ్ళిన గాంధీజీ, అక్కడి భారతీయుల సమస్యలపై వారిని సమీకరించి, అక్కడి శ్వేతజాతి ప్రభుత్వంతో 20 సంవత్సరాలపాటు శాంతియుత సత్యాగ్రహ పోరాటాన్ని నిర్వహించాడు. ప్రపంచాన్ని దిగ్భ్రాంతిలో ముంచాడు. 1915లో భారతదేశానికి తిరిగి వచ్చిన గాంధీజీ ఇక్కడి సామాజిక. రాజకీయ స్థితిగతులను అధ్యయనంచేశాడు. అనేక ప్రాంతాలు పర్యటించి. పరిస్థితులను స్వయంగా తెలుసుకున్నాడు.

చంపారణ్ సత్యాగ్రహం (1917), కైరా సత్యాగ్రహం (1918) ద్వారా భారత రాజకీయాల్లోకి ప్రవేశించిన గాంధీజీ నిర్దేశించిన రౌలట్ సత్యాగ్రహం (1919) దేశవ్యాప్తమయ్యింది, భారతప్రజల హక్కులను కాలరాసేందుకు బ్రిటిష్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన రౌలట్ చట్టానికి వ్యతిరేకంగా నిర్వహించిన ఉద్యమం ద్వారా జాతీయస్థాయి నాయకుడుగా గాంధీజీ గుర్తింపు పొందాడు.

## జలియన్‌వాలా బాగ్ మారణకాండ

1919 ఏప్రిల్ 13న పంజాబ్‌లో సంవత్సరాది పండుగ. రౌలట్ చట్టాన్ని నిరసిస్తూ పంజాబ్‌లోని అమృతసర్‌లో 'జలియన్‌వాలా బాగ్ మైదానంలో శాంతియుతంగా ప్రజలు సమావేశమైనారు. అప్పటి పోలీస్ కమీషనర్ 'డయ్యర్' ఆదేశంతో పోలీసులు జరిపిన కాల్పుల్లో వందలాది భారతీయులు నేలకొరిగారు. అనేకమంది క్షతగాత్రులయ్యారు. నెత్తురు ఏర్లు ప్రవహించాయి.

పంజాబ్ నడిబొడ్డులో జరిగిన ఈ మానవ మారణహోమం మొత్తం దేశాన్ని కుదిపేసింది. స్వాతంత్ర్య సమరచరిత్రలో రక్తాక్షరాల్ని నింపింది. దేశవ్యాప్తంగా హర్తాళ్లు, నిరసన సభలు జరిగాయి.

## సహాయ నిరాకరణ

1920 కలకత్తా కాంగ్రెస్ అత్యవసర సమావేశంలో సత్యాగ్రహోద్యమాన్ని ముమ్మరం చేసే నిర్ణయం తీసుకున్నారు. సత్యాగ్రహ నియమావళిని గాంధీజీ ప్రవేశపెట్టాడు. సత్యాగ్రహాల విధులను నిర్వచించాడు.

ప్రభుత్వం ప్రసాదించిన గౌరవోద్యోగాలను, బిరుదులను పరిత్యజించాలి. న్యాయస్థానాలను, న్యాయవాద వృత్తులను బహిష్కరించాలి. శాసన సభలను బహిష్కరించాలి. ప్రభుత్వంతో అన్ని విధాల సంబంధాలను తెగతెంపులు చేసుకోవాలి. సహాయ నిరాకరణ ప్రదర్శించాలి. ఇవీ ఉద్యమంలోని ప్రధానాంశాలు.

ఇందులో భాగంగానే న్యాయవాదులెందరో తమ పట్టాలను త్యజించారు. ఆరోజుల్లోనే మద్రాసులో వేలాది రూపాయలార్జిస్తున్న టంగుటూరి ప్రకాశం పంతులు న్యాయవాదవృత్తిని వదిలేసి సత్యాగ్రహసారధ్యం చేపట్టారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, కొండా వెంకటప్పయ్య, ఖులుసు సాంబమూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు, గాడిచర్ల హరిసర్వోత్తమరావు మొదలైన ఆంధ్ర ప్రాంత నాయకులు ఈ ఉద్యమంలో ప్రముఖ పాత్రను నిర్వహించారు.

## నిర్మాణ కార్యక్రమాలు

సత్యాగ్రహంతో పాటు ప్రజల్ని సమీకరించడానికి, చైతన్య పరచడానికి గాంధీజీ కొన్ని నిర్మాణ కార్యక్రమాలు సూచించారు. 1) అస్పృశ్యతా నివారణ, 2) మద్యపాన నిషేధం, 3) ఖద్దరు ధారణ, 4) జాతీయ విద్యా ప్రచారం, 5) రైతుజన సేవ, 6) హరిజనోద్ధరణ మొదలైన కార్యక్రమాలు ప్రధానమైనవి.

మద్యపాన నిషేధాన్ని కోరుతూ కల్లు, సారాయి దుకాణాలముందు జరిగిన పికెటింగుల్లో వందలాదిమంది స్త్రీ పురుషులు పాల్గొనేవారు.

ఖద్దరుధారణ కోసం, స్వదేశవస్త్రనిర్మాణం కోసం ఇంటింటా ఒక రాట్నం వెలిసింది. జాతీయతాభావ చిహ్నంగా నిలిచింది.

అస్పృశ్యతను నిరసిస్తూ, దేశవ్యాప్త ప్రచారం జరిగింది. హరిజనోద్ధరణ జాతీయోద్యమంలో ప్రధాన భూమికను నిర్వహించింది.

'స్వరాజ్య నిధి,కి పిలుపు ఇవ్వగానే కుప్పలు' తెప్పలుగా ధనరాసులు కురిశాయి.

సర్వ సామాన్య ప్రజానీకం బ్రిటిష ప్రభుత్వాన్ని ఎదిరించే గుండె దిటవును ప్రదర్శించగల ధైర్యాన్ని, స్థైర్యాన్ని ఈ నిర్మాణ కార్యక్రమాలు కలిగించాయి. నైతిక మార్గాన్ని నిర్దేశించాయి.

## స్వాతంత్ర్యోద్యమంలో విప్లవకారుల పాత్ర

బ్రిటిషు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా దాదాపు వంద సంవత్సరాల పాటు సాగిన సుదీర్ఘ జాతీయ-స్వాతంత్ర్యోద్యమంలో శాంతియుత సత్యాగ్రహాలతో పాటు, అశాంతియుత విప్లవ పోరాటాలు కూడా కొనసాగాయి. వందలాది మంది విప్లవకారులు బ్రిటీషు పోలీసుల లాఠీలకూ, తూటాలకూ బలయ్యారు. దీనికి ప్రతీకారంగా బ్రిటీషు అధికారులను కొందరిని బలి తీసుకుని తెల్లదొరలను గడగడలాడించారు. తీవ్ర నిర్బంధాలకు గురయ్యారు దేశమాత స్వేచ్ఛ కోసం నవ్వుతూ ఉరికొయ్యల్ని వరించారు.

## ఇండియన్ హోమ్ రూల్ సొసైటీ

1897 నాటికి భారతదేశంలోని బ్రిటీష్ రహస్య పోలీసుల నిఘాలో ఉన్న దేశభక్తులు కొందరు తమ నివాసాన్ని లండన్‌కు మార్చారు. 1905 ఫిబ్రవరి 18న 'ఇండియన్ హోమ్ రూల్ సొసైటీ'ని స్థాపించారు. 'ఇండియన్ సోషియాలజిస్టు' పత్రిక నడిపారు. లండన్‌లో 'భారత్‌భవన్' పేరుతో వసతి గృహాన్ని నడిపారు. విప్లవ సాహిత్యవ్యాప్తికీ, విప్లవాశయాల ప్రచారానికి కృషి చేశారు. భారతదేశం నుండి అక్కడికి చేరిన విప్లవకారులకు బాంబులు తయారు చేయడం నేర్పారు.

## వివిధ విప్లవ సంస్థలు

ఒకవైపు 'ఇండియన్ హోమ్ రూల్ సొసైటీ' యూరప్ ఖండంలో భారత స్వాతంత్రోద్యమ జ్వాలలు రేపుతుంటే, మరోవైపు ఇటు భారత దేశంలో 'హిందూ ధర్మ బాధానివారిణి సమితి' 'తరుణ భారత సమితి', 'మిత్రమేళ', 'అభినవ భారత సమితి,' వంటి సంస్థలు యువతరంలో విప్లవ భావాలను ప్రచారం చేయసాగాయి.

బెంగాల్ విభజనకు వ్యతిరేకంగా సాగిన 'వందేమాతరం' ఉద్యమాగ్ని నుండి. 'బెంగాల్ అనుశీలన సమితి' ఏర్పడింది. 'యుగాంతర్', 'సంధ్య' 'వందేమాతరం', 'న్యూ ఇండియా' వంటి పత్రికల ద్వారా దేశ ప్రజల్లో జాతీయతా భావ చైతన్యాన్ని కలిగించింది.

1907 డిసెంబర్ 6న బెంగాల్ గవర్నర్ ప్రయాణం చేస్తున్న రైలు మిడ్నపుర్ సమీపానికి రాగానే విప్లవకారులు బాంబు దాడి జరిపారు. రైలు పెట్టెలు కొన్ని పట్టాలు తప్పాయి. గవర్నర్ బతికి బయటపడ్డా, బ్రిటిష్ ప్రభుత్వానికి ఇదొక హెచ్చరికగా పరిణమించింది.

బెంగాల్ విప్లవకారుడు ఖుదీరాం బోస్‌ను ప్రభుత్వం ఉరి తీసింది.

1916 లో పోలీస్ డిప్యూటీ సూపరింటెండెంట్ వసంత చటర్జీని విప్లవ కారులు పట్టపగలే కాల్చి చంపారు. 1917 అక్టోబర్ 21న పోలీస్ ఇన్స్పెక్టర్ సుశీల్ చంద్ర బెనర్జీని అతని యింటి ముందే విప్లవకారులు కాల్చి వేశారు.

విప్లవకారుల్ని క్రూరంగా హింసించడంలో పేరు గాంచిన ఇన్స్పెక్టర్ బంకించంద్ర చౌదరి ఇంటిపై పికరిల్ యాసిడ్ బాంబు విసిరి చంపారు.

ఢిల్లీలో మాస్టర్ అమీర్‌చంద్ అనే ఉపాధ్యాయుడి పర్యవేక్షణలో దీనా నాథ్, జె.ఎన్. చటర్జీ వంటి విప్లవకారులు తయారయ్యారు.

భారత స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తూ అమెరికాలో పనిచేస్తున్న ప్రవాస భారతీయులు 'గదర్ పార్టీ'ని స్థాపించారు. మొదటి ప్రపంచ యుద్ధకాలం (1914)లో బ్రిటిష్ ప్రభుత్వంతో పోరాడటానికి గదర్ వీరులు భారతదేశానికి పయనమయ్యారు. అనేక అవాంతరాలను ఎదుర్కొన్నారు. భారత సరిహద్దులు చేరగానే కొందర్ని ప్రభుత్వం అరెస్టు చేసింది. తప్పించుకుని, దేశంలో అడుగుబెట్టిన గదర్ వీరులు విప్లవ దళాలను నిర్మించారు. సైనికుల్లో తిరుగు బాటు తత్వాన్ని ప్రబోధించారు. పోలీసులతో జరిగిన ముఖాముఖి కాల్పుల్లో 80 మంది సిక్కు యువకులు నేలకొరిగారు. 64 మంది వీరుల మీద 'లాహోర్ కుట్ర కేసు' నడిచింది. 26 గురికి ఉరిశిక్షలు పడ్డాయి. అనేకమంది గదర్ వీరులు అజ్ఞాతవాసం చేయాల్సివచ్చింది.

## హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్

1917 అక్టోబర్ 24 (నవంబర్ 7) నాటి రష్యన్ సోషలిస్టు విప్లవం ప్రభావంతో బెనారస్‌లో 1922లో 'హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్' **(HRA)** ఏర్పడింది. ఆర్థిక వనరుల కోసం 1925 ఆగస్టు 9న ఈ సంస్థ సభ్యులు, కాకోరి నుండి బయలుదేరిన ఒక రైలును దట్టమైన అరణ్యంలో ఆపి, ప్రభుత్వ ధనాన్ని దోచుకున్నారు. తరువాత హరిద్వార్ సమీపంలో ఉన్న కనఖల్ మహంతు మఠం దోచుకున్నారు. ఈ సందర్భంగా 40 మంది **HRA** సభ్యుల్ని నిర్బంధించి, ప్రభుత్వం 'కాకోరి కుట్రకేసు' నడిపింది. కొందరికి ఉరిశిక్షలు విధించింది. అనేకమందికి జైలు జీవితం సంప్రాప్త మయింది. చంద్రశేఖర్ ఆజాద్ ఈ సంస్థ సభ్యుడే.

## హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్

సమ సమాజ నిర్మాణాన్ని ధ్యేయంగా పెట్టుకుని, భారత స్వాతంత్ర్యోద్యమాన్ని ఉధృతం చేయాలన్న సంకల్పంతో హిందూస్థాన్ రిపబ్లికన్ అసోసియేషన్‌ను 'హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్'గా (హెచ్.ఎస్.ఆర్.ఎ)మార్చారు. ఈసంస్థకు భగత్‌సింగ్ అధ్యక్షుడుగా, విజయ కుమార్ సిన్హా కార్యదర్శిగా ఎన్నికయ్యారు. క్రూరులైన బ్రిటిష్ అధికారుల్ని హతమార్చడానికి 'హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీ'ని ఏర్పాటు చేశారు.

## హెచ్. ఎస్. ఆర్. ఎ. కార్యక్రమాలు

లాలా లజపతిరాయ్ మరణానికి కారకుడైన పోలీస్ అధికారి సాండర్సును, అతని ఆఫీసు సమీపంలోనే హెచ్. ఎస్. ఆర్. ఎ. సభ్యులు 1928 డిసెంబర్ 17న కాల్చి చంపారు.

1929 ఏప్రిల్ 4న బ్రిటిష్ ప్రభుత్వం సెంట్రల్ సెంబ్లీలో ట్రేడ్ డిస్ప్యూట్ బిల్లు, సేఫ్టీ బిల్లులను ప్రవేశపెట్టింది. వీటిపై తమ వ్యతిరేకతను ప్రకటించడానికి ఆనాడు అసెంబ్లీ హాల్‌లో భగత్‌సింగ్, బటుకేశ్వర దత్తులు బాంబు వేశారు.

1930 మార్చి 23న భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖదేవ్‌లను లాహోర్ సెంట్రల్ జైల్లో బ్రిటిష్ ప్రభుత్వం ఉరితీసింది. 'ఇంక్విలాబ్' నినాదాన్ని యువతరానికి అందించిన విప్లవకారుడు భగత్‌సింగ్ స్వాతంత్ర్యోద్యమ సంకేతమయ్యాడు.

## ఆజాద్ హింద్ ఫౌజ్ (భారత జాతీయ సైన్యం)

భారత జాతీయ కాంగ్రెస్ 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని చేపట్టగానే బ్రిటిష్ ప్రభుత్వం ప్రముఖ జాతీయ నాయకులందర్నీ నిర్బంధించింది.

జయప్రకాశ్ నారాయణ, రామ్ మనోహర్ లోహియా, అరుణా అసఫాలీ వంటి అతివాదనాయకులు మాత్రం అజ్ఞాతవాసంలో ఉంటూ ఉద్యమాన్ని తీవ్రతరం చేయసాగారు.

మరోవైపు భారతదేశానికి దూరంగా 'భారత జాతీయసైన్యం' దేశ స్వాతంత్ర్యసాధనకు సాయుధ పోరాటానికి సన్నద్ధం కాసాగింది.

1941 జనవరి మాసంలో 'సుభాస్‌చంద్ర' బోస్ కలకత్తాలో గృహనిర్బంధంనుండి తప్పించుకుని జర్మనీ చేరాడు. యూరప్ ఖండంలో నివసించే

భారతీయుల సమావేశాన్ని ఏర్పాటు చేశాడు. 'ఫ్రీ ఇండియా సొసైటీ'ని స్థాపించాడు. చాలా తక్కువకాలంలో ఈ సంస్థ తన సొంత రేడియో ప్రసారాలు ప్రారంభించింది.

1941 డిసెంబర్‌లో కెప్టెన్ సోహన్‌సింగ్ భారత జాతీయసైన్యాన్ని నిర్మించాడు.

జపాన్‌లో స్థిరపడ్డ భారత విప్లవకారుడు రాస్ బిహారీ బోస్ చొరవతో 28-30 మార్చి 1942లో టోక్యోలో సమావేశమైన ప్రవాస భారతీయులు 'ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్'ను ఏర్పాటు చేశారు. ఆ తరువాత అదే సంవత్సరం జూన్ మాసంలో ఆసియాదేశాల్లో నివసిస్తున్న ప్రవాసభారతీయులు సమావేశమై, సభాస్థలిపై త్రివర్ణ పతాకం ఎగురవేశారు. రాస్ బిహారీ బోస్‌ను ఇండియన్ ఇండిపెండెన్స్ లీగ్ అధ్యక్షునిగా సమావేశం ఎన్నుకుంది. సుభాస్ చంద్రబోస్‌ను జపాన్‌కు ఆహ్వానిస్తూ సమావేశం తీర్మానించింది. బోస్ 1943 జూన్‌లో టోక్యో వచ్చి లీగ్ అధ్యక్షపదవినీ, ఆజాద్ హింద్ ఫౌజ్' సర్వసైన్యాధ్యక్ష పదవినీ స్వీకరించాడు. 1944 సంవత్సరారంభం నాటికి 30 వేలమంది సుశిక్షితులైన ఆజాద్ హింద్ ఫౌజ్ సైనికులు తయారయ్యారు.

ప్రవాసభారతీయులతో ఏర్పడిన ఈ సైన్యానికి 'జైహింద్,' 'చలో ఢిల్లీ' నినాదాలనందించిన నాయకుడు నేతాజీ సుభాస్‌చంద్ర బోస్.

1943 డిసెంబర్ 29న అండమాన్, నికోబార్ దీవులను జపాన్ ప్రభుత్వం నుండి ఆజాద్ హింద్ ఫౌజ్ స్వాధీనం చేసుకుంది.

1944 ఫిబ్రవరి 4 నుండి. ఆజాద్ హింద్ ఫౌజ్ సేనలు యుద్ధ రంగంలో ప్రవేశించాయి. రంగూన్ కార్యస్థానంగా చేసుకుని 'ఢిల్లీ చలో' అంటూ ముందుకు దూకాయి. బ్రిటిష్ సేనల ప్రతిఘటన లెమర్కొంటూ 1944 మార్చికల్లా భారత భూభాగంలోకి అడుగుబెట్టాయి. అప్పటికే దాదాపు 4,000 మంది ఆజాద్ హింద్ సైనికులు యుద్ధంలో వీరమరణం పొందారు.

క్రమంగా జపాన్ సహాయం తగ్గించింది. ఆహారం కొరత, వైద్య సహాయం కొరత, శత్రుదాడుల విజృంభణ వంటి అనేక కారణాల వల్ల 'ఆజాద్ హింద్ ఫౌజ్ ఓటమిని చవిచూసింది.

1945 ఆగస్టు 18న నేతాజీ ప్రయాణం చేస్తున్న విమానం తైవాన్ రాజధాని తాయిహోకు వద్ద ప్రమాదానికి గురై, ఆ మహానాయకుడు తుదిశ్వాస విడిచాడు.

బ్రిటిష్ పాలకులు హింద్ ఫౌజ్ సైనికులు చాలామందిని కాల్చిచంపారు. కొందర్ని రంగూన్‌లో నిర్బంధించారు. కొందర్ని కోర్టు మార్షల్ చేసి శిక్షలు విధించారు. కొందర్ని మాత్రం దేశవ్యాప్త సంచలనం తట్టుకోలేక బేషరతుగా 1946 మార్చి 30న విడుదల చేశారు.

'ఆజాద్ హింద్ ఫౌజ్' అపజయాన్ని ఎదుర్కొన్నా, కొంతకాలం పాటు బ్రిటిష్ పాలకుల్ని గడగడ లాడించింది. భారతీయ సైనికులకు తిరుగుబాటు బాట చూపింది. ఈ ప్రేరణతో 1946 ఫిబ్రవరి మాసంలో బొంబాయి, కరాచీ రేవుల్లో నావికుల తిరుగుబాట్లు జరిగాయి. భారతీయసైనికదళాల హృదయాల్లో విప్లవస్రవంతులు ప్రవహించాయి.

## సైమన్ కమీషన్ వ్యతిరేకత

భారతీయులు స్వరాజ్యాన్ని పొందడానికి ఎంతవరకు అర్హులో, వారి రాజకీయస్థాయి ఏమిటో పరిశీలించడానికి బ్రిటిష్ ప్రభుత్వం 1927లో సర్ జాన్ సైమన్ ఆధ్వర్యంలో ఒక కమీషన్‌ను నియమించింది. ఒక్క భారతీయ ప్రతినిధికూడా లేని ఈ కమీషన్‌ను వ్యతిరేకించాల్సిందిగా కాంగ్రెస్ పిలుపు నిచ్చింది. సైమన్ కమీషన్ అడుగుపెట్టిన ప్రతిచోట నల్లజెండాలు చేబూని వేలాదిమంది ప్రజలు 'సైమన్ గో బ్యాక్' అని నినదించారు.

లాహోర్ నగరానికి ఈ కమీషన్ వెళ్ళినప్పుడు, పంజాబ్ కేసరి లాలా లజపతిరాయ్ నాయకత్వాన నిరసన ప్రదర్శన జరిగింది. సాండర్స్ నాయకత్వంలో పోలీసులు ప్రజలపై పాశవిక లాఠీచార్జి జరిపారు. ప్రదర్శన అగ్రభాగంలో ఉన్న 'పంజాబ్ కేసరి' లాఠీదెబ్బలతో నేలకొరిగాడు. ప్రక్క టెముక విరిగింది. క్షయగా పరిణమించింది. ఆ మహానాయకుడ్ని పొట్టన పెట్టుకుంది.

## సంపూర్ణ స్వరాజ్య తీర్మానం

1929లో లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభ 'సంపూర్ణ స్వరాజ్య తీర్మానం' ఆమోదించింది. ఆ సభకు అధ్యక్షత వహించిన జవాహర్‌లాల్ నెహ్రూ 1929 డిసెంబర్ 31 రాత్రి 12 గంటలు దాటిన మరుక్షణంలో జనవరి 1 930లోకి అడుగుబెట్టగానే రావీనది ఒడ్డున మహాసభావరణలో స్వతంత్ర భారతజెండాను ఎగురవేశాడు. ఆక్షణం నుండి కాంగ్రెస్ లక్ష్యం 'సంపూర్ణ స్వరాజ్యం' అని మహాసభ నినదించింది.

## ఉప్పు సత్యాగ్రహం

ప్రభుత్వ నిర్బంధ విధానానికి ఎదురీతగా గాంధీజీ శాసనోల్లంఘన కార్యక్రమాన్ని ప్రారంభించాడు. ప్రభుత్వశాసనాలను ఉల్లంఘించి ప్రజలే స్వయంగా ఉప్పును తయారుచేయాలన్న గాంధీజీ నినాదం గ్రామీణప్రజల్ని బాగా ఆకర్షించింది.

1930 మార్చి 12న గాంధీజీ నాయకత్వంలో దండి సత్యాగ్రహ యాత్ర ప్రారంభమయింది. 24 రోజులపాటు సాగిన ఈ సుదీర్ఘ ప్రయాణంలో 300 గ్రామాల్లోని గ్రామాధికారులు సత్యాగ్రహానికి మద్దతుగా రాజీనామాలు చేశారు. 1930 ఏప్రిల్ 6న గాంధీజీ సముద్రతీరాన ఉప్పును సేకరించారు.

బ్రిటిష్ ప్రభుత్వం గాంధీజీని అరెస్టు చేసింది. దేశ వ్యాప్తంగా ప్రజలపై లాఠీచార్జీలు, కాల్పులు జరిపింది. జైళ్ళన్నీ సత్యాగ్రహులతో నిండి పోయాయి.

ఉప్పు సత్యాగ్రహం ద్వారా శాసనోల్లంఘనోద్యమం ముమ్మరంగా సాగుతున్న దశలో 1931 మార్చి 4వ తేదీనాడు గాంధీ-ఇర్విన్‌ల మధ్య సంధి జరిగింది. ఉద్యమాన్ని అర్థాంతరంగా నిలిపివేశాడు గాంధీజీ.

## రెండో ప్రపంచయుద్ధం

1939 సెప్టెంబర్ 3వ తేదీనాటికి రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభ మయింది. భారత జాతీయ నాయకులెవరితోనూ సంప్రదించకుండా బ్రిటిష్ ప్రభుత్వం భారతదేశాన్ని యుద్ధరంగంలోకి దింపింది. దీనికి నిరసనగా కాంగ్రెస్ మంత్రివర్గాలన్నీ రాజీనామా లిచ్చాయి.

## క్విట్ ఇండియా

1941 డిసెంబర్ 7న మిత్రరాజ్యాల కూటమికి విరుద్ధంగా జపాన్ యుద్ధరంగంలోకి ప్రవేశించింది. చాలా తక్కువ కాలంలో అది ఫిలిప్పైన్స్, ఇండో చైనా, ఇండోనేషియా, మలయ, బర్మాలను జయించింది. 1942 మార్చి నాటికి రంగూన్‌ను స్వాధీనం చేసుకుంది. భారత సరిహద్దుల్లో యుద్ధ మేఘులావరించాయి.

ఆంగ్ల ప్రభుత్వానికి భారతీయుల తోడ్పాటు అవసరమయింది. జపాన్ విజయాలను తిప్పి కొట్టాలన్నా, మిత్రరాజ్యాల కూటమి ముందుకు సాగాలన్నా భారత ప్రజల సహాయం అవసరం. అందుకే రాజకీయ తంత్రజ్ఞు

డైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్‌ను బ్రిటన్ 1942 మార్చి 23న భారతదేశానికి పంపింది. క్రిప్స్ కాంగ్రెస్, ముస్లిం లీగ్ నాయకులతో రాయబారాలు జరిపాడు. శుష్క-వాగ్దానాలు, శూన్య హస్తాలతో వచ్చిన క్రిప్స్ రాయబారం విఫలమయింది.

భారతదేశంలోని ఏ ప్రాంతమైనా భారత యూనియన్‌లో విలీనం కాకుండా స్వయం ప్రతిపత్తిని కాపాడుకోవచ్చు. బ్రిటిషు ప్రభుత్వంతో నేరుగా సంప్రదింపులు జరుపవచ్చు. యుద్ధకాలంలో ఎలాంటి రాజ్యాంగ సవరణలు జరుగరాదు. యుద్ధం ముగిసాక అన్ని రాజకీయ పార్టీల సహకారంతో 'జాతీయ ప్రభుత్వం' ఏర్పడుతుంది. రక్షణ - శాఖ కమాండర్ ఇన్ - చీఫ్‌గా మాత్రం ఆంగ్లేయాధికారి కొనసాగుతాడు - వంటి క్రిప్స్ ప్రతిపాదనలు రాయబారానికి ప్రతిబంధకాలుగా మారాయి. ఫలితంగా క్రిప్స్ వచ్చిన దారిన తిరిగివెళ్ళాడు.

గాంధీగారికి స్టాఫర్డ్ క్రిప్స్ రాక మొదట్నించీ ఇష్టం లేదు. అయినప్పటికీ రాయబారం విఫలం కావడంతో ఆయన కొంత నిరుత్సాహపడ్డాడు. దేశవ్యాప్తంగా నిరాశా నిరుత్సాహాలు ఆవరించాయి. తగిన చర్య తీసుకోక పోతే ప్రజలు సహించే స్థితి దాటిపోయింది.

1942 జూలై 6న వార్ధాలో కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం జరిగింది. సుదీర్ఘ చర్చలు, వాదోపవాదాల తరువాత 'జాతీయ వాంఛ' **(National Demand)** ను సమావేశం ప్రకటించింది. వెంటనే భారతీయులకు అధికారాన్ని హస్తగతం చేసి 'దేశాన్ని వదలండి' (క్విట్ ఇండియా)- అంటూ సమావేశం బ్రిటిష్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. ఈ జాతీయ డిమాండ్‌ను ఆంగ్ల ప్రభుత్వం అంగీకరించని పక్షంలో కాంగ్రెస్ తన మొత్తం శక్తి యుక్తుల్ని కూడగట్టుకుని ప్రత్యక్ష చర్యకు పూనుకుంటుందని సమావేశం హెచ్చరించింది.

చైనా జనరల్ చాంగ్ కై షేక్, యునైటెడ్ స్టేట్స్ అధ్యక్షుడు రూజ్‌వెల్ట్ బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఒప్పించే ప్రయత్నాలు చేశారు. భారతదేశంతో ఒక అవగాహనకు రమ్మన్నారు. బ్రిటన్ ప్రధాని చర్చిల్ అంగీకరించలేదు. తన హయాంలో బ్రిటిష్ సామ్రాజ్యం హరించుకుపోవడం భరించలేనన్నాడు.[7]

1942 ఆగస్టు 8 న బొంబాయిలో అఖిల భారత కాంగ్రెస్ కమిటీ (ఎ.ఐ.సి.సి.) సమావేశం జరిగింది. వార్ధాలో కార్యవర్గం చేసిన 'క్విట్

7. Freedom struggle - National BooK Trust of India, New Delhi.

ఇండియా' తీర్మానాన్ని సమావేశం ఆమోదించింది. భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటిస్తే వెంటనే ప్రొవిజినల్ ప్రభుత్వాన్ని ఏర్పాటు, చేసి మిత్రరాజ్యాల కూటమికి మద్దతు నిస్తుందని సమావేశం ప్రభుత్వానికి తన అభిప్రాయాన్ని ప్రకటించింది. బ్రిటిషు ప్రభుత్వం వెంటనే ప్రతిస్పందించక పోతే గాంధీజీ నాయకత్వంలో పోరాటం అనివార్యమౌతుందని బొంబాయి సమావేశం ఖచ్చితంగా హెచ్చరించింది.

బ్రిటిషు ప్రభుత్వం ఈ హెచ్చరికల్ని ఖాతరుచేయక పోగా, అదే రాత్రి గాంధీజీని, ఇతర జాతీయ నాయకుల్ని అరెస్టు చేసింది. ఒక ప్రత్యేక రైలు నేర్పాటు చేసి, బొంబాయి నుండి నాయకులందర్నీ తరలించింది. గాంధీజీని పూనాలోని ఆగా ఖాన్ ప్యాలెస్‌లో, ఇతర జాతీయ నాయకుల్ని అహమద్ నగర్ ఫోర్ట్‌లో నిర్బంధించింది.

1942 ఆగస్టు 9 వ తేదీ ఉదయానికల్లా 'క్విట్ ఇండియా' తీర్మానం, జాతీయ నాయకుల అరెస్ట్ ఉదంతం దేశమంతా మారుమోగింది. ఎక్కడికక్కడే ప్రజలు ప్రతిఘటన పోరాటాలు ప్రారంభించారు.

గాంధీజీ 'డూ ఆర్ డై' చేయండి లేదా చావండి అని జాతికి పిలుపునిచ్చారు. జాతి యావత్తు జాగృతమై కదిలింది. అరెస్టులు, కాల్పులు, నిరసన ప్రదర్శనలు, పోలీసుల దౌర్జన్యాలు, ప్రజల తిరుగుబాట్లు దేశమంతా రణభూమిగా మారింది.

## ఆగస్టు విప్లవం

'క్విట్ ఇండియా' నినాదంతో 1942 ఆగస్టు మాసమంతా దేశవ్యాప్త ఉద్యమం చెలరేగింది. విధ్వంసకాండ ప్రళయ తాండవం చేసింది. రైళ్ళు, టెలిగ్రాఫ్ తీగెలు, రైల్వే స్టేషన్లు, ప్రభుత్వ భవనాలనేకం ధ్వంసమయ్యాయి. ఉద్యమంలో విద్యార్థులు అగ్రభాగాన నిలిచారు. ప్రభుత్వాన్ని స్తంభింపజేశారు. గాంధీజీని, ఇతర జాతీయ నాయకుల్ని నిర్బంధించడంతో ఉద్యమం ఆగుతుందని ప్రభుత్వం భ్రమించింది. కానీ అది ఆగకపోగా ద్విగుణీకృతమయింది. శాంతియుత సత్యాగ్రహాలు అనేక చోట్ల హింసాయుత పోరాటాలుగా పరిణమించాయి. దీనినే 'ఆగస్టు విప్లవం' అంటున్నాం.

## తెలుగునేలపై స్వాతంత్ర్యోద్యమం

బ్రిటిషు పరిపాలనకు వ్యతిరేకంగా దేశమంతటా వ్యాపించిన జాతీయ, స్వాతంత్ర్యోద్యమంలో భాగంగానే తెలుగు నేలపై అనేక ప్రాంతాల్లో ప్రజలు

వలస పాలనకు వ్యతిరేకంగా నిరసనలు, ఆందోళనలు కొనసాగించారు.

జమీందారీ, రైత్వారీ వ్యవసాయ పద్ధతుల లోపాలకు వ్యతిరేకంగా ఆంధ్రప్రాంతంలోని అనేక చోట్ల రైతులు ఆందోళనలు లేవదీశారు.

## వందేమాతరం మందేరాజ్యం

జాతీయోద్యమాన్ని కొత్త మలుపు తిప్పిన బెంగాల్ విభజన (1905) కు వ్యతిరేకంగా లేచిన 'వందే మాతరం' ఉద్యమం తెలుగునేలను కూడా ప్రభావితం చేసింది. బెంగాల్‌ను విభజించినట్లే బ్రిటిష ప్రభుత్వం ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుండి గంజాం, విశాఖపట్టణం జిల్లాలను విభజించి ఒరిస్సాలో విలీనం చేయాలని సంకల్పించింది. దీనికి వ్యతిరేకంగా ఆంధ్ర ప్రజలు తీవ్రంగా ప్రతిస్పందించారు. తమ నిరసన వ్యక్తం చేశారు. 'వందే మాతరం - మందే రాజ్యం' నినాదం తెలుగు నేలపై ప్రతిధ్వనించింది. ఫలితంగా ప్రభుత్వం ఈ ప్రతిపాదనను విరమించుకుంది.

## బిపిన్ చంద్ర పాల్ ఆంధ్ర పర్యటన

1907 ఏప్రిల్ మాసంలో స్వాతంత్ర్యోద్యమ నాయకులు బిపిన్‌చంద్రపాల్ ఆంధ్రప్రాంతంలో చేసిన పర్యటన, అతని మహోపన్యాసాలు ఇక్కడి ఉద్యమానికి కొత్త ఊపునిచ్చాయి. ముట్నూరి కృష్ణారావు ఈ పర్యటనను ఏర్పాటు చేశారు. విజయనగరం, విశాఖపట్నం, రాజమండ్రి, కాకినాడలలో పాల్ ఉపన్యసించారు. ఏప్రిల్ 19 నుండి 24 వరకు ఆయన రాజమండ్రిలో ఉండి, అక్కడ చేసిన ఉపన్యాసాలు బ్రహ్మాండమైన ప్రజాదరణ పొందాయి. ప్రజలు తండోప తండాలుగా వెళ్ళి పాల్ ఉపన్యాసాలను విన్నారు. 'స్వరాజ్యం,' 'స్వదేశం,' 'బ్రహ్మసమాజం,' 'విదేశీవస్తు బహిష్కారం' మొదలైన అంశాలపై సాధికారికంగా ప్రసంగించిన 'పాల్' ఉపన్యాసాలు ఇక్కడి ప్రజలను, ముఖ్యంగా మేధావులను బాగా ఆకర్షించాయి. రాజమండ్రిలోనే బిపిన్‌చంద్ర పాల్ 'గోదావరి స్వదేశీ వస్తువుల నిలయానికి' ప్రారంభోత్సవం చేశారు.

## తొలి తెలుగు రాజకీయ ఖైదీ

బిపిన్ చంద్ర పాల్ ప్రసంగాలతో ప్రభావితులైన రాజమండ్రి ప్రభుత్వ ఆర్ట్స్ అండ్ ట్రయినింగ్ కాలేజీ విద్యార్థులు 'వందే మాతరం' బ్యాడ్జీలు ధరించి, 'వందేమాతరం' గీతాలాపన ప్రారంభించారు. పాల్ పర్యటనకు నెలరోజుల

ముందే, ఆ కాలేజీ ప్రిన్సిపాల్ 'మార్క్ హంటర్' విద్యార్థుల్ని సమావేశ పరిచి, 'వందేమాతరగీతం' పై నిషేధం విధిస్తున్నట్లు ప్రకటించాడు. ఈ ఆదేశాలను ఉల్లంఘించిన విద్యార్థులు మాతృదేశభక్తిని గానం చేశారు. అంతే కాదు ఆ కళాశాల విద్యార్థుల్లో ఒకరైన 'గాడిచర్ల హరి సర్వోత్తమరావు' బిపిన్ చంద్రపాల్‌కి స్వాగతం చెప్పారు. దాంతో ప్రిన్సిపాల్ ఆగ్రహోదగ్రుడయ్యాడు. మొత్తం 222 మంది కాలేజీ విద్యార్థుల్లో 138 మందిని 2 సంవత్సరాల పాటు పరీక్షలు రాయకుండా డిబార్ చేశాడు. హరిసర్వోత్తమరావుని డిబార్ చేయడంతోపాటు, అతను ప్రభుత్వ సర్వీసునకు అనర్హుడిగా ప్రభుత్వం ప్రకటించేట్లు చేశాడు.

ఇలా విద్యార్థి జీవితానికి స్వస్తి చెప్పిన హరిసర్వోత్తమరావుగారు 'స్వరాజ్య' పత్రికను స్థాపించారు. అందులో ప్రభుత్వాన్ని ఖండిస్తూ వ్యాసాలు రాసినందుగ్గాను, ప్రభుత్వం మూడు సంవత్సరాల కారాగార శిక్ష విధించింది. తెలుగునాట జైలు పాలయిన తొలి రాజకీయ ఖైది హరి సర్వోత్తమరావుగారే

## విజయవాడలో అఖిల భారత కాంగ్రెస్ సభలు (1921)

1921 మార్చి 31- ఏప్రిల్ ఒకటి తేదీల్లో విజయవాడలో 'అఖిల భారత కాంగ్రెస్ కమిటి' సభలు జరిగాయి. ఆంధ్రప్రాంత రాజకీయ చరిత్రలో ఈ సభలకు ప్రత్యేక ప్రాధాన్యం ఉంది. గాంధీజీ, మోతీలాల్ నెహ్రూ, చిత్తరంజన్‌దాస్, మహమ్మద్ ఆలీ, శౌకత్ ఆలీ వంటి జాతీయ నాయకులను చూడాలనీ, వారి ఉపదేశాలు వినాలనీ నలుమూలల నుండి వేలాది ప్రజలు 'విజయవాడ'కు తరలివచ్చారు. ఈ సభల్లోనే తెలుగువాడైన 'పింగళి వెంకయ్య' త్రివర్ణపతాకాన్ని రూపొందించి ఇచ్చాడు.[1] కొన్ని స్వల్పమైన మార్పులతో ఈ మువ్వన్నెల జెండాను గాంధీజీ ఆమోదించారు. క్రమంగా మరికొన్ని మార్పులతో అది మన జాతీయ జెండాగా స్థిరపడింది.

కాంగ్రెస్ సభల సందర్భంగా విజయవాడ నగరంలో ఎటు చూసినా ప్రజా సమూహాలే. ఎటు విన్నా దేశభక్తి గీతాలే. మిన్నంటుతున్న జయజయ ధ్వానాలే. ప్రజలను అదుపుచేయడం కాంగ్రెస్ కార్యకర్తలకు తలకు మించిన పనయ్యింది. నాయకులు సభావేదిక పైకి వెళ్ళడం కూడా కష్టసాధ్యమయ్యింది. సరిగ్గా ఆ సమయంలోనే 500 మంది సుశిక్షితులైన 'రామదండు' సైనికులను

1. History of Modern Andhra (Page : 99) —P. R. Rao,

దుగ్గిరాల గోపాల కృష్ణయ్య చీరాల నుండి విజయవాడకు ఒక ప్రత్యేక రైలులో తీసుకెళ్ళాడు. 'రామదాసు' వేషంలో, తన శిష్యులతో బాటు రంగప్రవేశం చేసి, క్షణాల్లో ప్రజలను ఎక్కడి వారి నక్కడ కూచో బెట్టాడు. శాంతిని నెల కొల్పాడు.

ఆనాడు దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ప్రదర్శించిన నైపుణ్యం చూసిన జాతీయ నాయకులకు ఆశ్చర్యానందాలు కలిగాయి. 'శౌకతాలీ' వంటి నాయకులు 'రామదండు'ను 'ఎర్రసేన'గా కీర్తించారు.[1]

ఈ మహాసభల తరువాత గాంధీజీ ఆంధ్రప్రాంతంలోని కాకినాడ, రాజమండ్రి, ఏలూరు, మచిలీపట్నం, చీరాల, నెల్లూరు మొదలైన ప్రధాన కేంద్రాలను పర్యటించారు. గంభీరమైన ఉపన్యాసాలతో ప్రజలను చైతన్య పరిచారు. గాంధీగారి పర్యటన ఇక్కడి జాతీయోద్యమ విస్తృతికి ఇతోధికంగా తోడ్పడింది.

## చీరాల - పేరాల సత్యాగ్రహం

ఆంధ్ర జాతీయోద్యమంలో ప్రముఖ స్థానాన్ని పొందిన ప్రజోద్యమ మిది.

ఇప్పటి ప్రకాశం జిల్లా, బాపట్ల తాలూకాలోని జంట గ్రామాలు చీరాల - పేరాల. ఇవి బంగాళాఖాతం తీర గ్రామాలు. 1921 నాటి జనాభా లెక్కల ప్రకారం అప్పటి జనాభా 15,000. ఈ జంట గ్రామాలతో బాటు జాండ్రపేట, వీరరాఘవపేటలు కలిసి 'చీరాల యూనియన్' పేరుతో ఒక పరిపాలనా యూనిట్‌గా ఉండేవి.

1919 లో మద్రాసు ప్రభుత్వం చీరాల - పేరాల లను 'యూనియన్' నుండి విడగొట్టి 'మున్సిపాలిటీ'గా రూపొందించింది. 1920 నాటికి ఈ జంట గ్రామాల మీద వసూలుచేస్తున్న పన్నుల్ని 10 రెట్లు పెంచి, సంవత్సరానికి 40,000 రూపాయలు వసూలు చేయ నిర్ణయించింది.[2]

---

1. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య జీవిత చరిత్రము(పుట: 74) —శ్రీ కార్యంపూడి నాగేంద్రుడు
2. History of Modern Andhra (Page : 100) —P.R. Rao.

ఈ నిర్ణయాన్ని ప్రజలు వ్యతిరేకించారు. ప్రభుత్వానికి అనేక విజ్ఞప్తులు పంపారు. అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి 1921 ఫిబ్రవరిలో స్వయంగా చీరాలను సందర్శించినప్పుడు, ప్రజలు 'మున్సిపాలిటీ'ని రద్దుచేయమని పెద్ద యెత్తున అభ్యర్థన పత్రాలందజేశారు. అయినా ప్రభుత్వం దిగిరాలేదు.

దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నాయకత్వంలో ప్రజలు 'పన్నుల నిరాకరణ' ఉద్యమాన్ని ప్రారంభించారు.

## తొలి తెలుగు మహిళారాజకీయఖైదీ

1921 మార్చి నెలలో మున్సిపల్ అధికారులు పోలీసుల సహాయంతో పన్నులు వసూలు చేయడానికి విఫల ప్రయత్నం చేశారు. ప్రజలు లొంగలేదు. 11 మంది పురుషులను, ఒక వృద్ధ దేశభక్తురాలు 'శ్రీమతి రావూరి అలువేలమ్మ'ను అరెస్టు చేశారు. తొలి తెలుగు మహిళా రాజకీయ ఖైదీ ఈమే. బహుశా దేశంలోనే తొలి తెలుగు మహిళా రాజకీయ నిర్బంధితురాలు అలువేలమ్మే కావచ్చు.

1921 ఏప్రిల్ 25 న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య సారథ్యంలో చీరాల - పేరాల ప్రజలు ఒక మహాసభ జరిపి, 'గ్రామత్యాగం' నిర్ణయం తీసుకున్నారు. మున్సిపల్ హద్దులకు దూరంగా తాటాకుల పాకలతో 'రామనగర్' నిర్మించుకుని, గ్రామాలను ఖాళీచేసి, అక్కడికి వెళ్ళిపోయారు. ధనవంతులు, నిరుపేదలు, రైతులు, చేతి వృత్తులవారు, చేనేతవారు — అనే వ్యత్యాసాలు లేకుండా ఈ రెండు గ్రామాల ప్రజలందరూ దాదాపు 11 నెలలపాటు గ్రామత్యాగంతో 'అరణ్యవాసం' చేశారు. ప్రభుత్వ నిర్బంధం, ఆర్థిక ఇబ్బందులు, భయంకరమైన వేసవి ఉగ్రతలను తట్టుకున్నారు. దుగ్గిరాల అరెస్టుతో 11 నెలల తర్వాత ఉద్యమ విరమణ జరిగింది.

## పలనాటి పుల్లరి సత్యాగ్రహం

గుంటూరు జిల్లాలోని వెనుకబడిన ప్రాంతం పలనాడు. అక్కడి ప్రజలను ప్రభుత్వఅధికారులు, ముఖ్యంగా అటవీశాఖఅధికారులు అనేక ఇబ్బందులు పెట్టేవారు. అడవుల్లో పశువులను మేపుకుంటున్నా, వంటచేసుకునే పుల్లలను, కట్టెలను ఏరుకుంటున్నా అటవీశాఖవారు నిర్బంధించేవారు; హింసించే వారు. లంచాలు సమర్పించిన వారిని వదిలేస్తూ, వ్యతిరేకించిన వారిని అటవీ చట్టాల ప్రకారం శిక్షించేవారు. 1921 వ సంవత్సరంలో వర్షా

భావం వల్ల పశుగ్రాసం కొరత ఏర్పడింది. అడవుల్లో పశువులను మేపుకునే అనుమతి కోసం పలనాటి ప్రజలు ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపారు. ప్రభుత్వం నిరాకరించింది. ప్రభుత్వవైఖరికి నిరసనగా అక్కడి స్థానిక నాయకుడు కన్నెగంటి హనుమంతు నాయకత్వాన ప్రజలు ఎదురు తిరిగారు. అధికారుల ఆజ్ఞలను ధిక్కరించి, అడవుల్లో పశువులను మేపసాగారు. అడవి నుండి కట్టె పుల్లల్ని ఏరుకుని రావడం మొదలు పెట్టారు. ప్రభుత్వ నిర్బంధం పెరిగింది. ప్రజా ప్రతిఘటన కూడా పెరిగి ప్రభుత్వాధికారులను, ఉద్యోగులను ప్రజలు 'సాంఘిక బహిష్కారం' జరిపారు. అక్కడి డిప్యూటి తహసిల్దారుపిల్లలకే పాలు దొరకక లేదంటే, ఇతర ఉద్యోగుల సంగతి ఊహించవచ్చు. వ్యాపారస్తులు ప్రభుత్వాధికార్లకు సరుకులు అమ్మడం మానేశారు. నూటికి నూరు పాళ్ళ సాంఘిక బహిష్కరణ అమలు జరిగింది.

1921 జూలై మాసంలో గుంటూరు జిల్లాకలెక్టర్, పోలీసు సూపర్నెంటును వెంట బెట్టుకుని, పరిస్థితిని స్వయంగా అంచనా వేయడానికి మాచెర్ల వెళ్లాడు. మాచెర్లలో అడుగుబెట్టగానే వారిక్కూడా 'సాంఘిక బహిష్కరణ' ఎదురయ్యింది. వారికావలసిన రవాణా సదుపాయాలు కానీ, అన్న పానీయాలు కానీ దొరకనీయకుండా ప్రజలు తమ ఆగ్రహాన్ని ప్రదర్శించారు. ఉద్యమ విరమణ కోసం 'డప్పు' చాటింపు వేయించడానికి కలెక్టర్ డప్పుల వాళ్ళకు కబురు పెట్టాడు. ఒక్కరూ సహకరించలేదు. చుట్టుపట్ల గ్రామాల్లో డప్పుల వాళ్ళను వెదికించాడు. డప్పులు పనిచేయడం లేదన్న సమాధానమే వచ్చింది. ఆ రోజంతా కలెక్టర్ మాచెర్ల లోనే గడిపాడు. ఆనాటి సాయంత్రం ప్రముఖ కాంగ్రెస్ నాయకులు ఉన్నవ లక్ష్మీనారాయణ, వేదాంతం నరసింహాచారి ఆ గ్రామాన్ని సందర్శించడానికొచ్చారు. పలనాటి ప్రజానీకం కొన్ని వందల డప్పులతో ఊరేగింపుగా వెళ్ళి, తమ నాయకులకు స్వాగతం చెప్పారు. ప్రజా సమూహాన్ని, మేళతాళాల్ని చూసి పిచ్చెక్కిన కలెక్టర్ ఆ ఇద్దరు నాయకులను అరెస్టు చేయించి, ఏడాది పాటు కఠిన కారాగార శిక్ష విధించాడు. నాయకుల అరెస్టుతో పల్నాటి పోరాటం మరింత తీవ్రమై 'పన్నుల నిరాకరణ' ఉద్యమంగా మారింది. ప్రజలకూ - అటవీశాఖ అధికార్లకూ; ప్రజలకూ-పోలీసులకు మధ్య అనేకచోట్ల ఘర్షణలు జరిగాయి. అధికారులు స్వాధీనం చేసుకున్న పశువులను ప్రజలు బలప్రయోగంతో విడిపించుకోసాగారు. 1922 ఫిబ్రవరి నాటికి అనేక గ్రామాలనుండి పోలీసులను ప్రజలు తరిమికొట్టారు. వెల్దుర్తి అనే గ్రామంలో పోలీసులు విడిచిచేసిన భవనాన్ని ప్రజలు చుట్టుముట్టారు. అతికష్ట

మీ్మద అర్థరాత్రిపూట పోలీసులు చీకట్లో తప్పించుకుని పారిపోయారు. 'జల్లి పాలెం'లో అటవీశాఖ అధికారుల ఆజ్ఞలను ధిక్కరించి అడవుల్లో పశువులను ప్రజలు మేపసాగారు. పోలీసులు పశువులను స్వాధీనం చేసుకుంటే, ప్రజలు సామూహికంగా ప్రతిఘటించి విడిపించుకుపోయారు. 26 ఫిబ్రవరి 1922 నాడు 'మించాలపాడు'లో అటవీశాఖవారు, పోలీసులు కలిసి దాదాపు 50 గొర్రెల్ని 125 బర్రెల్ని స్వాధీనం చేసుకుని 'ముట్కూరు' వైపు తీసుకెళ్తున్నారు. కన్నెగంటి హనుమంతు నాయకత్వంలో దాదాపు 300 మంది స్త్రీ పురుషులు తమ పశువులను విడిపించు కోటానికి అధికార్లపై పడ్డారు. పోలీసులు నిర్దాక్షిణ్యంగా కాల్పులు జరిపారు. పలనాటి ప్రజల నాయకుడు 'హనుమంతు' నేలకొరిగాడు. ప్రజలు చెల్లాచెదురై పారిపోయారు.

ప్రజల ప్రియతమనాయకుడు బలైపోవడం, ఉన్నవ లక్ష్మీనారాయణ వంటి నిబద్ధనాయకులు జైల్లో ఉండడం, స్వార్థపర కాంగ్రెస్ నాయకులు ఉద్యమాన్ని నీరుగార్చడం మొదలైన కారణాల వల్ల పల్నాటి ప్రజోద్యమం అర్థాంతరంగా ఆగిపోయింది.

## పెదనందిపాడు పన్నుల నిరాకరణ

గాంధీజీ బార్డోలీ సత్యాగ్రహాన్ని ప్రారంభించడానికి ముందే గుంటూరు జిల్లాలోని పెదనందిపాడులో శ్రీ పర్వతనేని వీరయ్యచౌదరి నాయకత్వంలో ప్రజలు సత్యాగ్రహం జరపడం విశేషం.

అక్కడి గ్రామాధికారుల సమస్యలు ప్రభుత్వం పరిష్కరించక పోవడంతో ఉద్యమం ప్రారంభమయ్యింది. శ్రీ వీరయ్యచౌదరి నాయకత్వంలో పెదనందిపాడు గ్రామాధికారులు ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరికి నిరసనగా తమ పదవులకు రాజీనామాలిచ్చారు. దాంతో పన్నులు వసూలు చేసే వారే లేనందున ప్రజలు పన్నులు కట్టడం మానేశారు. ఇది క్రమంగా సహాయనిరాకరణోద్యమంగా, పన్నుల నిరాకరణోద్యమంగా మారి దాదాపు 8 నెలలపాటు ఇక్కడి ప్రభుత్వ యంత్రాంగాన్ని స్తంభింపజేసింది. ప్రభుత్వం ఎన్ని ఎత్తుగడలు వేసినా ప్రజల ప్రతిఘటన చైతన్యాన్ని నిరోధించలేక పోయింది.

అయితే దేశవ్యాప్తంగా గాంధీజీ సహాయనిరాకరణోద్యమాన్ని విరమిస్తున్నట్లు ప్రకటించడంతో, 1922 ఫిబ్రవరి 10 న జరిగిన గుంటూరు జిల్లా కాంగ్రెస్ కమిటీ సమావేశం ఉద్యమ విరమణకు పిలుపు ఇచ్చింది. ఉవ్వెత్తున ఎగిసిన జనంపొంగు క్రమంగా చల్లారింది.

## మన్యం వీరుల తిరుగుబాటు

1922 జనవరి మొదలు 1924 మే మాసం వరకు దాదాపు 2 సంవత్సరాల 5 నెలలపాటు తెల్లదొరలకు వ్యతిరేకంగా గిరిజనులు జరిపిన సాయుధపోరాటం మన్యం తిరుగుబాటు. 'రంపపితూరీ', 'రంప తిరుగుబాటు', 'మన్యం వీరుల పోరాటం' మొదలైన పేర్లతో ఈ పోరాటం చరిత్ర ప్రసిద్ధమయ్యింది. సహాయ నిరాకరణోద్యమాల కన్నా ప్రభుత్వానికి ఈ సాయుధ తిరుగుబాటు ఎక్కువ ఆందోళన కలిగించింది.

1921 నాటికే అల్లూరి సీతారామరాజు 'సహాయనికరణ' ఉద్యమంచేత ప్రభావితుడయ్యాడు. 1921 జూలై మాసంలో చిటగాంగ్‌లో సమావేశమైన బెంగాల్ విప్లవకారుల రహస్య సమావేశానికి హాజరయ్యాడు. దాంతో ఉత్తేజితుడైన రామరాజు ఆంధ్రప్రాంతానికి తిరిగిరాగానే, తూర్పుగోదావరి జిల్లాలోని గూడెం కొండల్లో గిరిజనుల తిరుగుబాటును రగిలించడం మొదలు పెట్టాడు.

అప్పుడా ప్రాంతంలోని గిరిజన ప్రజలు ప్రభుత్వ అటవీసంరక్షణ చట్టాల మూలంగా అనేకవిధాల దోపిడికీ, అణచివేతకు, నిర్బంధాలకూ గురవుతూ ఉండేవారు. ప్రభుత్వాధికారులు ఆ ఆటవికజనాన్ని అనేక రకాలుగా వేధించేవారు. వారి గూడెంపైబడి కోళ్ళు, గొర్రెలు, పాలు, నెయ్యి, తేనె వంటి విలువైన వస్తువులను దోచుకునేవారు. ప్రతిఘటిస్తే చావబాదేవారు. వారి స్త్రీలను బలాత్కరించేవారు. అడవిలో కట్టెలు ఏరుకుంటే శిక్షించేవారు. గిరిజనులు తెచ్చుకున్న కలప, కరక్కాయలను లాక్కుపోయేవారు. అడవుల్లో రోడ్ల నిర్మాణాన్ని చేపట్టే కాంట్రాక్టర్లు గిరిజనులతో బలవంతంగా పనులు చేయించుకొని సరైన కూలీ ఇచ్చేవారు కాదు.

ఈ దారుణాలన్నీ సీతారామరాజు కండ్లారాచూశాడు. గిరిజనులను సమీకరించాడు, ఎదురు తిరిగేదారి చూపెట్టాడు. 1922 ఆగష్టు 22 న 'చింతపల్లి' పోలీసుస్టేషన్ పై మొదటి దాడి జరిగింది. 'శరభన్నపాలెం' పోలీసుస్టేషన్ పై రెండవదాడి జరిగింది. అక్కడ మేళతాళాలతో కోయప్రజలు విప్లవకారులకు స్వాగతం పలికారు. ఆ తరువాత 'కృష్ణదేవిపేట', 'రాజకొమ్మంగి' పోలీస్‌స్టేషన్‌లపై దాడి చేసి, ఆయుధాలను, మందుగుండు సామగ్రినీ మన్యం వీరులు స్వాధీనం చేసుకున్నారు. ప్రభుత్వం అణచివేతచర్యలు ప్రారంభించింది. **స్కాట్, హైటర్‌లనే క్రూర అధికార్ల సారధ్యంతో ఒక సాయుధ పోలీసుదళం**

'దమనపల్లిఘాట్' చేరగానే, సీతారామరాజు దళం వారిపై మెరుపుదాడి చేసింది. అధికారులు నేలకొరిగారు. ఆయుధాలను వదిలివేసి పోలీసులు పారిపోయారు. 'అడ్డతీగల', 'రంపచోడవరం' పోలీసుస్టేషన్లను రామరాజు స్వాధీనం చేసుకున్నాడు. మలబారు స్పెషల్ పోలీసుదళాన్ని మన్యం వీరులు మట్టికరిపించారు. సీతారామరాజు విజయపరంపరలు ఆంధ్రదేశాన్ని ఉర్రూతలూగించసాగాయి. మన్యం గిరిజన ప్రజల్ని ఉత్సాహపరిచి, పోరాటయోధులుగా మలిచాయి.

1923 ఏప్రిల్ 18 నాడు సీతారామరాజుదళం 'అన్నవరం' పోలీస్ స్టేషన్‌పై దాడి జరిపింది. ఆయుధాలు దొరకకపోయినా అక్కడి ప్రజల ఆదరణ మాత్రం వీరికి దొరికింది.

1923 సెప్టెంబర్ 18 న సీతారామరాజు సహచరుడు 'మల్లుదొర' ను నడింపల్లి గ్రామంలో పోలీసులు నిర్బంధించారు. గిరిజనోద్యమాన్ని అణచడానికి 'అస్సాం రైఫిల్స్‌దళాన్ని' బ్రిటీషు ప్రభుత్వం ఏజెన్సీ ప్రాంతానికి పంపింది. రూథర్‌ఫర్డ్ ఈ దళానికి స్పెషల్ కమీషనర్-ఇన్‌చార్జిగా వచ్చాడు. 1924 మే 6 న 'అగ్గిరాజు'ను పోలీసులు పట్టుకున్నారు. గిరిజన ప్రజలపై పోలీసులు అణచివేత చర్యలు తీవ్రతరం చేశారు. 1924 మే 7న అస్సాం రైఫిల్స్ దళం కొయ్యూరు వద్ద సీతారామరాజును కాల్చి చంపింది. రంప తిరుగుబాటు క్రమంగా సన్నగిల్లింది. తెలుగు ప్రజల ప్రతిఘటనాగ్నికి 'రామరాజు' ప్రతీకగా నిలిచాడు.

ప్రజల తోడ్పాటు పుష్కలంగా ఉన్నా, రామరాజు తిరుగుబాటును అప్పటి సమకాలీన కాంగ్రెస్ నాయకత్వం మాత్రం హర్షించలేకపోయింది. 1924 అక్టోబర్‌లో జరిగిన కాంగ్రెస్ వార్షిక సమావేశంకానీ, కాంగ్రెస్ మహాసభలు కానీ 'రామరాజు' దేశభక్తినీ, త్యాగనిరతినీ ప్రశంసిస్తూ కనీసం ఒక తీర్మానమైనా ఆమోదించలేక పోయాయి. [1]

తెలుగునేలను కుదిపేసిన పై ఆందోళనలతో పాటు సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా జరిగిన నిరసనోద్యమంలోనూ, 1930 నాటి సహాయ నిరాకరణోద్యమంలోనూ, ఉప్పు సత్యాగ్రహం, శాసనోల్లంఘనం మొదలైన ఉద్యమాల్లోనూ ఆంధ్రులు అగ్రభాగాన నడిచారు.

---

1. History of Modern Andhra (Page; 106) —P.R. Rao.

ఒకవైపు శాంతియుత సత్యాగ్రహాలు ఆంధ్రప్రాంతాన్ని ఉర్రూత లూగిస్తుంటే, మరోవైపు కాకినాడలో ప్రతివాద భయంకరాచారి మొదలైన విప్లవకారులు బాంబు దెబ్బలతో బ్రిటీషు ప్రభుత్వాన్ని వడగొట్టే ప్రయత్నాలు చేశారు. 'కాకినాడ కుట్రకేసు', 'మద్రాసు కుట్రకేసు'ల్లో కఠిన కారాగార శిక్షలనుభవించారు.

## ఆంధ్రలో 'క్విట్ ఇండియా' ఉద్యమం

భారత స్వాతంత్ర్యోద్యమ పరాకాష్ట 'క్విట్ ఇండియా' ఉద్యమం. 1942 ఆగష్టు 8 న బొంబాయిలో సమావేశమైన 'అఖిలభారత కాంగ్రెస్ కమిటీ' 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని ఆమోదించిన విషయం ఇదివరకే తెలుసుకున్నాం' అయితే 1942 జూలై నాటికే ఆంధ్రప్రాంతంలోని కాంగ్రెస్ నాయకులు శ్రీ పట్టాభి సీతారామయ్య నాయకత్వాన 'ఆంధ్ర సర్క్యులర్'ను విడుదలచేసి ఉన్నారు.

'నిషేధాజ్ఞలను ధిక్కరించడం, న్యాయవాదులు-విద్యార్థులు తమవిధులను బహిష్కరించడం, కార్మికులు సమ్మెలు చేయడం, రైళ్లను నిలిపివేయడం, కల్లునిచ్చే ఈతచెట్లను నరకడం, టెలిఫోన్-టెలిగ్రాఫ్ తీగలను తెంపడం, సహాయనిరాకరణ కార్యక్రమాలను చేపట్టడం' మొదలైన పోరాటరూపాలను జిల్లాకాంగ్రెస్ కమిటీలకు నిర్దేశిస్తూ ఈ సర్క్యులర్ వెలువడింది.[1]

బ్రిటీష్ ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణచడానికి అనేక చర్యలు తీసుకుంది. 'ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ'ని చట్టవిరుద్ధమైన సంస్థగా ప్రకటించింది. ప్రముఖ నాయకులందర్నీ నిర్బంధించింది. దీనితో ప్రజలు కోపోద్రిక్తులైనారు. రైలుస్టేషన్లు దగ్ధం చేశారు. తెనాలి, చీరాల, పాలకొల్లు, దుగ్గిరాల, నిడుబ్రోలు, ఉప్పులూరు, ఒంగోలు మొదలైన రైల్వేస్టేషన్లను ప్రజలు తగులబెట్టారు. పాలకొల్లు, ఆకివీడు, అల్లూరు మొదలైన చోట్ల పోలీస్‌స్టేషన్లపై ప్రజలు దాడి చేశారు. ఆంధ్రప్రాంతంలోని దాదాపు 1500 ప్రదేశాల్లో టెలిఫోన్ టెలిగ్రాఫ్ తీగలను ప్రజలు ధ్వంసం చేశారు.

ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణచడానికి రెండు ప్రత్యేకమైన ఆర్డినెన్సులను జారీచేసింది. వీటిమూలంగా జిల్లామెజిస్ట్రేట్ మరణదండనకానీ, కొరడా

1. ఆంధ్రలో స్వాతంత్ర్యోద్యమం (వ్యాసం)- "ఆంధ్రప్రదేశ్‌దర్శిని" (పుట: 557) —ప్రొ. కె. వెంకటేశ్వర్లు: కె.రవి.

దెబ్బలవంటి శిక్షలుకానీ, కారాగార శిక్షలుకానీ విధించవచ్చు. మరొక ఆర్డినెన్సు ద్వారా ప్రాంతీయ అధికారులు, ఆయాప్రాంతాల్లోని ప్రజలపై 'సామూహిక జరిమానా' విధించవచ్చు.

ఈ ఆర్డినెన్సులేవీ ప్రజల స్వాతంత్ర్యేచ్ఛను, పోరాటపటిమను అణచలేకపోయాయి. 1942-47 సంవత్సరాల నడుమ భారతస్వాతంత్ర్యోద్యమం అనేక మలుపులు తిరిగింది. ప్రజలు సాహసోపేతమైన సమరోత్సాహాన్ని ప్రదర్శించారు.

## స్వాతంత్ర్యోదయం

సహాయనిరాకరణ, శాంతియుత సత్యాగ్రహాలు, గదర్‌పార్టీ సాహసం' హిందుస్తాన్ సోషలిస్ట్‌రిపబ్లిక్ పార్టీ, భారత కమ్యూనిస్టుపార్టీ, ట్రేడ్ యూనియన్లు, సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ, మన్యం తిరుగుబాటు, ఆజాద్ హింద్ ఫౌజ్, క్విట్ ఇండియా, నావికుల తిరుగుబాటు మొదలైన పోరాటాల, సంస్థల సమాహారం భారత స్వాతంత్ర్యోద్యమం. సుదీర్ఘకాలం పాటు ప్రజలు అనేక పోరాట రూపాలద్వారా ఉద్యమించడంతో 1947 ఆగష్టు 15 న స్వాతంత్ర్యోదయమయ్యింది. పరాయిపాలన అంతమయ్యింది. దేశమాత సంకెళ్ళను తెంచుకుని స్వేచ్ఛా భారతం ఆవిర్భవించింది.

# 3

# తెలుగులో 'జాతీయ, స్వాతంత్ర్యోద్యమ గీతాలు'

బ్రిటీష్ పాలకుల పరిపాలన కింద మగ్గిపోతున్న భారతీయుల్లో 20 వ శతాబ్దారంభం నుండే జాతీయచైతన్యం, దేశభక్తి, బానిసత్వనిరసనం మొదలైన భావావేశాలు మొలకెత్తసాగాయి. శతాబ్దాలుగా పరాయి పాలనకిందనలిగిపోతున్న అన్ని ప్రాంతాల్లోనూ స్వాతంత్ర్యోద్యమ జ్వాలలు నూతనచైతన్యాన్ని రగిలించ సాగాయి. దేశంలో ఏ మూల ఏ ఉద్యమం తలెత్తినా, అది క్రమంగా అన్ని ప్రాంతాలను ప్రభావితం చేసేది. అయితే అన్ని ప్రాంతాల్లోనూ జాతీయ స్ఫూర్తిని మొదట ప్రతిబింబించింది వంగదేశం. పలు సంస్కరణోద్యమాలకు, విప్లవోద్యమాలకు బెంగాల్ కేంద్ర బిందువు కాసాగింది.అక్కడి ప్రకంపనలు ఆంధ్రప్రాంతంలో కూడా కనబడటం మొదలయింది.

## తొలినాటి జాతీయోద్యమ గీతాలు

అప్పటికింకా గురజాడ 'దేశభక్తిగీతం' (1910) వెలువడలేదు. 'దేశభక్తి గీతం' జాతీయోద్యమ భావాలు, సంస్కరణాభినివేశం తెలుగుజాతిని ముంచెత్తు తున్నరోజులవి. శిష్టసాహిత్యంలో అనేక నూతన ప్రయోగాలు జరుగుతున్న కాలం కూడా అదే.

అయితే ఉద్యమసాహిత్యానికి ఒకరకమైన విశిష్టత కనిపిస్తుంది.ఉద్యమం సామాన్యప్రజల సంస్పందనతో రూపొందినప్పుడు, ఉద్యమప్రేరణతో ఉద్యమ సాహిత్యం వెలువడినప్పుడు, అది సామాన్య ప్రజోన్ముఖంగానే ప్రవహిస్తుంది. అలా సామాన్య ప్రజోన్ముఖంగా ప్రవహించే వెసులుబాటు, లేదా శక్తి 'పాట' కే ఉంటుంది. ఇతర సాహిత్య ప్రక్రియలకు ఆ ఆవేశం తక్కువ. అప్పటికీ, ఇప్పటికీ సామాన్య ప్రజల్లో సద్యః ప్రేరణ కలిగించేది గీతమే.

ఈ గీతాలకు సాహిత్య మూల్యాలతో బాటు సామాజిక, లేదా చారిత్రిక మూల్యాలుంటాయి. ఆయా కాలాలనాటి పరిస్థితుల్లో ఊపిరి పోసుకోవడం వల్ల,

వీటిని ఆ పరిస్థితులనుండి విడదీసి చూడడం సాధ్యంకాదు. ఈ దృష్టితోనే ఉద్యమగీతాల పరిశీలన జరుగుతున్నది.

19 వ శతాబ్దం చివరి దశాబ్దంలో 'పత్రికలు' ఉద్యమ సాహిత్యానికి విశేష ప్రాచుర్యాన్ని కలిగించాయి.

1872 లో బందరులో ఉమారంగనాయకులుగారు 'పురుషార్థ ప్రదాయని' అనే పత్రికను స్థాపించారు. వీరేశలింగం పంతులుగారి తొలిరచనలు ఈ పత్రిక లోనే ప్రచురితమయ్యాయి. తరువాత పంతులుగారు తమ సంస్కారణోద్యమానికి కేంద్రస్థానమైన రాజమండ్రి నుండి వరుసగా 'వివేకవర్ధని' (1874), 'హాస్య సంజీవని' (1875), 'సతీహితబోధిని' (1883), 'సత్యసంవర్ధని' (1892), 'సత్యవాదిని' (1905) అనే పత్రికల్ని వెలువరించారు. సంఘ సంస్కరణా శయాలను, జాతీయతా భావాలను ఈ పత్రికలద్వారా ప్రచారం చేశారు.

అలాగే మద్రాసునుండి 1874లో వెలువడిన గట్టుపల్లి శేషాచార్యులు గారి 'శశిరేఖ', ఎ.వి. పార్థసారధి నాయుడుగారి 'ఆంధ్రప్రకాశిక' (1884); బెజవాడ నుండి వెలువడిన దేశగుప్తం శేషాచలపతి గారి 'దేశాభిమాని (1896), వీరేశ లింగం గారి అనుయాయుడు మూజాయత్ అలీఖాన్ నర్సాపురం నుండి వెలువరించిన 'విద్వాన్ మనోహరిణి', న్యాపతి సుబ్బారావుగారి 'చింతామణి', రాయసం వెంకటశివుడుగారి 'జనానాపత్రిక' మున్నగు పత్రికలు ఆరోజుల్లో తెలుగు ప్రజల్లో సాంఘిక చైతన్యాన్ని, దేశాభిమానాన్ని జాగృతం చేయడానికి కృషి చేశాయి.

20 వ శతాబ్దారంభంలో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు నడిపిన 'మనోరమ' (1906), 'దేశమాత' (1910) వంటి పత్రికలు జాతీయ భావాలను ప్రచారం చేశాయి.

తెలుగునేలపై తొలి ఇంగ్లీషు విద్యాకేంద్రం, రాజకీయ ఉద్యమ కేంద్ర మూ అయిన బందరులో 1902 ఫిబ్రవరి 1 న 'కృష్ణాపత్రిక' ను కొండా వెంకటప్పయ్య, దాసునారాయణరావుగార్లు నెలకొల్పారు. అప్పటి కృష్ణాపత్రిక సంపాదకులు కొండా వెంకటప్పయ్యగారే. 1907 లో ముట్నూరి కృష్ణారావు గారు ఆ పత్రిక ప్రధానసంపాదకులై దాదాపు నాల్గు దశాబ్దాలపాటు సాంస్కృ తిక పునరుజ్జీవనోద్యమానికి, జాతీయోద్యమానికి దర్పణంగా 'కృష్ణాపత్రిక'ను మలిచారు.

1908 సెప్టెంబర్ 9 న దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు బొంబాయిలో 'ఆంధ్రపత్రిక' (వారపత్రిక)ను స్థాపించారు. ఆరేళ్ళ తరువాత ఆ పత్రికను మద్రాసుకు తరలించి, దినపత్రికగా మార్చారు.

1908 లో 'కేసరి', 'మరాఠీ' పత్రికల్లో తీవ్రవాద వ్యాసాలు వ్రాసిన జాతీయ నాయకులు తిలక్‌ను బ్రిటీషు ప్రభుత్వం అరెస్టు చేసింది. అదే సమయంలో ఆ అరెస్టును ఖండిస్తూ తెలుగులో 'స్వరాజ్య' పత్రిక సంపాదకులు గాడి చర్ల హరిసర్వోత్తమరావుగారు 'అరెరే ః ఫరంగీ, క్రూర వ్యాఘ్రమా ః' శీర్షికతో తమ పత్రికలో ఒక వ్యాసం (1908 జూలై 8 న) వ్రాశారు. ఫలితంగా రాజద్రోహనేరం కింద ప్రభుత్వం అరెస్టు చేసి, మూడేళ్ళ కఠిన శిక్ష విధించింది.

తెలుగు పత్రికారంగంలో రాజకీయ నేరానికి శిక్షను అనుభవించిన తొలి సంపాదకుడు హరిసర్వోత్తమరావుగారే.

ఇక తొలినాటి జాతీయోద్యమ వ్యాప్తికి పత్రికలు చేసిన కృషిని పరిశీలిద్దాం.

1897-98 మధ్యకాలంలో 'సరస్వతి' పత్రికలో భారతదేశపు స్థితి గతుల్ని వర్ణిస్తూ అనేక ఖండికలు వెలువడ్డాయి.

అదే సంవత్సరం (1897) మే మాసంలో 'చింతామణి' పత్రికలో దేశాభిమాని లక్షణాలను వివరిస్తూ పి. రామశాస్త్రిగారు 'విశాఖపట్టణ మండల సభ' పద్యాలు రాశారు. తరువాతి సంచికల్లో 'సంఘశక్తికి సరియైన శక్తి గలదే' అని ప్రశ్నించారాయన.

1897 లో జరిగిన విశాఖపట్టణమండల సభలో దేశభక్తి ప్రబోధితాలైన పద్యాలను ఈశ్వర జగన్నాథ మార్తాండ శాస్త్రిగారు వినిపించారు.

1905 అక్టోబర్‌నాటి 'కృష్ణాపత్రిక' లో గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారి 'స్వదేశాభిమానము' వ్యాసం అచ్చయ్యింది. అదే సంవత్సరం డిసెంబర్ సంచికలో కొండావెంకటప్పయ్యగారి సంపాదకీయం 'బెంగాల్ విభజన' ఆ సమస్యపై ఆంధ్రుల స్పందనకు సంకేతమయ్యింది, ఆ సంచికలోనే చన్నా ప్రగడ భానుమూర్తిగారు 'దేశాభిమానమే దేశాభివృద్ధికిని, దేశజనుల సౌఖ్య క్షేమమునకును ముఖ్యసాధనము' అని చాటి చెప్పారు.

బెంగాల్ విభజన తరువాత జాతిజనుల సమరనాదంగా మారిన బంకిం చంద్రుని 'వందేమాతరం' ప్రేరణతో ఒక అజ్ఞాతకవి 1905 డిసెంబర్ 15 నాటి 'కృష్ణాపత్రిక'లో 'దిక్రైఆఫ్ మదర్ ఇండియా' శీర్షికన ఒక గొప్ప ప్రబోధగీతాన్ని వెలయించారు.

'హిందువులారా! ఎన్నాళ్లీ గతి
మంద మతులరై మాటికి జెడెదరా
నందనులగు మీరందరు స్రుక్కగ
యెందుకు నా బ్రతుకితరుల కోసమ
నావంటను గల సారంబంతయు
నావంతయు లేకే పలికేగెను
చేవ చెడిన నేనేవిధి బ్రతుకుదు
జీవించిన సార్థక్యం బేమిక
దూడనోరుగొట్టి దోహింబు గొల్లలు
పాడి సమస్తము పరులకమ్మగతి
కూడులేని నాకొడుకుల గాదని
యేదకో నాధనమెల్లను బోయెడి
చీము నెత్తురు చిక్కెనా లేదో
ఏమెయి బ్రతుకుదు నీదుర్దశతో
ప్రేమజూపరే-ప్రేమజూపరే
రామ రామ! నాలావు చెడియెనిక
ఇకనైనను మీరెల్లరు సోదరులై
ప్రకటింపుడు నాపై ప్రేమమ్మును
అకటా! ఎన్నాళ్ళిక జీవింపుడు
సకలేశుడు మీకిక తోడ్పడుగాక!'

అంటూ సాగుతుంది గీతం.

అనేక రకాలుగా ప్రత్యేకతలు సంతరించుకున్న గీతమిది. తెలియ వస్తున్నంత వరకు స్వాతంత్ర్యోద్యమ గీతాల్లో బహుశా తొలి తెలుగు గీతమిది. 'బహుశా' అనేది జాగ్రత్తకోసం అంటున్న మాట.

డా॥సి. నారాయణరెడ్డిగారు తమ సిద్ధాంతగ్రంథంలో చిలకమర్తివారి 'భరతఖండంబు' అనే పద్యాన్ని జాతీయోద్యమ సంబంధమైన తొలిరచనగా భావించారు.1

కానీ ఆ పద్యం 1907 ఏప్రిల్ మాసంలో బిపిన్‌చంద్రపాల్‌గారి రాజమండ్రి పర్యటనల సందర్భంగా, పాల్ ఆంగ్లోపన్యాసాలను అనువదిస్తున్న చిలకమర్తివారు ఆశువుగా వినిపించింది.2

'దిక్రై ఆఫ్ మదర్ ఇండియా' గీతం 1905 లో వెలువడింది. 'భరత ఖండంబు' తేటగీతి పద్యానికి దాదాపు రెండేళ్ళు ముందన్నమాట. కాబట్టి జాతీయోద్యమ సంబంధమైన సాహిత్యంలో దీనినే తొలి గీతంగా భావించవచ్చు. అంతేగాక ఒకరకంగా చిలకమర్తివారి పద్యానికి ప్రేరణలు కూడా దీనిలో లభిస్తున్నాయి.

'దూడ నోరుగొట్టి ద్రోహంబు గొల్లలు
పాడి సమస్తము పరులకమ్ము గతి'

అనేవి పైగీతంలోని పంక్తులు.

---

1. 'చిలకమర్తివారి భరతఖండంబు అన్నపద్యము తెలుగులో భారత జాతీయోద్యమ సంబంధమైన తొలిరచనయని చెప్పవచ్చును - 'ఆధునికాంధ్ర కవిత్వము: ప్రయోగాలు, సాంప్రదాయాలు' -డా॥సి.నారాయణ రెడ్డి. (పుట: 378)

2. బిపిన్ చంద్రపాలుగారి యుపన్యాసములకు (1907) ఇంగ్లీషు రాని జనులు వేలకు వేలు వచ్చుటచే పాలుగారి యుపన్యాసపారమును తెలుగులో జెప్పుడని సభాసదులు నన్ను గోరిరి. సభలు జనులతో క్రిక్కిరిసి యుండెను. కట్టకడపటి దినమున సభలో కూర్చుండి నామనసులో యూహించుకొని యీక్రింది పద్యమును బహిరంగముగా కట్టకడపట జదివితిని. 'భరత ఖండంబు' ...ఈ పద్యమును విని సభాసదులు సంతోషపారవశ్యమున బ్రహ్మాండము పగులునట్లు చప్పట్లు గొట్టిరి - చిలకమర్తివారి 'స్వీయచరిత్రము'
(పేజీలు 224, 225, 226,)

'భరత ఖండంబు చక్కని పాడియావు' పద్యంలో వర్ణింపబడిన 'పాడి యావు' 'లేగదూడలు' 'మూతులు బిగియగట్టి' వంటి ప్రయోగాల పోలికలు పైగీతంలో కనిపిస్తాయి.

చిలకమర్తి పైగీతాన్ని చదివి ఈ పోలికలు తీసుకున్నాడా? తనే స్వయంగా రచించాడా? అనేది కాదు ప్రశ్న. ఒకవేళ అమిత ప్రాచుర్యం పొందని 'క్రై' గీతం నుండి ఉత్తేజం పొందినా, మునిగి పోయిందేమీలేదు. స్వాతంత్ర్యాకాంక్ష పొంగి పొరలే కాలంలో ఇవి పునరుత్తేజాలవుతాయేకానీ, పునరుక్తులు కావు.

చిలకమర్తివారి పద్యానికి విశేష ప్రాచుర్యం లభించింది. సమకాలంలో, అనంతరకాలంలో తెలుగు నాలుకలపై ఇళ్ళు కట్టుకుంది.

మందమతులుగా ఉన్న భారతీయుల్ని మేల్కొనమని, తనపై ప్రేమ జూపుమని దేశమాత గావించిన ఆక్రందన 'ది క్రై ఆఫ్ మదర్ఇండియా' గీతం. పత్రికలో ఆనాడు రచయిత. తన పేరు ప్రకటించనందువల్ల తొలి జాతీయోద్యమ సంబంధమైన గీతం రాసిన కవి అజ్ఞాతంగా మిగిలిపోవడం మన దురదృష్టం.

బిపిన్‌చంద్రపాల్ ఆంధ్ర పర్యటన ఇక్కడి రాజకీయజీవితంమీద, సాహిత్యరంగంమీద చెరగని ముద్రలు వేసింది. పాల్ ప్రసంగాలు విన్నందుకు, సమావేశాలకు హాజరయినందుకు 138 మంది రాజమండ్రి ట్రైనింగ్ కాలేజీ విద్యార్థుల్ని కళాశాల యాజమాన్యం బర్తరఫ్ చేసింది. 1907 మే ఒకటిన కాకినాడలో 50 మంది దేశభక్తుల్ని ప్రభుత్వం అరెస్ట్ చేసింది.

1907 లోనే చన్నాప్రగడ భానుమూర్తి పంతులుగారి 'భారత ధర్మ దర్శనము' (ఖండకావ్యం) వెలువడింది.

దేశవ్యాప్తంగా జాతీయ నాయకుల పర్యటనలు, ప్రసంగాలు ప్రజల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేయసాగాయి. ప్రభుత్వం గుండెల్లో భయాందోళనల రైళ్ళు పరుగెత్తాయి. ఫలితంగా 1907 లో ఆంగ్ల ప్రభుత్వం ఒక అత్యవసర చట్టాన్ని ప్రవేశపెట్టింది. సభలు, సమావేశాలపై ఆంక్షలు విధించే అధికారాన్ని ధారాదత్తం చేసుకుంది.

1907 మే నెలలో పంజాబ్ కేసరి 'లాలాలజపతిరాయ్'ని అరెస్టుచేసి దేశానికి దూరంగా బర్మాలో నిర్బంధించింది. దీనికి నిరసనగా దేశవ్యాప్త

ఉద్యమం చెలరేగింది. ఆంధ్ర ప్రాంతంలోని అన్ని ప్రధాన నగరాల్లో విద్యార్థులు సమ్మెలు చేశారు. అరెస్టయ్యారు. చెరసాలలకు వెరవని విద్యార్థుల చైతన్యంతో ఉత్తేజితులైన చిలకమర్తి-

'చెరసాలల్ పృథు చంద్రశాలలె యగున్, చేదోయి గిలించు, న
య్యెర దండల్ విరి దండలయ్యెడున్........'

అనే పద్యంతోపాటు........

'భారత ఖండంబె ఒక పెద్ద బందిఖాన

అనే పద్యాన్ని రచించారు. ఈ పద్యాలు ప్రజల్లో విశేష ప్రచారాన్ని పొందాయి.

1908 లో అత్తిలి సూర్యనారాయణగారి 'హిందూదేశ దారిద్ర్యం', ముట్నూరి వెంకట సుబ్బారాయుడు, మరియు మంగిపూడి వెంకటశర్మగారి 'మాతృ శతకము' వెలువడ్డాయి.[1]

1908 లోనే 'దేశీయ కీర్తనలు' అనే పుస్తకం వెలువడింది.[2] స్వదేశ భక్తి మొదలైన సుగుణాలను బోధించిన పుస్తకమిది. ప్రకాశకుల మాటలు పేర్కొనదగినవి.

'ఈ జాతీయ కీర్తనల ప్రచురమునందు పూర్వ ప్రచురమందలి కీర్తనలు తగు రీతిని మార్చబడుటయే గాక యున్నతమైన స్వదేశ భక్త్యాది సుగుణముల బోధించు మనోహరములైన క్రొత్త కీర్తనలు చాలా వరకు చేర్చబడి గ్రంథము పెంపు చేయబడినది. కడు చిన్నదైన పూర్వ ప్రచురమింక వేఱుగా ప్రచురింపబడ నేరదు.'

— పబ్లిషర్

---

1. **The Freedom struggle in Andhra Pradesh vol. II, Page : 49.**
   **Ed : Mamidipudi Venkata Rangaiah**
2. ముఖచిత్రంపై రచయిత పేరులేదు, కానీ **'Published by T. V. Subba Rao, at Vidyanilaya Press, Rajahmundry-1908'** అని ఉంది.

దీనిని బట్టి వివిధ రచయితలు రాసిన గీతాలసంపుటి ఇదనీ, 1908 కి ముందే ఒక ప్రచురణగా వెలువడిందనీ తెలుస్తుంది.

బంకించంద్రుని 'వందేమాతరమ్' గీతంతో ప్రారంభమయ్యే ఈ సంపుటిలో 20 దేశభక్తికీర్తనలున్నాయి.

ఆ తరువాతి సంవత్సరం (1909) (శా.శ. 1831 మాఘ) సంచిక 'ఆంధ్రభారతి'లో 'మేలుకొలుపు' శీర్షికతో ఒక ప్రబోధగీతం ప్రచురితమయింది.

'మేలుకొనుమీ భరతపుత్రుడ
మేలుకొనుమీ సుజనమిత్రుడ
మేలుకొనుమీ సచ్చరిత్రుడ
మేలుకొనవయ్యాః వత్సాః మేలుకో॥మేలుకో'[1]

అనే పల్లవితో ప్రారంభమయ్యే ఈ గీతంలో 'వేడుకను జాతీయతాయను వేగుచుక్క పొడిచిందనీ, కూడి వందేమాతరంబని కుక్కుటములరచెన్' అని ప్రబోధించారు. అలాగే దేశవ్యాప్తంగా అంతః కలహములనే చీకట్లు అంతరించి విజ్ఞానారుణోదయంతో నవశక్తి యొక్క కాంతిపుంజములు తేజరిల్లడాన్ని, వీస్తున్న నూతనోద్యమ మారుతాన్ని ఈ అజ్ఞాతకవి ప్రదర్శితం చేశారు. 'అందరూ ముందడుగు వేస్తుంటే పందవలె నిద్రపోవడం పాడికాదు' అనే హెచ్చరికతో బాటు 'ధీరవరుడవు నీ స్వశక్తిని తెలుసుకొనుమయ్యా' అంటూ కొండంత ఆత్మ విశ్వాసాన్ని భారతీయుల గుండెల్లో ప్రతిధ్వనింప జేసిందీ గీతం.

జాతీయోద్యమ కాలంలో ప్రతిదేశభక్తుని నాలుకపై నాట్యం చేసిన ఈ గీతానికి అనేక అనుకరణగీతాలు అనంతర కాలంలో వెలువడ్డాయి.

1921 నాటికి మంగిపూడి పైగీతం ప్రేరణతో....

---

1. ఈ పాట ప్రేరణతో 1921 నాటికి మంగిపూడి వేంటశర్మగారు 'మేలుకో సుచరిత్ర మేలుకో భరతపుత్ర' గీతంరాశారు. ఇది మంగిపూడి వారి 'జాతీయగీతములు' సంపుటి (1921)లో ఉంది. 1909 నాటి 'మేలుకొలుపు' గీతంరాసిన రచయిత పేరు లభ్యంకాలేదు. గురజాడ రాఘవ శర్మగారు సంకలనంచేసిన 'జాతీయగీతాలు'లో ఈ గీతంరాసిన రచయితగా మంగిపూడిని పేర్కొనడం జరిగింది.

'మేలుకో సుచరిత్ర మేలుకో భరతపుత్ర
మేలుకో చిరమిత్ర మేలుకో॥
కాలాయముగ మన పాలన వేళాయె
చాలుచాలు నిదుర మెలుకో॥'

అనే గీతం రాశారు. జనచైతన్యాన్ని పదునుబెట్టిన ఈ గీతానికి పై గీతంతో ఉన్న పోలికలవల్ల, 'ఆంధ్రభారతి'లో అజ్ఞాత కర్తృకంగా వెలువడిన 'మేలుకొలుపు' గీతాన్ని కూడా మంగిపూడివారురాసినట్లు గురజాడ రాఘవశర్మ గారు ప్రచురించారు. ఇది వాస్తవంకాకపోవచ్చు. మంగిపూడివారి సంకలనంగా వెలువడిన 'జాతీయగీతములు'1 సంపుటిలోనూ, ఆ కాలంనాటి 'స్వరాజ్య భజనకీర్తనలు' సంపుటిలోనూ 'మేలుకో సుచరిత్ర - మేలుకో భరతపుత్ర' అనే గీతమే ఉంది. కాబట్టి ఈ రెండవ గీతమే మంగిపూడి వారి రచనగా నిర్ధారించవ పీలున్నది. దీనికి మాతృకగా వెలువడిన మొదటి గీతం (1909) అజ్ఞాత కర్తృకంగానే మిగిలింది.

భారత రాజకీయరంగంపై గాంధీజీ ప్రత్యక్షం కావడానికి ఒక దశబ్దానికి ముందే (1909 నాటికే) 'ఆంధ్రభారతి' పత్రికలో 'మాలవాండ్రపాట' అచ్చయ్యింది. ఆకాలంలోనే సాహిత్యంలో అస్పృశ్యతపై నిరసన కనిపించడం విశేషం.

'అందారు పుట్టిరి హిందమ్మతల్లికి
అందారు ఒక్కటై ఉండాలి సక్కంగ
వర్ణాల యెక్కువ పుట్టంగ లేదయ్య
మమ్మేల క్రిందికి క్రుమ్మేరు మానోరు

ఎట్టాగు యెక్కువ బ్యామ్మర్లు మాకంటె
ఎట్టాగు యెక్కువ యేరైన మాకంటె

తమ్ముళ్లమని మీరు మమ్ముల జూడండి
అమ్మోరు దీవించి అయిశ్వర్యమిచ్చాను'

---

1. 'జాతీయగీతములు' -బ్రహ్మశ్రీ మంగిపూడి వేంకటశర్మ, రామా ముద్రాక్షరశాల, ఏలూరు, 1921.

అంటూ శుద్ధ బడుగుజీవుల భాషలో వెలువడిన ఈ గీతం, సామాజిక అసమానతలను ప్రశ్నించిన వేదనా రేఖ.

1910 లో గురజాడ అప్పారావుగారి 'దేశభక్తిగీతం' వెలువడింది.[7]

అనేకానేక జీవితానుభవాలను గడించిన గురజాడ అప్పారావుగారు, తమ 58 వ యేట నూతన జీవితదృక్పథంతో రాసిన గీతమిది. దేశభక్తికి కొత్త నిర్వచనాన్నిచ్చి, అంతర్జాతీయ దృష్టిని ఆంధ్రులకు అందించిన అపూర్వ అభ్యుదయగీతమిది.

'దేశమును ప్రేమించుమన్నా
మంచి యన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్:

* * *

స్వంతలాభం కొంత మానుకు
పొరుగువాడికి తోడు పడవోయి
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి:'

అంటూ 56 గేయపాదాల్లో సాగిన ఈ మహారచన భారతీయ సాహిత్యం లోనే అద్వితీయమని విమర్శకులు భావించారు. అర్థభావాల దృష్ట్యా, జాతీయ-అంతర్జాతీయ చేతనా వైశాల్యం దృష్ట్యా ఈగీతం బంకించంద్రుని 'వందే మాతరమ్', రవీంద్రుని 'జనగణమన', ఇక్బాల్ 'సారేజహాఁసే అచ్ఛా' వంటి గీతాలను కూడా మించిందని విమర్శకులు అభిప్రాయ పడ్డారు.

దేశ సరిహద్దుల్ని మాత్రమే కీర్తించే పూర్వకవుల సాహిత్యదృష్టికి భిన్నంగా దేశీయుల అమూల్యమైన మానవీయజీవితం, దాన్ని మెరుగుపరిచే ఉత్తమాదర్శాల చైతన్యం నిజమైన 'దేశభక్తి' గా నిర్వచించి, నిరూపించారు గురజాడ.

---

7. గురజాడ నవ్య భావాలను వెల్లడించే రచనలు అనేకం 1910 లోనే వెలువడ్డాయి. ముత్యాలసరాలు (నూతన ఛందస్సు), దిద్దుబాటు, మీపేరేమిటి ? వంటి కథలు అచ్చయిన సంవత్సరమిదే. దేశభక్తి గీతంతోబాటు మహాకవి శ్రీశ్రీ పుట్టిన సంవత్సరం కూడా ఇదే.

భావంలోనూ, భాషలోనూ, రూపంలోనూ, వస్తువులోనూ, ఛందంలోనూ, గేయ సౌందర్యంలోనూ నూతనత్వానికి ఒరవడి దిద్దింది గీతం.

జాతీయోద్యమ సాహిత్య వికాసం, భావకవితా విజృంభణంలో దాదాపు పాతికేళ్ళపాటు అజ్ఞాతంగా ఉన్న గురజాడ గీతం,అభ్యుదయ కవితావిర్భావంతో పునర్జన్మ నెత్తింది. వామపక్ష ప్రజాసంఘాల ఉద్యమాలకు ప్రార్థనాగీత మయ్యింది.

గురజాడ దేశభక్తిగీతం వెలువడిన తర్వాత నాలుగేళ్ళకు (1914) జాతీయ భావాలతో, దేశాభిమానస్ఫూర్తిని కలిగించిన 'జన్మభూమి' గీతాన్ని రాయప్రోలు సుబ్బారావు రచించారు.

'ఏదేశమేగినా ఎందు కాలిడిన
ఏపీఠమెక్కినా ఎవ్వరెదురైన
పొగడరా నీతల్లి భూమి భారతిని
నిలుపరా నీజాతి నిండుగౌరవము'

అంటూ ప్రారంభమయ్యే ఈ గీతం 'జన్మభూమి'పై అమితమైన ప్రేమాభిమానాలను ప్రదర్శించే స్ఫూర్తిని తెలుగుప్రజలకు కలిగించింది.

ఇలా ప్రారంభమైన జాతీయ, స్వాతంత్ర్యోద్యమ సాహిత్యం పద్యాలుగా, ఖండకావ్యాలుగా, గీతాలుగా, బుర్రకథలుగా, నవలలుగా, వచనరచనలుగా శాఖోపశాఖలుగా విస్తరించింది.

జాతీయోద్యమాన్ని ప్రభావితం చేసిన గీతాలు కొన్నైతే, జాతీయోద్యమంతో ప్రభావితమై వెలువడిన గీతాలు మరికొన్ని. ఈగీతాలు రాసిన కవులు ఉద్యమానికిదూరంగా కాల్పనిక జగత్తులో కూచుని కావ్యాలు రాసినవారు కాదు. జాతీయనాయకుల పిలుపులందుకొని ఎన్నో త్యాగాలు చేసినవారు. కఠోరమైన నిర్బంధాలను ఎదుర్కొన్నవారు.

ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్యాలకు భంగంకలిగితే రచయితలు సహించలేరని హిందీ ప్రాంతంలో ప్రేంచంద్; వంగభూమిలో టాగోర్, శరత్‌చంద్ర, నజ్రుల్ ఇస్లాం; తమిళంలో సుబ్రహ్మణ్య భారతి,మళయాళంలో శంకరకురూప్; సంస్కృతంలో గణపతిముని; తెలుగులో చిలకమర్తి, గరిమెళ్ళ, ఉన్నవ, మంగిపూడి మొదలైన అనేకమంది నిరూపించారు. కవులు, రచయితలు కేవలం రచనావ్యాసంగానికే పరిమితం కాకుండా క్రియాశీలంగా ఉద్యమాల్లో పాల్గొన్నారు.

ఉత్తర భారతంలో గాంధీజీ ఉపన్యాసాలతో ప్రభావితులైన మున్షీ ప్రేంచంద్ ఉద్యోగానికి రాజీనామాచేసి, జాతీయోద్యమానికి అంకితమయ్యారు. బెంగాల్‌లో నజ్రుల్‌ఇస్లాం ఉత్తేజకరమైన గీతాలురాయడమే కాక, కఠిన కారాగార శిక్షల్ని భరించారు. జైల్లోనూ హక్కుల సాధనకోసం సుదీర్ఘమైన నిరాహారదీక్షచేసి చరిత్ర సృష్టించారు. పంజాబ్ దురంతాలతో వ్యథ చెందిన విశ్వకవి రవీంద్రుడు బ్రిటిష్ ప్రభుత్వం ప్రసాదించిన 'సర్' బిరుదును తృణప్రాయంగా విసిరికొట్టారు.

అలాగే తెలుగునేలపై గరిమెళ్ళ సత్యనారాయణ జాతీయోద్యమస్ఫూర్తితో యల్.టి. ట్రయినింగ్‌కో నమస్కారం పెట్టి ఉద్యమంలోకి దూకారు. కాటూరి వెంకటేశ్వరరావు, బి.ఏ. పరీక్ష మరి కొద్దిరోజుల్లో ఉందనగా చదువుకు స్వస్తి చెప్పారు. అడవి బాపిరాజు, రాజశేఖర శతావధాని జైలు శిక్షలు అనుభవించారు. చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు మొదలైన వారనేకులు బ్రిటీషు పాలకులేకాదు, బ్రిటీష్ ప్రచురణ సంస్థలు ఎరజూపిన బహుమతులను తిరస్కరించారు.

జాతీయోద్యమంతో ప్రభావితులైన తెలుగురచయితలు ఉద్యమ గీతాలతో బాటు వివిధసాహిత్య రూపాలద్వారా ప్రజలను చైతన్యపరిచారు. ఉన్నవ లక్ష్మీనారాయణ 'నవల' ను, ముట్నూరి కృష్ణారావు 'వ్యాసాన్ని', దామరాజు పుండరీకాక్షుడు గీ'నాటకాన్ని', గరిమెళ్ళ, మంగిపూడి మొదలైన కవులు 'గీతాన్ని'; కాశీనాథుని నాగేశ్వరరావు, సురవరం ప్రతాపరెడ్డిగార్లు 'పత్రిక' లను తమ సాధనాలుగా చేసుకుని, జాతీయోద్యమానికి జవాన్నీ, జీవాన్నీ సమకూర్చారు.

ఈ రచయితల్లో కొందరు విద్యాధికులు; మరిందరు కేవలం ప్రాథమిక విద్యావంతులు; ఇంకొందరు విశేష విద్యాయోగ్యతలు, సాహిత్యదక్షత లేక పోయినా పరాయిపాలకుల అన్యాయాలను, అక్రమాలను చూసి ఆగ్రహంతో కవిత్వాన్ని అల్లిన స్రష్టలు. వీరందరూ ప్రజల్లోఉన్న వేర్వేరు పొరల్ని తట్టి లేపి, ఆయా స్థాయీ భేదాలతో ఉన్న జనసమూహాల్లో చైతన్యం కలిగించారు. నిరాడంబరత, సారళ్యం, సూటిదనం కలిగిన గీతాలు ప్రజల మనోభావాల ప్రతిధ్వనులై సామాన్య జనబాహుళ్యంలోకి చొచ్చుకుపోయాయి.

జాతీయ, స్వాతంత్ర్యోద్యమ గీతాలను విషయాన్ని బట్టి అనేక అంశాలుగా వర్గీకరింపవచ్చు. దారం ఒకటే అయినా పూల గుణాకృతులను

బట్టి గుర్తించక తప్పదు. అన్ని గీతాల్లోనూ ప్రధానధ్వని దేశమే అయినప్పటికీ, వస్తువును బట్టి చేసుకునే విభజన సౌలభ్యానికి మూల హేతువు. ఆయా శీర్షికల కింద పరిశీలన కాలక్రమపద్ధతిలో జరుగుతుంది. వివిధాంశాల విభజన ఈవిధంగా ఉంది. (1) దేశమాతస్తుతి,(2) మేలుకొలుపు గీతాలు, (3) ఆంధ్రమాతస్తుతి, (4) నాయకస్తుతి, (5) నాయకస్మృతి, (6) పంజాబ్ దురంతాలు, (7) జాతీయ జండాగీతాలు, (8) సహాయనిరాకరణోద్యమ గీతాలు, (9) నిర్మాణ కార్యక్రమాలపై గీతాలు, (10) స్వాతంత్ర్య సమరగీతాలు.

ఇప్పుడు వీటిని గురించి వివరంగా పరిశీలించుదాం.

## దేశమాతస్తుతి

మనకు దేశం తల్లి. కొన్ని పాశ్చాత్యా దేశాల్లోలాగా తండ్రికాదు. 'మాతృదేవోభవ' అనేది మనకు మొదటి పంక్తి. కాబట్టి దేశాన్ని మాతగా భావించి ఆరాధించడం జాతీయోద్యమ గీతాల్లో కనబడుతున్న విశిష్టలక్షణం. ఇలా భావించే తత్వాన్ని 'మానుషధర్మారోపణం' అంటారు. దీనికే ఇంగ్లీషులో 'ఆంథ్రోపోమార్ఫిజం' **'Anthropomorphism'** అని పేరు. ఆంథ్రోపస్ **Anthropos** అంటే మనిషి. **morphe**అంటే ఆకృతి, లేదా బింబం. **Anthropo morphism** అంటే మానుషధర్మాన్ని ప్రకృతిశక్తులకు ఆపాదించడం. వాటిని దేవతలుగా, శక్తి స్వరూపులుగా, మాతృమూర్తులుగా, రక్షకులుగా భావించడం.

ఈ 'మానుష ధర్మారోపణం' ఆదిమగణాల 'గణచిహ్నవాదం' **(Totemism)**[1] నుండీ, 'సర్వజీవచేతనవాదం' **(Animism)**[2] నుండీ, నిర్జీవాల్లో జీవత్వారోపన చేసే 'అధిభౌతికవాదం' **(Metaphysics)** నుండీ ఉద్భవించిందని శాస్త్రజ్ఞుల అభిప్రాయం.[3]

---

1. ఆదిమ కాలంలో మానవుల తెగలకు ఆయాచెట్లు కానీ, జంతువులు కానీ దేవతలుగా, రక్షకులుగా ఉంటూ కాపాడుతుంటాయన్న నమ్మకం 'గణచిహ్నవాదం '**(Totemism)**
2. 'ఆత్మ' మానవులపైన, జంతువులపైన, ప్రకృతిపైన, సర్వభౌతిక ప్రపంచంపైన, ప్రభావాన్ని చూపుతుందన్న విశ్వాసం 'సర్వజీవచేతనవాదం' **(Animism)**
3. 'రేఖాచిత్రాలు' సాహిత్యవ్యాసాలు (1987) పుట : 16 ఆం. ప్ర. అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ.

దీనిని 'ఆదిమవాస్తవికత' (Primitive Realism) అంటారు. ఆదిమ మానవుడు సృష్టిలోని అద్భుతాలను చూసి విస్మయం చెందాడు. ప్రకృతి శక్తులకు మానవత్వారోపణ చేసి ఆరాధించాడు. శైశవావస్థలోని తన ఆలోచనల ద్వారా వాటికి దైవత్వారోపణ చేశాడు. నదిని నదీమతల్లిగా, నేలను నేలతల్లిగా భావించాడు. ఇది కొంత కాలానికి సంప్రదాయంగానూ, ఆ తరువాత ఆచారంగానూ మారింది. ఇది మనిషి భావుకతకు చిహ్నం. ఆదిమ మానవుని ఆలోచన నుండి ఉత్పన్నమైనప్పటికీ, అధునాతన మానవుని మస్తిష్కంలోనూ సౌందర్యాత్మకతను నింపుతున్న ఉదాత్తమైన ఊహాచిత్రమిది. దీని కొనసాగింపే దేశాన్ని 'దేశమాత'గా, రాష్ట్రాన్ని 'రాష్ట్రమాత'గా కీర్తించి, ఆరాధించడం.

1921 కి ముందే బాలకవి వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది కాశీవిశ్వనాథ శాస్త్రి. ..

'దండాలు దండాలు భారతమాత
ఆవి అందుకొని దీవించు భారతమాత'

అంటూ 'భరతమాతగీతము'ను గానం చేశారు. 1 ఈ గీతం, మరి కొన్ని గీతాలు, ఛందోబద్ధ పద్యాలు కొన్ని కలిపి 1921 లో ఈ జంటకవులు 'స్వరాజ్యగీతామృతము' అనే పుస్తకాన్ని అచ్చువేశారు. 38 పేజీలున్న ఈ పుస్తకంలో 'దండాలు దండాలు భారతమాత' పాట ఒక్కటే 18 పేజీల నాక్రమించింది. ఈ పాటలో మొత్తం 326 పాదాలున్నాయి. అ పాట ఆనాడు పట్టణాలను దాటి పల్లె పల్లెకూ విస్తరించింది. విశేష ప్రజాదరణ పొందింది. అది సహించలేని బ్రిటిషు ప్రభుత్వంవారు ఆ పాటనూ, ఆ పుస్తకాన్నీ నిషేధించారు. ఈ గీతాన్ని రాసినందుగ్గాను కవులిద్దర్ని ప్రభుత్వం క్షమాపణ కోరింది. క్షమాపణ చెప్పడానికి నిరాకరించినందుకు 124 ఏ; ఐ. పి. సి. చట్టం కింద 9 నెలల కఠిన కారాగారశిక్ష విధించింది. 500 రూపాయల జరిమానాకూడా వేసింది. అది కట్టనందుకు మరో మూడు నెలల జైలు. మొత్తం కలిపి ఒక సంవత్సరం పాటు రాజమండ్రి జైల్లో పెట్టింది. ఈ కఠిన కారాగార

1 'స్వరాజ్య గీతామృతము' — శతావధాని పురాణం సూర్యనారాయణ తీర్థుల వారి శిష్యులును, విశాఖ పట్టణ వాస్తవ్యులునగు బాలకవి వడ్డాది సీతారామాంజనేయులు, పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రి గార్లచే రచింపబడి ప్రకటింపబడియె (1921).

వాసాన్ని బాలకవి వడ్డాది మాత్రం ధైర్యంగా భరించాడు. జైలు వాతావరణా నికి తట్టుకోలేని పూడిపెద్ది కాశీవిశ్వనాథశాస్త్రి ప్రభుత్వానికి క్షమావణ రాసిచ్చి, జైలు నుండి విడుదలై రాజకీయాలకు దూరంగా వెళ్ళిపోయాడు. 1

'దండాలు దండాలు - భారతమాత
అవి అందుకొని దీవించు - ,,
గాంధీమహాత్ముండు - ,,
నీ ముద్దు కొడుకుండగా - ,,
మాకేమియును భయములేదు - ,,
మాకేమియును కొదువ లేదు - ,, '2

అంటూ సాగే ఈ గీతంలో మాతృభూమిని రతనాలతల్లిగా, పైరు పంటల నిక్షేపంగా, కామధేనువుగా, కల్పవృక్షంగా కీర్తించడంతో బాటు మూడువందల యేళ్ల క్రిందట వ్యాపార నిమిత్తం దిగిన కుంపినీ వాడు దేశాన్ని దోచుకు వెళ్తున్న వైనాన్ని నిశితంగా విమర్శించడం జరిగింది. పండినా, ఎండినా పరాయి పాలకులకు శిస్తు కట్టక తప్పని దేశీయులదైన్యాన్ని వర్ణిస్తూ —

'కట్టబట్ట తినగతిండి - భారతమాత
ఒక్క పూటకైన లేదమ్మ - ,,
చాకిరైన చేయంగా - ,,
మాకు శక్తికూడ లేదమ్మా - ,,'

అంటున్న ఈ కవి కుమారులు -

---

1. ఇంత చరిత్ర సృష్టించిన ఈ పుస్తకం ప్రతి ఈనాటికీ 'సారస్వత నికేతనము' వేటపాలెంలో భద్రంగా ఉంది. అయితే 1972 లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వశాఖ వెలువరించిన 'దేశంపిలుపు' సంకలనంలో ఈ గీతం చోటు చేసుకుంది. సంకలనకర్తలు ఈ గీతం కర్త లెవరో తెలియదని పేర్కొన్నారు.

2. ఈ గీత కర్తృత్వంపై "ఆంధ్రభూమి" దిన పత్రిక 15-8-1987, 5 - 9 - 1997 అక్షరభూమిలో ప్రయోజనకరమైన వాద - వివాదం జరిగింది.

'ప్రాణం పోయేటప్పుడైన - భారతమాత
మమ్మ సత్యం తప్పనీయకమ్మ - ,,
మేమెవరిని హింసించకుండ - ,,
మాకు ధైర్యమిచ్చి రక్షించు - ,,'

అని విజ్ఞప్తి చేశారు.

'నీ మానమును నిల్పంగ - భారతమాత
మా ప్రాణమైన ఒగ్గుతామె - ,,
మా పెద్దన్నల నిద్రనుండి - ,,
యిప్పుడైన లేవగొట్టు - ,,
స్వరాజ్య మారునెలలలోనె - ,,
నడుముకట్టి తెచ్చు శక్తి - ,,
యిచ్చి మమ్మ రక్షించు - ,,
నీ కన్న గంపెడు బిడ్డలుండ - ,,
నీకు విజయము నిశ్చయమమ్మా - ,,

అనే ఆత్మ విశ్వాసాన్ని ప్రకటించారు. దేశమాతను స్తుతించిన ఈగీతం బహుళ ప్రజాదరణ పొందింది. దీనికి ముఖ్య కారణాల్లో ఇందలి ఆవేశం ఒకటైతే, ఇందలి భాష మరొకటి. గ్రంథ కర్తలు పుస్తకానికి (1921) వ్రాసిన తొలిపలుకుల్లో ఇలా వివరించారు - 'సోదరులారా! మాటలకిది కాలము కాదు. చేతలను చూపవలసినదియే. దేశ సౌభాగ్యము కష్టజీవులపై నాధారపడి యున్నది. మహాత్ముని యాశయమును నిదియే. మన దేశమున జనసామాన్యము నిరక్షరాస్యులు. దేశ దాస్యము వారికి సుబోధముగావలెనన్న నిర్భాగ్యమైన గ్రామ్యభాషయే నేడు శరణ్యము. 1 మన సోదర కష్టజీవులు, వినికిడి మాత్రముననే సులభముగా గ్రహించి సర్వకాల సర్వావస్థల యందును మాతృనామ సంస్మరణమున పుణ్యార్జనము చేసి ధన్యులగుటకు 'భారతమాత గీతము'ను మేముద్దేశించితిమి. ఇది కావ్యము గాదు - ప్రబంధమా? అదియును గాదు. ఇది యేమో నిర్ణయింప మా పని గాదు. కానీ, మర్త్యుల కమరత్వము సిద్ధింప జేయు స్వరాజ్య గీతామృతమని మా వాదు.'

1. ఈ గ్రామ్యభాష పదాన్ని గ్రంధ కర్తలు వాడినది 1921 నాటి సంగతి, ఆ రోజుల్లో పండితులు వాడుక భాషను 'గ్రామ్యభాష' అని పిలిచేవారు. 'గ్రామ్యభాష' పదం ఎవరు ప్రయోగించినా గిడుగు రామ్మూర్తి పంతులుగారు మందలిస్తూ ఉండేవారు.

నిజమే. ఇది కావ్యమో ? ప్రబంధమో? అయినా, కాకపోయినా స్వరాజ్య గీతామృతమే. ప్రజారాజ్య ప్రచార సాధనమే. ఈ ప్రచారాన్ని వారు అపూర్వమైన పక్కీలో సాగించారు.[1]

1921 నాటికే ప్రఖ్యాతమైన మరొక దేశమాతస్తుతి గీతం ...

---

1. ఈ జంట కవుల్లో ఒకరైన 'వద్దాది సీతారామాంజనేయ కవి' దాదాపు 69-70 ఏళ్ళ క్రితం తన నూనూగు మీసాల నూత్న యవ్వనంలో ప్రతిరోజూ సాయంత్రమయ్యేసరికి విశాఖపట్నం టౌన్‌హాల్ నుండి ఓ బల్ల తీసుకుని, నెత్తిమీద పెట్టుకుని, ఓ కుర్చీ చేత బుచ్చుకుని బీచికేసి నడిచేవాడు. బీచిలో ఆ బల్లా కుర్చీవేసి, కుర్చీమీద గాంధీగారి ఫోటో పెట్టేవాడు. తర్వాత గొంతెత్తి గానం చేసేవాడు. పాటలు విన్న జనం చుట్టూ పోగయ్యేవారు. అప్పుడా స్వరాజ్య కవి గాయకుడు పాటలాపి, ఉపన్యాసం ప్రారంభించేవాడు. మళ్లీ పాట. తర్వాత ఉపన్యాసం. ఈ రకంగా విశాఖపట్నంలో దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన వారిలో మొదటివాడు, ఆ ప్రాంతంలో సహాయ నిరాకరణోద్యమంలోనూ మొదటివాడు ఈ వద్దాది సీతారామాంజనేయ కవి. ఈ నాటికీ సింహాచలం దగ్గర్లో అప్పటి జ్ఞాపక చిహ్నంగా నివసిస్తున్న ఈ పోరాట యోధుడి చిరునామా ప్రభుత్వ అజమాయిషీలోని సాంస్కృతిక వ్యవహారాల శాఖకు స్వాతంత్ర్య రజతోత్సవాల నాడే దొరకలేదు. రాజకీయ బాధితుల జాబితా నుండి ఆయన పేరు ఇటీవలి కాలం వరకూ చెరిగిపోయింది. అయితే 'తెలుగు పరిశోధన' 5 వ సంచిక (1988-89) లో వద్దాది పై డా॥ అత్తలూరి నరసింహారావుగారు చక్కని వ్యాసం రాశారు. అందులో '1980 నుండి వద్దాది వారికి నెలకు 300 రూపాయలు, ఈ మధ్య నుండి 500 రూ. స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ లభిస్తుంది అని తెలిపారు. ఆ వ్యాసంలోనే డా॥ అత్తలూరి 'దండాలు దండాలు భారత మాత'ను 'రచించింది కేవలం వద్దాది వారేనట' అని రాశారు. ఇది నిజం కాదు. వద్దాది, పూడిపెద్ది జంట కవులు రాసిన సుదీర్ఘ గీతమది. నిర్బంధాలను గుండె నిబ్బరంతో భరించలేక పూడిపెద్ది కాశీవిశ్వనాథ శాస్త్రి మధ్యలో ప్రభుత్వానికి క్షమాపణ రాసిచ్చారు. ఆ కోపంతో వద్దాది 'దండాలు దండాలు' గీతరచనలో పూడిపెద్ది పాత్రను విస్మరిస్తున్నారు

'వందన మిదె గైకొనుమీ భారత జనని
భారత జననీ - మా పాలిటి రాణీ'

అనే పల్లవితో ప్రారంభమయ్యేది. తెలుగు జాతీయ గేయ కవి సార్వభౌమ 'గరిమెళ్ళ సత్యనారాయణ' గారిచే విరచితమై ఆంధ్రుల జిహ్వాగ్రాల మీద నాట్యం చేసింది.

'ముప్పది కోట్ల జనమునకు మూల మాతవు
మూల మాతవు - మా పాలి నేతవు ||వందన||

ఉపనిషత్తు లుద్భవించె - యుదర మందున
నీ యుదర మందున - అవి నిదుర జెందునా ? ||వందన||

సకల పురాణేతిహాస - సార భరితవు
సారభరితవు - ఓంకార మహితవు'[1] ||వందన||

అంటూ 'దేశ ప్రజల భాగ్యానికి మహిత కర్త, అఘవిహర్త, స్వరాజ్య దీక్ష గొనిన సత్యమూర్తి, అసహాయవర్తి' యైన మాతృభూమిని కీర్తిస్తూ గొంతెత్తి గానం చేసిన ఈ జాతీయ కవి, తమిళ రాష్ట్ర జాతీయ కవి 'సుబ్రహ్మణ్య భారతి'కి ఏ మాత్రం తీసిపోని ప్రతిభాశాలి.[2]

1921 నాటికే వెలువడిన మరో దేశమాతస్తుతి గీతం 'నిన్ను నెన్న మా తరమా ?' అనేది.

---

1. 'స్వరాజ్య గీతములు' — గరిమెళ్ళ సత్యనారాయణగారిచే విరచితము. ప్రకాశకులు : ఇండియా యేజంసీ బీరో, మదరాసు (1921)
2. మితభాషి. కంచుకంఠ స్వరం. బరంపురం కారాఖిల్లి నోట్లో. అనునాసిక ధ్వని మిళితమైన వాక్కు, నిష్కల్మషమైన నవ్వుమొగం. అవసరమైనప్పుడు ప్రసంగములలో ఆవేశం వ్యక్తిత్వంగా గల వ్యక్తి గరిమెళ్ళ. కలకత్తా కాంగ్రెస్ మహాసభ (సెప్టెంబర్, 1920) యిచ్చిన అసహాయోద్యమ పిలుపుతో ప్రభావితులై రాజమండ్రి ట్రయినింగ్ కళాశాలలో చేస్తున్న యల్.టి. ట్రయినింగ్‌కు స్వస్తి చెప్పారని 'గురజాడ రాఘవ శర్మ' తమ 'జాతీయ గీతాలు' సంకలనానికి రాసిన పరిచయ వాక్యాల్లో వర్ణించారు.

'నిన్ను నెన్న మా తరమా ? నిరుపమాన భరతమాత
మిన్నపీ యఖిల భూములఁ కన్నతల్లి! కల్పవల్లి' [1]
॥నిన్ను నెన్న॥

అనే పల్లవితో ప్రారంభమయ్యే ఈ గీతంలో ....

కనకరత్న ఖనిజాలు, పర్వతాలు, వనాలు, పుణ్యనదీ నదాలు, పావను లగు తనయులు గల 'భారత జనని'ని ఈ కవిరాజులు స్తుతించారు. సకల సంపదలకు నెలవైన దేశమాత ఒకరిని బిచ్చమెత్త పని లేదనీ, త్యాగులు - మహాత్ములే సుతులై ఉండగా దాస్యవృత్తి ఆమె కెందుకని సూటిగా ప్రశ్నిం చారు. సకలైశ్వర్య సంజాతయైన దేశమాతను సద్భక్తితో స్తుతించిందీ గీతం.

ఈ గీతం కర్తృత్వంపై కొంత గందరగోళం ఉంది. 1921లో వెలు వడిన బ్రహ్మశ్రీ మంగిపూడి వేంకటశర్మగారి 'జాతీయ గీతములు' లోనూ, 1921 లోనే వెలువడిన చెఱకువాడ వేంకట రామయ్య, రామోజీపురపు వేంకట నరసింహారావు గార్ల 'జాతీయ గీతములు' లోనూ 'నిన్ను నెన్న మా తరమా?' గీతం ప్రచురితమయ్యింది.

1921 లోనే ఈ రెండు సంపుటాలు వెలువడడం వల్ల ఎవరీ గీతాన్ని రచించారో గుర్తుపట్టడం కష్టమౌతుంది. గురజాడ రాఘవశర్మగారు సంకలనం చేసిన 'జాతీయగీతాలు' సంకలనంలో 'మంగిపూడి వేంకట శర్మ' గారి పేరు తోనే ఈ గీతాన్ని ప్రచురించారు.

ఇది మంగిపూడి వారు రాశారా ? చెఱకువాడ, రామోజీపురపు జంట కవులు రాశారా ? నిర్ణయించడం కష్టం.

ఏది ఏమైనా ప్రజల నోళ్లలో నానిన ఈ గీతం ప్రజల పరమయిందని భావించడం తప్ప ప్రస్తుతానికి గత్యంతరం లేదు.

అలాగే సత్యాగ్రహోద్యమంలో మంగిపూడి వారు అరెస్టయి, రాయ వెల్లూరు సెంట్రల్ జైల్లో ఉన్నప్పుడు ......

---

1. 'జాతీయగీతములు' - బ్రహ్మశ్రీ మంగిపూడి వేంకట శర్మ. రామా ముద్రాక్షర శాల, ఏలూరు (1921)
1. 'జాతీయ గీతములు' — చెఱకువాడ వేంకట రామయ్య, రామోజీపురపు వేంకట నరసింహారావు రచించినది. కేసరి సమాజము, రాజమహేంద్ర వరము వారిచే ప్రకటితము. (1921)

'పతిత భారత ఘోర
పరిభవానల మర్చ
వ్రతులము, నవ్య భా
రత వీర సుతులము
వితత సర్వార్పణో
ద్యతి మతిని నీ దరికి
కుతుకమున వచ్చినామే తల్లి' [1]

అని గానం చేశారు. దేశమాత సంకెళ్ళను తెంచడానికి తాము ఎన్ని సార్లు సంకెళ్ళను ధరించాల్సి వచ్చినా వెనుకాడబోమని మంగిపూడిగారు ప్రతిజ్ఞ చేశారు.

తెలుగు ప్రజలకు ఉత్తేజం కలిగించిన మరొక గీతం వేదుల సత్యనారాయణగారి లేఖిని నుండి ఉద్భవించింది.

'జయము హిమగిరి మణికిరీటా
జయము సింహా[illegible]
జయము విజయాంకిత లలాటా
జయము ప్రియ జననీ!
జయము భారత భాగ్య ధాత్రీ
జయము వినమిత పుత్ర పుత్రీ
జయము శాంతి జగత్ పవిత్రీ
జయము జనయిత్రీ' [2]

అని సాగే ఈగీతం దేశజననికి విజయ హారతులు పట్టింది.

'నమో హిందు మాతా
సుజాతా నమో జగన్మాతా ॥నమో॥

---

1. 'ఆంధ్రులను ప్రభావితం చేసిన జాతీయ గీతాలు' (వ్యాసం) - మాదల వీరభద్రరావు, ఆంధ్రప్రభ (దినపత్రిక) 20-7-1986.
2. 'తెలుగు రచయితలు - భారత స్వాతంత్ర్యోద్యమం' రచయిత ఆర్. ఎన్. శర్మ విశ్వసాహితి అనుబంధ ప్రచురణ, సికింద్రాబాద్.

అమోఘ దివ్య జ్ఞాన సమేతా
అఖండ వర భరత ఖండ మాతా
గోలు కొండ సీ రత్న కేశమట
కోహినూరు నీ జడలో పువ్వట
తాజమహలు నీ దివ్య భవన మట ॥నమో॥

అంటూ దేశమాతకు వడ్డాది సీతారామాంజనేయులుగారు జోహార్లర్పించారు.

అలాగే దేశమాతను స్తుతించిన గేయాల్లో ప్రముఖంగా పేర్కొన వలసినవి - దువ్వూరి వారి 'జాతీయగీతము', రాయప్రోలు వారి 'జన్మభూమి', 'తమ్ముడా!'. కాటూరి వేంకటేశ్వరరావు గారి 'మాతృస్తవము,' గురుజాడ రాఘవశర్మ గారి 'భారత జననీ,' కవికొండల వేంకటరావుగారి 'ఉయ్యాలా! జంపాలా!,' 'జాతీయగీతిక' వేదుల సత్యనారాయణ శాస్త్రిగారి 'మా తల్లీ!,' 'ప్రియభారతావని', దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి 'జాతీయగీతం' మొదలైనవి. ఇవన్నీ మాతృదేశ గీతాలాపనల్లో పునీతమయ్యాయి.

'శారద శుభ్రవియత్తల పథమున సంచరించు రథముపై పయనించు భారతమాత మృదు వీణాగాన ప్రబుద్ధమైన మనముతో దేశమాతకు' జోహార్లర్పించి, ముకుళిత హస్తప్రియ పుత్రుడైనాడు శ్రీ దువ్వూరి.

'ఏ దేశమేగినా, ఎందుకాలిడినా భరతజాతి నిండు గౌరవమును నిల్పుమని' ప్రబోధించాడు రాయప్రోలు.

'హిమాలయోన్నత సమాదర్శిని-తమోదళన, విద్యాస్వరూపిణి, పావన గంగా జీవనశోభిని-పతితోద్ధారిణి, పాప విదారిణియైన భారతజనని' విజయాన్ని కాంక్షిస్తూ ...

'జయజయ భారత జాననీ, పావనీ
జయజయ సకలానంద దాయినీ'

అంటూ వీరగీతికలాలపించాడు శ్రీగురజాడ రాఘవశర్మ.

'పుడమిచేడియకు గొప్పైన మల్లెపూదండ
పొడుపు గల మా జన్మభూమి భారతధాత్రి

ఎంత చక్కని తల్లివే! రాణివే! ఎల్లభూములకు నీవు', అంటూ 'మాతృభూమి'ని కీర్తించారు శ్రీకాటూరి వేంకటేశ్వరరావు[1]

'హిమగిరి శిఖరము-వింధ్యవనీంద్రము
కన్యాకుమారీ పద డిండీరము
స్ఫురితము-భరితము-చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే-స్వాతంత్ర్యముచే
స్వాగతమనవోయ్, కని, వనివినవోయ్
మనవోయ్. అనవోయి, జయ, జయ, జయ!'

అని దేశీయుల్ని ఉత్తేజపరిచాడు-కవికొండల వెంకటరావు.

తెగలు తెగలై చీలి వగచు మన సంతతిని తెగని స్నేహమున బంధించి ఏకముచేసి; కలుషితాచారములను, కులజాతి మత ద్వేషములను బాపి మాతృభూమి సేవచేసే భాగ్యాన్ని జాతిజనులకు పంచిపెట్టమని ప్రియభారతాపనిని, విశ్వైక పావనిని అభ్యర్థించాడు 'గౌతమీకోకిల' వేదుల.

దేశమాతను స్తుతించిన గీతాల్లో తలమానికమైన ప్రసిద్ధ గీతం 'జాతీయ గీతం'. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు దీన్ని రచించారు.

'జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్య ధాత్రి
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి ॥జయ॥'

అంటూ....'జయ దిశాంత గత శకుంత దివ్యగాన పరితోషణ, జయ గాయక వైతాళిక గళ విశాల పద విహరణ' అంటూ దేశమాతకు నివాళులర్పించారు శ్రీ కృష్ణశాస్త్రి. 1940 వ దశకంలో జరిగిన అనేక విద్యార్థి సమావేశాల్లో ఈ గీతం ప్రార్థనాగీతమయ్యింది.

జాతీయోద్యమంలో పాల్గొంటున్న బాలికలకై ప్రత్యేకంగా ఒక 'జయగీతి'ని శ్రీ మిక్కిలినేని భగవంతరావు. [2] రాసి యిచ్చారు.

జయ జయ భారత జననీ నీకిదే జయహారతి గొనుమా
విజయ పతాకము, విరులు దండలును
వీరగంధమిదే గొనుమా జయహారతి గొనుమా ॥జ॥

---

1. ఈగీతం పల్లవి ప్రేరణతో తరువాతి కాలంలో 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' వంటి గీతాలు వెలువడ్డాయి.
2. 'జాతీయ గేయాలు'—మిక్కిలినేని భగవంతరావు (పుట : 13) దేశి కవితా మండలి, బెజవాడ

పారతంత్ర్యమును పారద్రోల
బయలుదేరిన బాలికలము

స్తన్యామృతమును తాగినరుణము
తల్లీ తీర్తుమిదే జయహారతి గొనుమా ॥జ॥'

అంటూ పరాయి పాలనపై పగబట్టిన త్రాచులుగా బయలుదేరిన వీర బాలికల చేత దేశమాతకు విజయహారతులు పట్టించారు.

అలాగే బానిసత్వంలో మగ్గిపోతున్న భారతమాతను ఓదారుస్తూ -

'ఓ దాస్య భారతమాత నీవు
కలవరింతువ కంటినీరుల్లో
యుగ యుగంబుల దాస్యబంధన
ఊర్పులల్లో నిప్పుసెగలు
మానమర్యాదలకు వగచి
మగ్గిపోతావమ్మ నీవు ॥ఓ దాస్య॥

వలదుతల్లీ దుఃఖభారము
కలరు బాలచంద్రులమ్మ
రక్త బిందువులారకుండ
మాతృదేశము సేవచేయు
ఘోరమైన కాలసర్పాల్ - కొడుకులున్నారమ్మ నీకు
॥ఓ దాస్య॥' 1

అని అబ్బరాజుశర్మ వర్ణించారు. బానిసత్వం శాశ్వతం కాదని, బాల చంద్రులవంటి కొడుకులు సంకెళ్ళను బద్దలు కొడతారని ఈ కవి దేశమాతకు ధైర్యం చెప్పారు.

## మేలుకొలుపు గీతాలు

ఉద్యమానికి ఆరంభ సూచన మేల్కొలుపు. ఉద్యమ గీతాల ప్రాదుర్భావానికి ప్రారంభ సూచనలు మేల్కొలుపు గీతాలు. జాతీయోద్యమంలోకి జన సమీకరణకోసం ప్రజాకవులు ప్రజల్ని మేల్కొలిపారు. పోరాట పథాన్ని చూపారు.

1. 'స్వతంత్ర పోరాటము' — అబ్బరాజుశర్మ (30-11-1945)

'పొడుపుకొండ మీద-పొడిచె నల్లదె ప్రొద్దు
తడయకింకను వేగలేరా-భారతతల్లికి పుట్టిలిపోరా
॥పొడుపు॥
వేగుచుక్కతోడ వేకువ మేల్కాంచి-యోగముద్రలు
మరచినావు ఓరీ భోగాసక్తుడవై చెడ్డావు
రోగాలకెల్లను జాగాచేసితివిల్లు-పోగాలమెదురైన
పొలముచేనె విధాన ॥పొడుపు॥'[1]

అనే 'మేలుకొలుపు' గీతాన్ని పాడుతూ గరిమెళ్ళ సత్యనారాయణ జాతిని జాగృతపరిచారు. త్యాగాలతో తల్లిఋణాన్ని తీర్చుకొమ్మనే తత్వాన్ని ప్రబోధించారు.

'మేలు కొనుడు! మేలుకొనుడు! మేల్మిబంగరు-ఉషస్సిది!
ఓ నిద్రమత్తుల్లార! ఓ భద్రప్రపత్తుల్లార!
ఈ ప్రాభాతిక వేళను-మీప్రాంగణములు తెరువుడు
మేలుకొనుడు! మేలుకొనుడు! మేల్మిబంగరు ఉషస్సిది॥
ఆకుకూడ మేల్కొన్నది-అశ్రద్ధకు అవనికదలె
ఉదయ మలయ మరుదంకుర
వలయంబులు పారుచుండె
మేలుకొనుడు! ఒత్తిగిలుడు! లేచి కనులు నలిచిగనుడు॥'2

అంటూ దేశీయుల్ని మేల్కొలుపుతున్న శ్రీ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి గారు — 'ఆకులు మేల్కొంటున్నవి, పక్షులు మేల్కొంటున్నవి, గుడి గంటలు మేల్కొంటున్నవి, పిల్లపూవులు మేల్కొంటున్నవి, నిరపె యపు కాల్వపిలె పథము మేల్కొంటున్నది' కాబట్టి....

'నిశిగూడను మేల్కొన్నది-నిన్ను లేపు దాని లెను
ఉద్బుద్ధ ప్రకృతి మనో
భూకంపంబదె దరిసెను
ప్రత్యూషంబదె మురిసెను

1. 'స్వరాజ్యగీతములు' - గరిమెళ్ల సత్యనారాయణ.
2. 'జాతీయగీతాలు' - సం: గురజాడరాఘవశర్మ.

లెండిక స్వాతంత్ర్యమిదో - లెండు శ్వాస విడుపుటనె
మేలుకొనుడు : మేలుకొనుడు - మిసిమి బంగరుల ఉషస్సిది' ॥[1]

అంటూ పశుపక్ష్యాదులకన్నా, ఝురులు - వనచరులకన్నా దేశప్రజలు వెనుకబడడానికి వీలులేదని హెచ్చరికలు చేశారు.

దేశ ప్రజల్లో జాతీయతా ప్రబోధానికి పరాకాష్ఠగా నిలిచిన నినాదం 'వందేమాతరం.' ఈ నినాద ప్రళయనాదాన్ని గానంచేసిన కవికుమారులు శ్రీ మట్నూరి వెంకట సుబ్బారాయుడు, శ్రీ మంగిపూడి వెంకట శర్మ.

'దేశాభిమానంబు, దీపింప జేయు మం
త్రంబు వందే మాతరంబు సుండు
సాహసౌదార్యమున్ సమకూరజేయు మం
త్రంబు వందేమాతరంబు సుండు.

స్వాతంత్ర్య భాగ్యంబు చేతి కందిచ్చు తం
త్రంబు వందేమాతరంబు సుండు
ఐకమత్యాధిక శ్రీశుల జేయు జం
త్రంబు వందేమాతరంబు సుండు.

హిందూ జనులార : వాచాఫణీంద్రులార
నీతి పరులార ; స్వాతంత్ర్య నిరతులార:
మన మనోరథములు దీర్చి మనుచునట్టి
బ్రహ్మ మరయ వందేమాతరంబు సుండు.' [2]

అంటూ స్వాతంత్ర్య భాగ్యాన్ని చేతి కందిచ్చే తంత్రంగా, ఐకమత్యాన్ని సాధించే జంత్రంగా, దేశాభిమానాన్ని దీపింప జేసే మంత్రంగా 'వందేమాతరం' నినాదాన్ని, వందేమాతరం ఉద్యమాన్ని గానం చేస్తుందీ గీతం.

'భారత దేశము నాదేరా :
భారతీయుడను నేనేరా ॥భారత॥

భారత దేశము ప్రజాస్వామికము
బచయగోరి నే - బయలు వెడలితిని ॥భారత॥
ప్రాణము పోయిన - మానము విడువను
మాన ధనుడ, విజ్ఞాన ధనుడనే ॥భారత॥'

---

1. 2, 'జాతీయగీతాలు' - సం : గురజాడ రాఘవశర్మ.

అంటూ శ్రీ మంగిపూడి పురుషోత్తమ శర్మ పారతంత్ర్యమును పార ద్రోలుటకు బద్ధకంకణుడై బయలు దేరిన ఒక దేశభక్తుడిగా 'పాంచజన్యము'ను పూరించారు.

ఒక వైపు మేల్కొలుపు గీతాలు పాడుతూనే, మరో వైపు 'బానిస భారతము' యొక్క దైన్యాన్ని, దయనీయతను వర్ణిస్తూ జాతీయకవులు ప్రజల్ని కర్తవ్యోన్ముఖుల్ని చేశారు.

'కనరా కనరా భారతదేశపు
పారతంత్ర్య బ్రతుకూ ॥కనరా॥

బానిస విద్యా బానిస సాడూ
భారత దేశము నేడూ
బయలుదేరు నీ భాగ్యోన్నతికై
భావి పౌరు డవురా ॥కనరా॥'

అంటూ కర్తవ్య బోధ చేస్తూనే....

'తెల్లవాడే వట్టి కల్లవాడే
మన తల్లి దేశమంతా కొల్లగొట్టాడే' ॥తెల్ల॥

అని 'నల్లవాడే గొల్లపిల్లవాడే' అనే జానపదబాణీలో.... బేరగాడిగా వచ్చి, ప్రజలకు మత్తుమందును నూరిపోసి, అన్నదమ్ముల మధ్య తగవులు బెట్టి, మన మీద పెత్తనాన్ని చెలాయిస్తున్న 'తెల్లవాడి' అసలు రూపాన్ని ప్రదర్శించారు శ్రీ మిక్కిలినేని భగవంతరావు. 1

అయినా విచారిస్తూ కూచోవడం కాదు, స్వరాజ్యయుద్ధానికి సన్నద్ధం కావాలంటూ భగవంతరావు పిలుపునిచ్చారు.

'భరతవీరులం పరవిదార శూరులం
స్వారాజ్య యుద్ధమునకు సిద్ధమైన ధీరులం
సిద్ధమైన ధీరులం ॥'

అంటూ 'బానిస సంకెళ్ళుబోవ ప్రాణమైన యొగ్గుతాం' అని ప్రతిజ్ఞ చేస్తున్న ఈ గీతంలో బానిసత్వనిరసన వ్యక్తమవుతుంది. బానిసత్వాన్ని బలంగా నిరసిస్తూనే, దాన్ని పోగొట్టడానికి మాతృభూమి కోసం ప్రాణాలొడ్డ డానికి ప్రజల్ని సమాయత్త పరిచారు జాతీయోద్యమ కవులు.

1. జాతీయగేయాలు - మిక్కిలినేని భగవంతరావు.

'నా మాతృభూమికై' శీర్షికన వెలువడిన శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం గారి 'బాలగీతం'లో....

'నా మాతృ భూమికై-ప్రాణమొడ్డెదను
నన్నడ్డు పెట్టకే-నను గన్న తండ్రి ॥
దేశమునకై జన్మ-ధారబోసెదను
నను నిల్పబోవకే-నను గన్న తండ్రి ॥
సత్యమునకై నేను-చావగోరెదను
నను నిరోధింపకే-నను గన్న తండ్రి ॥
ధర్మమునకై మేను-తరిగి యిచ్చెదను
నను మాన్పబోవకే-నను గన్న తండ్రి'[1]

అంటున్న అంకితభావాన్ని వింటుంటే వీరాభిమన్యులు, బాలచంద్రులలా అయిన జాతీయోద్యమ బాలవీరులు కళ్ళముందు కదలాడుతారు.

## ఆంధ్రమాత స్తుతి

జాతీయోద్యమ కాలంలో దేశమాతను స్తుతించడంతోపాటు మన తెలుగు కవులు, శతాబ్దాల చరిత్రగల 'ఆంధ్రమాత'ను కూడా స్తుతించి, ఆమె పుత్రులను ఉద్యమోన్ముఖం గావించారు.

'జయ జయహే మహాంధ్ర జననీ! మధునాదవనీ!
జయ జయ హరిదంత వినత-మస్తకాగ్రతరుణ్రమణీ'!

అంటూ బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి 'మాతృగీతమ్' ఆలపించారు. నదీనదాలకు, కవి పండితులకు నెలవైన ఆంధ్రమాతను కొనియాడారు.

'దిక్కులన్నియు దెలిసి పాడగ
గీర్తి కాంతులఁ గెరలియాడిన
తెలివి గడ్డను తెలుగుసీమను
జగతిఁ జాటర తమ్ముడా!'[2]

---

1. 'జాతీయగీతములు'-శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం.
ప్రకాశకులు-గ్రామ సేవాసంఘము, పల్లపాపురము, గుంటూరు జిల్లా
2. 'తెలుగుసీమ'-దుగ్గిరాల బలరామకృష్ణయ్య
మానవాదర్శ గ్రంథమండలి, కృష్ణాజిల్లా (1932)

అంటూ 'తెలుగుసీమ' వైభవాన్ని ప్రపంచమంతటా చాటి చెప్పమని శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య ప్రబోధించారు. కేవలం ప్రబోధించడమేకాదు, 127 చరణాల సుదీర్ఘగీతంలో ఆంధ్రమాత ఔన్నత్యాన్ని ప్రస్తుతించారు.

అలాగే 1924 జూన్ మాసంలో శేషాద్రిరమణ కవులు 'నిజామ్ రాష్ట్ర ప్రశంస' శీర్షికన ఒక సుదీర్ఘకావ్యాన్ని ప్రచురించారు. పోతనామాత్యుని వంటి కవులకు జన్మనిచ్చిన నిజామాంధ్రరాష్ట్రాన్నీ, ఆ నేలతల్లి కన్నబిడ్డడు పోతనామాత్యుని కవితావైశిష్ట్యాన్నీ ఈ జంటకవులు కొనియాడారు.

'కఱుడుగట్టిన తెలుగు నెత్తుటి
వరదలందున నీదులాడెడి
తెలుగుబాస పొలంతి మొగమున
దిలకముంపవె చెల్లెలా!

చెఱగిపోయిన యాంధ్ర శిల్పము
మఱచిపోయిన తెలుగు బీరము
తఱచి తఱచి గ్రహించి వెల్లడి
పరుపవేమే చెల్లెలా!'[1]

అంటూ శతావధానులైన ఈ జంటకవులు తెలుగుజాతి గతవైభవ పునరుద్ధరణకోసం పిలుపునిచ్చారు. వీరికావ్యానికి అప్పటి నిజామ్ కళాశాల చరిత్ర విభాగాచార్యులు ఎస్. హనుమంతరావుగారు విపులమైన పీఠిక రాశారు. కావ్యానికున్న చారిత్రికావసరాన్ని స్పష్టం చేశారు.

'వేద సుధలను పిదికిన ప్రేమభూమి
బుద్ధదేవుని గన్నట్టి పుణ్యభూమి
భవ్య సంపత్సమేతయౌ భరతభూమి'కి
హృదయముగా నిలిచిఉన్న 'తెలుగుభూమి'ని కీర్తిస్తూ
'తెలుగు తల్లుల పాలలో కలదు భక్తి
తెలుగు మండెడు గుండెలో కలదు రక్తి

---

1. 'నిజాము రాష్ట్రప్రశంస' - శేషాద్రిరమణకవులు, శతావధానులు. నందిగామ (1.6.1924)

తెలుగు కత్తుల నెత్తుట కలదు శక్తి
తెలుగు గడ్డపై చచ్చిన కలదు ముక్తి'

అంటూ 'ఆంధ్రజ్వాల' జంపన చంద్రశేఖరరావు ...

'నేను తెలుగువాడను-తల్లినేలకొరకు
రాలు కన్నీళ్లె రత్నాల రాసులగును
నేను తెలుగువీరుడ-తల్లినేలకొరకు
కార్చు రుధిరమ్మె స్వాతంత్ర్య సుధలనొసగు'[1]

అనే దీక్షను ప్రకటించారు. నేలతల్లి కొరకు కార్చే నెత్తురు స్వేచ్ఛామృతాన్ని ప్రసాదిస్తుందన్న నిజాన్ని ఈ కవి నిజాయతీతో నినదించారు.

ఇంకా తెలుగు మాటల్లోని సత్యాన్ని, తెలుగు పాటల్లోని మాధుర్యాన్ని, తెలుగు ఆటల్లోని ధైర్యాన్ని,తెలుగునేలపై పుట్టిన భాగ్యాన్ని ఇంకెందరో కవులు గొంతెత్తి గానం చేశారు.

జాతీయోద్యమంలో భాగంగానే సాగిన 'ఆంధ్రోద్యమ' ప్రేరణతోనూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణా కాంక్షతోనూ, 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' నినాదంతోనూ వెలువడిన గీతాలను మరోప్రకరణంలో పరిశీలించడం జరుగుతుంది.

## నాయక స్తుతి

జాతీయ, స్వాతంత్ర్యోద్యమాలకు నాయకత్వం వహించి; అనేక త్యాగాలుచేసి, కారాగార క్లేశాలనుభవించి, జాతిజనులను సమరోన్ముఖులుగా మలచిన జాతీయనాయకులను స్తుతిస్తూ ఎన్నో కావ్యాలు, ఖండకావ్యాలు, గీతాలు వెలువడ్డాయి.

తెలుగు గీతాల్లో బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్ మొదలైన జాతీయ నాయకులు స్తుతింపబడినప్పటికీ, 'గాంధీజీ' పొందిన సాహిత్యస్థానం మరే ఇతర జాతీయ నాయకుడు కూడా పొందలేదు.

---

1. 'ఆంధ్రజ్వాల'-జంపన చంద్రశేఖరరావు
నవజీవన సమితి, అన్నామలై విశ్వవిద్యాలయము, అన్నామలై (1944)

## (అ) గాంధీ స్తుతి

గాంధీజీ వ్యక్తిత్వాన్ని, ఆయన చూపిన నిర్మాణ కార్యక్రమాల్ని, శాంతి మార్గాన్ని, ఆయన పోరాటరూపాల్ని బహువిధాలుగా తెలుగుకవులు స్తుతించారు.

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి గాంధీజీ 'ఆత్మకథ'ను, 'మహాత్మ కథ'ను కావ్యాలుగా మలిచారు. 1921వ సంవత్సరం వరకు గాంధీగారు రాసుకున్న స్వీయచరిత్రను తుమ్మలవారు 'ఆత్మకథ'గా కావ్యానువాదం చేశారు. ఆ తరువాత 'మహాత్మకథ' పేరుతో మరో స్వతంత్రకావ్యం వెలువరించారు.

'యుగపురుషుల యుత్తమాదర్శ జీవిత పద్ధతులను జనసామాన్యమునకు ఉత్తమరీతిని ప్రదర్శించవలసిన బాధ్యత'ను వహించిన మరింగంటి శేషాచార్యులు 'శ్రీగాంధీ భారతము' కావ్యాన్ని రచించారు.

గరిమెళ్ళ సత్యనారాయణ గారి అనేకగీతాల్లో గాంధీజీ ప్రశంస కనబడుతుంది.

'గాంధి' అనుశీర్షికతో గరిమెళ్ళ రాసినగీతంలో....

'సామాన్యుడనుకోకు మతని-దైవ-సంకల్పమురవాని
జననమీ యవని'

అనికీర్తిస్తూ....

'కత్తిని నిరసించు సతము స్వస్థ-చిత్తవృత్తియె
వానిచేతి యాయుధము ॥వినురా॥'

అంటూ అహింసావ్రతాన్ని అవలంబించి గాంధీజీ చూపిన నిర్మాణ కార్యక్రమాల్ని 17 చరణాల దీర్ఘగీతంలో గరిమెళ్ళ గానం చేశారు.[1]

1921లో 'శ్రీ మహాత్మాగాంధీ భజనకీర్తనలు' అనే కావ్యం వెలువడింది. లోపలి ముఖచిత్రంపై 'ఇయ్యది, శింగవరపు కాపురస్తులు మద్దూరి పాపారావు గారిచే రచియింపబడి, వంగలపూడి వాస్తవ్యులైన నీరుకొండ వెంకటరత్నం చౌదరీగారి ధన సహాయ్యమున శింగవరపు కాంగ్రెసు సంఘంవారిచే ప్రచురింప బడినది' అని ఉంది.

1. 'స్వరాజ్యగీతములు' -గరిమెళ్ళ సత్యనారాయణ.

అలాగే గ్రంథకర్త మాటల్లో....'మద్రాసువాసులగు భక్తులచే భజన చేయించుచు శీతానగరంలో తాలూకా మహా జనసభకు మహాత్ముని యాజ్ఞాను వర్తులును రాజమండ్రి వాస్తవ్యులును నగు దేశభక్తాగ్రేసరుల సమక్షమున నేను స్వయముగా భజన చేయించితిని' అని వ్రాసుకున్నారు.

'యేమీ తెలియదు। గాంధీమాయ। యీనవ
యుగమందున ॥యే॥'

ఈ పల్లవితో ప్రారంభమయ్యే భజనకీర్తనలో గాంధీజీ దక్షిణాఫ్రికాలో నడిపిన ఉద్యమం, ఆ తరువాత స్వదేశంలో సాగిస్తున్న సత్యాగ్రహ ఉద్యమాలు' ఖిలాఫత్ ఉద్యమ సాన్నిహిత్యం వర్ణింపబడినాయి.

'గాంధీ మహాత్మకు జైజై యనుచును ప్రజలెల్లరు రండి
భువిలో ప్రజలెల్లరు వినుడి
స్వరాజ్యమనునది యిక కనుడి
యీ సృష్టి యేలుటకు గాంధిదేవుడవతారమెత్తెనండి' అంటూ

సాగే 'దసరాగాంధి అను కోలాటకీర్తన'1 లో గాంధీజీ గుణగణములు, ఖద్దరు ధారణ, ఇతర నిర్మాణ కార్యక్రమాల వైశిష్ట్యం వర్ణింపబడింది.

ఇక గాంధీజీ పుట్టుక, విద్య, ఉద్యోగం, స్వరాజ్యసిద్ధికి అతను సాగిస్తున్న శాంతియుద్ధంవంటి అంశాలను వర్ణించిన మరొక కోలాటపుకీర్తన 'గాంధీజీ చరిత్ర;2

'శ్రీగణనాథుని పాద పద్మములు చిత్తమందు దలచి
వాగీశ్వరినిన్ భజియించి - భాగవోత్తములను గొలిచి
గాంధీమహాత్ముని దివ్యగాథ నిట - ఘనముగ రచియించి
తెల్పెద వినరయ దయ యుంచి -'

ఇది ఈ కోలాటపు నడక. ఇది వర్ణనాత్మకమైన కోలాటకావ్యంగా రూపొందింది.

ఇలా కీర్తనలు, కావ్యాలు మాత్రమే కాకుండా వందలాది జాతీయ గీతాలు గాంధీజీ సమగ్ర స్వరూపాన్ని ఆవిష్కరించాయి.

---

1 'దసరాగాంధి అను కోలాట కీర్తన' రచయిత: నూకల సుబ్బారావు గుప్త
2. జాతీయ దసరాగీతములు' - జాస్తి వెంకటనర్సయ్య, ధూళిపాళ వేంకట సుబ్రహ్మణ్యం.

'మమ్ముబ్రోవ మహిని వెలిసితివి - మహాత్మాగాంధి
మమ్ముబ్రోవ మహిని వెలిసితివి ॥ మమ్ము'॥

అంటూ మంగిపూడి స్తుతించగా ....

'నెత్తురు చుక్కను నేలను చిందక
యెత్తినావు మన స్వరాజ్య జండా
దేశదేశముల దిగ్భ్రమ జెందగ
సత్యాహింసలు చాటితివయ్యా'[1]

అని మిక్కిలినేని భగవంతరావు నివాళులర్పించారు.

'జగద్రక్షకుడు - గాంధిమహాత్ముడు - జనులందరు మీరెరుగండి!'

అని జగన్నాథ దాసు చాటి చెప్పగా ....

'జగతిని ధర్మము స్థాపన సేయగ
జన్మించిన హరి, యితడండీ' అన్నారు శ్రీ కొండపల్లి.[2]
'ఎన్ని జన్మల పుణ్యఫలమో
ఈ జన్మమున గాంధి నెరుగ గలిగితిని'

అని మామునూరు నాగభూషణరావు కీర్తిస్తే ....

'నీవె ధన్యుడవోయి! మహాత్మగాంధి ॥నీవె॥
నీదు మతమే - లోక హితము
నీదు పలుకే నిగమ సమము
నిరతి శయమౌ - నీ తపమ్మె
నిఖిల జగతి - నడుపు శక్తి ॥ నీవే ॥'

అంటూ మరింగంటి శేషాచార్యులు నివాళులర్పించారు.

'ఏడనున్నాడో, శ్రీ గాంధీదేవుడేడనున్నాడో
ఏడనున్నాడో, ఆ జాడ తెలియరాదు

---

1. 'జాతీయ గేయాలు' - మిక్కిలినేని భగవంతరావు.
2. 'జాతీయ గీతాలు'- సం; గురజాడ రాఘవశర్మ

నాడు కెయిరా ప్రజల-కీడుబాపిన తండ్రి ఏడనున్నాడో'

అని శ్రీ నెల్లూరి వెంకట్రామానాయుడు అన్వేషిస్తుంటే....

'పోరుబందరు కోమటింటా-పుట్టినాడోయ్
పురుషోత్తముడు జగతి-మెట్టినాడోయ్'

అనే చిరునామాను శ్రీ బసవరాజు అందించారు.

'అంతారామమయం' అన్న భక్తిగీతాన్ననుసరించి....
'అంతా గాంధిమయం-ఈ జగమంతా గాంధిమయం'[1]

అనే పల్లవులతో శ్రీ దామోజీ, శ్రీ దామరాజుగార్లు రెండుగీతాలు రాశారు.

'జీవితమంటే నీదే గాంధీ'

అంటూ శ్రీ సబ్బవీసు గురునాథరావు ప్రస్తుతించారు.

'ఎవరు దూషించితేనేమి? మహాత్మ!
ఎవరు భూషించితేనేమి?
అవతారపురుషుడని-ఆదర్శప్రాయుడని
దశదిశలు మార్మోగి-ధన్యాత్ముడైనాడు'[2]

అంటూ శ్రీ ఉప్పలపాటి వెంకయ్య కీర్తించారు.

అలాగే మరోగీతంలో వీరశైవ వచనాల్లోని ఆవేశాన్ని, వైష్ణవ పద సాహిత్యంలోని తాదాత్మ్యాన్ని శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం గారు స్ఫురింపజేశారు. 'గాంధీనై పోతానే' అనే శీర్షికతో ఈకవిరాసిన బాలగీతంలో భావావేశాన్ని చూడండి....

'గాంధీనై పోతానే అమ్మా - గాంధీనై పోతా నేనే
హిందూ ముస్లిం క్రైస్తవ సిఖ్ఖు - లందరై పోతా నేనే
సత్యమైపోతానే అమ్మా - శాంతమైపోతా నేనే
సర్వలోక సేవలోనే - సొంతమైపోతా నేనే
ధర్మమైపోతానే అమ్మా - త్యాగమైపోతా నేనే
కార్మికునికి కర్షకునికి - కవచమైపోతా నేనే

1, 2. 'జాతీయగీతాలు' - సం: గురజాడ రాఘవశర్మ.

ప్రేమమైపోతానే అమ్మా, ని-ష్కా-మమైపోతా నేనే
రామ రహీమయహోవా దివ్య-నామమైపోతా నేనే'[1]

అంటూ గాంధీజీ గుణగణాలను ప్రతిబాలుడూ ఆవాహన చేసుకోవాలన్న ఆకాంక్షను శిష్టాగారు హృదయాలకు హత్తుకు పోయేలా వ్యక్తం చేశారు.

మరో గీతంలో శ్రీ దామరాజు పుండరీ కాక్షుడు....

'శ్రీ గాంధి నామం-మరువాం మరువాం
సిద్ధము జైలుకు-వెరువాం వెరువాం
మా గాంధీనే మేం - నమ్మేం నమ్మేం
మరి యితరుల మేము - నమ్మాం నమ్మాం'[2]

అంటూ లాఠీదెబ్బలతో బెదరమనీ, మేటి తుపాకులతో చెదరమనీ' గాంధీజీ చూపిన మార్గంలో స్వరాజ్యాన్ని సాధిస్తామనీ వర్ణించారు.

'శ్రీ గాంధిదేవుండు- లోకరక్షకుండు
భోగవిరహితుండు-త్యాగశీలుండు'

అనేగీతంలో కొమాండూరు పార్థసారథి అయ్యంగార్ గాంధీగారి జీవిత విశేషాలను వివరించారు.[3]

పైన పేర్కొన్న కవులతో బాటు శ్రీయుతులు ఓలేటి చిరంజీవిశర్మ, గురజాడ రాఘవశర్మ, పురిపండా అప్పలస్వామి, గొన్నాబత్తుల మల్లికార్జునరావు, అంబటి లక్ష్మీనృసింహారావు, మల్లావధాని, మదునాపంతుల, పాటిబండ మాధవశర్మ, ఖండవల్లి లక్ష్మీరంజనం, దొప్పలపూడి అనసూయాదేవి, దాశరధి కృష్ణమాచార్య మొదలైన కవులెందరో పద్యాలద్వారా, కావ్యాలద్వారా, గేయాలద్వారా గాంధీగారి ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని, ఉద్యమనిర్వహణా నైపుణ్యాన్ని వేనోళ్ళగానం చేశారు.

ఇక్కడ పేర్కొన్న కావ్యసంపుటులతోబాటు 'స్వరాజ్యతత్త్వము', 'స్వరాజ్య భజనకీర్తనలు', 'స్వరాజ్యరధము', 'జాతీయగీతములు', 'స్వతంత్ర పోరాటము', 'స్వరాజ్యగీతామృతము', 'జాతీయ చేనేతగీతావళి', 'అమర

1. 'జాతీయగీతములు' - శిష్టా సత్యనారాయణ రాజశేఖరం
2. 'జాతీయగీతాలు' - సం: గురజాడరాఘవశర్మ
3. 'కాంగ్రెస్ ప్రచార పాటలు' - కొమాండూరు పార్థసారథి అయ్యంగార్.

గేయాలు' మొదలైన జాతీయగీతికా సంపుటుల్లో గాంధీగారిపై అనేక గీతాలు వెలువడి ఆయన వ్యక్తిత్వానికి నివాళులెత్తాయి.

## (ఆ) ఇతర జాతీయనాయకుల స్తుతి

ఇతర జాతీయ నాయకులను స్తుతిస్తూ వెలువడిన కావ్యాలను, గీతాలను పరిశీలిద్దాం.

1907లో చెరకువాడ వెంకట్రామయ్య, గాదె జగన్నాథస్వామిగార్లు రచించిన 'లాలా లజపతిరాయ్' అనే లఘుకావ్యం వెలువడింది.

1917లో మంత్రిప్రగడ భుజంగరావుగారు వ్రాసిన ఏకాశ్వాస నిర్వచన ప్రబంధం 'గోఖలే చరిత్రము' ప్రచురితమయ్యింది.

1918లో మంత్రిప్రగడ భుజంగరావుగారే వ్రాసిన 'దాదాబాయి నౌరోజీ చరిత్రము' వెలుగుచూసింది.

1921లో జంధ్యాల అయ్యవారుశాస్త్రిగారు రచించిన 'దేశభక్తుడు' లఘు కావ్యం 'దేశభక్త కొండావెంకటప్పయ్య'గారి నాయకత్వాన్ని ప్రశంసించింది.

1939లో నూకలసుబ్బారావు గుప్తగారు రచించిన 'రాష్ట్రపతి సుభాష్ చంద్రబోసుగారి జీవితచరిత్ర' దీర్ఘగీతం వెలువడింది.

1941లో చెళ్ళపిళ్ళ వేంకటేశ్వరకవిగారి 'లోకమాన్యతిలక్' కావ్యం తిలక్ జీవితాన్ని చిత్రించింది.

'క్విట్ఇండియా ఉద్యమం' జరుగుతున్న రోజుల్లో కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గారి 'అరుణ కిరణాలు' వెలువడింది. ఇందులో జయప్రకాశ్ నారాయణ, బాపూజీ కెప్టెన్ విజయలక్ష్మి, అరుణా అసఫాలీ, ఆంధ్ర కేసరులపై వ్రాసిన గీతాలు నాయకస్తుతిగీతాల్లో అగ్రగతాంబూలాలు. గాంధీజీ తరువాత జాతీయోద్యమంలో అధిక ప్రజాదరణపొందిన నాయకుడు నేతాజీ సుభాష్ చంద్రబోస్. గాంధీజీతో అభిప్రాయ భేదాలు ఏర్పడింతర్వాత నేతాజీ స్థాపించిన 'ఫార్వర్డ్‌బ్లాక్,' ఆ తరువాత 'భారత జాతీయసైన్యం' ఆనాటి యువతరాన్ని ఎంతో ప్రభావితం చేసింది,

## (ఇ) సుభాస్ చంద్రబోస్ స్తుతి

ఒకవైపు సహాయ నిరాకరణోద్యమం వంటి శాంతియుత పోరాటాలు బ్రిటీష్ పాలకులను కలవరపరుస్తుంటే, మరోవైపు భారతజాతీయసైన్యం దేశ సరిహద్దుల కావల నిలిచి సాగించిన సాయుధ పోరాటం తెల్లపాలకుల మనో నిబ్బరాన్ని దెబ్బతీయసాగింది.

1939 నుండే తెలుగు సాహిత్యం మీద సుభాస్ చంద్రబోస్ ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. 1946 నాటికి అది విస్తరించి విప్లవ ముద్రల్ని వేసింది.

1946 జనవరి 26 నాడు వెలువడిన 'ఆగష్టుగేయాలు'[1] ఆగష్టు విప్లవ వీరులకు అంకితం చేయబడినాయి. ఈ గీతికా సంపుటికి ముందుమాట వ్రాసిన అప్పటి ఆంధ్రరాష్ట్ర యువజన కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ రామకుమార వర్మ-"పరిస్థితులు మారినాయంటే కాలం మారిందన్నమాట. కాలం మారగానే కలం కూడా మారాలి. మారిన పరిస్థితుల కనుగుణంగా వుండేజీవిత పంథాను చూపే జీవసహిత సారస్వతం కావాలి. అలాఉండే సారస్వతమే సారవంత మైంది. ఈ నియమం ఆర్థిక, రాజకీయ, సాంఘిక రంగాలన్నింటిలో నూ చెల్లుతుంది- సారస్వతరంగం ఆ రంగాల సిద్ధాంత రూపం. ఆ రూపం యొక్క ప్రతిబింబమే యీ నవ కవుల గీతాపుంజం. గానం ద్వారా చవిచూచి యువకులు వదలరేమో! విన్న ప్రేక్షక జనం రక్తం వుప్పొంగి స్వరాజ్యాన్ని సాధించేటట్టు చేయక తప్పదు కూడా!" అని ప్రకటించారు.

'కాశీ విశ్వనాథం' 'నెత్తురు కలం' చిందించిన ఈ గేయాల్లో-

'జై హింద్, జై హింద్ జై నినాదం
జాతీయోద్యమ శంఖారావం ॥జై॥
వినబడలేదా?
సుభాసుబాబు దివ్యసందేశం
స్వతంత్ర సమరపు జైజై నాదం'

అని ప్రశ్నించడంతో బాటు 'స్వతంత్ర భారతసేనకు జోహార్లూ శరవేగముతో చేయగరారా' అనే పిలుపు ప్రతిధ్వనిస్తుంది.

---

1. 'ఆగష్టుగేయాలు' 'కాశీవిశ్వనాథం! "నెత్తురుకలం" - మోడరన్ రైటర్స్ కాంగ్రెస్, విజయవాడ (1946)

1947 జనవరి మాసంలో వెలువడిన 'విద్యార్థుల వీరగేయాలు'[1] సంపుటిలో నేతాజీ ప్రశంస కనబడుతుంది.

'జైజై నేతాజీ "జైహింద్"
"ఢిల్లీఛలో" నీదే స్వాతంత్ర్యరణమూ
యూరప్‌నందున కూడా స్వతంత్ర
భారతసైన్యము నిలిపినావయా
ప్రపంచమందే భారతభూమికి
పేరుదెచ్చిన వీరుడవయ్యా ॥జై'॥

అంటూ 'జైహింద్', 'ఢిల్లీచలో' వంటి విప్లవాత్మక నినాదాలను జాతికి అందించిన నేతను శ్రీ మిక్కిలినేని భగవంతరావు కీర్తించారు.

1949 ఆగష్టులో వెలువడిన 'జాతీయ దసరాగీతములు'[2] బోసువీరుడి సమగ్ర స్వరూపాన్నీ, సాయుధపోరాట స్వభావాన్నీ సుదీర్ఘంగా వర్ణించిన గీతాన్ని అందించాయి.

1949 ఆగష్టు సెప్టెంబర్ మాసాల్లో 'క్విట్‌ఇండియా' ఉద్యమ సందర్భంగా ప్రభుత్వ నిర్బంధాలను సైతం లెక్కచేయకుండా ఆంధ్ర ప్రాంతాన్ని రహస్యంగా పర్యటించిన 'తరుణ భారతనారీమణి' అరుణ అసఫాలికి అంకితంగా కరుణశ్రీ రచించిన 'అరుణకిరణాల్లో'....

'యువభారత యుగోదయంలో
నవభారత మహోదయంలో
పూచిందొక అరుణ తరంగం
లేచిందొక క్రాంతి విహంగం'[3]

అంటూ కంఠంలో విప్లవరాగం, గమనంలో విద్యుద్వేగం కలిగి ఆసఫాలీ హృదయాంబరమున ప్రసరించిన మహేంద్రచాపం శ్రీమతి అరుణా అసఫాలీని ప్రశంసించిన కవిగారు, మరోగీతంలో....

---

1. విద్యార్థుల వీరగేయాలు' — మిక్కినినేని భగవంతరావు దేశి కవితా మండలి, బెజవాడ.
2. జాతీయ దసరాగీతములు' - జాస్తి వెంకటనరసయ్య, భూశిహా వెంకట సుబ్రహ్మణ్యం.
3. అరుణకిరణాలు - కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి.

'లాల్ ఖిల్లా ప్రాంతంలో
లక్ష్మిసాక్షాత్కారం
విమానాన్ని దిగుతున్నది
వీరఝూన్సి అవతారం'

అంటూ కెప్టెన్ లక్ష్మిని అభినందించారు.

'క్విట్ ఇండియా' ఉద్యమ రథసారథి జయప్రకాశ్ నారాయణ గారిని స్తుతిస్తూ....

'కుటిల జటిల శృంఖలాలు
పెట పెట ఫెట ఫెటా త్రెంచి
కఠోర కారాగారాపు
కట కటాల లోనుంచి
వెలువడింది వెలువడింది
విప్లవసింహ కిశోరం'[1]

అంటూ జైలు కటకటాలను తప్పించుకుని ప్రజోద్యమ నిర్వహణకు వచ్చిన ఉద్యమ నాయకునికి కరుణశ్రీ నివాళులర్పించారు. అజ్ఞాతవాసంలో ఉంటూ ఉద్యమానికి కావలసిన ప్రజ్ఞామయ ప్రచండ తేజాన్ని ప్రసరించిన నాయకుని ప్రతిభను కీర్తించిందీగీతం.

## (ఈ) ఆంధ్రనాయక స్తుతి

జాతీయ నాయకులతో బాటు ఆంధ్రదేశాన్ని ఉద్యమోన్ముఖం గావించిన ఆంధ్రనాయకుల్ని కూడా స్తుతి స్తూగీతాలు వెలువడ్డాయి. ఈ గీతికా సంపుటుల్లో ప్రధానంగా పేర్కొనదగింది 'బద్దిరెడ్డి కోటీశ్వరరావు'గారి 'స్వరాజ్యరథము'.

'స్వరాజ్యోత్సవమునకు - జయభేరిమ్రోగించి
స్వారాజ్యలక్ష్మి పుత్రుండు - దేశోద్ధారకుండు నాగేశ్వరుండు
చంద్ర, తారార్కముగ కీర్తి - ధరనిలిపెరండు'[1]

అంటూ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి దేశభక్తిని బద్దిరెడ్డి గారు కొనియాడారు.

---

1. అరుణకిరణాలు - కరుణశ్రీ
2. 'స్వరాజ్యరథము' - బద్దిరెడ్డి కోటేశ్వరరావు
   45. చరణాల ఈ దీర్ఘగీతం స్వరాజ్యోద్యమానికి నిలువుటద్దం

'ఆంధ్రకేసరి యన్న - సన్నుతవాదులకెల్ల
బల్లెంబుగా పరిణమించె - నాంధ్ర, భారతావనికి కీర్తిదెచ్చె'

అంటూ ఓంగుటూరి ప్రకాశం పంతులుగారిని ఈ రచయిత ప్రశంసించారు.

పలునాడు గుంటూరు - పరిసరగ్రామములెల్ల
ప్రభవించు నెవ్వానిగొల్చుచు - ధర్మరాజంచు నెవ్వాని ప్రార్థింత్రు
కొండావశాంబ్ధి చంద్రుడు - బంధింపబడినాడు'

అంటూ కొండా వెంకటప్పయ్యగారి నిర్బంధం పట్ల కోటీశ్వరరావు గారు ఆందోళన వ్యక్తం చేశారు.

స్వారాజ్య రథ గమనాన్ని వర్ణిస్తూ....చెఱకువాడ నరసింహంపంతులు, అయ్యదేవర కాళేశ్వరరావు, బులుసు సాంబమూర్తిగార్ల వ్యక్తిత్వాలను, పోరాట ఆదర్శాలను ఈ రచయిత ప్రస్తుతించారు. స్వరాజ్యోద్యమ రథానికి సారథ్యం వహిస్తూ, ముందుకు నడిపిన ఆంధ్రజాతీయ నాయకుల ఉద్యమ గమనాన్ని ప్రశంసించిందీ కావ్యం. ఉద్యమ గమ్యాన్ని త్వరత్వరగా చేరాలని ఆశించిందీ కావ్యం.

## నాయకస్మృతి

ఆంగ్లంలో 'ఎలిజీ' అని పిలువబడుతున్న కావ్య ప్రక్రియకు తెలుగులో 'స్మృతికవిత', 'స్మృతికావ్యం', 'స్మృతిగీతం' అనే పేర్లు పర్యాయనామాలుగా వ్యవహారంలో ఉన్నాయి.

మన ప్రాచీన పురాణాల కాలంనుండి 'స్మృతికవితలు' వెలువడుతున్నప్పటికీ, ఇదొక కవితా శాఖగా పెరిగింది ఇటీవలే.

Elegy అంటే 'A Song or Poem expressing Sorrow or lamentation especially, for one who is dead' అని నిఘంటువులు అర్థాలు చెబుతున్నాయి.[1]

'గ్రీక్ భాషలో ఎలిగాస్ అంటే శోకమని అర్థం. శోకభరితమైన కవిత ఎలిజీ. ఈ పదాన్ని పదహారు, పదిహేడవ శతాబ్దాలలోని ఆంగ్ల కవులు

1. Websteris Seventh New Collegiate Dictionary, Indian Edition, 1971.

గ్రహించారు. గ్రీకు సాహిత్యంలో ఎలిజాయిక్ ఛందస్సులో రాసిన ఏ కవిత్వమయినా ఎలిజీగానే ప్రాచీన కాలంలో పరిగణింపబడేది.'[1]

థామస్‌గ్రే రాసిన 'ఎలిజీ ఇన్ ఏ కంట్రీ చర్చ్‌యార్డ్,' టెన్నిసన్ రాసిన 'ఇన్‌మెమోరియం' వంటి ఆంగ్ల కావ్యాలు ఈ రకమైన సాహిత్య ప్రక్రియలో చిరస్మరణీయాలుగా నిలిచాయి. 1579లో 'రిచర్డ్‌పుటెన్ హామ్' అనే సాహిత్య విమర్శకుడు ఎలిజీని 'దీర్ఘశోకగీతం' అని నిర్వచించాడు నిజానికి 'ఎలిజీ' అంటే జీవన విషాదాన్ని స్మరించే కావ్యప్రక్రియ అని అర్థం. ఇదొక విషాద స్మృతికావ్యమన్నమాట. కానీ రానురానూ ఇది కేవలం శోక కావ్యంగా; మరణించిన ఆప్తులపై - ఆత్మ బంధువులపై రాసుకున్న 'స్మృతి కావ్యం'గా వ్యవహారంలో కొచ్చింది. ఆధునిక సాహిత్యంలో ఏ భాషలోనైనా 'ఎలిజీ' అంటే....సమకాలీన సమాజంలో ప్రసిద్ధుడైన ఒక వ్యక్తి, కవి, కళాకారుడు, దేశభక్తుడు మొదలైనవారు మరణించినప్పుడు కానీ; తన ఆత్మీయులెవరైనా కనుమూసినప్పుడు కానీ కవి రాసుకునే 'శోకగీతం'గా పరిగణింపబడుతుంది.

భారత జాతీయోద్యమంలో క్రియాశీలంగా పాల్గొన్న జాతీయ నాయకుల మరణం పట్ల ఆర్ద్రమైన హృదయాలతో కవులు వెలువరించిన కావ్యాలను 'నాయకస్మృతి కావ్యాలు' అంటున్నాం.

## (అ) గోఖలే స్మృతి

రాయప్రోలు సుబ్బారావు ఆధునికాంధ్ర సాహిత్యంలో మొట్టమొదటి స్మృతి కావ్యం వెలయించారు. గోపాలకృష్ణ గోఖలే మరణవార్త (19 ఫిబ్రవరి 1915) విని సుబ్బారావుగారు స్మృతిఖండికను రచించారు.[2]

## (ఆ) తిలక్ స్మృతి

1920 ఆగస్టు 31 న మహానాయకుడు లోకమాన్య బాల గంగాధర తిలక్ అస్తమించారు. తిలక్ నిర్యాణము అనేక స్మృతిగీతికల ప్రాదుర్భావానికి ప్రాణం పోసింది.

1. 'కొడాలి సాహితీ సౌవర్చసం' (వ్యాసం) - డా॥ గాలిగుణశేఖర్ 'తెలుగు పరిశోధన' (తొలిసంచిక) 1987-88.
2. 'తెలుగులో జాతీయోద్యమ కవిత్వం' (పి హెచ్.డి. సిద్ధాంత వ్యాసం) —డా॥ మద్దూరి సుబ్బారెడ్డి.

'షౌకతాలీ గాంధీల జూపి లోకమాన్యుడేగె దివిజసభకు
మా లోకమాన్యుడేగె దివిజసభకును యీలోకులతని
లోపమునకు వ్యాకులమును జెంద ॥షౌ॥[1]

అంటూ విషాదగీతికలతో తెలుగుకవులు విలపించారు.

తన ప్రియపుత్రుడు దూరమయ్యాడని దేశమాత విలపిస్తున్న దృశ్యాన్ని వర్ణిస్తూ....

'అన్నా సంసార సుఖము సున్నాయని
దివికి చన్నావా సుగుణలోకమాన్య ॥అన్నా॥
వినుత శీలులైన సుతులగని మనమున సంతసించి
ఘనత చెందనున్న నన్ను కలతనొంద జేసితే
ఘనులగు బలరామ కృష్ణులని నమ్మిన జనులపైని
కనికరము లేక దివికి జన భావ్యమ లోకమాన్య ॥అన్నా॥
కన్నతండ్రిలోకమాన్య యెన్ని బాధలొంది ఆత్మ
సన్యాసమును బూనినావొ యన్నాయీ భువినిగాన
సన్యాసిగనైన బ్రతికి యున్నావని సంతసింప క
న్నందున కిటులనన్ను నన్యాయము చేయదగున
॥అన్నా॥'[2]

అంటూ పుత్ర వియోగ విషాదాన్ని కవులు ప్రదర్శించారు.

తల్లి విలపిస్తుంటే తనయులు చూస్తూ కూచోలేరు. కుటుంబంలో ఒక సభ్యుడు చనిపోతే, మిగతా అందరికీ విషాదమే. అయినా ఒకర్నొకరు ఓదార్చుకోక తప్పదు. మానసిక ధైర్యాన్ని కలిగించక తప్పదు. అలాగే దేశమాతను ఓదార్చుతూ....

'శోకింపకుమా జననీ - మాసోదరుడు మహాత్ముడుండ ॥శో॥
లోకమాన్య నిర్యాణము లోపము మది తలచకమ్మ

1. 'స్వరాజ్యతత్వము' (గీతికా సంకలనం)-రచయిత పేరు ప్రచురించలేదు.
2. 'స్వరాజ్య భజనకీర్తనలు' (సంకలనం) **Printer at Hitakari Press Ellore**. - రచయితల పేర్లు ప్రచురించలేదు.

ప్రాకటముగ సతడిపుడీ లోకమంత నిండియుండె ॥శో॥
హిందుజనులు పందలనుచు డెందము సందు కుందనేల
ముందు శుభములొసగుట కానందమూర్తి గాంధి కలుగ
॥శో॥

పరుల ప్రాపునకు జేరరు పరధనాదులను గోరరు పరమ
పావనీ నీదగు పాదభక్తి మది మీరరు ॥శో॥[1]

అని పలికారు దేశభక్తులైన కవులు. తిలక్ లేని లోటును గాంధీజీ తీర్చు తారనే ఆత్మ విశ్వాసాన్ని తమ మాతృమూర్తికి కలిగించే ప్రయత్నం చేశారు

దేశమాతనైతే ఓదార్చ యత్నిస్తున్నారు కానీ, తమ ప్రియతమ నాయకుని మరణాన్ని ఎలా భరించ గలదు. ఉబికి వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ ....

'బాలగంగాధరయో భారతీయ కులతిలకా
చాల నమ్మియున్న మాపై జాలిలేక చనుట మేల ॥బాల॥[2]
గీతార్థము లోకమునకు నీతి గఱపు విఖ్యాతా - మాతా
భ్రాతలను విడిచె మరణము వ్రాసెన విధాత ॥బాల॥
ముందు కార్యమునకు సాయమొంద దలచిడెందమందు
గాంధి యందు నమరగ, మృతినొందినావ లోకమాన్య ॥బాల॥[2']

అంటూ తల్లినీ, తనయులనూ విడిచి వెళ్ళిన లోకమాన్యుని మరణం పై శోకాన్ని ప్రకటించారు సోదర భారతీయులు. వీరిని ఓదార్చే బాధ్యత జాతినేత గాంధీజీపై పడింది.

'అన్నలారా మీ మనమునందు చిన్నబోకుడీ
మనకన్నయైన తిలకు నెపుడు మరువబోకుడీ ॥అన్న॥

జగన్నుతుడై స్వర్గమునకు చేరెను సుండీ
మీ కన్నుమూసి గాంచిన కనుపించు నమ్ముడీ
సోదరులగు మనకు మనో బలము కొరకిలన్
సూక్ష్మమునను మనలజేరి స్థూలముబాసెన్
॥అన్న॥[3]

---

1, 2, 3. స్వరాజ్యభజనకీర్తనలు (సంకలనం) నుండి.

అంటూ ఎదఎదలో నిండిన బాలగంగాధరుని విశ్వరూపాన్ని వర్ణించిన గాంధీజీ దేశప్రజలకు ధైర్యం చెప్పారు.

ఆ మహనీయుని ఆత్మకు శాంతి లభించాలని కోరుతూ....

'శాంతి పొందుమా! మహారాజః ఆత్మశాంతిపొందుమా!
దేహమనిత్యమని - దేశముకొరకయి
బాములు పడిన - బాలగంగాధరుని ఆత్మ ॥శాంతి॥

కారాగృహములు - కైలాసముగ గడపి
గీతా రహస్యము తెలిపి-కీర్తి గాంచినమూర్తి ఆత్మ ॥శాంతి॥

చరమదశ యనక-జనుల బ్రోచు కొరకు
జని బ్రిటీషతావులందు-జయము గన్న తండ్రి ఆత్మ ॥శాం॥

నీదుతేజము నిలుప దలచినాడు
గాంధి కర్పణజేసి-కాయము బాసిన ఆత్మ ॥శాంతిపొందుమా॥[1]

అని దేశప్రజలు ఆశిస్తున్న ఆకాంక్షను బ్రహ్మశ్రీ మంగిపూడి గానం చేశారు.

తిలక్‌పై వెలువడిన ఆనాటి (1921) స్మృతిగీతాలన్నింటిలోనూ అంతర్లయగా విషాదంతో బాటు, గాంధీజీ తిలక్ బాటలో జాతిని నడిపించి, స్వరాజ్యాన్ని సాధిస్తారన్న ఆత్మవిశ్వాసాన్ని తెలుగుకవులు కవితామయం చేశారు.

## (ఇ) మోతీలాల్ స్మృతి

1931 ఫిబ్రవరి 5న జాతీయనాయకులు మోతీలాల్‌నెహ్రూ దేశమాత ఒడిలో దీర్ఘ నిద్రపోయారు. రాజకీయ దురంధరుడు, న్యాయశాస్త్ర కోవిదుడు, యావదాస్తిని జాతీయోద్యమానికి ధారవోసిన ఆ మహనీయుని స్మృత్యర్థం కర్ణవీర నాగేశ్వరరావు 'మోతీలాల్జీ నిర్యాణము' పేరుతో స్మృతికావ్యం వెలువరించారు.

'భావిరాజ్యాంగ కల్పనా బ్రహ్మవనగ
నీ రిపోర్టె తగిన సాక్షి నియతితోడ

1. 'జాతీయగీతములు'-బ్రహ్మశ్రీ మంగిపూడి వెంకటశర్మ (1921)

సకల సమవర్తి విజ్ఞాన చక్రవర్తి
సాటి కనరాదు నీకింక శాంతమూర్తి'[1]

అంటూ ఆ నాయకుని గుణగణాలను నాగేశ్వరకవి ప్రశంసించారు. అతని అడుగు జాడల్లో నడుద్దామని తోటి ప్రజలకు ప్రబోధించారు.

## (ఈ) ఆంధ్రరత్న స్మృతి

చీరాల-పేరాల ఉద్యమం ద్వారా, రామదండు నిర్మాణంద్వారా ఆంధ్రప్రాంతంలో జాతీయోద్యమ విస్తృతికి పాటుబడిన 'ఆంధ్రరత్న' దుగ్గిరాల 1928 జూన్ 10న అస్తమించారు. పిడుగుపాటు లాంటి ఈ వార్తను విన్న తెలుగుకవులు పెక్కుమంది ఆయన స్మృత్యర్థం పద్యాలు, గేయాలు రచించారు. దుగ్గిరాల ఉపన్యాస పటిమను, కవితా చాతుర్యాన్ని, హాస్యసరళిని, గానమాధుర్యాన్ని కొనియాడిన ఆ స్మృతికవితలు అనాటి ఆంధ్రపత్రిక, భారతివంటి పత్రికల్లో ప్రకటితమయ్యాయి.

శ్రీయుతులు చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, వేదాంతవని, గుఱ్ఱంజాషువా, బలిజేపల్లి లక్ష్మీకాంత కవి, దోమా వెంకటస్వామి గుప్త, చళ్ళపిళ్ళ దుర్గేశ్వర శాస్త్రి, తుమ్మల సీతారామమూర్తి, బసవరాజు అప్పారావు, బులుసు రామజోగా రావు, భాగవతుల సుబ్బయ్యశాస్త్రి, పెండెం వెంకట్రాములు, డా॥కె.కె. ఎన్. ప్రసాద్, వడ్డాది సీతారామాంజనేయులు, వెంపరాల సూర్యనారాయణ మూర్తి, వెదురుమూడి శేషగిరిరావు, అల్లంరాజు నారాయణరావు, జోస్యుల నారాయణమూర్తి, జి. గోకర్ణము, కాటపాటి తిరుమలరాయుడు, కేసరి ఆదినారాయణ శర్మ, శ్రీమతి కాంచనపల్లి కనకాంబ మొదలైన కవులెందరో 'ఆంధ్రరత్న' పై స్మృతి కవితలు రచించారు. రాజకీయరంగంలోనే కాక, సాహిత్య రంగంలోనూ దుగ్గిరాల స్థానాన్ని విశదపరిచారు.2

'పలుకు పలుకున హాస్య సంపదలు గురియు
సహజవైదుష్యమునకు నిచ్చలును బొంగు

1. 'మోతీలాల్జీ నిర్యాణము' (పద్యకావ్యము) - కర్ణవీర నాగేశ్వర కవి
2. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాల కృష్ణయ్య జీవిత చరిత్రము

నాంధ్ర సోదరలోక మల్లాడ నపుడ
స్వర్గమెక్కితివేల? గోపాలకృష్ణ' (జాషువా)[1]

'ఏలా పాడేనింక
యమునా కళ్యాణి*మా
లీలా మానవుడు-గోపాలుడు లేడాయె ॥ఏలా॥'
(బసవరాజు అప్పారావు)

'ప్రజ్ఞలందున బటు హాస్యరసమునందు-వెరసిరామకృష్ణుండవై వెలసితీవు కాని రాజకీయ విమర్శనానుభూతి-నాడు కొఱవడినది తీర్పనేడు నెగడి తాంధ్ర గోపాలమూర్తివై యాంధ్రరత్న' (వడ్డాదిసీతారామాంజనేయులు) అంటూ కవులు ఆంధ్రరత్నకు కైమోడ్పులందించారు.

## (ఉ) కస్తూరిబా స్మృతి

1942 ఆగష్టు విప్లవ సందర్భంగా ప్రముఖ జాతీయ నాయకులందర్నీ ప్రభుత్వం నిర్బంధించింది. గాంధీజీ సతీమణి శ్రీమతి కస్తూరిబా గాంధిని కూడా జైల్లో పెట్టింది. జైల్లోనే అనారోగ్యంతో ఆమె చివరి శ్వాస విడిచింది. ఆ త్యాగశీలి మరణంతో వ్యాకుల పడిన సాహితీపరుల హృదయాలనుండి అనేక స్మృతిగీతాలు వెలువడ్డాయి.

'కస్తూరి మాత యింక కానరాదండీ
కఠినమైన జైలులోనే కాలమొందిందీ
తల్లీ కాలమొందిందీ ॥కస్తూరి॥'[2]

అంటూ శ్రీ మిక్కిలినేని భగవంతరావు ప్రాణాలను దేశమాతకు అంకితంచేసి, వీరనారీ లోకానికి ఆదర్శమైన కస్తూరిబా మరణం పట్ల ఆవేదన వ్యక్తం చేశారు.

---

1. 'ఆంధ్రరత్న' దుగ్గిరాల గోపాలకృష్ణయ్య జీవితచరిత్రము — శ్రీ కార్యంపూడి నాగేంద్రుడు, బహూత్తమ పబ్లికేషన్స్; పేరాల, చీరాల * యమునా కళ్యాణి ఆంధ్రరత్నకు అభిమాన రాగం.
2. 'జాతీయగేయాలు'—మిక్కిలినేని భగవంతరావు.

'కస్తూరి గాలిలో కలిసిపోయినది
గాంధి వాసనలతో-కమ్మనే కమ్మనై ॥కస్తూరి॥
నేస్తురాలా రావె-నీవంతు గొనిపోవె
నీ మనసులో సుంత-నెలకొల్పుకోవె ॥కస్తూరి'॥[1]

అంటూ గాలిలో కలిసిన కస్తూరీ పరిమళం అరగడియలో దేశమంతా అలుముకొని పోయి, నారీజన హృదయాలను రగిలించాలని విషాదంలోనూ విప్లవ భావాలను దేశప్రజలు గానం చేశారు.

## (ఊ) వీర మహేంద్ర చౌదరి స్మృతి

భగత్సింగ్, రాజగురు, సుఖదేవ్ వంటి విప్లవ వీరుల మార్గంలో బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడిన బీహార్ విప్లవ వీరుడు వీరమహేంద్ర చౌదరి. ప్రభుత్వ వ్యతిరేక విప్లవ సన్నాహాలు చేస్తున్నాడని పోలీసులు చౌదరిని అరెస్టుచేసి, చిత్రహింసలు పెట్టారు. రహస్యాలు చెప్పమని వేధించారు. గుండె నిబ్బరంతో హింసల్ని భరించిన వీరుడు పెదవి విప్పలేదు. దాని ఫలితం ఉరిశిక్ష. చిరునవ్వుతో ఉరికంబాన్నెక్కిన ఆ వీర మహేంద్రుడ్ని స్మరిస్తూ....

'అడుగడుగో మాహేంద్రచౌదరీ-చూడు డల్లడుగో మాహేంద్ర చౌదరీ

బ్రిటీషు బీభత్స-భూతాల నృత్యంబు
బీహారు భువిలోన-గర్జించి గదముచూ చౌదరీ
గళము వురి బంధమున బెట్టె చౌదరీ ॥అడు॥

నాజాతి గౌరవము నగ్నంబు గావిస్తి
నా కేమి లోటంటు-నాకపురికే బోయెగా చౌదరీ
నరులనే విడనాడెగా చౌదరీ ॥అడు॥

స్వాతంత్ర్య పదములో చౌదరీ-మనల
సాహసుల గమ్మనెను చౌదరీ ॥అడు॥'[2]

అంటూ 'పరదాస్య భావాలను పట్టుకుని వేలాడే నిజజాతి సోదరులను నీచులని నిందించిన' వీరచౌదరిని స్మరిస్తూ కాశీవిశ్వనాథం కవితాంజలి ఘటించారు.

1. 'జాతీయగీతములు'—శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం.
2. 'అగష్టుగేయాలు' - కాశీవిశ్వనాథం 'నెత్తురుకలం'
మోడరన్ రైటర్స్ కాంగ్రెస్, బెజవాడ (26.1.1946

## (ఎ) బొంబాయి నావికుల స్మృతి

ఒకవైపు 'క్విట్ ఇండియా' ప్రజోద్యమం; మరోవైపు 'ఆజాద్ హింద్ ఫౌజ్' సాయుధ సమరం జరుగుతున్న కాలమది. వీటి ప్రేరణతో 1946 ఫిబ్రవరి మాసంలో బొంబాయి రేవులో కాపలా కాస్తున్న మరాఠీ సైనికులు అధికారుల ఆజ్ఞల్ని ధిక్కరించారు. బ్రిటీష్ సోల్జర్లు రంగంలోకి దిగారు. సాయుధ యుద్ధం జరిగింది. ఇరువైపులా ప్రాణనష్టం సంభవించింది. ఆ తిరుగుబాటులో అమరులైన మరాఠీసైనిక వీరుల్ని సంస్మరిస్తూ....

'కదనోద్ధత కర్మవీర-వదనోద్గత రుధిరపూర
బలిపులకిత నవభారత-జగతీ జాగరణాంజలి
తరుణ తరుణ బాష్పాంజలి

పరిమ్లాన దీనహీన-పరిక్షిప్త శప్తతప్త
పరాభూత జనతా-దుర్భర జీవన మరణాంజలి
అరుణ అరుణ బాష్పాంజలి

సత్యాగ్రహదీక్షాబల-సంస్తంభిత పరప్రభుత్వ
హత్యామయ దుష్కృత్య-ప్రత్యక్షీకరణాంజలి
కరుణ కరుణ బాష్పాంజలి'[1]

అంటూ కరుణాంజలి ఘటించారు కరుణశ్రీ.

## (ఏ) గాంధీజీ స్మృతి

1948 జనవరి 30. భారత చరిత్రలో ఒక దుర్దినం. దేశంస్వాతంత్ర్యాన్ని సంపాదించుకుని ఆర్నెల్లయినా పూర్తి కాకముందే నాథూరామ్‌గాడ్సే అనే మతోన్మాది పిస్తోలు గుండుకు గాంధీజీ నేలకొరిగారు. జాతీయోద్యమంలోకి లక్షలాది మందిని ఆకర్షించిన జాతిపిత; జీవితాంతం శాంతి, అహింసలను బోధించిన శాంతమూర్తి ఒక హింసాత్మని కాల్పులకు గురై కూలిపోయాడు. జాతి యావత్తు నిర్ఘాంతపోయింది. దేశం ఒక మహాత్ముని కోల్పోయింది.

58. 'అరుణకిరణాలు'-కరుణశ్రీ

'కనిపింప వదియేమి? కనకకాంతుల జిమ్మ
సత్యావతార ప్రశాంతమూర్తి
వినిపింప దదియేమి? వీనులవిందుగా
రఘుపతి రాఘవ రామభజన'[1] (అ)
—కరుణశ్రీ

'ఓ భారత భాగ్యవిధాతా! శోభాయుత కీర్తి సమేతా!
చాలించితివా అవతారం: సైరింపుము-మా అపచారం'
—పూ.భా.('పూర్వాభాద్ర') (ఆ)

'ఎవరి పాద చిహ్నము లివి?
ఎవరి పాదచిహ్నములివి?
అతని ప్రతి అడుగు గురుతు
ఆలయమై తలయెత్తును,
అతని చేతి గొడుగు క్రింద
అఖిల జగము శయనించును ॥ఎవరి॥' (ఇ)
—దాశరథి

'తొలికోడి కూసింది
తెలతెల వారింది
ఏడవకు! ఏడవకు! నాచిట్టిపాప
ఇప్పుడే వస్తాడు, నీ గాంధి బాబా!'(ఈ)
—కొప్పరపు సుబ్బారావు

'మరల రమ్ము ఒక్కసారి
కరుణ జూపు బాపూ!
నూరేడులు మననీయని
క్రూరాత్ముల మన్నింపుము' (ఉ)
—గురజాడ రాఘవశర్మ

ఇలా అనేక మంది కవికుమారులు మహాత్ముని మరణ వార్తవిని కవితాశ్రువులు రాల్చారు.

'ఎవడురా వాడు, గుండియలెన్నివచ్చి
కొట్టెరా! గాంధి గుండెల గుండుదెబ్బ (పైడిపాటి)' (ఊ)

అని కొందరు కవులు ఆక్రోశిస్తే....

1. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ,: 'జాతీయగీతాలు' సం: గురజాడ రాఘవశర్మ

'చేజేతుల చంపుకొన్న
చెనటులమే - మా బాపును
పూజించుట పోయి గురుని
కాజేసిన కష్టులమే ॥చే॥

గాంధి కన్న దేశభక్తి
గల దనెడు దివాంధులమే
హిందువులకు గాంధి కన్న
హితులమనే దుర్భ్రాంతులమే ॥చే॥'[1]

(శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం)

అంటూ కొందరు కవులు గుండెలు పగిలెలా విలపించారు.

'అక్కటా వినరయ్య ఆంధ్రజనులార!
ఒక్క ఘోరపు వార్త యొదవె నవురపుర !
నగుబాటు గలుగగా నలుబదెనిమిది
యగు వత్సరంబున నరయ ముప్పాది
జనవరి నెల యందు సాయంత్రమునను
విననయ్యె హరి హరీ విభ్రాంతముగ!
భారతీయుల పాలి భాగ్యముల రాశి
మేరు సమధీరుండమేయ గుణభాసి
గాంధిజీ నెవ్వడో కఠిన హృదయుండు
అజ్ఞుండై వధియించె నవుర ! హీనుండు'[2]

అంటూ గాంధీజీ నిర్యాణ ఘట్టాన్ని ఒక సుదీర్ఘగీతంలో రికార్డు చేశారు శ్రీ జాస్తివెంకట నరసయ్య.

'భారత దేశం
మహావెలుగు
మహాత్ముని
మరణం

1. 'జాతీయగీతములు' - శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం (1948)
2. 'నవగీతాలు' - జాస్తివెంకట నరసయ్య (1949)

కదిపివేసింది
మానవ హృదయం
కంపించిందోయ్
భూవలయం
గర్జిల్లిందోయ్
ఘనభోంతరాళం' 1

అని నిట్టూర్చారు శ్రీ పూర్ణానంద్.

'కారడవుల
కలల కావరములో
మరణించిన గాంధీజీ
నీ అమృత వాహిను లెక్కడ ?
ఆశలు నిరాశలై
అస్తమించిన - గాంధీజీ
నీ చల్లని చిరునవ్వు లెక్కడ ?
మదించిన మతోన్మాదికి
బలియయిన బాపూజీ
నీ మత సామరస్యం యెక్కడ ?[1] (అ)

అని రామమూర్తిగారు ప్రశ్నిస్తుంటే....

'మహాత్మగాంధి
మా తండ్రి, ఏడంచు
దిక్కు దిక్కుల గాంచు
పిచ్చి భారత ప్రజలు' (ఆ)

విలపిస్తున్న విషాద సన్నివేశాన్ని చిత్రించారు శ్రీ చంద్రన్.

'కరుణా జలధులు పొరలే హృదయం
సత్యాహింసలు చాటే గుండె
శాంతి బోధనలు - సలిపే గొంతుక
సౌహార్ద్రము వెదజల్లే మనసు

---

1. (అ),(ఆ) 'జాతీయగీతాలు' - సం : గురజాడ రాఘవశర్మ

విడిపోయినదీ విశ్వభారతని
విడిపించినదీ విపదంబుధిలో

భౌతిక శక్తుల బలము గూర్చుకొని
ఆధ్యాత్మిక శిఖరాగ్రమందు వాని
సర్వస్యము దేశమున కొసంగిన
పురుషోత్తము డగు పుణ్యాత్మునిపై

ప్రేలిపోయినవి పిస్తలు గుండ్లు
రాలిపోయినది రత్నరాజము'1 (ఇ)

అంటూ దాస్యకూపంలో మూల్గే జగతిని స్వేచ్ఛా పథముల బట్టించిన జాతి పితను చంపుకొన్న జాతీయుని క్రూరత్వంపై అసహాయంగా శ్రీరంగాచార్య 'ఆవేదన' చెందుతుంటే

నీ చేతులెట్లాడెరా ! మనగాంధి - నిన్ జంప మనసొచ్చెరా
నీచ ! నీచే, జాతికి, తీరని నింద కొడి గట్టితివిరా ॥నీ చేతు॥ (ఈ)

అని ఆవేశంగా ప్రశ్నించారు శ్రీ గురజాడ రాఘవశర్మ.

పోతన 'భాగవతం'లో శ్రీకృష్ణనిర్యాణ వార్త విన్న అర్జునుని వలె —
'మన సారధి మన బంధుడు
మన హితుడున్ మన గురుడు, మన నాయకుడున్
మన భారత సేవకుడున్

మన గాంధి భానుడ స్తమయమున్ గనగా'(ఉ)

అంటూ స్మృతి కవిత పలికారు శ్రీ రాఘవశర్మ.

ఇంకా మహాత్ముని దివ్య స్మృతిలో శ్రీయుతులు తుమ్మల సీతారామ మూర్తి, మంగిపూడి పురుషోత్తమ శర్మ, పువ్వాడ శేషగిరిరావు, జ్ఞానానంద కవి, మద్దోజు సత్యనారాయణ, మానేపల్లి సంగమేశ్వర కవి, వేముగంటి నరసింహాచార్యులు, గరికపాటి మల్లావధాని, కోగంటి దుర్గా మల్లికార్జునరావు, కొడాలి వెంకట రాజారావు, కవి కొండల వెంకట్రావు, మారేపల్లి రామచంద్ర

1. (ఇ),(ఈ),(ఉ) 'జాతీయగీతాలు' - సం : గురజాడ రాఘవశర్మ.

శాస్త్రి, జాగర్లపూడి వెంకట సుబ్బయ్య శాస్త్రి, కొండా వెంకటప్పయ్యపంతులు, కన్నెగంటి వీర భద్రాచార్యులు, గుఱ్ఱం జాషువా, దీపాల పిచ్చయ్య శాస్త్రి, మాలకొండారెడ్డి, యేటుకూరి వెంకట నరసయ్య, నండూరి రామకృష్ణమాచార్య, పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు, బొడ్డు బాపిరాజు, దివాకర్ల వెంకటావధాని, బొడ్డుపల్లి పురుషోత్తం, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి మొదలైన ఎందరో కవులు పద్యాలు, గేయాలు, గీతాలు వ్రాసి తమ ఆవేదనను అక్షరమయం చేశారు. కావ్య జగత్తులో గాంధీజీ స్మృతికి అనితర సాధారణ మైన ప్రాధాన్యంలభించింది

జాతీయ నాయకుల్లో ఏ ఇతర నాయకుని మరణం దేశవ్యాప్తంగా సాహితీ పరుల గుండెల్ని ఇంతగా కుదిపేయలేదు. జాతి జాతినే ఇంత విషాదంలో ముంచెత్త లేదు.

## VI పంజాబ్ దురంతాలు

పరాధీనమైన భారత దేశాన్ని మరింత క్రుంగదీసే ఉద్దేశ్యంతో 1919 సంవత్సరారంభంలో బ్రిటిష్ ప్రభుత్వం 'రౌలట్ చట్టాన్ని' ప్రవేశ పెట్టింది. ఈ చట్టం ప్రకారం ఎవరినైనా ఎప్పుడైనా, ఏ కారణం చూపకుండానే ప్రభుత్వం నిర్బంధించవచ్చు. అరెస్టు వారెంట్లు అక్కరలేదు. విచారణ నిమిత్తం కోర్టుకు పంపే అవసరం లేదు. బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకి అనే అనుమానం కలిగితే చాలు, ఎట్టి విచారణ లేకుండానే జైళ్ళో పడదోయవచ్చు

ఈ బిల్లుకు వ్యతిరేకంగా దేశవ్యాప్త నిరసన పెల్లుబికింది. 1919 ఏప్రిల్ 6 న దేశమంతటా హర్తాళ్ జరిగింది. ఒక్క బొంబాయి నగరంలోనే పోలీసుల కాల్పుల్లో 53 మంది మృతి చెందగా 400 మంది గాయపడ్డారు. వేలాది దేశ భక్తులు నిర్బంధింప బడ్డారు.

ఈ దేశవ్యాప్త ఉద్యమంలో భాగంగానే 1919 ఏప్రిల్ 13 వ తేదీ నాడు పంజాబ్‌లోని 'జలియన్ వాలాబాగ్' లో భారతీయులకు అత్యంత ప్రీతిపాత్ర మైన 'ఉగాది' పండుగ సందర్భంగా దాదాపు 2000 మంది ప్రజలు సమావేశమయ్యారు. ఈ సమావేశ వార్త విన్న డయ్యర్‌సేనాని తన సైనికులతో అక్కడికి చేరాడు. సైన్యం ప్రజల్ని చుట్టుముట్టింది. తన అనుమతి లేకుండా సమావేశం జరుపుకుంటున్నారన్న ఆగ్రహంతో డయ్యర్ కాల్పులకు ఆదేశించాడు. నిరాయుధులైన వందలాది ప్రజలు తుపాకి గుళ్లకు బలై పోయారు. వేలాది మంది క్షతగాత్రులయ్యారు. చరిత్రలో కనీ వినీ ఎరుగని రీతిలో మానవ మారణ హోమం జరిగింది.

'కంటా గుడ్డను పెట్టి - కర్ణాస వేలెట్టి
వింటా వటర ఓరయ్యా ! ముందరింటిలో జరిగిన చర్య
మొన్న మొన్ననె సుమ్మి - మూడు సంద్రాల్ దాటి
శత్రువుల గెలిచొచ్చినారు - పాంచాల దేశములోని వారు
సత్యాగ్రహమని, సర్వేశు పూజింప - కత్తితో తెగ నరికినారు
అయ్యో ! కటిక డెందపు - తెల్లవారు'[1]

అంటూ జరిగిన ఘోరాన్ని శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ జగత్తుకు చాటి చెప్పారు.

'కనుల నీరు గారునుగా - కరుణలేక యా డయ్యరొనర్చిన
వధ వినిస - కనుల నీరు గారునుగా'[2]

అని కవులు కన్నీటి కథ గార్చారు. దేశమాత, తన బిడ్డలకు జరిగిన ఘోరాన్ని చూసి....

'హిందు మాతానురా ! - డయ్యరు వినరా
లోక మాతానురా ! - డయ్యరు వినరా
నా డబ్బుతిని నీవు, నా బిడ్డలను జంప
నీ చేతు లెట్టాడెరా - నీతి లేని వాడ ॥హిందు॥'[3]

అంటూ శ్రీ కొండపల్లి ప్రశ్నింపజేశారు.

'డైయరు రాక్షసుండటు హడావిడిగా చనుదెంచి, నోటికిన్
గూయగరాని, పెన్ మొఱటు కూతుల(గూయుచు మాన
హీనమున్
జేయగ సాహసించె, నవినీతుల నూరక నింకసైపగా న్యాయమె ?
> శక్తి గల్గిన యనాథులమే ? యిటు మిన్నకుండగన్'

అని గురజాడ రాఘవశర్మ ఆవేశంతో పిడికిళ్ళు బిగించారు.

బలిజేపల్లి, పువ్వాడ శేషగిరిరావు మొదలైన కవులు పంజాబ్ దురంతాలను పద్యాల్లో నిరసించారు.

---

1 'జాతీయగేయకవిసార్వభౌమ' 'గరిమెళ్ళ' (వ్యాసం) —ద్వానా శాస్త్రి ఆంధ్రప్రభ (దినపత్రిక) 14-8-1988

2. 'స్వరాజ్య భజన కీర్తనలు' (కవుల పేర్లు లేవు)

3. 'జాతీయ గీతాలు' - సం. గురజాడ రాఘవశర్మ.

పరాయి పాలనలో జరిగిన పరాభవాల పరాకాష్టగా మిగిలింది పంజాబ్ రక్తపాతం. జాతీయోద్యమ తీవ్రతకు పదును బెట్టింది ఆ మారణ హోమం.

## VII జాతీయ జెండాగీతాలు

'పింగళి వెంకయ్య' అనే తెలుగు వాడు మన జాతీయ జండా రూపు రేఖలు దిద్దాడు (1921). మార్పులు, చేర్పులతో కాంగ్రెస్ సంస్థ 1947 జూలై 22 న దాన్ని ఆమోదించింది. అయితే మన జెండా రూప కల్పన వెనుక నాలుగు దశాబ్దాల చరిత్ర ఉంది. తర్జన భర్జనల నేపథ్యం ఉంది.

మొట్టమొదటి సారిగా జాతీయోద్యమంలో మన పతాకాన్ని 1906వ సంవత్సరం ఆగష్టు 7న కలకత్తాలోని పార్సీబగాన్ స్క్వేర్ (ఇప్పటి గ్రీన్ పార్క్)లో ఎగురవేశారు. అందులో ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగులు ఇప్పటి రంగుల్లాగే అడ్డంగా ఉండేవి. పై భాగంలోని ఎరుపులో ఎనిమిది తెల్ల కమలం పువ్వుల వరుస, పసుపు భాగంలో ముదురు నీలం రంగుతో దేవనాగరి లిపిలో 'వందేమాతరం' అన్న అక్షరాలు ఉండేవి. ఆకుపచ్చ భాగంలోం ఎడమ పక్క తెల్లటి సూర్యుడు, కుడిపక్క తెల్లటి అర్ధచంద్రుడు, ఒక నక్షత్రం ఉండేవి.

ఆ తరువాత 1907 ఆగష్టు 18న జర్మనీలోని స్టట్‌గార్ట్ నగరంలో జరిగిన 'అంతర్జాతీయ సోషలిస్టుల మహాసభ'కు హాజరయిన భారత ప్రతినిధి 'మేడం కామా' అక్కడ మన జాతీయ పతాకాన్ని ఎగుర వేశారు. పైన పేర్కొన్న పద్ధతిలోనే ఉన్న ఈ పతాకంలో కొన్ని చిన్న చిన్న మార్పులు జరిగాయి. ఎరుపు భాగంలో ఎనిమిది కమలాలకు బదులుగా ఒకే కమలం, ఏడు నక్షత్రాలూ పొందు పరిచారు. ఈ ఏడు నక్షత్రాలు సప్త ఋషులకు సంకేతించారు.1

తర్వాత హోమ్‌రూల్ ఉద్యమ సందర్భంగా 1917 లో లోకమాన్య బాలగంగాధరతిలక్, అనీ బిసెంట్‌లు మరికొన్ని మార్పులతో జాతీయ పతాకాన్ని ఆవిష్కరించారు. ఇందులో ఐదు ఎరుపు, నాలుగు ఆకుపచ్చ స్ట్రిప్స్ ఆల్టర్నేట్‌గా ఉంచారు. వాటి పై సప్తఋషులకు చిహ్నంగా ఏడు నక్షత్రాలు,

---

1. జాతీయ పతాకం పుట్టు పూర్వోత్తరాలు (వ్యాసం) —లక్ష్మి కమలాకర్ ఆంధ్రజ్యోతి (దినపత్రిక), 26 జనవరి 1988.

పైన ఎడమ భాగంలో యూనియన్ జాక్, కుడి భాగంలో అర్ధచంద్రుడు, ఒక నక్షత్రం పొందుపర్చారు.

1920 లో జాతీయోద్యమ రంగస్థలం పై గాంధీగారు ప్రత్యక్షమయ్యారు. 1921 వ సంవత్సరం మార్చి 31వ తేదీనాడు విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ సంఘం మహాసభల సందర్భంగా 'పింగళి వెంకయ్య' అను పేరు గల ఒక ఆంధ్ర యువకుడు (బందరు జాతీయ కళాశాల అధ్యాపకుడు) తాను తయారు చేసిన జాతీయపతాకం నమూనాను 'గాంధీజీ'కి అందజేశాడు. అందులో కేవలం రెండే రెండు రంగులున్నాయి. ఒకటి ఎరుపు, రెండవది ఆకుపచ్చ. ఇవి హిందువులకు, ముస్లిమ్‌లకు చిహ్నాలుగా అతను పొందుపర్చాడు. అయితే ఈ రెండు రంగులకు మధ్య ఇతర అన్ని జాతులకు గుర్తుగా తెలుపు రంగును గాంధీగారు సూచించారు. అలాగే ఆ తెలుపులో ప్రగతికి సూచకంగా రాట్నం ఉండాలని పంజాబ్‌లోని జలంధర్ నివాసి, వయోవృద్ధ దేశభక్తుడు లాలా హంసరాజ్ సూచించారు. అదే మువ్వన్నెల జండాగా రూపొందింది. విజయవాడ మహాసభల తరువాత జరిగిన అన్ని కాంగ్రెస్ మహాసభల్లోనూ అదే పతాకాన్ని ఆవిష్కరించసాగారు. 1923 మే 21 న నాగపూర్ లో జండా సత్యాగ్రహం ఈ జెండా నీడ కిందనే ప్రారంభమయ్యింది.

1931 లో కరాచీలో జరిగిన కాంగ్రెస్ మహాసభ, తమ సంస్థకు ఒక అధికార పతాకం నిర్ణయించడం కోసం ఏడుగురు సభ్యులున్న ఒక కమిటీని నియమించింది. ఆ కమిటీ సభ్యులు పూర్తి కాషాయరంగు పతాకం, అందులో ఎడమ వైపు మూల మట్టిరంగులో రాట్నం వుండాలని నిర్ధారించారు. అయితే కాంగ్రెస్ సభ్యులు దీనిని ఆమోదించలేదు.

అదే సంవత్సరం తర్జన భర్జనల తర్వాత కాంగ్రెస్‌కు మూడు రంగుల జండా ఉండాలని; అవి కాషాయం, తెలుపు, ఆకుపచ్చ రంగులు పై నుండి క్రిందికి అదే వరుసలో ఉండి, తెలుపురంగు మధ్యలో నీలంరంగు రాట్నం ఉండాలని నిర్ణయించారు. ఇది పింగళి వెంకయ్య రూపొందించిన పతాకాన్ని పోలి ఉన్నది. అయితే అతను సూచించిన ఎరుపురంగుకు బదులుగా కాషాయం రంగును కాంగ్రెస్ సభ్యులు ఆమోదించారు. ఈ పతాకంలోని రంగులకు ముందు చర్చించినట్లుగా జాతులతో సంబంధం లేదని నిర్ధారించారు.

కాంగ్రెస్ సంస్థకు అధికార పతాకంగా ఉన్న ఈ జెండానే కొంత మార్పు చేసి 1947 జూలై 22న 'జాతీయ జెండా'గా ఆమోదించారు. తెలుపులో రాట్నానికి బదులుగా సారనాథ్ స్థూపంలోని ధర్మ చక్రం చిహ్నాన్ని ప్రతిష్ఠించారు.

మన పతాకంలోని రంగులు - కాషాయం ధైర్యానికి, త్యాగానికీ; తెలుపు సత్యానికి, శాంతికీ; ఆకుపచ్చ నమ్మకం, మర్యాదలకు; ధర్మ చక్రం ప్రగతి, చిహ్నాలుగా పండిట్ జవాహర్లాల్ నెహ్రూ వివరించారు.

ఈ మువ్వన్నెల పతాకమే రాజ్యాంగ పరిషత్తు ఆమోదించిన స్వతంత్ర భారత జాతీయ పతాకమయింది.

ఇక మన జెండపై వచ్చిన గీతాలను చూడవలసి ఉంది.

దేశ వ్యాప్తంగా 'జాతీయ జెండా' పై అన్ని భాషల్లోనూ గీతాలు వెలువడ్డాయి. అందులో శ్రీ శ్యాంలాల్ గుప్తా ప్రసాద్ హిందీలో వ్రాసిన 'ఝుండా ఊంచా రహే హమారా' గీతం దేశమంతా మార్మోగింది.

'విజయీ విశ్వతిరంగా ప్యారా
ఝుండా ఊంచా రహే హమారా ॥ఝుండా॥

సదా శక్తి బర్సానే వాలా
ప్రేమ్ సుధా సర్సానే వాలా
వీరోంకో హర్షానే వాలా
మాతృ భూమికా తన్ మన్ సారా'[1] ॥ఝుండా॥

అంటూ సాగే గీతంలో - స్వతంత్ర పోరాటంలో వీరులకు ధైర్యాన్ని, స్థైర్యాన్ని, మనో నిబ్బరాన్ని, విజయాన్ని చేకూర్చే జాతీయజండా ప్రాశస్త్యం వివరింపబడింది. ఈ గీతం ఇచ్చిన ప్రేరణతో తెలుగులో అనేక గీతాలు వెలువడ్డాయి.

'ఎగురవే పతాకమా
ఎరుపు తెలుపు ఆకుపచ్చ

1. 'జాతీయ గీతములు' (వివిధ రచయితల సంకలనం)
పబ్లిషర్: అరవ వెంకట స్వామి, రాజమండ్రి (1938)

జాతి చిహ్నములను దెలుప
ఢిల్లి కోటపైన వేగ ॥ఎగురవే॥

నీదు ఛాయలందు జాతి
వీర రక్త మొలుక బోసె
శాత్రవులకు ఱొమ్ము నొసగి
ప్రాణములనె ధారవోసె ॥ఎగురవే॥

నీదు గౌరవమ్ము నిలుప
లజపతి తన ప్రాణమొడ్డె
జవహరు తన సౌఖ్యమొడ్డె
వీరసుతులు బలియయ్యిరి ॥ఎగురవే॥

భరత భూమి నేలు కొనగ
భారతీయు లేక వైరి
అన్యదేశ పాలకుడా :
క్విట్ క్విట్ క్విట్ యనుచు ॥ఎగురవే॥'1

అంటూ వీరగీతముల నాలపించిన జాతీయ జంటకవులు జాస్తి వెంకట నర్సయ్య, ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యం.

'జండా జండా జాతీయ జండా అదిగో కనుడీ
త్రివర్ణములు ధరియించి
స్వరాజ్యమునె మది నెంచి
స్వతంత్ర సమరము జరిపిన జండా ॥జండా॥
గాంధి మహాత్ముని తలపూ
వీర జహ్వరుని పిలుపూ
స్వరాజ్య యోధుల గెలుపూ
సమస్త విశ్వము చాటిన జండా ॥జండా॥'2

అంటూ గానం చేసిన సుప్రసిద్ధకవి శ్రీ మిక్కిలినేని భగవంతరావు. వీరిని పరిచయం చేస్తూ .... 'వీరు రచించిన బుర్రకథలు ఆంధ్ర దేశమంతటను

1. 'జయభేరి' (కీర్తనలు)
గ్రంథకర్తలు :జాస్తి వెంకటనర్సయ్య,ధూళిపాళ
వెంకట సుబ్రహ్మణ్యం.
2. 'జాతీయ గేయాలు' — మిక్కిలినేని భగవంతరావు.

సంచారము చేసి ఆంధ్రులను దేశాభిమాన తరంగములలో నోలలాడించినవి. వట్టి భావోద్రేక పూరితములే కాక వీరి రచనలన్నింటిలో రాజకీయ పరిజ్ఞానము నిచ్చు విషయ సమగ్రత కలదు' అని తమ తొలి పలుకుల్లో అయ్యదేవర కాళేశ్వరరావుగారు ప్రశంసించారు.

అలాగే నాగపూర్ జండా సత్యాగ్రహం (1923 మే1)[1] సందర్భంగా....

'జండాను చేతగొని దండి వీరులు
శాంతి దండుగ బైలుదేరండీ
భారతీయుల ప్రాణప్రదమగు ॥జండా॥

నాగపురిని నేడు నారీమణులు గూడ
శాంతి సమరము జేయుచుండ
చూచుచుండ తగదు తగదిక ॥జండా॥

జండా బట్టనిచేయి దండుగనుచు
మీరు గుండెలలో నుంచరయ్యా
ముచ్చటగ నీ మూడు రంగుల ॥జండా॥

1. 1923 మే ఒకటిన నాగపూర్‌లో 'జండా సత్యాగ్రహదళం' బయలు దేరింది. దేశంలోని అనేక ప్రాంతాలనుండి వేలాది దేశభక్తులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్ర స్త్రీ వలంటీర్లలో శ్రీమతి సుభద్రా దేవి ముందు వరుసలో నిలిచి, నడిచింది. ఆనాటి కోటీశ్వరుల్లో ఒకడైన జమునాలాల్ బజాజ్ జండా సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు ప్రభుత్వం అరెస్ట్‌చేసింది. 3000 రూపాయల జరిమానా విధించి, అది కట్టనందుకు ఆయన కారును జప్తు చేసింది. డబ్బులకోసం వేలం పాటకు పెడితే భారతీయులెవరూ దాన్ని కొనలేదు. ఇతరులను కొననివ్వలేదు. తరువాత కతియవాడకు తీసుకెళ్ళి ఎవరికో కట్టబెట్టింది. 1923 జూలై 10 న అప్పటి కాంగ్రెస్ అధ్యక్షుడు సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్ దీన్నో అఖిల భారత ఉద్యమంగా మార్చి, అనేక ప్రాంతాలకు విస్తరింపజేశాడు. 1930 ఏప్రిల్ 6న పోలీసుల లాఠీ దెబ్బలనడుమ బందరులో జెండా ప్రతిష్టాపన జరిగింది.

స్త్రీలు పురుషులనక బాలాబాలికలనక
లీలాతో మీరంత జేరి
జాతీయ జీవన నిలయమగు నీ ॥జండా॥'[1]

అంటూ జండా ప్రాశస్త్యాన్ని తెలియజేస్తూనే, జండాను చేతగొని జాతీయోద్యమంలో దండివీరులుగా బయలుదేరమనే ఉత్సాహాన్ని తెలుగు కవులు జాతిజనులకు కలిగించారు.

'ఇదియే జాతీయ జండా
జాతి కిదియే ప్రాణము మానమిదియే ॥ఇదియే॥
ఇదియే స్వరాజ్యధ్వజము-నదుము ఫిరంగీల హాజము
కదనమునకు దీనిబట్టి-కదలు శాంతి ప్రతిన బట్టి
॥ఇదియే॥'[2]

అంటూ జండా స్వరూపాన్ని కవితామయం చేసిన గురజాడ రాఘవశర్మ జాతి జీవితానికి ప్రాణంగా, మానంగా జండాను కీర్తించారు.

'ఖండాంతరముల ఖ్యాతిగాంచి-జయముగూర్చెడి జండా-ప్ర
చండమైన పరాయిపాలన-పారద్రోలే ప్రజలయండా'[3]

అంటూ దామోజీగారు వర్ణిస్తే....

'ఎగురవే వినువీధి ఎగురవే జండా
శాంతి దూతగ నేడు జాతీయ జండా
సౌఖ్య ప్రదాతగా స్వాతంత్ర్య జండా ॥ఎగురవే॥'[4]

అంటూ ప్రజాకవి సుంకర సత్యనారాయణ గానం చేశారు.

'జండా యెత్తర-జాతికి ముక్తిర
నిండగు శక్తిర-నిలుపర కీర్తిర ॥జండాయెత్తర॥
దండిగ వైరులు గుండులు ప్రేల్చిన
చెండుచు నెత్తురు కండలురాల్చిన ॥జండాయెత్తర॥
ప్రాణమొండె, యభిమాన మొండె, మన
ప్రాణములైనన్-బలియుసంగి మన ॥జండాయెత్తర॥'[5]

1. 'స్వరాజ్యతత్త్వము' (కాకినాడ ముద్రక్షరశాలలో అచ్చయిన గీతికా సంకలనం) —రచయితల పేర్లులేవు.
2,3,4,5, 'జాతీయగీతాలు'- సం: గురజాడ రాఘవశర్మ.

అంటూ గురజాడ రాఘవశర్మ, బలిదానాలకు వెనుకాడక జండాను యెత్తి జాతికి విముక్తిని కలిగించాలని సోదర భారతీయులకు చైతన్యం కలిగించిన మార్చింగ్ గీతాలను గానంచేశారు.

'పతాకోత్సవము సేయండి
స్వతంత్ర భారతజాతి చిహ్నమౌ ॥పతాకోత్సవము సేయండి॥

కొత్తవన్నెలూ-కొత్తచిన్నెలూ
కొత్తజీవమూ-కొామరొప్పంగా
నూతన భారత-జాతికి భువిలో
ఖ్యాతి విజయము-కలగాలంటూ ॥పతాకోత్సవము సేయండి'॥[1]

అంటూ 'ప్రాణము పోతేపోనీ జండా-మానము మాత్రము మంట గలపక పతాకోత్సవము చేయండని నూతనోత్సాహాన్ని ప్రజల్లో శ్రీ బసవరాజు అప్పారావు కలిగించారు.

'ఎత్తండి స్వరాజ్యజండా-జండా
నెత్తండి ధైర్యంబు నిండ-నింక
స్వరాజ్య జయమును సంధించు మనుచును
॥ఎత్తండి॥'[2]

అని శృంగవరపు శ్రీనివాసాచార్యులు కర్తవ్యబోధ చేస్తుంటే....

'అదిగో మన జయధ్వజం-అదుగదుగో భద్రగజం
నందిచునదౌ జయహిందని నవయువ సోదరవ్రజం'[3]

అని జయధ్వజ ప్రాముఖ్యతను చాటిచెప్పిన వానమామలై వరదాచార్యులు జాతికి జీవగఱ్ఱయైన జండాను గాంచి భక్తితో తలవంచండని. దాని గౌరవాన్ని నిలపడానికి ప్రాణాలను అంకితం చేయండని ప్రజానీకానికి ప్రబోధించారు.

## VIII సహాయ నిరాకరణోద్యమ గీతాలు

1918 నాటి రౌలట్ చట్టం, 1919 ఏప్రిల్ నాటి జలియన్ వాలాబాగ్ మారణహోమం భారతీయుల గుండెల్లో బ్రిటీషు వ్యతిరేకాగ్నికి ఆజ్యం పోశాయి కలకత్తా కాంగ్రెస్ (1920) అత్యవసర సమావేశంలో సత్యాగ్రహోద్యమాన్ని

1,2,3. 'జాతీయగీతాలు'.

ముమ్మరం చేసే నిర్ణయం తీసుకున్నారు. గాంధీజీ సత్యాగ్రహ నియమావళిని ప్రవేశ పెట్టారు. ప్రభుత్వంతో అన్ని సంబంధాలను తెగతెంపులు చేసుకుని సహాయ నిరాకరణ ప్రదర్శించే పిలుపు నిచ్చారు. ఇదొక దేశవ్యాప్త ఉద్యమ రూపం దాల్చింది. సహజంగానే తెలుగుకవుల కలాలను పదును బెట్టింది.

జాతీయగేయకవి సార్వభౌమ 'గరిమెళ్ళ సత్యనారాయణ'గారి 'మా కొద్దీ తెల్లదొరతనము' గీతం ఊరూరా వాడవాడ ప్రజల గొంతుల్లో ప్రతిధ్వనించింది. స్వాతంత్ర్య సమర శంఖారావంగా జానపద బాణీలో హృదయాలను తాకే రీతిలో 'గరిమెళ్ళ' ఈగీతాన్ని పాడుతుంటే ప్రజలు ఉర్రూత లూగేవారు.

'మాకొద్దీ తెల్ల దొరతనము-దేవ
మాకొద్దీ తెల్లదొరతనము
మా ప్రాణాలపై పొంచి-మానాలు హరియించె ॥మాకొద్దీ
పన్నెండు దేశాలు-పండుచున్నాగాని
పట్టెడన్నమె లోపమండి
ఉప్పు ముట్టుకుంటే దోషమండి
నోట మట్టికొట్టి పోతడండి
అయ్యో కుక్కలతో పోరాడి-కూడుతింటామండి
॥మాకొద్దీ॥1

అంటూసాగే ఈ గీతంలో....

1. 39 చరణాల ఈ గీతంలో దాదాపు 162 గేయపాదాలున్నాయి ఈ గీతాన్ని పాడిన వారినే ప్రభుత్వం జైళ్లకు పంపిందంటే, ఇక రచించిన వారి సంగతి చెప్పనవసరంలేదు. అప్పటి రాజమహేంద్రవరం కలెక్టర్ జి.టి. హెచ్. బ్రేకన్, గరిమెళ్ళపాడిన 'మాకొద్దీ తెల్ల దొరతనము' పాటవిని, 124 ఏ 'సెడిషన్' చట్టం కింద అరెస్టు చేయించి జైలుకు పంపాడు. ఏడాదిపాటు జైళ్లోఉంటూ, అక్కడ కూడా అనేక గీతాలల్లుకుని, పాడుకుని బయటికి రాగానే ప్రచారానికి పూనుకున్నారు. మళ్ళీ నిర్బంధం. రెండున్నర సంవత్సరాలజైలు శిక్ష. అన్ని శిక్షలనూ ధైర్యంగా ఎదుర్కొన్న ఈ ధీశాలి, జాతీయగీతావనతో గాంధీగారి ప్రశంసలను పొందిన ఈ నిష్కలంక దేశభక్తుడు స్వతంత్ర భారతంలో కటికదరిద్రంతో పొరుగు రాష్ట్రమైన మదరాసులో 'దేహి' అంటూ భిక్షమెత్తుకుని బతికారు. తమ 60వ యేట 1952 డిసెంబర్ 18న దేశమాత ఒడిలో దీర్ఘనిద్ర పోయారు.

వర్తకంబున కొచ్చి - పట్టణంబుల పట్టి
రాజ్య మొక్కటి అల్లినాడు
దాన్ని । రాణి కప్పగించినాడు
రాణి । పత్రమ్ము చించేసినాడు
ఈ చిత్రమిదెమన్న - శిక్షిస్తానంటాడు ॥మాకొద్దీ॥

అంటూ ఈస్టిండియా కంపెనీ వారి ప్రవేశం మొదలుకొని రాజ్యాధికారాన్ని కైవసం చేసుకోవడం, కొత్త కొత్త చట్టాలను ప్రవేశ పెట్టి ఇక్కడి సామాజిక జీవితాన్ని ఛిన్నాభిన్నం చేయడం వరకు కళ్ళకు గట్టినట్లు గరిమెళ్ళ ఈ గీతంలో చిత్రించారు

మలబారు, మోప్లా తిరుగుబాటులను అణచడానికి బ్రిటిష్ ప్రభుత్వం అనుసరించిన ఘోర విధానాలను వర్ణిస్తూ....

నూరు మంది మలబారు వాసులను
కూరి నాడొక పెట్టెలోన
నోట నీరు పోయడు, దేవునాన
గాలి దూరనీయడించుకైన
వాడి దారుణత్వమెట్లు
తరిమి వైతువా దేవ ॥మా కొద్దీ॥

అంటూ మలబారు ఖైదీలను రైలు పెట్టెల్లో ఊపిరాడకుండా నిర్బంధించి, వారి మరణానికి కారణమైన దురాగతాన్ని వివరించారు.

చీరాల - పేరాల సత్యాగ్రహాన్ని వర్ణిస్తూ....

మా చీరాలను యిపుడు చేరినాడు
చూచి సిగ్గును పొందబోడోయి
ఇంక బీరాలు పలుకుతాడోయి
మాదు సారము గ్రహింపడోయి
వాడి దూరాలోచన మెల్ల - ధూళిలో కలిసింద ॥మా కొద్దీ॥

అని తమ ఆగ్రహాన్ని ప్రదర్శించారు. అలాగే తెల్లవారి సేవలు చేస్తూ, తమ పబ్బం గడుపుకుంటున్న దేశీయుల దౌర్భాగ్యాన్ని వివరిస్తూ ....

తెల్ల దొరల సేవవల్ల బ్రదుకుట - పెద్ద
నల్ల మచ్చని యెంచరోయి
జాతి కల్లా తప్పని యెంచరోయి
భూమి తల్లి ఏడ్పులు వినవోయి
వారి యుల్లి మెల్ల - సన్నికల్లులై పోయాయి ॥మాకొద్దీ॥

అని హెచ్చరించిన గరిమెళ్ళ - దేశ భక్తుల్ని దోషులుగా, మోస గాండ్రుగా, దొంగలుగా, శాంతి నాశకులుగా చిత్రిస్తున్న బ్రిటీష్ శాసనాలను శపిస్తూ.......

వాడి శాసనాలు మాడిపోను
వాడి గోడియె - మా కొద్దు తండ్రి
దొరల బాధలు మాకు
తొలగించుమో తండ్రి ॥మా కొద్దీ॥

అంటూ వర్ణించారు. కుల, మత భేదాలు కాల్చివేయండనీ, అంటు దోషము మానండనీ, ప్రపంచంలో శాంతి దివ్వెల్ని మన దేశం వెలిగించాలని కూడా తన గేయంలో ఆశించిన శాంతి కాముకుడు గరిమెళ్ళ.

గరిమెళ్ళ గారి "స్వరాజ్యగీతములు" గేయ సంపుటి (1921) లోని 'మేలుకొలుపు', 'మాతృ స్తవము' 'పాంచాలము' 'స్వరాజ్యము' వంటి గీతాలన్నీ సహాయ నిరాకరణోద్యమ సంజనితాలే.

ఆంగ్లేయ విద్యను నిరసిస్తూ....

'పడదన్ను మాంగ్ల బడిలో నేర్పెడి పాపపు విద్యయ దెల్ల
ఆ పాపపు విద్యయదెల్ల - నీ పండుగునాడో చెల్ల
మన భారతి పుట్టును మల్ల - సురవరులు మొల్ల -
సుమములు జల్ల ॥పడ॥

అని స్పష్ట పరిచిన గరిమెళ్ళ, బ్రిటీష్ న్యాయస్థానాలను నిరసిస్తూ....

మతి పోయెనుర నీకు - ఇతర వృత్తిని మాని సతము
కోటున్‌ల - దిరుగు తావు అథః పతము నుంతయు
గాను కోవు '॥మతి॥'[1]

అని హెచ్చరించారు.

1. 'స్వరాజ్య గీతములు' —— గరిమెళ్ళ సత్యనారాయణ గారిచే విరచితము.

1921 లోనే వెలువడిన తురిమెళ్ళ వెంకట సుబ్బారావుగారి 'స్వరాజ్య భజనకీర్తనలు,' చెలికువాడ వేంకట రామయ్య-దామోజీపురపు వేంకట నరసింహారావుగారి 'జాతీయ గీతములు'; దామోజీపురపు వేంకట నరసింహారావు గారు వ్రాసిన 'కాకినాడ కాంగ్రెస్ జాతీయ గీతములు' (1923), కవికొండల వెంకట రావుగారి 'మాతృదేశ సంకీర్తనము' (1924), బసవరాజు అప్పారావుగారి గీతాలు సహాయ నిరాకరణోద్యమ కాలంలో ప్రజల ఆవేశానికి ప్రతీకలయ్యాయి.

ఆంధ్ర ప్రాంతంలో సహాయనిరాకరణోద్యమ పరాకాష్ట చీరాల-పేరాల వనవాసము ఈ ఉద్యమాన్ని ఇతివృత్తంగా తీసుకుని 1922 లో పిశుపాటి నారాయణ శాస్త్రిగారు 'చీరాల పేరాల వనవాసము' అనే పద్యకావ్యాన్ని వెలువ రించారు. ఈ కావ్యానికి కవిరాసిన ముందు మాటలో...

'నేనీ చిన్న పొత్తమును వ్రాయుటకు నీ పురజన సందర్శనమునం గలిగిన ప్రబలాశ్చర్య సంతోష సంభ్రమోద్రేకమే ప్రధాన కారణము. దీని పేరు చేత రెండూళ్ళు పరిగణింప బడినను పద్యముల యందెక్కువ చోట్ల నట్లుంచ వీలులేక యొక్కదానినే గ్రహించితిని. చీరాల-పేరాల యను నీ రెండు పదంబులకు గురులఘుల భేదంబు లేదుగాన చదువుకొను నప్పుడొకటియైన తర్వాత నింకొకటి రెంటిని మార్చి యుపయోగింప వలయును. దీనిని చదివిన వారు వీరివలె కష్టములకోర్చి దేశ సేవాపరాయణులై యశంబు గాంతురని నమ్ముచున్నాను' అని ఆశించారు.[1]

గీతాలు కాకపోయినా నోళ్ళ కెక్కిన పద్యాలు కాబట్టి వాటిని పేర్కొనక తప్పదు.

'కష్టమనక తాటాకు పాకాలలోన
జెట్టు చేమలు గనరాని వట్టి యిసుము
నేలపై గాపురము సేయ నేర్చె నౌర
ధీరమతి తోడ జీరాల పౌరజనము'
'ఎన్ని కడగండ్లు వెట్టిన నన్నిటికిని
నుస్సురనకయె సైచుచు నున్నవారు
తక్కొరులు మీకు సాటిగా దగినవారె
భవ్య మతులార! చీరాల పౌరులారా!'

అంటూ చీరాల పేరాల వనవాసాన్ని పద్యమయం చేశారు నారాయణ శాస్త్రి గారు.

---

1. 'చీరాల పేరాల వనవాసము' (పిశుపాటి నారాయణ శాస్త్రి విరచితము) (పద్య కావ్యము) నకు కవి వ్రాసినముందుమాట.

ఈ చీరాల - పేరాల ఉద్యమానికీ, ఉద్యమ సైన్యమైన రామదండుకు సమర్థవంతమైన నాయకత్వం వహించిన ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్యను తెలుగు నేలపై సుప్రసిద్ధులైన చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి, జాషువా, బసవరాజు అప్పారావు, తుమ్మల సీతారామమూర్తి వంటి అనేకమంది సాహితీ వేత్తలు ప్రస్తుతించారు.

## (ఆ) ఉప్పు సత్యాగ్రహం

1930 సంవత్సరంలో 'ఉప్పు సత్యాగ్రహం' దేశవ్యాప్తంగా ఉద్యమ జ్వాలల్ని రగిలిస్తున్న తరుణంలో త్రిపురనేని రామస్వామి చౌదరి గారు 'సూతాశ్రమ గీతాలు' ప్రకటించారు. 1930 సం॥లోనే ఉన్నవ లక్ష్మీనారాయణ గారి అధ్యక్షతన సత్యాగ్రహుల సమావేశం జరుగుతుంటే, త్రిపురనేని రామస్వామి చౌదరి గారు ఉద్యమానికి విరాళాలు అందజేయడంతో బాటు సత్యాగ్రహుల నుదుట కుంకుమ బెట్టి...

'వీరగంధము దెచ్చినారము
వీరుడెవ్వడొ దెల్పుడీ
పూసి పోదుము, మెడను వైతుము
పూలదండలు భక్తితో'1

అంటూ కవితానీరాజనాలందించారు.

'పగవారు మనపైకి వచ్చిపడ్డారు
కోయంచు మన యూళ్ళు కొల్లగొట్టారు
గూటిలో పిట్టల్ని కూల్చివైచారు
పొలములో పసిలేళ్ళ పొడిచివైచారు
మరచిపోవద్దోయ్ మరచిపోవద్దోయ్
మనజాతి యగచాట్లు మరచిపోవద్దోయ్'2

అంటూ ఉద్యమకారుల్ని హెచ్చరించారు.

ఈ సంపుటిలోనే 'కవిరాజు' త్రిపురనేని పేరు వినగానే గుర్తొచ్చే "మందేరా" గీతం కూడా కనబడుతోంది.

---

1. జాతీయోద్యమకాలంలోనూ, అనంతర కాలంలోనూ విశేష ప్రాచుర్యాన్ని సంపాదించిన గీతమిది. తరువాతి కాలంలో ఈ గీతానికి అనేక అనుసరణలు వెలువడ్డాయి. బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి వంటి రచయితలు ఈ గీతం పల్లవితో ఇతరగీతాలను రచించారు.
2. సూతాశ్రమ గీతాలు (1930)
— 'కవిరాజు' త్రిపురనేని రామస్వామి చౌదరి, సూతాశ్రమం, తెనాలి.

స్వేచ్ఛ చచ్చి చిందులాడే - పిచ్చి మానండోయ్
మీరు జైళ్ళు నింపండోయ్'1

అంటూనే—

'దేశసేవకు మీరు ధీరులై నడవండి
దేశస్వాతంత్ర్యాన్ని తెస్తామనండి
దాసోహమని గాంధి దారినే నడువండి
వాసిగ భారత - ప్రతిభనే నిలుపండి'2
'శాంతిని యేవేళ-స్వాంతాల విడకండి
సంతోషముగ అన్ని-త్యజియించి సాగండి'

అంటూ పిలుపునిచ్చారు దామరాజు పుండరీకాక్షుడు.

'భారతదేశపు దాస్యము బాపగ
పయనమాయె మోహనగాంధి
చావో జయమో ! తేలందే యీ
జన్మకు మళ్ళీ కనబడడండోయ్
భార్యల విడచీ - భర్తలు రండోయ్
భర్తల విడచీ - భార్యలు రండోయ్
తల్లుల విడచీ - పిల్లలు రండోయ్
పిల్లల విడచీ - తల్లులు రండోయ్'3

అంటూ ప్రజల్ని సత్యాగ్రహ సమరోన్ముఖుల్ని గావించే గీతాలను బసవరాజు అప్పారావు గానం చేశారు.

సహాయ నిరాకరణోద్యమానికి చక్కని ఉదహారణగా నిలిచే గీతం 'సహాయ నిరాకరణము' శీర్షికన కొండపల్లి జగన్నాథదాసు వ్రాశారు.

'నిరాకరణమను మిఠాయి యిదుగో బిరాన రుచి చూడండీ
వేరేపోయి కొనబనిలేదిక - చీరాలపురిలో కొల్లగ దొరకును
॥నిరాకరణ॥

సత్యాగ్రహమను గోధుమ పిండిలో - సత్యసారమను ఆజ్యము పోసి
సాత్వికమను పెదభాండములోపల - సత్యాగ్రహులు పాకము బట్టిన
॥నిరాకరణ॥

---

1,2. 'జాతీయ గీతాలు'
3. 'జాతీయ గీతాలు' - సం. గురజాడ రాఘవశర్మ

శాంతంబనియెడు శనగపిండిలో - శౌచంబనియెడు జలమును కలిపి
స్వధర్మ మనియెడు పంచదారతో - స్వార్థత్యాగులు పాకము బట్టిన
॥నిరాకరణ॥

మానుషమను బియ్యపు పిండిలో - జ్ఞానంబనియెడు తేనెనుకలిపి
ముని గాంధీయను చెఱకు బెల్లముతో - మున్సిపాలిటీ పాకము బట్టిన
॥నిరాకరణ॥

దేశభక్తియను గోధుమనూకలో - దేశముక్తియను వెన్నను గల్పి
దేశభక్తి జగమంత నిండగ - సత్యాగ్రహులు - తయారుచేసెడి
॥నిరాకరణ॥[1]

చీరాల సత్యాగ్రహానికి దర్పణం పట్టే ఈ గీతం సత్యాగ్రహ లక్షణా లను సంక్షిప్తంగా సాహిత్యమయం చేసింది.

ఉప్పు సత్యాగ్రహ గీతాల్లో మకుటాయమానంగా నిలిచే గీతాలు చూడండి...

'ఉప్పుచేశామిదిగో చూడండి! గాంధీమహాత్ముని
ఉప్పు చేశామిదిగో చూడండి॥
ఉప్పు చేశామిదిగో దేవతలుప్పరంబుననుండి హర్షము
లుప్పతిల్లగ పుష్పవర్షము గుప్పుచును ఆశీర్వదింపగ ॥ఉప్పు॥'[2]
'స్వరాజ్య లవణము తయారుచేయరె! సహోదరులారా!
నిరాకరణ మంత్ర రాజగురుడగు - నరోత్తముడగు గాంధీ
యోగి చెప్పిన ॥స్వరాజ్య॥'
'ఉప్పు కొనండయ్యా! స్వరాజ్యపు - ఉప్పు కొనండయ్యా
ఉప్పు చట్టమును ధిక్కరించితే - తప్పక మనకు స్వరాజ్యము
వచ్చు ॥ఉప్పు॥'[3]

వంటి గీతాలు వెలువడ్డాయి. లభ్యమయిన గీతాలు ఇవి కాగా ఎన్నో... ఇంకెన్నో గీతాలు అచ్చుకు నోచుకోకపోయినా అచ్చమైన ప్రజాగీతాలై ప్రజం గొంతుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

ఇలా దేశమాతను, ఆంధ్రమాతను, జాతీయ నాయకులను, ఆంధ్ర నాయ కులను స్తుతించిన తెలుగు కవులు మేల్కొలుపు గీతాలు గానం చేశారు. పంజాబ్ దురంతాలపై ఆగ్రహాన్ని ప్రకటించారు. జాతీయ జండాను స్తుతిస్తూ దాని వైశిష్ట్యాని వివరించారు. సహాయ నిరాకరణోద్యమాన్ని సాహిత్యంలో పొందు

1. 'స్వరాజ్య భజన కీర్తనలు' (సంకలనం)
2,3. 'జాతీయ గీతాలు' - సం: గురజాడ రాఘవశర్మ.

పరిచారు. ఉప్పు పాటలతో ఉప్పు సత్యాగ్రహానికి ఊపు నిచ్చారు. గాంధీజీ చూపిన నిర్మాణ కార్యక్రమాల్లో చాలామంది కవులు స్వయంగా పాల్గొంటూ, వాటి ఆశయాలను పాటల్లో ప్రచారం చేశారు.

## IX జాతీయోద్యమంలో నిర్మాణ కార్యక్రమాలు

జాతీయోద్యమంలోకి అశేష ప్రజానీకాన్ని సమీకరించడానికి గాంధీజీ కొన్ని నిర్మాణ కార్యక్రమాలను ప్రారంభించారు. వాటిలో అస్పృశ్యతా నిరసన, మద్యపాన నిషేధం, రాట్నం తిప్పడం, ఖద్దరు ధారణ, విదేశీవస్తు బహిష్కరణ వంటివి ముఖ్యమైనవి. ఈ కార్యక్రమాల ద్వారా అప్పటి విద్యావంతుల పరిమిత ఉద్యమాన్ని విస్తృత ప్రజోద్యమంగా రూపొందించిన ఘనత గాంధీగారికే దక్కుతుంది.

## (అ) హరిజన సమస్య (అస్పృశ్యతా నిరసన)

భారత జాతి జీవనాన్ని నిర్వీర్యం చేసిన జాడ్యాల్లో 'అస్పృశ్యత' ఒకటి. శరీర కష్టంపై ఆధారపడిన శ్రమ జీవుల్లో ఒక వర్గాన్ని అస్పృశ్యులుగా వ్యవహరిస్తూ, జాతీయ స్రవంతి నుండి దూరంగా నెడుతున్న తరతరాల అన్యాయాన్ని నిరసించడం ఈ శతాబ్దారంభం నుండే మొదలయింది. పరాయి పాలనపై పోరాటానికి జాతీయ సమైక్యత అనివార్యమయింది. దీనిలో భాగంగానే 'అస్పృశ్యత'పై పోరాటం జాతీయోద్యమంలో ఒక ప్రధానాంశమయింది.

జాతీయ రంగస్థలంపై గాంధీగారు నిలదొక్కుకోడానికి దాదాపు ఒక దశాబ్దానికి ముందే (1909 లో) 'ఆంధ్రభారతి' పత్రికలో 'మాలవాండ్రపాట' అచ్చయిన విషయం వెనక పేర్కొనబడింది. ఆ తరువాత ఆరేళ్ళకు (1915 లో) మంగిపూడి వేంకటశర్మ గారి 'నిరుద్ధ భారతము' (కావ్యం) వెలువడింది.

'జాతికి వెన్నెముక యనందగు నంత్య జాతులను సంఘమునకు దూరము చేసి, మనకు గానివారినిగ జేసికొనుట కన్న యాత్మహత్య వేరొండు లేదు' అని హెచ్చరించిన మంగిపూడి......

'పంచములార! యంతరిత భావ్యగుణోత్కరులార! గర్భితో
దంచిత శక్తులార! యసమర్థులె మీరలు, గొర్రెమందలో
వంచితమై చరించు నల వ్యాఘ్ర కిశోరముకీతి బూర్తిగా
వంచితులైలి రాత్మబల మైఖరినెంచుడు, మేల్కొనుండికన్'

అంటూ వెన్నుతడుతూ జాగృతమొనర్చారు.

19.6లో అయ్యదేవర కాళేశ్వరరావు, త్రిపురనేని రామస్వామి చౌదరి గార్లు హరిజనోద్యమం ప్రారంభించారు. అదే సంవత్సరం త్రిపురనేని అధ్యక్షులుగా, కాళేశ్వరరావు కన్వీనర్‌గా బెజవాడలో హరిజనోద్యమం మొద

అయింది. అప్పటికే (1916 నాటికే) కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి అక్క గారైన శ్రీమతి బండారు లక్ష్మాంబ హరిజన బాలలను పెంచి పోషించింది.[1]

'మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండె కులములు
మంచి యన్నది మాలయైతే
మాలనే యగుదున్'

అంటున్న గురజాడ అప్పారావు పంతులుగారు స్వభావాన్ని బట్టి ఉచ్ఛ నీచములుంటాయనీ, జన్మతః ఉండవనీ స్పష్టం చేశారు

'అంటరాని వారెవరు? మా
వెంటరాని వారు'[2]

అంటూ ప్రగతి పథంలో, మానవత్వపు దారుల్లో నడవనివారే నిజమైన అస్పృశ్యులని మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి భావించారు

అస్పృశ్యులుగా పరిగణింపబడుతున్న అభాగ్యుల ఆక్రందనలకు నిర్దిష్ట మైన అక్షర రూపం సిద్ధింపజేసిన అక్షర శిల్పి గుఱ్ఱం జాషువా. పీడితప్రజల కన్నీటి గాథలకు కావ్యత్వం కల్పించిన మహానుభావుడాయన. ఆయన కలం సృజించిన 'గబ్బిలము', 'అనాథ' వంటి కావ్యాల్లో...

'ధర్మువునకు గలుగునే కుల వివక్షతయు'

అని సూటిగా ప్రశ్నించడం కనిపిస్తుంది కారుణ్య భావాలతో ఆయన రచనలు హృదయాలను కదిలిస్తాయి. ఈ విషయంలో 'జాషువా' అస్పృశ్యత మూలాల్లోకి దిగి ప్రశ్నించిన ప్రతిఘటన చైతన్యానికి ప్రతీకగా నిలుస్తాడు. అయితే ఆయన రాసినవన్నీ పద్యకావ్యాలు కావటంవల్ల ఇక్కడ వివరించడం లేదు.

వెలగల సుబ్బారెడ్డిగారు తమ 'ఆదిమాంధ్ర' అనే కావ్యంలో...

'ముందు మీ సంఘమందుండె మూర్ఖ విడువ
విద్యకై శ్రద్ధబూనుడు వేగ మీర
నదియె మిమ్ముద్ధరించును నరయ ధరణి
వేరు సాధన మికలేదు వెదకి జూడ'

అంటూ స్వశక్తిపై ఆధారపడి, విద్యార్జనకై శ్రద్ధజూపి, మిమ్మల్ని మీరే ఉద్ధరించుకొండని ఉద్బోధించారు.

---

1. ముక్కామల నాగభూషణంగారితో ఇంటర్వ్యూ (18-10-1988).
2. తరువాతి కాలంలో ఈ పల్లవితో జె. బాపురెడ్డి రాసిన గీతం విశేష ప్రచారాన్ని పొందింది.

1930లో జాలా రంగస్వామి 'అంటరాని వారెవరు?' శీర్షికన ఒక సుదీర్ఘ గేయ కావ్యాన్ని వెలయించారు.[1]

ఈ కావ్యానికి రచయిత రాసిన 'తొలి పలుకులు' హృదయాన్ని కదిలిస్తాయి.

'ఈ చిన్న పుస్తకమును అగ్రజాతి సోదరుల హస్తములలో కడముట్ట పఠింతురన్న యాశతో సమర్పించు కొనుచున్నాను. మాలో లోపములు లేకపోలేదు. వాటిని సవరించుటలో మేమశ్రద్ధ వహించుటలేదని మనవి చేయుచున్నాను. మా జాతిని సంస్కరించి, చేయూత యొసగి యుద్ధరించు భారము మీదని మాత్రము మనవి. మాలో జేరుడని మహమ్మదీయులు, మాలో జేరుడని క్రైస్తవులు మమ్ము తొందరపెట్టి తమలో కలుపుకొనుచున్నారు. "స్వధర్మే నిధనం శ్రేయం" అను గీతా వాక్యమును మేము విస్మరింప లేదు. కాని మానవ ధర్మమగు ఆశ మమ్ము పరమతముల కీడ్చుచున్నది. దేశములో ఐక్యత అత్యావసరమగు సమయమింత కన్న వేరొకటుండదని మీకు నేను చెప్పనక్కరలేదు. మా కష్టముల నున్నవి యున్నట్లుగానే చెప్పుకొంటిని. ఆలించి పాలించు భారము మీది.'[2]

ఈ మాటల్లో అస్పృశ్యుల ఆవేదన, మతం మార్పిడుల సమస్య, దేశ సమైక్యతపై ఆసక్తి వంటి అనేకాంశాలను జాలా రంగస్వామి ప్రస్తావించారు.

'బొబ్బిలిపాట' వరుసలో సాగే ఈ గేయకావ్యంలో...

'రామరామ శ్రీ రామారామ రామా రఘురామ
అలసింపక మేలుకొనండి ఆంధ్రులు మీరైతే
జానిసలై ఈ దేశములోన బ్రతికెదరెన్నాళ్ళు
పరా పాలనచే యీ ప్రజలు పాడైయున్నారు'
అంటూ ప్రారంభమై...

---

1. దీని ముఖపత్రంపై 'అంటరాదనుట - అమానుషము' అనే కొటేషన్‌తో బాటు భూగోళం (గ్లోబ్) పై కూచున్న దేశమాత చేతిలో ఒక త్రాసు, ఆమె శిరస్సు సమీపాన 'అరుంధతి' నక్షత్రం, త్రాసుకింద 'JUSTICE' అనీ, త్రాసుపక్కన 'సమానత్వమే స్వరాజ్యము' అని రాయబడి ఉంది. దేశమాత పాదాల దగ్గర చిక్కి శల్యమైన తండ్రీ కొడుకుల అస్థిపంజరాలున్నాయి. అంటరానితనాన్ని నిరసిస్తూ వేసిన భావస్ఫోరకమైన ముఖచిత్రమిది.
2. 'అంటరాని వారెవరు?' కావ్యానికి 'తొలి పలుకులు'
— జాలా రంగస్వామి (13-6-1930), రాజమండ్రి.

'దీనుల వంక చూచుచున్నది దేశమాత సుంది
అంటు దోషమువల్ల అడలెడు ఆది భారతండి'
'మన దేశస్థులు మాల మాదిగలు మరచిపోయినారా
అయ్యయ్యో యిది ఘోరముకాదా అన్యాయముకాదా
ఏడు కోట్ల మా మాలల దండు ఏమైపోయాము
కొంచెమైన మీరాలోచించరు మంచితనముతోను'

అంటూ మాల మాదిగలుగా పిలువబడుతున్న ఏడు కోట్ల ప్రజలు ఈ నేల తల్లి బిడ్డలేనని, వీరిని విస్మరించడం సముచితం కాదనే విషయాన్ని మంచి మనసుతో ఆలోచించమని ఈ కవి అభ్యర్థిస్తున్నారు. అలాగే...

'వృత్తులు కొన్ని కల్పన జేసి వొప్పగించినారు
సేవకులంచును పేర్లను బెట్టి సాగదీసినారు
వర్ణ భేదములు పెట్టి మమ్ముల పంచివేసినారు
జానిస వృత్తుల చేత మమ్ముల బాధలు పెట్టేరు'

అంటూ కులాల పుట్టుకకు కారణమైన శ్రమ విభజనను, తద్వార ఘనీభవించిన వర్ణ భేదములను స్పష్టంగా వివరించారు.

'ఏడుకోట్ల దండొక్క భాగమై ఎడగలుండిపోతే
బలమెక్కడిదీ హిందూజాతికి పౌరుషమెక్కడిది
హిందూదేశము లోపల జనులు ఏకము కాకుండె
సంపాదింపగ జన్మహక్కు మరి శక్యము కాదండి'

అంటూ జన్మహక్కు అయిన స్వరాజ్యాన్ని సాధించడానికి సకల వర్ణాలూ సమైక్యం కావాలన్న సద్భావాన్ని శ్రీ జాలా రంగస్వామి చాటి చెప్పారు.

జాతీయోద్యమానికి ఊపిరులూదిన అనేక ప్రసిద్ధ గీతాలను రాసిన గరిమెళ్ళ సత్యనారాయణ 1933లో 'హరిజనుల పాటలు' వెలువరించారు [97]

ఈ పుస్తకానికి ముందుమాట రాసిన శ్రీ వి. వెంకటసుబ్బయ్య ఇలా అభిప్రాయపడ్డారు...

'Mahatma Gandhi's concentration on the removal of untouchability from Hindu society has stirred the whole Country in a mannner that nothing else could have done. He has awakened the soul of the

97 'హరిజనుల పాటలు' — గరిమెళ్ళ సత్యనారాయణ, మైలాపూరు, 18-2-1933.

Harijans no less than that of the other Hindhus. Mr. Garimella Satyanarayana has given very apt and faithfull expression to the feelings and longings of the Harijans in the small bunch of songs that he is now publishing. I trust that some if not all of them will be learnt and sung with affection in the hamlets of the Telugu districts. I commend them with great pleasure to pracharaks and other workers in the cause of Harijans.'

— **V. Venkata Subbaiah**, Servents of India Society, Royapetah, Madras. 18-2-1938.

ఆలాగే ఈ గీతికా సంపుటికి రచయిత గరిమెళ్ళ సత్యనారాయణ రాసిన 'మున్నుడి' కూడా పేర్కొనదగిందే.

'శ్రీ గాంధీ మహాత్ముని ఉపవాసప్రారంభము నుండి అస్పృశ్యతా నివారణోద్యమమున కపూర్వత్వరితగమన మలవడినది. సంస్కారులకు చులుకన తనము కలిగినది. సనాతనులకు పట్టుదల కొంచము విగిసినట్లు కనబడినను, ఏ తత్సమస్యను గూర్చి తీక్షణమగు ఆలోచనయు, కొంతవరకు స్వయం కృతాపరాధ జ్ఞానమును శాస్త్రసిద్ధమైనంతవర కాయెను. సంస్కరణము యొక్క సత్వరావశ్యకతయు స్ఫురించుచున్నవి. కొందఱడ్డు వచ్చినను సర్వసమ్మతము లగు మార్పులు జరుగును గాని తప్పవు. అట్టి శుభ సమయమున సాహిత్యలక్ష్మి సర్వాలంకార శోభితయై కథలు, కల్పనలు, వ్యాసములు, హరికథలు, నాటకములు, గీతములు మొదలగు కావ్యముల రూపమున మానవ రసజ్ఞులయందు నటనములు సల్పగడంగుట ఎంతయు సహజము. అట్టి సాహిత్యములో నిది యొకటి

మద్రాసు నగర హరిజన సేవా సంఘ కార్యదర్శి శ్రీయుత వి. వెంకట సుబ్బయ్యగారు దీనికభిమానపూర్వకముగా మున్నుడి వ్రాయుటయే కాక, పాటలు బహుజనగ్రాహ్యములగునట్లు పెక్కు సవరణలు సూచించి దిద్దిపెట్టినారు. ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవా సంఘాధ్యక్షులు శ్రీయుత దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు వీనిని ప్రచురించుటకు పురిగొల్పియు, ప్రకటించుట కంగీకరించియు మిక్కిలి ప్రోత్సాహము నొసగినారు. వారిరువురకును కృతజ్ఞతా సూచక వందనము లర్పించుచున్నాను.'

గరిమెళ్ళ పాటలకు వెంకటసుబ్బయ్యగారి ముందుమాట ద్వారా, రచయిత రాసుకున్న మున్నుడి ద్వారా ఆనాటి సామాజిక స్థితిగతులు స్పష్టమౌతున్నాయి గాంధీజీ ప్రభావం వల్ల అస్పృశ్యతా నివారణోద్యమానికి లభిస్తున్న ఊపు కూడా తెలియవస్తున్నది.

1921 నాటి గరిమెళ్ళ 'స్వరాజ్యగీతములు' గీతికా సంపుటిలోనూ, 1933 నాటి 'హరిజనుల పాటలు' సంపుటిలోనూ పంచముల సమస్యకు ఈ కవి పరిష్కార మార్గాలను అన్వేషించడం గమనార్హం. స్వరాజ్య సమస్యలో భాగంగానే అస్పృశ్యత సమస్యను పట్టించుకుని ఆలోచనలను రేకెత్తించే గీతాలను గరిమెళ్ళ రచించారు

'పంచములు' శీర్షికన గరిమెళ్ళ రాసిన గీతంలో......

'అన్నలారా వినండి - మన యఘమొక్కటి కనుగొనుడి
మన చిన్ని తమ్ముళ్లను జేరదీసి దయ - చేసి మహాదరమిడుడి
॥అన్న॥'

పల్లవితో ప్రారంభించి...

'అంటరాదనుచు నాడరాదనుచు - నతి దూరమునకు
ద్రోసి ఆ చండిబిడ్డలకు నార్యఋషీంద్రులు శాస్త్ర రహస్యము
మూసి ॥అన్న॥'
పంచమహాపాతకముల సమమురా - పంచములనుచు
వంచించి పంచభాగముల నొకటగు హైందవ-ప్రజలను దూషణ
సేత ॥అన్న॥
సర్వ సమానత బాడుకొల్పి యా - జనముతోఁ గల
యండి ఆ సర్వేశుడు స్వేచ్ఛా వర్షంబును - సరగ జల్లు మనపైని
॥అన్న॥[1]

అంటూ పంచములను వంచించుట పంచమహాపాతకాలతో సమానమని హెచ్చరించిన గరిమెళ్ళ...కుష్ఠురోగులను కూడా కలుపుకుపోయే సంఘం, పంచములను భ్రష్టులంటూ న్యూనపరచడం బాధాకరమన్నారు.

అలాగే గరిమెళ్ళగారి మరోగీతంలో...

'ఎవరెన్ని చెప్పిన-హిందూదేశవాసు-లేక
సోదరులేనండి!

---

1. 'స్వరాజ్యగీతములు' — గరిమెళ్ళ సత్యనారాయణ, ఇండియా యేజంసీ బీరో, మదరాసు.

అంటుదోషము మాకు లేదండి
పాపమంటూ చాటుదాము రండి
ఈ కుంటి వాదనలు గూటిలో పెట్టండి'1

అంటూ కుంటి సాకులను కట్టిపెట్టి భారతీయులంతా ఒక్కటనే విశాల దృష్టిని పెంపొందించుకోవలసిన అవసరాన్ని నొక్కి చెప్పారు.

'హరిజన కవీంద్ర' వైద్యవిద్వాన్ కుసుమధర్మన్నకవి, రాజమండ్రి 'నల్ల దొరతనము' కావ్యాన్ని వెలువరించారు. 1933 డిసెంబర్ మాసంలో జరిగిన 'ఆంధ్రరాష్ట్రీయ హరిజన దినోత్సవ' కానుకగా 'తూర్పుగోదావరిజిల్లా అస్పృశ్యతా నివారణ సంఘం' ప్రచురణగా ఇది వెలువడింది.

ఆంగ్లేయుల ప్రవేశం, పాశ్చాత్య విద్యా సంపర్కం, నాగరికతా వికసనం వంటి అనేక కారణాలవల్ల వృత్తులపై ఆధారపడిన వర్ణవ్యవస్థ ఛిన్నాభిన్నమయ్యింది. వర్ణాశ్రమ ధర్మాలను వదిలినవారికి వర్ణమెలా వస్తుందనే భావాన్ని ధర్మన్న కవి వర్ణిస్తూ...

'వర్ణాశ్రమ ధర్మాము। వదలి తిరుగుటచేత
వచ్చేను వెలిమీ కంటారు
వేద పఠన బ్రాహ్మణులు। విడిచేరు
క్షాత్రధర్మము। క్షత్రియులు మానేరు
కులవృత్తి కోమట్లు మరచేరు
శూద్రవరులు సేద్యమును పీడేరు
మమ్ములొంగదీసి। పంగనామాలు బెట్టేరు'2

అని నిలదీశారు. అలాగే వెలివేయబడిన బడుగు జీవుల బతుకులను, గతి లేని అతుకులను వివరిస్తూ...

'ఊరి వెలుపల నున్న। పూరి గుడిసెలె గాని
బారి కొంపలు మాకులేవు
గాలి వెలుగు సుంత। తొలంగిరాదు
సారమైన। కూర, కూడు లేదు
కోరి కట్ట। కోక, పంచి లేదు
నల్లపూస। పుస్తె। నగలు లేవు
దున్ని తినగ పొలము। దొడ్డి లేదు
మా దారిద్రియము జూడ। దయపుట్టగారాదు'

1. 'హరిజనుల పాటలు' - గరిమెళ్ళ సత్యనారాయణ.
1. 'నల్లదొరతనము' - 'హరిజనకవీంద్ర' కుసుమ ధర్మన్నకవి
దుర్గా కళామందిరము, బెజవాడ, 16-12-1933.

అంటూ గాలీ వెలుతురు సోకని పూరిగుడిసెల జీవన స్థితిగతులను; తిన డానికి తిండి, కట్టడానికి గుడ్డ కూడా కరువైన కష్టజీవుల వెతలను ధర్మన్నకవి తమ కవిత్వంలో ప్రతిబింబింపజేశారు.

1935 లో హరిజన సంఘసేవకులు నక్కా చినవెంకయ్య 'హరిజన కీర్తనలు' వెలువరించారు. అంటు దోషము మానుసుని సాటి దేశీయులను అభ్యర్థించారు.

'అంటు దోషము మానరేల
దాని విడువరాదని మీరు పంతా
లాడగనేల - అంటు దోషము మానరేల ॥అం॥
పగలనక రేయనక పాటుబడ్డను గాని పట్టాడన్నము
గుడ్డసున్న, కడు
పు మాడిన గంజి పొయ్యారు బాధపడుచుంటె పలక
రించారు, మాచే
పనులెన్నో చేయించుతారు, దేవ హింశా పెట్టి మమ్ము
హీనులుగా చూచేరు. ॥అం॥'[1]

అంటూ పగలనక, రేయనక కష్టపడుతున్నప్పటికీ కడుపులు నిండని కష్ట జీవులను హీనులుగా చూసి, హింసించడం మానివేయమని; పంతాలకు పోకుండా అంటు పట్టింపులు పాతిపెట్టమని కవి ప్రబోధించారు.

చదలువాడ కోటి నరసింహము ముప్పదిరెండు శీర్షికలతో మంజరీ ద్విపద నడకలో 'రాష్ట్రగీత' అను కావ్యాన్ని వెలువరించారు. యేటుకూరి వెంకటనర్సయ్యగారు గ్రంథానికి వ్రాసిన 'మున్నుడి'లో ప్రకటించినట్లు... 'ప్రతి మకుటము ప్రకృతావస్థనుద్దీపింపజేసి వర్గ చైతన్యమునకు దారి చూపు చున్నది.' గుడి, కులము, శిల్పి, రైతు, ఓలి, వరకట్నము వంటి అనేకాంశాల్ని స్పృశించిన ఈ కావ్యములో కోటి నరసింహముగారు 'హరిజనుడు' శీర్షికన ఇలా వివరిస్తున్నారు...

'ఇనుపగజ్జెల తల్లి కిక్కయైనాడు
పలక బల్పము చేత బట్టుకున్నాడు
ఏకాకియై విలపించుచున్నాడు
జాలి గొల్పడె హరిజన సోదరుండు?

1. 'హరిజన కీర్తనలు' - నక్కా చినవెంకయ్య, హరిజన సంఘసేవకుడు, 1935.

మూడు కోట్లాంధ్రుల తోడునుంగల్గి
దీనుడయ్యె నరుంధతీ కుమారుండు
అస్పృశ్యతా దోషమంట గట్టితివి
పక్షపాత సమేత భరత మాత'[1]

అరుంధతీ సుతులకు అస్పృశ్యతా దోషమంట గట్టిన భరతమాతను నిలదీసి నిందించడంలోనూ కవి కుమారులు వెనుకాడలేదని ఈ ద్విపదమంజరి స్పష్ట పరుస్తుంది. ఇలా నిలదీసి ఊరుకోకుండా, 'మాలమాదిగలు కారు! భారతమాత కన్న సుకుమారులు మీరు' అనే ఆత్మవిశ్వాసాన్ని కూడా మరి కొందరు కవులు వీరిలో ప్రజ్వలింపజేశారు.

'మాల మాదిగలు కారు! భారత
మాత కన్న సుకుమారులు మీరు ॥మాల॥

అంటరానితనమేదో? మా
కంటికి కనబడలేదే? ఎటు
వంటి సేవయును హేయముగాదే
కంటగించు హేతువు గనరాదే! ॥మాల॥

ఒళ్ళు మలినయైయుంటే - బాగా
నీళ్ళు పోసుకుంటే పోదంటే?
ఇళ్ళు తిళ్ళు బాగుంటే - లోపలి
కళ్ళు తెఱచి మోక్షము గనరంటే? ॥మాల॥

బంధుల మిత్రుల మిమ్ము - మే
మంధులమై కాదను కొన్నాము
సుందర సత్యము జూచి తరించిన
గాంధీ మతమే గైకొన్నాము'[2] ॥మాల॥

ఈ ఆత్మవిశ్వాసాన్ని పురికొల్పిన శిష్టా సత్యనారాయణ రాజశేఖరంగారే 'హరిజన దైవము' అనే మరో సమూహ గానంలో ...

'తలుపులు తెరవండీ - హరిజన
దైవమిదే దయచేసెనండి
తలపులు పరిశోధింపగ కోవెల
వెలుపల దేవుడు లేచెనండి ॥తలు॥

1. 'రాష్ట్రగీత' - చదలువాడ కోటి నరసింహము, మే 19ళ౬.
2. జాతీయ గీతములు - శిష్టా సత్యనారాయణ రాజశేఖరం.

భ్రమ పడబోకండి - ఈ వెలి
బాగుల వాడెటువలె ఈశ్వరుడని
హరి మందిరమున వెలసిన దేవుడె
హరిజనుడై చనుదెంచెనండి ॥తలు॥
చెంతకు బిలువండీ - ఇక మీ
వింత ప్రవర్తనములు మానండి
ఇంతటి కాలము హీనతి జూడగ
నెంతగ తనలో చిన్నబోయెనో ॥తలు॥
అర్థుడు కాదండి - యిటుమిము
యాచన సేయగ రాలేదండి
ధూర్తుడు మాయా వర్తనమున దీ
నావతారుడె వచ్చెనండి ॥తలు॥
స్వాగత మీయండి - కరమను
రాగముతో హృదయము లుప్పొంగగ
ఆగమవిధిమై నర్చించి పరమ
భాగవతోత్తములై తరింపగ'[1] ॥తలు॥

అంటూ హరిజనులను దైవ స్వరూపులుగా కీర్తించారు. హరిజన దైవ మరుదెంచెను గావున తలుపులు తెరిచి స్వాగతం పలుక మన్నారు.

"స్వరాజ్య తత్వము" గీతికా సంపుటిలో 'మాల లెవరు?' శీర్షికన ఒక ఆలోచనాత్మక గీతం వెలువడింది.

'వారు మాలలా లేక వీరు మాలలా?
మాల మాలలంచుమమ్మ జీలదీసి సంఘమందు భేద
భావములను బెంచి బాధలంద జేయునట్టి ॥వారు॥
ఆంగ్ల దేశమునకు దాము అధిక విద్యలందబోయి ఆంగ్ల
విద్య కన్న అధిక మద్యపాన విద్య నేర్చు ॥వారు॥
వాటమైన గింజతాను దినకపాలి వానికిడక పోటి
ధరలకమ్మి ధనపు మూట జూచి పొంగుచుండు ॥వారు॥
అరువదేండ్ల వయసునందు అబలనొకతె బెండ్లియాడి
యాగములను జేసి దేవ భోగమనుభవింప గోరువారు ॥వారు॥
కాయ కష్టమనుభవించి కాని దెచ్చు విధిని మరచి వాద
ములను బెంచి బీద జనులను బాధించి బ్రతుకు'[2] ॥వారు॥

1. 'జాతీయ గీతములు' - శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం.
2. 'స్వరాజ్య తత్వము' (గీతికా సంకలనం) రచయితల పేర్లు లేవ

ఆంగ్ల విద్యతో బాటు మద్యపాన వ్యసనము, పోటీధరల ధనపు మూటలు, అరువదేండ్ల వయసులో అబలతో వివాహాల వంటి నిత్యకృత్యాలు గల పెద్దమనుషులు మాలలా? లేక పుట్టుకతో కాయకష్టం చేసి, కష్టాలను అనుభవిస్తున్న పేద జనులు మాలలా? అని సూటిగా ప్రశ్నించటం ఈ గీతంలో కనిపిస్తుంది.

జాతీయోద్యమ కాలంలో అంటరానితనాన్ని నిరసించడం నాయకుల ప్రచారాల్లో ప్రధానాంశమయింది. అయితే కేవలం ప్రచారంతోనే సమస్య పరిష్కారం కాదు. దీనికి చిత్తశుద్ధి కావాలి. ఆచరణాత్మక నిబద్ధత కావాలి. ఈ భావాన్నే పత్తిగొడుపు రాఘవరాజు వ్యక్తంచేస్తూ...

'అంటరానివాడివోయ్ - ఆవలకు పొమ్మంచు
కంటగించు పాపకర్ములీ యిలనుండ
అంటుదోషము పోవునా? సోదరా
ఆనందమే చిక్కునా?'

అని ఆక్షేపించారు. అస్పృశ్యత పాటించే పాపకర్ములను నిరసించారు.

జాతీయోద్యమంలో ప్రతి చిన్న సంఘటనకు ప్రతిస్పందించిన కవి కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి. పుష్ప విలాపాన్ని కవితామయం చేసిన కరుణాహృదయుడు. సహజంగానే దేశమాత కడగొట్టు బిడ్డడి దైన్యస్థితిని చూసి చలించిపోయాడు. గుండెలను కదలించగల కథనల్లి గీతంలో గానం చేశాడు. ఈ గీతానికి రాసిన ముందుమాటలో దాని నేపథ్యాన్ని తెలిపే సన్నివేశాన్ని ఇలా పేర్కొన్నాడు.

'ఆస్తంతా ఆక్రమించుకున్నారు విరోధులు. ప్రస్తుతం ఆమె నిరుపేద యిల్లాలు. ఆయమ్మకు ఐదుగురు సంతానం. పెద్దవాళ్ళు నలుగురూ చిచింద్రీలు. అయిదోవాడు అమాయకుడు. అన్నలంతా ఒక్కటై తమ్ముణ్ణి విడదొక్కారు. దూరంగా వుండమన్నారు. ముట్టుకుంటే తంతామన్నారు. పాపమా పసిబిడ్డ తల్లిని కౌగలించుకొని బావురుమన్నాడు. చిక్కి శల్యమైవున్న చిన్న కొడుకును చూడగానే తల్లికడుపు తరుక్కుపోయింది. వొళ్ళోకి తీసుకుని బుజ్జగించింది. కొడుకుల్ని కేకలేద్దామనుకొంది. అంతలోకే వచ్చారు అసహాయశూరులు. విషాద వీణ మ్రోగింగి కన్నతల్లి కంఠంలో...[1]

'అందకుండా మీరు
ముందు పరుగేస్తుంటె
విడలేక తమ్ముడూ

1. 'తప్పులేని తమ్ముడు' గీతానికి కవి రాసిన పరిచయ వాక్యాలు
'అరుణ కిరణాలు' - కరుణశ్రీ.

వెనకాలె వస్తుంటె
ధుమ ధుమా లాడారు బే!! బిడ్డపయి
దుమ్మెత్తి పోశారు బే!
వడగాడ్పులో శోష
వచ్చి నాలుక యెండి
చెర్లోని దేవుడిచ్చిన
నీళ్ళు త్రాగబోన్
కళ్ళెర జేశారు బే! తండ్రిపై
రాళ్ళన్ని రువ్వారు బే!!
ధ్వజ స్తంభము కాడ
దణ్ణాలు పెడుతుంటె
మడిగట్టి కూర్చున్న
గుడిలోని జేజాయి
మైలబడున్నన్నారు బే!! నాయన్ని
మాలవా డన్నారు బే!!
అన్నలంతా గూడి
నన్ను కేటా జేసి
శివుడి గుళ్ళో కెళ్ళి
చిందులేశా రంటు
వెక్కి వెక్కేడ్చాడురా!! నా తండ్రి
చిక్కి సగమైనాడురా!!
జట్టులో రానీక
నెట్టి వేశారంచు
మరగి పోయెను మనసు
తిరిగి పోయెను బుద్ధి
కరగిపోతున్నాడురా!! నానాడు
తరగిపోతున్నాడు రా!!
కడగొట్టు తమ్ముడని
గారాబు తమ్ముడని
కనికార మే లేని
కటిక రక్కసులార
ఏ తప్పు చేశాడురా?! మీ సొమ్ము
ఏమి కాజేశాడురా?!

అంటూ దేశమాత తన కొడుకుల్ని మందలించింది. 'తప్పులేని తమ్ముడ్ని' అకారణంగా శిక్షించవద్దని ఆజ్ఞాపించింది. కడగొట్టు సోదరుడిపై కనికరం చూపని కర్కశరాక్షసత్వాన్ని నిలదీసింది.

ఇకపోతే నెల్లూరి వెంకటరామానాయుడు 'హరినామస్మరణ చేయండి' అనే భజనగీతం వరుసలో......

'మాల మాదిగ వారమండి-మమ్ము
చాలగ ప్రేమించి-పాలింపరండి
కూలి జేసెడి వారమండి-ఎండ
గాలివానలనక యే ప్రొద్దు సుండి ॥మాల॥
పాలు మారని వారమండి-ఎట్టి
పాలైన కోరకే పండింతు మండి ॥మాల॥
దిక్కుమాలిన వారమండి, మేము
పెక్కు బాధలపడి పొక్కితిమండి ॥మాల॥
కష్టించి పనిచేతుమండి మీతో
సృష్టి పుట్టినపుడె - పుట్టితిమండి ॥మాల॥
హీనపు మాలలనకండి-ఎల్ల
మానవులందొక-యాత్మే కదండీ ॥మాల॥
పశువుల వలె జూడకండి-మమ్ము
విసిగించిన గాని-కసి బూనమండి ॥మాల॥
గాంధి బోధల వినరండి-మాకు
బంధ విముక్తికి-బని బూనరండి ॥మాల॥[1]

అంటూ అస్పృశ్యులతో మమేకమై, వారి ఆర్తినీ, ఆవేదననూ అక్షరమయం చేశారు. గాంధీ గారి బోధనలు విని, వర్ణవ్యవస్థ బంధాలనుండి వారిని విముక్తులను చేయాలని ఉద్బోధించారు.

అస్పృశ్యులను హరిజనులుగా, కొండవాసులను గిరిజనులుగా నామకరణం చేసి, వీరిని జాతీయ స్రవంతిలో కలపడానికి గాంధీజీ అవిశ్రాంతంగా కృషిచేశారు. అందుకే వారి దృష్టిలో ఆయన ఒక అవతార పురుషుడు. తమ కష్టాలను ఆయనకు వినిపించి, తమను రక్షించమని వారు గాంధీజీని అభ్యర్థిస్తున్న సన్నివేశాన్ని బసవరాజు అప్పారావు చిత్రిస్తూ...

'గాంధిమహాత్మ - గాంధిమహాత్మ !
కాచి రక్షించు గాంధిమహాత్మ !

---

1. 'జాతీయగీతాలు'— సం: గురజాడ రాఘవశర్మ.

సరకారువోరు - కడుకైనవారు
ఉప్పేరితేను - తప్పేసినారు
డబ్బుగలోరు - దరికి రానీరు
ఈ గోరమేమి - మా నేరమేమి
మాల మాదిగలం - మనుషులంగామా
కుక్కల కన్నా - తక్కువయ్యామా
మా మొరాలించ - సామిరెదిక్కు
ఆ సామివారి - అవుతారమైన'[1] ॥గాంధి మహాత్మ॥

అని వర్ణించారు పశువుల కన్నా హీనంగా చూడబడుతున్న తమ జీవిత వాస్తవాన్ని గాంధీజీకి వివరిస్తున్నట్లు వ్యక్తీకరించారు.

ఊటుకూరు సత్యనారాయణ రావు 'సవర్ణగర్విష్టి'ని నిలదీసి...

'నా యభాగ్యదేశంపు సంతానమైన
ఓ సవర్ణ గర్విష్టి ! పేరాస వీడి
దులిపి వేయుము నీ గొప్ప కులపు సీటు
ఎవరిపైన నిందా తిరస్కృతుల పేర
బెఱుగు చుంటివో ఆ నిప్పు కరడులెల్ల
కుప్పలై వచ్చి నీ తల కూలునోయి'[2]

అంటూ దిక్కు మొక్కులేని జనం అగ్ని కణాలై సవర్ణ గర్విష్టుల అహంకారం పై ఎదురుతిరిగే రోజులొస్తున్నాయని హెచ్చరించారు.

అభ్యుదయ సాహిత్య పథ నిర్దేశకులు గురజాడ అప్పారావుగారి 'మాలలు' గీతంలోని పంక్తులన్నీ జాతి జనుల నాలుకలపై నాట్యం చేస్తున్న జాతీయాలైనాయి.

ఇలా అస్పృశ్యతను నిరసిస్తున్న గీతాల్లో పంచముల దయనీయమైన జీవన స్థితిగతులు, జాతీయోద్యమ కాలం నాటి సామాజిక పరిస్థితులు, వృత్తులపై ఆధారపడిన వర్ణాల వల్ల ఏర్పడిన హెచ్చుతగ్గులు వంటి అంశాలు వర్ణింపబడ్డాయి. అంటరానితనం మంచిది కాదని ఉద్బోధించడమే కాదు, నిత్యజీవితంలో దీనిని పాటించకుండా ఆచరణాత్మకంగా ఋజువు చేయాలన్న సూచన కొన్ని గీతాల్లోనూ; ఈ జాడ్యాన్ని వొదిలించుకోకపోతే జాతిసమైక్యత ఎలా సాధ్యమౌతుందన్న ప్రశ్న మరికొన్ని గీతాల్లోనూ కనబడుతుంది. అస్పృశ్యులుగా పిలువబడుతున్న జనం మేల్కొంటున్నారనీ, సాంఘిక అసమానతలపై సమరం ప్రకటించనున్నారనే హెచ్చరిక ఒకటి రెండు గీతాల్లో ధ్వనిస్తూ ఉంది.

1,2. 'జాతీయ గీతాలు' - సం: గురజాడ రాఘవశర్మ.

మొత్తం మీద ఎందరెందరో కవులు స్వాతంత్ర్యోద్యమ అంతఃస్రవంతిగా 'హరిజన సమస్య'ను తమ గీతాల్లో ప్రతిధ్వనింపజేశారు.

## (ఆ) మద్యపాన నిరసన

స్వాతంత్ర్యోద్యమ కాలంలో అస్పృశ్యతతో బాటు అత్యధికంగా నిరసింపబడిన అంశం మద్యపానం. అనేకమంది కవులు, రచయితలు తమ రచనల్లో ఈ అంశాన్ని ప్రముఖంగా ప్రస్తావించారు. ప్రజలను మద్యపాన విముఖులను గావించడానికి కృషి చేశారు.

1921లో వెలువడిన గరిమెళ్ళ సత్యనారాయణగారి 'స్వరాజ్య గీతములు' సంపుటిలో 'కల్లు' శీర్షికన ఇరవయ్యొక్క చరణాల సుదీర్ఘ గీతం ఉంది. దానిలో...

కల్లుతాగి నీ యిల్లు నెల్ల గుల్ల చేయకు
నీ వళ్లు రోగాలకెల్ల వడ్డికీయకు ॥కల్లు॥
పిల్ల జల్లలను తెచ్చి పీథిపెట్టకు-ముసలి
తల్లి దండ్రులను బట్టి తన్ని కొట్టకు ॥కల్లు॥
కూడంబలి మాని సారా-కొట్టుకెళ్లకు ఇంట్లో మా
డేడ్చు పిల్లలను మరపు నొందకు ॥కల్లు॥
మత్తెక్కి బుర్ర తిరిగి-మహినికూలకు-నీ
బత్తెమున్ను కూలియున్ను పారబోయకు ॥కల్లు॥

అని హితవు చెప్తూ...

'మాని వేసి చూడు-అవమాన మెల్లమాడు
నీ మహిమ ముందురాడు-ఇక మరలు తెల్లవాడు ॥కల్లు॥
తెల్లవాడి బావుట-అది తిరుగును రింక
నీవు కల్లుమానితేను చాలు-కట్టురశంక ॥కల్లు॥
స్వరాజ్య కేతన మది-సామివంటిది
నీచపు కల్లు తాగువార్ని నేను కలయనంటది ॥కల్లు॥
శుభ్రమూర్తివైన నిన్ను చూడనేరక-గాలి
కభ్రమువలె తెల్లవాడు గడగడవడకు'[1] ॥కల్లు॥

అంటూ స్వరాజ్యోద్యమంలో పాల్గొంటున్న జనం మద్యపానాన్ని మానివేసి శుభ్ర మూర్తులై నిలిస్తే తెల్లవాడు గడగడ వణికి పోతాడని గరిమెళ్ళ వివరించారు.

---

1. 'స్వరాజ్య గీతములు'—గరిమెళ్ల సత్యనారాయణ (1921)

1930 లో జాలా రంగస్వామిగారి 'అంటరాని వారెవరు?' అనే గీతికా సంపుటి వెలువడింది. దీనిలో 'త్రాగుడు వారి స్థితి' ని వర్ణిస్తూ ఏకాదశ చరణాల గీతం ఉంది. 'భజన చేసే విధము తెలియండి' బాణీలో సాగే ఈ గీతంలో...

'కల్లు మానే విధము తెలియండి - జనులార
కల్లు జబ్బులకు ప్రఖ్యాతి బడెనండి
కల్లుమానే విధము తెలియక - కాయమెల్లను
పాడు చేసుక - మానధనమును మంట గలిపి
మంచి బుద్ధిని మరచిపోతిరి ॥కల్లు॥
గురక గుండెలు ఉబ్బజేయును కార్జమును తునకలు జేసి
కీళ్ళ జ్వరము వచ్చును
పైత్యవాతముచేత జనులు బాధపడుచునుందురెపుడు పడి
శము తలనొప్పి చేతను పొట్లుపెట్టి తీరించు మద్యము ॥కల్లు॥
వేనవేలు గడించు వీరులను యీ కల్లు దొంగ వీరులనుగా
జేసి తీరును
నేరములను తెచ్చిపెట్టి కోర్టులందున ఈడిపించి హాయిగ
చెరసాల సుఖము అనుభవించగజేసి తీరును ॥కల్లు॥
అప్పులను జేయించి తీరును - ఆ వెనుక కొంపలు తప్పకను
తాకట్టుబెట్టును
చిప్పముంత జేతవచ్చును చింపపాతలు పైకి వచ్చును
పంచలందు పరుండవలయును పరువునంతను పాడుజేయును
॥కల్లు॥'[1]

అనే గీతంలో — కల్లు పట్టుకుంటే వదలదు. మానడం కష్టం. కల్లు వల్ల పరువు మంటకలుస్తుంది. పైగా ఆరోగ్యం చెడిపోయి రకరకాల రోగాలొస్తాయి. ధన నష్టం జరుగుతుంది. నేరాలు చేయించి జైళ్ళపాలు చేస్తుంది... అంటూ జాలారంగస్వామి మద్యపాన నష్టాలను వివరంగా వర్ణించారు.

1930 లో నీలం వెంకయ్యగారి 'మద్యపాన నిషేధ కీర్తనలు' వెలువడింది. బ్రహ్మశ్రీ కొత్తపల్లి సుందరరామయ్య పరిష్కరించిన ఈ కావ్యం లోపలి ముఖచిత్రం మీద...

'నీ ప్రాణ మానధనములను, నీ మాతృదేశమును రక్షింపగోరితే దీనిని తప్పక చదువుము'

అని ప్రకటించారు.

1. 'అంటరానివారెవరు?, — జాలా రంగస్వామి (1930)

'కల్లు సారా మానవేల - వళ్ళు యిల్లు గుల్లజేసి
గుళ్ళు మననేల ॥కల్లు॥'[1]

ఆనే పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో అన్నిరకాల అనర్థాలకు మూలమైన కల్లు, సారాయిల విశ్వరూపాన్ని నీలం వెంకయ్య సాక్షాత్కరింప జేశారు.

1935లో ఏలూరు నివాసి, మద్యపాన నిషేధ ప్రచారకుడు నక్కా చిన వెంకయ్య 'మాకొద్దు ఈ కల్లు సార కీర్తనలు' వెలువరించారు. గొల్ల నాగన్న సుర్చెంటు, సంధ్యాలవారు ప్రచురించిన ఈ సంపుటిలో మొత్తం పది కీర్తనలున్నాయి. ఈ పుస్తక రచనకు ప్రేరణ వెంకయ్యగారి స్వీయ జీవితమునుండే లభించినట్లు తెలుస్తున్నది.[2]

దేశ దుస్థితిని గురించి ఈ రచయితకు గల అవగాహనను తెలిపే వాక్యాలను ఉదహరించక తప్పదు...

'మహాజనులారా! మాకొద్దు ఈ కల్లు సార అను కీర్తనలు వ్రాయుటకు కారణము ఇప్పుడు దేశములో ఒక పూట వుండి, ఒకపూట లేక, అన్నమో రామచంద్రా! యని అలమటించుచు ప్రస్తుత ఆర్థిక దుస్థితివల్ల దేశము క్రుంగిపోవుచున్న సమయములో పీల్చి పిప్పి చేయుచున్న ఈ కల్లు సారాయిని మన మందరము అరికట్టినట్లయితే మన భారతదేశము ముందు ముందు మంచి ఉచ్చస్థితికి రాగలదని నా దృఢ విశ్వాసము. అందుకుగాను ఈ మద్యపానమును నివారించుటకు భగవంతుడు నాకిచ్చిన తెలివితేటలతో కల్లు సారా కంపును

1. 'మద్యపాన నిషేధ కీర్తనలు' — నీలం వెంకయ్య, వాల్మీకాశ్రమము, వెన్నవల్లివారిపేట, ఏలూరు (1930)
2. ఈ గీతికా సంపుటిని రచయిత, తన తల్లిదండ్రులకు అంకితమిస్తూ ఇలా రాశారు - ''మాకొద్దు ఈ కల్లు సార కీర్తనలు' అను పుస్తకమును నా తల్లిదండ్రులకు కృతిగా సమర్పించుకొనుచున్నాను. నా తండ్రి మద్యపానము సేవించుచు ధనమంతయు వ్యయముచేసి బీదజీవనము గడుపుచుండెను. అట్టి కాలములో (అనగా 1922వ సంవత్సరము) మహాత్మా గాంధీగారు ఏలూరు వచ్చినప్పుడు, నా తండ్రి ఆ మీటింగునకు వెళ్ళి మహాత్ములవారి బోధ విని 1922 సం॥ మొదలు 1924 సం॥ వరకు మద్యపానము మానివేసి 1924 సం॥లో పరలోకగతులైరి. నా తల్లి దైవభక్తురాలు శాంతి శమదాది సద్గుణములు గల తల్లి 1919 సం॥న పరలోకమున కేగిరి. నాకు తల్లిదండ్రులయందు వుండు భక్తిచేత నాచే వ్రాయబడిన ఈ పుస్తకమును నా తల్లిదండ్రులగు కీ॥ శే॥ నక్కా కొండయ్య, ఈరమ్మగార్లకు కృతిగా సమర్పించుకొనుచున్నాను."

గూర్చి కొన్ని కీర్తనలు వ్రాసినాను. ఈ కీర్తనలు పాడి, అందు సారాంశమును గ్రహించి, తప్పకుండా ఈ కల్లు సారాయిని మీమీ సంఘములనుండి బహిష్కరింతురని మనవి చేయుచున్నాను'1

అంటూ దేశప్రగతికి అడ్డుగోడగా నిలిచిన మద్యపాన సేవనమును నిశితంగా ఖండిస్తూ, ఈ దురలవాటు నుండి దేశ ప్రజలు బయటపడితే ముందు ముందు మనదేశం ఉన్నత శిఖరాల నధిరోహించగలదనే ఆత్మవిశ్వాస్వాన్ని నక్కా చినవెంకయ్య, తన పుస్తకానికి రాసుకున్న ముందు మాటలో వ్యక్తం చేశారు.

'కల్లుమానే విధము తెలియండి' అనే కీర్తనతో ప్రారంభమయ్యే ఈ సంపుటిలో 'ముంతా మాయమ్మ నిన్ను మరువజాలనే' కీర్తన మకుటాయమానం.

'ముంతా మాయమ్మ నిను మరువజాలనే
కల్లు ముంతా మాయమ్మ ॥క॥
అమ్మ నీదు పేరు బలే కమ్మగున్నాదే యిమ్మహిలో నిన్ను
బోలు వారలెవ్వరే ॥క॥
చల్ల పెరుగు పాలు నీకు సాటి రావమ్మ నీ సారామేమొ గాని
ఖల్ సంతోషమోయమ్మ ॥క॥
కల్లు కెళ్ళేటప్పుడు మేము కలిసి వెళ్ళెదము మళ్ళి తిరిగి
వచ్చేటప్పుడు తన్నూ లాడెదమె ॥క॥
ముంతకల్లు త్రాగినపుడు గంతులేతునే చెంతనున్న
వారి తోటి సికలు పడుదునే ॥క॥
దొంగతనము చేసి నేను నిండుగాను త్రాగుచుంటి
దండైన దొరలు వచ్చి దండ సేసితే ॥క॥
వల్లు తెలియకుండ నేను పుల్లకల్లు త్రాగుచుంటె
వళ్ళంత పులిసిపోయి ఒడలి పోతినే ॥క॥
అప్పు సప్పు చేసి నేను ఎప్పుడు నిను త్రాగుచుంటి
అప్పులోరు వచ్చు వరకు ఐ. పి. పెడితినే2 ॥క॥'

అంటూ కల్లుముంత విష ప్రభావాలను హాస్యభరిత పదజాలంతో అభివర్ణించారీ రచయిత. అలాగే మరో కీర్తనలో ... గరిమెళ్ళ వారి ప్రఖ్యాత జాతీయోద్యమ గీతం 'మా కొద్దు తెల్ల దొరతనము' బాణీ ననుసరించి...

1. "మాకొద్దు ఈ కల్లు సారా కీర్తనలు" గీతికా సంపుటికి రచయిత నక్కా చిన వెంకయ్య రాసిన ముందుమాట.
2. 'మా కొద్దు ఈ కల్లు సారా కీర్తనలు' - నక్కా చినవెంకయ్య.

'మా కొద్దు ఈ కల్లుముంత బాబు మా కొద్దు
యీ కల్లుముంత॥
మా పాలి రాక్షసి మమ్ము తినుటకు పుట్టె మా కొద్దు
యీ కల్లుముంత'[1]

అంటూ సామాన్య జన జీవన శత్రువైన కల్లుముంతను నిరాకరిస్తూ ఈ కవి నిరసనాత్మక కీర్తనలు వెలయించారు. దొంగతనం, దోపిడీలు, కొట్లాటలు, హత్యలు వంటి నేర ప్రవృత్తులను పెంచడంలోనూ, వేశ్యాలోలత్వాన్ని వృద్ధి పరచడంలోనూ కల్లుముంత ప్రధానమైన పాత్ర వహిస్తున్న విధానాన్ని వెంకయ్య గారు వ్యంగ్య కీర్తనల ద్వారా వ్యక్తీకరించారు.

1937-40 మధ్యకాలంలో తెలుగులో 'గృహ లక్ష్మి' అనే చలనచిత్రం విడుదలయ్యింది. అందులో చిత్తూరు నాగయ్య పాడిన...

'కల్లు మానండోయ్ - బాబూ! కళ్ళు తెరవండోయ్!'

గీతం సామాన్య ప్రజల్లో విశేష ప్రాచుర్యం పొందింది. ఆ కాలంలోనే మద్రాసు ప్రెసిడెన్సీలో రాజాజీ కాంగ్రెస్ ప్రభుత్వం సేలం జిల్లాలో మద్య పానంపై నిషేధం పెట్టడం వల్ల ఆ చిత్రానికి, పాటకూ ప్రత్యేక ప్రాముఖ్యత లభించింది.[2]

కొమాండూరు పార్థసారథి అయ్యంగార్ రచించి, ప్రచురించిన 'కాంగ్రెస్ ప్రచారపాటలు' సంపుటిలో రెండు కల్లుసారా పాటలు కనబడుతున్నాయి.

'కల్లమ్మోరా - సారాయమ్మా! మీ
కాళ్లకింక బుద్ధిచెప్పి - కదలిపోండమ్మా॥
సల్లంగున్న సంసారాల్ని గుల్లజేస్తిరే - యిక
సెల్లిపోండి సాలునమ్మ సాగరంలోకి
మల్లిరాకుండా మీరెల్లిపోండమ్మా
మా మొగుళ్ళు మీ మొకాల్కి మారు మొగుళ్ళా
కాంగ్రెసోళ్ళు పట్టుబట్టి కరిలించేళాల్లె
కలిగిరి చెర్వుదాటి మీరు కాలిపోతాల్లే ॥క॥
కలుగోళ్ళమ్మా! అంకాళమ్మా! మా
కూలివోళ్ళ కొంపలన్ని దోచి తింటురా!

---

1. 'మాకొద్దు ఈ కల్లుసారా కీర్తనలు' - నక్కా చినవెంకయ్య.
2. 'తెలుగు రచయితలు - భారత స్వాతంత్ర్యోద్యమం' (వ్యాసాలు) (పుట : 35) —ఆర్. ఎన్. శర్మ; విశ్వసాహితి అనుబంధ ప్రచురణ, సికింద్రాబాద్ (1986)

కల్లు నీళ్ళు పొట్టేళ్ళున్నా దున్నపోతులన్ మీ
కడుపుల్లోకి పెట్టి పెట్టి సాలి పోయిందే ॥క॥
ఏమి దైభాలో మీరేమి దయ్యాలో
భూమిలో మీ బతుకు మమ్మ పీక్కో తింటాన్నా
గాంధి దేవుడొకడె మాకు రక్షంకుడమ్మా
మా కొంపలన్ని నిలిపి మమ్మ కాపాడ్నాడమ్మా ॥క॥
నెల్లూరులో కల్లులేదిక
ఇల్లు వాకిలి నిల్పుకుంటాం సల్లంగుంటామే
కాంగ్రెసాయ్న పార్థసారథి పాడుతుంటడే, ఆ
పాటలన్ని పాడుతా ప్రచారం చేస్తాంలే[1] ॥క॥'

అని ప్రకటించడం వెనక కాంగ్రెస్ పార్టీ ప్రధాన నినాదమైన మద్యపాన నిషేధం కనబడుతుంది స్వతంత్ర భారతంలో కాంగ్రెస్ పార్టీ అధికారం సంపాదిస్తే, కల్లు సారాయిలను పూర్తిగా నిషేధిస్తుందని ఆ కాలంనాటి రచయితలు భావించారు దానికి తోడు మద్రాస్ కాంగ్రెస్ ప్రభుత్వం కొన్ని జిల్లాల్లో వీటిని నిషేధించడంతో ఆ నమ్మకం బలపడింది. కానీ తరువాతి కాలంలో జరిగిందేమిటో చెప్పవలసిన పనేలేదు.

ఇలా గానం చేసిన రచయిత కొమాండూరు పార్థసారధి అయ్యంగార్ మరో పాటలో భార్యాభర్తల సంవాద రూపంలో...

'భార్య : గాంధిగార్కి దండం బెట్టు-గాంధి దేవుడె రచ్చించాడు
ఇంక మీద కల్లు సారాయ్-ఇలలోనెందు కనబడబోదు
గాంధి సర్కారు, సాయమయ్యె-కల్లు సారాయి ముగించారు
దండాలయ్య జవ్హారిలాలు దండాల్ బాబు దండం నీకు ॥గాం॥
భర్త : ఔలేసాల్, ముయ్ నోరింక-బలె సంతోసంగా వుండావే
ఎల్లిపోయి కాస్తో కూస్తో-ఎండకు సల్లగ తాగొస్తాన్లే
భార్య : మాటసెప్తె యినవోరయ్యా-యాంటికి మమ్మ సంపేస్తావు
సద్దు సప్పిడొద్దు మన్కి-బుద్ధిగల్గి బతుకుతాము'[2]

అంటూ వివరించారు. మద్యపాన వ్యతిరేక ప్రచారానికి విశేష ప్రాధాన్యతను కల్పించిన గాంధీగారికి నమస్కరించాలన్న భక్తి భావాన్ని ప్రజల్లో పురికొల్పే ప్రయత్నాలు చేశారు.

జాతీయ, స్వాతంత్ర్య ఉద్యమ వ్యాప్తికి సాహిత్యాన్ని ఆయుధంగా వాడుకున్న జాతీయోద్యమ జంటకవులు జాస్తి వెంకటనర్సయ్య, ధూళిపాళ

---

1, 2. 'కాంగ్రెస్ ప్రచార పాటలు' - కొమాండూరు పార్థసారథి అయ్యంగార్.

వెంకట సుబ్రహ్మణ్యం ఉద్యమం తిరిగిన ప్రతి మలుపులోనూ వీరి గీతాలు కన బడతాయి. సహజంగానే మద్యపాన నిరసన పై ఈ కవులు ప్రతిస్పందించారు.

'మానరా సారాయి మానరా
మానకుంటే ఒట్టునీకు
మానుకుంటే మేలు గలుగూ'1

అంటూ హితవు చెప్పారు కల్లుసారాయి తాగడం వల్ల కేవలం డబ్బు ఖర్చుకావడమే కాక, నలుగురిలో పరువూ మర్యాదలు కూడా మిగలవనీ, తాగు బోతులపై పెళ్ళామయినా జాలిదలవదనీ, పిల్లలు ప్రేమించరనీ ఈ జంటకవులు సమాజంలో ఉన్న వ్యసనపరులను హెచ్చరించారు.

జాతీయోద్యమ గీతాలకు ఒరవడి దిద్దిన కవుల్లో ఒకరైన శిష్టా సత్య నారాయణ రాజశేఖరం మరొక అడుగు ముందుకేసి, మద్యపానంతో బాటు మాంసము, నల్లమందు, పొగాకులను కూడా మానేయమని ఉద్బోధించారు.

'కల్లు-మాంసము' శీర్షికతో ఆయన రాసిన గీతంలో కల్లుతో బాటు మాంసము చేర్చినందుకు స్వయంగా ఒక వివరణము నిచ్చారు.2

'మానరా మా యన్న-కల్లు
మాంసము, నల్లమందు పొగాకు
మాన ప్రాణహాని కల్గించును
కానరాని కలతల పెంచును ॥మానరా॥

పాటుపడిన శ్రమ-బాయగగాని
కోటీశ్వరుడనే గొప్పకు గాని
మోట శక్తుల పూజల గాని
నీట గలపకురా నీతి నిష్ఠ ॥మానరా॥

తల్లి పెంచిన తనువు కృశించి
తాను కూర్చిన ధనము నశించి
నల్ల రక్తపు నాళల నుంచి
నానా విధముల నలమటించకురా ॥మానరా॥

---

1. 'జయభేరి' (ఖండకావ్యము)-ఉభయభాషా ప్రవీణ జాస్తి వెంకటనర్సయ్య, ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యం ('947)
2. 'మాంసము' మద్యమంత హేయం కాకపోయినా బీదభారతదేశంలో విడువదగిన ఆహారం అని గుర్తించిన్నీ, సాంస్కృతిక దృష్టితో ఈ పదం ఇక్కడ వాడబడింది'— రచయిత (శిష్టా సత్యనారాయణ రాజశేఖరం)

ఎండి ఎండి ఈ మేనువాడ
మొండిబారి నీ బుద్ధి వెనుకాడ
నిండు ప్రేమతో రాజశేఖర నుతుని
నీ మదిలో గొల్వ నేరకపోయేవు ॥మానరా॥'[1]

అంటూ......శ్రమను మరచిపోవడానిగ్గానీ, గొప్పలు చెప్పుకోడానిగ్గానీ ఏ కారణమైతేనేం కల్లు, సారాయి, మాంసము, నల్లమందు, పొగాకు వంటి వ్యసనాలన్నింటినీ మానేయమని ప్రబోధించారు.

మొత్తం మీద ఈ సమస్యపై వచ్చిన గీతాలన్నింటిలోనూ మద్యపానం వల్ల సమాజానికీ, సామాజికులకూ కలుగుతున్న హాని వర్ణింపబడింది. కల్లు, సారాయి మానేయమనే ప్రబోధం ప్రచలితమయింది. స్వరాజ్యం లభించగానే కాంగ్రెస్ ప్రభుత్వం మద్యపానాన్ని నిషేధిస్తుందనే నమ్మకం ప్రతిధ్వనిస్తుంది.

## (ఇ) రాట్నం పాటలు

ఈస్టిండియా కంపెనీ మనదేశంలో అనుసరించిన ఏకపక్ష వాణిజ్య పద్ధతుల మూలంగా ఇక్కడి స్థానిక పరిశ్రమలు దెబ్బతిన్నాయి. సన్నని నూలు వస్త్రాలు నేసే నేతగాండ్రకు పనిలేక పస్తులుండే గతి పట్టింది. నేతకు కావలసిన నూలు దొరక్క ఉత్పత్తికి తగిన ప్రోత్సాహం లేక క్రమంగా చేనేతవృత్తి క్షీణించసాగింది. రాట్నాలు మూలబడ్డాయి దేశంలోని సగటు విద్యావంతులు విదేశీవస్త్ర వ్యామోహంలో పడసాగారు. జానెడుగుడ్డ కోసం లాంకైషేర్ వస్త్రాలపై ఆధారపడాల్సి వచ్చింది. విదేశీ వస్త్రాలను కొనడంతో కోట్లాది రూపాయల ధనం పరాయి దేశాలకు ప్రవహించసాగింది. ఈ ధన ప్రవాహాన్ని ఆపనిదే మన దేశ పురోభివృద్ధి సాధ్యం కాదని గమనించిన గాంధీజీ విదేశీవస్త్ర బహిష్కారణకు, స్వదేశీ వస్త్ర వినియోగానికి పిలుపునిచ్చారు. స్వయంగా రాట్నం తిప్పారు. నూలు వడికారు. ఖద్దరు ధారణ స్వరాజ్య ఉద్యమ సంకేతమయ్యింది. రాట్నలక్ష్మి ఇంటింటా గృహలక్ష్మిగా రూపొందింది. వందలాది రాట్నం పాటలు ప్రజల పనిపాటల్లో చోటు చేసుకున్నాయి. కుప్పతెప్పలుగా వెలువడిన ఈ రాట్నం పాటల్ని స్థలాభావం వల్ల అన్నింటినీ పరిశీలించటం సాధ్యం కాదు. కొన్ని ప్రఖ్యాత గీతాలను ఉదహరించుకోవచ్చు.

'మా పాలి మహాలక్ష్మి మా యన్నపూర్ణ
మా సరస్వతీదేవి - మా రాజ్యలక్ష్మి'[2]

---

1. 'జాతీయ గీతములు' - శిష్ట్లా సత్యనారాయణ రాజశేఖరం, నిజాం పట్టణం, గుంటూరు జిల్లా.
2. 'జాతీయ గీతాలు'

అంటున్న 'చెఱుకువాడ' దేశ సంపదలను పెంచే లక్ష్మిగా, నేతపనివారి అన్నపూర్ణగా, స్వరాజ్యాన్ని సాధించే రాజ్యలక్ష్మిగా రాట్నాన్ని ఉపాసించారు.

'నా తల్లి రాట్నమా ! - నా పాలి భాగ్యమా
నా దేశమును పీడ - న్యాయమా చెప్పుమా
కట్టు గుడ్డల నిచ్చి - పొట్టకూడిచ్చి
నట్టి తల్లివె నీవె - ఇట్టు రావమ్మా !'[1]

అని స్వాగతం పలుకుతూ 'కొండపల్లి' రాట్నమాత పునర్వికాసాన్ని కాంక్షించారు. దేశానికి దూరమౌతున్న చేనేత వృత్తిని తిరిగి రావలసిందిగా ఆహ్వానించారు.

'పెట్టరే రాట్నము - ఓ తల్లులారా! పెట్టరే రాట్నము
పెట్టరే మీరింకనైనను - పేదతనమున తల్లి వ్యథచే
కట్టుకొనుటకు బట్టలేకను - కడువిచారము బొందుచున్నది'[2]

అనే గీతంలో ఇంటింటా రాట్నాన్ని నెలకొల్పాలనే గాంధీగారి సందేశాన్ని తెలుగు తల్లులకు నెల్లూరు వెంకట్రామానాయుడు వినిపించారు.

స్వరాజ్యోద్యమ పల్లవిగా మారిన రాట్న సంగీతాన్ని విని పులకరించిన 'గరిమెళ్ళ' ఇంతకాలంపాటు ఎక్కడదాగి ఉన్నావమ్మా అని రాట్నలక్ష్మిని ప్రశ్నిస్తూ—

'ఎందు దాగి యుండితివో - ఇందు సుందరీ రాట్నమ
మంద మధుర నీ గానమహిమ నెచ్చట బెట్టితివి ॥ఎందు॥
సుందరీమణుల హస్త - శోభకేళి పీడబాపి
నిందిత పాశ్చాత్యవసన - నీరసతను మేనదాపి ।ఎందు॥
స్వాగతమిదె యిచ్చెదము - స్వాంతమలర గైకొనుము
ఏగను నికమిము విడియని - యియ్యుమమ్మ నీ శపథము
॥ఎందు॥'[3]

మళ్ళీ దేశ ప్రజలకు దూరంగా వెళ్ళనని ప్రతిజ్ఞ చేయుమంటూ రాట్న రమణిని ప్రాధేయపడుతున్నారు.

రాట్నాన్ని స్వరాజ్య ద్వార కవాటంగా భావించిన కాంగ్రెస్ కవి కొమాండూరు పార్థసారథి అయ్యంగార్...

---

1, 2 'జాతీయగీతాలు' - సం : గురజాడ రామశర్మ,
3. 'స్వరాజ్య గీతములు' - గరిమెళ్ళ సత్యనారాయణ

'ఏటికి వట్టి ఆరాటం - ఇంటింట బెట్టర ఏకులరాటం
నేటికి చిక్కెను వాటం - ఇదియె స్వరాజ్యపు ద్వార కవాటం'[1]

అనే 'రాట్నంపాట'లో ఇతర దేశవాసులు సిగ్గుపడునట్లుగా స్వదేశస్థులు రాట్నం తిప్పాలని, జాతిని మేల్కొలపాలని ఆకాంక్షించారు. దానితోబాటు...

'రాట్నపు పాటను పాడగనందఱు - రండీ జనులారా!
రాట్నము వలననె కల్గెడు మనకు - స్వరాజ్యము కన్గొనుడి
రాట్నమె దివ్య సుదర్శన చక్రము - రమ్యముగా దిరుగన్
కాటకముల పోద్రోలి - స్వరాజ్యము క్రమ్మఱ మనకందించున్'[2]

అంటూ స్వరాజ్యోద్యమ ప్రేరకాలైన రాట్నం పాటలను పాడడానికి సోదర భారతీయులను సాదరంగా ఆహ్వానించారు.

ఇలా రాట్నాన్ని గృహలక్ష్మిగా, రాజ్యలక్ష్మిగా, స్వరాజ్యాన్ని సాధించి పెట్టే సుదర్శన చక్రంగా, స్వాతంత్ర్యదాతగా శ్రీయుతులు గురజాడ రాఘవ శర్మ, కాటూరి వెంకటేశ్వరరావు, దువ్వూరి రామిరెడ్డి, మిక్కిలినేని భగవంత రావు, వెన్నెలకంటి రాఘవయ్య, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ ప్రభృతులు తమ గీతాల్లో వర్ణించారు.

## (ఈ) విదేశీ వస్త్ర బహిష్కరణ

స్వరాజ్య సమరంలోకి ప్రజలను ఆకర్షించడానికి తారకమంత్రంగా ఉపయోగపడిన నినాదం 'విదేశీ వస్త్రబహిష్కారం'. ఈ అంశాన్ని ఇతివృత్తంగా తీసుకుని అనేక గీతాలు వెలువడ్డాయి.

చేతివృత్తుల వినాశనానికి కారణమైన పరాయి దేశవస్త్రాలను బహిష్కరించండని పిలుపునిస్తున్న గరికపాటి మల్లావధాని...

'వద్దురా మనకొద్దురా పరదేశవస్త్రము
వద్దురా చేతివృత్తి-పనులనెల్లను చితుకగొట్టెను సోదరా ॥వద్దురా॥
కదురు చూచి బెదరిపడుచు-కఠిన పద్ధతి దాల్చెరా
ఓర్వలేని చుప్పనాతిగ-నుర్విపైన నుండేరా ॥వద్దురా॥
ఏడుకోట్ల ప్రజలనోట - మట్టిగొట్టుచు నుండెరా
కూడుగుడ్డలేక పేదలు - గోలబెట్టుచు నుండగా ॥వద్దురా॥
లేవరా మన రాట్నదేవత - జీవితం బికనేలరా
ప్రోవ(బ్రోవ కన్నతల్లి - గౌరవము పూజింపరా ॥వద్దురా॥'[3]

---

1. 'కాంగ్రెస్ ప్రచార పాటలు' - కొమాండూరు పార్థసారథి అయ్యంగార్
2,3. 'జాతీయ గీతాలు'

అన్నారు. అంతేకాక మిగతాగీతంలో దేశప్రజలను దోచుకుతింటున్న విదేశీ వస్త్రాలను ద్వేషించాలని, కన్నతల్లి గౌరవ చిహ్నంగా నిలిచిన స్వదేశీ వస్త్రాలను ఆదరించాలని ఉద్బోధించారు.

'సీమగుడ్డ కట్టబోకురా'1, 'కట్టకురా సీమగుడ్డ'2, 'కట్టకుమా సీమబట్ట'3, అనే గీతాల్లో కొండపల్లి జగన్నాథదాసు, నెల్లూరు వెంకట్రామానాయుడు, గరికపాటి మల్లావధాని వంటి కవులు విదేశీ వస్త్రాలను కట్టుకోవద్దని, నామరూపాలు లేకుండా నశించిపోతున్న స్వదేశీ వస్త్రాలను ధరించవలసిందిగా దేశ ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

ఇలా మనవిచేసే దశనుండి మరొక అడుగు ముందుకువేశారు మంగిపూడి పురుషోత్తమ శర్మ...

'సీమగుడ్డ మానవెంతటి సిగ్గురా ఓ సోదరా!
ఈ మహా వ్యామోహమెంతో ఎగ్గురా నా సోదరా! ॥సీమ॥'4

అని మందలించారు. బసవరాజు అప్పారావు హెచ్చు స్వరంతో...

'సిగ్గులేదా నీకు శరములేదా?
అన్నమైన లేక బీదలల్లాడు తుంటేను
సీతాకోక చిలుకలాగ - సీమగుడ్డకట్టి తిరుగ ॥సిగ్గులేదా॥'5

కడుపు నిండా కూడు దొరకని కడు దరిద్రులకు పెన్నిధిగా ఉన్న చేనేత పరిశ్రమను వెక్కిరిస్తూ, నిగనిగలతో ధగద్ధగలతో మోసగిస్తున్న సీమగుడ్డపై వ్యామోహాన్ని పెంచుకుంటున్న భావదాసులను అభిశంసిస్తూ, ద్వేషిస్తూ బసవరాజు గీతాలు వెలువడ్డాయి.

## (ఉ) చేనేత భజనావళి

స్వరాజ్యోద్యమ ప్రధాన స్రవంతిలో లేచిన కెరటం చేనేత పరిశ్రమ. 1939 నాటికే సంఖ్యాబలంలో కోటిమందిని మించిన చేనేత పనివారు ఒక సంఘటిత శక్తిగా రూపొందసాగారు.6 1930 నాటి శాసనోల్లంఘన ప్రేరణతో పెండెం వెంకట్రాములు, సత్యనారాయణగార్లు 'చేనేత పారిశ్రామిక సంఘం' స్థాపించారు. 1936-39 మధ్యకాలంలో ఈ చేనేత పారిశ్రామికోద్యమం బాగా వ్యాప్తి చెందింది. వివిధ కులాలవారు తమ కులగోత్రాలు పేర్కొనడం కంటే, తామందరు 'చేనేత పనివారు'గా పేర్కొనసాగారు 1938 లో చేనేతవారు 'ఎర్రజెండా' నీడకింద సమీకృతులయ్యారు, 1934 లో శ్రీ అందె సుబ్బారాయుడు 'ఆంధ్ర రాష్ట్ర చేనేత విద్యాలయాన్ని' నిడుబ్రోలులో స్థాపించారు; దానితో

1 నుండి 5 వరకు - 'జాతీయ గీతాలు.'

6. 'చేనేత భజనావళి.'

బాటు ఆయన 'చేనేత రక్షణ యాత్రలు' కొనసాగించారు. శ్రీ ప్రగడ కోటయ్య 'చేనేత విక్రయశాలల్ని' నెలకొల్పారు. తాడిపర్తి శ్రీకంఠం 'అఖిల భారత చేనేత సంఘం' ప్రారంభించే ప్రయత్నాలు మొదలెట్టారు.

'చేనేత ఉద్యమం, రైతుకూలీ ఉద్యమాలు కవలల్లాంటివి. వాటికి అన్నా భావ సంబంధముంటుంది' అంటారు ఆచార్య ఎన్.జి. రంగా.[1]

1939 లో నిడుబ్రోలులోని 'ఆంధ్ర రాష్ట్ర రైతాంగ విద్యాలయం'లోనే 'ఆంధ్ర చేనేత విద్యాలయం' ప్రారంభమయింది.

అప్పటికి ఐదేళ్ళకు ముందే (1934 లో) 'రైతు భజనావళి' వెలువడింది. 1936 లో 'కార్మిక భజనావళి' ప్రచురితమయింది. 1939 లో 'చేనేత భజనావళి' వెలుగు చూసింది. ఆచార్య రంగా దీనికి చక్కని పరిచయవాక్యాలు రాశారు.

'యీ పాటలు వ్రాసినవారి హృదయాలు నవనీతమైనవి. వారి రక్తము నూతనోత్తేజము కలది. వారి పల్కులు మోడుచెందిన పారిశ్రామిక హృదయాలను పల్లవింపజేయునవి. వారి పాటలు పిల్లలకు పెంపు, పెద్దలకు కార్యోత్సాహము కల్గించగల్గును. కవులు, గాయకులేగాక రక్షణ యాత్రికులు, సంఘ సంస్కారులు యీ భజనావళిని ప్రతి కార్మికుని హృదయాన ప్రతిష్ఠాపన చేసెదరు గాత.'[2]

ఈ గీతికా సంపుటికి సంపాదకులైన కృష్ణారావు, సూర్యనారాయణరావు గార్లు...

'జీర్ణ శల్యావశిష్టమై చివికిపోయి
మారుమూలల నెక్కడో మ్రగ్గియున్న
చేతినేతను పునరుద్ధరింతమయ్య
లెండు సోదరులార! లేలెండు! రండు!'

అని విజ్ఞప్తి చేశారు.

రాయప్రోలు సుబ్బారావుగారి ప్రఖ్యాత గీతం 'ఏ దేశమేగినా ఎందు కాలిడినా' నడకను అనుసరించి...

'ఏదేశమేగినా ఏ పీఠమెక్కినా
చూపవా నీ నేత నిజకౌశలంబు
తలపవా నీ పూర్వ కళకాంతులెల్ల
నిలుపవా నీ వృత్తి నిజగౌరవంబు'[3]

---

1. 'చేనేత భజనావళి' గీతికాసంపుటికి ఆచార్య రంగా ఆశీస్సులు.
2. 'చేనేత భజనావళి'కి ఆచార్య రంగా ఆశీస్సులు.
3. 'చేనేత భజనావళి'సం; కృష్ణారావు, సూర్యనారాయణరావు
చేనేత గ్రంథమాల, చీరాల (1939).

అంటూ పెండెం వెంకట్రాములు రాసిన గీతంలో...ఏ చదువు చదివినా, ఏ ఉద్యోగం చేసినా, ఏ వృత్తిలో ఉన్నా ఏ ఊరి కేగినా ప్రాచీన చేనేత ప్రాశస్త్యాన్ని వివరించమని విజ్ఞప్తి చేశారు.

'ఎగిరి యెగిరే జండ - చేనేత జండా
ఎగిరి మన దారిద్ర్య - మడపేటి జండా'[1]

గీతంలో చీని చీనాంబరాలను చిత్రించే ప్రతిభగల చేనేత కార్మికుల ప్రతీకగా నిలిచిన జండా, రాట్నం మోతలతో రాజిస్తూ రక్తవర్ణంతో రమ్యమైన జండా ఎగరాలని ఆకాంక్షించిన చేబ్రోలు భావనారాయణ, ప్రజల స్వాతంత్ర్య వాంఛలకు స్థావరంగా ఈ జెండాను కీర్తించారు.

'లెండోయి లెండోయి చేనేతవారూ
బండచాకిరి చేసి పస్తుండనేలా?'[2]

గీతంలో...అందమైన బట్టలు అందరికీ అందిస్తూ, పాత పేలికలతో బతుకులు వెళ్ళదీస్తున్న చేనేత పనివారు సమైక్యం కావాలని ప్రబోధించారు.

'రావోయి రావోయి చేనేత బిడ్డా!
మిల్లులన్నియు మనల కొల్లగొట్టుచునుండె'[3]

అనే పిలుపుతో... హృదయాల్లో అణగారుతున్న ఆశలను మోసుకుంటూ, ఆకలి బాధలను గుండెల్లో దాచుకుంటూ, సరిగంచు బట్టల్ని చక్కగా నేస్తున్న తన నేస్తాలను చేబ్రోలు భావనారాయణ చైతన్య పరిచారు.

ఆ తరువాత ఇదే రంగంలో వెలువడిన మరో ఆణిముత్యం లాంటి పుస్తకం 'జాతీయ చేనేత గీతావళి'. 1947 లో 'ఆంధ్ర జాతీయ చేనేత కాంగ్రెస్' వైజ్ఞానిక శాఖ వారి ప్రథను ప్రచురణగా వెలువడిన ఈ గీతావళిని దామర్ల నాగేంద్ర కవి (పేరాల) రచించారు.

చేనేత కార్మికులను సంఘటితపరచడంలో విశేషమైన కృషి చేసిన పెండెం వెంకట్రాములు గారికి నివాళులర్పిస్తూ...

'జోహార్లివెగొను ఆచార్య!
పెండెము వెంకట్రామా!
జోహారు చేనేతప్రజ
జీవనప్రదాతా!'[4]

---

1, 2, 3. 'చేనేత భజనావళి' సం: కృష్ణారావు, సూర్యనారాయణరావు, చేనేత గ్రంథమాల, చీరాల (1939).

4. 'జాతీయ చేనేత గీతావళి' - దామర్ల నాగేంద్ర కవి, పేరాల ఆంధ్ర జాతీయ చేనేత కాంగ్రెస్ వైజ్ఞానిక శాఖవారి ప్రథమ ప్రచురణ (1947).

అంటూ స్వరాజ్య సమరంలో గాంధీగారి అడుగుజాడల్లో నడుస్తూ, కఠిన కారాగారాలు భరిస్తూ, సహనానికి మారుపేరుగా నిలిచిన చేనేత ప్రజల నేతను నాగేంద్ర కవి ప్రశంసించారు.

అనేక గీతాల్లో చేనేత పనివారి కష్ట నిష్ఠూరాలను, దుర్భర జీవన స్థితి గతులను వర్ణించిన ఈ కవి...

'జై వీరయోధుడ! చేతినేత సోదర!
వేగ కదలి నడువవోయ్
విజయ గీతిక పాడవోయ్!'[1]

అనే మార్చింగ్ గీతంలో—దేశదేశాలలో ఖ్యాతిగాంచిన నాటి చేనేత దివ్య చరితలు పాడుకుంటూ, మంచు తెరలను పోలిన వస్త్రనల్లిన నాటి హస్త నైపుణ్యాన్ని స్మరిస్తూ, వృత్తిగౌరవాన్ని కాపాడమని, పురావైభవాన్ని పునః ప్రతిష్ఠించమని నాగేంద్రకవి ప్రబోధించారు.

ఎంతో గర్వించదగిన చరిత్రగల చేనేతవృత్తి బ్రిటీషువారి పరిపాలనలో కృశించి, నశించిన విధానాన్ని వివరించిన జాతీయ చేనేత కవులు, నేతపరిశ్రమ పునర్వికాసాన్ని కాంక్షిస్తూ గీతాలు రాశారు. విదేశీవస్త్ర వ్యామోహాన్ని నిశితంగా విమర్శించారు. స్వదేశ వస్త్రస్వాభిమానాన్ని సోదర భారతీయుల హృదయాలలో జాగృతం చేసే భావాలను ప్రచారం చేశారు. పరాయి పాలకుల ఆర్థికవ్యవస్థపై దెబ్బకొట్టడానికి నేతపనిని ఒక ఆయుధంగా ప్రయోగించారు. చేనేత కార్మికుల్లో చైతన్యరాగాలు పలికించారు.

## X స్వాతంత్ర్య సమర గీతాలు

1942 ఆగస్టు 8 నాడు బొంబాయిలో జరిగిన 'అఖిల భారత కాంగ్రెస్ కమిటీ' సమావేశం 'క్విట్ ఇండియా' తీర్మానాన్ని ఆమోదించింది. బ్రిటీష పాలకులను తరిమివేయడానికి దేశ వ్యాప్త ఉద్యమం ప్రజ్వరిల్లింది. 'ఆగస్టు విప్లవం'గా ప్రసిద్ధి కెక్కిన ఈ ఉద్యమ ప్రారంభం మొదలు దేశం స్వతంత్ర మయ్యేదాకా ఐదేళ్ళపాటు వెలువడిన గీతాలను స్వాతంత్ర్య సమర గీతాలంటున్నాం. వస్తువులోనూ, భాషలోనూ, భావ ప్రకటనంలోనూ మిగతా గీతాలకు భిన్నంగా తీవ్రతరంగా స్పష్టమైన సమర మార్గాన్ని నిర్దేశించిన గీతాలివి.

'వద్దురా మన కొద్దురా - పరపాలనం ఇక వద్దురా
హద్దు పద్దులేని పన్నుల - రుద్ది పీల్చుచునుండెరా' ॥వద్దురా॥[2]

---

1. 'జాతీయ చేనేత గీతావళి' - దామర్ల నాగేంద్రకవి, పేరాల. ఆంధ్ర జాతీయ చేనేత కాంగ్రెస్ వైజ్ఞానిక శాఖవారి ప్రథమ ప్రచురణ (1947).
2. 'జాతీయ గీతాలు'.

అంటున్న గరికపాటి మల్లావధాని, పన్నుల భారాన్ని పెంచిన పరాయి పాలనం ఇక కొనసాగడానికి వీల్లేదన్నాడు భారతీయుల స్వేచ్ఛను హరిస్తున్న ఇంగ్లీషు చట్టాలను ఆక్షేపించాడు.

'పర దేశీయులు తొలగండి - యీ భారతదేశం మా దేశం
వినండి వినండి పశ్వ ప్రజలు - వీర భారత సందేశం
ఆసేతు హిమాచల పర్యంతంబాసర్వస్వము మా దేశం
ఆచంద్రార్కం బానందన వన మంకితమయ్యెను మా కోసం'[1]

ఈ గీతంలో వానమామలై వరదాచార్యులు ప్రగాఢమైన దేశ భక్తిని ప్రదర్శిస్తూ, పరదేశీయులను తొలగిపొండని హెచ్చరించారు.

'జయభేరి మ్రోగింది - జనులార లేవండి
జయము పొందెడిదాక - శాంతమూ లేదండి'[2]

అని మల్లాది చంద్రశేఖరరావు మడమతిప్ప గూడని అవిశ్రాంత సమరానికి ప్రజలను సమాయత్తం కమ్మంటున్నారు.

'స్వాతంత్ర్య సమరమ్ము - సాగింపగా వేగ
సహచరులతోగూడి రావోయీ!
సాగిపోవలె త్వరగ లేవోయి!!
స్వాతంత్ర్యమును గోరి - సామరస్యమ్ముగా
సల్పిన ప్రయత్నముల్ - సకలమ్ము చెడెనింక ॥స్వా॥
పారతంత్ర్యము బాప - పగతురతొ పోరాడి
ప్రాణముల్ వీడిన - ప్రథిత వీరుల దలచి ॥స్వా॥
విజయమును కాంక్షించి - వేవేగ రావోయి
విజయమో గాకున్న - వీరస్వర్గము నీకు ॥స్వా॥'

అనే గీతం స్వరాజ్య యోధులకు 'సమరాహ్వాన'మైంది.[3] మల్లాది రామచంద్రశాస్త్రి రాసిన ఈ గీతంలో శతాబ్దకాలం పాటు సాగిన శాంతియుత సత్యాగ్రహాల పరాకాష్టగా ప్రారంభమైన తుది సమరంలో విజయమో, వీరస్వర్గమో తేల్చుకుందాం రమ్మంటున్న పిలుపు ప్రతిధ్వనించింది. ఈ పిలుపుతోబాటు...

'లెండోయి లెండోయి - తండోప తండాలు
రండోయి రండోయి - జండాలు చేబూని'[4]

అనే విప్లవాహ్వానాన్ని మల్లాది స్వరాజ్య వీరులకు వినిపించారు.

ఆగష్టు విప్లవ ప్రతిధ్వనిగా 'నెత్తురు కలం' అనే గుప్త నామంతో కాశీ విశ్వనాథం 'ఆగష్టు గేయాలు' ఆలపించారు.

---

1, 2, 3, 4. 'జాతీయగీతాలు.'

శ్రీ శ్రీ మహాప్రస్థాన గీతం బాణీలో...
'స్వతంత్ర సమరం - స్వతంత్ర సమరం
స్వతంత్ర సమరం సాగిందోయ్
పదండి వేగమె - పదండి ముందుకు
జాతీయ జెండాచ్ఛాయల్లోనే'[1]

అనే గీతంలో కాశీ విశ్వనాథం - గుండెల్లో కత్తులు దూసుకుపోయినా, లాఠీలు తలలను చితకగొట్టినా, తూటాలు శరీరాలను తూట్లు పొడిచినా చలించకుండా స్వతంత్ర సమరం సాగిద్దామంటున్నారు.

'ఆగష్టు వీరుడ నేనేరా
ఆగష్టు విప్లవం నాదేరా
కరో మరో కథసంబిని నే
కదన భూమిలో కదలితిరా
మర ఫిరంగులను మార్కొని నే
మహిలో ఖ్యాతిని బొందితిరా'[2]

అంటూ ఆగష్టు విప్లవంలో బలైన 949 మంది భారతీయుల, 39 మంది తెలుగువీరుల ఆత్మ బలిదానాలను ఆవాహన చేసుకుని ఆగష్టు వీరుడను నేనే అని ఈ కవి చాటి చెప్పారు.

ఈ ఉద్యమంలో తమ ప్రాణాలను ఫణంగా పెట్టి బలైన వీర విద్యార్థులకు అంకితం చేస్తూ మిక్కిలినేని భగవంతరావు 'విద్యార్థుల వీరగేయాలు' వెలువరించారు.

1942 ఆగష్టు 12 వ తేదీ ('క్విట్ ఇండియా' తీర్మానం ఆమోదించిన నాలుగోరోజు) ఉదయం 8-30 గంటలకు తెనాలి విద్యార్థులు మొదటిసారిగా రైల్వేస్టేషన్‌పై దాడిచేసి, పూరీ ప్యాసింజర్ రైలును తగులబెట్టిన ఉదంతం విని...

'స్వాతంత్ర్య సమరమునకు - చేవదెచ్చావోయి
పరతంత్ర రాజుపై-బాకు దూశావోయి
దేశమెల్లడ నీకు విద్యార్థీ
త్యాగముద్రలు గలవు విద్యార్థీ
ఆగష్టు రణరంగమందు తెగబడి నీవు
కలుకు కత్తుల నూరి బరిగీసి కేకెట్ట

1, 2. 'ఆగష్టు గేయాలు' - కాశీ విశ్వనాథం 'నెత్తురు కలం'
మోడరన్ రైటర్స్ కాంగ్రెస్, బెజవాడ (26 జనవరి 1946).

తెల్ల దొరలానాడు విద్యార్థీ
తల్లడిల్లినారోయి విద్యార్థీ
తొడ చరిచి తెనాలి నడివీథిలో నాడు
దొరల సామ్రాజ్యమును దగ్ధంబు గావించి
వీరభారత జనని విద్యార్థీ
పేరు నిలిపావోయి విద్యార్థీ'[1]

అంటూ విద్యార్థులను భగవంతరావు అభినందించారు దేశమాత పేరు నిలిపిన వీరులుగా ప్రశంసించారు.

1946 అక్టోబర్‌లో డిటెన్షన్‌లకు వ్యతిరేకంగా తెనాలి పట్టణ విద్యార్థి కాంగ్రెస్ జరిపిన ఊరేగింపును చూసి...

'ఎలుగెత్తి చాటరా విద్యార్థీ
ఎదురేదిరా నీకు విద్యార్థీ
బాలచంద్రుడు నాకు పాలిజోదూయంచు
వీరాభిమన్యునకు వారసుడనేనంచు
సమరమునకు కాలుదువ్వు విద్యార్థీ
సాహసము నీదేర విద్యార్థీ'[2]

అనే గీతంలో వీర నేతాజీ చూపిన సమరమార్గంలో సాగిపోతున్న విద్యార్థులను ప్రళయరుద్రులుగా మారి బరిమీద దూకమని, భరతమాత సంకెళ్ళను పగులగొట్టమని 'మిక్కిలినేని' ప్రబోధించారు.

'క్విట్ ఇండియా' ఉద్యమకాలంలో పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారి 'దేశం' (గేయ కావ్యం), చేకుమళ్ళ కామేశ్వరరావుగారి 'వెలుగు' (గేయ కావ్యం), విశాలాక్షిగారి 'అభ్యుదయ గీతాలు', కరుణశ్రీగారి 'అరుణ కిరణాలు', తెన్నేటి సూరిగారి 'అరుణ రేఖలు' వెలువడ్డాయి.

'తెల్లదొరా! కల్లదొరా!
మాయదారి మల్లుదొరా!
ఇల్లు విడిచి దారి బట్టవోయ్ - తెలతెల్లవారె
కొల్లగొట్టువేళ దాటెనోయ్'[3]

---

1,2. 'విద్యార్థుల వీరగేయాలు'-మిక్కిలినేని భగవంతరావు, దేశికవితా మండలి, బెజవాడ.

3. 'అరుణరేఖలు' - తెన్నేటి సూరి.

అంటున్న తెన్నేటి సూరి-పెద్దమనిషిలాగా ప్రవేశించి, మిద్దెలు గట్టుకుని, గద్దెనెక్కి-కూచున్న తెల్లదొరను వచ్చిన దారిన తిరిగి వెళ్ళమని హెచ్చరించారు. కొల్లగొట్టుకు తినే కాలం తీరిందని స్పష్టం చేశారు.

అరుణకిరణాల వెలుతురులో యువభారత యుగోదయానికి, నవభారత నవోదయానికి స్వాగతం పలికిన కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి...

'కుచ్చితంపూ దొరల కుటిల కృత్యాలతో
బిచ్చగత్తెగనైన పిచ్చి భారతమాత
పచ్చ పచ్చగ పచ్చి బాలెంతయగురోజు
వచ్చిందిరా బాబు! వచ్చిందిరా'[1]

అనే శుభోదయానికి వాకిళ్ళు తెరిచారు. అన్నదమ్ముళ్లాగా అన్నిజాతుల వారూ కలిసి పొన్నపూలతో కన్నతల్లి పాదాలు పూజించే రోజు వచ్చిందని ఖచ్చితంగా చెప్పారు.

ఒకవైపు 'క్విట్టిండియా ఉద్యమం' సాగుతుంటే' మరోవైపు 'ఆజాద్ హింద్ ఫౌజ్' సేనలతో నేతాజీ సుభాష్ చంద్రబోస్ బ్రిటీషు ప్రభుత్వంపై యుద్ధం ప్రకటించారు. బోస్ బాబు దేశ ప్రజలకందించిన 'జైహింద్' నినాదం కల్పించిన ప్రేరణతో సూరిసెట్టి సాంబశివరావు శాస్త్రి 'జయ్‌హింద్' (జాతీయ-గీతాలు) వెలువరించారు.

'లెండి లెండి
లెండీ, విశాల భారతీ పిపాస దీర్చగాన్
జైహింద్ నేతాజీ యని వెళదాంపదండి'[2]

అనే గీతంలో బాపూజీ నేర్పిన క్విట్టిండియా మంత్రానికీ, నేతాజీ సాగిస్తున్న ఆజాద్ హింద్ సైనిక యుద్ధానికి సమన్వయం చూపే ప్రయత్నం కనబడుతుంది.

'చల్ చల్‌రే నౌ జవాన్' శీర్షికన ఆజాద్ హింద్ జాతీయ సైనికులను జయశంఖమూదమని ఉత్సాహపరుస్తూ కరుణశ్రీ రాసిన గీతంలో...

'ఊదరా! ఊదరా! ఊదరా! సోదరా!
ఉడుకు రక్తపు పొంగు లుప్పొంగ జయశంఖ మూదరా!
ఉరకరా! ఉరకరా! ఉరకరా! సోదరా!
విధుర ప్రజారుధిర మధురసోన్మదులపై ఉరకరా!

---

1. 'అరుణకిరణాలు' - కరుణశ్రీ.
2. జయ్‌హింద్ (జాతీయగీతాలు) - సూరిసెట్టి సాంబశివరావు శాస్త్రి.

నిలుపరా! నిలుపరా! నిలుపరా! సోదరా!
జ్యోతిఃప్రపూత జాతీయ విజయధ్వజము నిలుపరా!'[1]

అంటూ పరాయిపాలనకు వ్యతిరేకంగా జరుగుతున్న తుట్టతుది పోరులో విజయశంఖ మూదమని, ప్రజాకంటకులపై ఉద్రేకంతో ఉరకమని, జాతీయ జండా గౌరవాన్ని నిలుపుమనే ఆదేశం ప్రతిఫలిస్తుంది.

నిరసనలతో ప్రారంభమై... ఆందోళనల రూపాన్ని ధరించిన జాతీయ, స్వాతంత్ర్య ఉద్యమాల ఉధృతిని తట్టుకోలేని బ్రిటిష ప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. 1947 ఆగష్టు 15 నాడు దేశమాత సంకెళ్ళు తెగిపోయాయి. స్వేచ్ఛాభారతి శిరస్సుపై త్రివర్ణపతాకం రెపరెపలాడింది.

'పవిత్ర భారత సవిత్రి కోహో
స్వతంత్రోత్సవం సాగింది
లాల్‌ఖిల్లాపై అశోకచక్రపు
త్రివర్ణకేతన మెగిరింది '[2]

అంటూ తెలుగు కవులు విజయగీతికలు గానం చేశారు. శతాబ్దాల స్వప్నాలు ఫలించిన ఆనందోత్సాహాలతో మాతృభూమిపై మమతానురాగాలు కురిపించారు. హిమాలయాలు మొదలు కన్యాకుమారివరకు విశాల భారతావని స్వేచ్ఛాగీతికలతో మార్మోగింది. మూడు రంగుల జెండా జాతి గౌరవానికి ప్రతీకగా నిలిచింది. విభిన్న జాతి, కుల, మతాలతోకూడిన దేశం సమైక్యతా సంగీతాన్ని ఆలపించింది.

1. విరసం ఆవిర్భవించాక శ్రీశ్రీ రాసిన 'ఊగరా! ఊగరా! ఊగరా! ఉరికొయ్య పట్టుకుని ఊగరా!' గీతం ఇదే బాణీలో సాగుతుంది.
2. 1947 ఆగష్టు 15 అర్ధరాత్రి 12 గంటలకు పేరూరులో జరిగిన సభలో గౌతమీ కోకిల 'వేదుల' గానం చేసిన గీతం.

# 4
# ఆంధ్రోద్యమం

భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా తెలుగు నలపై తలెత్తిన సాంస్కృతిక - రాజకీయోద్యమమే 'ఆంధ్రోద్యమం.' ముక్కలైన తెలుగు వారిని ఏకంచేసి, తెలుగుజాతి ఒక సమైక్య జాతిగా మనుగడ సాగించడానికి, అన్ని రంగాల్లో ముందడుగు వేయడానికి దారి చూపిన మహోద్యమమే 'ఆంధ్రోద్యమం '

ఈ శతాబ్దారంభం నాటికి కోస్తాంధ్ర, రాయలసీమ ప్రాంతాలు మద్రాస్ రాజధానిగా బ్రిటీషు పరిపాలన కింద ఉండేవి. తెలంగాణా ప్రాంతం హైదరా బాద్ రాజధానిగా నైజామ్ నవాబు పరిపాలన కింద ఉండేది. అటు తమిళ భాషా ధిక్యత, ఇటు ఉర్దూ భాషాధిక్యతల మధ్య 'తెలుగు' నలిగిపోయింది. పరాయీల నిరాదరణకు గురైన తెలుగు భాష, తెలుగు సంస్కృతి తమ ఉనికిని వెతుక్కో నారంభించాయి.

## ఆంధ్రలో ఆంధ్రోద్యమం

లోకమాన్య బాలగంగాధరతిలక్ ప్రారంభించిన స్వదేశీ ఉద్యమం, బెంగా లీల జాతీయ విద్యా సంస్థలు, వీరేశలింగం పంతులుగారు ప్రబోధించిన మాతృ భాషాభిమానం, కాంగ్రెస్ స్వరాజ్యం, తెలుగువారికి ఉద్యోగాలు కావాలన్న ఉద్యోగాకాంక్ష - వంటి హేతువులు ఆంధ్రులలో ఆంధ్రాభిమానాన్ని రేకెత్తించ డానికి దోహదం చేశాయి. బందరులో జాతీయ నాయకులు శ్రీ కోపల్లె హనుమంత రావు 'ఆంధ్రజాతీయ కళాశాల'ను ప్రారంభించారు. శ్రీ ముట్నూరి కృష్ణారావు 'కృష్ణా కర్మాగారాన్ని' నెలకొల్పారు. హైదరాబాద్‌లో కొమర్రాజు లక్ష్మణరావు, రావిచెట్టు రంగారావుగార్లు 'విజ్ఞానచంద్రికా గ్రంథమండలి'ని ప్రారంభించారు. జాతీయ విద్య, స్వదేశీ పరిశ్రమలు, మాతృభాష ద్వారా విజ్ఞాన ప్రచారాలతో 1906 ప్రాంతంలో ప్రారంభమైన మాతృదేశాభిమానం, ఆంధ్ర జాతీయా భిమానంగా రూపొందింది.[1]

ఇది క్రమంగా పెరిగి పెద్దదై, ఉద్యమ రూపం దాల్చింది. ఈ ఉద్య మాన్ని స్థూలంగా నాలుగు దశలుగా విశ్లేషించవచ్చు.

---

1. "విశాలాంధ్రం" - వావిలాల గోపాలకృష్ణయ్య (పుట: 20).

1. భావాభివ్యక్తి దశ - 1900 నుండి 1912 వరకు.
2. ప్రచార దశ - 1912 నుండి 1920 వరకు.
3 స్తబ్ధ దశ - 1920 నుండి 1947 వరకు
4. ఆందోళన దశ - 1947 నుండి 1953 వరకు.

వీటిలోని మొదటి రెండు దశల్లో విద్యావంతులు, మేధావులు, రాజకీయ నాయకులు, సాహితీవేత్తలు ప్రధాన భూమికను నిర్వహించారు. చివరిదశలో పై శ్రేణులతో బాటు ప్రజలు కూడా ప్రధానమైన పాత్రను నిర్వర్తించారు.

## నేపథ్యం

దాదాపు అర్ధశతాబ్దం పాటు సాగిన ఆంధ్రోద్యమ నేపథ్యాన్ని అధ్యయనం చేయాల్సి ఉంది.

1910 లో విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి 'ఆంధ్రుల చరిత్రము'ను ప్రచురించింది. ఈ గ్రంథం విద్యావంతులైన ఆంధ్రుల్లో విశేష ప్రాచుర్యాన్ని పొందింది. రాజకీయ - చారిత్రకాంశాల్లోనూ, నాగరికతా - సంస్కృతుల్లోనూ ఆంధ్రజాతి, దేశంలోని ఏ ఇతర జాతికన్నా తక్కువ కాదన్న చారిత్రిక స్ఫూర్తిని ఈ గ్రంథం చాటి చెప్పింది.

అప్పటి ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ఉన్న జిల్లాల్లో దాదాపు 40 శాతం తెలుగు జిల్లాలుండేవి వీటిలో 58 శాతం తెలుగు ప్రజలు నివసించేవారు వీరు తమిళుల కంటే, ఇతర తెలుగేతర ప్రజలకంటే అన్ని రంగాల్లోనూ వెనుకబడి ఉండేవారు. ఈ నేపథ్యంలో తమిళులు, తెలుగువారిపట్ల చేసిన అమర్యాదకర వ్యాఖ్యానాలు క్రమంగా తెలుగు ప్రజల్లో జాతీయ చైతన్యాన్ని కలిగించసాగాయి.

1911 లో ఒకానొక ఆంధ్ర పట్టణం నుండి మద్రాసు నగరానికి రైల్లో ప్రయాణిస్తున్న తమిళ ప్రయాణీకుడు, సాటి తెలుగు ప్రయాణీకునితో- "తెలుగు వారు వెనుకబడిన జాతివారు. వాళ్ళకు మొనఖ్యుండవు మా భావ్యం అయ్యంగార్, లేదా ముత్తుస్వామి అయ్యర్ వంటి మహనీయులు ఆ జాతిలో లేరు'' అని వ్యాఖ్యానించాట్ట[1]. దీనికి ప్రతిస్పందనగా 1911 ఏప్రిల్ చివరి రెండు వారాల్లో "The Hindu" పత్రికలో ఒక లేఖకుడు వరుసగా ఆరు వ్యాసాల ద్వారా మద్రాస్ రాష్ట్రంలో అప్పటి ఆంధ్రుల స్థానాన్ని వివరించాడు. ఆంధ్రుల వెనుకబాటుతనానికి ప్రధాన కారణం, వారికో సొంత రాష్ట్రమంటూ లేకపోవడమేనన్న భావాన్ని ఆ లేఖకుడు కల్పించాడు.

---

1. Quoted in the Essay "Are the Telugus a Backward People?" Published in "The Hindu" (Madras) 15 th April 1911.

సరిగ్గా ఈ సంఘటనలకు రెండు నెలలకు పూర్వమే గుంటూరు నుండి వెలువడే 'దేశాభిమాని' (ఆంగ్ల - తెలుగు వార పత్రిక)లో ఒక సంపాదకీయం అచ్చయ్యింది. అది తెలుగు ప్రజల్లో సమైక్యతను, సఖ్యతను, సౌభ్రాతృత్వాన్ని సాధించే ఉద్దేశ్యంతో ఆంధ్రుల రాజకీయ సభ ఒకటి జరగాలని ప్రగాఢంగా వాంఛించింది.[1]

1911 సెప్టెంబర్ మాసంలో గుంటూరులో ఒక న్యాయ స్థానంలో డఫేదారు (జవాను) ఉద్యోగానికి ప్రకటన వెలువడింది. ఆ ఉద్యోగానికి చాలా మంది తెలుగువారు దరఖాస్తు చేశారు కానీ అదే న్యాయస్థానంలో పనిచేస్తున్న ఒక తమిళ సబ్‌జడ్జి తన స్వస్థలం కుంభకోణంకు చెందిన ఒక తమిళునికి ఆ ఉద్యోగం ఇచ్చాడు.[2] ఈ సంఘటన సహజంగానే గుంటూరు విద్యావంతుల్లో ఆగ్రహాన్ని కలిగించింది. జిల్లాలో ఇంకా చాలమంది తమిళ ఉద్యోగులు ఉన్నారన్న విషయాన్ని తెలుసుకునేలా చేసింది. అప్పటికే గుంటూరులో ఏర్పడిన 'యువజన సాహితీ సమితి'[3] అక్కడి ప్రజల ఆగ్రహానికి దర్పణం పట్ట సాగింది.

1911 డిసెంబర్ 12 నాటి 'ఆంధ్రకేసరి'లో ఒక లేఖకుని విజ్ఞప్తి డిసెంబర్ 21 నాటి 'దేశాభిమాని' పత్రికలో శ్రీ ఎన్ నారాయణరావుగారి లేఖ, డిసెంబర్ 26 నాటి 'దేశాభిమాని'లో చల్లా శేషగిరిరావుగారి వ్యాసం, 'కృష్ణా పత్రిక' సంపాదకీయాలు ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలన్న కోరికను వ్యక్తం చేశాయి. 1912 కల్లా ప్రధాన వార్తాపత్రికలైన ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రిక, ఆంధ్రకేసరి, దేశాభిమాని ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని బల పరచడం, వ్యాసాలు, ఉత్తరాలద్వారా ఈ అంశంపై విస్తృత చర్చ జరగడం ప్రారంభమయ్యింది.

బెంగాల్‌నుండి బీహార్ ప్రాంతాన్ని విడదీసిన సందర్భంలో మాట్లాడుతూ 1911 ఆగస్టు 11వ తేదీనాడు భారత రాజ్య కార్యదర్శి ప్రసంగవశాత్తూ భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ భావాన్ని వ్యక్తం చేశారు. ఇది రాజకీయ చైతన్యంగల ఆంధ్రుల్లో స్వరాష్ట్ర కాంక్షను ఉద్దీపింపజేసింది.

1 Deshabimani (Guntur), 4 February 1911.

2. ఆంధ్ర రాష్ట్ర అవతరణ (వ్యాసం) - ప్రొ. కె. వెంకటేశ్వర్లు, డి సూరజ్ నాయుడు. 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' పుట 662.

3. 1903 - 04 సం॥ల్లో ఏర్పడిన 'యువజన సాహితీ సమితి' సంస్థాపకులు శ్రీ వై. గుర్నాథం.

## నిడుదవోలు మహాసభ - మే, 1912

ఈ నేపథ్యంలో మే, 1912లో గోదావరి, కృష్ణ, గుంటూరు జిల్లాల సంయుక్త మహాసభ నిడుదవోలులో జరిగింది. ప్రముఖ స్వాతంత్ర్య యోధుడు శ్రీ వి. రామదాసుగారి అధ్యక్షతన జరిగిన ఈ మహాసభలో మొట్టమొదటిసారిగా ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలన్న అంశంపైన చర్చ జరిగింది. అయితే కేవలం మూడు జిల్లాల మహాసభలో ఈ తీర్మానం ఆమోదింపబడేకన్నా విస్తృత ప్రాతిపదికపై అన్ని తెలుగు జిల్లాల ప్రతినిధులతో ఒక 'ఆంధ్ర మహాసభ' జరగాలనీ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ సమస్య చర్చించాలనీ నిర్ణయింపబడింది.

## ప్రథమాంధ్ర మహాసభ, 1913

'దాదాపు 800 మంది ప్రతినిధులతో, 2,000 మంది సందర్శకులతో ప్రథమాంధ్ర మహాసభ శ్రీ బయ్యా నరసింహశర్మ (అప్పటి మద్రాస్ శాసన మండలి సభ్యులు)గారి అధ్యక్షతన 26 మే, 1913 నాడు బాపట్లలో జరిగింది. మద్రాసు రాష్ట్రంలోని తెలుగు జిల్లాల ప్రతినిధులు ఇందులో పాల్గొన్నారు.'[1] వీరితో బాటు హైదరాబాద్, వరంగల్, నాగపూర్ వంటి నిజామాంధ్ర రాష్ట్ర ప్రతినిధులు కూడా ఈ మహాసభలో పాల్గొన్నారు. ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని గురించి అటు ప్రతినిధుల సభలోనూ, ఇటు బహిరంగసభలోనూ తీవ్రమైన చర్చలు జరిగాయి. శ్రీ వి. రామదాసుగారు ప్రతిపాదించిన 'ప్రత్యేక రాష్ట్ర నిర్మాణం' తీర్మానాన్ని ప్రముఖ రాజకీయ నాయకులు శ్రీ ఎన్. సుబ్బారావు, ఎం. ఆదినారాయణయ్య, ఎం రామచంద్రరావు వంటివారు వ్యతిరేకించారు. సుదీర్ఘ చర్చల తరువాత 'ప్రత్యేక రాష్ట్ర విషయాన్ని గూర్చి ప్రజాభిప్రాయాన్ని నిర్ధారణ చేసి రాబోవు మహాసభకు నివేదించాలని' ఆ మహాసభ తీర్మానించింది.

## ప్రచార కమిటీ

ప్రథమాంధ్ర మహాసభ సందేశాన్ని విస్తృతంగా ప్రచారంచేస్తూ, ప్రజాభిప్రాయాన్ని సేకరించడానికి ఒక ప్రచార కమిటీ ఏర్పాటయింది. ఆ కమిటీలో శ్రీ కొండా వెంకటప్పయ్య, డా॥ పట్టాభి సీతారామయ్య, శ్రీ ముట్నూరి కృష్ణారావు, శ్రీ వి. సూర్యనారాయణగార్లు ఉన్నారు.[2] వీరు తెలుగు జిల్లాలన్నిటా విస్తృతంగా పర్యటించారు. ముఖ్యంగా రాయలసీమ జిల్లాలైన నంద్యాల, గూటి,

1. The Hindu (Madras) 28 May, 1913.
2. The Birth of the Andhra Movement (Essay) from History of Modern Andhra - P. R Rao (Page: 85)

అనంతపురం, బళ్ళారి, చిత్తూరు, కడప, నెల్లూరు వంటి జిల్లాల్లో ఏర్పాటైన బ్రహ్మాండమైన బహిరంగ సభల్లో ప్రసంగించారు. ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణానికి రాయలసీమ ప్రజలు సుముఖంగా ఉన్నారనీ, కేవలం కొందరు తమిళ న్యాయవాదులు మాత్రం తాము మద్రాస్ రాష్ట్రంలోనే కొనసాగాలనుకుంటున్నారనీ గ్రహించారు. శ్రీ కొండా వెంకటప్పయ్యగారు బరంపురం, విశాఖపట్నం, కాకినాడ, రాజమండ్రి వంటి ప్రధాన కేంద్రాల్లో ఏర్పాటయిన బహిరంగ సభల్లో ప్రసంగించారు.

ఒకవైపు ఈ నాయకుల ప్రసంగాలు, ఇంకోవైపు పత్రికల్లో వ్యాసాలు, మరోవైపు విశాఖపట్నం, నెల్లూరు మొ॥ జిల్లా మహాసభలు 'ఆంధ్రరాష్ట్ర నిర్మాణ కాంక్ష'ని ప్రజల ఆలోచనల్లో, చర్చల్లో పదునుపెట్టసాగాయి.

11 ఏప్రిల్ 1914 నాడు శ్రీ న్యాపతి సుబ్బారావుగారి అధ్యక్షతన విజయవాడలో ద్వితీయాంధ్ర మహాసభ జరిగింది. 'మద్రాస్ రాష్ట్రంలోని తెలుగు ప్రాంతాలతో ఒక ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు కావాలి' అన్న తీర్మానం అత్యధిక మెజారిటీ సభ్యుల ఆమోదం పొందింది.

మే, 1915 న విశాఖపట్టణంలో జరిగిన తృతీయాంధ్ర మహాసభ మరొక అడుగు ముందుకువేసి 'రాష్ట్ర నిర్మాణం అవశ్యం గావున ప్రభుత్వం త్వరగా రాష్ట్ర నిర్మాణం గావించాలి' అని తీర్మానం చేసే స్థాయికి చేరింది. 'సెకండరీ స్కూల్ స్థాయిలో మాతృభాషలో విద్యాబోధన జరగాలి' అనే కోరికను ఈ మహాసభ డిమాండ్ చేసింది. మద్రాస్ నుండి వెలువడే తమిళ దినపత్రిక 'స్వదేశ మిత్రన్' ఈ డిమాండ్‌ను ఆహ్వానించింది.

సభల్లో, సమావేశాల్లో, బహిరంగ సభల్లో ప్రసగించే వక్తలు తెలుగులో మాట్లాడే అలవాటును, ఒక నూతన సంస్కారాన్ని ఈ ఆంధ్రమహాసభ వేదికలు అలవరిచాయి.

మే, 1916 లో చతుర్థాంధ్ర మహాసభ కాకినాడలో శ్రీ మోచర్ల రామచంద్రరావుగారి అధ్యక్షతన జరిగింది.

అవి మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులు. 'ఆంధ్రమండలములను కలిపి ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయడం అవశ్యం, యుక్తం కాబట్టి యుద్ధం ముగిసిం తర్వాత సాధ్యమైనంత త్వరగా ఆంధ్ర రాష్ట్రాన్ని ఏర్పాటు చేయాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ' తీర్మానం ఆమోదించబడింది.

దేశాన్ని భాషా ప్రాతిపదికపై పునర్నిర్మించాలని కోరుతూ ఒక విజ్ఞాపన పత్రాన్ని ఈ మహాసభ 'భారత జాతీయ కాంగ్రెస్'కు అందజేసింది.

తెలుగువారిలో ప్రబలుతున్న ఈ జాతీయ స్వాతంత్ర్యకాంక్షను బ్రిటీషు ప్రభుత్వం సహించలేకపోయింది మొదటి ప్రపంచ యుద్ధంలో భారతదేశం పక్షాన యుద్ధం చేయడానికి నియమింపబడుతున్న సైనికుల్లో ఉత్తర సర్కార్ జిల్లాల తెలుగువారు పనికిరారని నిర్ణయించింది. జాతీయ అభిమానం కల ఆంధ్ర యువకులు దీనిని అవమానంగా భావించారు. ఆంధ్ర మహాసభ ద్వారా ప్రభుత్వ నిర్ణయానికి వ్యతిరేకంగా తమ నిరసనను వ్యక్తం చేశారు. ప్రభుత్వం చేత పై ప్రకటనను రద్దు చేయించగలిగారు.

1 జూన్, 1917 లో పంచమాంధ్ర మహాసభ నెల్లూరులో శ్రీ కొండా వెంకటప్పయ్యగారి అధ్యక్షతన జరిగింది. 'ఆంధ్ర మహాసభ ఆందోళన ఫలితంగా ఆంధ్రులకు మళ్ళీ యుద్ధ సైనిక అర్హత వచ్చిందని, ఆంధ్ర యువకులందరూ సైనికులుగా చేరి ఆంధ్ర పౌరుషమును నిల్పవలె'నని శ్రీ కొండా వెంకటప్పయ్యగారు ఉద్బోధించారు.[1]

'యుద్ధం ముగియగానే సాధ్యమైనంత త్వరగా ఆంధ్ర రాష్ట్రాన్ని నిర్మించాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేస్తూ' మహాసభ తీర్మానాన్ని ఆమోదించింది.

డిశంబర్, 1917న కలకత్తాలో అనీబిసెంట్‌గారి అధ్యక్షతన జరిగిన భారత జాతీయ కాంగ్రెసు మహాసభ 'ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెసు కమిటీ'ని ఏర్పాటు చెయ్యాలని తీర్మానించింది. దీనిని అనీబిసెంట్, గాంధీజీ వ్యతిరేకించారు. తిలక్, డా॥ పట్టాభి. సీతారామయ్యల వాదనాబలంతో ఈ తీర్మానం ఆమోదించబడింది. ఇది ఆంధ్ర మహాసభ సాధించిన తొలి విజయమని చెప్పవచ్చు.

## మాంటేగ్ - చేమ్స్‌ఫర్డ్ సంస్కరణలు

భారతదేశంలో పరిపాలనా సంస్కరణల విషయమై పరిశీలించటానికి 1918 లో భారత రాజ్య కార్యదర్శి మాంటేగ్ మన దేశానికి వచ్చినప్పుడు ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతూ ఆంధ్ర ప్రముఖులు తమ విజ్ఞాపన పత్రాలను అందజేశారు. 6 ఫిబ్రవరి, 1918 నాడు కేంద్ర శాసనమండలిలో మొట్టమొదటి సారిగా శ్రీ బయ్యా నరసింహశర్మగారు 'భాషా ప్రాతిపదికపై ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతూ' తీర్మానం ప్రవేశ పెట్టారు. ఇది ఆమోదింపబడకపోయినా దేశ వ్యాప్తంగా చర్చల్నీ సంచలనాన్నీ రేకెత్తించింది. ఈ నేపథ్యంలో ఆంధ్రుల భాషా రాష్ట్ర వాంఛ న్యాయమైనదేనని మాంట్‌ఫర్డ్ నివేదిక అంగీకరించింది. దాంతో 1919 ఇండియా చట్టంలోని 52 (ఎ) ప్రకరణం 'రాష్ట్ర శాసనసభలో

1. 'విశాలాంధ్రం' - వావిలాల గోపాలకృష్ణయ్య, పుట : 27.

అత్యధిక సంఖ్యాకులు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణాన్ని అంగీకరిస్తూ తీర్మానిస్తే ప్రభుత్వం అందుకు సమ్మతించవచ్చు' - అని రాష్ట్ర విభజనకు అవకాశం కలిగించింది.[1] ఈ ప్రకరణం కల్పించిన అవకాశాన్ని దృష్టిలోపెట్టుకొని అనేక సార్లు కేంద్ర, రాష్ట శాసనసభల్లో ఆంధ్రరాష్ట నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు ప్రవేశపెట్టబడినాయి. అయినా ఆంధ్రరాష్ట్ర నిర్మాణం మాత్రం దేశం స్వతంత్ర మయ్యేవరకు జరగలేదు.

## ఆంధ్రోద్యమంలో స్తబ్దత

బ్రిటిషు ప్రభుత్వం ప్రవేశపెట్టిన రౌలట్ చట్టాన్ని వ్యతిరేకిస్తూ భారత ప్రజలు సాగించిన ప్రతిఘటన, జలియన్‌వాలా బాగ్ మానవ మారణహోమం, తర్వాత 1920 కలకత్తా కాంగ్రెసు అత్యవసర సమావేశం సత్యాగ్రహ ఉద్యమాన్ని తీవ్రతరంచేసే నిర్ణయం తీసుకుంది. దీంతో దేశవ్యాప్తంగా జాతీయోద్యమం పరవళ్ళుతొక్కింది. ఫలితంగా 1920 నుండి 1937 వరకూ దాదాపు 17 సం॥లపాటు తెలుగు ప్రజలు ఆంధ్రోద్యమం నుండి జాతీయోద్యమంలోకి ప్రవేశించారు. ఫలితంగా చాలాకాలంపాటు ఆంధ్రోద్యమంలో స్తబ్దత ఏర్పడింది. ఈమధ్యకాలంలో ఆంధ్ర మహాసభ సమావేశాలు స్థంబించిపోయాయి. భారత జాతీయ స్వాతంత్ర్యమే భాషాప్రయుక్త రాష్ట్రాలను ఏర్పాటు చేయగలదనే విశ్వాసం ఆంధ్ర నాయకులకు కలిగింది. అందుకే 'బ్రిటిషు ప్రభుత్వాన్ని ఈ విషయమై అభ్యర్థించటంకన్నా స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని నిర్మించుకోవటమే మిన్న' అనే అభిప్రాయం ఆంధ్రుల్లో వికసించింది. దానితో ఆంధ్రోద్యమం కల్పించిన ఉత్సాహం, ఉద్రేకాలతో ఆంధ్రజాతి భారత స్వాతంత్ర్య సమరంలో చారిత్రాత్మకమైన పాత్రను నిర్వర్తించింది.

## ఆంధ్రోద్యమ నినాద పునరుద్ధరణ

1935 నాటి భారత ప్రభుత్వ చట్టం క్రింద ఒరియాభాష మాట్లాడేవారికి 'ఒరిస్సా' రాష్ట్రాన్ని, సింధి మాట్లాడేవారికి 'సింధు' రాష్ట్రాన్ని ఏర్పాటుచేసిన బ్రిటిషు ప్రభుత్వం - ఆంధ్రులు మూడు దశాబ్దాలుగా కోరుతున్న 'ఆంధ్ర' రాష్ట్రాన్ని మాత్రం నిర్లక్ష్యం చేసింది. అయితే, 1937లో జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో భారత జాతీయ కాంగ్రెసు పార్టీని మద్రాసు రాష్ట్రంలో అధికారాన్ని సంపాదించటంతో ఆంధ్రోద్యమ నినాదం పునరుద్ధరింపబడింది. 1938లో నెహ్రూగారి అధ్యక్షతన కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశంలో 'భాషా ప్రాతిపదికపై రాష్ట్రాలను పునర్నిర్మించాలనీ, దానికోసమై

1. ఆంధ్ర రాష్ట్ర అవతరణ (వ్యాసం)-ప్రొ. కె. వెంకటేశ్వర్లు, డి. సూరమ్ నాయుడు, "ఆంధ్రప్రదేశ్ దర్శిని" పుట : 563.

శాసనసభల్లో తీర్మానాలు చెయ్యా'లని నిర్ణయించింది. ఈ నిర్ణయం ప్రకారం 1938 మార్చిలో మద్రాసు శాసనసభ 'ఆంధ్ర, తమిళ, కర్ణాటక, కేరళ ప్రాంతాలను భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజించా'లని ఏకగ్రీవ తీర్మానం చేసింది. కానీ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి వ్యతిరేకి అయిన అప్పటి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ సి రాజగోపాలాచారి విముఖతవల్ల ఆంధ్రరాష్ట్ర నిర్మాణంలో అడ్డంకు లేర్పడ్డాయి.

## శ్రీబాగ్ ఒడంబడిక

1937 అక్టోబర్‌లో విజయవాడలో ఆంధ్రమహాసభ రజతోత్సవ సమావేశం జరిగింది. ముందు ముందు ఏర్పడవలసి ఉన్న భాషాప్రయుక్త రాష్ట్రంలో రాయలసీమ జిల్లాల హక్కులను రక్షించటానికి కొన్ని ప్రత్యేకమైన సూచనలు చేసే కమిటీని ఈ సమావేశంలో ఏర్పాటు చేశారు. ఈ కమిటీ సభ్యులు మద్రాసులోని కాశీనాథుని నాగేశ్వరరావుగారి నివాస భవనం 'శ్రీబాగ్'లో 16 నవంబర్, 1937 న సమావేశమై, ఆంధ్రరాష్ట్రంలో రాయలసీమ రక్షణల విషయమై ఒక అంగీకారానికి వచ్చారు. ఈ కమిటీ సభ్యులలో సర్కారు, రాయలసీమ ప్రాంతాల ప్రముఖ నాయకులు శ్రీయుతులు కొండా వెంకటప్పయ్య దేశిరాజు హనుమంతరావు, కె. కోటిరెడ్డి, హెచ్. సీతారామిరెడ్డి, కల్లూరు సుబ్బారావు. గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగార్లు వున్నారు. ఈ కమిటీ ఆమోదించిన ఒడంబడికనే 'శ్రీబాగ్ ఒడంబడిక' అంటున్నాం. దీని ప్రకారం

1. ఆంధ్ర విశ్వవిద్యాలయం కింద రెండు విశ్వవిద్యాలయ కేంద్రాలను ఏర్పాటు చేయాలి. అందులో ఒకటి విశాఖపట్టణంలోనూ రెండవది అనంతపురంలోనూ వుండాలి.

2. సేద్యపు నీటి సౌకర్యాల విషయంలో రాయలసీమ అవసరాలు ముందు తీర్చాలి.

3 జనాభా సంఖ్యతో నిమిత్తం లేకుండా రాష్ట్ర పరిపాలనా వ్యవస్థలో అన్ని జిల్లాలకూ సమాన ప్రాతినిధ్యం వుండాలి.

4. రాష్ట్ర రాజధానిని నిర్ణయించడంలోనూ, రాష్ట్ర హైకోర్టును ఏర్పాటు చేసే స్థలం విషయంలోనూ రాయలసీమ ప్రతినిధుల అభిప్రాయమే తుది నిర్ణయంగా ఉండాలి

ఈ ఒడంబడిక తర్వాత సర్కారు, రాయలసీమ జిల్లాల నాయకుల మధ్య ఒక అవగాహన ఏర్పడింది. 'శ్రీబాగ్' ఒడంబడికపై సంతకాలు చేయడమయ్యాక మద్రాస్ శాసనసభలోని సభ్యులు ఆంధ్ర, తమిళ, కేరళ, కర్నాటక రాష్ట్రాలను భాషా ప్రాతిపదికపై పునర్నిర్మించమని బ్రిటిష్ ప్రభుత్వాన్ని

కోరుతూ తీర్మానం చేయడానికి ముఖ్యమంత్రిపై ఒత్తిడి తేవడం ప్రారంభించారు. 'ఈ భాషాప్రయుక్త రాష్ట్రాల్లో మొదటి మెట్టుగా ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలి' అనే మాటను తీర్మానంలో చేర్చాల్సిందిగా శ్రీ కె.వి. రెడ్డినాయుడు గారు చేసిన ప్రతిపాదన వీగిపోయింది. ఏమైతేనేం ఒక తీర్మానం మాత్రం మద్రాస్ శాసనసభలో 21 ఏప్రిల్ 938 నాడు ఆమోదింపబడి కేంద్ర ప్రభుత్వానికి పంపడం జరిగింది. కాని బ్రిటిష్ ప్రభుత్వం మే 2 వ తేదీనాడు 'హౌజ్ ఆఫ్ కామన్స్'లో ఓ ప్రకటన చేసింది. 'భారతదేశంలో కొత్త రాష్ట్రాలను నిర్మించడం జరగదు' అని ఆ ప్రకటన సారాంశం. ఇది ఆంధ్రులను దిగ్భ్రాంతుల్ని చేసింది. మద్రాస్ ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలచారి ప్రభావంతోనే ఈ ప్రకటన వెలువడిందని తెలుగుప్రజలు భావించారు. అప్పటి మద్రాస్ శాసన సభలోని స్పీకర్ శ్రీ బులుసు సాంబమూర్తిగారు తమ పదవికి రాజీనామా చేసి ఆంధ్రోద్యమంలో క్రియాశీలక పాత్రను వహించాలని నిర్ణయించారు. కానీ కాంగ్రెస్ పార్టీ అధిష్టానవర్గం సూచన మేరకు ఆయన తన నిర్ణయాన్ని విరమించుకున్నారు.

## మరోసారి స్తబ్ధత

1938 వ సంవత్సరంలో కాంగ్రెస్‌పార్టీ నాయకత్వ ధోరణి మారింది. అప్పటివరకు 'ఆంధ్రోద్యమం'లో ప్రధాన పాత్రనే వహించిన కాంగ్రెస్ నాయకత్వం ఒక కొత్త నినాదాన్ని ప్రారంభించింది. 'ముందు దేశస్వాతంత్ర్యం - తరువాత ఆంధ్ర రాష్ట్రం' అన్నది. 'భాషా ప్రయుక్త రాష్ట్రకాంక్ష జాతీయ సమైక్యతకే విరుద్ధం' అనడం కూడా మొదలుబెట్టింది. జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్ వంటి నాయకులు కూడా 'దేశంలో ఎన్నో ప్రధానమైన సమస్యలున్నాయ్, గనక ఆ సమస్యలు ముందు తరువాత ఆంధ్రరాష్ట్రం' అని ప్రకటనలు చేశారు.

సెప్టెంబర్ 1939 లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యింది. ఆయా రాష్ట్రాల్లో అధికారంలో ఉన్న కాంగ్రెస్ మంత్రి వర్గాలు నవంబర్ 1939 లో రాజీనామాలు చేశాయి. ఆంధ్రోద్యమం మళ్ళీ కొంతకాలం పాటు స్తబ్ధతలో పడిపోయింది. ఒకవైపు కాంగ్రెస్ నాయకత్వం అనాసక్తత, మరోవేపు ప్రపంచ యుద్ధ తీవ్రత ఆంధ్రోద్యమాన్ని కుంటుపరిచాయి.

## తెలంగాణాలో ఆంధ్రోద్యమం

ఒక వైపు మద్రాస్ రాజధానిగా కల ఆంధ్ర ప్రాంతంలో ఆంధ్రోద్యమం ముమ్మరంగా జరుగుతున్నప్పటికీ తెలంగాణా ప్రాంతంలో మాత్రం 1920

తర్వాతే ఇది మొదలైంది. అయితే ఉధృతంగా కాకపోయినా ఉద్యమానికి కావలసిన భూమికను ఏర్పరచిన వివిధ సంస్థల కృషి చిరస్మరణీయం.

## సాంస్కృతిక పునరుజ్జీవనం

ఈ శతాబ్దారంభం నుండే తెలంగాణాలో సాంస్కృతిక పునరుజ్జీవనానికి ప్రయత్నాలు ఆరంభమయ్యాయి. కీ. శే. రావిచెట్టు రంగారావు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు, శ్రీ రాజా నాయని వేంకట రంగారావుగార్లు వారి మిత్ర బృందంతో కలిసి 1901 లోనే సుల్తాన్ బజార్‌లో 'శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయం' స్థాపించారు. దీనికి గ్రంథాలను సమకూర్చడానికి 'విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలి'ని ప్రారంభించారు

వరంగల్లు జిల్లాలోని 'ఇనుగుర్తి' అనే గ్రామంలో కీ. శే. వద్దిరాజు సీతా రామచంద్రారావు, రాఘవ రంగారావుగార్లు అనేక నవలలు, నాటకాలు, భాషా విషయిక గ్రంథాలు రాయడమేగాక, 'విజ్ఞాన ప్రచారిణీ గ్రంథమాల'ను నెల కొల్పి సారస్వత సృజనకు దోహదం చేశారు. 'తెలుగు పత్రిక' అనే వార పత్రికను కూడా వెలువరించారు. అదేకాలంలో నల్లగొండలో కీ. శే. షబ్నవీసు వేంకట నరసింహారావుగారు 'నీలగిరి పత్రిక' పేరుతో ఒక వారపత్రికను, 'వీరేశలింగ కంఠాభరణ గ్రంథమాల'ను నెలకొల్పారు. వీరు ప్రచురించిన గ్రంథాలన్నింటికీ రెండణాలే వెల. నల్లగొండ జిల్లా సూర్యాపేటలో కీ. శే. పువ్వాడ వెంకటప్పయ్యగారు 'కృషి ప్రచారిణీ గ్రంథమాల'ను నెలకొల్పారు. సికింద్రాబాద్‌లో వట్టికోట ఆళ్వార్ స్వామిగారు 'దేశోద్ధారక గ్రంథమాల'ను స్థాపించి, అభ్యుదయకరమైన అనేక పుస్తకాలను వెలువరించడమే కాక, సంచీ భుజాన వేసుకుని ఇంటింటికీ తిరిగి పుస్తకాలను అమ్మేవారు.

శ్రీ వెల్దుర్తి మాణిక్యరావు, కె. సి. గుప్తా 'అణా గ్రంథమాల'ను నెల కొల్పి చాలా చిరుపొత్తాలను ప్రచురించి అణాకే విక్రయించేవారు. వీరి ప్రచు రణలపై ప్రభుత్వం కన్నెర్ర జేయడం, కోర్టుకు పోవడం కూడా జరిగింది.[1]

సురవరం ప్రతాపరెడ్డిగారు స్థాపించి చాలాకాలంపాటు సంపాదకత్వం వహించిన 'గోల్కొండ పత్రిక' ఖచ్చితమైన రాజకీయ దృక్పథంతో వెలువడ టమేగాక, అనేక ప్రచురణలను వెలువరించింది. ప్రతాపరెడ్డిగారు సంకలనం చేసిన 'గోలకొండ కవుల సంచిక' ద్వారా ఎందరో అజ్ఞాత తెలంగాణా కవుల వివరాలు వెలుగు చూశాయి.

---

1. 'అణా గ్రంథమాల' నుంచి 'అగ్నిధార'ల వరకు (వ్యాసం) - కోదాటి నారాయణరావు, ఆంధ్రజ్యోతి (దినపత్రిక) 1-9-1986 పుట : 10.

మాడపాటి హనుమంతరావుగారి షష్టిపూర్తి సందర్భంగా, ఆయన సన్నిహితులు ఆయనకు సమర్పించిన నిధితో 'ఆంధ్ర చంద్రికా గ్రంథమండలి'ని స్థాపించి, నిజాం రాష్ట్ర ఆంధ్రోద్యమానికి వెన్నుతట్టిన అనేక గ్రంథాలను వెలువరించారు.

వీటితోబాటు 'ప్రభాత ప్రచురణ సమితి', 'వైదికధర్మ గ్రంథమండలి' వంటి ప్రచురణ సంస్థలు; 'ఆంధ్రమాత', 'తెలుగు పత్రిక', 'భాగ్యనగర పత్రిక', 'తెలుగు తల్లి', 'ఆంధ్రకేసరి', 'సందేశం', 'తెలంగాణా', 'మీజాన్' వంటి పత్రికలు తెలుగు ప్రజల చైతన్య స్థాయిని పెంచడానికీ, తెలుగుభాషా వికసనానికీ ఇతోధికంగా తోడ్పడ్డాయి.

ఇలా అనేక సంస్థలు, పత్రికలు తెలంగాణా సాంస్కృతిక పునరుజ్జీవన వికాసాలకు పాటు పడ్డాయి తద్వారా తెలంగాణాలో ఆంధ్రోద్యమ స్పృహకు శ్రీకారం చుట్టాయి.

మద్రాస్‌లో తమిళభాషా ప్రాబల్యం, తమిళుల బాధ్యతా రహిత వ్యాఖ్యానాలు ఏ విధంగా ఆంధ్రోద్యమానికి ఆజ్యం పోశాయో, అదే విధంగా తెలంగాణాలో ఉర్దూ, మరాఠీ భాషల ప్రాబల్యం; తెలుగేతరుల బాధ్యతారహిత వ్యాఖ్యానాలు ఇక్కడి ఆంధ్రోద్యమానికి దోహదం చేశాయి.

## ఉద్యమ నేపథ్యం

1921 వ సంవత్సరం. నవంబర్ 11,12 తేదీల్లో హైదరాబాద్ నగరంలో ప్రముఖ మహారాష్ట్ర సంఘ సేవకులు, S.N.D T. మహిళా విశ్వవిద్యాలయ సంస్థాపకులు మహర్షి కార్వే పండితుని అధ్యక్షతన 'నిజమ్ రాష్ట్ర సమాజ సంస్కార మహాసభ'లు జరిగాయి. ఆయన అధ్యక్షోపన్యాసం చాలావరకు మరాఠీలోనూ, కొంత ఇంగ్లీషులోనూ జరిగింది. మహాసభ కార్యకలాపాలన్నీ ఇంగ్లీషు, మరాఠీ, ఉర్దూ భాషల్లోనే జరుగసాగాయి. ఇది ఆంధ్రులకు కొంత అసంతృప్తిని కలిగించింది. దానికితోడు హైదరాబాద్ నగరంలో ప్రముఖ న్యాయవాది శ్రీ ఆలంపల్లి వెంకట రామారావుగారు ఒక తీర్మానంపై తెలుగులో ప్రసంగించడం మొదలుపెట్టగానే సభలో చప్పట్లు, అభ్యంతరాలు ప్రారంభమయ్యాయి. ముఖ్యంగా మహారాష్ట్రులు తెలుగులో వినడానికి ఇష్టపడక గొడవ ప్రారంభించడంతో ఆయన తన ఉపన్యాసాన్ని మధ్యలో ఆపి కూచోవల్సి వచ్చింది ఈ సంఘటన తెలుగువారిని నొప్పించింది. స్థానికంగా అధిక సంఖ్యాకులుగా ఉన్న తెలుగు ప్రజలు దీనిని అవమానంగా భావించారు. పర్యవసానంగా 'ఆనాటి రాత్రియే ఆంధ్రోద్యమము నారంభించు సంకల్పము నాం ఆంధ్రజన

సంఘమునున స్థాపింపబడెను.'[1] పదకొండు మంది సభ్యులతో అప్పటికప్పుడు స్థాపితమైన ఈ సంఘంలో శ్రీయుతులు మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, మందుముల నరసింగరావు, ఆదిరాజు వీరభద్రరావు వంటి ప్రముఖులు ఉన్నారు. అతి తక్కువ కాలంలోనే ఈ సంస్థ సభ్యత్వం 100 దాటింది. ఆంధ్రజనసంఘం ప్రథమ సమావేశం 14 ఫిబ్రవరి 1922 నాడు శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారి అధ్యక్షతన హైదరాబాద్‌లో జరిగింది. ఈ సమావేశంలోనే సంస్థపేరు 'నిజామ్ రాష్ట్ర ఆంధ్ర జన సంఘం'గా మారింది. దీని మొదటి కార్యదర్శిగా ఎన్నికయిన మాడపాటి హనుమంతరావుగారు తెలంగాణా సాంస్కృతికోద్యమంలో ప్రముఖ పాత్రను నిర్వహించసాగారు.

## ఉద్యమ ఆశయాలు—ఆచరణ

తెలంగాణా ప్రాంతంలోని ప్రజల సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక చైతన్యాన్ని పదును బెట్టడం; స్థానిక ఆంధ్ర ప్రజల్లో పరస్పర సహకార భావాన్ని కల్పించి వారి అభివృద్ధికి పాటుపడడం; ఆంధ్రుల శ్రేయస్సు కోసం సంఘాలను, సంస్థలను స్థాపించడం; సభలను సమావేశాలను ఏర్పాటు చేయడం ఆంధ్ర జనసంఘ ఆశయాలుగా ప్రకటించారు. నిజామ్ 'రాష్ట్రంలోని ప్రతి వ్యక్తి (స్త్రీ పురుష భేదం లేకుండా)పద్దెనిమిది సంవత్సరాలు దాటిన వయస్సుండి చదవడం, వ్రాయడం నేర్చుకుంటే ఈ సంస్థలో సభ్యులు కావచ్చు' అని స్పష్టపరిచారు.

తెలంగాణ ప్రాంతంలోని వివిధ జిల్లాల ఆంధ్ర సంఘాల కార్యక్రమాలను సమన్వయపరచడానికి 1 ఏప్రిల్ 1923 నాడు హనుమకొండలో 'ఆంధ్ర జన కేంద్ర సంఘం' ఏర్పడింది. మాడపాటి హనుమంతరావుగారు ఈ కేంద్ర సంఘ కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఈ కేంద్ర సంఘం 'వెట్టిచాకిరి', 'వర్తక సంఘం' వంటి కరపత్రాలను ప్రచురించింది.

తెలుగు పాఠశాలల్ని నెలకొల్పడం, తెలుగు గ్రంథాల్ని ప్రచురించడం, చారిత్రక పరిశోధనల్ని ప్రోత్సహించడం వంటి కార్యక్రమాల్ని ఈ కేంద్ర సంఘం ప్రారంభించింది. 'నిజామాంధ్ర రాష్ట్ర ప్రశంస', 'నిజాం రాష్ట్ర ఆంధ్రులు' వంటి గ్రంథాల్ని ప్రచురించింది.

కొందరు విద్యావంతులు, మేధావులతో ప్రారంభమైన ఈ సంఘం దాదాపు నాలుగు దశాబ్దాలపాటు తెలంగాణా ప్రజల జీవితం మీద బలమైన ముద్ర వేయగలిగింది. 1944 లో శ్రీ రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతన భువనగిరిలో

---

1. తెలంగాణా ఆంధ్రోద్యమం (మొదటి భాగం) పేజీ: 17 - శ్రీ మాడపాటి హనుమంతరావు.

జరిగిన 11 వ ఆంధ్ర మహాసభలో దాదాపు 10 వేల మంది ప్రజలు పాల్గొన్నారు. ఆ రోజుల్లో ఇంత పెద్ద ఎత్తున జనాన్ని సమీకరించగలగడం సామాన్యమైన విషయం కాదు. ఆంధ్ర ప్రాంత కమ్యూనిస్టు నాయకులైన చంద్ర రాజేశ్వరరావుగారి వంటి ప్రముఖు లెందరో పాల్గొన్న ఈ 11 వ మహాసభలో పెరిగిన కమ్యూనిస్టు పార్టీ సభ్యుల ప్రాబల్యాన్ని నిరసించిన శ్రీ కొండా వెంకటరంగారెడ్డి, ఎం. రామచంద్రరావు వంటి కాంగ్రెస్ నాయకులు 1945, 1946 సంవత్సరాల్లో పోటీ మహాసభలు నిర్వహించారు.

వివిధ ప్రాంతాల్లో, వివిధ సంవత్సరాల్లో జరిగిన నిజామ్ రాష్ట్ర ఆంధ్ర మహాసభ సమావేశాల వివరాలు——

| **మహా సభ సంఖ్య** | **సంవత్సరం** | **స్థలం** | **సభాధ్యక్షులు** |
|---|---|---|---|
| 1. | 1930 | జోగిపేట | శ్రీ సురవరం ప్రతాపరెడ్డి |
| 2. | 1931 | దేవరకొండ | శ్రీ బూర్గుల రామకృష్ణారావు |
| 3. | 1934 | ఖమ్మం | శ్రీ పులిజాల వెంకటరంగారావు |
| 4. | 1935 | సిరిసిల్ల | శ్రీ మాడపాటి హనుమంతరావు |
| 5. | 1936 | షాద్‌నగర్ | శ్రీ కొండా వెంకటరంగారెడ్డి |
| 6. | 1937 | నిజామాబాద్ | శ్రీ మందుముల నరసింగరావు |
| 7. | 1940 | మల్కాపురం | శ్రీ మందుముల నరసింగరావు |
| 8. | 1941 | చిలుకూరు | శ్రీ రావి నారాయణరెడ్డి |
| 9. | 1942 | ధర్మవరం | శ్రీ మాదిరాజు రామకోటేశ్వరరావు |
| 10. | 1943 | హైదరాబాద్ | శ్రీ కొండా వెంకటరంగారెడ్డి |
| 11. | 1944 | భువనగిరి | శ్రీ రావి నారాయణరెడ్డి |
| 12. | 1945 | ఖమ్మం | శ్రీ రావినారాయణ రెడ్డి |
| | | మడికొండ | శ్రీ మందుముల నరసింగరావు |
| 13. | 1946 | కంది | శ్రీ జమలాపురం కేశవరావు |

వీటిలో పన్నెండు, పదమూడవ మహాసభలను కాంగ్రెస్‌వాదులు విడిగా జరుపుకున్నారు. కాంగ్రెస్ ప్రాబల్యం కింద ఉన్న ఆంధ్రమహాసభ తన 13 వ సమావేశాన్ని జరుపుకున్న తర్వాత 1946 లో నిజాం రాష్ట్రంలోని తన సోదర సంఘాలైన 'మహారాష్ట్ర పరిషత్', 'కర్నాటక పరిషత్'లతో కలిసి 'హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్'లో విలీనమయ్యింది. కమ్యూనిస్టు పార్టీ ప్రాబల్యం క్రింద ఉన్న ఆంధ్రమహాసభ 12 వ సమావేశం ఖమ్మంలో శ్రీ రావి నారాయణరెడ్డి

గారి అధ్యక్షతన జరిగింది. ఇందులో దాదాపు 40 వేలకు పైగా జనం పాల్గొన డాన్నిబట్టి, ఇది గ్రామీణ ప్రజానీకంలో ఎంత పలుకుబడి సంపాదించిందో విదితమౌతుంది. 3 డిసెంబర్ 1946 నాడు తెలంగాణా ప్రాంత కమ్యూనిస్టు పార్టీని నిజామ్ ప్రభుత్వం నిషేధించింది. క్రూరమైన అణచివేత చర్యల్ని ప్రారంభించింది ఫలితంగా ఆంధ్ర మహాసభ సాంస్కృతిక పోరాటం నుండి సాయుధ పోరాటానికి సమరశంఖ మూదింది.

ఈ విధంగా 17 సంవత్సరాల్లో 13 మహాసభలను విజయవంతంగా జరుపుకున్న 'నిజామ్ రాష్ట్ర ఆంధ్రమహాసభ' తెలంగాణ ప్రాంతంలో ఆంధ్రోద్యమ వ్యాప్తికీ, రాజకీయ చైతన్యానికీ ప్రజలను ఉద్యమోన్ముఖుల్ని చేయడానికి మహత్తరమైన కృషి చేసింది.

## ఉద్యమ తీవ్రత

దేశంలోని అన్ని ప్రాంతాల ప్రజలతోపాటు ఆంధ్రులు కూడా చేసిన అపారమైన త్యాగాలవల్ల దేశమాత బానిస సంకెళ్ళు 15 ఆగష్టు 1947 నాడు విడిపోయాయి. దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది.

అయినా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం జరుగలేదు. 1946 నాటి కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో 'భాషా సంస్కృతుల ప్రాతిపదికపై రాష్ట్రాలను నిర్మించడం జరుగుతుంది' అన్న వాగ్దానం పుస్తకాల్లోనే ఆవిరయ్యింది. ఆంధ్ర ప్రాంతంలోన అనేక చోట్ల అలజడులు, ఆందోళనలు తీవ్రతరమయ్యాయి. స్వాతంత్ర్యం లభించగానే సొంత రాష్ట్రం ఏర్పడుతుందని ఆశించిన ఆంధ్ర ప్రజలకు నిరాశ మిగిలింది ప్రముఖ కాంగ్రెస్ నాయకులు ప్రకాశం పంతులు, ఎన్.జి. రంగాగార్లు అప్పటి ఉపప్రధాని సర్దార్ వల్లభ్‌బాయ్ పటేల్ గారిని కలిసి కొత్త రాజ్యాంగాన్ని రూపొందించడానికి ముందే ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం గావించమని విజ్ఞప్తి చేశారు.

'భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటు, భారత యూనియన్‌లోని అన్ని జాతిస్వామ్య యూనిట్లకు సమాన అభివృద్ధి అవకాశం, గిరిజన ప్రాంతాల ప్రజలకు ప్రాంతీయ స్వయంప్రతిపత్తి వంటి నినాదాలతో భారత కమ్యూనిస్టు పార్టీ ఆందోళనలు నిర్వహించసాగింది.'[1]

తెలుగు భాష, సంస్కృతుల అభివృద్ధికి; ఆంధ్రరాష్ట్ర తక్షణ నిర్మాణానికి సాగిన ఉద్యమాల్లో కమ్యూనిస్టులు అగ్రభాగాన నిలిచారు.

---

1. 'భాషాప్రయుక్త రాష్ట్రాల పోరాటంలో కమ్యూనిస్టుల పాత్ర'
- అవతార్‌సింగ్ మల్హోత్రా (పుట : 20).

## నెహ్రూ విధాన ప్రకటన

దేశవ్యాప్తంగా పెరుగుతున్న ప్రజోద్యమాల ఉధృతిని గమనించిన స్వతంత్ర భారత ప్రథమ ప్రధాని శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారు 27 నవంబర్ 1947 నాడు ఒక విధాన ప్రకటన చేశారు. 'రాష్ట్రాలను భాష, సంస్కృతుల ప్రాతిపదికపై పునర్నిర్మించడానికి భారతప్రభుత్వం సిద్ధంగా ఉందనీ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం కోసం సాగుతున్న ఉద్యమం సహేతుకమైనదనీ, నూతన రాజ్యాంగంలో దీన్ని పొందుపరచడం జరుగుతుందనీ' ఆ ప్రకటన సారాంశం.

భాషా ప్రయుక్త రాష్ట్రాలను నిర్మించడంలో ఎదురయ్యే సాధక బాధకాలను విచారించి, తగిన సిఫార్సులు చేయడానికి 17 జూన్ 1948 నాడు కేంద్రప్రభుత్వం థార్ కమీషన్‌ను నియమించింది. డాక్టర్ పన్నాలాల్, శ్రీ జగత్ నారాయణ్‌లాల్‌లు సభ్యులుగా ఉన్న ఈ కమిషన్ అధ్యక్షులు శ్రీ ఎస్.కె. థార్ (అలహాబాద్ హైకోర్టు రిటైర్డ్ న్యాయమూర్తి). ఈ కమీషన్ సభ్యులు మద్రాస్‌ను పర్యటించిన సందర్భంగా 'మద్రాస్ ఆంధ్రులకే దక్కాలని' టంగుటూరి ప్రకాశం పంతులుగారు, 'ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అనర్థదాయకం' అని నీలం సంజీవరెడ్డి గారు విజ్ఞాపన పత్రాలందజేశారు. ఆంధ్ర నాయకుల్లో ఉన్న విభేదాలను గమనించిన థార్ కమీషన్ 'ప్రస్తుతానికి కొత్త రాష్ట్రాలను నిర్మించాల్సిన అవసరంలేదు'[1] ఆంధ్ర ప్రాంతం స్వయం పోషకం కాదు కాబట్టి ఆంధ్ర రాష్ట్ర నిర్మాణావశ్యకత లేదంటూ 10 డిసెంబర్ 1948 నాడు తన నివేదికను ప్రభుత్వానికి అందజేసింది.

ఈ నివేదిక ఆంధ్ర ప్రజల్లో తీవ్రమైన అసంతృప్తిని కలిగించింది. ఎంతోకాలంగా నిరీక్షిస్తున్న తమ రాష్ట్ర నిర్మాణం జరగకపోవడంతో ప్రజలు ఆందోళనలు మొదలు పెట్టారు. రాష్ట్ర కాంగ్రెస్‌వాదులుసైతం థార్ నివేదికపై తమ అసహనాన్ని ప్రదర్శించడం మొదలుపెట్టారు. దాంతో 1948 లో జయపూర్‌లో సమావేశమైన జాతీయ కాంగ్రెస్ మరొక విచారణ సంఘాన్ని నియమించింది. జవాహర్‌లాల్ నెహ్రూ, వల్లభ్‌భాయ్ పటేల్, పట్టాభి సీతారామయ్యలు సభ్యులుగా ఉన్న ఈ విచారణ సంఘం 'జె.వి.పి. కమిటీ'గా ప్రఖ్యాతమయ్యింది. ఈ కమిటీ సభ్యులు అన్ని విషయాల్ని పరిశీలించింతర్వాత April 1949 లో తమ నివేదికను ప్రభుత్వానికి సమర్పించారు. 'భారతదేశాన్ని భాషా ప్రాతిపదికపై విభజించే విషయం ప్రస్తుతానికి కొన్ని సంవత్సరాలపాటు వాయిదా వేయాలనీ, అయితే మద్రాస్ నగరంపై తమ హక్కుల్ని ఆంధ్రులు

---

1. Report of the linguistic provinces commission, New Delhi, 1948 (Page No. 2).

వదులుకుంటే, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ప్రత్యేకాంశంగా భావించి చర్యలు తీసుకోవాలని' ఆ సభ్యులు సూచించారు.[1] ఈ రిపోర్ట్ వెలువడింతర్వాత ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సంఘం విజయవాడలో సమావేశమై, జె వి పి. రిపోర్టును ఆమోదించింది. మద్రాస్‌ను ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధానిగా అంగీకరించాలని, మద్రాస్‌ను కేంద్రపాలిత ప్రాంతంగా ప్రకటించాలని ప్రభుత్వాన్ని కోరింది. తమిళ నాయకులు ఈ కోరికను అభ్యంతరం పెట్టారు. గట్టిగానే ప్రతిఘటించారు. ఆంధ్ర-తమిళ నాయకులమధ్య ఉన్న విభేదాలను అవకాశంగా తీసుకుని కేంద్ర ప్రభుత్వం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి స్వస్తి చెబుతూ 16 జనవరి 1950 నాడొక ప్రకటన జారీ చేసింది.

## 1951-52 సాధారణ ఎన్నికలు

1951-52 లో స్వతంత్ర భారతంలో జరిగిన సాధారణ ఎన్నికల్లో భాషా ప్రయుక్త రాష్ట్రాల విషయం ఒక ప్రధానాంశమయింది. దేశవ్యాప్తంగా ఈ సమస్యపై భారత కమ్యూనిస్టుపార్టీ విశేషప్రచారం చేసింది. మద్రాస్ శాసన సభకు జరిగిన ఎన్నికల్లో 'నిర్వివాద ప్రాంతాలైన 11 జిల్లాలు, మూడు తాలూకాలతో వెంటనే ఆంధ్రరాష్ట్ర మేర్పరచాలి' అనే నినాదాన్ని కమ్యూనిస్టుపార్టీ ముందుకు తెచ్చింది ప్రజల ప్రగాఢవాంఛకు దర్పణం పట్టింది. కాంగ్రెస్‌పార్టీ ఊగిసలాట, కాలయాపనంతో విసిగిపోయిన ప్రజలు 1952 సాధారణ ఎన్నికల్లో ఆ పార్టీపై తమ ఆగ్రహాన్ని ప్రదర్శించారు. 375 సీట్లుగల మద్రాస్ శాసన సభలో కాంగ్రెస్ కేవలం 152 సీట్లు మాత్రమే పొందగలిగింది. అలాగే 140 సీట్లున్న ఆంధ్రప్రాంతంలో కేవలం 43 నియోజకవర్గాలను కైవసం చేసుకోగలిగింది కమ్యూనిస్టుపార్టీ 41 స్థానాలను దాని మిత్రపక్షమైన కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ (K M.P P) 20 స్థానాలను గెలుచుకుంది. ఈ రెండు పార్టీలు కలిసి. ఇతర మిత్రపక్షాలతో ఏర్పాటుచేసిన ఐక్యప్రజాస్వామ్య సంఘటన (U D F)కు మొత్తం 164 స్థానాలు దక్కాయి. ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయగల మెజారిటీ U.D F కు ఉన్నప్పటికీ కేంద్ర ప్రభుత్వం శ్రీ సి. రాజగోపాలచారిని ముఖ్యమంత్రిగా నామినేట్‌చేసి కాంగ్రెస్‌పార్టీకే అధికారాన్ని హస్తగతం చేసింది.

శాసనసభలో ప్రవేశించింది మొదలు కమ్యూనిస్టులు, ఐక్యసంఘటనలోని ఇతర స్వతంత్ర సభ్యులు ప్రత్యేక రాష్ట్ర నిర్మాణావశ్యకతను గురించి వాదించసాగారు. ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో ఆంధ్రులకు అన్ని రంగాల్లో జరుగుతున్న

1. 'Formation of Andhra State' from the History of Modern Andhra by P.R. Rao (Page No. 127).

అన్యాయాలను విశ్లేషించి చూపసాగారు. ఆంధ్ర ప్రజల చైతన్యస్థాయిని పెంచుతూ, బలమైన ఉద్యమాన్ని నిర్మించసాగారు.

## స్వామి సీతారాం నిరాహారదీక్ష :

రాజ్యాంగ పద్ధతుల ద్వారా 'ఆంధ్ర రాష్ట్రం' ఏర్పాటు కావడంలేదు కాబట్టి సత్యాగ్రహోద్యమం ద్వారానైనా దీన్ని సాధించుకోవాలన్న సంకల్పంతో ప్రముఖ కాంగ్రెస్ నాయకుడు 'స్వామి సీతారాం' (శ్రీ గొల్లపూడి సీతారామ శాస్త్రి) 1951వ సంవత్సరంలో ఆంధ్రప్రాంతంలో 'ఆనందయాత్ర' జరిపారు. అనేక ప్రాంతాల్లో సభలు, సమావేశాల్లో పాల్గొన్నారు. ప్రత్యేక రాష్ట్ర నిర్మాణ ధ్యేయంగా 16-8-1951 నుండి సామూహిక అమరణ నిరాహారదీక్ష ప్రారంభించారు. 35 రోజులపాటు నిరవధికంగా సాగిన నిరాహారదీక్ష మూలంగా స్వామీజీ ఆరోగ్యం పూర్తిగా క్షీణించింది 35వ రోజు ఆచార్య వినోభాబావేగారి విజ్ఞప్తి మేరకు ఈ దీక్ష విరమింపబడింది. ఆచార్య వినోభాబావేగారు కేంద్ర ప్రభుత్వానికి ఒక వినతిపత్రం పంపారు. అయినా నెహ్రూగారి ప్రభుత్వం చలించలేదు, సానుకూలమైన చర్యలు తీసుకోలేదు

## పొట్టి శ్రీరాములు ఆత్మాహుతి

ఆంధ్రోద్యమ పరాకాష్ట శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మాహుతి. గాంధీజీ అనుచరుల్లో ఒకరైన శ్రీ పొట్టి శ్రీరాములుగారు 19 అక్టోబర్ 1952 నాడు మద్రాస్‌లో 'అమరణ నిరాహారదీక్ష' ప్రారంభించారు. 'ఆంధ్రరాష్ట్రం గురించి గతకొన్ని రోజులుగా నేను ఆలోచిస్తున్నాను. మన పెద్దలు ఒక అవగాహనకు వస్తారన్న నమ్మకం నాకుంది. నేను ఏ రాజకీయపార్టీకి పనిముట్టును కాదు. నాకు ఏ పార్టీ లేదు. నాకు అనుచరులు లేరు నేను ఎక్కడున్నా, ఏమి చేసినా నా నిర్ణయాలకు కట్టుబడి ఉంటాను. ఆంధ్రరాష్ట్ర సమస్య అనేక అభిప్రాయాల్ని సృష్టించింది. ఎవరికివారే తమ వాదనలు సమర్థించుకుంటున్నారు. ఒక ఉమ్మడి అవగాహనకు రాలేకపోతున్నారు. అధికారంలో ఉన్నవారి సమస్యలను మార్చడం సాధ్యంకాదు. నా జీవితాన్ని ధారపోయడమొక్కటే ఈ పరిస్థితుల్లో సరైన పరిష్కారమని నేను భావిస్తున్నాను. నాకు ఏ కోరికలు లేవు. ఏ విద్వేషాలు లేవు. ప్రగాఢమైన నిర్ణయం మాత్రం ఉంది' అంటూ 15-9-1952 నాడు శ్రీ శ్రీరాములుగారు, తమ మిత్రుడు, మద్రాస్ న్యాయవాదియైన శ్రీ బి. లక్ష్మినారాయణగారికి రాసిన లేఖలో తమ ఉద్దేశ్యాలను వ్యక్తపరిచారు.[1]

---

1. Letter Quoted in the History of Andhra Movement-Volume 2 - Compiled by : G. V. Subba Rao (Page : 499).

మద్రాస్‌లో తను పుట్టిన వీధిలోని ఒక ధర్మసత్రంలో తమ ఆమరణ నిరాహార దీక్షను ప్రారంభించాలన్న సంకల్పం శ్రీ శ్రీరాములు గారికి ఉండింది. కానీ ఆ వీధిలోని తమిళ ప్రజలు ఆయనకు ఆశ్రయం కల్పించలేదు. శ్రీ బులుసు సాంబమూర్తిగారు సమకూర్చిన 'యజ్ఞశాల'లో ఆయన నిరశనవ్రతం మొదలు పెట్టారు. మొదట్లో కొంత మందకొడిగా వచ్చిన ప్రజల ప్రతిస్పందన క్రమంగా రోజులు గడుస్తున్నకొద్దీ ఆందోళన రూపాన్ని ధరించసాగింది. నవంబర్ గడిచి డిసెంబర్ మొదలయ్యేసరికి ఆంధ్ర ప్రాంతమంతా అట్టుడికిపోయింది. శ్రీరాములు గారి ప్రాణాలను రక్షించాలని కోరుతూ ఆంధ్రదేశమంతా ప్రతిధ్వనించింది. కేంద్ర ప్రభుత్వ వైఖరిపట్ల నిరసన పెల్లుబికింది. తెలుగునేల నాలుగు చెరుగులా విద్యార్థులు, సమ్మెలు, హర్తాళ్ళు చేశారు. పార్లమెంటు నుండి కమ్యూనిస్టు పార్టీ, నేషనల్ డెమొక్రాటిక్ పార్టీ, ప్రజా సోషలిస్టు పార్టీ, స్వతంత్ర సభ్యులు వాకౌట్లు చేశారు. మద్రాస్ అసెంబ్లీలో కూడా ఈ విషయమై తర్జన - భర్జనలు, వాకౌట్లు జరిగాయి.

కేంద్ర ప్రభుత్వం మాత్రం తన మొండి వైఖరిని విడనాడలేదు, జాతీయ కాంగ్రెస్ కూడా ఈ విషయంలో అనుకూలంగా ప్రతిస్పదించలేదు. మరో ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే 7 డిసెంబర్ 1952 నాడు శ్రీరాములు గారి ప్రాణరక్షణ కోసమై జరిగిన అఖిలపక్ష సమావేశానికి ఆంధ్రప్రాంత కాంగ్రెస్‌కమిటీ అధ్యక్షునితో సహా అనేకమంది ప్రముఖ నాయకులు హాజరు కాలేదు. ఈ సమావేశం జరిగిన వారంరోజుల తర్వాత కష్టసాధ్యమైన 58 రోజుల నిరవధిక నిరాహార దీక్ష 57 వ రోజు చేరిననాడు 14 డిసెంబర్ 1952 న పొట్టి శ్రీరాములుగారు తుదిశ్వాస వదిలారు. ఈ వార్త దావానలంలా ఆంధ్రావని అంతా వ్యాపించింది. ఎక్కడి రైళ్ళు అక్కడ బందయినాయి. అంతటా హర్తాళ్ళు, సమ్మెలు, బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనలు జరిగాయి. కోర్టుల పనులన్నీ ఆగి పోయాయి. ప్రభుత్వమే ఆ 4 రోజులు స్తంభించింది. ఎక్కడ చూసినా లాఠీ ఛార్జీలు, కాల్పులే. వాల్తేరు కాల్పుల్లో 15 మందికి గాయాలు, ఒక స్త్రీ చనిపోయింది. నెల్లూరులో 5 గురు, అనకాపల్లిలో ముగ్గురు, తాడేపల్లిలో ఇద్దరు, రాజమండ్రిలో ఇద్దరు...ఇలా 12 మంది వీరులు కాల్పుల్లో అసువులు కోల్పోయారు. కోపోద్రిక్తులై రెచ్చిపోయిన ప్రజానీకం గుంటూరు, విజయవాడ రైల్వేస్టేషన్లను కొల్లగొట్టింది. 50 లక్షల రూపాయలు రైల్వేఆస్తికి నష్టం జరిగిందని ప్రభుత్వం ప్రకటించింది. కాల్పులలో చనిపోయిన వీరుల శవాలతో 5 గంటలపాటు 9 మైళ్ళ పర్యంతం గొప్ప ఊరేగింపు జరిగింది. ఒక మహాసముద్రంలాగా 80 వేలమంది ప్రజలు ఆ ఊరేగింపులో పాల్గొన్నారు.[1]

1. 'విశాలాంధ్రోద్యమం' — మాదల వీరభద్రరావు (పుట: 12)

కేంద్రప్రభుత్వ మొండి వైఖరికి నిరసనగా శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, సుబ్బతాతరాజు, దంతులూరి నారాయణరాజు, పి. సీతారామయ్య, పి. వి. సోమయాజులు ప్రభృతులు తమ అసెంబ్లీ, కౌన్సిల్ సభ్యత్వాలకు రాజీనామాలు సమర్పించారు.

ఆంధ్రోద్యమం తారాస్థాయికి చేరిందన్న విషయాన్ని గమనించిన భారత ప్రధాని నెహ్రూగారు 19 డిసెంబర్ 1952 నాడు 'మద్రాస్ మినహా నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ప్రభుత్వం పూనుకుంటుందని' ప్రకటించారు. ఈ విషయంలో ఎదురయ్యే సమస్యల్ని పరిశీలించడానికి 'జస్టిస్ వాంచూ'ను కేంద్ర ప్రభుత్వం నియమించింది. వాంచూ కమిటీ ఆంధ్ర ప్రాంతంలోని అన్ని రాజకీయ పార్టీల ప్రతినిధులను, ప్రముఖ రాజకీయ నాయకులను కలిసి, అభిప్రాయాలు సేకరించి 1953 ఫిబ్రవరిలో తన నివేదికను సమర్పించింది. ఆ తరువాత మార్చినెలలో నెహ్రూగారు ఒక ప్రకటనచేస్తూ '1953 అక్టోబరు 1 నాడు నిర్వివాద ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రం ఏర్పడుతుందని, రాజధానిని మద్రాస్‌లో ఉంచే సమస్యే లేదని, ఆంధ్ర ప్రాంతంలో ఎక్కడ నెలకొల్పాలో ఆంధ్ర శాసన సభ్యులే నిర్ణంచుకోవాలనీ' ప్రకటించారు

ఈ ప్రకటనకు ప్రతిస్పందనగా 1953 జూన్ 5 నుండి ఆంధ్ర శాసన సభ్యుల ప్రత్యేక సమావేశం జరిగింది. 5 రోజులపాటు వాగ్వివాదాలతో, తర్జన భర్జనలతో జరిగిన చర్చల తరువాత రాజధాని కర్నూలులో ఉండాలన్న తీర్మానం నెగ్గింది. నూతన రాష్ట్ర నిర్మాణం కోసం కేంద్ర ప్రభుత్వం శ్రీ సి.ఎమ్. త్రివేదిని ప్రత్యేకాధికారిగానూ, శ్రీ నీలం సంజీవరెడ్డి. శ్రీ తెన్నేటి విశ్వనాథం తదితరుల్ని సలహా సంఘ సభ్యులుగానూ నియమించింది.

ఇంతటి సుదీర్ఘకాల ఉద్యమ ఫలితంగా కర్నూలు రాజధానిగా 1953 అక్టోబర్ 1వ తేదినాడు ఆంధ్రరాష్ట్రం ఏర్పాటయ్యింది స్వతంత్ర భారత దేశంలో మొట్టమొదటి భాషాప్రయుక్త రాష్ట్రం ఏర్పడింది.

# 5
# ఆంధ్రోద్యమ గీతాలు

భారత జాతీయోద్యమంతోబాటు తెలుగునేలపై సాగిన మరొక ఉప జాతీయోద్యమమే 'ఆంధ్రోద్యమం' లేదా 'ఆంధ్ర జాతీయోద్యమం'. తమిళం మాత్రృభాషగా గల 'మద్రాసు' రాష్ట్రంలో కొంతభాగం, ఉర్దూ అధికార భాషగా గల 'నిజామాంధ్ర రాష్ట్రం'లో కొంతభాగంగా తెలుగునేల ఉండేది. దీనిని ఏకం చేయడానికి సాగిన ప్రజోద్యమమే 'ఆంధ్రోద్యమం'. భాషా ప్రాతిపదికపై 'విశాలాంధ్ర' రాష్ట్ర నిర్మాణానికి ఆంధ్ర ప్రజలు సాగించిన మహోద్యమమిది.

ఆంధ్ర జాతియాభిమానం క్రమంగా రాజకీయ పరిణతినిపొంది ఏ విధంగా ఉద్యమ రూపాన్ని దాల్చిందో, ఒక ప్రజోద్యమంగా రూపొంది ఎలా విజయాన్ని సాధించిందో గత ప్రకరణాల్లో పరిశీలించడం జరిగింది.

ఎన్నో ఎగుడు దిగుళ్ళతో సాగిన ఈ ఉద్యమం దాదాపు అర్థ శతాబ్దం పాటు తెలుగు సాహిత్యంమీద, ముఖ్యంగా గీతికా సాహిత్యంమీద వేసిన ప్రభావాన్ని; అది సృష్టించిన గీతాలను ఇప్పుడు పరిశీలించవలసి ఉంది.

ఆంధ్రోద్యమ కాలంలో వెలువడిన గీతాలను ఈ క్రింది శీర్షికల కింద విశ్లేషించవచ్చు.

## ఆంధ్రమాత స్తుతి

భారత జాతీయోద్యమంలో దేశమాతను స్తుతించిన తెలుగుకవులు, ఆంధ్రోద్యమంలో ఆంధ్రమాతనుకూడా స్తుతించారు.

'ఆంధ్రమాత స్తవం చేసిన మొదటి ఆధునికాంధ్ర కవి మంగిపూడి వేంకటశర్మగారే యనవచ్చు ప్రాచీనాంధ్ర సాహిత్యంలో కనిపించే ఆంధ్రాభిమానంకంటే భిన్నమైన బహుముఖ వికసన పూర్వకమైన ఆంధ్ర జాతీయాభిమానాన్ని వెల్లడించే కవిత మంగపూడివారి 'ఆంధ్రమాత' అనేది' అంటున్నారు డా॥ మద్దూరి సుబ్బారెడ్డిగారు.[1]

తెలుగు నేలపై ప్రవహిస్తున్న నదులను, అలరారే క్షేత్రాలను, తెలుగు సంస్కృతిని సంపన్నం చేసిన కవులను, ఆదర్శ అమాత్యులను, విదుషీమణులను కీర్తించిన కవితా ఖండిక మంగిపూడి వారి 'ఆంధ్రమాత'.

---

1. తెలుగులో జాతీయోద్యమ కవిత్వం (సిద్ధాంత వ్యాసం) పుట: 325.
—డా॥ మద్దూరి సుబ్బారెడ్డి.

1911 లోనే మంగిపూడి వారు 'ఆంధ్రదేశ ప్రశంస' అనే శీర్షికతో వెలువరించిన పద్యాలు, ఆంధ్రదేశ ప్రాచీన వైభవానికి పట్టిన నివాళులు.

1914 లో గడ్డము కొండారెడ్డి 'ఆంధ్రమాతృ స్తవము' అనే కవితా ఖండికలో ఆంధ్ర మాత ప్రాచీన వైభవాన్ని స్తుతిస్తూనే, సమకాలీన సామాజిక దుస్థితిపట్ల తమ విచారాన్ని వ్యక్తం చేశారు. 'ఆంధ్రపత్రిక' 1914 ఉగాది సంచికలో పిప్పర సోదర కవులు 'ఆంధ్రమాతృ సమాశ్వాసము' శీర్షికన కొన్ని పద్యాలు వెలువరించారు.

పై అన్ని రచనల్లోనూ ఆంధ్రోద్యమారంభ దశ ప్రభావం కనబడుతుంది.

బుడమగుంట శివరామయ్య రాసిన 'ఆంధ్రమాతృ విలాపము'లో...

'ఆంధ్ర రాష్ట్రం బవశ్యంబనుచు
దలచు చున్నారీ సదస్యులెల్ల
.....................
.....................
అనుచు తీర్మానములు సేసి యమితముగను
సభను వదిలియు వానిని జరుపుటను
యత్నములు సేయగా నొల్ల రాంధ్రులకట
మరల సభ గూడు వరకును మందలగుచు'

అంటూ కేవలం సభలు, సమావేశాలు, తీర్మానాలతో సరిపోదనీ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి కావలసిన యత్నములు చేయవలెనని కర్తవ్య బోధ చేశారు.

రచయితల పేర్లు లేకుండా వెలువడిన 'స్వరాజ్య భజన కీర్తనలు' సంపుటిలో 'ఆంధ్రమాత' శీర్షికన ఒక గీతం ప్రచురితమయ్యింది.

'ఆంధ్రమాతరో నీదు బిడ్డలమైన మము కరుణించుమా
సాంధ్రభక్తినిచేయు వందన శతము గొని దీవింపుమా
తల్లి నీ యెడ భక్తి కడువర్ధిల్ల బోధన చేయుమా
ఎల్లరము సోదరులమని ప్రేమించు మతి దయచేయుమా
॥ఆంధ్ర॥'[1]

అనే ఈ గీతంలో ఆంధ్రమాతపై భక్తి ప్రపత్తులు కలిగి, ఈ నేలతల్లిని ప్రేమించే తత్వాన్ని ప్రజల్లో పెంచవలసిందిగా మాతృభూమిని అభ్యర్థించడం జరిగింది.

---

1. స్వరాజ్య భజన కీర్తనలు.

విశ్వకవి రవీంద్రుని 'జనగణమన అధినాయక' గీతాన్ని అనుకరించి, తెలుగు జాతీయోద్యమకవి దామరాజు పుండరీకాక్షుడు 'ఆంధ్రమాతృ స్తవము' చేశారు.

'వరధర భర సుఖదాయిని జయహే,
ఆర్య వరాంధ్ర సుజాతా॥

1. గంజాం విశాఖ గోదావరి కృష్ణా
తుంగ త్రిలింగ సమేతా
వేద మహాచల విమలానంద
మంజుల మహిత మహాంధ్ర

2. మృదు మధు భాషా భూషా
సదమల శీల సుహాసా
వందే వరధర మాతా
జయ జయ జయ
సుందర శ్యామల జయహే
ఆర్య వరాంధ్ర సుజతా
జయ హే జయ హే,
జయ హే. జయ హే'1

ఈ గీతంలో ఆంధ్రమాతను మృదుమధు భాషా భూషితగా, సుందర శ్యామల విరాజితగా దామరాజు వర్ణించారు.

అచ్చంగా అదే బాణీ కాదు గానీ, దానిని స్ఫురింపజేసే నడకలో జంపన చంద్రశేఖరరావు రాసిన గీతంలో...

'జెయ్ జెయ్ జెయ్ జెయ్
ఆంధ్రమాతా!
జెయ్ జెయ్ జెయ్ జెయ్
యశో విజాత!
భారత దేశాకాశ విరాజిత
చంద్రకళా కళాశోభిత ॥జెయ్॥
ధీర కుమార గభీర హృదయ
రుధిర లిఖిత పదభరితా ॥జెయ్॥

1. విజయాంధ్ర (గీతాలు) - దామరాజు పుండరీకాక్షుడు.

గౌతమి కృష్ణోత్తుంగ తరంగ
మంగళ గానోల్లాస సేవితా ॥జెయ్॥
జెయ్ జెయ్ జెయ్ జెయ్
ఆంధ్రమాతా!'[1]

అంటూ భారత దేశాకాశంలో ప్రకాశించే చంద్రకళా శోభితగా, నదీ నదాలు, ధీర కుమారులు గల యశోవిజాతగా 'ఆంధ్రమాత'ను వర్ణించారు.

ఆయనే మరో గీతంలో...

'వేద సుధలను పిదికిన ప్రేమభూమి
బుద్ధ దేవుని గన్నట్టి పుణ్యభూమి
భవ్య సంపత్సమేతమౌ భరతభూమి
గలదు హృదయమ్ముగా మన తెలుగు భూమి
తెలుగు తల్లుల పాలలో కలదు భక్తి
తెలుగు మండెడు గుండెలో కలదు రక్తి
తెలుగు కత్తుల నెత్తుట కలదు శక్తి
తెలుగు గడ్డపై చచ్చిన కలదు ముక్తి
నేను తెలుగు వాడను - తల్లి నేల కొరకు
రాల్చు కన్నీళ్ళె రత్నాల రాసులగును
నేను తెలుగు వీరుడ - తల్లి నేల కొరకు
కార్చు రుధిరమ్మె స్వాతంత్ర్య సుధల నొసగు'[2]

అంటూ తెలుగు మాటలో వెలిగే సత్యాన్ని, తెలుగు పాటలో చెలగే ధర్మాన్ని, తెలుగు ఆటలో కలిగే ధైర్యాన్ని, తెలుగుతల్లి పలుకుల మాధుర్యాన్ని ఎలుగెత్తి చాటారు.

## తెలుగు ప్రాంతాల ప్రశంస

ఏ దేశస్థుడికైనా, ఏ ప్రాంతీయుడికైనా తన సొంత నేల, కన్న తల్లితో సమానమైనది. దానిపై ప్రేమాభిమానాలు ఉండడం, వాటిని ప్రదర్శించుకోవడం సహజం. అట్లాగే తెలుగుతల్లిని స్తుతించడంతో పాటు తెలుగునేలపై విలసిల్లే వివిధ ప్రాంతాలను, అనేక ప్రదేశాలను ప్రశంసిస్తూ కవితాగానం చేశారు కవికుమారులు. 'నిజామ్ రాష్ట్ర ప్రశంస' అనే కావ్యంలో శేషాద్రి రమణ కవులు...

---

1,2 'ఆంధ్రజ్వాల'— జంపన చంద్రశేఖరరావు, 'నవజీవన సమితి', అన్నామలై విశ్వవిద్యాలయము, అన్నామలై నగర్.

'వాడి వాడని యుడువిపూపుం
పీడ జాలని తేటి కొదములు
పాడు పాటలు కవితలోపల
ఐరిలపఱుపవె చెల్లెలా!
తెలుగు శూరుల నెత్రుటేరులు
కలియం బాఱిన యాంధ్ర నగరపు
విజయగీతిక కబ్బములలో
నిలుపవేమే చెల్లెలా!
కలుకు గట్టిన తెలుగు నెత్తుటి
వరదలందున నీదులాడెడి
తెలుగుబాస పొలంతి మొగమున
డింకముంపవె చెల్లెలా!
చెలఁగిపోయిన యాంధ్ర శిల్పము
మఱచిపోయిన తెలుగు బీరము
తఱచి తఱచి గ్రహించి వెల్లడి
పఱుపవేమే చెల్లెలా!
జోల పాటలఁబాడి యాంధ్రుల
మేలు కొలిపెడి నీలగిరిలో
తేలికగ నొక భావగీతిక
మేళవింపవె చెల్లెలా!'1

అంటూ తెలుగు శూరులు తమ రక్తాలను ధారపోసి వెలిగించిన ఆంధ్ర నగరపు విజయగాథలను విలయగీతాలుగా పాడాలని ప్రబోధించారు.

1932 లో దుగ్గిరాల బలరామకృష్ణయ్యగారి 'తెలుగుసీమ' కావ్యం 'మానవాదర్శ గ్రంథ మండలి' వారి పదకొండో పుష్పంగా వెలువడింది. దీనిలో...

'దిక్కులన్నియు । దెలిసి పాడగ
కీర్తి గాంతుల । గెరలి యాడిన
తెలివి గడ్డను । తెలుగు సీమను
జగతిఁ జాటర తమ్ముడా!

1. 'నిజాము రాష్ట్ర ప్రశంస' - శేషాద్రి రమణ కవులు. ఈ కావ్యానికి అప్పటి నిజామ్ కళాశాల చరిత్ర విభాగాచార్యులు ఆచార్య ఎస్. హనుమంతరావు విపులమైన పీఠిక రాశారు.

కత్తి వ్రేటులఁ । గాలము పోటుల
నారితేరిన । వీరభద్రుఁడు
తెలివి గడ్డను । తెలుగు సీమను
జగతిఁ చాటర తమ్ముడా!
కాకతీయుల । కదన పాండితి
విచ్చి మండిన । వీరభూమిని
తెలివి గడ్డను । తెలుగుసీమను
జగతిఁ జాటర తమ్ముడా!
కృష్ణ రాణ్మణి / యుష్ణ రక్తము
వీర రసమయి / వెల్లివిరిసిన
వీర భూమిని / తెలుగుసీమను
జగతిఁ చాటర తమ్ముడా!'[1]

అంటున్న దుగ్గిరాల బలరామకృష్ణయ్య తెలుగుసీమను పరిపాలించిన వెలుగు దివ్వెలవంటి రాజుల వైభవాన్ని, తెలుగువీరులు ప్రదర్శించిన సాహస పరాక్రమాలను ప్రపంచానికి చాటి చెప్పమన్నారు

1940 లో కొండా వెంకటప్పయ్య 'గుంటూరు గొప్ప' అనే సుదీర్ఘ గీతాన్ని ప్రచురించారు. గుంటూరు మండల గొప్పతనము, చీరాల చరిత్రము, వేపల్లె పన్నుల నిరాకరణ, పల్నాటి పౌరుషాలను బుర్రకథ బాణీలో వెలువరించిన దీర్ఘ గీతమిది.[2]

'సహజ కవితావతంస' చందోలు ఆనందకవి 'తెలుగుగడ్డ' శీర్షికతో ఒక పద్య కావ్యాన్ని ప్రకటించారు. 'ఆధునిక ప్రపంచములో తెలుగు తల్లికి, తెలుగు సోదరులకు కల్గుచున్న అన్యాయములను తలంచి' ఆనందకవి హృదయంలో కలిగిన ఆవేదనకు అక్షరాకృతి యిది.[3]

---

1. 'తెలుగుసీమ' - దుగ్గిరాల బలరామకృష్ణయ్య,
మానవాదర్శ గ్రంథ మండలి ప్రచురణ (1982).

2. 'గుంటూరు గొప్ప' - ఆంధ్రనాయక కొండా వెంకటప్పయ్య. ఈ కావ్యానికి రచయిత రాసిన తొలిపలుకుల్లో ఇలా అన్నారు: "గుంటూరు గొప్ప అను పేరు పెట్టుటలో నితర మండలముల నిరసించు తలపెంత మాత్రము లేదు. ఈ మండలముతో బాటు గోదావరి, కృష్ణ మొదలగు మండలములు తీసిపోకున్నవనుట నిస్సందేహము. ఈ పొత్తము కేవలము పలువురకు ప్రోత్సాహము కలిగించుటకును, గుంటూరి చరిత్రను శాశ్వతము జేయుటకును నుద్దేశింపబడినది."

3. 'తెలుగు గడ్డ' - చందోలు ఆనంద కవి.

1980 మార్చి 8 న జోగిపేటలో సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన ప్రథమాంధ్ర మహాసభ ఈ క్రింది ప్రబోధ గీతంతో ప్రారంభ మయ్యింది

'ఆంధ్రదేశపు మట్టి । అది మాకు కనకమ్ము
ఆంధ్రదేశపు జలము । అమృతంపు రసము
ఆంధ్రదేశపు గాలి । అది మాకు ప్రాణమ్ము
ఆంధ్రదేశమె మాకు । అమర దైవతము.'[1]

ఆంధ్ర మహాసభ ప్రారంభ సమావేశాల్లో ప్రార్థనా గీతంగా ఆలపింప బడిన ఈ గీతం ఉద్యమానికి ఊపిర్లూదిందని చెప్పవచ్చు.

## గత వైభవ ప్రశంస

ఆంధ్రమాతను స్తుతించి, ఆంధ్రప్రాంతాలను ప్రశంసించిన తెలుగు కవులు ఆంధ్రుల గతవైభవాన్ని వేనోళ్ళ కొనియాడారు. గతించిన చారిత్రిక గాథల్ని గర్వంగా నెమరువేసుకున్నారు. ఈ పద్ధతి ఆధునికాంధ్ర కవిత్వా రంభదశలో కాల్పనిక కవిత్వంలో ప్రధానాంశంగా కనబడుతుంది. రాయ ప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, నాయని సుబ్బారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి మొదలైన కవులందరూ ఆంధ్రుల గతవైభవాన్ని ప్రశంసించిన వారే. గత ప్రాభవ ప్రేరణతో వర్తమానానికి కర్తవ్య నిర్దేశం చేశారు.

1916 లో బాలాంత్రపు వేంకటరావు 'జాతీయ గీతము' శీర్షికతో సుదీర్ఘ గీతాన్ని రచించి, వెలువరించారు. దీనిలో...

'పుణ్యుల మా పూర్వ పురుషుల గూర్చి
మహిత విక్రములగు మావారి గూర్చి
పేరు గన్నట్టి మా పెద్దలం గూర్చి
ఆర్యులగు పురాతనాంధ్రుల గూర్చి
వారల కీర్తి వైభవలక్ష్మి గూర్చి
వారల పుణ్య ప్రవర్తన గూర్చి
వారల ధర్మ తత్పరతను గూర్చి
వారల విజ్ఞాన వల్లరిగూర్చి...'[2]

---

1. 'జాతీయ గీతములు' (రచయితల పేర్లు లేవు) అయితే ఈ గీతాన్ని మంగిపూడి వేంకటశర్మ రచించారని డా॥ మద్దూరి సుబ్బారెడ్డి, తమ సిద్ధాంత వ్యాసంలో ప్రకటించారు.
2. 'జాతీయ గీతములు' - బాలాంత్రపు వేంకటరావు,
సం : అయ్యగారినారాయణమూర్తి, ఆంధ్ర ప్రచారిణీ ప్రచురణ (1916).

తలయుకోవటం కనిపిస్తుంది. పురాతన ఆంధ్ర తేజాన్ని, ఆంధ్ర చక్రవర్తుల ఆదర్శపాలనా విధానాన్ని ఈ గీతంలో ప్రశంసించారు.

ఆధునికాంధ్ర కవిత్వంలో విశిష్టమైన స్థానాన్ని సంపాదించిన కవి రాయప్రోలు సుబ్బారావు. 'ఏ దేశమేగినా, ఎందుకాలిడినా మాతృభూమి భారతిని పొగడాలి' అనే ప్రబోధాన్ని అందించిన రాయప్రోలువారు సకలజనుల నోళ్ళ కెక్కిన పద్య గీతాన్నికూడా ప్రసాదించారు.

'అమరావతి పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు
ఓరుగల్లున వీర లాంఛనముగ
బలు శస్త్ర శాలలు నిలుపునాడు
విద్యానగర రాజవీథుల కవితకు
పెళ్ళి పందిళ్ళు కల్పించునాడు
పొట్నూరికి సమీపమున నాంధ్ర సామ్రాజ్య
దిగ్జయ స్తంభ మెత్తించునాడు
ఆంధ్ర సంతతికే మహితాభిమాన
దివ్య దీక్షా సుఖస్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి ఆంధ్రులార
చల్లుడాంధ్ర లోకమున నక్షతలు నేడు.'

ఆంధ్రుల గత వైభవానికి అక్షరాంజలి ఘటించారు. రాయప్రోలు వారి "ఆంధ్రావళి"లోని 'ప్రబోధము', 'పుస్తకము', 'ఆంధ్రమాత' 'తెలుగుతల్లి' మొదలైన ఖండికల్లో ఈ అంశం ప్రధానంగా కనిపిస్తుంది.

పుట్టపర్తి నారాయణాచార్యులవారు అనేక పద్యాల్లో 'ఆంధ్ర ప్రశస్తి'ని వర్ణిస్తూ, కీర్తిస్తున్నారు.

అలాగే మహావాది వేంకటరత్నము రాసిన గీతంలో......

'ఆలకింపగదోయి! ఆలకింపగదోయి!
ఆలకింపగదోయి! ఆంధ్ర ప్రశస్తి
తెలగాణ సోదరా! తెలుగు నాయకుడు
శ్రీకాకుళము నుండి శ్రీపర్వతము దాక
తెలుగు వీర పవిత్ర తీర్థాలు సేవింప
ఆంధ్ర విష్ణువు కీర్తి యాకాశమంటినది
తెలుగు సీమ చరిత్ర ఘనత కెక్కినది

తెలుగు గొప్పతనంబు తేట తెల్లముగాగ
తెల్లవారి మొగాలు తెల్లనై పోయె'[1]

అంటూ...అనేక రంగాల్లో ఆంధ్రులు సాధించిన ఔన్నత్యాన్ని ప్రశంసించారు. తెలుగువారి గొప్పతనాన్ని తెలుసుకుని తెల్లవారి ముఖాలు తెల్లబోతా యనే ముగింపుతో పరాయి పాలకులను పరిహసించారు.

ఆధునికాంధ్ర సాహిత్యంలో అసాధారణమైన ప్రతిభను ప్రదర్శించిన విశ్వనాథ సత్యనారాయణ 'ఆంధ్ర పౌరుషము'ను 'ఆంధ్ర తేజము'ను అనేక పద్యాలలో వర్ణించారు. 'గోదావరీ పావనోదార' అంటూ ప్రారంభమయ్యే 'ఆంధ్ర పౌరుషము' పద్యాలు, 'వేంగీ క్షేత్రము'ను వర్ణించిన విశ్వనాథ కవితా ధార తెలుగు సాహితీ లోకంలో విశేష ప్రాచుర్యాన్ని పొందాయి.

తెలుగు నేలను వర్ణించిన జాతీయోద్యమ, ఆంధ్రోద్యమ కవులు ఇక్కడ ప్రవహించే నదులను ప్రశంసిస్తూ కూడా అనేక పద్యాలు రాశారు.

గుఱ్ఱం జాషువా మరియు పెనుమర్తి వెంకటరత్నం 'అఖండ గౌతమి'ని స్తుతించారు.

కందుకూరి రామభద్రరావు గోదావరీ నది నాట్యాన్ని ప్రశంసించారు.

'కావేరి' పేరు వినగానే పులకించి పరవశించిపోయే 'అబ్బూరి' తెలుగు సాహితీ లోకానికి ఒక 'నదీ సుందరి' (రూపకం)ని అందించారు.

అఖిలాంధ్ర తెలంగాణా ప్రజాకవి దాశరథి 'మంజీర' జన్మస్థలాన్ని, ప్రవాహమార్గాన్ని, ఆ మార్గంలో కనబడే చెరుకు తోట సౌభాగ్యాన్ని అనితర సాధ్యంగా వర్ణించారు.

అలాగే 'విశ్వనాథ' వారి 'కిన్నెరసాని పాటలు' తెలుగు సరస్వతి వాకిట విరిసిన పూదోటలు.

## మేల్కొలుపు గీతాలు

ఆంధ్రులకు ఒక ప్రత్యేక రాష్ట్రం కావాలని కాంక్షించడంతో సరిపోదు, ఆంధ్రుల ఔన్నత్యాన్ని కీర్తించడం చాలదు. తదాశయ సాధనకోసం ఉద్యమించాలి. ఉద్యమ చైతన్యవంతుల్ని చేయడానికి ప్రజల్ని మేల్కొలపాలి. అందుకే...

'మేలుకొనుమీ ఆంధ్రపుత్రుడ
మేలుకొనుమీ ఆర్య గోత్రుడ
మేలుకొనుమీ శుభ చరిత్రుడ
మేలుకొనవయ్యా ॥వత్సా మేలుకో॥

1. 'జాతీయ గీతాలు' - ఆం. ప్ర. సాహిత్య అకాడమీ ప్రచురణ.

తెల్లవారెను తూర్పు దిక్కున
అల్లభానుండుదయమయ్యెను
ఎల్లవారును మేలుకాంచిరి
ఎలమి మీరగను ॥వత్సా మేలుకో॥

ఒళ్ళు తెలియక నిద్రపోతివి
ఇల్లు వాకిలి ఏమి అయినదో
కళ్ళు తెరుచుక చూచుకో
కలికాలమిదె సుమ్మీ ॥వత్సా మేలుకో॥

బాలురందరు నిద్ర మేల్కొని
పాఠశాలల కేగుచుండిరి
జాలమేటికి నీవు విశ్వ వి
ద్యాలయము గనుగోరా ॥వత్సా మేలుకో॥

సాము నేరిచి దేహబలమును
చాల సంపాదన మొనర్చియు
సేమముగ సామ్రాజ్య రక్షణ
సేయగావలెరా ॥వత్సా మేలుకో॥

అంటూ శ్రీ మంగిపూడి వేంకటశర్మ జన జాగృతి గీతాలను ఆల పించారు.

1930 నాటికే 'కవిరాజు' త్రిపురనేని రామస్వామి చౌదరిగారు ప్రకటిం చిన 'సూతాశ్రమ గీతాలు' ఆంధ్రుల్లో ఆత్మ విశ్వాసాన్ని, ఆత్మ గౌరవాన్ని ఇనుమడింపజేసిన చైతన్య రావాలు.

'వీరగంధము తెచ్చినారము - వీరుడెవ్వడొ తెల్పుడీ
పూసిపోదుము - మెడను వైతుము - పూలదండలు భక్తితో'[1]

అనే గీతంలో ఉద్యమోన్ముఖులైన వీరులకు వీరగంధము పూసే ఆహ్వానాన్ని 'త్రిపురనేని' గానం చేశారు.

ఆంధ్రోద్యమ కాలంలో ఊరూరా, వాడవాడలా విశేష ప్రచారాన్ని పొందిన గీతం రామస్వామి చౌదరి గారి 'మందేరా'.

'బ్రహ్మపురము మందేరా
పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే
కటకం దాక మందేరా!'[2]

1, 2, 'సూతాశ్రమ గీతాలు' — త్రిపురనేని రామస్వామి చౌదరి (1930).

అనే దృఢ సంకల్పాన్ని ప్రతిధ్వనించిన నిబద్ధ 'కవిరాజు' త్రిపురనేని. అయితే బ్రహ్మపురము నుండి కటకం దాకా మనదేనని చాటి చెప్పడం వల్ల మాత్రమే ప్రయోజనం లేదని, తెలుగువారికి తెలుగు రాష్ట్రం అప్రయత్నంగా సమకూరేది కాదని తీవ్రంగా హెచ్చరించారాయన.

'తెలుగువారికి తెలుగు రాష్ట్రము, తేరతేరగ నూడిపడునా
ద్రవిడ మంత్రి ముఖావలోకన భాగ్య సంపద యబ్బినప్పుడు
తెలుగు మంత్రులు మంత్రవిదులై మూగనోమును బట్టినప్పుడు
తెలుగు శాసన సభ్యులెల్లరు తెల్లమొగములు వైచునప్పుడు
తెలుగు బిడ్డా! లేవ లేవా?
వీర పాణము సేయరావా?'[1]

అని సూటిగా ప్రశ్నించారు. ద్రవిడ మంత్రుల ఆధిపత్యాన్ని తెలుగు మంత్రులు, శాసన సభ్యులు, సామాన్య ప్రజలు శిరసావహించినంతకాలం తెలుగు వారికి ప్రత్యేక రాష్ట్రం సిద్ధింపజాలదని కచ్చితంగా మందలించారాయన. ఇలా హెచ్చరింపులు, మందలింపులతో ఆగక, తెలుగు వారంతా ఒక్కటై ముందు కురికినప్పుడు తెలుగురాష్ట్రం తప్పకుండా ఏర్పడుతుందని కర్తవ్య బోధ చేశారు.

అలాగే తెలుగు వారిలో ఆవరిస్తున్న అలసత్వాన్ని అపహాస్యం చేస్తూ మంగిపూడి వారు రాసిన గీతంలో...

'ఓ ఆంధ్ర పుత్రుడా! ఓ మహాఘనుడా!
ఓ అసమర్థుడా ! ఓ దంబపరుడా! ॥జో॥ ॥జో॥

ఆంధ్ర సంతతివాడ ననుచు పొంగెదవు
అన్నిటికి నేనేయని అడ్డమయ్యెదవు
కార్య సూర్యుడిలాగె కానిపించెదవు
కార్య శూన్యుడనంచు తుదకు కుంగెదవు ॥జో॥ ॥జో॥

దేశాభిమానమని దేవులాడావు
భాషాభిమానమని పాకులాడావు
బాసలెన్నో చేసి ఆశగొలిపావు
ఆశా విభంగమే అసలు నిలిపావు ॥జో॥ ॥జో॥

... ... ... ...
... ... ... ...

---

1. 'సూతాశ్రమ గీతాలు' —త్రిపురనేని రామస్వామి చౌదరి (1930)

బిరుసైన దుప్పటి బిగదన్నవయ్యా
దరివాడు బెదరగా గురుపెట్టవయ్యా'[1] ॥జో॥ ॥జో॥

అంటూ వ్యంగ్యంగా విమర్శించి, ఆంధ్రులు ఆత్మవిమర్శ చేసుకునేలా ఉసిగొల్పారు.

ఒకవైపు కోస్తాంధ్రుల్లోనూ మరోవైపు నిజామాంధ్రుల్లోనూ ఆంధ్రోద్యమ భావాలు వ్యాప్తినొందుతుండేటి బ్రిటీష్ ప్రభుత్వం బందరు రేవును నైజామ్ నవాబుకు అమ్మివేయ సంకల్పించింది. ఈ రహస్య సమాచారాన్ని డా॥ లంక సుందరంగారు బైటపెట్టగా, డా॥ పట్టాభిగారు ధ్రువపరిచారు. ఈ సమాచారాన్ని విన్న పైడిపాటి సుబ్బారామశాస్త్రిగారు...

'అమ్ముడు పోతున్నామా?
ఆంధ్రులు
సమ్ముడు పోతున్నామా?
నిజాము పీటికి
బజారు రేటుకి
అమ్ముడు పోతున్నామా?!
చేపల్లా
జెల్లల్లా
కొవ్వి బలసినా
గొఱ్ఱెల్లా ॥అమ్ముడు॥
కోయిల కూస్తుందా? యింకా
వాయువు వీస్తుందా
జులుము హుకుములో
తెలుగు జీవులకు
వెలుగు సోకుతుందా? ॥అమ్ముడు॥
నడుం కట్టరండి - ఎపుడో
బుడుంగు మంటుంది

---

1. తెలుగు వారిలో కొందరిలో కనబడుతున్న ఉదాసీనతనీ, అసమర్థతనీ, దాంబికాన్నీ పరిహసిస్తూ, కొంతఘాటైన పదజాలంతో మంగిపూడి వేంకట శర్మగారు 'జోలపాట' శీర్షికన ఒకగీతాన్ని రాశారు. శర్మగారు తమ పేరు ప్రకటించకుండా 'కృష్ణాపత్రిక'కు ప్రచురణార్థం పంపిన ఈ గీతం అచ్చయిన తర్వాత, ఈ గీత కర్తృత్వంపై అనేక ఊహాగానాలు చెల రేగాయి. తర్వాత దీని రచయిత మంగిపూడివారని వెల్లడయింది.

ప్రతిపాదనలో ఉన్నదానినే
ప్రతిఘటించ రండీ
　　　ఆంధ్రులు
ప్రతిఘటించ రండీ
అమ్ముడు పోతామా
　　　ఆంధ్రుల
మమ్ముడు పోతామా?
కల్ల-అబద్ధం-ఝూటా-
　　　మమ్మ
ల్నమ్మే దెవరండీ?' ॥అమ్ముడు॥[1]

అని ప్రశ్నించారు బ్రిటిష్ పాలకులు అమ్మివేయాలనుకుంటే, నైజామ్ నవాబు కొనాలనుకుంటే అమ్ముడు పోయేంత అసమర్థులు ఆంధ్రులు కాదని గట్టిగానే మందలించారు.

అలాగే తెలుగు ప్రజల్ని మేల్కొల్పుతూ...

'వినవోయి తెల్గులా-వీర శౌర్యపుగాధ
కనవోయి ఆంధ్రులా-కమ్మ, కమ్మని శోభ
మరచి పోవుదమన్న-మరపు రానేరాదోయ్
మన ఆంధ్ర చరితంబు-మన వీర శౌర్యంబు'[2]

అంటూ కాకతీయుల కదన పాండిత్యం, పలనాటి మాంచాల పౌరుషం, వెలనాటి నాగమ్మ నాయకత్వం మళ్ళీ రావాలని ఆహ్వానం పలికిన కవయిత్రి గుడిపూడి రాజేశ్వరీదేవి.

'ఒలికెరా - ముత్యాలు
మొలిచెరా - రతనాలు
నీ యాంధ్ర భూమిపై-తెలుగోడా
నీ తెల్గు గడ్డపై-మొనగాడా॥
అంనాటి పలనాటి - ఆ వీర గాథలూ
నాగులేటిని పారు - ఆ రక్త ధార
మగువ మాంచాల యా - మాసిపోవని కీర్తి
బాలచంద్రుని కత్తి - సాటిలేని శక్తి
గొంతెత్తి పాడరా - తెలుగోడా?
తొమ్ము విరుచుక పాడు - మొనగాడా'[3]

1. 'జాతీయ భారతి'—పైడిపాటి సుబ్బరామశాస్త్రి.
2, 3. అమర గేయాలు—గుడిపూడి రాజేశ్వరీదేవి.

అని తాంధ్ర పాపని కీర్తి, కొండపీటి రెడ్డిరాజుల కోడెత్రాచు బుసలు, కాకతీయుల కదన శౌర్యము తలపోసి ఆంధ్ర తేజాన్ని కాపాడమని పిలుపు నిచ్చారీ కవయిత్రి.

## ఆంధ్ర జాతీయ గీతాలు

తెలుగు ప్రజల్లో ఆంధ్ర జాతీయాభిమానాన్ని పెంపొందించి, ఆంధ్రోద్యమ వ్యాప్తిలో అనాటి మూడుకోట్ల ఆంధ్ర ప్రజానీకాన్ని భాగస్వాములను చేయవలసిన తరుణం ఆసన్నమయింది. జాతీయోద్యమ ప్రధాన స్రవంతిలో పడి నలుగుతున్న ఆంధ్రోద్యమానికి కొత్త జవాన్నీ, జీవాన్నీ పోయాల్సిన సమయం అరుదెంచింది. సరిగ్గా ఆ రోజుల్లోనే (1945) ప్రముఖ తెలుగు పత్రికలన్నింటిలో ఒక ప్రకటన వెలువడింది. ఆ ప్రకటన పూర్తి పాఠం ఇది-

**'ఆంధ్ర జాతీయ గీతం కావాలి'**
**ఉత్తమ గీతానికి రూ. 116 బహుమానం**

'తెలుగు కవి సోదరులారా!

విశాలమైన ఆంధ్రభూమిలో దాదాపు 3 కోట్ల మంది తెలుగు ప్రజలమున్నాము. రెండు వేలేండ్లకు మించిన ప్రాచీన సంస్కృతి మనది. 'దేశభాష లందు తెలుగు లెస్స' అనిపించుకొన్నది మన మాతృభాష. ఏ జాతి అయినా సగర్వంగా చెప్పుకోదగ్గ ఉజ్వలమైన చరిత్ర మన ప్రజలది. గోదావరి, కృష్ణ, పెన్న, తుంగభద్ర నదులు ప్రవహించే పవిత్రభూమి మనది.

అట్టి మన తెలుగుజాతి నేడు వెలవెల బోతూంది. మనకు ప్రత్యేక రాష్ట్రమైనా లేదు. ఆంధ్రభూమి మద్రాసు రాష్ట్రంలో కొంత, హైదరాబాదు సంస్థానంలో కొంత, మధ్యరాష్ట్రం, మైసూరు సంస్థానాలలో మరికొంత - యీ విధంగా చీలిపోయి ఉంది. వివిధ ప్రాంతాలలోని తెలుగు ప్రజలందరికి మనమంతా ఒక ఆంధ్రజాతి వారమనే చైతన్యం, ఉత్సాహం కలిగించే తెలుగు జాతీయ గీతం మనకు లేదు.

స్వతంత్ర భారతదేశంలో దోపిడి, దారిద్ర్యం లేకుండా ప్రజలందరికీ సమానావకాశాలు ఇచ్చే ప్రజారాజ్యాన్ని ఆంధ్రులం స్థాపించుకోవాలి. అప్పుడు మన తెలుగు గడ్డకు, ఆంధ్రజాతికి ఉజ్వలమైన భవిష్యత్తు ఉంటుంది. మన దేశంలో ప్రవహించే నదీ జలానికి తగిన ప్రాజెక్టులు నిర్మించితే, తెలుగుదేశమంతా సస్యశ్యామలమై ధనధాన్యాలతో అలరారుతుంది. ఆంధ్ర భూగర్భంలో వున్న లోహాదులను తవ్వి పరిశ్రమలు నిర్మించితే తెలుగుప్రజ ధన, కనక, వస్తు, వాహనాలతో తులతూగగలదు.

పై భావాలను సూచించుతూ, చక్కని ఆంధ్ర జాతీయ గీతం రచించాలని తెలుగు కవులను కోరుతున్నాను. గీతం పాడటానికి సులభంగా వుండాలి. తెలుగు నుడికారం ప్రతిబింబించుతూ వుండాలి. గీతం 30 పంక్తులకు మించి ఉండకూడదు ఉత్తమమైన గీతానికి రూ. 116లు బహుమానం ఇవ్వబడుతుంది.

ఏది ఉత్తమ గీతమో నిర్ణయించడానికి ఈ క్రిందివారు ఒక కమిటీగా ఉంటారు.

1. శ్రీ తెలికచర్ల వెంకటరత్నంగారు, 2. శ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు, 3 శ్రీ అడవి బాపిరాజుగారు, 4. శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, 5. శ్రీ కంభంపాటి సత్యనారాయణగారు, 6 శ్రీ తుమ్మల వెంకటరామయ్యగారు, 7. శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావుగారు.

వరా :– కవులు తాము రచించిన గీతాలను ఏప్రిల్ నెలాఖరుకు చేరేలాగు క్రింది అడ్రసుకు పంపప్రార్థన.

అడ్రసు :- ఇట్లు విన్నవించు.

ప్రజాశక్తి ఆఫీసు, బెజవాడ. పుచ్చలపల్లి సుందరయ్య.'

ఈ ప్రకటనకు ప్రతిస్పందించిన శ్రీ పాటిబండ్ల రఘుపతిగారనే బెజవాడ వాస్తవ్యులు మరో నూటపదహార్లు తమ బహుమతిగా ప్రకటించారు.

దీనితో అనేక ఆంధ్రభక్తిగీతాలు సకాలంలో 'ప్రజాశక్తి' పత్రిక కార్యాలయానికి చేరాయి. న్యాయనిర్ణేతలు కూలంకషంగా పరిశీలించి...... కొండేపూడి లక్ష్మీనారాయణగారి 'పాడరా ఓ తెలుగువాడా!–పాడరా ఓ కలిమిరేడా!' గీతానికి ప్రథమ బహుమతిని ప్రకటించారు. అలాగే ముక్కామల నాగభూషణం గారి– 'తెలుగు తేజము దీప్తి చెందగ - తెలుగు వెలుగులు దిశలు నిండగ - తెలుగు తల్లిని కొలువ దీక్షతో తరలిరావోయ్ తమ్ముడా!' అనే గీతానికి ద్వితీయ బహుమతిని ప్రకటించారు. వీటితో బాటు పోటీకి వచ్చిన గీతాలనుండి ప్రచురణార్హమైన వాటిని ఎంపికచేసి, 'ఆంధ్ర జాతీయగీతాలు' పేరుతో ప్రజాశక్తి ప్రచురణాలయం వారు 1945-46లలో ఒక సంకలనం వెలువరించారు. కొండేపూడి వారి గీతంతోబాటు తెలుగునేల నాలుగు చెరగులా విశేష ప్రజాదరణ పొందిన వేములపల్లి శ్రీకృష్ణగారి 'చేయెత్తి జైకొట్టు తెలుగోడా!', పులుపుల వెంకట శివయ్యగారి 'పలనాడు వెలలేని మాగాణిరా!' గీతాలు కూడా ఈ సంకలనం లోనివే.

ప్రజాశక్తి ప్రచురణాలయం వారు ప్రకటించినట్లుగా ఈ గీతాలన్నీ నిజంగా ఆంధ్రుల జాతీయగీతాలే.

'పాడరా ఓ తెలుగువాడా !
పాడరా ఓ కలిమిరేడా !
పాడరా మన తెలుగు దేశపు
భవ్య చరితల దివ్యగీతం ॥పాడరా॥

యుగ యుగంబుల నుండి
బంగరు గంగ నిచ్చెడు గౌతమీనది,
కోహినూరును కడుల సందున
ముడిచి కులికిన కృష్ణవేణీ,
హోయలుగా రతనాల సీమను
ఊలలాడిన తుంగభద్రా,
సొగసు గూర్చును తెలుగు తల్లికి
సుఖము గూర్చును తెలుగు వారికి ॥పాడరా॥

కదనరంగము నందు మెరిసిన
కాకతీయుల ఖడ్గతేజం
వదరు శత్రువు నెదిరి పోరిన
వనిత రుద్రమ యుద్ధ పటిమ
కొదమ సింగము పగిది నురికిన
బాల చంద్రుని బాహు దర్పం
పొంగ జేయద మేని రక్తం
ఉప్పొంగ జేయద నీదు హృదయం? ॥పాడరా॥

తెలుగు పలుకుల తేనె లొలికెను
తిక్కనార్యుని కవిత లోన,
రాలు కరిగే త్యాగరాజుని
రాగసుధలో మునిగె తెనుగు
సొంపు గూర్చెను తెలుగు తల్లికి
హంపి నగరపు శిల్ప సంపద
భరత నాట్యపు భంగిమములో
పల్లవించెను తెలుగు పరువం ॥పాడరా॥

తెనుగు జాతికి నూత్న సంస్కృతి
తీర్చి దిద్దిన కందుకూరి
తెనుగు భాషను ప్రజల భాషగ
జేయ పోరిన గిడుగు పిడుగూ

దేశమంటే మనుజులేనని
తెలియ జెప్పిన అప్పారాయడు
తెలుగు తల్లి నోము పంటచె
తేవరిల్లిన దివ్యతారలు ॥పాడరా॥

కలవు గనులును నదులు జలములు
పసిడి పాతర మనదు దేశం,
సిరియు సంపద వెల్లివిరిసే
స్వర్గతుల్యము జేసికొందము
ఐదు కోటుల తెలుగు బిడ్డల
ఐక్య కంఠము లొక్కపెట్టున
జయము జయమని తెలుగు తల్లికి
విజయ గీతిక లాలపింపగ పాడరా ॥పాడరా॥'[1]

అంటూ కొండేపూడి గానం చేసిన ఈ గీతంలో కేవలం గత వైభవాన్ని ప్రశంసించడమే కాకుండా నాటి సిరిసంపదలను సద్వినియోగ పరుచుకుని, భవిష్యత్తులో తెలుగుసీమను స్వర్గతుల్యము చేసుకుందామన్న భావం, త్రికాల సత్యమైన సంకల్పం నిక్షిప్తమై ఉంది. ఆధునిక సాహిత్యోద్యమ వైతాళికులైన కందుకూరి, గురజాడ, గిడుగులను ప్రశంసించడాన్ని బట్టి 1945 నాటికి సాహిత్యకారులపై పడిన అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రభావం కూడా స్పష్టమౌతోంది.

అలాగే ఈనాటికీ తెలుగు ప్రజల నోళ్ళలో గూడుకట్టుకున్న మరో గీతం వేములపల్లి శ్రీకృష్ణ రాసింది.

'చేయెత్తి జైకొట్టు తెలుగోడా!
గతమెంతో ఘనకీర్తి గలవోడా!
సాటిలేని జాతి - ఓటమెరుగని కోట
నివురుగప్పి నేడు - నిదురపోతుందాది
జైకొట్టి మేల్కొలుపు తెలుగోడా!
గతమెంతో ఘనకీర్తి గలవోడా!'

దీనిలో బాలచంద్రుని, తాండ్ర పాపని, కాకతీయ రుద్రమ్మ - మల్లమంబా - మాంచాలల వారసుడైన తెలుగువాడిని కీర్తించాడు కవి.

---

1. కొండేపూడి లక్ష్మీనారాయణగారి స్మృతులు - గేయాలు.
సం : శ్రీమతి కొండేపూడి రాధ.

'తల్లి ఒక్కతె నీకు తెలుగోడా
సవతి బిడ్డలపోరు మనకేలా?'

అని సూటిగా ప్రశ్నించిన శ్రీకృష్ణ...

'ముక్కోటి బలగమోయ్ - ఒక్కటై మనముంటె
ఇరుగు పొరుగూలోన - వూరు పేరుంటాది'

అనే వాస్తవాన్ని నొక్కి చెప్పారు.

ఇక మరో గీతం పులుపుల శివయ్య రచన-

'శాతవాహన తెలుగు చక్రవర్తుల శౌర్య
మిదె బ్రహ్మ్య మిదె క్షాత్రమన్న గర్జాఘోష
పులకలే ఎత్తించెరా పలనాట
పౌరుషమ్మే పొంగెరా॥'

అంటూ ప్రారంభమై పలనాటి ఉజ్జ్వల చరిత్రంతా గుండెల్ని కదిలించే భావవేగంతో సాగుతుంది.

పాట ముగింపులో...

'వెనుక తరములవారి వీరచరితల సిరులు
నాల్గోసి త్యాగంపు నీర్వెట్టి పెంచరా
విరిసి సుఖములు పండురా - పలనాడు
వెలలేని మాగాణిరా'

అనే సందేశాన్నందించారీ కవి.

1947-50 మధ్యకాలంలో కరిగిన సభల్లో - సభా ప్రారంభానికి ముందు 'దేశమును ప్రేమించుమన్నా', 'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా!' 'పలనాడు వెలలేని మాగాణిరా' అనే పాటలు వి. గోపాలం గొంతెత్తి వాడేవాడనీ, ఆ పాటలు విన్న వాళ్ళ చెవుల్లో ఇప్పటికీ అవి రింగుమని మోగుతాయనీ తమ 'చేరా' తల్లో డా॥ చేకూరి రామారావుగారు రాశారు.[1]

విచిత్రమేమిటంటే, ఇంతగా ప్రజల అభిమానాన్ని పొందిన ప్రఖ్యాత గీతాలను రాసిన ఆనాటి కొందరు రచయితలు, తరువాతి కాలంలో సాహిత్యకారులు కాక, క్రియాశీల రాజకీయ నాయకులై, వేలాది కార్యకర్తలను తయారు చేశారు. తాము నమ్మిన సిద్ధాంతాలకోసం జీవితాలను వెచ్చించారు.

'పలనాడు వెలలేని మాగాణిరా' గీతాన్ని రాసిన పులుపుల శివయ్య (1910-1976) ఆంధ్ర ప్రాంతంలో కమ్యూనిస్టు ఉద్యమ వ్యవస్థాపకుల్లో ఒకరు. జీవితాంతం 'భారత కమ్యూనిస్టు పార్టీ' విస్తృతికీ, దాని సిద్ధాంతాల

1. ఆంధ్రజ్యోతి (దినపత్రిక) 10-10-1987.

ప్రచారానికి పాటుపడ్డారు. ఎంతో రాయగలిగిన చేవగల శివయ్యగారు తమ జీవిత కాలంలో రాసిన గేయాలు పద్దెనిమిదే. అయినా వీటిలోని ఒక్కొక్క గేయం దేనికదే సాటి. పులుపుల శివయ్యగారు మరణించిన (1976) తర్వాత ఆయన రాసిన 18 గేయాలను, ఆయనపై ఇతరులు రాసిన రచనలను కలిపి 1978లో సర్వశ్రీ గజ్జెల మల్లారెడ్డి, పరుచూరి రాజారాం, కొండేపూడి శ్రీనివాస రావుగార్లు సంపాదకత్వం వహించి 'పులుపుల వెంకటశివయ్య స్మృతిసంచిక'ను ప్రకటించారు. దానిని ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరు జిల్లా శాఖ ప్రచురించింది.

ఉత్తమ తెలుగు జాతీయ గీతం 'పాడరా ఓ తెలుగువాడా!' రాసిన కొండేపూడి లక్ష్మీనారాయణ, తెలంగాణా సాయుధ పోరాటానికి ఊపిరులూదిన 'తెలుగు తల్లి బిడ్డలం- తెలంగాణ వీరులం' అనే చారిత్రాత్మక గీతాన్ని రచించారు. నైజామ్ వ్యతిరేక పోరాటంలో 'మార్చింగ్ గీతం'గా ఉపయోగపడిన ఈ పాట తెలంగాణా ప్రజానీకాన్ని రణభూమికి నడుపగలిగింది. చిత్తశుద్ధి, నిరంత రోత్సాహమూ, కమ్యూనిస్టు ఉద్యమశీలత అనే త్రిగుణాలు గల కొండేపూడి రాసిన 19 స్వీయ కవితలు, 17 అనువాద కవితలు, హెన్రిచ్ హెయినే కవి రచనల 16 అనువాదాలు కలిపి, మొత్తం 52 కవితలతోబాటు కొండేపూడి జీవిత విశేషాలతో 'కొండేపూడి లక్ష్మీనారాయణ స్మృతులు-గేయాలు' (1987) శ్రీమతి కొండేపూడి రాధ వెలువరించారు 23-6-86 వ తేదీనాడు విజయవాడ లోని తమ స్వగృహంలో కనుమూసిన కొండేపూడి జీవితాంతం కమ్యూనిస్టు ఉద్యమవ్యాప్తికి పాటుపడ్డారు.

అలాగే 'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా' గీతాన్ని రాసిన వేములపల్లి శ్రీకృష్ణ ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమంలోనూ, వేర్పాటువాద ఆందోళనలకు వ్యతిరేకంగా సాగిన సమైక్యాంధ్ర పోరాటంలోనూ ముందు నడిచిన వీర యోధుడు. రాష్ట్ర కమ్యూనిస్టు నాయకుల్లో ఒకరు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసన సభలో చాలాకాలంపాటు కమ్యూనిస్టు పక్షనాయకులుగానూ, ప్రతిపక్షనాయకులు గానూ కొనసాగిన శ్రీ కృష్ణగారు ప్రస్తుతం ఇండో-సోవియట్ సాంస్కృతిక సంస్థ, అఖిలభారత శాంతి సంఘం వంటి సంస్థలకు రాష్ట్ర నాయకులుగా క్రియా శీల బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

"ఆంధ్రోద్యమంలో ప్రధాన పాత్ర వహించిన రాజకీయ పక్షాలు రెండే రెండు. ఒకటి కమ్యూనిస్టు పార్టీ రెండోది కాంగ్రెస్ పార్టీ తెలుగు జాతీయ గీతాల్లో విశేష ప్రజాదరణ పొందిన గీతాలు 'కమ్యూనిస్టు పార్టీ' ప్రచారగీతాలై ఊరూరా మారుమ్రోగుతుంటే, వీటికి పోటీగా 'కాంగ్రెస్ పార్టీ' ప్రచారానికి ఉపయోగపడే

తెలుగు జాతీయ గీతాలను వ్రాయించాల్సిన అవసరం ఆనాటి కాంగ్రెస్ నాయకులకు కలిగింది. దాంతో శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి ప్రోత్సాహంతో పైడిపాటి సుబ్బరామశాస్త్రిగారు 'ఆంధ్ర జాతీయగీతము' శీర్షికన 'త్రిలింగ దేశమ్ మనదేనోయ్' అనే పాట రాశారు.[1] 1949-50 ప్రాంతాల్లో ఈ గీతాన్ని ఒక కరపత్రగీతంగా ముద్రించి, దాని ప్రశంసతోబాటు అప్పటి మద్రాస్ ప్రభుత్వం ఈ గీతాన్ని 'ఆంధ్ర జాతీయ గీతం'గా నిర్ణయించాలనే బెజవాడ గోపాలరెడ్డిగారి అభిప్రాయాన్ని కూడా పొందుపరిచారు ఆనాటి కాంగ్రెస్ పార్టీ సభల్లోనూ, సమావేశాల్లోనూ మార్మోగిన ఈ గీతాన్ని చూద్దాం.

'త్రిలింగ దేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్
మధురం మధురం మధురం మధురం
ఆంధ్రమ్మంటే అతి మధురం
దేశభాషలా తీరుల్లోకి
ఆంధ్రమ్మంటే అతి మధురం...
రాయలు మనవాడోయ్ - పండిత
రాయలు మనవాడోయ్
కలం తిక్కనా ఖడ్గ తిక్కనా
గణపతిదేవులు మనవారోయ్...
అమరావతి నాగార్జున కొండా
సిద్ధహస్తులా శిల్పాలోయ్
మల్లినాథ కుమారిల భట్టులు
అందెవేసిన హస్తాలోయ్...
గోదావరి కృష్ణా
తుంగభద్ర పెన్నా
కావేరి పంపా
కనిపెంచినవోయ్ తెలుగుజాతిని
వినిపించినవోయ్ వీణానాదం...
ఓడలు కట్టేము - మింటికి
మేడలు కట్టేము
మున్నీరంతా ఏకరాశిగా
ముద్దర వేశామూ...

1. ప్రముఖ సాహిత్య విమర్శకులు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తితో ఇంటర్వ్యూ (12-3-1989)

సంతలలో వజ్రాల రాసులూ
జలజల లాడినవి
కుబేరతుల్యం మహదైశ్వర్యం
గొడుగు పట్టినాదీ...
కలకలలాడే తెలుంగు దేవికి
గంధా గురుధూపం

కిలకిలలాడే తెలుంగు కన్నెల
కిన్నెర లాలాపం...
బలం గడించి వెలుంగు నించే
తెలుంగు జండా "హుం"
తెలుంగు భేరీ "ఢాం"

గణ గణ గణ గణ
గణ గణ గణ గణ
తెలుంగు జయ ఘంటా

గణ గణా గణా గణ
గణా గణా గణ
తెలుంగు జయఘంటా
త్రిలింగదేశం మనదేనోయ్
తెలుంగులంటే మనమేనోయ్—'[1]

అంటూ సుసంపన్నమైన ఆంధ్ర సంస్కృతినీ, ఆంధ్ర సంపదల సంచయాన్నీ ప్రశంసించిన ఈ గీతం తెలుగు ప్రజల గుండెల్లో కొండంత ఆత్మవిశ్వాసాన్ని నింపి, తెలుగు రాష్ట్ర నిర్మాణానికి ఉద్యమించే 'కదలిక'ను కలిగించ గలిగింది.

అదే కాలంలో అనేక రాజకీయ, సాంస్కృతిక సమావేశాల్లో ప్రార్థనా గీతంగా ఉపయోగపడిన మరో గీతం...

'మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు - కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొర్లించు మా తల్లి ॥మా॥

---

1. 'ఆంధ్ర జాతీయగీతము' శీర్షికన ఇది కరపత్ర గీతంగా ప్రచురితమయ్యింది. వేటపాలెంలోని 'సారస్వత నికేతనము' గ్రంథాలయంలో ఆ కరపత్రం ఈనాటికీ భద్రంగా ఉంది.

గల గలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయీ
మురిపాల ముత్యాలు దొర్లుతాయీ ॥మా॥
అమరావతీ నగర అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలిచియుండేదాక ॥మా॥
రుద్రమ్మ భుజశక్తి మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి కృష్ణరాయల కీర్తి
మా చెవులు రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం, నీ ఆటలే ఆడుతాం
జై తెలుగు తల్లీ, జై తెలుగు తల్లీ—'1

అంటూ శ్రీ శంకరంబాడి సుందరాచారి 'కడుపులో బంగారు, కను చూపులో కరుణ గల తెలుగుతల్లి'కి అర్పించిన ఆ మల్లెపూదండ ఈ నాటికీ వాడకుండా చక్కని సాహిత్య సౌరభాలను వెదజల్లుతూ ఉంది. తెలుగు ప్రజల హృదయాల్లో తెలుగుతల్లి పట్ల ఆరాధనా భావాన్ని వికసింపజేస్తూ ఉంది.

'తెనుగుతల్లి'ని కీర్తిస్తూ కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ఉత్తేజకరమైన పద్యాలు రాసి, తెలుగు ప్రజల మెదళ్ళను పదును పెట్టారు.

విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడవారు 1961లో ప్రచురించిన 'స్వేచ్ఛాపథం' గేయసంకలనంలో పైగీతాలతోబాటు 'ఆంధ్రమాతా' శీర్షికన ప్రచురించిన గీతంలో......

'జయహే జయహే జయ జయా ఆంధ్రమాతా
జయ జయా ఆంధ్రమాతా జయహే॥
పెన్న కృష్ణ తుంగభద్ర మిన్న గోదావరి చిరుతరగల
చిన్నని సన్నని తీయని పాటల
తేనెలొల్కునమ్మా తెలుగుల వాణి పల్కునమ్మా -
ఉత్సాహం ఉపకారం ప్రజ్ఞ సత్సంగం
సత్యం సమభావం గోరుముద్దలుగ
నీ పాపల కిడి పేరు గాంచుమమ్మా
నీ కిల లేరు సాటి రమ్మా—'2

1, 2. స్వేచ్ఛాపథం (గేయ సంకలనం) - విశాలాంధ్ర ప్రచురణాలయం.

అంటూ బమ్మెర పోతన భాగవతం, కమ్మని తిక్కనకవి భారతం, మర్మమెరిగిన వేమన గీతులు, అజంతా ఎల్లోరా అమరావతీ హంపీ క్షేత్రాల శిల్ప విన్యాసాలతో విరాజిల్లుతున్న ఆంధ్రమాతకు వినయపూర్వక నీరాజనా లందించారు.

## భారత స్వాతంత్ర్యోదయం

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించగానే ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరుగు తుందని ఆంధ్రోద్యమ కవులు విశ్వసించారు. దేశంలోని అన్ని భాషలు మాట్లాడే ప్రజలతోబాటు ఆంధ్ర ప్రజలు కూడా స్వాతంత్ర్యోదయానికి స్వాగతం పలికారు

'పూల దోసెళ్ళెత్తరా - మన
        పుణ్య వీరుల బాటరా!
భారతము స్వేచ్ఛా వరమ్మును
        బడసినట్టి దినమ్మురా
తర తరమ్ముల రాజ్య గాథలు
        తలచికొని నిట్టూర్పు విడిచే
హస్తినాపురి ముఖముపై - దర
        హాస మొలికిన దినమురా!
సాదు బాధలు - పేద భేదము
        సమయజేయగ భరత పుత్రులు
కంకణము లిడి రాజ్యమందిన
        గర్వకారణ దినమురా
భరత వీరులు కట్టబోయే
భావి సుందర కనకలోకము
చూడగలవిక రేపొ మాపో
తోడు పడరా! సోదరా!!'[1]

అంటూ ఆగష్టు 15 నాటి చారిత్రాత్మక సన్నివేశానికి పూలదోసెళ్ళెత్తి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఆహ్వానం పలికారు.

భారత గణతంత్ర దినం (జనవరి 26) దేశ ప్రజాతంత్ర రాజ్యాంగానికి పట్టం కట్టిన సందర్భంగా శ్రీశ్రీ రాసిన గీతంలో...

'రానేస్తం పోదాం చూదాం
ముప్వన్నెల జెండా పండుగ

---

1. 'స్వేచ్ఛాపథం' (గేయ సంకలనం)
—విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

రా నేస్తం లేదాం చూదాం
మన భారత జన సౌభాగ్యం!
అటు చూడు సముద్రనేస్తం
హర్షానికి పర్యాయపదం
ఇటుచూడు విహాయసనేత్రం
దుఃఖానికి అధ్యాహారం!
ఈ రెంటికి మధ్యనిలిస్తే
నీలోపల లోలోపలికే
ఆలాపన ఆలోకిస్తే
వినపడదా ఒక సంగీతం
విడివడదా ఒక సందేశం?
రా నేస్తం పోదాం చూదాం
మువ్వన్నెల జెండా పండుగ'[1]

అంటూ మువ్వన్నెల జండా పండుగ పంచే ఆనందంలో భాగస్వాములు కావ దానికి తెలుగు సోదరులకు ఆహ్వానం పలికారు.

అలాగే పైడిపాటి సుబ్బరామశాస్త్రి.........

'తురగలించె కాంతిరేఖ
భరత జాతి మస్తకమున
పరిమళించె విశ్వంభర
ఇరువది ఆరవ జనవరి—
పెదరాజరికపు చాయలు
చిరిగి చిరిగి చెరగిపోయె
తరిగిన మన భారతమ్మె
పరిపుష్టమ్మై నిలిచెను
ఎలుగెత్తెను భారతమ్మ
వెలుగుల శంఖాల నొత్తి
విజయ దుందుభులు మ్రోసెను
ప్రజ కూర్చెను రాజ్యాంగం—
ప్రజలే పరిపాలకులై
సృజియించిరి అధ్యక్షుని

1. 'స్వేచ్ఛపథం' (గేయసంకలనం)

తలగల దేశాలలోనె
తలయెత్తెను భారతమ్ము
పసరైనా తగ్గనిదీ
సిసలైనది స్వాతంత్ర్యం
విరచించి ప్రకటించిరి
ఇరువది యారవ జనవరి'

అంటూ స్వేచ్ఛా భారతంలో ప్రజలే పరిపాలకులు కాగలిగిన రాజ్యాంగాన్ని రూపొందించిన గణతంత్ర ఉత్సవ వేడుకలను గానం చేశారు.

ప్రజాకవి సుంకర సత్యనారాయణ...

'ఎగురవే వినువీథి ఎగురవే జండా
శాంతి దూతగ నేడు జాతీయ జండా
యుగ యుగంబుల జగతి నెగురవే జండా
సౌఖ్య ప్రదాతగా స్వాతంత్ర్య జండా

భారతీయుల మహాపోరాట ఫలితమా
వీరయోధుల రక్తధారలకు చిహ్నమా
శాంతి దూత అశోక ధర్మచక్రము దాల్చి
శాంతి నిల స్థాపించ నరుదెంచితివి నీవు

పెను తుఫానుల నెన్ని పెనవేసుకున్న
దనుజులందరు గూడి నిను దింపకున్న
కడ భారతీయుండు పడిపోవు దనుక
గగనాన ధ్రువతార కరణి నిల్చెదవు' ॥ఎగురవే॥[1]

అంటూ శాంతి దూతగా వినువీధిలో ఎగురుతున్న 'స్వాతంత్ర్య పతాక' ప్రాశస్త్యాన్ని వర్ణించారు.

ఇంకా ఎందరెందరో కవులు ఈ ఆనందోత్సవంలో భాగం పంచుకుని తమ కలాలను - గళాలనూ సవరించుకుని స్వేచ్ఛాగీతాల నాలపించారు.

## ఆంధ్రరాష్ట్ర పోరాట గీతాలు

దేశానికి స్వాతంత్ర్యమైతే వచ్చింది కానీ ఆంధ్రరాష్ట్ర మేర్పడలేదు. తెలుగు ప్రజలకు నిరాశే మిగిలింది. సహజంగానే తెలుగు కవులు పిడికిళ్ళు బిగించారు. ఎంతటి త్యాగానికైనా వెనుదీయరాదనీ, భాషా ప్రాతిపదికపై తమ సొంత రాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకోవాలనీ వ్యాసాలద్వారా, ఉపన్యాసాల ద్వారా, పద్యాల ద్వారా, గేయాల ద్వారా ప్రబోధించారు.

1. 'గేయాంజలి' (1984) - ఆం.ప్ర.ప్రభుత్వ సమాచార పౌరసంబంధశాఖ.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం విషయంలో అటు కేంద్రప్రభుత్వానికి గానీ, ఇటు గాంధీగారికి గానీ శ్రద్ధ లేదనే భావం కలిగిన పైడిపాటి సుబ్బారామశాస్త్రి గారు 'తేరా! రాష్ట్రం' అనే గేయంలో తమ భావాన్ని వెంటుపరిచారు. ఈ గీతాన్ని ఏలూరు కాలేజీ ఆంధ్రోత్సవాలలో చదివినప్పుడు అప్పటి సభాధ్యక్షులు శ్రీ వారణాసి శ్రీనివాసరావుగారు అభినందించి, శ్రీ పైడిపాటిని కౌగలించు కొన్నారు.[1]

'రాదురా రాదురా రాష్ట్రం ఆంధ్రుడా!
వృధా కంఠశోష——
విశ్వదృష్టితో తెలుగు తమ్ముడు
వెనుకకు పడ్డాడు ॥

అసలీ ఆంధ్రుల విషయం శ్రద్ధ
ముసలివానికే లేదూ
అయిన వారికి ఆకుల కూడూ
కాని వారికి కంచాలూ ॥

జపాను దెబ్బకు, తుఫాను దెబ్బకు
మనమే చెడ్డామూ
మోయలేని సొమ్ములు చందాలుగ
మనమే యిస్తామూ ॥

తేరా తమ్ముడ! తేరా రాష్ట్రం
పరాపేక్ష వద్దూ
ఒక్కడవే, నీ వొక్కడివే, నీ
దిక్కు చూచుకోరా॥'

అంటూ ఒకవైపు తమ ఆగ్రహాన్ని ప్రకటిస్తూనే, మరోవైపు 'తేరా తమ్ముడ! తేరా రాష్ట్రం' అంటూ శ్రీ పైడిపాటి కర్తవ్యబోధ చేశారు.

'తెలుగు నదులెల్ల పొంగెత్తి ప్రళయవారి
కెరలివచ్చి తెన్గునేల మునిగించనిమ్ము
నేటితో నస్వతంత్రా నియతమైన
యీ బ్రతుకు తెన్గువారు భరించలేరు'

అని తెగేసి చెప్పారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ.

---

1. 'జయభారతి' (గీతావళి) - పైడిపాటి సుబ్బారామశాస్త్రి.
(తేరా! రాష్ట్రం గీతానికి రచయిత రాసిన వివరణ ఆధారంగా...)

తెలుగు బాలల హృదయాలలో తెలుగు వ్యక్తిత్వ చైతన్యాన్ని మేల్కొల్పిన నార్ల చిరంజీవి...

'దేశమేదన్నచో తెలుగుదేశమనుము
జాతియేదన్నచో తెలుగుజాతియనుము
వంశమేదన్నచో తెలుగువాడననుము
తెలుగుకీర్తిని చాటుము తెలుగుబిడ్డా!'[1]

అనే సందేశాన్ని తెలుగు ప్రజలకు వినిపించారు.

తెలుగు ప్రజల్లో పోరాట స్పృహను రగిలిస్తూ మల్లంపల్లి సోమశేఖర శర్మ రాసిన గీతంలో...

'దృఢ మనస్కుడవై యత్నించిన
సడలిపోదా దాస్యబంధము
నీ యపూర్వ స్వతంత్ర తేజము
నిలిచి దిక్కుల నిండులేరా
ఈ విలంబన మేటికోయీ ఆంధ్రుడా!'

అంటూ దాస్యబంధాలను సడలించే దృఢ సంకల్పమే ఉంటే, దానికై కావలసిన ప్రయత్నం ప్రారంభించమన్నారు. అప్పుడు ఆంధ్రుల స్వతంత్ర తేజము నలుదిక్కుల నిండుతుందనే నమ్మకాన్ని ప్రకటించారు.

'ఆంధ్రరాష్ట్రం' ఖండ కావ్యాన్ని వెలువరించిన శ్రీనివాస సోదరులు...

'చేవగలిగిన చాలొక్క చిటికెలోన
నాంధ్రరాష్ట్రమ్ము సాధింపనగును మనకు'[2]

అనే సమర చైతన్యాన్ని ప్రబోధించారు. ఆంధ్రులు సమైక్యంగా ఉద్యమిస్తే చిటికెలో రాష్ట్రాన్ని సాధింపవచ్చుననే ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించారు.

'రాష్ట్ర సంపాదనానికి రాజమార్గం సూచించడానికే ఈ చిన్నిపుస్తకం ప్రకటిస్తున్నాం' అంటూ తమ సంకల్పాన్ని ఆంధ్ర ప్రజలకు ఈ రచయితలు విశదపరిచారు.

ఆంధ్రోద్యమ తీవ్రతకు ప్రతిబింబంగా నిలిచే గీతికా సంపుటి 'ఆంధ్ర జ్వాల'. జంపన చంద్రశేఖరరావు రాసిన ఈ గీతాల్లో ఆంధ్రోద్యమ దశలన్నీ వర్ణింపబడినాయి.

బానిస సంకెళ్ళలో బంధింపబడిన తెలుగు తల్లికి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు కల్పించడానికి కలాలను, ఖడ్గాలను చేబూని కదిలి రావలసిందిగా తెలుగు సోదరులకు పిలుపు నిచ్చారు జంపన.

---

1. 'తెలుగుపూలు' - నార్ల చిరంజీవి.
2. 'ఆంధ్రరాష్ట్రం' (ఖండకావ్యం) - శ్రీనివాస సోదరులు.

'తెలుగు తల్లికి స్వాతంత్ర్య తేజమొసగ
హృదయ బలివేదిపై వెలిగించినారు
రుధిర హారతి తెలుగు శూరులు; నగార
చాటుమో తండ్రి! దేశదేశాల వేగ -

కనుల జలజల బాష్పముల్ కార్చుచున్న
తల్లివదనమ్ము కనలేము, తాళలేము
కలము ఖడ్గమ్ము పూనెడు కరములెత్తి
పిలచుచున్నాము రారమ్ము తెలుగువీర!

పరుల భిక్షచే బ్రతికెడు ప్రాణికింక
లేదు కన్నీట విజయార్ద్రరేఖ యొకటి
పోదు దాస్యము స్వార్థము పోవకున్న
రాదు మోక్షము బానిస రాష్ట్రమందు'[1]

అని స్పష్టపరిచిన 'ఆంధ్రజ్వాల' జంపన చంద్రశేఖరరావు-

'మండిపోయెడు గుండెలో ఎండిపోవు
ఖధిర రుధిరమ్ము విజయ విధ్వానమైన
తెలుగు వీరుని గుండెపై నిలిచియున్న
ప్రళయరుద్రుని పాదాలు వణికిపోవె?'

అని ధైర్యంగా ప్రశ్నించి, ఆంధ్రుల ఆత్మధైర్యాన్ని పెంచి పోషించారు. అంతేకాదు...

'తెలుగు దేశము నాది
తెలుగు వీరుడ నేను
తెలుగు జెండా ఏదిరా?
సోదరా!
తెలుగు జెండా లేదురా!
తెలుగు పాలతో మాతల్లి
ఉగ్గు పోసింది
తెలుగు పాటల మాతల్లి
నిదుర పుచ్చింది
తెలుగు నెత్తురు నాది
తెలుగు శక్తులు నావి
తెలుగు జెండా ఏదిరా?
సోదరా!

1. 'ఆంధ్రజ్వాల'—జంపన చంద్రశేఖరరావు.

తెలుగు జెండా లేదురా!
తెలుగు శౌర్యము నాలో
జీర్ణించి పోయింది
తెలుగు ధైర్యము నాలో
జీవించి మెరిసింది
తెలుగు వీరుని కత్తి
తేజమొలికెడు నాడు
తెలుగు నెత్తుటి జల్లు
దిశల జిమ్మెడినాడు
జాతిసత్వము మాకు
కలదా?
పౌరుషోత్తులు మాలో
కలరా?
తెలుగు భాషయె నాది
తెలుగు వేషము నాది
తెలుగు జెండా ఏదిరా?
సోదరా!
తెలుగు జెండా ఏదిరా?

అంటూ ఆవేశపూరిత స్వరంతో గానం చేసిన చంద్రశేఖరరావు గుండెగుండెలో 'ఆంధ్రజ్వాలల్ని' రగిలించారు. తెలుగేతర మంత్రుల, శాసనసభ్యుల ఊడిగం చేసే తెలుగువారిని అడవిబాపిరాజు ఆక్షేపిస్తూ......

'ఓ తెలివిమాలిన తెలుగువాడా
దండలు చదివే దండుగవాడా
......................
దాసుడనంటూ దణ్ణం పెట్టేయరా
నీ ఎదాన కింకా
ఆంధ్రదేశం మాటలు ఎందుకురా?'[1]

అంటూ వ్యంగ్యంగా ఎత్తిపొడవడమే కాదు, వేగంగా పిడికిలెత్తమనే కర్తవ్యాన్ని నిర్దేశించారు.

1. 'మాతృభూమి' 8 మే 1949 సంచికలో 'తెలివిమాలిన తెలుగువాడా' (గేయం)

ఆంధ్రోద్యమంలో శాంతియుత్నాలు పూర్తయ్యాయనీ, ఇక పోరుతప్ప దారి లేదని ఉద్యమ తీవ్రతను స్ఫురింప జేస్తూ...

ఆంధ్రయువక వీరులార
అలసింప నేలనోయ్
    అలసింప నేలనోయ్
    అందఱును జేరుడోయ్
ఏక్, దో, తీన్, చార్,
ఏకధాటిగాను నడిచి
    ఏకధాటిగాను నడచి
    ఎల్లరు క్రమశిక్షణమున
నడుముల బిగియించి లెండు
నదురు బెదురు లేకరండు'1

అంటూ శాస్త్రి వెంకట నర్సయ్య పోరాటానికి పిలుపు నిచ్చారు. అదురు బెదురూ లే అందరూ నడుములు బిగించి రండని విప్లవాహ్వానం పలికారు.

మరోవైపు 'నిజామాంధ్ర రాష్ట్రం'లో రాజరిక వ్యవస్థపై పోరాడుతున్న తెలంగాణా ప్రజానీకాన్ని మేల్కొలుపుతూ ప్రజాకవి సుంకర...

'తెలుగు బిడ్డా! మేలుకోవోయ్!
నైజాము తెలుగుబిడ్డా! లేచిరావోయ్! ॥తెలుగు॥
నదులు నగములు గనులు - నల్ల నల్ల భూములూ
కలవు నీ దేశాన - గంజిసీళ్ళే కరవ?॥
దున్ని చెమటోడ్చి ఈ - మన్ను బంగిరు జేసి
కరువుతో జచ్చేటి - గతి ఏమి పట్టినది?॥
కదిలించి బలగాన్ని - ఎదిరించి వైరులను
శక్తి చూపించగల - సమయమిదె లే! లెమ్మ ॥తెలుగు॥'2

అంటూ నైజాము ప్రాంత తెలుగు ప్రజలను చైతన్యపరిచిన ఈ కవి...

'బిరాన లేచిరండు తెలుగు
బిడ్డలార ఒకటిగా
దురాగతాలు సేయు దేశ
ద్రోహి నణచివైవగా ॥బిరాన॥

---

1. నవగీతాలు - శాస్త్రి వెంకట నరసయ్య.
2. 'జయగీతి' (ప్రబోధ గేయాలు) - సుంకర సత్యనారాయణ.

ప్రజావిరోధి యెవ్వడైన
బ్రతుకలేడు నిశ్చయం - నిశ్చయం
ప్రజాబలాల ధాటినాప
బ్రహ్మతరము గాదుపో ॥విరాన॥

నిరంకుశత్వమేదియైన
నిలువలేదు జగతిపై - జగతిపై
దురాత్ములైన హిట్లరాదు
లొరిగిపోయి రుర్విపై ॥విరాన॥

పరాక్రమించి ప్రతిఘటించు
ప్రజం కెదురు లేదురా - లేదురా
కిరాత ధనిక పెత్తనాని
కంత్యక్రియలు సేయరా ॥విరాన॥'

అంటూ సమర శంఖారావాన్ని సాహిత్యంలో ప్రతిధ్వనింపజేశారు. ప్రజం బలము ధాటికి తట్టుకోవడం బ్రహ్మతరం కూడా కాదని స్పష్టపరిచారు.

అలాగే తెలుగు జాతిని ముక్కచెక్కలు చేసిన తెల్లప్రభువుల పాలనపై ఆగ్రహాన్ని ప్రకటిస్తూ ప్రభుత్వ ప్రజావ్యతిరేక ప్రచారాన్ని ఎండగట్టిన ప్రయాగ కోదండరామశాస్త్రి...

'ముక్కోటి తెలుంగుజాతి ముక్కలుగా చెక్కలుగా
చీలదీసి చెదరగొట్టి, పాలించే తెల్లతెగులు
మర తుపాకి కొరకొరలో, పరిపాలన సాగిస్తూ

'ప్రజలే చెంరేగా'రని, నైజాములు, సీ పీ లు
మా యిళ్ళను కొల్లగొట్టి, చెల్లెళ్ళను చెరబట్టి
ప్రజలపైన ధ్వజమెత్తి కవాతు చేస్తున్నారా?'

అని ప్రశ్నించారు. తుపాకి పాలనకు ఎదురు తిరుగుతున్న ప్రజల కార్యాచరణకు కారణమెవ్వరో ఆలోచించమన్నారు. అలాగే పాట ముగింపులో...

'మర తుపాకి కొరకొరలో పరిపాలన సాగించే
నైజాములు సీపీలు నేలకొరిగిపోవాలి
ప్రజలే ప్రభువులుగా భూస్వర్గం రావాలి'1

అని నినదించారు. ప్రజలను కదిలించారు. పదనానికి ముందుకు నడిపి..రు.

1. 'కల్పన' — చేతనసాహితి, విజయవాడ - 2.

ఒక వైపు మద్రాస్ రాజధానిగా గల ఆంధ్రప్రాంతంలోనూ, మరోవైపు హైదరాబాద్ రాజధానిగా గల తెలంగాణ ప్రాంతంలోనూ 'ఆంధ్రమహాసభ'ల నాయకత్వంలో ఉవ్వెత్తున ప్రజోద్యమాలు ఉవ్వెంగుతున్నప్పటికీ కేంద్రంలో ఏర్పడిన స్వతంత్ర భారత ప్రభుత్వం ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పాటు చేయడంలో చొరవ తీసుకోలేకపోయింది. 1949 లో ఈ సమస్యను పరిష్కరించడానికి ఏర్పడిన జె. వి. పి. కమిటీ (జవహర్లాల్ నెహ్రూ, వల్లభ్ భాయ్ పటేల్, పట్టాభి సీతారామయ్య సభ్యులుగా గల కమిటీ) కొన్నేళ్ళవరకు భారతదేశాన్ని భాషా ప్రాతిపదికపై విభజించడం వాయిదా వేయాలని అభిప్రాయపడింది. అయినా ఆంధ్రులు మద్రాసును గురించి పట్టుబట్టకపోతే, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం జరుప వచ్చని సిఫార్సు చేసింది ఇదిలా ఉండగా మద్రాస్ అసెంబ్లీలో రాయలసీమకు చెందిన 21 మంది శాసన సభ్యులు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని వాయిదా వెయ్యాలని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ విజ్ఞప్తి పంపారు. ఇలాంటి భిన్నాభిప్రాయాలతో ఆంధ్ర రాష్ట్ర సాధన రోజు రోజుకీ దూరం కాజొచ్చింది. ఇక లాభం లేదని 1952 ఆగష్టు 15న స్వామీ సీతారాం ఈ సమస్య పరిష్కారాన్ని కోరుతూ 'నిరవధిక నిరహారదీక్ష' ప్రారంభించారు. అయినా ప్రయోజనం లేకపోయింది. రోజులు గడుస్తున్నా కేంద్ర ప్రభుత్వం చలించలేదు. 38 రోజులపాటు నిరాహారదీక్షచేసిన స్వామీ సీతారాంగారి ఆరోగ్యం క్షీణించడం వల్ల ఆయన దీక్షను విరమించిన సంగతి గత ప్రకరణంలో చర్చించాం.

తెలుగు ప్రజల దురవస్థకు బాధపడిన దేశభక్తుడు, గాంధేయవాది పొట్టి శ్రీరాములు ఈ సమస్యపై ప్రజాభిప్రాయాన్ని కేంద్రీకరించడానికి కృషి ప్రారంభించారు. 1952 సెప్టెంబర్ 15 న తన మిత్రుడు, న్యాయవాదియైన బి. లక్ష్మీనారాయణకు ఉత్తరం రాస్తూ- 'ఆంధ్ర రాష్ట్ర సాధనకు నేను బలి కావాలని నిశ్చయించుకున్నాను. సరైన మార్గంలో ఆలోచిస్తే తప్ప ఒకరి దృక్పథం మరొకరికి అర్థమయి ఐక్యత చేకూరదు' అని స్పష్టపరిచారు.[1]

1952 అక్టోబర్ 19న ఆంధ్ర రాష్ట్ర సాధనకోసం పొట్టి శ్రీరాములు గారు 'ఆమరణ నిరహార దీక్ష' ప్రారంభించారు. మొదట్లో ఎవరూ పట్టించుకోక పోయినా, రోజులు గడుస్తున్నకొద్దీ ప్రభుత్వ నిర్లక్ష్యానికి నిరసగా ప్రజలు ఆందోళన ప్రారంభించారు. హర్తాళ్ళు, ఊరేగింపులు ప్రారంభమయ్యాయి. కేంద్ర ప్రభుత్వానికి ప్రజలు టెలిగ్రామ్‌లు పంపసాగారు. అయినా నెహ్రూ ప్రభుత్వం ఈ సమస్యను పరిష్కరించే చొరవ చూపలేదు 'ఆంధ్ర రాష్ట్రం ఇవ్వండి -

1. 'ఈనాడు' (దినపత్రిక) 1-11-86 సంచికలో శ్రీ రాధా శివమోహన్‌గారి వ్యాసం ఆధారంగా...

శ్రీరాములు ప్రాణాలు కాపాడండి' అనే నినాదం తెలుగు నేలపై ప్రతిధ్వనించింది. కానీ ప్రయోజనం లేకపోయింది. 58 రోజుల నిరాహార దీక్షతో 1952 డిసెంబర్ 15 అర్ధరాత్రి 12 గంటలకు 'ఆంధ్రయోధుడు' శ్రీరాములు అసువులు బాశాడు. ఆ అమరజీవి ఆత్మార్పణతో ఆంధ్రదేశం అట్టుడికిపోయింది. నిరసన ప్రదర్శనలు, ఊరేగింపులు, హర్తాళ్ళు, విజయవాడ రైల్వే స్టేషన్‌లో గూడ్స్ రైలు దోపిడీ; వాల్తేరు, నెల్లూరు రైల్వే స్టేషన్లలో పోలీసు కాల్పులు; అనేక ప్రాంతాల్లో ఆందోళనకారులపై పోలీసు కాల్పులు... ఆంధ్రోద్యమం ఒక మహోద్యమ మయింది.

అపూర్వమైన ఈ ప్రజా ప్రతిస్పందనను గమనించిన భారత ప్రధాని నెహ్రూగారు మార్చి 25న ఒక ప్రకటన చేశారు. 'అక్టోబరు 1న ఆంధ్ర రాష్ట్రం ఏర్పడుతుంది ఆంధ్ర రాజధాని మద్రాసులో ఉండరాదు. కనుక ఆంధ్ర శాసనసభ్యులే తమ ఆంధ్ర ప్రాంతాల్లో ఒకదానిని రాజధానిగా నిర్ణయించుకోవాలి' అన్నది ఆ ప్రకటన సారాంశం.

ఇలా ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి తన ప్రాణాలర్పించిన అమరవీరుడు పొట్టి శ్రీరాములు తెలుగు కవుల హృదయాల్లో 'స్మృతిగీతి' (Elegy)గ నిలిచిపోయాడు అనేక కావ్యాలకు, గేయాలకు కథావస్తువుగా నిలిచి, అమరుడయ్యాడు.

## 'అమరజీవి'కి అక్షరాంజలి

'ఆంధ్ర రాష్ట్ర సిద్ధికై ప్రాణములు ధార
పోసి దివముఁ జేరఁబోయినట్టి
ధీరుడైన పొట్టి శ్రీరాములెట్టి పూ
జ్యతను గనెనొ చదువుడాంధ్రులార'[1]

అంటూ పుస్తక ముఖచిత్రంపై ప్రకటించి, పొట్టి శ్రీరాములుగారి జీవితం, త్యాగనిరతి, ఆత్మార్పణం మొదలైన అంశాలను వర్ణించిన పద్యకావ్యం మోచర్ల రామకృష్ణయ్య గారి 'అమర గౌరవము' (జూలై 1953). అమరజీవి ఆత్మాహుతికి పట్టిన అక్షరాంజలి ఇది. ఇలాగే నార్ల చిరంజీవి. అమరజీవికి అంజలి ఘటిస్తూ...

'రాష్ట్ర సిద్ధికై పొట్టి శ్రీరాములయ్య
నిరశన వ్రతదీక్ష పూని మృతుడయ్యె
అమర జీవిని స్మరియించి అంజలించి
పులకరెత్త కీర్తించుము తెలుగుబిడ్డ'[2]

---

1. 'అమర గౌరవము' మోచర్ల రామకృష్ణయ్య (జూలై 1953).
2. 'తెలుగుపూలు' - నార్ల చిరంజీవి.

అనే చతుష్పదగీతిలో ఆ త్యాగమూర్తిని కీర్తించుమని తెలుగు బిడ్డలకు తెలుపుతున్నారు.

రాజులూ, రాజ్యాలూ నశిస్తాయిగానీ. ప్రజలకోసం ప్రాణాహుతి చేసిన అమరజీవుల బలిదానం అవని ఉన్నంతవరకూ నిలిచి ఉంటుందని వివరిస్తూ...

'కత్తి బలము నమ్మి ఘన చక్రవర్తులు
మాడినారు రూపు మాసినారు
ప్రజల మేలుకొరకు బలియైన త్యాగులు
నిల్చిపోదు రవని నిల్చు వరకు'

అనే సత్యవాక్కులతో 'అమరజీవి' మెడలో 'తెలుగుపూల' దండ వేశారు నార్ల చిరంజీవి.

'జోహార్లు జోహార్లు పొట్టి శ్రీరామా!
ఆంధ్రజాతికై నీవు అసువులిచ్చావా?
పేరుకని రాముడని అన్నారుగానీ
రాముడన నీ ముందు ఎంతరా స్వామీ

అనాడు ఆ రాముడడవి కేతెంచ
తోడుకొని వెళ్లెరా సతిని సోదరుని
ఏ తోడు సిద్ధైన లేకుండ నీవు
అకులలములు గాని అన్నము గానీ
ఆరగించక నీవు ప్రాణమిచ్చావు'[1]

అంటూ అక్షరాంజలి ఘటిస్తూ ఫిబ్రవరి 1953 లో విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ వారు 'తెలుగు తొలకరి' పాటల సంకలనం వెలువరించారు.

అలాగే...

'నిస్తుల తపస్వి రాములు - క్రీస్తు శకము
పదియుఁదొమ్మిది వందల - పైన యొకట
బుట్టి యేబది రెండులో - గిట్టెఁ దన యశస్సు దిగ్దంతిదంత వి-శ్రాంతి నొంద'[2]

అంటూ శ్రీరాములుగారికి అంకితం చేస్తూ 'ఆంధ్ర మహాభ్యుదయము' పద్య కావ్యాన్ని బండ్ల సుబ్రహ్మణ్యకవి రచించారు. అమరజీవి జీవితచరిత్ర

1. 'తెలుగు తొలకరి' (సంకలనం) —విశాలాంధ్ర ప్రచురణాలయం
2. 'ఆంధ్ర మహాభ్యుదయము' (పద్య కావ్యము) —బండ్ల సుబ్రహ్మణ్యకవి

భారత స్వాతంత్ర్య సమరము - అల్లూరి సీతారామరాజు చరిత్ర - ఆంధ్ర రాష్ట్రోదయములను వర్ణించిన ఆవేశపూరిత పద్య సుమహారం ఈ కావ్యం.

1952 లోనే 'ఆంధ్ర రాష్ట్ర గీతారత్నములు' ప్రచురించిన కవి అను పోజు లక్ష్మణరావు. పుస్తకానికి అతను రాసిన ముందు మాటలో...

'ఆంధ్ర సోదరా! తన సహోదర మానవులకై ప్రాణము లర్పించిన మహాత్ములు యుగమున అరుదు.

తన సోదరాంధ్రులకై నలువదినాలుగు సంవత్సరముల నుండి ఆంధ్రులకు అందరాని పండుగ నుండిన ఆంధ్రరాష్ట్ర సిద్ధికై శాంతియుత మార్గాన ఆంధ్రుల రాష్ట్ర వాంఛను చాటిన అమర బాపూజీ స్వచ్ఛంద శిష్యవర్గపు మేటి ఆంధ్ర వీర రత్నము శ్రీ పొట్టి శ్రీరాములుగారు. ఏబది ఎనిమిది దినములు ప్రాయోపవేశ దీక్ష గావించి తమ అసువులను బలిదానమొనర్చిన నాటినుండి నాలోని ఆవేదన ద్విగుణీకృతమై పురకలు వేసి నాచే ఈ గేయములను రచించ ప్రోత్సహించినది. ప్రజ యైక్యతా జ్ఞానోదయం కలిగించి పూర్ణాహుతి ఆంధ్ర ప్రజలచేతనేగాక యావద్భారతీయులచేత శ్లాఘించబడిన యీ ఆంధ్రవీర శిఖామణిని గోల్పోవుట మనకు తీరని లోటు.

శ్రీ పొట్టి శ్రీరాములుగారి మహాత్యాగ నిరతిచే రేకెత్తిన ఆవేశము ప్రోత్సహించ ఈ గేయములను వ్రాసి పట్టణ సమైక్య సభలలో పాడితిని.

శ్రీ శ్రీరాములుగారి - ఆత్మశాంతికై, ఆశయసిద్ధికై ఆంధ్ర ప్రజానీకం ప్రతిజ్ఞ పట్టాలి. అతని ఆత్మకు శాంతి కలుగుగాక' అంటూ తమ అభిప్రాయాలను వెల్లడించారు. ఆయన రాసిన గీతాల్లో......

ఆంధ్రజ్యోతి ఆరలేదు. నేటితో
ఆంధ్ర రాష్ట్రము రాకపోదు ॥ఆంధ్ర॥
ఆంధ్రదేశము కన్న అగ్రదేశము లేదు
ఆంధ్రుని గెలిపించు అర్హుడేయెడలేడు
ఆంధ్రదేశపు ధనము ఆంధ్రేతరుల బాగు
కందించి మనమింక కుందిపోవుటయేన ॥ఆంధ్ర॥
త్యాగశీలుడు పొట్టి శ్రీరాములికలేడు
రాగలుగు వారలు యెందరో యికచూడు
మీ ఘనతలకు స్వస్తి చెప్పుదురు ప్రజనేడు
వేగ రాష్ట్రంబిచ్చి మీ విలువగైకొనుడు ॥ఆంధ్ర॥
అఖిలాంధ్రు లీవేళ ఐక్యతను జెందాలి
ఆంధ్రవీరుని మాటలన్ని సాగించాలి

ఆంధ్రవీరుని మాటలన్ని సాగించాలి
ఆంధ్ర రాష్ట్రము కొరకు ముందడుగువేయాలి
ఆంధ్రమాతకు హారతులను వెలిగించాలి'[1] ॥ఆంధ్ర॥

అంటూ 'ఆంధ్రావేదన'కు అనుపోజు లక్ష్మణరావు అక్షరరూపం కల్పించారు. అలాగే మరోగీతంలో......

'జోహారు జోహారు ఓ ఆంధ్రవీరా ॥జోహారు॥
దేహమును విడనాడు । దీక్షాఫలము నీవు
ఊహించితివి గాని । యుర్విపై వినలేదె ॥జోహారు॥
సత్యాగ్రహముకన్న । సాధనము లేదని
ప్రత్యక్షముగ జూపి । ప్రాణమును వీడితివి ॥జోహారు॥
... ... ... ...
నీ మరణవార్త విని । నీ యాంధ్రలోకము
మైమరచి యెన్నెన్నో । మార్గాల ద్రొక్కింది ॥జోహారు॥
ఆంధ్ర రాష్ట్రము కొరకు । అసువులను విడనాడి
ఆంధ్ర వీరాగ్రణీ । ఆ గాంధి జేరితివి ॥జోహారు॥

అంటూ 'రాష్ట్రదాత'కు జోహార్లర్పించారు.
అంతటితో ఆగక......

'నీ శక్తి జూపించుమా ఆంధ్రుడా!
నీ పట్టు విడకింక మొనగాడా ॥నీ శక్తి॥
నీవు చేసిన త్యాగనిరతి వ్యర్థము కాదు
భావి సౌఖ్యాలెన్నో పండించుటకు పాదు
అన్ని సంస్థల ప్రజలు మనవారోయ్
అండ నిలచుండగా భయమేలోయ్' ॥నీ శక్తి॥

అంటూ 'రాష్ట్ర భేరీ' మ్రోగించి, ఆంధ్రులను కదన రంగానికి కదలండని పథనిర్దేశం చేశారీ రచయిత.

24-11-1953 నాడు ఆవిష్కృతమయిన శ్రీమతి గుడిపూడి రాజేశ్వరీదేవి గారి 'అమర గేయాలు' రాష్ట్ర నిర్మాణ ప్రధాన శిల్పి, అమరజ్యోతి పొట్టి శ్రీరాములుకు సమర్పితం చేయబడింది.

'రాష్ట్రం కొరకై - ప్రాణాలిచ్చిన
రాష్ట్రసేవకా - రామయ్య బాబు
నీ నిరసన దీక్షతో - కదలిందయ్యా

1. 'ఆంధ్రరాష్ట్ర గీతరత్నములు'-అనుపోజు లక్ష్మణరావు.

ఆచేతనంబగు - ఆంధ్రుల హృదయం
సత్యాహింసల - శాంతి సమరమున
స్వామి బాపూజీ - సహచరుడవుగా
నిత్య జ్యోతియౌ - విశాలాంధ్రకు
విత్తనంబులీ యిల - నాటితివా
నీ వొక మణివి - తెలుగుజాతిలో
నిను మరువదురా - ఆంధ్రహృదయం
రాష్ట్రం కొరకు - త్యాగం చేసి
ప్రాణాలిచ్చిన - ప్రశాంతజీవి
చిరస్థాయిగా - నీదు నామమూ
తేజరిల్లురా - తెలుగుల గుండెలో
వేష భాషల - మోసం జేయు
మోసగాంధ్రకిక - దీపములారు'

అంటూ తెలుగు హృదయాల కదలికకు కారకుడైన రాష్ట్రజ్యోతి శ్రీరాములుకు నివాళులర్పించారు రాజేశ్వరీదేవి.

ఆంధ్ర జాతీయభక్తి గీతాలకు ఆట పట్టయిన పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారు తమ 'జాతీయ భారతి' గీతాల్లోనూ, ఇతర కావ్యాల్లోనూ పొట్టి శ్రీరాములు గారిని ఘనంగా కీర్తించారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఆహ్వానం పలికిన సాహితీవేత్తలందరూ 'అమరజీవి' పొట్టి శ్రీరాములు గారిని వివిధ సాహితీప్రక్రియల్లో స్మరించి తమ అక్షరాంజలులు ఘటించారు.

## రాష్ట్రోదయం పై ఆనందగీతాలు

అమరజీవి ఆత్మార్పణం, నెహ్రూగారి మార్చి 25 ప్రకటన తర్వాత ఆంధ్ర నాయకులు అనేక తర్జన భర్జనల తరువాత 'కర్నూల్'లో రాజధాని, గుంటూరులో రాష్ట్ర హైకోర్టు నెలకొల్పడానికి నిర్ణయించుకున్నారు. కాంగ్రెస్ పార్టీ నాయకత్వం మాత్రమే ఈ నిర్ణయాన్ని ఆమోదించింది. కమ్యూనిస్టుపార్టీ, కృషికార్ లోక్‌పార్టీ, సోషలిస్టు పార్టీ మొ॥నవి ఈ నిర్ణయాన్ని నిరసించాయి.

రాష్ట్ర కాంగ్రెస్ నాయకత్వ నిర్ణయాన్ని కేంద్ర కాంగ్రెస్ ప్రభుత్వం బలపరిచింది. 1953 అక్టోబర్ 1న తాత్కాలిక రాజధాని కర్నూల్‌గా భారత ప్రధాని జవాహర్‌లాల్ నెహ్రూ ఆంధ్రరాష్ట్రాన్ని ఆవిష్కరించారు.

రాజధాని ఏదయితేనేం, చాలామంది కవులు ఆంధ్ర రాష్ట్రోదయంపై ఆనందగీతాలు పాడారు.

'నవోదయం - శుభోదయం
నవయుగరాష్ట్ర - మహోదయం
విశ్వప్రకాశం - సుప్రభాతం
సుందరవదనం - సురుచిరభావం
కూయని కూసె - కోయిల జంట
స్వాగత మిడయె - చిలుకల జంట
జయమని పలికె - దుందుభి ధ్వని
విరుల జల్లునదె - విహంగ శ్రేణి
కృష్ణ గౌతమదె - అభిషేకించె
నాగార్జున కొండ - ఛత్రము బట్టె
రష్మి కదలిక రష్మి - కమ్మని తెల్గుల తెమ్మెరవీచె
రాయల వీటిలో - రతనాల జ్యోతులు
పాటలీ పుత్రాన - తెలుగుల జండా
నీటు గుల్కు మా - ఎల్లోర శిల్పం
ఆంధ్రుల తేజమౌ - అజంత గుహలు
అన్ని స్వాగతమిస్తున్నాయి - అమ్మా రాగదె తెల్గుల తల్లి
వొట్టి శ్రీరాములె - పూజారి నీకు'

అంటూ నవయుగ రాష్ట్ర మహోదయానికి 'సుప్రభాతం' పలికారు గుడిపూడి రాజేశ్వరీదేవి

కరుణశ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి మరొక అడుగు ముందుకేసి, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణంతో సరిపోదు, 'విశాలాంధ్ర' నిర్మాణానికి జనం కదులుతారనే కొత్త ఆశ, తన గుండెల్లో తలెత్తిందని 'నవోదయ' గీతం ఆలపించారు.

'గుండెల్లో నేడేదో
కొత్త ఆశ తలెత్తింది
ఎండిన వృక్షం మళ్ళీ
ఎందులకో చిగిర్చింది

తీరని కోరిక ఏదో
తియ్యంగా హాసించింది
అందని అందం ఏదో
అంతస్సును స్పృశించింది

తుంగభద్ర తరంగాలు
పొంగి పొరలి పోతున్నవి
బంగారపు గుడి గంటలు
ఖంగు ఖంగు మంటున్నవి
తెలుగు తల్లి గుడి తలుపులు
తీస్తారట యీ 'ఉదయం'
"విశాలాంధ్ర"కే రాస్తా
వేస్తుందట 'నవోదయం'
రా చెల్లీ! రా తల్లీ!
రా అన్నా! రా తమ్ముడు!
ఆంధ్ర జనని అడుగులపై
అభ్యుదయం విరజిమ్ముడు'[1]

అంటూ ఆహ్వానం పలికారు. తెలుగుతల్లి గుడి తలుపులు తీసి 'విశాలాంధ్ర'కు రాస్తావేసే నవోదయానికి స్వాగతం చెప్పారు.

## 'ఆంధ్ర రాజధాని-అధిక్షేప గీతాలు'

1953 మార్చి 25 నాటి నెహ్రూగారి ప్రకటన తరువాత ఆంధ్రరాష్ట్రానికి రాజధాని ఎక్కడుండాలి? - అనే సమస్యపై భిన్నాభిప్రాయాలు తలెత్తాయి. 'శ్రీభాగ్ ఒడంబడిక' (1937) ప్రకారం రాయలసీమలో రాజధాని, కోస్తాంధ్రలో రాష్ట్ర హైకోర్టు ఉండాలని కాంగ్రెస్ నాయకులు అంగీకారానికి వచ్చారు.[2] అయితే రాయలసీమలో ఆనాటికి అంతో ఇంతో అభివృద్ధి చెంది ఉన్న ఇతర పట్టణాలను వదిలి, కనీస సౌకర్యాలు లేని 'కర్నూల్'ను రాజధానిగా నిర్ణయిస్తున్నారన్న వార్త చాలా మందిలో అసంతృప్తికి కారణమయ్యింది. ఈ అసంతృప్తిని అధిక్షేపంగా మార్చి, రాజధాని మార్పు జరిగేవరకు 'విశాలాంధ్ర' దినపత్రికలో రాంభట్ల కృష్ణమూర్తి రోజువారీ వ్యంగ్య గీతాల బాణాలను సంధించారు.

---

1. 'ఉదయఘంటలు' (అఖిలాంధ్ర కవుల గేయ సంపుటి) తెలంగాణా రచయితల సంఘం.
2. ఆంధ్ర రాష్ట్రంలో రాయలసీమ రక్షణల విషయమై 1937లో మద్రాస్‌లోని కాశీనాథుని నాగేశ్వరరావుగారి నివాస భవనం 'శ్రీభాగ్'లో ఆంధ్ర నాయకుల మధ్య కుదిరిన ఒప్పందం 'శ్రీభాగ్ ఒడంబడిక.'

కర్నూలు రాజధానిగా ఆంధ్ర నాయకులు సాధించిన కుందేటి కొమ్ము 'శశ విషాణం.' తెలుగు నేలపై తొలి కార్టూన్ కవితలకు, రాజకీయ అధిక్షేప గీతాలకు రాంభట్ల శ్రీకారం చుట్టారు 1953 జూన్ 8 నుండి డిసెంబరు ఒకటి దాకా 'విశాలాంధ్ర' దిన పత్రికలో ప్రతి రోజూ అచ్చయిన అధిక్షేప గీతాల నుండి కొన్నింటిని ఏర్చి, కూర్చి, 'విశాలాంధ్ర ప్రచురణాలయం' వారు 1954 ఆగష్టులో 'శశ విషాణం' పేరుతో సంపుటిని వెలువరించారు.

దసరా పండుగ సందర్భంగా తెలుగునాట మహిళలు ఆడుతూ, పాడుతూ పాడే పాట 'బతుకమ్మ పాట.' ఈ బాణీలో...

'అగ్గెట్టి గుడిసెకు - ఉయ్యాలో
బొగ్గులంగడి పెట్టె - ఉయ్యాలో
చెట్టునూ కూలేసి - ఉయ్యాలో
కట్టెలంగడి పెట్టె - ఉయ్యాలో
... ... ... ... ...
ఎద్దు పారిటి బట్టి ఉయ్యాలో
గద్దె లెక్కారమ్మ ఉయ్యాల'[1]

అంటూ రాంభట్ల రాశారు. ఈ పాటలోని 'గుడిసె పారిటి' అంటే ప్రకాశం గారి 'కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టి'. 'చెట్టు పారిటి' అంటే 'సోషలిస్టు పార్టీ'. పూసపాటి విజయరామ గజపతిరాజు (పి.వి జి రాజు) దీని నాయకుడు. మద్రాస్ అసెంబ్లీలో దేనికవి విడివిడిగా పోటీచేసి, గెలిచి, పనిచేసిన పైరెండు రాజకీయ పార్టీలు 'కర్నూల్' అసెంబ్లీలో కలిసిపోయాయి. 'ప్రజా సోషలిస్టు పార్టీ'గా రూపాంతరం చెందాయి. అంతటితో ఆగక, కాడెద్దుల కాంగ్రెస్‌తో దోస్తీచేసి మంత్రివర్గంలో భాగస్వాములయ్యాయి. అందుకే...

'గుడిసెకు అగ్గెట్టి - చెట్టును కూలేసి
ఎద్దుమందలో దూరి - గద్దెలెక్కారనీ'

రాంభట్ల ఎద్దేవా చేశారు. ప్రజలకిచ్చిన వాగ్దానాలను మరచి ప్రవర్తించిన ప్రజాప్రతినిధులను ఆక్షేపించారు

1954 నాటి 'దసరా పండుగ' నాటికి అయిదుగురు మంత్రులతో ఆంధ్ర రాష్ట్ర మంత్రివర్గం ఏర్పడింది. వీరిని పాండవులుగా వర్ణిస్తూ...

'పాండవులు పాండవులు - తుమ్మెద
పంచపాండవులు - తుమ్మెద'

---

1. 'శశవిషాణం' (గీతాలు) - రాంభట్ల కృష్ణమూర్తి.
విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ (1954).

అనే పల్లవితో, 'తుమ్మెద' మకుటంగా 'తుమ్మెద పదం' రాశారు రాంభట్ల. దీనిలో...

'పాండవులం కిద్దరూ - తుమ్మెదా - కొత్త
భాయీలు వచ్చారు - తుమ్మెదా'

అని వర్ణించారు. పై అయిదుగురు మంత్రులకు రాజకీయ సలహాలనిచ్చే కేంద్ర సలహాదారుడు 'అత్రి వేదవ్యాస్', అప్పటి రాష్ట్ర గవర్నర్ 'చందూలాల్ త్రివేది'లను ఇద్దరు భాయీలుగా రచయిత అభివర్ణించారు.

'పాకలను పీకించి పందిళ్ళు వేశారు'

అనడంలో అప్పటి రాజకీయ వాస్తవికత స్ఫురిస్తుంది. ఆ రోజుల్లో కర్నూల్‌లో అసెంబ్లీ సమావేశాలు జరుపుటకు ఒక పాత భవనమైతే దొరికింది కానీ, సిబ్బందికి కావలసిన వసతి సౌకర్యం సమకూరలేదు. సచివాలయానికి అవసరమైన ఏర్పాట్లు లేవు. పందిళ్ళు వేసి పనిచేయడం ప్రారంభించారు. అందుకే......

'పందిట్లో సిబ్బంది - పడుతోంది ఇబ్బంది'

అని రాంభట్ల చమత్కరించారు.

28 అక్టోబర్ 1953 నాడు కర్నూల్ రాజధాని నగరంపై కుండపోతగా వర్షం కురిసింది. నిజానికి అక్టోబర్‌మాసం కుండపోత వర్షాల సీజన్ కాదు. అయినా వాన కురిసింది సచివాలయం కోసం వేసిన పందిళ్ళు కొట్టుకు పోయాయి. అప్పుడా సిబ్బంది పడిన ఇబ్బందులను ఊహించవచ్చు.[1] దీనినే 'కారణం లేని పీరణం' శీర్షికన రాంభట్ల ఎత్తిపొడుపు గీతం రాశారు.[2]

1953 నవంబర్ 6 నాడు దీపావళి పండుగ. ఆనాటికి రాజధాని సమస్యపై చెలరేగుతున్న భిన్నాభిప్రాయాలు క్రమంగా చల్లారసాగాయి. కమ్యూనిస్టు పార్టీ మినహా, మిగతా పార్టీలన్నీ క్రమంగా సద్దుమణిగాయి. కర్నూలును రాజధానిని

1. రాంభట్ల కృష్ణమూర్తిగారితో ఇంటర్వ్యూ.
2. 'పీరణం' అన్నది 'విశాఖ' జిల్లాలో ప్రఖ్యాతమైన వాద్య విశేషం. దాదాపు అన్ని విధాల శుభాశుభ కార్యాలలో ఇది ఉపయోగింపబడుతుంది. 'డివ్వి డివ్వి డివ్విట - టక్కు ముక్కు డివ్విట' అనే ధ్వనిని పీరణం స్ఫురింపజేస్తుంది. 'కారణం లేనిదే పీరణం మోగదు' అనేది విశాఖ పట్టణం సామెత. అయితే ఇక్కడ కారణం లేనిదే పీరణం మోగింది. వాన కురిసింది. గుడారాలు మునిగాయి. అందుకే రచయిత గీతానికి ఈ అధిక్షేప శీర్షిక పెట్టారు.

చేస్తే భరించేది లేదని ప్రగల్భాలు పలికిన పెద్దలనేకమంది, పదవుల ఎరలలో ప్రకాశంగారి గాలానికి చిక్కుకున్నారు ఈ పరిస్థితిని వివరిస్తూ...

'దబ్బు దిబ్బు దీపావళి - దివిటీ కొట్టేరు
మలి దీపావళికి గాలిమేడలు కట్టేరు'

అనే 'దీపావళి గీతం' రాశారు. ఈ గీతంలో నీలం సంజీవరెడ్డి, తిరుపతి తిమ్మారెడ్డి, కడప కోటిరెడ్డి, తెన్నేటి విశ్వనాథం వంటి ప్రముఖ రాజకీయ నాయకుల ప్రస్తావన నిక్షిప్తమై ఉంది.

22 నవంబర్ 1953 నాటికి రాజధాని సమస్య కొంత సద్దుమనిగిందే కానీ పూర్తిగా సమసిపోలేదు. లోలోన అసంతృప్తి జ్వాలలు చెలరేగుతున్నట్లు గమనించిన ప్రకాశం పంతులుగారు 'రాజధాని మారిందంటే నిరాహారదీక్ష చేస్తానని' ప్రకటించారు. దీనిని దృష్టిలో పెట్టుకొని 'అసత్యాగ్రహం' శీర్షికన రాంభట్ల రాసిన గీతంలో......

'మంత్రి ఉవాచ :

రాష్ట్రమొకటి ముఖ్యం కాని
రాజధాని ఏదైతేనేం
విందుకు విస్తళ్ళేకాని
వంటకాలు లేకుంటేనేం
పదిరోజులు ఆగారంటే
బంతి భోజనాల్ పెట్టిస్తాం
నైజాం నవ్వాబును అడిగి
హైద్రాబాద్ తెప్పించిస్తాం
వోటుస్వేచ్ఛ మేం ఇచ్చామా
బోటు తూటు పద్ధం ఖాయం
మా పార్టీ కాకుంటే సరి
స్వేచ్ఛ ప్రసాదించుట న్యాయం
నలుగురిలో సిగ్గేస్తుందని
ముసుగు తొడిగి మేం కూర్చుంటే
రభసలు రాద్ధాంతాలెందుకు
రచ్చకీడ్చుటకు కాకుంటే
ఇంతకు మావాళ్ళున్నారు
ఎంతకైన సిద్ధంవారు
జనం వెనక లేకుంటెనేం
కుండ పిండి కొట్టేస్తారు

రాజధాని మారిందంటే
భోజనాలు మానేసేస్తాం
మాసిన వస్త్రాలు ధరించి
అలక పాన్పుపై పవళిస్తాం
కోపగృహం చేరామంటే
ఛస్తే ఇక బైటికిరాము
కొంగల మల్లయ్యల్లాగ
లేస్తే మనుషులమే కాము'

అంటూ వర్ణించారు. రాజధాని సమస్యపై అసెంబ్లీలో ఓటింగ్ పెట్టకుండానే ఆమోదింపజేయాలన్న మంత్రిగారి ఉద్దేశ్యం ఈ గీతంలో వివరింపబడింది. అయినా 1 డిసెంబర్ 1953 నాడు ఈ సమస్యపై ఓటింగు జరిగింది. చివరి క్షణంలో కర్నూలును రాజధానిగా మెజారిటీ సభ్యులు నిర్ణయించారు. కమ్యూనిస్టులు మినహా మిగతా పార్టీలవారు కర్నూలుకు అనుకూలంగా ఓటు చేశారు. ఈ ఉదంతాన్ని 'చివరి క్షణం', 'వెన్నుపోటు' శీర్షికల్లో రాంభట్ల వర్ణించారు. 'వెన్నుపోటు' శీర్షికన 2 డిశంబర్ 1953 నాడు ఈ కవి రాసిన గీతం ఆనాటి ప్రజల ఆగ్రహానికి సంకేతం. అప్పటిదాకా అనేక ప్రగల్భాలు పలికిన ప్రముఖులు తీరా సమయం రాగానే ప్రలోభాలకు లోనై ఎలా వెన్నుపోటు పొడిచారో ఈ గీతంలో వర్ణిస్తూ...

'రాజధాని సమస్యపై
జరిగెను నిన్నను వోటు
పాలుతాగి రొమ్ముపైన
వేసిరి కొందరు కాటు'

అంటూ ఘాటుగా విమర్శించారు. అనేక వేదికలపై కర్నూలుకు వ్యతిరేకంగా మాట్లాడి, ప్లేటుమార్చిన పెద్దల వేషభాషలను రాంభట్ల నిశితంగా విమర్శిస్తూ ఎత్తిపొడిచారు.

## విజయాంధ్ర గీతాలు :

జాతీయోద్యమంలోనూ, ఆంధ్రోద్యమంలోనూ ప్రజలను ఉద్రూతలూగించిన గీతాలు రాసిన దామరాజు పుండరీకాక్షుడు 1954 జూలై మాసంలో 'విజయాంధ్ర గీతాలు' వెలువరించారు. రాజధాని కర్నూలయితేనేం, ఏదయితేనేం... ఆంధ్ర రాష్ట్రం ఏర్పడినందుకు ఈ రచయిత ఆనంద గీతాలు ప్రకటించారు. ఒకవైపు రాజధాని కర్నూలుపై రాంభట్ల అధిక్షేప గీతాలు రాయగా, మరోవైపు దామరాజు విజయాంధ్ర గీతాలు రచించారు.

1954 జూలై నాటికి శ్రీబాగ్ ఒడంబడిక మేరకు గుంటూరులో హైకోర్టు ఏర్పాటయ్యింది. 'ఆంధ్ర రాష్ట్ర అవతరణ ఉన్నత న్యాయస్థాన నియామక మహానంద సమయమున బహుళాంధ్ర పాఠక మహాశయులకు అభివందనములు తెలుపుతూ' గ్రంథకర్త ప్రచురించిన ఈ గీతికా సంపుటి తొలిపుటలో...

'మన రాష్ట్రము, మన రాష్ట్రము
మన రాజ్యమ్మనుచు గలల స్మరియించిన యా
ఘన రాష్ట్రము "రాముల" దయ
గనుగొంటిమి యిక "విశాల" గావలె నెలమిన్'

అని ప్రకటించారు.

తెలుగు జండాను కీర్తిస్తూ...

'ఆడవే, పాడవే అఖిలాంధ్ర జెండా
ఎగురవే, ఎగురవే, ఓ తెలుగు జెండా॥
ఆ సేతు వింధ్యాద్రి - వేదాద్రి భద్రాద్రి
సింహాద్రి శిఖరాల - జైజైల వెలిశావు
అరుణ సాంద్రాలపై
ఆంధ్ర కేంద్రాలపై
ధగ ధగల మెరిశావు
నిగ నిగల వెలిశావు॥ ॥ఆడవే॥

మూడు కోట్లకు జెండ,
ముచ్చటైనా జెండ
ముద్దు లొలికే పలుకు
చిలికె వెలిసే జెండ
ఆనాడు నీనాడు
ఘనత వెలిగే జెండ[1] ॥ఆడవే॥'

అంటూ వర్ణించిన 'దామరాజు' తెలుగువాణిని ప్రశంసిస్తూ, 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అనే గీతం బాణీలో...

'మా తెలుగు వాణికి మల్లెపూదండ
మా తెలుగు పలుకులో మంచి ముత్యాలు॥
స్వరములో నృత్యాలు,
పదవీథిలోలయలు
చమకంబులో హొయలు,
ఫలియించు భావాలు॥ ॥మా తెలుగు॥

---

1. 'విజయాంధ్ర గీతాలు—దామరాజు పుండరీకాక్షుడు (1954).

కిలకిలా కావ్యాలు కళలు గాలించేయ
కమ్మగా కవులెల్ల కయితలనుచుంచేను
శృంగార హంసలే చిందుతాయీ
బంగారు చిలుకలే పలుకుతాయీ ॥మా తెలుగు॥
మృదు మాధురీ మహిమ
ముదమైన శబ్దాలు
సంగీత సరణిలో హంగైన రాగాలు
ముచ్చట్ల శైలిలో మోదాక్షరాలు
ముద్దులై మురిపెమై
పరుగులెత్తే భాష
తిక్కన్న కవికీర్తి
నన్నయ్య యశవల్లి
శ్రీనాథు ప్రఖ్యాతి
సుకవి పోతనకాంతి
అందరికి హర్షమై
ఆటలాడే భాష
నీ వీణలో పల్కగా
నీ పల్కులో చిల్కగా
శ్రీతెలుగువాణీ - శ్రీతెలుగువాణీ॥'[1]

అని నివాళులర్పించారు.

'మేలుకొనుమీ తెలుగుబిడ్డా
ఏలుకొనుమా తెలుగుగడ్డా॥
మేలుకో ఓ ఆంధ్రవీరా
ఏలుకో నీ తెలుగునేలా॥'

అని మేలుకొల్పు గీతాలు పాడిన పుండరీకాక్షుడు 'ప్రాచీనాంధ్రము'ను వర్ణిస్తూ 22 పద్యాలు రాశారు. గుంటూరు హైకోర్టుకు స్వాగతం చెబుతూ...

'జయ జయ జననీ ఆంధ్రా!
జయ జయ ముక్కోటి తెనుగు
జన ఘన వాణీ
జయ కృష్ణా గోదావరి

---

54. శంకరంబాడి సుందరాచారి గారి 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' అనే గీతం అప్పటికే ప్రఖ్యాతమై ఉంది.

జయ తుంగ త్రిలింగ భాస
జగదభి జననీ॥
ఉన్నత న్యాయస్థాన మ
హోన్నతి కనువైన పట్టణోన్నతి పే
రెన్నిన న్యాయాధిపులిం
దన్నిన సమకూడె జయ జయ ధ్వానములన్॥'

అని వర్ణించారు కవి. 27 చరణాల ఈ గీతం శీర్షిక 'విజయాంధ్ర' ఛంద పద్యాల 27 చరణాల్లో ఆంధ్రప్రాంత ఔన్నత్యం, గుంటూరు విశేషాలు ఉద్వేగ స్వరంతో వర్ణితాలు.

1947 మార్చి మాసంలో ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర అసెంబ్లీలో ముఖ్య మంత్రి 'ఆంధ్రకేసరి' ప్రకాశం పంతులుగారిపై అవిశ్వాస తీర్మానం ప్రవేశ పెట్టినప్పుడు, దామరాజు ఆవేదనతో రాసిన పద్యాలు 16-3-1947 నాటి 'నవోదయ' పత్రికలో అచ్చయ్యాయి. ఆ పద్యాలను కూడా ఈ పుస్తకంలో చేర్చారు రచయిత.

'మాయదురోదరం బటుల
మంతన మేదియొ పన్ని ఆంధ్రదే
శీయశః ప్రకాశమును
చెచ్చెర గద్దియ వీడి పొమ్మనన్
వా యెటులాడునయ్య, పరువా
ఘనమా, యశమా, స్వలాభమా,
ఏ యది లేదు, మీ తెలివిహీనత
యొక్కటె దక్కె నమ్మడీ॥'

'ఆంధ్రకేసరి కోల లల్లాడునాడు
ఆంధ్రకేసరి గర్జ చల్లారు నాడు
ఆంధ్రడవె కావురా నీవు, ఆంధ్రవీర
మేలుకొనవోయి, నీ యల్కచాలునోయి॥'

అని శ్రీ దామరాజు పుండరీకాక్షుడు చాటి చెప్పారు.

## 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం'

'విశాలాంధ్ర' కావాలని మొట్టమొదటి సారిగా 1946లో కమ్యూనిస్టు పార్టీ పిలుపు నిచ్చింది.[1] ఆ తరువాత మామిడిపూడి వెంకటరంగయ్యగారు

1. 'ఆంధ్రప్రదేశ్ అవతరణ' (వ్యాసం)— ప్రొ. కె. వెంకటేశ్వర్లు, కె.రవి. 'ఆంధ్రప్రదేశ్ దర్శిని' — విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

కూడా తెలంగాణా కలిసిన ఐక్య ఆంధ్రరాష్ట్రాన్ని గురించి సూచించారు. భాషా ప్రాతిపదికపై రాష్ట్రాల నిర్మాణం వివిధ జాతుల స్వయం నిర్ణయాధికార సూత్రాధారమై ఉండాలని కమ్యూనిస్టు పార్టీ వాదించింది. చారిత్రాత్మక తెలంగాణా సాయుధ పోరాట లక్ష్యాలలో 'విశాలాంధ్ర నిర్మాణ కాంక్ష' ఒకటి. సాయుధ పోరాట కాలంలోనే 1949 ఆఖరు నెల్లో విజయవాడలో కమ్యూనిస్టు పార్టీ 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' నినాదాన్ని విస్తృతంగా ప్రచారం చేసింది. ఈ నినాదం వల్లే 1952 ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ అఖండ విజయం సాధించింది. 1952 నాటి ఉమ్మడి మద్రాసు రాష్ట్ర అసెంబ్లీలో భారత జాతీయ కాంగ్రెస్‌పార్టీకి 40 సీట్లు ఉంటే, భారత కమ్యూనిస్టు పార్టీకి 41 సీట్లున్నాయి.

అప్పటి 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' నినాదం శీర్షికతో శ్రీశ్రీ రాసిన గీతంలో...

'శక్తికోసమే నడు!
ముక్తికోసమే మను! విముక్తి కోసమే మను
విశ్వశాంతి క్రాంతికోసమే మనస్సు లేకమై
నడూ నడూ! భయం గియం విడూ!
వేగుచుక్క వెలిగె మింటిపై
వెలుగురేఖలవిగో కంటివా?
ఉదయమెంతో లేదు దూరము
వదలిపోవు నంధకారము

జీవితాశలే భావిజాడలోయ్
ప్రపంచ శాంతి శాంతి కాంతి బాటసారివై!
విరోధించు వారు లేరులే
నిరోధించు వారు లేరులే
అస్తి నాస్తి భేదమేలరా
వాస్తవం వరించి సాగరా?
విశాలాంధ్రలో
ప్రజా రాజ్యమే
ఘటించగా శ్రమించరా పరాక్రమించరా'[1] అంటూ పిలుపునిచ్చారు.

అలాగే మరోగీతంలో చావలి రామచంద్రరావు...

'తెలుగు తల్లి బిడ్డలం - తెలుగు బాలవీరులం
తెలుగు తల్లి పరువునిల్ప - తెలుగుజాతి పౌరులం

---

1. 'స్వేచ్ఛాపథం' (గేయసంకలనం) - విశాలాంధ్ర ప్రచురణాలయం.

తెలుగు భాష నేర్చెదం - తెలుగు భూమి గొల్చెదం
తెలుగు జాతి కీర్తి - వాడవాడలందు చాటెదం
తెలుగు పూలు, తెలుగు చేలు, తెలుగు పాడి పంటలూ
తెలుగు ప్రజల ముల్లెయనుచు తెలియ నేడె పలికెదం
తెలుగు మాటలాడునట్టి - తెలుగువారలందరూ
ఎక్కడున్న ఒక్కటనుచు - నొక్కినొక్కి చాటెదం
ఒక్క తల్లి బిడ్డలైన - ముక్కోటి తెలుగులం
ఒక్క త్రాటిమీద నిలిచి - ఏకధాటి నడిచెదం
స్వేచ్ఛ శాంతి, సౌఖ్యాలు వెల్లివెరిసి పూయగా
విశాలాంధ్ర ప్రజారాజ్య జయపతాక నెత్తెదమ్'

అంటూ ప్రతిజ్ఞాగీతం గానం చేశారు.

'భాషా రాష్ట్రిమటన్న వాంఛితము
నుత్పాదించి మా తెల్గువా
డాషామాషి కబుర్లు గాక నిజమౌన
ట్లేరు కవ్వించినన్
రోషంబందక నుద్యమించి గెలిచెన్
లోకంబు హర్షింప, ప్ర
త్యూషం బిన్ని దినాలకైనది స్వరా
ష్ట్రోద్యాన భాగంబునన్'

అనే పద్యంలో ఆంధ్రరాష్ట్ర నిర్మాణంపట్ల హర్షాన్ని ప్రకటిస్తూనే ప్రజా కవి దాశరథి...

'కోటి కంఠాలతో తెలుగులు సతమ్ము
ఆంధ్రరాష్ట్రావతరణ శుభావసరము
గోరుచున్నారు, కలిసిపోగోరుచుందు
రగ్రజులతోడ వీలైనయంత వడిగా'

అంటూ తెలంగాణాంధ్రులు అగ్రజులైన కోస్తాంధ్ర, రాయలసీమ ప్రజానీకంలో కలిసిపోయి 'విశాలాంధ్ర' నిర్మాణాన్ని కాంక్షిస్తున్న నిజాన్ని చాటి చెప్పారు.

## ఆంధ్రావతరణం

1954 నాటికి హైదరాబాదులోని వివిధ ప్రాంతాల్లో విశాలాంధ్ర మహాసభలు వెలిశాయి. 1954 జూన్ 13, 14 తేదీల్లో జరిగిన విశాలాంధ్ర సదస్సులో మాడపాటి హనుమంతరావు పాల్గొని 'విశాలాంధ్ర'కు పిలుపునిచ్చారు. అప్పటి

తెలంగాణా ప్రాంత ముఖ్యమంత్రిగా ఉన్న బూర్గుల రామకృష్ణారావు విశాలాంధ్ర నిర్మాణం విషయంలో శాసనసభ్యుల అభిప్రాయాన్ని కూడగట్టడంలో విశేషమైన కృషి చేశారు. ఒకవైపు కమ్యూనిస్టుపార్టీ, మరోవైపు 'అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్' విశాలాంధ్ర నిర్మాణావశ్యకత విషయంలో ప్రజాభిప్రాయాన్ని, కార్మికవర్గ అభిప్రాయాన్ని అనుకూలంగా మలచడంలో తమవంతు చారిత్రక కర్తవ్యాన్ని నిర్వర్తించాయి 1955 అక్టోబర్‌లో ఢిల్లీలో జరిగిన ముఖ్యమంత్రుల సమావేశంలో బెజవాడ గోపాలరెడ్డి, బూర్గుల రామకృష్ణారావు వెంటనే ఆంధ్ర-తెలంగాణా ప్రాంతాలను విలీనం చేయమని కేంద్రప్రభుత్వాన్ని కోరారు.

విశాలాంధ్ర నిర్మాణాన్ని కోరుతూ తెలుగు నేల నాలుగు చెరుగులా వ్యాపిస్తున్న ప్రజాభిమతాన్ని గుర్తించిన కేంద్ర ప్రభుత్వం 1956 ఆగష్టు 10 న 'విశాలాంధ్ర'కు బదులు 'ఆంధ్రప్రదేశ్'గా రాజ్యాంగ చట్టపు 7వ సవరణ బిల్లును లోకసభలో ప్రవేశపెట్టింది. ఫలితంగా 1956 నవంబర్ 1 న హైద్రాబాద్ రాజధానిగా 'ఆంధ్రప్రదేశ్' అవతరించింది.

ఈ శుభ సందర్భాన్ని పురస్కరించుకుని వందలాది గీతాలు వెలువడ్డాయి వాటిలో మచ్చుకు కొన్ని...

'ఏమానందము - ఏమానందము
ఏమానందము ఈనాడు
ఇంటా బైటా - ఎటు జూచిన అటు
ఎంతో సంబరమీనాడు
నవ్య తేజములు - నానా శోభలు
నవాంబరమున ఈనాడు
ఏడులు పూడులు - ఎదురు చూచిన
ఇష్టుల కూటమి ఈనాడు
అందరిపాలిటి - అమరతరువుగా
ఆంధ్రప్రదేశము ఈనాడు
అవతరించినది - అవతరించినది
అవతరించినది ఈనాడు
గట్టి గుండెగల - పొట్టి శ్రీరాములు
పెట్టి భిక్షగ ఈనాడు
తెలుగునాడులో - వెలుగుల పండుగ
తెచ్చెను కానుక ఈనాడు

అమరజీవునకు - ఆత్మానందము
అంబరవీధిని ఈనాడు
భారత భారతి - బహు రూపమ్ముల
ప్రాభవమందగ ఈనాడు
భారతమంతట - ప్రాంత ప్రాంతమున
భాషకు పట్టము ఈనాడు
ప్రజామోదము - బ్రహ్మానందము
భారతి 'శ్రీమతి' - ఈనాడు
తెలుగు వెలుగుతో - వెలుగు పులుగులకు
వలచిన ఆమని - ఈనాడు
చెలిమి కలిమితో - వలచిన రీతిగ
బలగము పెరిగెను - ఈనాడు
ముక్కోటాంధ్రుల - మొక్కులు చెల్లగ
ఒక్కటె ఆంధ్రము ఈనాడు
సామరస్యము - సంఘీభావము
సహజీవనము - ఈనాడు
నెయ్యము వేళల - కయ్యము వలదని
తియ్యని మాటల ఈనాడు
కాళోజీ కవి - గంటము రాల్చిన
కవితా సుమములు - ఈనాడు'[1]

అంటూ 'ఆంధ్రావతరణం' పట్ల ఆనందాన్ని ప్రకటించారు ప్రజాకవి కాళోజీ నారాయణరావు.

'తెలుగు వాకిళ్ళలో
తొలికోడి కూసింది
తెలుగు కన్నియ తలుపు
తెఱచి చూసింది

చిమ్మ చీకటి రాత్రి
శిథిలమై పోయింది
తూర్పు వాకిట మరల
తొలిప్రొద్దు పొడిచింది

1. 'గేయాంజలి'—ఆం.ప్ర. ప్రభుత్వ పౌరసంబంధ శాఖ.

వేడి వెచ్చని వెలుగు
వేయి కరముల తెలం
గాణ మాగాణముల
కౌగిలించింది
గత దినమ్ములలోని
కతలన్ని చెప్పింది
భావి కాలములోని
భాగ్యమును పొగడింది'[1]

అంటూ నవోదయానికి నివాళులెత్తారు పల్లా దుర్గయ్య.

'అదో నవంబరు ఒకటి నవాంబరమ్ము
దాల్చి ఆంధ్రావనీ మాత తక్కినట్టి
కోటి కొమరుల నొడి జేర్చ కొంగుజాపి
భాగ్యనగరికి విచ్చేసె భాగ్యమనుచు'[2]

అంటూ 'ఐక్యత్రిలింగము'నకు వానమామలై వరదాచార్యులు ఆహ్వానం పలికారు.

'సూర్య భగవానుడుదయించె సురుచిరముగ
సుజనులందరు మేల్కాంచి శోభిలంగ
నిదుర మున్నట పాడియా నీకు నిపుడు
ఆంధ్రుడా! వేగపడనిడి యదను సుమ్మ
పెంచి పెద్దను జేసిన ప్రేమమూర్తి
తల్లితో సమమైనదీ ధరణి మనకు
ఆంధ్ర రాష్ట్రమె బలమిచ్చు నందరకును
ఆంధ్ర భాషాభివృద్ధికి నదియె త్రోవ'

అంటూ శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మ ప్రబోధించారు.

'తల్లి రానే వచ్చె, తడవాయె రారండు।
చల్లగా మన తెలుగు తల్లి రానే వచ్చె
ప్రణమిల్లి జయగీతి పాడండి మృదురీతి
ముక్కోటి తెలుగుల్లు మొఱయండి జయగీతి'[3]

అంటూ 'మాతృగీతి'ని ఆలపించారు తెన్నేటి సూరి.

---

1. 'పాలవెల్లి'-పల్లా దుర్గయ్య; తెలంగాణా రచయితల సంఘం.
2. 'గేయాంజలి.'
3. 'కల్పన' - చేతన సాహితి, విజయవాడ - 2.

నవంబర్ 1, 1956 నాడు తెలుగునాట ప్రఖ్యాతి చెందిన కవులు రాసిన పద్యాలతో ఆదర్శ సాహిత్యమాల, హైదరాబాదు వారు 'ఆంధ్రావతరణము' శీర్షికన ఒక పద్యసంపుటిని వెలువరించారు.

'మూగవోయిన కోటితమ్ముల గళాల
పాట పలికించి కవితా జవమ్ము కూర్చి
నా కలానకు బలమిచ్చి నడపినట్టి
నా తెలంగాణ కోటి రత్నాల వీణ'

అని గళమెత్తి నినదించిన తెలంగాణ ప్రజల కవి దాశరథి. తెలంగాణా ప్రజోద్యమంలో రుద్రవీణలను మీటి, అగ్నిధారలను వర్షించిన దాశరథి 'మహాంధ్రోదయం' కావ్యసంపుటిని వెలువరించారు. దానిలో రాష్ట్రావతరణకు పులకరించిపోయి...

'ఎన్నాళ్ళకు తెల్లవారె
ఎన్నాళ్ళకు కన్నుదూరె
వెలుగు, వెలుగు, వెలుగు, వెలుగు!
తెలుగు, తెలుగు, తెలుగు, తెలుగు!

ఏది కాకతి? ఎవరు రుద్రమ?
ఎవరు రాయలు? ఎవడు సింగన?
అన్ని నేనే, అంత నేనే
వెలుగు నేనే, తెలుగు నేనే

తెలుగు ఊరులు
తెలుగు వారలు
ప్రతిఫలించే మహాకావ్యం
నాకు కావలె, నాకు కావలె

నాకు కావలె మహాంధ్రోర్వర
రండి అన్నల్లార! తూరుపు
దారి కెదురుగ ద్వారబంధము
మనిషి మనిషి మనస్సు దారుల
రాగబంధము, రాగబంధము

ఈనాడు మహాంధ్రోదయ
మైనది, కోట్లాది జనము
తెలుగు లక్ష్మి పాదాలకు
వెలుగుల పారాణి నిడిరి'[1]

1. దాశరథి కవిత—మహాంధ్ర ప్రచురణలు, మద్రాసు.

అంటూ ఆనందోత్సాహాలకు అక్షర కల్పన చేసిన రచనాశిల్పి దాశరథి.

'ఆంధ్రరాష్ట్ర మవతరించెనోహో!
అంధయుగం బంతరించెనోహో!
నలువైపుల చీకటి నా
గులు ప్రాకిన, ద్వేష విష
ము్మలు దూకిన, నీల నిషా
నిలయంలో నేటి కుష
స్సులు లేచెనహో, సుమన
స్సులు పూచె నహోహో! ॥ఆంధ్ర॥

..................

సింధూరం వోలె తెలుగు - సీమ నేడు విలసించెను
మందారం వోలె తెలుగు - మాట నేడు వికసించెను
సంగీతం వోలె తెలుగు - నింగి నేడు నినదించెను
'జలపాతం' వోలె తెలుగు
జాతి నేడు ప్రవహించెను
ఆంధ్ర రాష్ట్ర మవతరించె నోహో
అంధయుగం బంతరించె నోహో'[1]

అంటూ తుంగభద్ర పొంగి తరగలెత్తిందని, కృష్ణవేణి విజయకరము లెత్తిందని, గోదావరి గొంతెత్తి పదాలు పాడిందని, పెన్నా నది తెన్గన్నులతో మాట్లాడిందని, అడుగంటిన తెలుగు చరిత మడుగడుగున పల్లవించిందనీ వర్ణించారు శ్రీ సి. నారాయణరెడ్డి 'రాష్ట్రావతరణం' తెలుగు జాతికి నూత్నయుగోదయమని శ్రీ నారాయణరెడ్డి ఎలుగెత్తి నినదించారు.

ఈ విధంగా నాటినుండి నేటివరకూ ఎందరో కవులు 'ఆంధ్రావతరణ' ఆనంద గీతాలను గానంచేస్తూ, ఆంధ్ర సంస్కృతిని సుసంపన్నం చేస్తూనే ఉన్నారు. ఆంధ్రమాతకు నివాళు లర్పిస్తూనే ఉన్నారు.

## వేర్పాటువాద ఆందోళనలు

**నేపథ్యం :-** ఆంధ్ర ప్రజానీకం ముక్తకంఠంతో నినదించిన ఆంధ్ర ప్రదేశ్ అవతరించింది కానీ, అటు ఆంధ్ర ప్రాంతంలోనూ ఇటు తెలంగాణా ప్రాంతంలోనూ, మరోవైపు రాయలసీమలోనూ సమైక్యాంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని

1. స్వేచ్ఛాపథం (గేయ సంకలనం)
—విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2.

వ్యతిరేకించేవారు మొదటినుంచీ వున్నారు. రాయలసీమకు చెందిన కాంగ్రెసు, స్వతంత్ర శాసనసభ్యులు 21 మంది నీలం సంజీవరెడ్డిగారి ప్రోత్సాహంతో 'మద్రాసులేని రాష్ట్రం వద్దు' అంటూ కేంద్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి పంపిన విషయం ఇప్పటికే చర్చించాం. అలాగే తెలంగాణా ప్రాంతంలో విశాలాంధ్రను వ్యతిరేకించిన ప్రముఖుల్లో కె. వి. రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, జె. వి. నర్సింగ్ రావు మొదలైన రాజకీయ నాయకులున్నారు అటు ఆంధ్ర ప్రాంతంలో ఎన్. జి. రంగా వంటి ప్రముఖులు విశాలాంధ్రను వ్యతిరేకించారు. అలాగే కేంద్ర ప్రభుత్వం నియమించిన 'రాష్ట్రాల పునర్నిర్మాణ సంఘం' తన నివేదికలో 'ప్రత్యేక తెలంగాణా ఏర్పాటు చేయాలని, 1961 వ సం॥లో తెలంగాణా రాష్ట్ర శాసనసభ్యులు విలీనమౌతామంటే 2/3 వంతు మెజారిటీతో విశాలాంధ్రను ఏర్పాటు చేయవచ్చని' పేర్కొన్నది. 955 నవంబర్‌లో జాతీయ కాంగ్రెసు ఈ విషయమై ఒక సబ్ కమిటీని నియమించింది. ఇందులో అప్పటి కాంగ్రెసు అధ్యక్షుడు ధేబర్, జవహర్‌లాల్ నెహ్రూ, మౌలానా ఆజాద్, గోవింద్ వల్లభ్ పంత్ సభ్యులు. ఈ సబ్‌కమిటీ హైదరాబాద్‌ను పర్యటించి, కె. వి రంగారెడ్డి మొ॥ అసమ్మతి వాదులను ఒప్పించి, 1956 ఫిబ్రవరి 20 నాడు 'పెద్ద మనుషుల ఒప్పందం' (Gentlemen agreement) కుదిర్చింది. ఈ ఒప్పందంలో తెలంగాణా ప్రాంతానికి అనేక రక్షణలు కల్పించబడ్డాయి. వీటిలో ముఖ్యమైనవి:- (1) తెలంగాణాకు సంబంధించిన మిగులు ఆదాయాన్ని తెలంగాణా ప్రాంతాభివృద్ధికై ఖర్చు చేయాలి (2) రాష్ట్రం మొత్తంమీద విద్యాసంస్థలలో మూడింట ఒక వంతు స్థానాలు కేటాయించాలి, (3) ఉద్యోగ నియామకాలు జనాభానుబట్టి ఇవ్వాలి, (4) 'ముల్కి' నిబంధనలను అమలు చెయ్యాలి, (5) తెలంగాణా ప్రాంత అభివృద్ధికై 20 మంది సభ్యులతో కూడిన ప్రాంతీయ మండలిని ఏర్పరచాలి. ప్రణాళికాభివృద్ధి, సేద్యపు నీటిపారుదల, పారిశ్రామికాభివృద్ధి, ఉద్యోగ నియామకాలు పరిశీలించి నిర్ణయాలు చేసే అధికారం ఈ ప్రాంతీయ మండలికి ఉండాలి. దీనికి, రాష్ట్ర ప్రభుత్వానికి అభిప్రాయ భేదం వస్తే కేంద్ర ప్రభుత్వానికి నివేదించాలి.

ఇవి 'పెద్దమనుషుల ఒప్పందం'లోని ప్రధానాంశాలు.

ఈ ఒప్పందం ప్రకారం 'ఆంధ్రప్రదేశ్'అవతరించింది. అయినా ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలను మానసికంగా కలపలేకపోయింది. నిజాం పరిపాలనలో తెలంగాణా ప్రధానంగా భూస్వామ్య వ్యవస్థలో వుంది. విద్యావకాశాలు, ఉద్యోగావకాశాలు ఇక్కడి ప్రజలకు తక్కువ. సంస్కరణలు, ఎన్నికలు ఇక్కడి

వారికి కొత్త. పీటిదృష్ట్యా తెలంగాణా, ఆంధ్ర ప్రజలలో సమైక్యభావం అభివృద్ధి కాలేకపోయింది. దానికితోడు ప్రాంతీయ అసమానతలు, పారిశ్రామిక వెనుక బాటుతనం, అసమ అభివృద్ధి వంటి కారణాలు ప్రాంతీయ దురభిమానాలకు వీలు కల్పించాయి.

1968 నాటికి కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల ఉదాసీనతవల్ల వేర్పాటువాద భావజాలం ఇటు తెలంగాణా ప్రాంతంలోనూ, అటు ఆంధ్ర ప్రాంతంలోనూ, పొడచూపసాగింది.

## ప్రత్యేక తెలంగాణా ఆందోళన

**ఆర్థిక-రాజకీయ కారణాలు :** 1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరించింది మొదలు 1968 నాటికి అంటే దాదాపు 12 సం॥ కాలంలో 'పెద్ద మనుషుల ఒప్పందం' లోని అనేకాంశాలు నిర్లక్ష్యం చేయబడ్డాయి. కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలకు తెలంగాణా ప్రాంత అభివృద్ధిపై ఆసక్తి లేకపోవటంవల్ల విద్య, ఉద్యోగ, ఆర్థిక నిర్లక్ష్యానికి ఈ ప్రాంతం గురైంది. రెవెన్యూ ఆదాయంలో 45%కి పైగా సమకూర్చిన తెలంగాణా ప్రాంతంపై అతి తక్కువ ఖర్చు పెట్టడం జరిగింది. రాష్ట్ర ఆదాయం నుండి, కేంద్ర ప్రభుత్వ వనరుల నుండి, రాష్ట్ర ప్రభుత్వ అభివృద్ధి పథకాల కేటాయింపుల నుండి తెలంగాణా ప్రాంతానికి అతి తక్కువ వాటా లభించింది. రాష్ట్ర రాజధాని హైదరాబాద్ నగరంలో ఉన్నప్పటికీ అల్పాదాయ ఉద్యోగాలు చాలా వరకు ఇతర ప్రాంతాలవారిచే ఆక్రమింపబడ్డాయి. పబ్లిక్ రంగంలోనూ, ప్రభుత్వ ఉద్యోగాలలోనూ తెలంగాణా ప్రాంతీయులకోసం రిజర్వు చేయబడిన ఉద్యోగాల్లో వేలాది మంది తెలంగాణేత రులు నియమింపబడ్డారనీ, పబ్లిక్ అండర్-టేకింగ్‌లలోనూ, క్వాసీ గవర్నమెంటు ఉద్యోగాల్లోనూ, సహకార రంగాల్లోనూ తెలంగాణా ప్రాంతవాసులకు అతి తక్కువ ఉద్యోగాలు దొరికాయనే అభిప్రాయం ప్రబలింది. తెలంగాణా ప్రాంతీయులకోసం రిజర్వ్ చేయబడిన అనేక ఉద్యోగాల్లో ఇతర ప్రాంతాలవారు నకిలీ డొమిసైల్ సర్టిఫికెట్లతో నియమితులయ్యారు. గ్రడేషన్, ప్రమోషన్ల విషయాల్లోనూ తెలంగాణా ఉద్యోగులకు - అధికార్లకు అనేక సందర్భాల్లో అన్యాయం జరిగిందనే భావం ఏర్పడింది. జిల్లా కళాశాలలను ఏర్పాటు చేయాలన్న నిర్ణయం కాగితాల్లోనే ఇంకిపోవడంవల్ల సంయుక్త హైదరాబాద్ నగరంలోనూ, ఇతర తెలంగాణా జిల్లాల్లోనూ అవసరానికి సరిపడా విద్యాసంస్థలు నెలకొనలేదు. పి.డబ్ల్యు.డి., మునిసిపల్ కాంట్రాక్టుల్లో అత్యధికం ఆంధ్రప్రాంత కాంట్రాక్టర్ల కైవసమయ్యాయి. సొంత నేలపై తెలంగాణా ప్రజలు సెకండ్ క్లాస్ పౌరులుగా పరిగణింపబడుతున్నట్లు అత్యధికులు భావింపసాగారు.[1]

1. Telangana Affair—Konda Laxman Bapuji.

## సాంస్కృతిక కారణాలు

సాంస్కృతికంగా నిజామాంధ్రులపై మహమ్మదీయ మత ప్రభావం. ఉర్దూ భాషా ప్రభావం ప్రగాఢంగా పడింది. కట్టు బొట్లలోనూ; వేష, భాషల్లోనూ తెలంగాణా, ఆంధ్ర ప్రజల మధ్య ఒకింత తేడా స్పష్టంగా కనబడుతున్నది. ఇవి క్రమంగా ఉభయ ప్రాంతాల ప్రజలమధ్య అవిశ్వాసానికి ఆజ్యం పోసింది. మాండలిక భాషా భేదాలు ఏ భాషకైనా సహజమే. కానీ ఆంధ్ర ప్రాంతం నుండి తెలంగాణా జిల్లాలకు ఉద్యోగార్థం వచ్చిన ఉద్యోగులు, అధికార్లు కొందరిలో తాము అధికులమని; స్థానికులపట్ల చులకన భావం చూపాలనే అహం పెరిగింది. దీంతో తెలంగాణా ప్రాంతీయుల్లో తమపట్ల న్యూనతా భావం ప్రదర్శించడంపై ఆవేదన ప్రబలింది. ఈ ఆవేదన ఆగ్రహానికి, ఆవేశానికి బాటలు వేసింది. నిజామాంధ్రలో విద్యావకాశాలు తక్కువగా ఉన్నందువల్ల విద్యాధికుల సంఖ్య తక్కువే. విశాలాంధ్రలో పై అధికార్లంతా ఆంధ్రప్రాంతం నుండి కానీ, అరవ ప్రాంతం నుండి కానీ రావడంవల్ల స్థానికుల్లో అసంతృప్తి ఆవరించింది.

ఇతర ప్రాంతాల నుండి వచ్చిన వారిలో కొందరు ఇక్కడి ప్రజలతో మమేకమై పోగా, మరి కొందరు స్థానికులను చులకనగా చూడటం, అవహేళన చేయడం, అపహాస్యపు వ్యాఖ్యలు చేయడం మొదలైనవి అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. దానికితోడు పత్రికలు, సినిమాలు, ఆకాశవాణి వంటి ప్రచార సాధనాల్లో ప్రామాణిక భాషగా స్థిరపడిన భాష తెలంగాణా ప్రాంతానిది కాకపోవడమే కాదు, అనేక సందర్భాల్లో ఇక్కడి మాండలికం అపహాస్యం చేయబడింది. తెలివితక్కువ పాత్రలచేత ప్రయోగింపబడింది.

ఇలాంటి సాంస్కృతిక కారణాలు కూడా తెలంగాణా ప్రజల భావేశానికి ఊపిరులూదాయి.

## ఆందోళనకు బీజాలు

1968 మధ్యకాలంలో గుమాస్తా ఉద్యోగ నియమకాల్లో డొమిసైల్ నియమాల్ని మినహాయించాలని అప్పటి లేబర్ కమీషనర్ ప్రభుత్వానికి సూచించారు. హోమ్‌శాఖ సంయుక్త కార్యదర్శి దీన్ని బలపరిచారు. జూన్ 1968 లో ఈ విషయమై మంత్రివర్గం చర్చించింది. అప్పటికే తెలంగాణా ప్రజానీకంలో ప్రబలుతున్న అసంతృప్తినీ, నిరసనలనూ అంచనా వేసిన మంత్రివర్గం ఈ మినహాయింపు ప్రతిపాదనను తిరస్కరించడంతోబాటు 6 జులై 1968 నాడు తాత్కాలికంగా నియమింపబడిన నాన్-డొమిసైల్ ఉద్యోగులను మూడు నెలల్లోగా తొలగించాలనుకున్న నిర్ణయం తీసుకుంది. ఈ విషయమై జి.వో. నెం. 1963/

జి.ఒ. (ఎస్.ఆర్.) 10-7-1968 జారీ అయ్యింది. ఈ ప్రభుత్వ ఉత్తర్వుల్ని ప్రజలు, పత్రికలు అనేక రకాలుగా విమర్శించాయి. అనేక విజ్ఞప్తులు రాష్ట్ర ప్రభుత్వానికి అందాయి. దీనితో నవంబర్ 1968 వరకు ఈ ఉత్తర్వులు అమలు జరుపలేదు. నవంబర్‌లో జరిగిన శాసనసభ శీతాకాల సమావేశాల్లో ఈ ఉత్తర్వుపై ఆంధ్రప్రాంత శాసన సభ్యులు నిశిత విమర్శలు కురిపించారు. అప్పటి ముఖ్య మంత్రి భిన్నాభిప్రాయాలుగల శాసన సభ్యుల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. నాన్-డొమిసైల్ ఉద్యోగులకు తమ సొంత ప్రాంతంలో ఉద్యోగాలు కల్పించి, తెలంగాణా ప్రాంతం నుండి బదిలీ చేయవచ్చునని గౌతు లచ్చన్నగారు సూచించారు.

19 జనవరి 1969 నాడు జరిగిన 'అఖిలపక్ష సమావేశం' కూడా ఈ సూచనను బలపరిచింది. చివరికి ప్రభుత్వ నిర్ణయం ప్రకారం 'తెలంగాణా ప్రజలకు రిజర్వుచేయబడిన ఉద్యోగాల్లో పనిచేస్తున్న తెలంగాణేతరులు 45 రోజుల్లోగా (28-2-1969) తమ స్వంతజిల్లాలకు బదిలీ కావాలంటూ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ఉత్తర్వులు జారీ చేశారు.

## నిరసనల నుండి ఆందోళనల దాక

1968–69 మధ్యకాలంలో ఇటు తెలంగాణా ప్రాంతంలోనూ, అటు ఆంధ్ర ప్రాంతంలోనూ అపార్థాలు, అసంతృప్తి, నిరసనలు వ్యాపించాయి. 1968 నవంబర్ మాసంలో కాకినాడలో తెలంగాణా వ్యతిరేక ఆందోళన ప్రారంభమయ్యింది. ఆంధ్ర N G.O సంఘాలు, పలుకుబడి గల ఆంధ్ర ప్రాంత నాయకులు 'తెలంగాణా రక్షణలకు వ్యతిరేకంగా' ఆందోళనలకు పిలుపునిచ్చారు ఆంధ్రప్రాంత ఉద్యోగులు ఈ విషయంలో కోర్టులో కేసువేసే వరకు వెళ్ళారు. దీనికి నిరసనగా 1968 డిసెంబర్ మాసంలో తెలంగాణా విద్యార్థులు ఆందోళన ప్రారంభించారు పేరిలో ఒక వర్గం అప్పుడే 'ప్రత్యేక తెలంగాణా రాష్ట్రం' నినాదాన్ని లేవదీసింది. అప్పటి ముఖ్యమంత్రి 19 జనవరి 1969 నాడు అఖిలపక్ష సమావేశాన్ని ఏర్పాటు చేశారు. తెలంగాణా హక్కుల పరిరక్షణ, ఉద్యోగ నియామకాలు, డొమిసైల్ హక్కులు వంటి అంశాలు ఈ సమావేశం చర్చించింది. దీనికి వ్యతిరేకంగా ఆంధ్ర ప్రాంతంలో పెద్ద ఎత్తున 'నిరసన' పెల్లుబికింది. ఈ నిరసనకు ప్రతినిరసనగా తెలంగాణా వ్యాప్తంగా ఆందోళన ప్రారంభం కాసాగింది. మార్చి 3 వ తేదీనాడు 'తెలంగాణా బంద్' జరిగింది. మార్చి 8, 9 తేదీల్లో 'తెలంగాణా సదస్సు' హైదరాబాద్‌లో జరిగింది. పోలీసులు, ప్రభుత్వం ఎన్ని ప్రతిబంధకాలు కల్పించినా వేలాది మంది ప్రతినిధులు ఈ సదస్సులో పాల్గొని 'ప్రత్యేక తెలంగాణా' నినాదాన్ని

బలపరిచారు 1969 మార్చి 27వ తేదీనాడు తెలంగాణా ప్రాంతానికి చెందిన కొండాలక్ష్మణ్ బాపూజీగారు తమ కార్మిక మంత్రిత్వ పదవికి రాజీనామా చేసి 'ఆందోళన'లో పాల్గొనసాగారు. తరువాత మరికొందరు శాసనసభ్యులు కూడా రాజీనామాలు సమర్పించి, ఆందోళన లో క్రియాశీలమైన పాత్రను నిర్వహించసాగారు. విద్యార్థులు, యువజనులతో ప్రారంభమైన ఆందోళన ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కార్మికులను కూడా ప్రభావితం చేసి, క్రమంగా ఒక ప్రజాందోళనగా పరిణతి చెందింది 'ప్రత్యేక తెలంగాణా రాష్ట్రనిర్మాణం' తెలంగాణాలోని తొమ్మిది జిల్లాల్లో మార్మోగింది. ఈ తొమ్మిది జిల్లాల చిత్ర పటం, ఈ చిత్రపటం వేసిన జెండా, తెలంగాణా జాతీయ గీతాలు ఊరూరా ప్రతిధ్వనించాయి.

## జై తెలంగాణా గీతాలు

ప్రతి నిరసనలోనూ, ఆందోళనలోనూ, ఉద్యమంలోనూ వెంటనే ప్రతిస్పందించే ప్రథమ పౌరుడు రచయిత. సహజంగానే యావత్తు తెలంగాణా ప్రాంతాన్ని కుదిపేసిన 'ప్రత్యేక తెలంగాణ' ఆందోళన అనేకమంది యువ రచయితల్ని సృష్టించుకుంది. వేర్పాటువాద గీతాలను వ్రాయించుకుంది. చాలా మంది రచయితలు తమపేర్లు వెల్లడించకుండా 'అజ్ఞాతకవులు'గానే అనేక గీతాలను రచించి, ప్రచారం చేశారు. జూలై 1969లో 'విప్లవశంఖం' (గేయవాహిని) 'తెలంగాణ విద్యార్థి ప్రచురణ'గా వెలువడింది. రచన 'ఎవరో' అంటూ ప్రకటించిన ఈ గేయవాహినిలోని చాలా గీతాలను హైదరాబాద్ పాతనగరకవి శ్రీ అనుముల శ్రీహరి రాశారు.

'ఇది నా తెలంగాణ సంజీవ దీవిరా
ఇది నా తెలంగాణ పుణ్యాలదేవిరా
ఇది నా తెలంగాణ పీయూష వాణిరా
ఇది నా తెలంగాణ రుద్రమ్మరాణిరా!

ఇచటి మాగాణాలు స్వర్ణ కేదారాలు
ఇచటి స్రోతస్విను మధు సుధ సుధారలు
ఇచటి పర్వతపంక్తి కోహెనూరుల మాల
ఇచటి శీతోష్ణస్థితి అమ్మకౌగిటి లీల
ఇచటి ప్రకృతిమూర్తి ఇంద్రలోకము కీర్తి
అందుకే తెలంగాణమంటె ఒడలకు రక్తి ॥ఇది॥

ప్రతి వనిత ఒక సీత, రోషమున రుద్రమ్మ
ప్రతివాడు రామయ్య, భక్తకవి పోతన్న

ప్రతి చిరంజీవి, పర ప్రాణముకు సంజీవి
ప్రతికర్త, యుగకర్త, వాగ్దేవికే భర్త
జీవరాశుల మహారాణి నా తెలంగాణ
పావనాత్మకు మరోపదము నా తెలంగాణ ॥ఇది॥
నవ ధాన్యములు పండు నా తెలంగాణలో
నవ రసమ్ములు పారు తెలంగాణ వాణిలో
గంభీరముగ మౌనముగ గారడిని చేసి
కదలికలు లేకయే తెలంగాణ శిలలలో
రంభోర్వశీ తిలోత్తమలు నృత్యము చేయు
రామకథ యుగచరిత్రలు గానమును చేయు ॥ఇది॥'

అంటూ నేలతల్లిని కీర్తించిన కవి కుమారులు...

'లేవరా సోదరా!
లేవవే సోదరీ!
తెలంగాణ విప్లవజ్వాల మిన్నును ముట్టె
కాకతీరుద్ర పొలికేక గుండెలు మీటె
ఇదిగోర! నా వేడి రుధిర తిలకము నీకు
అదిగోర! రక్కసుల వ్యూహ పంక్తి పరాకు ॥తె॥
నరరూప రాక్షసులు నమ్మించి లేచారు
మన తెలంగాణనే కబళించుచున్నారు
అధికార మదముతో అట్టహాసము చేసి
రక్తదాహము హెచ్చి రంకె వేస్తున్నారు ॥తె॥
అదిగోర! తెలంగాణ మధుర మాగాణాల
కదన భూమిని జేయు కాసు రాక్షసి హేల
ఇకనైన అందరం ఏకమై లేదాము
మాతృభూమిని బ్రోవ బలిదానమౌదాము ॥తె॥'

అంటూ 'విప్లవ శంఖం' పూరించారు. ప్రజల ఆగ్రహాన్ని పాటల రూపంలో ప్రచారం చేస్తూ...

'రక్కసుల దాసులై కుక్క బ్రతుకులకన్న
ఈ విప్లవములోన వీరమరణమె మేలు'

అంటూ కదన రంగానికి దూకారు.

'పన్నెండు వర్షాల బానిసత్వము చాలు
ఓర్చి లేచిన చివరి ఉద్యమం ఇదియెరా!

జై తెలంగాణమో, సమరాన మరణమో
తేల్చుకొందామురా, దిగ్విజయమౌనురా!'

అని ప్రతిజ్ఞ చేశారు. ప్రజాందోళనను లాఠీలతో, తూటాలతో అణచివేయడానికి ప్రయత్నించిన అప్పటి ముఖ్యమంత్రిపై ఆగ్రహం ప్రకటిస్తూ...

'కాసుగాడు గద్దెమీద
కూసుంచే ముప్పు వచ్చె
చూసి చూసి మనలను రా
కాసి అయ్యి మ్రింగవచ్చె'[1]

అంటూ తీవ్ర పదజాలంతో అభిశంసించారు.

'జై జై తెలంగాణమనే
చదువరులను కాల్చినాడు
తెలంగాణ వీరుల గుం
డెల రక్తం త్రాగినాడు

దేశ దేశ పోలీసును
తీసుకొచ్చి పెట్టినాడు
అడ్డాంసుగ మిలటరీని
అక్కడక్కడుంచినాడు'

అంటూ కోపాగ్నులు జ్వలిస్తూనే...

'దెబ్బతిన్న తెలంగాణ
దీక్ష వదిలి పెట్టదురా!
కాసూ! నీ గుంటనక్క
మోసమింక సాగదురా!

మానదురా తెలంగాణ
మనసులోని గాయం
కాసూ! త్వరలోనె నీకు
కాటి యాత్ర ఖాయం'

అంటూ తమ దృఢ సంకల్పాన్నీ, విశ్వాస తీవ్రతనీ ఇక్కడి రచయితలు గానం చేశారు.

ఆందోళన సందర్భంగా జరిగిన 'పోలీసుల దౌర్జన్యం' వర్ణిస్తూ...

'కుక్షిపోషణకు రాచరికానికి
కుక్కల మాదిరి అమ్ముడుపోయిన

1. అప్పటి ముఖ్యమంత్రి కాసు బ్రహ్మానందరెడ్డి.

వెట్టి బుర్ర పోలీసుల బలగం
విఱ్ఱవీగి విరుచుక పడుతున్నది
నడిరాతిరి తమ తమ గృహాలలో
సడిచేయక నిదురించే వాళ్ళను
అన్యాయంగా బయట కీడ్చుకొని
అమానుషంగా హింసిస్తున్నది
ఇళ్ళలోన జొరబడి స్త్రీజనమును
ఏడిపించి అవమానిస్తున్నది
తలుపులు వ్రయ్యలు కొట్టి, ఇళ్ళలో
దాగిన నిర్దోషుల కొడుతున్నది
ఇద్దరి నొకచో నిలువనివ్వదు
ప్రొద్దు గుంకితే కర్ఫ్యూ ఆర్డరు!
పది మనుజులు గుడిగూడితె చాలు
బెదిరింపులు లాఠీచార్జీలు-
మౌన యాత్రలను చేయనివ్వదు
ప్రజాభిప్రాయం తెలుపనివ్వదు
నిర్భయముగ సమ్మెను సాగిస్తే
నిరంకుశముగా ప్రజపై ఫైరింగ్'

అని వివరించారు కవులు. అలాగే ఆ రోజుల్లో ముషీరాబాద్ జైలులోని ఖైదీలతో తెలంగాణా సత్యాగ్రహులను జైలు పోలీసులు కొట్టించిన సందర్భంగా-

'జయిలులోన నేరస్థుల చేతికి
పొయిల కట్టెలను, మొలల కట్టెలను
సప్లైచేసి, తెలంగాణీయుల
చావచావ కొట్టించి చంపెరా-
చావుబ్రతుకులో తల్లడిల్లు మన
సత్యాగ్రహులను కరుణించదురా!
రాతిగుండె పోలీసుల కన్నా
రాబందుల హృదయాలే మేలురా!

అంటూ తమ ఆగ్రహావేశాలు వ్యక్తం చేశారు.

ఇంత జరిగినా, 'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రంనుండి 'తెలంగాణా' విడిపోక పోతే జరిగే నష్టాలను వర్ణిస్తూ...

'తెలంగాణమే విడికాకుంటే
ఆంతా ఆంధ్రుల దాసులమే
తెలంగాణమే విడిపోకుంటే
ఇతరుల దృష్టికి సీచులమే ॥తెల॥

పిరికిపందలై వెనుదిరిగామా-ఒరులిక కొలగానివ్వరురా
నూరేళ్ళైనా తెలంగాణీయుల-నోళ్ళకు తాళం వేతురురా
మన సిరి సంపదల్ని దోచుకుని-మనకు జోలె తగిలింతురురా
ఎట్టి సేవకులజేసి మనల తుద-ముట్టించుటకై చూతురురా ॥తెల॥

దీక్షవదిలి ఊర్కొన్నామంటే-శిక్షలు మనకిక తథ్యమురా
తరతరాలతో వచ్చిన సంస్కృతి-తాళిబొట్టు లేపోవునురా!
సుందరమగు మనభాగ్యనగరినిక - చూడ మనకు కళ్ళుండవురా!
తెలంగాణ సంజీవదీవిపై - తెల్ల మదనములు నవ్వునురా
తెలంగాణ పుణ్యాం౦ దేవిపై - కళంక సుమములు కురియునురా?' ॥తెల॥

అని సాహిత్యకారులు స్పష్టం చేశారు.

ఆందోళన క్రమక్రమంగా తీవ్రతరమయ్యింది. పోలీసుల చిత్రహింసల్ని, నిషేధాజ్ఞల్ని ధిక్కరిస్తూ యువజన విద్యార్థులు వీర విహారం చేయసాగారు. ఆనాటి అనేకమంది యువకుల్లాగే, యువకకవులు కూడా...

'అమ్మా! ఇక నన్నాపకు
నాన్నా! ఇక నన్నాపకు ॥అమ్మా॥

ప్రత్యేక తెలంగాణము - రావాలని పోరుచేసి
కాంగ్రేసు కాసుగాని - కత్తిపోటు కెదురిచ్చిన
నా తెలంగాణీయుల గోర్వెచ్చని రక్తం అదిగో ॥అమ్మా॥

నా తోబుట్టువులు సైన్యాల తుపాకుల తూటాల
కెదురు జవాబిచ్చినట్టి - ఎదల గాయములు చిమ్మిన
తడియారని వీరరక్త - ధారావాహినులవిగో! ॥అమ్మా॥

నిగళములో చిక్కుకున్న - తెలంగాణ స్వేచ్ఛశ్రీ
అదిగో పసిపాపతీరు - ఎదభారముతో క్రుంగెను
అదిగో నా తెలంగాణ - హృదయానికి మరఫిరంగి
గురినిపెట్టి ఎవడో పక్కన నవ్వే దుస్స్వప్నం ॥అమ్మా॥

ఇంకా నే నాగలేను - డొంక బ్రతుకు బ్రతుకలేను
అమ్మా ఇక నన్నాపకు - నాన్నా ఇక నన్నాపకు
అన్నా నన్నిక పోనీ - అక్కా నన్నిక పోనీ

ఏరులయ్యి పారిన నా వీరుల రక్తం త్రాగిన
రాక్షస సామ్రాజ్యముతో - రణం చేయబోతున్నా ॥అమ్మా॥'

అంటూ అంబరాలు దద్దరిల్ల పులిగర్జనలు చేస్తూ, బొలికేకలు వేస్తూ, కొనఊపిరి ఉండుదాక పోరాటం చేయడానికి తమను సాగనంపమంటూ కుటుంబ సభ్యులతో విజ్ఞప్తి చేశారు. మేల్కొన్న తెలంగాణా మెరుపు తీగలై జ్వలించారు చైతన్య గీతాలను ఆలపించారు.

'తెలంగాణ మేల్కొన్నది - తెలంగాణ మేల్కొన్నది
అమ్మా! యను పాపనుండి - అసువులుబాసే వృద్ధుని
దాక నేడు తెలంగాణ - దద్దరిల్లి మేల్కొన్నది ॥తె॥

గతంలోన నిద్దుర స్వీకారం చేసిన ఎడారి!
నేడు మనకు ప్రసాదించు నిరంకుశపు జైలు దారి
అడుగడుగున యమయాతన - అంతమున నిరాశ చావు
చూచి చూచి మేల్కొన్నది - వేచి వేచి మేల్కొన్నది
భావిని దివి చేయాలని - ప్రతిజ్ఞలను గైకొన్నది ॥తె॥

భావి తెలంగాణ జాణ - ఎవరికి దాస్యం చేయదు
జన్మహక్కు నపహరించు - ఉన్మాదులను క్షమించదు
జనరుధిరం త్రాగెడు - రాజరికానికి గోరి కట్టి
స్వయం రాజ్య పాలనలో - శాంతి కపోతాలు పెంచి
జోహారుల నందుకొనును - జోహారుల నందుకొనును' ॥తె॥

అంటూ మేల్కొన్న తెలంగాణకు కైమోడ్పులందించారు ఆనాటి తెలంగాణ రచయితలు.

అలాగే ఆ కాలంలో ఊరూరా, వాడవాడా అనేక వేదికలమీద తన బలమైన కలంబలంతో రాసిన 'జై తెలంగాణా' గీతాలను ప్రజలమధ్య గళమెత్తి గానంచేసిన వేర్పాటువాద కవి చల్లా నర్సింహులు. కాలగర్భంలో కలిసిపోయిన నర్సింహులు గీతాలను వెలికితీయాల్సిన బాధ్యత భావి పరిశోధకులపై ఉంది.

తను రాసినవి, ఇతర కవులు రాసినవీ కలిపి గానం చేసిన మరో గాయక కవి ఇ. వి. పద్మనాభం. ఆవేశపూరితమైన వక్తృత్వం, దానికి వన్నె చేకూర్చిన గంభీర స్వరంతో పద్మనాభం గారి ఉపన్యాసాలు, గీతాలు ఆనాటి యువతరాన్ని అపారంగా ప్రభావితం చేశాయి.

ప్రత్యేక తెలంగాణా ఆందోళన జరుగుతున్న రోజుల్లో హైదరాబాద్ పాత నగర వీధుల్లో 'ఉషస్సు రచయితలు' శ్రీయుతులు చింతపట్ల సుదర్శన్, జి.వి. జగదీశ్వరస్వామి, ఎస్వీ సత్యనారాయణ, తిరునగరి మురళి, ఎం.ఎస్. కుమార్,

జోగిని హనుమంతరావు ప్రభృతులు 'ప్రభాతఫేరీ' నిర్వహిస్తూ ప్రభుత్వ వ్యతిరేక గీతాలు పాడేవారు. ఆనాడు బాగా ప్రజాదరణ పొంది ఉన్న సినిమా గీతాల బాణీల్లో పాటల్లి ప్రచారం చేసేవారు. 'అయ్యయ్యో బ్రహ్మయ్య - అన్యాయం చేసినావయ్య!' అనే పల్లవితో ముఖ్యమంత్రికి వ్యతిరేకంగా సాగే పాట ప్రజలను ఉద్రూతలూగించేది. అలాగే 'మొక్కజొన్న తోటలో - ముసిరిన చీకట్లలో' అనే సినిమాపాట బాణీలో...

'తెలంగాణ భూమిలో
భాగ్యనగర సీమలో
మనుషుల ప్రాణాలతో - నువ్వు
ఆడకు బ్రహ్మయ్య - నువు
ఆడకు ఆడకు బ్రహ్మయ్యా'

అంటూ ఆనాటి ముఖ్యమంత్రిని అధిక్షేపిస్తూ పాటలు పాడేవారు.

ఈ 'ఉషస్సు రచయితలు' తరువాతి కాలంలో మరికొందరు స్థానిక రచయితలతో కలిసి 'హైదరాబాద్ పాతనగర రచయితల సంఘం' (1970) స్థాపించారు. ఇవ్వాళ పత్రికారంగంలో ఉన్న చాలామంది యువ జర్నలిస్టులను, కార్టూనిస్టులను, రచయితలను ఈ సంఘం తీర్చిదిద్దింది. దాదాపు ఒక దశాబ్దం పాటు పాతనగరంలో సాహిత్య చైతన్యాన్ని పదును పెట్టిన ఈ సంఘ సభ్యులు 1973 నుండి పునర్నిర్మాణమైన హైదరాబాద్ 'అరసం'లో క్రియాశీల పాత్ర నిర్వహించారు, నిర్వహిస్తున్నారు. ప్రోత్సాహం కరువైన ప్రాంతంలో ప్రతిభావంతులను సృష్టించిన ఈ సంఘం కృషి హైదరాబాద్ పాతనగర సాంస్కృతిక చరిత్రలో ఒక విశిష్ట అధ్యాయాన్ని ఆక్రమిస్తుంది.

## 'జై ఆంధ్ర' గీతాలు

ఒకవైపు తెలంగాణా ప్రాంతంలో జై తెలంగాణ' ఆందోళన ఉవ్వెత్తున లేచి, క్రమంగా చల్లారుతున్న దశలో అటు ఆంధ్ర ప్రాంతంలో 'జై ఆంధ్ర' ఆందోళన చెలరేగింది. 'ముల్కీ' నిబంధనలకు వ్యతిరేకంగా, డొమెసైయిల్ ఉత్తర్వులకు వ్యతిరేకంగా, తెలంగాణ పాలకులకు వ్యతిరేకంగా ఆంధ్రప్రాంతంలో సాగిన ప్రజాందోళన 'జై ఆంధ్ర'. ముల్కీ చట్టాన్ని సవాలు చేస్తూ, ఆంధ్ర ప్రాంత ఎన్.జీ.వో. నాయకులు కొందరు హైకోర్టు కెళ్ళారు. ఈ చట్టం చెల్లనేరదని హైకోర్టు తీర్పునిచ్చింది దీనిపై శ్రీ పి. వి. నరసింహారావు ప్రభుత్వం సుప్రీంకోర్టుకు అప్పీలు చేసింది. 'ముల్కీ నిబంధనలు చెల్లుతాయని' సుప్రీంకోర్టు తీర్పునిచ్చింది. దీంతో మొదట ఆంధ్రప్రాంత విద్యార్థులు, తరువాత ఎన్.జి వో.లు 'ముల్కీ డౌన్ డౌన్' అంటూ నిరసన నినాదాలు చేశారు.

సమ్మెలు ప్రారంభించారు. ఆంధ్రప్రాంతంలోని 12 జిల్లాల్లో నిరసన జ్వాలలు మండసాగాయి. దీని పరిష్కార మార్గంగా, మధ్యవర్తి తీర్పుగా అప్పటి భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ 'పంచసూత్ర పథకాన్ని' రూపొందించారు. ముల్కీ బిల్లు పార్లమెంటులో ప్రవేశపెట్టబడి, మెజారిటీ ఆమోదాన్ని పొందింది. ఆ వెంటనే రాజ్యసభ ఆమోదాన్ని పొంది, రాష్ట్రపతి సంతకం కోసం వెళ్ళింది. ఆ మరునాడే విజయవాడ న్యాయవాదులు ముల్కీ బిల్లుకు నిరసనగా నల్లకోట్ల ర్యాలీ నిర్వహించారు. మేధావుల్లో సంచలనం కలిగింది. ఆంధ్రుల భవిష్యత్తుపై, ఉద్యోగావకాశాలపై 'ముల్కీ నిబంధన బిల్లు' ప్రభావం తప్పకుండా పడుతుందన్న భయం, నిరాశ 'నిరసన'కు దారితీసింది. ఇది రాను రాను ప్రజల ఆగ్రహంగా పరిణమించి 'ఆందోళన' రూపం ధరించింది. సమ్మెలు, హర్తాళ్ళు, బంద్, ఘెరావ్‌లతో ఆంధ్ర ప్రాంతం అట్టుడికిపోయింది. పదిమంది మంత్రులు ఒక్కుమ్మడిగా మంత్రివర్గానికి రాజీనామాలు చేసి; 'ప్రత్యేకాంధ్ర' ఆందోళనలోకి దూకారు. 24-12-1972 నాడు 'సమైక్యాంధ్ర పరిరక్షణ'ను కోరుతూ సమైక్యతావాదుల ప్రజాప్రదర్శన 'విజయవాడ' నగరంలో జరిగింది. దీనిని ప్రతిఘటించడానికి పూనుకున్న 'ప్రత్యేకాంధ్ర' వాదులపై కేంద్ర రిజర్వు పోలీసుదళాల కాల్పులు జరిగాయి. ఎందరో యువకులు నేలకొరిగారు. ఆ మరునాడు అంటే 25-12-1972 నాటి వేకువ ఝామున ప్రత్యేకాంధ్ర నాయకుడు కాకాని వెంకటరత్నం గుండెపోటుతో తుదిశ్వాస విడిచాడు. వేలాది స్త్రీ పురుషులు తమ నాయకునికి శ్రద్ధాంజలి ఘటించారు ఒక బ్రహ్మాండమైన ప్రజాప్రదర్శనగా 'కాకాని అంతిమ యాత్ర' జరిగింది. 2 జనవరి 1973 నాడు ఆంధ్ర ప్రాంతంలోని 12 జిల్లాల్లో సంపూర్ణబంద్ పాటింపబడింది. ఊరేగింపులు, జైత్రయాత్రలు నిర్వహింపబడ్డాయి.

'ఆంధ్ర మాత పలకరించె
నా మేనంతా పులకరించె
ఆంధ్రత్వ మావేశించె
నా గేయం ప్రవహించె
నా గేయం - నా గేయం
ఆంధ్రప్రజ ధ్యేయం
సిద్ధించుట ఖాయం'

అంటూ డాక్టరు వల్లభుని నాగేశ్వరరావు గారు 'జై ఆంధ్ర' గీతాలు గానం చేయడమే గాక, ఫిబ్రవరి 1973 లో తానూ, ఇతర కవులు రాసిన గేయాలను కూర్చి 'ప్రత్యేకాంధ్ర పోరాటం' (గేయామాలిక) వెలువరించారు.

'వందనమమ్మా జయాంధ్ర మాతా! అభి
వందనమో నవ్యాంధ్ర మాతా!
గౌతమి కృష్ణ పినాకినీ
పావన పుణ్య నదీజలములు
నిత్యము పొంగి పొరలి ప్రవహించె
నవజీవని మా అమృతవల్లి'

అంటూ జయాంధ్ర మాతకు వందనాలు శ్రీ అవనిగడ్డ సూర్యప్రకాశ్ సమర్పిస్తే......

'ఎత్తండి జై ఆంధ్ర జండా!
ఎత్తండి-ఎత్తండి-మన గెల్పుజండా!
నిల్పండి నిల్పండి ప్రత్యేక రాష్ట్రం
ఎత్తండి 'జై ఆంధ్ర' జండా॥'

అంటూ ఉద్బోధించారు శ్రీ వి.యన్. ప్రసాద్.

'జై ఆంధ్ర' నినాదంతో సాగిన వేర్పాటువాద ఆందోళనలో నేలకొరిగిన అమర వీరులకు జోహార్లర్పిస్తూ...

'ఆంధ్ర వీరుల్లారా! అమరజీవుల్లారా!
జోహారు జోహారు - మీకు మా జోహారు ॥అమర॥

అపరాధ మెరుగని నిరాయుధులై మీరు
నేడాంధ్ర పోరులో - నేల కొరిగినారు
మీ గుండెలో మారుమ్రోగేటి నినదమ్ము
జై ఆంధ్ర! జై ఆంధ్ర! జై ఆంధ్ర అంటూ
అసువులొడ్డినారు - అమరులై పోయారు ॥అమర॥

సి.ఆర్.పి. తుపాకీ - తూటాల కెదురొడ్డి
నిలబడ్డ గుండెల్లో - జొరబడ్డ బుల్లెట్లు
మీ నెత్తురుప్పొంగి - ఉప్పెనై ప్రళయమై
మీ శౌర్య శక్తితో - ఈ కాల రుద్రులై
నిరతాగ్ని జ్వాలలై - నింగిలో జ్యోతులై
దివిని అలరించారు - అమరులై నిలిచారు' ॥అమరు॥

అంటూ స్మృతిగీతికలు గానం చేశారు శ్రీ అవనిగడ్డ సూర్యప్రకాశ్.

'ఆంధ్ర రథం కదిలెనోయ్
స్వతంత్ర పథంలో - జగ
న్నాథ రథం నిలిచెనోయ్

విజయపథంలో - నవీన యుగంలో
హైదరాబాదులోని బాధలు యిక ఉండవంట
హైరాణతోగూడిన - ఆ ముల్కీ గాథలుండవంట!
తెలంగాణలోని నీచ బ్రతుకు అంతరించునంట
ముల్కీ సంకెళ్ళు ఒక్క దెబ్బకు తెగిపోవునంట
ఇందిరమ్మ అడ్డుకున్న నేమాత్రము ఆగదంట
సుందర శివమున్న నవీనాంధ్రము అవతరించునంట'

అని ఆశావాదాన్ని ప్రకటించారు కుమారి వి. ఝాన్సీ దుర్గ.

'బాబూ మాకొద్దీ సమైక్యతా రాష్ట్రమూ
ఇక మాకొద్దీ తెలంగాణా రాజ్యము ॥బాబూ॥
మా కష్టం గుర్తించక - మా యిష్టం నెరవేర్చక
ముష్కర సి. ఆర్పి తెచ్చి - ఇనుప గుండ్లు కురిపించితె
మా యువకుల గుండెల్లో - దూసుకపోతూ ఉంటే
ఆ తల్లుల గర్భాల్లో - భగ్గుమన్న బడబాగ్నులు
ఆ సతుల జీవితాల్లో - రగులుకొనే దావాగ్నులు
ఎంతకాలము సాగిస్తారు ?
ఇంకెంతవరకు సహిస్తాము ?
ఆ సఖ్యత మాకొద్దూ - ఆ ఐక్యత ఇంకెందుకు ?'

అంటూ సూటిగా ప్రశ్నించారు శ్రీ వల్లభుని నాగేశ్వరరావు.

'నడవండోయ్ ! నడవండోయ్ !
ఆంధ్రమాతనే వినరండోయ్ !
ముక్కోటాంధ్రులు ఒక్కటిగా సమైక్యత వొద్దని చెప్పండీ !
ఆంధ్రులంతా చాటండీ - ప్రత్యేకాంధ్ర మా ధ్యేయమనీ
నిరసన దీక్షలు పూనండీ - పన్నుల నిరాకరించండీ !
చట్టాల నెల్ల ధిక్కరించగా - ప్రభుత్వపాలన స్థంభించాలి
స్టేటాఫీసులు కేంద్రాఫీసులు - అన్నిటినీ బంద్ చేయండీ !
ప్రభుత్వ ద్వారములన్నిటినీ - దిగ్బంధించగ లేవండీ !
ఆంధ్రులంతా తెస్తారూ - ప్రత్యేకాంధ్ర రాష్ట్రాన్ని
నిజం నిజం ముమ్మాటికీ - నిజం నిజం ఇదే నిజం !'

అంటూ 'సంపాదకీయ గేయం'గా 'ఆంధ్రమాత పిలుపు'ను వినిపించారు శ్రీ నాగేశ్వరరావుగారు.

'ఇది పార్టీల కతీత ఉద్యమం
వృత్తి భేదమే లేని ఉద్యమం
కుల మత వర్గ రహితోద్యమం
ముక్కోటాంధ్రుల మహోద్యమం'

అంటూ చాటి చెప్పిన కుమారి వల్లభుని ఝాన్సీ దుర్గ...

'పూర్వాంధ్ర రక్తం పంచుకొని - నవ్యాంధ్ర రాష్ట్రం నెలకొల్ప
ఒకే మాటపై నిలవండి - ఒకే బాటపై నడవండి
మీ ఆశయ లక్ష్యం కోసం - త్యాగమూర్తులై నిలవండి
ప్రత్యేకాంధ్రరాష్ట్రం కోసం - పొట్టి శ్రీరాములులై వెలగండి'

అంటూ పిలుపునిచ్చారు.

'జనగణ మంగళ దాయకి జయహే
ఆంధ్రుల భాగ్య విధాత్రీ!
నెల్లూరు విశాఖ శ్రీకాకుళ
రాయలసీమ గోదావరి కృష్ణ
తిరుమల శ్రీశైల ఇంద్ర కీలాద్రి
అహోబిల సింహాద్రీ
కృష్ణాపెన్నా గౌతమీ నదీమ
తల్లుల అమృత జలధీ!
త్యాగయ క్షేత్రయ లెల్లా
నన్నయ తిక్కన మొల్లా
వేమన కవివర శోభా!
బంగరు సీమలు పాడిపంటలతో
నిత్యము విలసిలు మాతా
జయహే! జయహే! జయహే!
ఆంధ్రమాతా! జయహే!'

అంటూ రవీంద్రుని 'జనగణమన' గీతం బాణీలో జై ఆంధ్ర గీతాన్ని గానం చేశారు అనాటి కవులు. ప్రత్యేకాంధ్ర ఆందోళన చరిత్రను, గేయాలను, హరికథలను, బుర్రకథలను ప్రచురించి ప్రచారం చేసిన సంస్థ "ప్రత్యేకాంధ్ర ప్రచారసంఘం."

'ప్రత్యేకాంధ్రావతరణకు ప్రాణాలను తృణప్రాయంగా సమర్పించిన అమరవీరులందరికీ కవితా సుమాంజలులు అర్పిస్తూ అంకితం చేసిన 'జై ఆంధ్ర గేయాలు' పుస్తకాన్ని 1973 లో డా॥ యసమదల పుల్లయ్యారావు వెలువరించారు.

'అనుమానమేలనే జై ఆంధ్ర సోదరీ!
అవమానమేలరా జై ఆంధ్ర సోదరా!
ఆంధ్రులం మేమంచు అందరిలో పాడగా
ఆంధ్రతేజం నేడు అందరిలో పాడగా'

అని ప్రశ్నించిన పుల్లయ్యారావుగారు...

'నా ఆంధ్రభూమి కంటె నాకమెక్కడుంది
నా జీవనాడు బోలు నందనమ్మెక్కడుంది
నా నదులు పొంగారు సవస్వాదు నీరమ్ము
నా అవని పండేను నవామృతపు పంట'

అంటూ ఆంధ్రమాతను ప్రశంసించారు.

'ఎగరాలి ఎల్లపుడు జై ఆంధ్ర జెండా
నింగిలో రెపరెపల నేత్ర పర్వమ్ముగా
తనువెల్ల పులకింప జేసేటి జెండా
మంగళ ప్రదమైన మా పసిడి జెండా
... ... ... ... ... ... ... ...
ఆంధ్ర జాతీయతను కాపాడు జెండా
ఆంధ్ర జన తేజాన్ని చూపేటి జెండా'

అంటూ జై ఆంధ్ర జెండా వందనం చేసిన కవి...

'ప్రత్యేకాంధ్ర ప్రత్యేకాంధ్రంటూ లేవండి
ఏకమై ఎల్లరం పోరాడుదాం రండి
స్వరాష్ట్ర సాధనకై పోరాడండి
స్వాభిమాన రక్షణకై ఈనాడు
సర్వస్వం త్యాగం గావించండి'

అని పిలుపునిస్తూ, ప్రత్యేకాంధ్ర రాష్ట్ర ప్రకటన జరగాలని ఆశించారు.

## సమైక్యాంధ్ర గీతాలు

దాదాపు అర్ధ శతాబ్దంపాటు అటు బ్రిటీష్ ప్రభుత్వంతోనూ, ఇటు నిజాం ప్రభుత్వంతోనూ పోరాడి సాధించుకున్న విశాలాంధ్ర రాష్ట్రాన్ని ఒకవేపు రెండు వేర్పాటువాద ఆందోళనలు కుదిపి వేస్తుంటే, మరోవైపు సమైక్యాంధ్ర పరిరక్షణ కోసం సమర భేరి మ్రోగించిన సాహితీవేత్తలు కూడా ఉన్నారు.

'ఆంధ్ర వేరు, తెలంగాణ వేరుగాదు. రెండూ తెలుగు మాతృభాషగా గలవే. ఒక ప్రాంతం ఇంగ్లీషు భాషాధిపత్యాన, మరొకప్రాంతం ఉర్దూ భాషాధిపత్యాన నలిగిపోయాయి. కనుక ఈ ప్రాంతాలపైన ఆ భాషల ప్రభావం పడ్డది. ఇరుప్రాంతాల ప్రజలూ మాట్లాడే భాషలో ఉన్న తేడా పైపైది మాత్రమే.

పెట్టుబడిదారీ విధానంతో పుట్టిన ప్రాంతీయ అసమానతలు - ఈ వ్యవస్థను వది లించుకుంటేగాని పోవు. ఈ మూల కారణాన్ని గుర్తించని వాళ్ళు అసలైన వర్గ పోరాటాన్ని వదిలి వ్యర్థమైన ప్రాంతీయ పోరాటాల్లోకి దిగజారుతారు'[1] అనే సందేశాన్ని ప్రజలకు వినిపించారు సమైక్యతావాదులు. కాంగ్రెస్ పార్టీలోని ప్రముఖులు ఇటు తెలంగాణ ప్రాంతంలోనూ, అటు ఆంధ్ర ప్రాంతంలోనూ 'వేర్పాటువాద ఆందోళనలకు' తమ మద్దతును ప్రకటించడమే కాక, తమ మంత్రి పదవులకు, శాసన సభ్యత్వాలకు కూడా రాజీనామాలు చేసి ఈ ఆందోళనలకు నాయకత్వం వహించారు. 'జనసంఘం' బ్రద్దలయ్యింది. తెలంగాణాలోని జన సంఘ నాయకులు పార్టీ నుండి వైదొలగి, బయటపడ్డారు. 'సంయుక్త సోషలిస్టు పార్టీ' ఒకవైపు ప్రత్యేక తెలంగాణా ఆందోళనకు తోడ్పాటునిస్తూ, మరోవైపు సమైక్యత కావాలని తీర్మానించింది. ఆనాటి 'శాసనసభ'లో ఉన్న ఆ పార్టీలోని ఇద్దరు సభ్యులు చెరోదారి పట్టుకోగా, మూడో సభ్యుడు పార్టీకి రాజీనామా చేశాడు. 'ఈ ప్రాంతీయ ద్వేషాగ్నిలోని అంతస్సారం కూడా విప్లవమేనని, తెలంగాణాలోని ప్రజారాజ్యం నిర్మాణానికి ఈ వేర్పాటు వాద ఆందోళన ఒక సాధనమని' నక్సలైట్లు భావించారు.

ఆంధ్ర రాష్ట్ర నిర్మాణంలోనూ, విశాలాంధ్రలో ప్రజా రాజ్యం నినాదంతో 'ఆంధ్రప్రదేశ్' అవతరణలోనూ అగ్రగామి పాత్ర వహించిన 'కమ్యూనిస్టు పార్టీ' ఒక్కటే 'సమైక్యాంధ్ర పరిరక్షణ' కోసం చిత్తశుద్ధితో కృషి చేసింది.

తెలుగునేలపై సర్క్యులేషన్‌లో ఉన్న పత్రికలన్నీ ఊగిసలాట వైఖరిని అవలంబిస్తున్న క్లిష్ట సమయంలోనూ 'విశాలాంధ్ర' పత్రిక వేర్పాటు వాదాలను నిర్ద్వంద్వంగా నిరసించింది. సమైక్యాంధ్రను నినదించింది. పత్రికాఫీసుపై అనేక సందర్భాల్లో జరిగిన దాడుల్ని యువజన విద్యార్థులతో ఏర్పడిన ఎర్రసేన తిప్పి కొట్టింది.

వేర్పాటువాద ఆందోళనలతో రాష్ట్రం అట్టుడికిపోతున్న గడ్డు రోజుల్లో... కమ్యూనిస్టుపార్టీ, భావసారూప్యత గల వ్యక్తులతోనూ, సంస్థలతోనూ కలిసి 24 డిసెంబర్ 1972 నాడు విజయవాడ నగరంలో 'సమైక్యాంధ్ర'ను కోరుతూ బ్రహ్మాండమైన ప్రజా ప్రదర్శనను నిర్వహించింది. ప్రదర్శనానంతరం జరిగిన బహిరంగ సభా వేదికపై...

'ఎవడబ్బ సొమ్మురా - ఈ గడ్డ చీల్చ
త్యాగాల బిడ్డరా మన తెలుగు గడ్డ ॥ఎవ॥

1. 'వీర తెలంగాణా కోరినది విచ్ఛిత్తికాదు, విశాలాంధ్ర—ప్రజా రాజ్యం' శ్రీ మోటూరి హనుమంతరావు, మార్క్సిస్టు ప్రచురణలు, విజయవాడ-2.

రాయలేలిన నాడు రతనాల గడ్డరా
రాజ రాజును గన్నదీ పుణ్యగడ్డరా
కాకతీయుల శౌర్యదీప్తి వెలిగిన గడ్డ
కవి గాయకులు జీవనదులు మెసిలిన గడ్డ ॥ఎవ॥
నాజీల మరపించు నైజాము ముష్కరుల
చీల్చి చెండాడిన వీరు లొరిగిన గడ్డ
వెలుగు నిండిన తెలుగు గుండె లెదురొడ్డి మన
అనుమర్లపూడి, కొమరయ్య లొరిగిన గడ్డ ॥ఎవ॥
ముక్కచెక్కల తెలుగు జాతినేకము చేయ
ముక్కోటి తెలుగులం ఒక్కటై పోరాము
వెతల నిండిన గతము నొకమారు చూడగా
నిను గన్న నీ తల్లి కలత చెందిందిరా ॥ఎవ॥
కూటికై గూటికై పెరిగేటి ధరలపై
పేదవానికి భూమి వానగూర్చుటందుకై
అస్తుబిస్తుల పస్తు బ్రతుకురోసిన జనత
నినదించి సమరాన నిలిచిపోరెడి వేళ
బూర్జువా భూస్వామ్య పెట్టుబడి కూటాలు
జాతికే చిచ్చెట్టి పొంచి కూర్చున్నాయి ॥ఎవ॥
తెలంగాణ, సర్కారు, రాయలేలిన సీమ
ఒక్కటేయని చాటరా, యీ గడ్డనే శక్తి
చీల్చలేదని తెలుపరా' ॥ఎవ॥

అనే గీతం మార్మోగింది. ప్రతి చరణానికీ ప్రజలు కరతాళ ధ్వనులతో తమ ప్రతిస్పందనను తెలిపారు. కృష్ణాజిల్లాకు చెందిన ఒక పేదరైతు, కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త పసుపులేటి వెంకయ్య రాసిన ఈ గీతం ఆనాడు సమైక్యాంధ్ర సమర సంకేతంగా నిలిచింది

'తెలుగు వీర మాగాణికి
తిరుగులేని వారసులం
సామ్యవాద గమ్యానికి - సాగిస్తాం మా పయనం!
కులం మతం ప్రాంతాలను
అల్పబుద్ధి మాకు లేదు
తెలుగుజాతి ఐక్యతకై - తెగువ జూపి పయనిస్తాం

మృత యోధుల క్రొన్నెత్తుటి
ఫలియించిన చిరస్వప్నం
విశాలాంధ్ర రమ్యావని - విరబూసిన త్యాగ సుమం'

అని నినదించిన శ్రీ కె. రాజేశ్వరరావు అనేక ప్రజాపోరాటాల్లో ప్రత్యక్షంగా పాల్గొని, అరెస్టు చేయబడి, జైళ్ళల్లోకి వెళ్ళినప్పుడు 'ఉక్కు కటకటాల వెనుక' అనే గీతం రాశారు.

1970-73 సంవత్సరాల నడుమ 'విశాలాంధ్ర' పత్రికలో అచ్చయిన 'సమైక్యాంధ్ర' గీతాల్లోంచి ప్రజాదరణ పొందిన కొన్ని ప్రఖ్యాత గీతాలను కూర్చి 1973 లో ఆం. ప్ర. అభ్యుదయ రచయితల సంఘం, కృష్ణాజిల్లా శాఖ 'సమైక్యవాణి' గీతికా సంపుటిని వెలువరించింది.

'ప్రతీపశక్తులు సాగిస్తున్న విభజనోద్యమాల అంతర్యాన్ని అభ్యుదయ రచయితలు ఆదిలోనే గుర్తించారు. చైతన్యవంతులయిన కవులు, ముఖ్యంగా యువకులు-ఆంధ్రజాతి సమైక్యతను గొంతెత్తి గానం చేశారు. ఇందులోని గేయాలన్నీ ఆంధ్రప్రజల హృదయావేదనను ప్రతిధ్వనిస్తున్నాయి. ఆంధ్రజాతి సమైక్యతను ప్రబోధించే ఈ కవితా సంకలనాన్ని ఆంధ్రప్రజలు ఆదరిస్తారని విశ్వసిస్తున్నాము' అంటూ 'ముందుమాట'ను ముగించిన ప్రకాశకులు, ఈ ముందుమాటలో ఆనాటి రాజకీయ, సాంస్కృతిక స్థితిగతుల్ని కూడా విశ్లేషించి, 'సమైక్యవాణి'ని వినిపించాల్సిన ఆవశ్యకతను స్పష్టం చేశారు. దాదాపు 20 మంది అభ్యుదయ రచయితలు రాసిన మొత్తం 23 గీతాలను ఈ పుస్తకం పాఠకలోకానికి అందిస్తున్నది. వాటిలో ప్రజల ప్రశంసలు పొందిన గీతాల్లో కొన్నింటిని ఇప్పుడు పరిశీలిద్దాం.

'అమర వీరులు వారబోసిన
అరుణ రక్తపు ధార సాక్షిగ
పచ్చినెత్తుట తడిసి విరిసిన
పారిజాత వనమ్ము సాక్షిగ
పాడరా గళమెత్తి ఆంధ్రుల
భవ్యజాతి సమైక్యగీతం ॥
సొంతలాభం కొరకు తల్లిని
సంతలో తెగనమ్ము ద్రోహులు
బొగ్గులకునై కల్పతరువును
అగ్గిపెట్ట సహించబోమని
పాడరా గళమెత్తి...'

అంటూ తెలుగు వెలుగులపై చీకటి తెరలు దించడానికి తెగించిన స్వార్థ పరుల కుట్రల్ని ఛేదిస్తూ, ఎలుగెత్తి విప్లవ భావరంజిత నవ్యగీతం గజ్జెల మల్లారెడ్డి వినిపించారు.

'తెలుగు జాతిని చీల్చి కలిమి బలములు కాల్చ
తుచ్ఛులే ఈనాడు పెన్బరిలుతున్నారు
ఒక కంట కనిపెట్టరా - యువకుడా!
ఐక్యతను నిలబెట్టరా!
ఈనాటిదా తెలుగుజాతి కలిసుండటం
ఏనాటిదో తెలుగు సాహిత్య సౌరభం
తిక్కన్న పోతన్నలూ - ఈనాట
కవిత పారిందారురా!

ఇంట చీమలుదూర ఇల్లు కాలుస్తార
కంట నలకలు పడితె కళ్ళు పీకేస్తార
నలుగురూ నవ్వేరురా - తెలుగోడ!
పరువు మంటలో కలియురా!

తిండిలేదని ప్రజల తలలు తరిగేస్తార
ఉద్యోగ మేదదని ఉరి పోసుకుంటార
కలిమిలేముల నడుమ ఎదమధికమాయెరా
కాంగ్రెసు పాలనమురా - తెలుగోడ
కష్టాల కారణమురా!

నాలుగున్నర కోట్ల ప్రజలొక్కటైయుండ
తెలుగుదేశము చీల్చ తలపెట్టు అధములీ
ప్రత్యేక నాయకుల పాడు చదరంగాన
పావువై పడబోకురా తెలుగోడా!
ఐక్యతను నిలబెట్టరా!'

అని ఉద్బోధించారు శ్రీ ఏటుకూరి ప్రసాద్.

'వద్దురా తెలుగన్న వద్దురా
ఈసుతో నీ పేగు కోసుకోవద్దురా
వద్దురా తెలుగన్న వద్దురా!
పాటి దిబ్బలకాడ - ఏటి కాల్వలకాడ
కాటులాడే దొరల - బాట పడవద్దురా

వడ్డి నాముఃకాడ - గడ్డి వాముఃకాడ
జిత్తులేసే బుగత - కత్తు కలవద్దురా!
రోసాలు పెంచుకొని - కాసెలు బిగించుకుని
తెలుగుసీమను దిబ్బ - తేర్చబోవద్దురా!
ఉమ్మడి పొలాలలో - ఉమ్మెత్త జిల్లేడు
విత్తులను వెదజల్లు - వెర్రిపని వద్దురా!'

అంటూ హెచ్చరించడంతో బాటు 'మాయమాటలు నమ్మి - మసక చీకటి కమ్మి-మన యింటి పచ్చనే - మసిచేయ వద్దురా!' అని వారించారు రాంభట్ల కృష్ణమూర్తిగారు.

తెలుగు జాతి ముక్కచెక్కలవుతుందేమోనని సమైక్య వాదులు ఆందోళన చెందుతున్న ఆ విషమ పరిస్థితుల్లోనే 'వేరు తెలంగాణా కాదు - వీర తెలంగాణా' కావాలని తన కవిత్వం ద్వారా ఎలుగెత్తి చాటిన కవి డా॥ సి. నారాయణరెడ్డి. 'ఒక తల్లి, ఇద్దరు కొడుకులు' శీర్షికన ఈ కవి రాసిన గేయంలో......

'ఇల్లు తగలబడి పోతున్నది
ఒళ్ళు తగలబడి పోతున్నది
ఇల్లూ, ఒళ్ళూ కాలుతున్నాయని కాదు తల్లిబాధ
ఇంటిలోని కంటి పాపల్లాంటి కొడుకు లిద్దరూ
ఎవరి దారి వారు చూసుకుంటున్నారని.'[1]

కలిమిలో కలలు పంచుకునే వాళ్ళు, లేమిలో కన్నీళ్ళు పంచుకునే వాళ్ళైన ఇద్దరు కొడుకులు చెరోదారి పడుతున్నప్పుడు కన్నతల్లి ఆవేదనను అక్షరాల్లో పొదిగారు.

'తెలుగు తల్లి తనయులార!
ఒకే సుమం రేకులార
విశాలాంధ్ర ప్రజారాజ్య
నినాదమే మరిచారా![2]

అని శ్రీ మల్లిక్ ప్రశ్నిస్తుంటే......

'లేదురా తమ్ముడూ!
లేదిందు ముక్తి
రాష్ట్రిమ్ము చీల్చితే
రాదురా భుక్తి!

అని స్పష్టం చేశారు శ్రీ ఉమారాజ్.

---

1. 'ఆంధ్రప్రభ' (సంక్రాంతి సంచిక) 17-1-1978.
2. 'సమైక్యవాణి' - ఆం.ప్ర. అరసం, కృష్ణాజిల్లా శాఖ.

'ఒక్కటిగా తెలుగు జాతి వర్ధిల్లాలి
సమైక్యమై సమగ్రమై విలసిల్లాలి
భాషలో భావములో పాటలో పల్లవిలో
ఒకేవాణి ఒకేబాణి తేనెలొలుకు తెలుగువాణి'

అంటూ అసంఖ్యాక తెలుగు వీరులసువులిచ్చి సాధించిన విశాలాంధ్రను విచ్ఛిన్నం చేయవద్దని శ్రీ లోకం వేంకటేశ్వరరావు కోరారు.

'ఆలపించు ఈ రోజున
తెలుగువాడి ఐక్యగీతి
వెలుగుబాట చూపించే
సమైక్యతా భావగీతి!

వేరుపాటు సర్పమ్ముల
విష పూత్కారాల తోటి
మన తెలుగుల మల్లెతోట
చెన్ను దరిగిపోరాదని
ఆలపించు ఈ రోజున...'

అంటూ 'తెలుగు జాతి ఐక్యతలో చరమగీతి లేదని, తెలుగువాడి భవితవ్యం చేదుపాట కాదని' ఆలపించమన్న అభ్యుదయ కవి శ్రీకాంత్.

'మృతవీరుల క్రొన్నెత్తుట
విరిసిందీ తెలుగునేల
ప్రాంతమేదైనా గానీ
తెలుగు ప్రజలొక్కటే
చిరకాలం నిలుస్తుంది
విశాలాంధ్ర సమైక్యత'

అని 'చారిత్రిక ఆశావాదాన్ని' శ్రీ వెల్లంకి అరుణకుమార్ ఎదనిండిన విశ్వాసంతో ప్రకటించారు.

1969-70 సం॥ల్లో 'ప్రత్యేక తెలంగాణా'ను గానం చేసిన 'ఉషస్సు రచయిత'ల్లోని చాలామంది 1971 నుండి 'అభ్యుదయ రచయితల సంఘం'తో సంబంధాలేర్పరుచుకుని, చర్చోప చర్చలద్వారా, నిరంతర అధ్యయనంద్వారా క్రమంగా సమైక్యాంధ్ర గీతాలను ప్రకటించసాగారు.

'తెలంగాణ విప్లవ రజతోత్సవ సంవత్సరమిది
విశాలాంధ్ర ఐక్యతకై విక్రమించి పోరాడగ
రండిరా! పదండిరా సమైక్యరాష్ట్ర రక్షకై'

అని ఎలుగెత్తి నినదించసాగారు.

'విజయవాడలో రెండవసారి జరిగిన బ్రహ్మాండమైన ఆంధ్ర సమైక్యతా ప్రదర్శనకు హైదరాబాదు నుండి కొందరు అభ్యుదయ రచయితలు వెళ్ళి పాల్గొన్నారు.'[1] విజయవాడలోనూ, ఇతర పట్టణ కేంద్రాల్లోనూ, 'సమైక్యాంధ్ర పరిరక్షణ' కోసం జరిగిన ప్రజాప్రదర్శనల్లో, బహిరంగ సభల్లో అభ్యుదయ రచయితలు, ప్రజానాట్యమండలి గాయనీ గాయకులు అగ్రగామి పాత్రను నిర్వహించి, తమ చారిత్రిక కర్తవ్యాన్ని నిర్వర్తించారు.

తెలంగాణా ప్రజల కవి సుద్దాల హనుమంతు, చెరుకు ఊశయ్యగౌడ్ 'సమైక్యాంధ్ర పరిరక్షణ'ను కోరుతూ, వేర్పాటువాద ఆందోళనలను నిరసిస్తూ రాసిన జానపదగేయ సంపుటి 'త్రిలింగాణెము'[2] గౌడశ్రీ సాహితీ పరిషత్, రామన్నపేట, నల్లగొండ జిల్లాని ప్రచురణగా ఫిబ్రవరి 1973 లో వెలువడింది. 'వేర్పాటు ఆందోళనలో అమాయకంగా బలియైన అమరజీవులకు' ఈ గేయ సంపుటిని అంకితం చేశారు.

"తెలుగు మాతృభాష కలిగిన అందరు ఆంధ్రులే. కాని ఈనాడు నిజామాంధ్ర (తెలంగాణ) ప్రాంతములో 'ఆంధ్ర' పదంపై దాడి జరుగుతుంది. తామెవరో, తమ జాతి ఏమిటో తెలియని పసి పిల్లలతో కొందరు స్వార్థపరులు 'ఆంధ్రా గోబ్యాక్' అనిపిస్తున్నారు. అంటే తెలుగు మాతృభాష కలిగిన వాళ్ళంతా వెళ్ళి పోవాలన్నట్లే గదా ! ఐతే ఈ ప్రాంతంలో ఉండే వారెవరు? విద్యావంతులు ఆలోచించండి.

ఆంధ్రప్రదేశ్ జనాభాలో 1% ఉన్న ఉద్యోగుల ప్రమోషన్లకొరకు, రేపు ప్రభుత్వ శాఖలలో దొరుకు 1, 2 ఉద్యోగాల కొరకు, లేదా కొందరికి మంత్రి పదవులకొరకు ఆంధ్రజాతి చీలవలెనా? విద్యావంతుల కొరకే గాక మొత్తం జనాభాకు పనులు కల్పించుటకై మన రాష్ట్రములో ఉన్న అన్ని రకాల వనరులను సమీకరించుకుని, కేంద్రముతో రావలసిన మన వాటా రాబట్టుకొని, ప్రక్క రాష్ట్రంలో ఉన్న మన ఆంధ్రప్రాంతాన్ని మనలో కలుపుకొని, దోపిడి సమాజాన్ని నిర్మూలించి 'విశాలాంధ్రలో ప్రజారాజ్యాన్ని, నిర్మించుకుందాం" అని పిలుపునిచ్చారు తమ ముందు మాటలో ఈ రచయితలు.

1. 'అభ్యుదయ రచయితల సంఘ పునర్నిర్మాణ కార్యకలాపాల నివేదిక' (వ్యాసం)-గజ్జెల మల్లారెడ్డి - 'అభ్యుదయ' 50 ఏళ్ళ పత్రాలు.
2. 'త్రిలింగాణెము' (జానపదగేయ సంపుటి) చెరుకు ఊశయ్యగౌడ్, గుర్రం హన్మంతు (సుద్దాల)-1973 ఫిబ్రవరి.

'ఇదేనా...ఇదేనా...
వేర్పాటు తెలంగాణ ప్రజాసమితి విధానంబు॥
స్వాతంత్ర్యమునకు ముందు సమత ముసుగులో దాగిన
మత కుల ప్రాంతీయ దురభిమానులదే సమయమని
లేత లేత మెదళ్ళలోన మత్తుజల్లి మతిజెరచి
స్వార్థ యజ్ఞ యాగముకై సమిధలుగా వాడుకొనుట ఇదేనా...'

అని ప్రశ్నిస్తూ, వేర్పాటువాద ఆందోళనకారులు సృష్టిస్తున్న భయోత్పాత పరిస్థితులు, ప్రజలకు కల్పిస్తున్న అనేక అసౌకర్యాలను వర్ణించి, తీవ్రంగా నిరసించారు శ్రీ సుద్దాల హనుమంతు.

'అయ్యో ఏమిటి ఈ ఘోరం?
ఎటు జూచిన మానవ మారణ హోమం
పట్టపగలె నడివీధులందునా - పిట్టలవలె మనుషుల గాల్చుచు
రణ రంగముగా మార్చి ప్రజలను-రక్తపు బేరుల ముంచేస్తుంటే
అమాయకులగు మన ఆంధ్ర యువకులు - అగ్నికి ఆహుతి
అయిపోతుంటే

ఏమంద్రరా నాయకులారా! ఎక్కడున్నారు
ఒకరన్నా ముందుకు వచ్చి నిలువరు ఈనాడు'

అని ప్రశ్నించిన చెరుకు ఊశయ్య గౌడ్‌గారు......

'పదవుల కొరకై పసిప్రాణాలను-అధములు అంతట కాల్చేస్తుంటే
దేశభద్రతా చట్టంపేరుతో-దొరలు ప్రజలను అణచేస్తుంటే
శాంతి అహింసల ఇందిరగాంధి-సి.ఆర్ పి.తో నలిచేస్తుంటే
ఏమంద్రరా...

విజయవాడ గుంటూరందున-అనంతపురము ఏలూరందున
హైదరాబాదు విశాఖపట్నం-కాకినాడలో నెల్లూరందున
కోస్తాప్రాంతం రాయలసీమలో-తెలంగాణలో కాల్పులు జరిగెను
ఏమంద్రరా...

నాడు నాయకులు జేసిన తప్పుకు-నేడు యువకులు బలియగుచుంటే
ఢిల్లీ గద్దెపై కళ్ళు మూసుకుని-పిల్లులు పాలను త్రాగుచునుంటే
ఆంధ్రదేశ ప్రజలందరు నేడు-అట్టుడికి నట్టుడుకుచు ఉంటే...
ఏమంద్రరా...'

అంటూ వేర్పాటువాద నాయకులను, కేంద్ర-రాష్ట్ర పాలకులను నిలదీసి

'అన్నలార! తమ్ములార - ఆంధ్రమాత బిడ్డలార!
అమ్మకడుపు రెండుగ చీల్చంగ వలదు నేడు మనం
పరపాలన యందు కన్న కొడుకులెన్నొ ఏండ్లు క్రుగ్గి
ఒక్కటయ్యి ఉన్నయిల్లు చక్కదిద్దు కొందరంటె
చిన్నచిన్న తగవులతో చీలిపోవు మనల జూచి
కన్నతల్లి దుఃఖముతో కుమిలి కుమిలి ఏడ్చుచుండె
పేరులేక ఊరులేక పడియుండిన ఆంధ్రజాతి
మద్రాసులో నైజాములో ముష్కర పరిపాలనలో
ఎదుగు బొదుగు లేక మనం ఎన్నో ఏండ్లు బ్రతికాము
ఉన్నదంత కోలుపోయి - కన్నయిల్లు చేరినాము
తరతరాల బానిసత్వతనము రూపుమాపుదాము
కరం కరం కలిపి యంత కలిసి ముందుకెళ్ళుదాము
రాష్ట్రప్రగతి నడ్డువారి రూపుమాపి వేయుదాము
ఆంధ్ర యువత శక్తి చాటి అమ్మపేరు నిలుపుదాము'

అనే సమైక్యతా సందేశాన్నందించారీ 'త్రిలింగాణెము కవులు'.

వేర్పాటువాద ఆందోళనల మహాప్రవాహానికి ఎదురొడ్డి; అనేక పరిహాసాలకు, పరాభవాలకు, దాడులకు, ఎదురుదాడులకు ఎదురు నిలిచిన ప్రగతిశీల ప్రజాతంత్ర శక్తుల ఆశయం నెరవేరింది. అమరవీరుల దృఢదీక్ష ఫలితంగా సమైక్యాంధ్ర రాష్ట్రం సంరక్షింపబడింది.

కారుమబ్బు క్షణం కన్న అరుణద్యుతి నాపలేదు
ప్రాతిగామ్యక్షీణ శక్తి ప్రగతిని శాసించలేదు'

అని ఎంతో గుండె నిబ్బరంతో పలికిన 'రాంభట్ల' కవి వాక్కు నిజమయ్యింది. పెనుగాలులు వీచినా, ప్రభంజనం లేచినా ఒక్కటయిన తెలుగుజాతి ఒకటిగానె నిలిచింది.

# 6

# తెలంగాణా సాయుధ పోరాటం

తెలుగు నేలపై తలెత్తిన ఉద్యమాల్లో తెలంగాణా సాయుధ పోరాటం ప్రత్యేకమైనది. అణచివేతకు వ్యతిరేకంగా తెలుగు ప్రజల పోరాట శీలాన్ని ప్రపంచానికి చాటిన తిరుగుబాటు ఉద్యమం తెలంగాణా సాయుధ పోరాటం. భారత స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా సాగుతూ, ఉద్యమ చరిత్రలో ఒక విశిష్టమైన అధ్యాయాన్ని లిఖించుకున్న పోరాటమిది. తెలంగాణాకు అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు తెచ్చిన ప్రజాపోరాటమిది. పాబ్లో నెరూడా చేత; అనేకమంది రష్యన్, స్పానిష్, పోలిష్ రచయితల చేత గీతాలు రాయించుకున్నదీ; స్టాలిన్ మన్ననలను పొందిందీ పోరాటం. హరీంద్రనాథ్ చటోపాధ్యాయ, చిత్తప్రసాద్‌వంటి జాతీయ స్థాయి కవులను, కళాకారులను ప్రభావితం చేసిన ప్రజోద్యమమిది. గత నాలుగు దశాబ్దాలుగా ఉద్యమ సాహిత్యానికి ప్రేరణగా ఉన్నది కూడా తెలంగాణా సాయుధ పోరాటమే.

'తెలంగాణాకు ఏనాడూ రాజకీయ ప్రతిపత్తి లేదు. తెలంగాణాకు పోరాట ప్రతిపత్తి ఉంది. ఉద్యమ ప్రతిపత్తి ఉంది. విప్లవ ప్రతిపత్తి ఉంది. అంతర్జాతీయంగా తెలంగాణా విదితమయ్యిందీ ప్రజాపోరాటం ద్వారానే. ఈ శతాబ్దపు నాల్గవ దశకపు పత్రికలు ఒకసారి పరికిస్తే తెలంగాణా పోరాటం ఎంత ప్రాముఖ్యతనూ, ప్రాధాన్యతనూ సంతరించుకున్నదో విదితం అవుతుంది'[1] అంటారు ప్రముఖ నవలా రచయిత దాశరథి రంగాచార్య.

తెలుగు ప్రజల విప్లవ పోరాటాల బావుటాగా పైకెగసిన ఈ సాయుధ పోరాటానికి దారితీసిన చారిత్రక, సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక కారణాలను క్లుప్తంగా పరిశీలించడం జరుగుతున్నది.

---

1. 'చిల్లరదేవుళ్ళకు తిరుగుబాటు, జనపదాలకు జరుగుబాటు' (వ్యాసం) —ఆంధ్రజ్యోతి (దినపత్రిక) 1-9-1986.

## పాలనా వ్యవస్థ

మొగల్ చక్రవర్తి షాజహాన్ చేత దక్కన్ (వింధ్యపర్వతానికి దక్షిణ ప్రాంతం) సూబాకి సుబేదారుగా 'నిజాముల్ ముల్క్' ఖమ్రుద్దీన్ నియమితు లయ్యారు. 1724 లో అతను స్వతంత్రాన్ని ప్రకటించుకుని హైదరాబాద్ సంస్థానంలో అసఫియా రాజ్యస్థాపన చేశాడు.

బ్రిటిష్‌వారు మన దేశాన్ని జయించి, వలస పాలనను సుస్థిరం చేసు కున్న తర్వాత దేశంలోని మూడింట రెండు భాగాలను తమ ప్రత్యక్ష పాలనలో పెట్టుకుని, మిగతా మూడోవంతు భాగాన్ని రాజుల, సంస్థానాధిపతుల పాలనలో కొనసాగనిచ్చారు. బ్రిటిష్‌వారు తలుచుకుంటే సంస్థానాధీశులను తుడిచిపెట్టి, ఈ భూభాగాన్నంతటినీ 'బ్రిటిష్ ఇండియా'లో కలుపుకోగలిగేవారు. కానీ ప్రజ లను ప్రత్యక్షంగా దోచుకోడానికి బదులు స్వదేశీ సంస్థానాలను కొనసాగనిచ్చి, వారి ద్వారా ప్రజలను కొల్లగొట్టించి లాభాలను గడించాలనే ఉద్దేశ్యంతో ఈ సంస్థానాలను అంగీకరించారు. వాటిలో హైదరాబాద్ సంస్థాన మొకటి. చట్టరీత్యా దీని అధిపతి నిజాం నవాబు. ఈ హైదరాబాద్ సంస్థానంలో భాష రీత్యా మూడు ప్రాంతాలుండేవి. 1. తెలంగాణము, 2. మరట్వాడా, 3. కర్నాటక ప్రాంతం. అన్నిటికన్నా పెద్దది తెలుగువారు నివసించే తెలంగాణా. దీనిలో 8 జిల్లాలుండేవి. 1. అత్రాఫ్ బల్దా[1], 2. నిజామాబాద్, 3. మెదక్, 4. మహ బూబ్‌నగర్, 5. నల్లగొండ, 6. వరంగల్లు, 7. కరీంనగర్, 8. ఆదిలాబాద్. సంస్థానంలోని జిల్లాలను 4 సూబాలుగా విభజించారు. అందులో తెలుగు మాట్లాడే వారు ఎక్కువగా ఉన్న సూబాలు రెండు. 1. మెదక్ సూబా, 2. వరంగల్ సూబా. ఈ సూబాలకు అధిపతులు సుబేదార్లు (గవర్నర్లు). వీరికి రెవెన్యూ అధికారాలుండేవి. జిల్లాలకు అధిపతులు తాలూక్దారులు. వీరికి రెవెన్యూతో బాటు పరిపాలనాధికారాలు కూడా ఉండేవి. తాలూకాలకు తహసీల్దార్లు అధికారులుగా ఉండేవారు.

సంస్థానంలో మూడింట రెండు వంతులు మాత్రమే సంస్థానాధిపతి ప్రత్యక్షపాలన కింద ఉండేది. దీనినే 'ఖాల్సా' లేదా 'దివానీ' అనేవారు. మిగిలిన మూడోవంతు ప్రాంతంలో జాగీర్లుండేవి. ఈ జాగీర్లు 4 రకాలు. 1. సర్ఫేఖాస్- నిజాం ప్రభువు స్వంత జాగీరు, 2. పాయెగాలు (నిజాం రాజబంధువుల జాగీర్లు), ముస్తసనా జాగీర్లు, 4. సాధారణ జాగీర్లు. ఈ జాగీర్లకు అధిపతులు

---

1. ఉర్దూలో 'అత్రాఫ్' అంటే పరిసరప్రాంతం, 'బల్దా' అంటే నగరం. హైదరాబాద్ పరిసరప్రాంతాలను కలిపి 'అత్రాఫ్ బల్దా' అనే జిల్లాగా వ్యవహరించేవారు. ఇది నిజాం నవాబు సొంత జాగీరుగా ఉండేది.

జాగీర్దార్లు. అలాగే 'మక్తా'లనే ప్రాంతాలుండేవి. వీటి అధిపతులు మక్తాదారులు. తెలంగాణాలోని సుమారు 10 వేల గ్రామాల్లో 2600 జాగిరు గ్రామాలుండేవి.

## భూస్వామ్య వ్యవస్థ

గ్రామాలపైన, అక్కడి భూములపైన అన్ని అధికారాలు గల జాగీర్దార్లు, మక్తాదార్లు, దేశముఖులు, దేశపాండ్యాలు, పటేలు, పట్వారీలు వంటి భూస్వామ్య వర్గాలు వివిధ స్థాయిల్లో, వివిధ హోదాలతో సంస్థానం నిండా ఉండేవారు. ప్రభుత్వానికి వారు చెల్లించాల్సిన మొత్తం కోసం గ్రామ ప్రజలనుండి పెద్దమొత్తంలో పన్నులు వసూలు చేసేవారు. రైతులనుండి ధాన్యం, చేతివృత్తుల వారినుండి పరిహారం తీసుకొనేవారు. క్రమంగా వీరిలో కొందరు ప్రజలను పీడించడం మొదలు పెట్టారు.

వీరు గ్రామ పరిపాలన నంతటినీ సాగిస్తూ ఉండేవారు. వీరు సాగించే దౌర్జన్యాలకు కూడా అంతలేకుండా ఉండేది. వారివారి హోదాను బట్టి, కొందరికి న్యాయవిచారణ తీర్పుల పేరుతో మరణశిక్షలు కూడా విధించడానికి అధికారాలుండేవి. చాలావరకు గ్రామాల్లో దేశ్‌ముఖ్‌లు, పటేల్ - పట్వారీలు ప్రజల్ని దోచుకుతినే ప్రభుత్వ అధికారులుగా తయారయ్యారు.

## సామాజిక స్థితిగతులు

భూస్వామ్య వర్గాలు తప్ప సామాన్య ప్రజానీకం ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని బతికే దుర్భర సామాజిక పరిస్థితులు సంస్థానంలో విలయ తాండవం చేసేవి.

దొరల ఇండ్లలో క్రింది తరగతికి చెందిన స్త్రీ పురుషులంతా వెట్టి చాకిరీ చేయవలసి వచ్చేది. ఆ రోజుల్లో వెట్టిని తప్పించుకోవడం ఎవరివల్లా అయ్యేది కాదు. వెట్టి చేయని ప్రతివారిని బూతులు తిట్టడమే కాకుండా, చావచితక గొట్టేవారు దొరలు. రైతులు ముందు దొరల పొలాల్లో పనిచేసినతర్వాతే 'తమ' పొలాల్లోకి వెళ్ళాల్సి వచ్చేది.

నిజాం సంస్థానం ఒక చీకటిరాజ్యం. గ్రామాల్లో పీడిత ప్రజలందరూ దొరలకు,పటేలు,పట్వారీలకు,పైనుండి వచ్చే ఉద్యోగులకు రకరకాల వెట్టిచాకిరీచేయాలి. ఇది అన్ని కులాలకు వర్తిస్తుంది. హరిజనులు, చాకళ్ళు, మంగళ్ళు, కుమ్మర్లు, వర్తకులు (కోమట్లు) - అందరికీ వెట్టిచాకిరి తప్పదు. చిన్న రైతులు, ధనిక రైతులకు కూడా ఇది తప్పలేదు. విత్తనాల తరుణంవస్తే ముందు దొరల భూములు సాగుచేసి, విత్తనాలు వేసిన తరువాతనే సొంత సాగు చూసుకోవాలి. దీనికితోడు రకరకాల పన్నులు - రోలు పన్ను, రోకటి పన్ను, పెండ్లికి పన్ను, సమర్తాడితే పన్ను, తీర్థమాడితే పన్ను, చస్తే పన్ను మొదలైన అనేక చట్టవ్యతిరేక పన్నులు

వసూలు చేసేవారు. వీటికితోడు నజరానాలను జాగీర్దార్లు, దేశముఖులు, పెద్ద భూస్వాములు గుంజేవారు. నాగు దోపిడి, విపరీత వడ్డీల దోపిడి ఉండేది.

ఒక దొరగారు తన అవసరాలకూ; భోగ విలాసాలకు కావలసిన వస్తువుల కోసం అవసరమైన ధనాన్ని తన ఆస్తినుంచి ఖర్చుచేయడానికి బదులుగా ప్రజల నుంచి వసూలు చేసేవాడు. తన ఇంట్లో పెళ్ళిళ్ళవంటి శుభకార్యాలకు, చావుల్లాంటి అశుభ కార్యాలకూ కావలసిన డబ్బు, ధాన్యం, ఇతర సామాన్లు ప్రజల నుంచి రావలసిందే. తాను నిర్మించే భవనాలకు కావలసిన డబ్బుతో పాటు రాయి, సున్నం మొదలైన సరుకు - సామాగ్రి ప్రజల నుంచి గుంజేవారు. రైతులు తమ బళ్ళతో రాయి, ఇటుక, సున్నం తోలాలి. కూలీలు ఉచితంగానో, నామ మాత్రపు కూలీకో పనిచేయాలి. ఒక కారు కొన్నప్పుడు, లేదా మరొక విలువైన వస్తువు తెచ్చినప్పుడు ఇదే పరిస్థితి ఉండేది. అక్రమమైన డబ్బును ప్రజల నుంచి వసూలు చేయడానికి, ప్రజలను అదుపులో పెట్టడానికి దొరలు కిరాయి మనుషులను పోషించేవారు. వారి వారి తాహతునుబట్టి ఒకరిద్దరి నుంచి వంద మంది వరకు వీరి సంఖ్య ఉండేది. ప్రజలను కొల్లగొట్టి జీవించడానికి దొరలకు వీరు అండగా ఉండేవారు. దొరలపై భక్తి విశ్వాసాలను ప్రదర్శిస్తూ ప్రజల పాలిటి యమభటులై వ్యవహరించేవారు.

పేదరైతులు, కూలీలు పండించిన పంట ఇంటికి చేరిన రోజుల్లోనే రెండు పూటలా కడుపునిండా తినేవారు. మిగతా రోజుల్లో అర్ధాకలితో బాధపడేవారు. గంజి కలిపిన మెతుకులు, గంజి లేనప్పుడు నీళ్ళలో తడుపుకున్న అన్నం తినేవారు. కారం కలుపుకుని పొడి అన్నం తినేవారు. కట్టుకోడానికి సరైన గుడ్డలు లేకుండా వ్యవసాయ కూలీల జీవితాలు మరింత దుర్భరంగా ఉండేవి. వారికి ఏ విధమైన స్వేచ్ఛ ఉండేది కాదు. చేతిపనులవారు, ఇతర వృత్తులవారు, హరిజన, గిరిజనులు - ఒకరేమిటి ప్రజలందరూ దొరల ప్రత్యక్ష దోపిడీకి గురి అవుతూ, దినదినగండంగా జీవితాలను గడిపేవారు.

## సాంస్కృతిక వాతావరణం

ఆనాటి హైదరాబాద్ సంస్థానంలోని ప్రజల్లో 3 నుండి 5 శాతం వరకు మాత్రమే అక్షరాస్యులు ఉండేవారు. అక్షరాస్యతను పెంచడానికి నిజామ్ ప్రభుత్వం ఎటువంటి చొరవా తీసుకోలేదు.

మొత్తం రాష్ట్రంలోనే 5 ఇంటర్మీడియట్ కాలేజీలు, 1 డిగ్రీ కాలేజీ, 31 హైస్కూల్‌లు, 105 మిడిల్ స్కూల్‌లు, 4000 ప్రాథమిక పాఠశాలలుండేవి. ప్రాథమిక పాఠశాలలు తప్ప మిగతా అన్ని విద్యాలయాల్లో ఉర్దూ మాధ్యమంలోనే చదువు చెప్పేవారు.

కొంత విద్యాధికులైన ప్రజలు కూడా భావ దాస్యానికీ, భాషా దాస్యానికి అలవాటుపడిపోయారు. ముస్లిం సంస్కృతితో ప్రభావితులై టర్కీ టోపీలు, పైజామా-షేర్వానీ వేషభాషలతో తెలుగుతనానికీ, భారత జాతీయతకు దూరం కాసాగారు.

హిందూ మహమ్మదీయుల పండుగలు రెండూ ఒకేసారి రావడమంటూ జరిగితే హిందువుల పండుగలను ప్రభుత్వం నిషేధించేది. మత స్వాతంత్ర్యమనే మాట వినబడేదే కాదు.

సంస్థానంలో అధిక సంఖ్యాకులుగా ఉన్న తెలుగు, మరాఠీ, కన్నడ ప్రజల భాషలు, మత విశ్వాసాలు అణచబడ్డాయి.

గస్తీ నిషాన్ తిర్పాన్ అనే జీవో (నెం 53) ప్రకారం ఏదైనా సమావేశం జరపడానికి నిజామ్ నవాబు అనుమతి అవసరమయ్యేది. పత్రికా స్వేచ్ఛ ఉండేది కాదు. గోలకొండ పత్రికను స్థాపించాలనుకున్నప్పుడు, అందులో 'ఆంధ్ర' అన్న పదాన్ని చేర్చడానికి ప్రభుత్వం అంగీకరించలేదు. తెలుగు పత్రిక నడపాలంటే క్యాబినెట్ అనుమతి కావలసివచ్చేది. క్యాబినెట్ అంటే ప్రజాప్రతినిధులు కాదు. నిజాం ప్రభువుచేత, జాగీర్దార్ల చేత, ఫస్ట్‌క్లాస్ ప్లీడర్ల చేత నియమితులైన ప్రతినిధులు, అంటే ప్రభుత్వం కొమ్ముకాచే విధేయులన్న మాట. ఇది ఆనాటి పరిస్థితి.

తెలంగాణా సంస్కృతిపై పెను చీకట్లు ఆవరించిన కాలమది. ప్రజల రాజకీయ-సాంఘిక-సాంస్కృతిక జీవితం అతి నికృష్ట దశకు చేరుకున్నది. ప్రజలకు పౌరసత్వపు హక్కుల్లేవు. వాక్, సభా, పత్రికా స్వాతంత్ర్యాల గురించి చెప్పక్కర్లేదు.

తెలుగు బోధనా భాషగా ఉన్న ఒకే ఒక పాఠశాలను ఆనాటి 'ఉస్మానియా విశ్వవిద్యాలయం' గుర్తించ నిరాకరిస్తే, పూనాలోని కర్వే యూనివర్సిటీకి వెళ్ళి పరీక్షరాయాల్సి వచ్చేది. తెలుగు భాషపట్ల ఉదాసీనత వహించడమే కాదు 'తెలంగీ బెడంగీ' (ముక్కూ మొగమూ లేని వికృత తెలుగు భాష) అంటూ అపహాస్యం చేసేవారు.

జాగీర్దార్లు కానీ, మక్తాదార్లు కానీ ప్రజల కోసం ఎలాంటి సౌకర్యాలు కల్పించేవారు కాదు. కొత్త చెరువులను నిర్మించడం కానీ, పాత చెరువులకు మరమ్మత్తులు చేయించడం కానీ జరిగేది కాదు. విద్య, వైద్య సదుపాయాల విషయం ఆలోచించవలసిన పనేలేదు. పన్నుల భారం మాత్రం జాగీరు ప్రజలను రోజురోజుకూ కృంగదీయసాగింది. ప్రజల్లో క్రమంగా అసహనానికీ, అశాంతికీ, అలజడులకు, ఆందోళనలకు ఊపిర్లు పోసింది.

## నిరసనలనుండి సాయుధపోరాటం దాకా

హైదరాబాద్ సంస్థానంలో కొనసాగుతున్న రాజరిక వ్యవస్థ దుష్పరిణామాలకు, మత పాక్షిక దృక్పథానికి వ్యతిరేకంగా జనాన్ని సమీకరించడానికి 1882లో 'థియోసాఫికల్ సొసైటీ', 1888లో 'హిందూ సోషల్ క్లబ్' 1891లో 'ఆర్యసమాజం' వంటి సంస్థలు స్థాపించబడినాయి. ప్రజల్లో సంస్కారాన్ని, చైతన్యాన్ని మేల్కొల్పడానికి ఇవి ప్రయత్నించాయి. 1913లో రాయ్ బాల ముకుంద్‌గారి అధ్యక్షతన హైదరాబాద్‌లో 'హ్యుమనిటేరియన్ లీగ్', 1915లో వామన్ నాయక్, కేశవరావు గార్ల పర్యవేక్షణలో 'సోషల్ సర్వీస్ లీగ్' ఏర్పడి హరిజనోద్ధరణ, ప్రాథమిక విద్యావ్యాప్తివంటి వాటిని ప్రచారం చేశాయి. 'యంగ్ మెన్స్ ఆంధ్ర అసోసియేషన్' తెలుగుభాషా సంస్కృతులను ప్రచారం చేసింది.

12 నవంబర్ 1921 నాడు హైదరాబాద్‌లోని ట్రూప్‌బజార్‌లో 'ఆంధ్ర జన సంఘం' స్థాపించబడింది. 1922 ఫిబ్రవరి 24 నాడు రెడ్డి హాస్టల్‌లో ఈ సంఘం మొట్టమొదటి సభ జరిపింది. చదువుకున్నవారిలో దేశాభిమానం, సోదర దేశీయుల క్షేమంకోసం పాటు పడాలనే భావం కలిగించడంలో చురుకైన పాత్ర వహించింది. ఈ సంఘం క్రమ వికాసం పొంది 'ఆంధ్రజన కేంద్ర సంఘం'గా రూపొందింది. అదయినా ఒక పరిమితమైన సంస్థే కాబట్టి నిజామాంధ్రుల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక వికాసానికి పాటుపడే ఒక విశాల వేదికను రూపొందించాలన్న ఆశయం ఇక్కడి విద్యావంతులైన పెద్దలకు కలిగింది. ప్రజల ఆశయాలకు, ఆదర్శాలకు, కోరికలకు దర్పణం పట్టగలిగే సంస్థగా దీన్ని తీర్చిదిద్దాలనే ఆశయంతో దానిపేరు 'నిజామ్ రాష్ట్ర ఆంధ్ర మహాసభ'గా మార్చాలనీ, 1930 లో మొదటి మహాసభ జోగిపేటలో జరపాలనీ అప్పటి నాయకులు నిర్ణయించారు. అనేక ప్రభుత్వ ప్రతిబంధకాలమధ్య 'నిజామ్ రాష్ట్ర ప్రథమాంధ్ర మహాసభ' జోగిపేటలో 1930 మార్చి 3 వ తేదీనాడు సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన 'ఆంధ్ర దేశపు మట్టి - అది మాకు కనకమ్ము' అనే ప్రబోధగీతంతో ఆరంభమై జయప్రదంగా జరిగింది. దీనితో బాటు శ్రీమతి నడింపల్లి సుందరమ్మగారి అధ్యక్షతన 'మొదటి మహిళా సభ'కూడా జరిగింది.

ఈ ప్రథమాంధ్ర మహాసభలో మొత్తం 32 తీర్మానాలను ఆమోదించారు. వాటిలో 1. వాక్ స్వాతంత్ర్యాన్ని అరికడుతున్న గస్తీ నిషాన్ (జి. వో. నెం. 53)ను రద్దు చేయడం. 2. నిర్బంధ ప్రాథమిక విద్యా విధానం అమలు జరపడం. 3. ప్రభుత్వేతర పాఠశాలల స్థాపన విషయంలో ఉన్న నిర్బం

ధాలను తొలగించడం. 4. స్టేట్ లైబ్రరీలో ప్రాంతీయ భాషలు ఏర్పాటు చేయడంవంటి తీర్మానాలు ముఖ్యమైనవి.

ఈ ఆంధ్ర మహాసభలో కాంగ్రెస్‌వాదులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు అందరూ కలిసి పనిచేశారు.

1930 నాటికి కాంగ్రెస్ సత్యాగ్రహం ప్రజోద్యమ స్వరూపం దాల్చింది. సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా దేశ వ్యాప్తంగా జరిగిన నిరసన ప్రదర్శనల ద్వారా ఉద్యమం ప్రజలను బాగా ఆకట్టుకుంది. దీని ప్రభావం ఆంధ్ర ప్రాంత ప్రజలపైన, నిజామాంధ్రులపైన కూడా పడింది.

కొన్ని ప్రాంతాల్లో కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమ ప్రభావంతో కాక పోయినా భూస్వాముల మీది కోపంతో రైతులు స్థానికంగా పోరాటాలను నిర్వ హించి సంచలనాన్ని సృష్టించారు.

1932-33 మధ్య కాలంలో అమ్మపాలెం (ఆనాటి వరంగల్ జిల్లా) భూస్వామి కాపూరి రాజేశ్వరరావుకూ, అక్కడి రైతులకూ మధ్య భూమి కోసం చాలా కాలం కోర్టులో కేసు నడిచింది. రైతులు కోర్టులో ఓడిపోయారు. డబ్బు నష్టపడి నిస్సహాయులైనారు. పట్టరాని కోపంతో భూస్వామిని చంపి, ముక్కలు ముక్కలు చేశారు.

1930 - 40ల మధ్య కాలంలో తెలంగాణాలోని అనేక ప్రాంతాల్లో భూస్వాముల పీడనకు వ్యతిరేకంగా, పన్నుల భారానికి నిరసనగా, వెట్టిచాకిరీ నిర్మూలన దిశగా రైతులు తిరుగుబాట్లు చేశారు. కొన్ని ప్రాంతాల్లో ప్రజావెల్లువ దానంతటదే వచ్చింది. మరికొన్ని ప్రాంతాల్లో 'ఆంధ్ర మహాసభ' పర్యవేక్ష ణలో నిబద్ధ నాయకత్వం నేతృత్వంలో క్రమబద్ధ పోరాట రూపాల ద్వారా సాగింది. కొన్ని ప్రాంతాల్లో శాంతియుత సత్యాగ్రహాల ద్వారా, మరికొన్ని ప్రాంతాల్లో కోర్టు కేసులవంటి లీగల్ పద్ధతుల ద్వారా, ఇంకా కొన్ని ప్రాంతాల్లో భూస్వాములను, వారి నమ్మకస్తులైన ఏజెంట్లను హత్య చేయడం వంటి అతివాద రూపాల ద్వారా రైతాంగ పోరాటాలు జరిగాయి. ఇవి ప్రజా పోరాటాలు. దీనిలో ప్రజల పాత్ర విశిష్టమైనది.

## యువజనులు, విద్యార్థుల కృషి

విద్యార్థుల్లో జాతీయోద్యమ భావాల వ్యాప్తికీ, సోషలిస్టు సిద్ధాంత ప్రచా రానికి 1936 లోనే లక్నోలో 'అఖిల భారత విద్యార్థి సమాఖ్య' ఆవిర్భవించింది. 1936 - 37 మధ్య కాలంలోనే హైదరాబాద్‌లో ఈ సంస్థ శాఖను ఏర్పాటు చేసే విషయమై ప్రముఖ ఉర్దూ పత్రికా రచయిత, సాహిత్య విమర్శకులు షిబ్లే-హసన్ ఒక సమావేశాన్ని ఏర్పాటు చేశారు. అందులో పాల్గొన్న అభ్యుదయ భావాలు గల

విద్యార్థుల కృషితో ఆబిడ్స్‌లో ఒక రీడింగ్‌రూం ప్రారంభమై, హైదరాబాద్ విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి పునాదులు వేసింది.

ఆ రోజుల్లో విద్యార్థుల కార్యక్రమాలపై అనేక ఆంక్షలుండేవి. ఉస్మానియా యూనివర్సిటీలో ఒక ప్రవర్తనా నియమావళి ఉండేది. అధికారుల అనుమతి లేకుండా ఏ రాజకీయ, సామాజిక, సాంస్కృతిక సంఘాలలో చేర కుండా, ఏ బహిరంగ వేదిక నుండి ప్రసంగాలు చేయకుండా నిషేధాలుండేవి.

పౌర హక్కుల అణచివేతకు వ్యతిరేకంగా ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థులు ప్రప్రథమంగా 1938 లో ప్రఖ్యాత 'వందే మాతరం' ఉద్యమాన్ని ప్రారంభించారు. ఇది క్రమంగా అన్ని హాస్టల్లకు, కళాశాలలకు వ్యాపించింది. ఆ ఉద్యమం ఉధృతిని గురించి అప్పటి ప్రభుత్వ గజెట్ (1939 జులై 22) ఇలా రాసింది: 'ఉస్మానియా యూనివర్సిటీకి చెందిన 850 మందితో సహా హైదరాబాద్‌కు చెందిన 1200 మంది హిందూ విద్యార్థులు, గుల్బర్గా ఇంటర్మీ డియట్ కాలేజీకి చెందిన 370 మంది, మహబూబ్‌నగర్ హైస్కూల్‌కి చెందిన 120 మంది, సిటీ కాలేజీకి చెందిన 70 మంది, వరంగల్, ఔరంగాబాద్, బీదర్, తదితర ప్రాంతాలకు చెందిన 350 మందికి పైగా విద్యార్థుల పేర్లను ఆయా సంస్థల హాజరు పట్టీలలో కొట్టివేశారు.'[1] వారిలో ఎక్కువ భాగం ఒక సంవత్సరం తమ విద్యాకాలం వృధా కాకుండా నాగపూర్ యూనివర్సిటీకి వలసపోవాల్సి వచ్చింది.

1939 మే, జూన్ మాసాల్లో 'వందేమాతరం విద్యార్థి సంఘం' నాగపూర్‌లో ఏర్పడింది. 1938 అక్టోబర్‌లో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభించింది. వీటివల్ల సంస్థానంలోని యువజన, విదార్థుల్లో నూతనోత్సాహం, రాజకీయ చైతన్యం పెంపొందసాగింది. 1939 చివరిమాసాల్లో 'కామ్రేడ్స్ అసోసియేషన్' పేరుతో ఒక యువజన సంస్థ ఏర్పడింది దాని ప్రారంభ సమావేశం 1939 డిసెంబర్ 13న హుష్మంత్‌గంజ్‌లోని మార్వారీ పాఠశాలలో జరిగింది 1939లో హైదరాబాద్ సంస్థానంలో 'భారత కమ్యూనిస్టు పార్టీ'పై నిషేధం ఉండింది. 1942 జూలైలో ఆ నిషేధాన్ని ఎత్తివేశాక 'హైదరాబాద్ కమ్యూనిస్టు పార్టీ' ఏర్పడింది. 1939-42 మధ్యకాలంలో'కామ్రేడ్స్ అసోసియేషన్' దాదాపుగా చట్టబద్ధ కమ్యూనిస్టు పార్టీ వేదికగా పనిచేసింది. 1941 జూన్ నెలలో హైదరాబాద్ సంస్థానంలోని విద్యార్థుల విశాల వేదిక 'ఆల్ హైదరాబాద్ స్టూడెంట్స్ యూనియన్' నిబంధనావళి విడుదలై, 1942 జనవరి

---

1. 'హైదరాబాద్ సంస్థానంలో రాజకీయ చైతన్యం'
—ఎస్.ఎమ్. జవాద్ రజ్వీ (పుట. 12, 13)

16 న దిని ప్రారంభ సమావేశం జరిగింది. నిజాం ప్రభుత్వ అణచివేత విధానా లకు వ్యతిరేకంగా పోరాడిన ఈ విద్యార్థి సంస్థలు తెలంగాణా గ్రామసీమల్లో రైతాంగ పోరాటాలను నిర్వహించగల నిబద్ధ నాయకులను తయారు చేశాయి.

## రైతాంగ పోరాటాలు

జేతవోలు మక్తాలో మక్తాదారు వసూలు చేస్తున్న అక్రమ పన్నులకు వ్యతి రేకంగా 1925-32ల మధ్యకాలంలో ఒక దఫా, 1934-35ల మధ్య కాలంలో రెండవ దఫాగా రైతులు తిరుగుబాట్లు చేశారు. అక్రమపన్నుల రద్దు, భూమిశిస్తు నిర్ణయం, సర్వే సెటిల్మెంట్, భూమిపై యాజమాన్యం, వెట్టిచాకిరీ రద్దు వంటి కోర్కెలతో 1938 నాటికి దాదాపు పది సంవత్సరాలపాటు కోర్టుల ద్వారా లీగల్ పోరాటాలను నడిపిన అక్కడి రైతాంగం 1940 నుండి కమ్యూనిస్టు పార్టీ నాయ కత్వాన తమ పోరాటాన్ని కొనసాగించింది. 1946లో 'కమ్యూనిస్టు పార్టీ' నాయ కత్వాన భూమి పంపకం జరగడంతో రైతాంగం విజయాన్ని సాధించింది.

నల్లగొండ జిల్లాలోని కొలనుపాకలో ఎంతో పలుకుబడి గల భూస్వామి నవాబు తరాబుయార్‌జంగ్ ప్రారంభించిన నిర్బంధ మతం మార్పిడికి వ్యతి రేకంగా ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, ఆరుట్ల రామచంద్రా రెడ్డిగార్ల నాయకత్వాన ప్రజలు తిరుగుబాటు చేసి, మహమ్మదీయ మతంలోకి మారిన వారిని తిరిగి హిందువులుగా మార్చారు.

పరిటాల జాగీర్‌లో జాగీర్దార్ ఏజెంట్‌ను అక్కడి రైతులు హత్య చేశారు. ఈ ఉదంతాన్ని గురించి శ్రీమాదిరాజు రామారావుగారు ఇలా వివరించారు - 'నవాబ్ కమాల్ యార్ జంగ్ తండ్రి ఖానా ఖానాన్‌గారి హయాంలో లంకా సుబ్బయ్యశాస్త్రి అనే వ్యక్తి వృద్ధుడైన నవాబు వద్ద పలుకుబడి సంపాదించి ఎట్టి అధికార హోదా లేకుండా, తరుచు ఈ గ్రామాలలో నిరంకుశ దమననీతి ద్వారా 7-8 సంవత్సరాలు నియంతగా వ్యవహరించి ప్రజలను పీడించినాడు. తత్ఫ లితంగా ప్రజలలో రాజకీయ చైతన్యం ప్రబలి, ఇతని నియంతృత్వాన్ని శాసనబద్ధంగా అణచడానికి సాముదాయిక ప్రయత్నాలు లెక్కకు మిక్కిలిగా జరిపారు. కానీ ఫలితం శూన్యమైనది. చివరికి ప్రజలు విసిగి వేసారి ఈయనను హత్యచేసినారు.'[1]

---

1. 'పరిటాల ప్రజా ఉద్యమం' (వ్యాసం) - శ్రీ మాదిరాజు రామారావు - దేశోద్ధారక గ్రంథమాలవారి 'తెలంగాణం' (వ్యాస సంకలనం) పుటలు 178-180.

కృష్ణాజిల్లాలో ఒక ప్రాంతమైన 'మునగాల' పరగణా జమీందారు నాయని రంగారావు, ప్రజలపై జరుపుతున్న దోపిడీ దౌర్జన్యాలకు వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన ప్రజలు వీరోచిత పోరాటాలు జరిపి, విజయాన్ని సాధించారు.

నల్లగొండ జిల్లాలోని మునుగోడులో రామిరెడ్డి అనే దేశ్‌ముఖ్ ఉండేవాడు. పెద్ద ఆస్తిపరుడు. గ్రామానికి పోలీసు పటేలు, పైరవీకార్ కూడా ఇతనే. గ్రామ ప్రజల్లో తగాదాలు సృష్టించి, కోర్టుల చుట్టూ తిప్పి, లంచాలిచ్చిన వారివైపు తీర్పు వచ్చేలాగా చూసేవాడు. ఇతని దాయాదుల్లో చాలామంది పేదలు, సాధారణ రైతులు. కుటుంబ పోషణ కోసం తమ ఇళ్ళల్లో రహస్యంగా సారాయిని తయారుచేసుకుంటున్న వాళ్ళ ఇళ్ళమీద ఈ రామిరెడ్డి ఎక్సైజ్ ఆఫీసర్లతో దాడి జరిపించాడు. స్త్రీలను అవమానించి, ఆడ, మగవాళ్ళందర్నీ హింసించేవాడు. దీనికి ప్రతీకారంగా ప్రజలు, దేశ్‌ముఖ్ దాయాదులు కలిసి దోమలపల్లి అనే గ్రామ శివారులో దేశ్‌ముఖ్‌ని ఆపి కొట్టి చంపారు.

ఆంధ్ర మహాసభ ఏర్పడిన నాటినుండి అతివాద, మితవాదులందరూ కలిసి పనిచేసేవారు. అయితే 1941 లో నల్లగొండలోని చిలుకూరులో జరిగిన ఏడవ ఆంధ్ర మహాసభకు రావి నారాయణరెడ్డిగారు అధ్యక్షత వహించారు. మహాసభ నాయకత్వం యువకుల హస్తగత మయ్యింది. రావి నారాయణరెడ్డి గారు అప్పటికే కమ్యూనిస్టు పార్టీ సభ్యుడు కావడంతో 'ఆంధ్ర మహాసభ'లో కమ్యూనిస్టుల ప్రాబల్యం పెరగసాగింది. ఇది రానురానూ 11 వ మహాసభ భువనగిరిలో జరిగేనాటికి మహాసభ వాతావరణమే పూర్తిగా మారిపోయింది. రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన ఈ సభలు కమ్యూనిస్టు జండాలతో నిండిపోయాయి.

## ఆంధ్రమహాసభ నాయకత్వం

1941 తర్వాత సూర్యాపేట తాలూకాలోని అనేక గ్రామాల్లో ఆంధ్రమహాసభ నాయకత్వాన రైతులు, కూలీలు, సామాన్య ప్రజలు ఉద్యమించారు.

ఎర్రపహాడ్ దేశ్‌ముఖ్ జన్నారెడ్డి ప్రతాపరెడ్డి, సూర్యాపేట దేశ్‌ముఖ్ కుందూరు లక్ష్మీకాంతరావు, వల్లభాపురం - దురాచపల్లి మక్తేదార్లకు వ్యతిరేకంగా ప్రజలు పోరాడారు.

భువనగిరి మహాసభ తర్వాత గ్రామ గ్రామాన 'సంఘం' పేరుతో 'ఆంధ్ర మహాసభ' విస్తరించింది. వెట్టిచాకిరి, నజరానాలకు వ్యతిరేకంగా; నిర్బంధ లెవీ వసూళ్ళకు వ్యతిరేకంగా; దొరల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడేందుకు 'సంఘం' నీడకింద ప్రజలు సమీకృతం కాసాగారు. సంస్థానమంతా తీవ్రమైన ఆందోళనలు, ప్రతిఘటన పోరాటాలు ప్రారంభమయ్యాయి.

వరంగల్లు జిల్లా జనగామ తాలూకాలో విసునూరి రామచంద్రారెడ్డి 40 ఊళ్ళకు దొర. పూస్కూరు రాఘవరావు, కటారి రామచంద్రరావు, నర్సింహా రావులాంటి దొరలకు నాయకుడు.

విసునూరు, కడివెండి, కామారెడ్డి గూడెం, దేవరుప్పల, ధర్మాపురం, ముంద్రాయి, శీతారామపురం వంటి గ్రామాల్లో 'సంఘం' బలపడటాన్ని సహించ లేని విసునూరి రామచంద్రారెడ్డి హత్యా రాజకీయాలతో సంఘాన్ని బలహీనపర చాలనుకున్నాడు.

కామారెడ్డి గూడెంలో 'షేక్ బందగీ' అనే మహమ్మదీయ రైతు యువకుడు విసునూరి రామచంద్రారెడ్డి బలపరుస్తున్న అబ్బసలీపై కోర్టులో విజయం సాధించి నందుకూ, ప్రజల్లో పలుకుబడి సంపాదిస్తున్నందుకూ ఆగ్రహించిన ఈ దేశ్‌ముఖ్ తన కిరాయిగుండాలతో బందగీని దారుణంగా హత్య చేయించాడు.

మొంద్రాయి గ్రామంలో కటారి రామచంద్రారావు సోదరుల భూమిని లంబాడీ రైతులు సాగుచేసుకుంటున్నారు. వారి కాలపరిమితి పూర్తయింది. రామచంద్రారావు సోదరులు రౌడీలను వెంట బెట్టుకుని ఆ భూమిని ఆక్రమించ డానికి వెళ్తే లంబాడి ప్రజలంతా ఏకమై ప్రతిఘటించారు.

పాలకుర్తి గ్రామంలో విసునూరి రామచంద్రారెడ్డి దౌర్జన్యాలకు ఎదురు తిరిగిన వీర వనిత చాకలి అయిలమ్మ. ఆమె భూమిని దౌర్జన్యంగా ఆక్రమించ డానికి ఆ దేశ్‌ముఖ్ పంపిన కిరాయి గుండాలకు వ్యతిరేకంగా ఆమె, ఆమెతో బాటు 'సంఘం' సభ్యులైన 18 మంది యువకులు కర్రలు పట్టుకుని నిలబడి తరిమిగొట్టారు.

ఇలా ఒక్కొక్క పరాజయంతో అవమానం పాలౌతున్న భూస్వాములు రెచ్చిపోయారు. తమ సొంత రౌడీలకు ఆయుధాలిచ్చి ఉద్యమాన్ని రక్తపుటేరుల్లో ముంచ దలిచారు. గ్రామాల మీదికి గూండాల గుంపులను పంపడం ప్రారంభిం చారు.

## దొడ్డి కొమరయ్య హత్య

విసునూరి దేశ్‌ముఖ్ ఆధిపత్యం కింద ఉన్న 'కడివెండి' గ్రామం మీదికి సాయుధ గూండాలు దాడిచేయ బోతున్నారన్న విషయాన్ని గమనించిన ప్రజలు 'సంఘం' ఆఫీసు ముందు సమీకృతమయ్యారు. ఎర్రజెండాలు చేతబట్టి జై జై నినాదాలతో ఊరేగింపు తీశారు ఊరేగింపు దేశ్‌ముఖ్ గడీముందు కొచ్చింది. గడీలో దాక్కుని ఉన్న సాయుధగూండాలు ఒక్క ఉదుటున బయట పడి ప్రజలపై కాల్పులు జరిపారు. ఊరేగింపు అగ్రభాగాన ఉన్న సంఘం నాయకుడు దొడ్డి కొమరయ్య పొట్టలో గుండు దూసుకుపోయింది. తెలంగాణా

తొలిపీరుడు దొడ్డి కొమరయ్య నేల కొరిగాడు. అనేకమంది గాయపడ్డారు. రెచ్చి పోయిన ప్రజలు గడీని చుట్టుముట్టారు. గుండాలు మెల్లగా జారుకున్నారు. చుట్టుపక్కల గ్రామాల ప్రజలు ఈ వార్త తెలిసీ తెలియగానే వేలసంఖ్యలో 'కడివెండి' చేరుకున్నారు. దానిలో భూస్వాముల గోదాములను, ప్రభుత్వ గోదాములను ధ్వంసం చేశారు. గడీని తగుల బెట్టటానికి ప్రజలు స్థిరపడ్డారు. అంతలో 60 మంది రిజర్వు పోలీసులు రంగ ప్రవేశం చేశారు. గూండాలపై, దేశ్‌ముఖ్‌పై చర్యలు తీసుకుంటామని ప్రజల్ని నమ్మించారు. ప్రజలు తిరుగుముఖంపట్టారు.

## ప్రత్యక్ష చర్య

కొమరయ్య హత్యతో తెలంగాణా నలువైపులా ప్రజలు పిడికిళ్ళు బిగించి లేచారు. ప్రజల సమర శంఖారావం ప్రతిధ్వనించింది. ఊరూరా సభలు - సమావేశాలు - ఊరేగింపులు - నిరసన ప్రదర్శనలు మొదలయ్యాయి. సుత్తి - కత్తి - కర్రలు - బరిసెలు - వడిసెలంతో సంఘం సభ్యులు ఎర్రజెండాను చేబూని ఒకో్క గ్రామానికి వెళ్ళి 'సంఘం' శాఖల్ని నెలకొల్పుతూ విప్లవ నినాదాలతో జైత్రయాత్ర చేశారు. భూస్వామ్య వ్యతిరేక పోరాటాల్లోకి గ్రామీణ స్త్రీ పురుషులు లక్షలాదిగా కదిలి వచ్చారు 'జాగీర్దారీ విధానం నశించాలి', 'పోలీసుల దౌర్జన్యం నశించాలి', 'కిరాయి గూండాల దౌర్జన్యం నశించాలి', 'విప్లవం వర్ధిల్లాలి' వంటి నినాదాలు నిద్రాణమైన తెలుగు జాతిని తట్టి లేపాయి. ఉద్యమోన్ముఖుల్ని చేశాయి.

ఉద్యమం కొత్త మలుపు తిరిగింది. జనగామ, సూర్యాపేట, హుజూర్‌నగర్ వంటి ప్రాంతాల్లో భూస్వాముల అక్రమ ఆక్రమణల్లో ఉన్న భూముల్ని ప్రజలాక్రమించుకోవడం మొదలయింది.

హుజూర్‌నగర్ తాలూకా బేతవోలు ప్రజలు అత్యంత కిరాతకుడైన తడకమల్ల సీతారామచంద్రరావుకు చెందిన 600 ఎకరాల భూమిని ఆక్రమించుకుని, గెట్లు పెట్టి పంచుకున్నారు.

నిజామ్ ప్రభుత్వం తన మూల స్తంభాలైన భూస్వాములను, జాగీర్‌దార్లను, ముక్తేదార్లను ప్రయోగించి 'ఆంధ్ర మహాసభ'ను అణచివేయడానికి, ఉప్పొంగే ప్రజల చైతన్యానికి అడ్డు కట్టలు వేయడానికి చేసిన అన్ని ప్రయత్నాలూ విఫలమయ్యాయి. ఇంకా పరిస్థితి చేయిదాటకముందే ఉద్యమాన్ని రక్తపుటేరుల్లో ముంచడానికి నిజామ్ ప్రభుత్వం పూనుకుంది.

1946 నవంబర్, డిసెంబర్ మాసాల్లో వందల సంఖ్యలో మిలటరీ దళాలను నిజాం నిరంకుశ ప్రభుత్వం గ్రామాలమీదికి పంపింది. బాలెముల, పాత సూర్యాపేట, దేవరుప్పల, కామారెడ్డి గూడెం, మల్లారెడ్డి గూడెంవంటి గ్రామాల్లో

ఉన్న ఆంధ్ర మహాసభ కేంద్రాలను మిలటరీ దళాలు చుట్టుముట్టి తుపాకులతో కాల్పులు ప్రారంభించాయి. ప్రజలు చేతికి దొరికిన ఆయుధాలతో ప్రతిఘటించారు. అనేకమంది నాయకులు నేలకొరిగారు. గత్యంతరం లేక ప్రజలు వెనక్కు తగ్గారు. వందలాది ఆంధ్ర మహాసభ కార్యకర్తల్ని అరెస్టు చేసి ప్రభుత్వం జైళ్ళకు పంపింది.

మల్లారెడ్డి గూడెంమీద 29 డిసెంబర్ 1946 నాడు వందలాది మిలటరీవారు దాడి చేశారు. ప్రజలు అంతకంటే ఎక్కువ సంఖ్యలో సమీకృతులై వడిసెలలు విసరసాగారు. ఉదయం 6-00 గంటలనుండి 11-00 గంటలవరకు పోరాటం సాగుతూనే ఉంది. చివరకు నాయకులతో సంప్రదించాలనే ప్రకటనతో ప్రజల్ని మభ్యపెట్టి ఊళ్ళోకి ప్రవేశించిన మిలటరీ దళాలు ముందుకొచ్చిన నాయకులు అప్పిరెడ్డి, నర్సిరెడ్డిలను కాల్చి చంపారు. ఈ పోరాటంలో ముగ్గురు స్త్రీలు, ముగ్గురు పురుషులు మొత్తం ఆరుగురు నేలకొరిగారు. మిలటరీ ఆయుధాల ముందు ప్రజల లాఠీలు, వడిసెలలు నిలవలేదు. వందలాది మందిని మిలటరీ వారు అరెస్టు చేసి జైళ్ళకు పంపారు.

## భారత స్వాతంత్ర్య ప్రకటన

దేశవ్యాప్తంగా జరిగిన సమ్మెలు-సత్యాగ్రహాలు - సాయుధ తిరుగుబాట్లు వంటి అనేక పోరాటాలతో విసిగిపోయిన బ్రిటిష్ ప్రభుత్వం 1947 ఆగష్టు 15న దేశానికి స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. దీంతోబాటు విశాల భరతావనిని రెండుగా చీల్చి ఇండియా, పాకిస్తాన్‌లుగా విభజించింది. దేశంలోని సంస్థానాధిపతులు విశాలభారతంలో చేరవచ్చు, స్వతంత్ర దేశాలుగానైనా కొనసాగవచ్చునే స్వేచ్ఛను ప్రకటించింది.

అన్ని సంస్థానాలు ఇండియన్ యూనియన్‌లో చేరడానికి అంగీకరించినా, కాశ్మీర్, నిజాం సంస్థానాలు మాత్రం ఇండియన్ యూనియన్‌లో చేరడానికి నిరాకరించాయి.

నిజామ్ నవాబు 'హైదరాబాదు సంస్థానం స్వతంత్ర దేశంగా ఉంటుందని' ప్రకటించాడు.

దేశ వ్యాపితంగా ప్రజలు ఆనందోత్సాహాలు జరుపుకుంటూ ఉంటే, హైదరాబాద్ సంస్థాన ప్రజలు స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం తుది సమరం జరపవలసి వచ్చింది.

ప్రజల స్వాతంత్ర్యాన్ని నిజామ్ నవాబు నిరాకరించాడు. భారత జాతీయ జెండాను నిషేధించాడు.

సంస్థాన ప్రజలు దీన్నొక సవాలుగా తీసుకున్నారు. 'హైదరాబాద్ సంస్థానం ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలి' అనే నినాదం ప్రజల సమైక్య సమర నాదమయింది. అన్ని రాజకీయ పార్టీలు ఈ నినాదాన్ని రణన్నినాదం చేశాయి. ఆంధ్ర మహాసభ ఉద్యమాలతో చైతన్యవంతమై ఉన్న ప్రజలు ఉవ్వెత్తున లేచారు. ప్రభుత్వ అధిపత్యం కిందఉన్న తాటిచెట్లను నరికారు. సంస్థాన సరిహద్దులో ఉన్న కస్టమ్స్ చౌకీలను ధ్వంసం చేశారు. గ్రామాధికార్ల రికార్డ్‌లు స్వాధీనం చేసుకోసాగారు. గ్రామ గ్రామాన జాతీయ జెండాను ఎగ రేశారు. ఈ ప్రజా వెల్లువను కేవలం పోలీసులతో అణచలేని నిజామ్ ప్రభుత్వం 'కాశిం రజ్వీ' నాయకత్వాన పనిచేస్తున్న 'మజ్లిస్ ఇత్తెహాదుల్ ముసల్మీన్' కార్యకర్తలైన 'రజాకార్ల'ను గ్రామాలపై ఉసిగొల్పింది. సాయుధులైన రజా కార్లు, నిజాం పోలీసులు గ్రామాలలో క్యాంపులు పెట్టారు. అనేక గ్రామాల మీద అమానుషమైన దాడులు, పాశవిక మానభంగాలు, ఆస్తులు దోచుకోవడం, ఊళ్ళు తగులబెట్టడం మొదలుపెట్టారు.

## సాయుధ పోరాటం

తెలంగాణా సంస్థానంలోని ప్రజల మాన, ప్రాణాలను కాపాడేందుకు; నిజామ్ సైన్యాలను, రజాకర్ మూకలను ఎదిరించేందుకు 'సాయుధ ప్రతిఘటనే ఏకైక మార్గమని' అన్ని పార్టీలూ, ప్రజలు అభిప్రాయపడ్డారు.

"సెప్టెంబర్ 1947 న 'ఆంధ్రమహాసభ' 'కమ్యూనిస్టు పార్టీ'లు సాయుధ పోరాటానికి పిలుపు నిచ్చాయి. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ముఖ్దుం మోహియుద్దీన్‌లు తమ సంయుక్త ప్రకటనలో ఈ చారిత్రాత్మకమైన పిలుపు నిచ్చారు. ఈ దిగువ పేర్కొన్న కార్యక్రమాన్ని ప్రకటించారు.

1. నిజాం ప్రభుత్వాన్ని కూలద్రోయుటకు సాయుధ పోరాటం సాగించాలి.

2. సాయుధ పోరాటాల నిర్వహణకై సాయుధ పోరాట శిక్షణా తరగతులు నిర్వహించాలి.

3. భూస్వాముల స్వాధీనంలో ఉన్న ఆయుధాలను, శత్రు శిబిరాలలో ఉన్న ఆయుధాలను, ఆ శిబిరాలపై దాడులు జరిపి స్వాధీనం చేసుకోవాలి.

4. నైజాం ప్రభుత్వ కార్యకలాపాలను స్థంభింపజేయాలి. ప్రభుత్వ రికార్డులను స్వాధీనపరచుకుని తగులబెట్టాలి.

5. నైజాం ప్రభుత్వానికి భూమిశిస్తు, లెవీధాన్యం ఇవ్వడానికి నిరాక రించాలి.

6. తాటిచెట్ల నుండి కల్లు గీయకుండా, కల్లు అమ్మబడకుండా చూడాలి.

7. నైజాం ప్రభుత్వంతో చేతులు కలిపి పనిచేసే భూస్వామ్య శక్తులను శత్రువులుగా పరిగణించి వారి స్థిర చరాస్తులను స్వాధీనపరచుకోవాలి.

8. నైజాం వ్యతిరేక పోరాటంలో కలిసివస్తున్న భూస్వాములకు 200 ఎకరాల మెట్ట, 10 ఎకరాల తరి వారి స్వంతసేద్యానికి వదిలి; మిగిలిన భూమిని నిరుపేదలకు, వ్యవసాయ కార్మికులకు పంపకం చేయాలి.

9. ప్రభుత్వ బంజరు భూములను, వ్యవసాయ యోగమైన అటవీభూములను పంపకం చేయాలి.

10 భూస్వాములు, వడ్డీ వ్యాపారులచేత ఆక్రమింపబడిన అన్యాక్రాంతాలను పునరాక్రమించుకుని, వాటి యజమానులకు తిరిగి స్వాధీన పరచాలి.

11. ప్రభుత్వ ఆఫీసులను, కోర్టులను, పాఠశాలలను, కాలేజీలను బహిష్కరించాలి.

12. భూస్వాములు, వడ్డీ వ్యాపారస్థులు నాగులపై ఇచ్చిన ధాన్యాన్ని, నగదును చెల్లించ నిరాకరించాలి.

13. నైజాం సరిహద్దుల్లో ఉండే కస్టమ్స్ - అవుట్‌పోస్ట్‌లను ధ్వంసం చేయాలి.

14. వ్యవసాయ కార్మికుల జీతాలు పెంచాలి.

15. జాగీర్‌దార్లకు స్వంత సేద్యంలో ఉన్న భూములను స్వాధీనపరుచుకుని, వారికి పన్ను చెల్లించడం నిరాకరించాలి.

16. ప్రభుత్వ ఆజ్ఞలను ధిక్కరించి గ్రామ - గ్రామాన జాతీయ జెండా, కమ్యూనిస్టు పార్టీ జెండా రెండింటినీ ఆవిష్కరించాలి.

ఈ ప్రకటన కార్యక్రమాన్ని ఆధారం చేసుకుని నైజామ్ నవాబుకు వ్యతిరేకంగా తెలంగాణా ప్రజల సాయుధ పోరాటం ప్రారంభమయింది."[1]

ప్రజా కమిటీలు, సాయుధ గెరిల్లాదళాలు ఏర్పడ్డాయి.

తెలంగాణాలో కమ్యూనిస్టు ఉద్యమం ప్రారంభమైన నాటినుండి ఆంధ్ర ప్రాంత కమిటీ తెలంగాణా కమ్యూనిస్టు పార్టీ శాఖతో సన్నిహిత సంబంధాలు ఏర్పరచుకుంది. తెలంగాణా పోరాటం ప్రారంభం కావడంతో రెండు శాఖలు దాదాపు ఒకటిగానే వ్యవహరించాయి ఆంధ్ర ప్రాంతం వాస్తవానికి తెలంగాణా పోరాటానికి సరఫరా స్థావరంగా రూపొందింది. ఉద్యమాన్ని విస్తృతం చేయడానికి, తర్వాత సాయుధ పోరాటం నిర్వహించడానికి ఆంధ్ర ప్రాంతంనుండి

---

1. 'రక్తాక్షరాల్లో చరిత్ర నిర్మించిన వీర తెలంగాణా' (వ్యాసం)
—రావి నారాయణరెడ్డి, విశాలాంధ్ర, 2-11-1987 (పుట : 5.)

ప్రముఖ కేడర్లు అనేకమంది వచ్చారు. అదే విధంగా మరట్వాడ కమ్యూనిస్టు పార్టీ యూనిట్‌నుండికూడా మహారాష్ట్ర సరిహద్దువ్వారా సాయం వచ్చింది.[1]

గ్రామగ్రామాన గెరిల్లా దళా లేర్పడ్డాయి. దాదాపు నాలుగు వేల మంది దళసభ్యులు సమీకృతమయ్యారు. గ్రామ రక్షక దళా లేర్పడ్డాయి. కొన్ని విధ్వంసక దళాలుకూడా నిర్మితమయ్యాయి.

మరోవైపు గ్రామాలపై రజాకర్ల దాడులు, పోలీసుల దాడులు అధిక మయ్యాయి. ప్రజలను కాల్చి చంపడం, స్త్రీలను అవమానపరచడం, ఆస్తులను దోచుకోవడం, గ్రామాలను తగులబెట్టడం ఎక్కువయింది.

దానితో రెచ్చిపోయిన జనం ఎదురు దాడి చేయడం మొదలుపెట్టారు. ఆయుధాలను సేకరించారు. భూస్వాముల వద్ద లైసెన్స్‌లతో ఉన్న ఆధునిక ఆయుధాలను స్వాధీనం చేసుకున్నారు. శత్రుసైన్యాలవారికి లంచాలిచ్చి ఆయుధాలను కొన్నారు. రాష్ట్రం బయటినుండి కూడా ప్రజలకు ఆయుధాలు అందాయి. సాయుధ గెరిల్లా పోరాటం సంస్థానమంతా విస్తరించింది. గ్రామాల్లో దోపిడి సాగించడానికి నిజామ్ - మజ్లిస్ రజాకార్ల గూండాలు వెళుతున్నప్పుడు అనేక ప్రాంతాల్లో సాయుధ గెరిల్లా దళాలు శక్తివంతంగా తిప్పికొట్టసాగాయి. అనేక చోట్ల వారి ఆయుధాలను లాక్కొని, వాళ్ళను తరిమిగొట్టారు. కస్టమ్స్ - ఔట్ పోస్టులు ధ్వంసమయ్యాయి నిజామ్ సాయుధ దళాల రవాణాను అడ్డుకొట్టడానికి రోడ్లను తవ్వే విధ్వంస కార్యక్రమంలో వేలాది ప్రజలు పాల్గొన్నారు. గెరిల్లా దళాలకు కావలసిన ఆహారం, ఆశ్రయం ప్రజలు కల్పిస్తూ, శత్రువు కదలికను గురించి సమాచార మందించేవారు.

ప్రజలపై అమానుషమైన దారుణాలు సాగించే నిజామ్ దళాలకు సహాయం చేసిన భూస్వాములకు, వారి ఏజెంట్లకు ప్రజలు తగిన బుద్ధి చెప్పారు. కొందరిని చంపివేశారు. మరికొందర్ని ప్రజాకోర్టుల ద్వారా శిక్షించారు. భూస్వాములనేక మంది ప్రాణభీతితో పల్లెలొదిలి పట్టణాలకు పరిగెత్తారు.

## విముక్తి

ఈ పోరాటం వల్ల నల్లగొండ, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలకు చెందిన దాదాపు 3 వేల గ్రామాలు భూస్వాముల పీడన నుండి విముక్త మయ్యాయి. ప్రభుత్వ ఉద్యోగులు, భూస్వాములందరూ గ్రామాలొదిలి పారి పోయారు. నిజామ్ రాజరికం నేలమట్టమయింది. గెరిల్లా దళాలు ఈ గ్రామాల్లో గ్రామపంచాయతీ లేర్పరచి గ్రామ స్వరాజ్యాన్ని స్థాపించారు. నిజామ్ వ్యతిరేక

---

1. ఉజ్వల ఇతిహాసం తెలంగాణా సాయుధ పోరాటం (వ్యాసం)
—చంద్ర రాజేశ్వరరావు, విశాలాంధ్ర, 2-11-1987.

పోరాటంలో కలిసివచ్చిన గ్రూపులన్నింటితో గ్రామ కమిటీ లేర్పడ్డాయి. గ్రామంలో వచ్చే తగాదాలన్నింటినీ ఈ కమిటీలు పరిష్కరించేవి.

వెట్టిచాకిరి-పన్నుల రద్దు, ధాన్యం పంపకాలతో ప్రారంభమైన ఉద్యమం భూమి పంపకందాకా అభివృద్ధి చెందింది. లక్షల ఎకరాల బంజర్లు, బంచరాయిలు ప్రజలు విస్తృతంగా పంచుకున్నారు. భూస్వాములు అప్పుల పేరుతో, తప్పుడు లెక్కలతో దౌర్జన్యంగా ఆక్రమించుకున్న భూములన్నీ ప్రజలు పంచుకున్నారు.

భూస్వాముల భూములకు సీలింగ్ కూడా పెట్టారు. ఆపైన ఉన్న భూములను ప్రజలు పంచుకున్నారు. బంజరు భూములు కాకుండానే - కౌలు భూములు, అన్యాక్రాంతం భూములు, సీలింగ్ పెట్టి పంచుకున్న భూములే దాదాపు 10 లక్షల ఎకరాలున్నాయి.

ఈ భూములు ప్రధానంగా వ్యవసాయ కూలీలకు, పేద, మధ్యతరగతి రైతులకు పంచారు. భూస్వాముల అధీనంలో ఉన్న పశువులు, వ్యవసాయ పనిముట్లు కూడా ప్రజలకు పంచారు. శత్రుపక్షంలో చేరిన భూస్వాముల భూములు ఎలాంటి మినహాయింపులు లేకుండా ప్రజలకు పంచారు. జమీందార్లు, భూస్వాములు, షావుకార్లు, వడ్డీవ్యాపారస్తులు పెట్టిన అప్పులన్నీ రద్దు చేయబడ్డాయి. దేశముఖుల, భూస్వాముల, ప్రజా విద్రోహుల ధాన్యం వేల పుట్లలో ప్రజలకు పంచి పెట్టారు.

వ్యవసాయ కార్మికుల కూలిరేట్లు పెంచారు. గ్రామాల్లో భూమిశిస్తు రద్దు చేయబడింది. అనేక గ్రామాల్లో ప్రజలే స్వయంగా ఏటి కాల్వలు, చిన్న కుంటలు, పంట కాల్వలు తవ్వుకున్నారు. గీత పారిశ్రామిక కార్మికులు తాటిచెట్లు ఉచితంగా గీచుకోడానికి అవకాశం కల్పించబడింది. వైద్య సదుపాయం, వైద్య విజ్ఞానం విరివిగా కలిగించబడింది. ముఖ్యంగా కలరా వచ్చినప్పుడు గ్రామాల్లో కలరా నిరోధకమందులు ఉచితంగా పంచారు.

ప్రభుత్వ అడవులనుండి రైతుల వ్యవసాయ పనిముట్లకవసరమైన కర్ర సామాను ఉచితంగా లభ్యమయింది.

స్త్రీలకు విడాకుల హక్కు గుర్తించబడి, అవసరమయినప్పుడు అమలు జరిగింది.

ఈ మహోద్యమంలో అస్పృశ్యత నిర్మూలించబడింది. మూఢాచారాలు తగ్గాయి.

ప్రజలలో రాజకీయ ప్రచారం, వైజ్ఞానిక ప్రచారం పెద్ద ఎత్తున సాగాయి. రాత్రి పాఠశాలలు విరివిగా నెలకొల్పబడ్డాయి. అనేకమంది నిరక్షరాస్యులు అక్షరాస్యులయ్యారు. విజ్ఞాన వంతులయ్యారు.

సామాన్య ప్రజలనుండి ఎందరో ఉద్యమ కవులు ఉద్భవించారు. నిరక్ష రాస్యులు కూడా పోరాటానుభవాలతో ఉత్తేజకరమైన గీతాలు రాశారు; పాడారు. సుద్దాల హనుమంతు, యాదగిరి, తిరునగరి రామాంజనేయులు, కాళోజీ, దాశరథిగార్ల గీతాలు ప్రజల సమరాగ్ని సంకేతాలయ్యాయి. ప్రజల గుండెల్లో ప్రతిధ్వనించసాగాయి.

## పోలీసు చర్య

నిజామ్ సంస్థానం 'ఇండియన్ యూనియన్‌లో విలీనం కావాలి' అన్న ప్రజల కోర్కెకు ప్రతిబింబంగా సాగిన పోరాటానికి పర్యవసానంగానూ, స్టేట్ కాంగ్రెస్ పార్టీవారి సత్యాగ్రహాల స్వాగతాల ఫలితంగానూ 1948 సెప్టెంబర్ 13న భారత సైన్యాలు మేజర్ జనరల్ జయంత్‌నాథ్ చౌదరి నాయకత్వాన హైదరబాద్ సంస్థానంలోకి ప్రవేశించాయి. 25,000 మంది భారత సైనికులు 170 షర్మన్ టాంకులతో షోలాపూర్, విజయవాడ మొదలైన దిశలనుండి సంస్థానంలోకి అడుగుబెట్టాయి. సెప్టెంబర్ 13న జరిగిన మొదటి రోజు పోరాటంలో 7 గురు యూనియన్ సైనికులు మరణించగా, 632 మంది నిజామ్ సైనికులు హతులయ్యారు. 200 మంది పట్టుబడ్డారు. అక్కడక్కడా ఎదుర్కొన్న రజాకార్లలో 1200 మంది చనిపోగా 450 మంది బంధింపబడ్డారు. సెప్టెంబర్ 18 నాటి సాయంత్రం 5-00 గంటలకు నిజామ్ హైదరాబాద్ రేడియో ద్వారా యుద్ధ విరమణను ప్రకటించి, భారత సైన్యాలకు లొంగిపోయాడు. రజాకార్ల నాయకుడు ఖాసిం రజ్వీని భారతప్రభుత్వానికి అప్పగించాడు. భారత ప్రజలు ఈ విజయానికి స్వాగతం పలికారు. సంస్థానంలోని ప్రజలు పండుగలు జరుపుకున్నారు.

## సాయుధపోరాటం అణచివేత

నిజామ్ ప్రభుత్వాన్ని 'ఇండియన్ యూనియన్'లో విలీనం చేయగానే యూనియన్ సైన్యం వెనుదిరిగి పోలేదు. ఇక్కడి కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన కొనసాగుతున్న ప్రజల పోరాటాన్ని అణచివేయడం ప్రారంభించింది.

నిజాం పాలన అంతం కాగానే భారత ప్రభుత్వం సంస్థానంలో ప్రజాతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించలేదు. 1952 సాధారణ ఎన్నికలు జరిగేవరకు తన అధికారుల ద్వారా, ఉద్యోగుల ద్వారానే సంస్థానాన్ని పరిపాలించింది. స్టేట్ కాంగ్రెస్ నాయకత్వంపై అటు కేంద్రప్రభుత్వానికీ, ఇటు ప్రజలకు విశ్వాసం లేకపోవడం వల్ల ఇలా జరిగింది. 1948-51 మధ్యకాలంలో సాయుధ పోరాటాన్ని అణచడానికి భారతప్రభుత్వం 50 వేలమంది సైనికుల్ని, సాయుధ పోలీసు బలగాల్ని, మోటారు రవాణా వాహనాలతో సహా దేశంలోని అనేక రాష్ట్రాల నుండి

సమీకరించి సంస్థాన ప్రజల మీదికి పంపింది గెరిల్లా పోరాటం జరుగుతున్న ప్రాంతాల్లో సైనిక శిబిరాలను ఏర్పాటుచేసి, వైర్లెస్ సమాచార కేంద్రాలను నెలకొల్పింది. అన్ని జిల్లా, తహసీల్ కేంద్రాల మధ్య టెలిఫోన్, టెలిగ్రాఫ్ సంబంధాలను ఏర్పరిచింది.

యూనియన్ సైన్యం కనబడ్డ కమ్యూనిస్టునల్లా కాల్చి చంపింది. జైళ్లలో కుక్కింది. చిత్రహింసలు పెట్టింది. తెలంగాణా గ్రామాల్లో ఆనాడు నైజాం బంట్లుగా ఉన్న జాగిర్దార్లు, మక్తాదార్లు నిజాం కాలపు కుచ్చుటోపీ లొదిలి, ఖద్దరు టోపీలతో గ్రామాల్లో ప్రత్యక్షమయ్యారు. గ్రామప్రజలు తరిమి గొట్టిన భూస్వాములంతా యూనియన్ సైన్యం అండదండలతో గ్రామాల్లోకి ప్రవేశించి కమ్యూనిస్టులను కాల్చి చంపారు.

'నిజాం వ్యతిరేక సాయుధ పోరాట కాలంలో రెండువేల మంది కమ్యూనిస్టులు, వారి అభిమానులు మరణిస్తే, కాంగ్రెస్ మిలటరీ పాలన కాలంలో మరో రెండువేల మంది అసువులు బాశారు. ఇంత రక్తతర్పణ, ఇన్నివేల మంది ఆత్మార్పణ జరిగిన ఘట్టం భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామంలో మరొకటి లేదని ఘంటాపథంగా చెప్పవచ్చు.'[1]

రజాకార్లను మించిన దాడులు, చిత్రహింసలు యూనియన్ సైన్యం కొనసాగించింది. కనీవినీ ఎరుగని నిర్బంధ విధానాలు కొనసాగించింది. గెరిల్లా దళాలకు అన్నం పెట్టినవారిని, రక్షణ కల్పించినవారిని, వార్తలందజేసిన కొరియర్లను, బిడ్డలను ఆశీర్వదించి పంపిన తల్లిదండ్రులను, భూస్వాముల భూములను పంచుకున్న పేద రైతులను యూనియన్ సైనికులు, కేంద్ర రిజర్వు దళాలు చింత బరిసెలతో కొట్టారు. చెట్లకు వేలాడదీసారు. గోళ్ళలో గుండు సూదులు గుచ్చారు. లాగుల్లో తొండలను వదిలారు. బెల్లం మడ్డిపూసి చీమల పుట్టల మీద పడుకోబెట్టారు. నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపారు. జైళ్ళకు పంపారు. కాన్సెంట్రేషన్ క్యాంపులు బెట్టారు. వందలాది గ్రామాలను తగులబెట్టారు.

## మారిన రాజకీయ పరిస్థితి

సంస్థానంలో పోలీస్ చర్య ప్రారంభమయ్యాక క్రమంగా ఇక్కడి రాజకీయ పరిస్థితి మారసాగింది.

పోరాట కాలంలో నిజాం వ్యతిరేక ఐక్య సంఘటనగా కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీ తదితర రాజకీయ శక్తులు రూపొందకపోయినప్పటికీ ఈ శక్తులన్నీ

---

1. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఏర్పాటుకు దారితీసిన మహత్తర ఉద్యమం (వ్యాసం)-శ్రీ నల్లమల గిరిప్రసాద్, విశాలాంధ్ర, 2-11-87 (పేజీ.8).

నిజాంకు వ్యతిరేకంగా తమకు తోచిన పద్ధతిలో పోరాడారు. ప్రజలంతా ఐక్యంగా ఉన్నారు. సాయుధ పోరాటాన్ని బలపరచడమో, లేదా సానుభూతి ప్రదర్శించడమో చేసేవారు. నిజాం దళాలు, రజాకారు గూండాలు తమను ఒకవైపున ఊచకోత కోస్తుంటే, తమ నాయకులు నిజాంతో రాజీకై సాగిస్తున్న ప్రయత్నాలవల్ల కాంగ్రెస్‌ను అనుసరిస్తున్న ప్రజానీకం ఆ పార్టీపై ఆగ్రహం ప్రదర్శించేది. పోలీస్ చర్య తర్వాత పరిస్థితి మౌలికంగా మారింది.

పట్టణాలలో సాధారణ ప్రజానీకం, సాయుధ పోరాటం జరగని ప్రాంతాలలోని ప్రజానీకం, మొత్తం మీద కాంగ్రెస్‌ను బలపరిచేవారు. రైతాంగంలోని పై వర్గం వారు సాయుధ పోరాటం జరుగుతున్న ప్రాంతాలలో సైతం కాంగ్రెస్ వైపు చేరారు. నిజాం నిరంకుశ పాలన అంతమైనందుకు ప్రజలు మొత్తం మీద హర్షం వెలిబుచ్చారు. తన వాగ్దానాలు అమలు జరపటానికి కాంగ్రెస్‌కు ఒక అవకాశం ఇవ్వాలని వారు అనుకున్నారు. సంస్థానంలో సాయుధ పోరాటం కొనసాగించడం పట్ల దేశ ప్రజలు సానుభూతి ప్రదర్శించే స్థితిలో లేరు.

## పోరాట విరమణ

ఒక వైపు గెరిల్లా దళాలపైన, అమాయక ప్రజలపైన యూనియన్ సైన్యాల, రిజర్వ్ పోలీసుల అమానుష దౌర్జన్యకాండను; మరోవైపు మారుతున్న రాజకీయ పరిస్థితులను అధ్యయనం చేసిన కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం, అనేక తర్జన భర్జనల తరువాత, చర్చల తరువాత 1951 అక్టోబర్ చివరి వారంలో సాయుధ పోరాటాన్ని విరమిస్తున్నట్లు ప్రకటించింది.

ఇన్ని మలుపులు తిరిగి, ఇంత విశిష్టమైన చరిత్రను సృష్టించుకున్న తెలంగాణా సాయుధ పోరాటంలో ప్రధానంగా నాలుగు దశలు కనబడుతున్నాయి.

1. ప్రారంభ దశ (1921 - 30)

దేశాభిమాన చైతన్యం, వివిధ సంఘాల నిర్మాణం, ప్రజలను సమీకరించడానికి జరిగిన కృషి ఈ దశలో ప్రధానమైనది.

2. భూస్వామ్య నిరసన (1930 - 46)

అనేక గ్రామాల్లో భూస్వామ్య పీడనకు, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ప్రజలు పోరాట శీలాన్ని ప్రదర్శించిన దశ ఇది.

3. నిజాం ప్రభుత్వంపై వ్యతిరేకత (1946 - 48)

ఒకవైపు భూస్వాముల దౌర్జన్యాలను ప్రతిఘటిస్తూనే; మరోవైపు భూస్వాములకు, రజాకారు గూండాలకు అండగా నిలిచిన రాజరిక నిజాం నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా 'ఆంధ్ర మహాసభ' నాయకత్వాన ప్రజలు తిరుగు

బాట్లను తీవ్రతరం చేశారు. శత్రువులెవరో తెలుసుకుని, సమరశీల సంఘటిత పోరాటాలు నిర్వహించారు.

4. సాయుధ పోరాటం (1948 - 51)

భూస్వామ్య వ్యవస్థపై తిరుగుబాటుగా ప్రారంభమైన పోరాటం పీడిత ప్రజల రాజ్య నిర్మాణాకాంక్షతో కొత్త మలుపు తిరిగింది. నిజాం రాజరిక పతనంతో ఆగక, యూనియన్ సైన్యాల పాశవిక దాడులకు ఎదురు నిలిచింది. గ్రామాలను విముక్తం చేసింది. వెట్టిచాకిరిని రద్దు చేసింది. దున్నేవాడికి భూమిని పంచింది. పాలక వర్గాలపై ఎదురుతిరిగి పోరాడే సమర మార్గాన్ని చూపింది. తెలుగుజాతి ప్రతిఘటన చైతన్యాన్ని ప్రపంచానికి చాటింది.

సాహిత్యాన్ని, కళారూపాలను ప్రభావితంచేసి ప్రజల పోరాట సంస్కృతిని రూపొందించే పథ నిర్దేశం చేసింది.

# 7

# తెలంగాణా సాయుధ పోరాట గీతాలు

చారిత్రాత్మక తెలంగాణా సాయుధ పోరాటంలోకి గ్రామీణ ప్రజానీకాన్ని సమీకరించడానికి సాహిత్య ప్రక్రియలు, జానపద కళారూపాలు ఇతోధికంగా తోడ్పడినాయి. ప్రజల నుండే కవులు, గాయకులు, నటీనటులు, బుర్రకథకులు, ఒగ్గుకథకులు, గొల్లసుద్దులవాళ్ళు పుట్టారు. ఆయా సందర్భాలకు అనువైన కళారూపాలను సృష్టించుకుని ప్రజలమధ్య ప్రదర్శించారు. ప్రజలు కదిలారు. లాఠీలనూ, తూటాలనూ ఎదిరించారు. ప్రజాపోరాటాలు ఈ ఉద్యమ కవులను ఉత్తేజపరిచాయి. మరిన్ని పోరాట గీతాలు పుట్టాయి. ప్రజలు పాడుకున్నారు. పాడుతూ పోరాడారు. ఈ పోరాట పాటలను ప్రజలు సొంతం చేసుకున్నారు.

అనేక కారణాలవల్ల పోరాట విరమణ జరిగింది. పోరాట యోధులు చెట్టుకొకరు, పుట్టకొకరు అయ్యారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో, ఓట్ల కాటులాటలో దాదాపు అన్ని రాజకీయ పార్టీలు కూరుకుపోయాయి. పోరాట కాలంలో ప్రజలను ఉద్రూతలూగించిన ఉద్యమగీతాలు క్రమంగా కనుమరుగయినాయి; వినుమరుగయినాయి. అయినా ప్రజల గుండెల్లో మాత్రం గూళ్ళు కట్టుకుని స్మృతిచిహ్నాలుగా మిగిలాయి.

సాయుధ పోరాట విరమణ జరిగిన తొలిరోజుల్లోనే, ఆనాటి గీతాలను సమీకరించడానికి ఏ వ్యక్తయినా, సంస్థయినా పూనుకుని ఉంటే చాలావరకు దొరికేవి. అలా జరగలేదు. పోరాటం కొనసాగించాలా? విరమించాలా?? పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అనుసరణీయమా??? నిరాకరణీయమా????— మొదలైన వాదోపవాదాలతో, సైద్ధాంతిక చర్చలతో చాలాకాలం గడిచిపోయింది ఈ తర్జనభర్జనల పర్యవసానంగా వామపక్ష ఉద్యమం నిలువునా చీలిపోయింది. ఆ తరువాత మరికొన్ని చీలికలతో ముక్కచెక్కలయింది. బలహీనపడింది. విమర్శలు, ఆత్మవిమర్శలు, పరిశీలనలు ప్రారంభమయ్యాయి.

ఇలా జరగాల్సిందంతా జరిగిపోయాక తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంపైన, పోరాట సాహిత్యంపైన పరిశోధనలు ప్రారంభమయ్యాయి. వేలాది గీతాలు కాలగర్భంలో కలిసిపోగా, మిగిలినవి కొన్ని మనకు దొరుకుతున్నాయి. ఆనాటి చరిత్రకు అద్దం పడుతున్నాయి.

1978 డిసెంబర్‌లో మొట్టమొదటిసారిగా విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ 'తెలంగాణా పోరాట గేయాలు' వెలువరించింది. ఆ తరువాత విప్లవ రచయితల సంఘం తెలంగాణా పోరాట గీతాలను ప్రచురించింది. అలాగే సాహితీ సర్కిల్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ విడివిడిగా 'సుద్దాల హనుమంతు పాటలు' ప్రకటించాయి. ఆం. ప్ర. అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరు జిల్లా శాఖ తిరునగరి రామాంజనేయులు గారి 'జ్వలిత జ్వాల'ను వెలువరించింది. దాశరథి, కాంచినేపల్లి, గంగినేని, సోమసుందర్, ఆరుద్ర, సుంకర, కొండేపూడి, కోగంటి, ముక్కామల మొదలైనవారి గీతాలు 'కల్పన' వంటి కవితా సంకలనాల్లో అచ్చయ్యాయి; వివిధ పత్రికల్లో, ప్రత్యేక సంచికల్లో ప్రకటితమయ్యాయి. సోమసుందర్ 'వజ్రాయుధం', ఆరుద్ర 'త్వమేవాహమ్', గంగినేని 'ఉదయిని', సుంకర 'జయగీతి', కాంచినేపల్లి 'అరుణరేఖలు', దాశరథి 'అగ్నిధార', 'రుద్రవీణ', 'మహాంధ్రోదయం', మఖ్దూం 'కవిత' వెలువడినాయి.

ఆనాటి సాహిత్యం క్రమంగా కొంత వెలుగు చూసింది. అనేకమంది సాహిత్య పరిశోధకులు పరిశీలనా వ్యాసాలు ప్రచురించారు. సాహిత్య పరిశోధకుడు జయధీర్ తిరుమలరావు క్షేత్ర పర్యటనలు చేసి, మౌఖిక ప్రచారంలో ఉన్న మరికొన్ని విలువైన గీతాలను సేకరించాడు. 'తెలంగాణా రైతాంగ పోరాటం - ప్రజా సాహిత్యం' అనే అంశంమీద సిద్ధాంత వ్యాసాన్ని రూపొందించాడు. అంతకు ముందే 'తెలంగాణా సాయుధ పోరాట నవలల' మీద వరవరరావుగారు పరిశోధన చేశారు. ఇంకా ఆనాటి సాహితీ ప్రక్రియలపైన, కళారూపాలపైన విస్తృతమైన పరిశోధనలు జరుగుతున్నాయి.

## పోరాట కవులు

వీరోచిత తెలంగాణా సాయుధ పోరాట సాహిత్యాన్ని సృజించిన కవులను, రచయితలను నాలుగు ప్రధాన శ్రేణులుగా వర్గీకరించ వీలున్నది. 1. ప్రావాహికులు, 2. ప్రవాహ ప్రభావితులు, 3. ప్రవాహ ప్రేరితులు, 4. తటస్థులు.

ఒక చేత్తో పెన్నూ, మరో చేత్తో గన్నూ పట్టి ప్రత్యక్షంగా పోరాట ప్రవాహంలో పయనించిన కవులను, రచయితలను ప్రావాహికులు అంటున్నాం. యాదగిరి, తిరునగరి రామాంజనేయులు, సుద్దాల హనుమంతు, మఖ్దూం, అలువాల మాచయ్య, ఆవుల పిచ్చయ్య, బి. గంగారాం, అప్పన్న, సర్వదేవభట్ల నర్సింహమూర్తి, పెండ్యాల వెంకటేశ్వరరావు మొదలైన కవులు ఈ శ్రేణికి చెందుతారు. వీరితోపాటు పోరాట కాలంలో నిజాం ప్రభుత్వంచేత కఠిన కారాగారవాసాలకు, అజ్ఞాత-అరణ్య వాసాలకు గురయిన వట్టికోట ఆళ్వార్ స్వామి, దాశరథి,

కాళోజీ, ఆదిరాజు వీరభద్రరావు, కాంచనపల్లి చిన వెంకట్రామారావు, సర్రా రాఘవరెడ్డి, హీరాలాల్ మోరియా ప్రభృతులుకూడా ప్రవాహితులే.

పోరాట ఆశయాలను, అనుభవాలను తమ రచనలద్వారా వెలిబుచ్చిన రచయితలను ప్రవాహ ప్రభావితులుగా వర్గీకరించవచ్చు. గూడూరు సీతారాం, భాగి నారాయణమూర్తి, దాశరథి రంగాచార్య, సురమౌళి, నెల్లూరి కేశవస్వామి, ఇటికాల నీలకంఠరావు, భాస్కరభట్ల కృష్ణారావు మొదలైనవారు వివిధ సాహిత్య ప్రక్రియల్లో ఆనాటి పోరాటాన్ని చిత్రించారు.

పోరాట ప్రాంతానికి దూరంగా ఉంటున్నప్పటికీ, ఉద్యమ ఉదంతాలను విని ఉత్తేజితులై సాహిత్య సృష్టి చేసిన కవులను - రచయితలను ప్రవాహ ప్రేరితులుగా భావించవచ్చు. వీరిలో కొందరు పోరాట ప్రాంతాన్ని సందర్శించారు. ఇంకొందరు సమీప గ్రామాల్లో ప్రదర్శన లిచ్చారు. మరికొందరు ఉద్యమానికి మద్దతు తెలిపినందుగ్గాను అజ్ఞాత జీవితాన్ని గడిపారు. సుంకర, వాసిరెడ్డి, తుమ్మల వెంకట్రామయ్య, గంగినేని, కోగంటి, ముక్కామల నాగభూషణం, నాజర్, అయ్యపు వెంకట కృష్ణయ్య, తెన్నేటి సూరి, పులుపుల వెంకట శివయ్య, బొల్లిముంత శివరామకృష్ణయ్య, మహీధర రామ్మోహనరావు, సోమసుందర్, ఆరుద్ర, కుందుర్తి మొదలైన రచయితలు రజాకార్ల దురాగతాలను ఎండగట్టారు. ప్రజోద్యమ విజయాన్ని కాంక్షిస్తూ రచనలు చేశారు.

కేవలం తెలుగు సాహిత్యాన్నే కాదు - హిందీ, బెంగాలీ, ఉర్దూ, అస్సామీ మొదలైన భారతీయ భాషా సాహిత్యాలను ఈ పోరాటం ప్రభావితం చేసింది. రష్యన్, స్పానిష్, పోలిష్ భాషల్లోనూ ఆ కాలంలో తెలంగాణా పోరాట ప్రేరణతో సాహిత్యం వెలువడింది.

14-9-1948 నాడు ఒడ్డు గ్రామానికి చెందిన భూస్వామి రంగారెడ్డిని చంపారన్న అభియోగంపై శివారెడ్డి (15 సం॥), సత్తిరెడ్డి (17 సం॥), పుల్ల పుల్లయ్య (18 సం॥), చిల్కా వీరయ్య (18 సం॥), కర్లపాటి రామిరెడ్డి (20 సం॥), మాడా ఎల్లయ్య (18 సం॥), మాడా నర్సింహ (18 సం॥)లతో బాటు మరో 12 మందికి ప్రభుత్వం 19 జూలై 1950 నాడు ఉరిశిక్ష విధించింది. ఈ ఉదంతం చదివి ప్రతిస్పందించిన పోలిష్ యువకవి 'ఉరికంబం కదులుతోంది' శీర్షికన ఒక గీతం రాశారు.

'స్వచ్ఛ రవి కిరణ కాంతితో
స్వయం వ్యక్తిత్వంతో
జ్వలించ వలసిన జీవితం
కాలుష్యాచ్ఛన్నమై మసకబారిపోయింది
..........................

పదిహేడుగురు తల్లులు
కదలకుండా కిటికీల వద్ద నిల్చొని
కంట నీరు పెడ్తున్నారు
కాళరాత్రి తెలంగాణాలో
కటిక చీకటిని పూసింది
....................
నవయుగ నాంది గీతం
నగారా మోగిస్తోంది
నేడో రేపో వినితీరాలి
నేడే వినడం మంచిది
....................
నరలోకపు గుండెల్లో
చిరచిర లాడుతోంది బాధ
ఉరికంబం కదులుతోంది
ఉచ్చు గాలి కెగురుతోంది'1

అంటూ ప్రపంచవ్యాప్తంగా ఆనాడు ప్రతిస్పందించిన రచయితల ఆలోచనలకు అక్షరాకృతి కల్పించారు.

అలాగే మరో సందర్భంలో తెలంగాణాలో ప్రభుత్వ కఠిన శిక్షలకు గురైన పన్నెండేండ్ల బాలుడు దీనా లింగయ్య కథను పత్రికల్లో చదివి స్పందించిన హృదయంతో విక్టర్ గోంచరోవ్ అనే రష్యన్ కవి...

'లేవు..........
కరకర పొడిచే ప్రొద్దును ఆపే
శక్తులు లేవు
లేవు..........
లేవు ఉదయమాపు జైళ్ళు'2

అంటూ సాగే కవితను రాశారు. రానున్న సూర్యోదయాన్ని జైలు గోడలు, కఠిన శిక్షలు ఆపలేవనే ఆత్మవిశ్వాసాన్ని ప్రదర్శించారు.

---

1. 'ఉరికంబం కదులుతోంది' గీతానికి తెలుగు అనువాదం : విద్వాన్ విశ్వం —'జనవాణి', 24 ఏప్రిల్ 1951.
2. రష్యన్ కవితకు తెలుగు అనువాదం : కె. వి. రమణారెడ్డి —'జనవాణి', 28 మార్చి 1951.

ఇక భారతీయభాషల్లో వెలువడిన గీతాల్లో హరీంద్రనాథ్ చటోపాధ్యాయ గారి 'విశేషించిన' అనే గీతం ప్రఖ్యాతమయింది. అలాగే ఉర్దూ మాట్లాడే ప్రజల్లో నిజాం వ్యతిరేక భావాలను తన కవితల ద్వారా ప్రచారం చేసిన ఘనత మఖ్దూం మొహియుద్దీన్‌కే దక్కుతుంది. తెలంగాణా సాయుధ పోరాట ప్రకటనపై రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి గార్లతో పాటు సంయుక్తంగా సంతకం చేసిన వీరయోధుడు మఖ్దూం.

నిజాం రాజరికాన్ని, జాగిర్దారీ విధానంలోని దుర్గుణాలను ఈ కవి వర్ణిస్తూ 'హవేలీ' అనే కవితలో...

'అది ఒక దయ్యాల మేడ - శిథిల సమాజాల నీడ
పీనుగులను పీక్కుతినే - రాబందుల రాచవాడ
అద్యంతం అంతులేని - అరిష్టాల మహాపీడ
ఎటు చూస్తే అటు చీకటి - ఎటుకన్నా శిథిలాలే'

అని వర్ణించారు. కవితాంతంలో...

'రా! ఈ శిథిలాలపైన - స్వాతంత్ర్య పతాకమెత్తు
రా! ఈ శిథిలాలపైన - రక్తపతాకమ్ము ఎత్తు'

అంటూ ఉద్యమాహ్వానం పలికారు.

మఖ్దూం తరువాత ఉర్దూ భాషా సాహిత్యాలకు ఎనలేని సేవ చేసిన తెలంగాణా యోధుడు డా॥ రాజ్ బహద్దూర్ గౌర్. వీరి సాహిత్య కృషికి గుర్తింపుగా ఢిల్లీ ఉర్దూ సాహిత్య అకాడమీ వీరికి 'బహద్దూర్ షా జఫర్ అవార్డు'నిచ్చి సత్కరించింది.

ఇక పోరాటకాలంలో కలం కదిలించని నాలుగవ శ్రేణి రచయితలను తటస్థులుగా పేర్కొనవచ్చు. జాతీయ, అంతర్జాతీయ రచయితలను ప్రభావితం చేసిన ఈ మహోద్యమ కాలంలో కనీసం ఒక్క గీతాన్నైనా రాయని మహాకవులు కొందరున్నారు. రాజకీయ కారణాలు, ఉద్యోగ కారణాలు, వ్యక్తిగత బలహీనతలవల్ల ఎంతో రాయగల ప్రతిభ ఉండికూడా ఉద్యమ ఉధృతిలోనూ ఉదాసీనంగా ఉండగలిగారు. ఏ దోపిడికి వ్యతిరేకంగా తమ కవిత్వాన్ని అంకితం చేసినట్లు ప్రతిజ్ఞలు చేశారో, ఆ దోపిడిపై జరుగుతున్న ప్రజాప్రతిఘటనను చూసికూడా ప్రతిస్పందించకుండా ఉన్న మహాకవుల్లో శ్రీశ్రీ ముఖ్యులు. కేవలం కవిత్వం రాయకపోవడమే కాదు, నిరంకుశ నిజాం నవాబు కొలువులో ఆ రోజుల్లో అతనొక ఉన్నతాధికారిగా పనిచేయడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

జాతీయోద్యమంలోనూ, ఆంధ్రోద్యమంలోనూ తమ బలమైన గొంతుల్ని వినిపించిన అనేకమంది కవులు ఈ తెలంగాణా సాయుధ పోరాటోద్యమకాలంలో తటస్థంగా ఉన్నారు. పూలు కదిలినా, పోరు మెదిలినా స్పందించిన కవులు కొందరు ఈ కాలంలో కలాలను నిద్రపుచ్చారు.

## కళారూపాలు

సాయుధ పోరాట కాలంలో నాయకుల ఉపన్యాసాలకన్నా, పత్రికల వార్తలకన్నా ఎక్కువ ప్రభావాన్ని చూపినవి ప్రజా కళారూపాలు. తిరునగరి రామాంజనేయులు పాటలతోబాటు హరికథల్ని, బుర్రకథల్ని అల్లి ప్రజలకు వినిపించారు. సుద్దాల హన్మంతు గొల్ల సుద్దులు, పిట్టలదొర వేషం, ఫకీర్ల వేషం, బుర్రకథ మొదలైన ప్రక్రియల్తో ప్రజల్ని కదిలించారు. సుంకర - వాసిరెడ్డిల 'మా భూమి' నాటకం తెలంగాణా సరిహద్దు గ్రామాల్లో ప్రదర్శింపబడింది. వరంగల్ ప్రజానాట్య మండలి కళాకారుల జంట అప్పన్న - కమలమ్మ గొల్ల సుద్దులు చెప్పారు. ఆదిలాబాద్ కమ్యూనిస్టు నాయకులు బి. గంగారాం గోండు భాషలో గీతాలు రాసి గిరిజనుల మధ్య గానం చేశారు. దాశరథి పద్యాలద్వారా, గేయాలద్వారా నైజాం నిరంకుశపాలనపై తమ ఆగ్రహాన్ని ప్రకటించారు. జైలు గోడలపై కవిత్వాన్ని రాసి, తమ ఆవేశానికి అక్షర రూపం కల్పించారు. హీరాలాల్ మోరియా హిందీ, ఉర్దూ భాషల్లో రాసిన ఉద్యమ గీతాలు తెలుగులోకి అనువదింపబడి అచ్చయ్యాయి. ఇలా ఒకటేమిటి పాటలు, అనేక ప్రజా కళా రూపాలు పోరాట కాలంలో వెలువడ్డాయి.

## పోరాట గీతాలు

గాన యోగ్యమై, లయబద్ధమైన గీతాలు ఇతర సాహితీ ప్రక్రియలకన్నా, ఇతర కళారూపాలకన్నా కొంత ఎక్కువ పాత్రనే పోరాట కాలంలో వహించాయి. అప్పటికప్పుడు సందర్భానుసారంగా అల్లి ప్రజల్లో వినిపించడానికి అనువైన కళారూపం గీతం. ఒకేఒక్క గాయకుడు గానం చేయడానికి వీలువైన సాధనం గీతం. ప్రక్క వాయిద్యాలు, వంతలు లేకుండా ప్రచారం చేయడానికి వీలైన గీతాలు వందలాదిగా పోరాట కాలంలో వెలువడ్డాయి. ఉద్యమ స్ఫూర్తికి దోహదం చేశాయి. వాటిలో పోయినవి పోగా, దొరికిన వాటిలో కనబడుతున్న సాధారణ లక్షణాలనుబట్టి ఈ క్రింది విధంగా విశ్లేషించవచ్చు :

## భూస్వామ్య వ్యతిరేకత

నిరంకుశ భూస్వామ్య విధానాన్ని నిరసిస్తూ తెలంగాణా ప్రజాకవులు గీతాలు గానం చేశారు.

'ఓ ధనికులారా!
ఓ పెత్తందారులార! మీరలింక
కనులు దెరవరెందుకోయ్? భూస్వాములార - మీ
పనులు మానరెందుకోయ్?' ॥ఓ ధని॥[1]

అని ప్రశ్నించారు సుద్దాల హన్మంతు. అలాగే -

'ఒహో ఒహో పల్లె దొరా!
ఒహో ఒహో పాత దొరా!
ఒంటరి తుంటరి తొండి దొరా!
ఎంతకు మారని మొండి దొరా!
చాలు చాలు నీ పెత్తనమిక
సాగించగ బోకుమోయ్'

అని హెచ్చరించారు హన్మంతు.

'గ్రామాధికారులు భీమస్వరూపులై
పెక్కు టక్కుల వెతల్ బెట్టుచుండ
వ్యాపార వర్గంబులా పూర్తి ధూర్తులై
లాభంబు పూర్తిగా లాగుచుండ
పోలీసుద్యోగులు పట్టాభిషిక్తులై
చిప్పముంతల పాలు సేయుచుండె.[2]

అంటూ అప్పటి పరిస్థితిని గంగుల శాయిరెడ్డి పద్యకావ్యంలో వర్ణించారు.

## వెట్టిచాకిరి చిత్రణ

నిజామ్ నవాబు పరిపాలన కింద తెలంగాణా గ్రామసీమలు భయంకరమైన సామాజిక పరిస్థితుల్లో కొనసాగాయి. గ్రామంలోని ప్రజలంతా అక్కడి నలుగు రైదుగురు పెత్తందార్లకు బానిసలుగా బతికేవారు. దుర్భరమైన వెట్టి చాకిరి, దారుణమైన అధికారుల జులుం, నిత్యం తన్నులు, చెవులు పగిలిపోయే తిట్లు, కచేరి చావిళ్ళవద్ద వంగబెట్టి మూపున బండలు, కొన్ని సందర్భాల్లో రైతుల మూపున గ్రామ వెట్టివానిని ఎక్కించి తొక్కించడం వంటివి నిత్య కృత్యాలుగా సాగేవి. గ్రామంలోని అన్ని కులాలవారు భూస్వాములకు, జాగీర్‌దార్లకు వెట్టిచాకిరీ చేయాల్సి ఉండేది.

---

1. సుద్దాల హన్మంతు పాటలు - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.
2. కాపు బిడ్డ (పద్య కావ్యం) - గంగుల శాయిరెడ్డి (1937).

ఆ వెట్టిని వర్ణిస్తూ......

'వెట్టి చాకిరి విధానమో రైతన్న
ఎంత జెప్పిన తీరదో కూలన్న
మాదిగన్న మంగలన్న మాలన్న చాకలన్న
వడ్రంగి వడ్డెరన్న వసిమాలిన బేగరన్న
కుమ్మరన్న కమ్మరన్న కూలన్న రైతన్న
అన్ని పనులు వాళ్ళతో - దొర
లందరు చేయించుకొనెడి ॥వెట్టి॥'

అని ప్రారంభమయ్యే గీతంలో చాకలన్న, మంగలన్న, కుమ్మరన్న, మాదిగన్న మొదలైన వాళ్ళంతా భూస్వాముల ఇళ్ళల్లో పైసా ప్రతిఫలం ఆశించకుండా చేసిన 'వెట్టి'ని గుండెలు అవిసిపోయేలా వివరించారు హన్మంతు.

## నైజామ్ వ్యతిరేకత

ప్రజల నిరసన కేవలం భూస్వాముల వ్యతిరేకతగా పరిమితం కాలేదు. భూస్వామ్య విధానానికి మూలవిరాట్టుగా మిగిలిన నైజామ్ నవాబు మీదా, రాజరిక వ్యవస్థ మీదకూడా ఆగ్రహ గీతాలు పాడి తమ అసహనాన్ని వినిపించారు.

'నైజాము సర్కారురా, ఓరన్న
నాజీల మించిందిరా
ప్రజా రాజ్యానికై పోరాడు ప్రజలపై
రాక్షసా చర్యలను రకరకాల్ చేస్తుండె'[1] ॥నై॥

అని తిరునగరి రామాంజనేయులు వర్ణిస్తే-

'ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మాకెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ, కోటి రత్నాల వీణ'[2]

అని జైలు గోడలపై పద్యాలు రాసిన దాశరథి-

'ప్రాణము లొడ్డి ఘోర గహ
నాటవులన్ బడగొట్టి, మంచి మా
గాణములన్ సృజించి, ఎము
కల్ నుసి జేసి పొలాలు దున్ని, భో
షాణములన్ నవాబునకు

1. 'తెలంగాణా పోరాట గేయాలు' —విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.
2. 'దాశరథి కవిత' —మహాంధ్ర ప్రచురణలు.

స్వర్గము నింపిన రైతుడే, తెలం
గాణము రైతుడే, మునలి
నక్కకు రాజరికంబు దక్కునే?

అని ప్రశ్నించారు. అంతటితో ఆగకుండా... 'మా నిజాము రాజు తర తరాల బూజు' అని నిర్వచిస్తూనే...

'పడతుల మానాలు దోచి
గుడగుడమని 'హుక్క' త్రాగి
జడియక కూర్చుంటినావు
మడి కట్టుక నిలిచినావు
దగాకోరు బటాచోరు
రజాకారు పోషకుడవు
వూళ్ళు కూళ్ళు అగ్గిపెట్టి
తల్లి పిల్ల కడుపుకొట్టి
నిక్కిన దుర్మార్గమంత
నీ బాధ్యత నీ బాధ్యత-

'కోటిన్నర' నోటివెంట
పాటలుగా మాటలుగా
దిగిపొమ్మని దిగిపొమ్మని
ఇదేమాట అనేస్తాను
వద్దంటే గద్దెయెక్కి
పెద్దరికం చేస్తావా?
మూడుకోట్ల చేతులు నీ
మేడను పడదోస్తాయి
మెడనే విడదీస్తాయి
నీకు నిలుచు హక్కులేదు
నీకింతా దిక్కులేదు'

అంటూ దిక్కులు పిక్కటిల్లేలా గర్జించాడు దాశరథి.

'ఈ కనులవోలెనే హిందూ ముసల్మాను
లిరుపక్షములు నేత్రములు రెండు నాకంచు
అమితప్రేమ నటించి సమత మంత్రము పఠించి
వంచించినావురో ఓ నిజాము నియంత!
ఓరి మాతృద్రోహి! - ఓరి కాలాహీ'!

అంటూ ప్రజాద్రోహి నిజాముపై పెరుగుతున్న ప్రజాగ్రహాన్ని ప్రతిధ్వనింపజేశారు శ్రీ హీరాలాల్ మోరియా.

'ఖబడ్దార్! ఖబడ్దార్
నైజాం పాదుషాయే!
బానిసత్వ విముక్తికై - రాక్షసత్వ నాశముకై
హిందూ ముస్లిం పీడిత శ్రమజీవులు ఏకమైరి
తమపై స్వారీజేసే దేశముఖుల ప్రతిఘటించి
ప్రజాకోటి పోరుతోంది ఖబడ్దార్! ఖబడ్దార్'[1]

అని హెచ్చరించిన సోమసుందర్...

'ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభవింతురు
ఒక నెత్తుటి బొట్టులోనె ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు'

అనే చారిత్రిక సత్యాన్ని చాటి చెప్పారు.

నిజామ్ పాలనపై, నిజామ్ ప్రభువుపై వెలువడిన గీతాల పరాకాష్ట 'యాదగిరి' గానం చేసిన 'నైజామ్ సర్కారోడా!' గీతం. 1948 సం॥ విశాలాంధ్ర మాసపత్రికలో అచ్చయిన ఈ గీతం ప్రజల ఉద్యమావేశానికి సంకేతంగా తెలంగాణా అంతటా ప్రజల గొంతుల్లో ప్రతిధ్వనించింది.

నైజాము సర్కారోడా
నాజీల మించినోడా
యమ బాధపెడ్తివి కొడుకో
నైజాము సర్కారోడా!

పండిన పంటనంత
తిండికైన ఉంచకుండ
తీసుక వెళ్ళినావు
నైజాము సర్కారోడా!

దున్నాను భూమిలేక
ఉండాను ఇల్లులేక
పరదేశమైతిమి కొడుకో
నైజాము సర్కారోడా!

పోలీసు మిల్ట్రి జూసి
మేము లొంగి వస్తమాని
నువు ఆశపడ్తివి కొడుకో
నైజాము సర్కారోడా!

1. 'వజ్రాయుధం' —సోమసుందర్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.

లాఠీల దెబ్బలుగాని
తుపాకి కాల్పులుగాని
మిషీను గన్నులు గాని
తుపాకి బాంబులుగాని
నీవెన్ని తెచ్చినగాని
నీవెన్ని తెచ్చినగాని
మేం లొంగిరాము కొడుకో
నైజాము సర్కారోడా!

కంచారు గాడుదులాను
లంచగొండి పోలిసోల్లా
నువు పెంచినావు కొడుకో
నైజాము సర్కారోడా!

చుట్టుపట్ల సూర్యాపేట
నట్టనడుమ నల్లగొండ
ఆవాల హైద్రాబాద
తర్వాత గోలకొండ
గోలకొండ ఖిల్లా కింద- నీ
గోరి కడ్తం కొడుకో
నైజాము సర్కారోడా!'

అంటూ సాగే ఈ ప్రఖ్యాతగీతంలో...

'గోలకొండ ఖిల్లా కింద- నీ
గోరి కడ్తం కొడుకో
నైజాము సర్కారోడా!'[1]

అన్న ప్రజల దృఢ సంకల్పాన్నీ, సదాగ్రహాన్నీ స్పష్టంగా గానం చేసిన యాదగిరి నిజామ్ పోలీసుల గుళ్ళకు బలయి అమరుడయినా, ఈ పాట ద్వారా చిరంజీవిగా నిలిచాడు.

## ఆంధ్ర మహాసభ గీతాలు

1944 లో భువనగిరిలో శ్రీ రావి నారాయణరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన 'ఆంధ్ర మహాసభ' ఎందరో యువకుల్ని ప్రభావితం చేసింది. సుద్దాల హన్మంతు,

---

1. పోరాటకాలంలో ప్రజలను ఉత్తేజితులాపిన ఈ పాట తరువాతి కాలంలోనూ విశేష ప్రాచుర్యాన్ని పొందింది.

తిరునగరి రామాంజనేయులు, యాదగిరి వంటి ప్రజా కళాకారుల ఆవేశానికి ఊపిరులూదింది.

'ఆంధ్ర మహాసభ కరుదెంచడండీ - జనులారా మీరు!' అంటూ దాశరథి రాసిన ప్రబోధ గీతాన్ని పాడుకునే ఆనాటి రామాంజనేయులు శ్రీశ్రీగారి బాణి, దాశరథిగారి ప్రబోధం జోడించి...

'ఆంధ్ర మహాసభ
ఆంధ్ర మహాసభ
ఆంధ్ర మహాసభ అదిగదిగో
చంద్ర కిరణ కళ
ఇంద్ర ధనుస్సున
ఆంధ్ర స్టేటులో వెలిసింది'

అనే గీతం రాశారు. ఇదే ప్రజాకవి తిరునగరి రామాంజనేయులు గారి తొలి రచన. ఈ గేయాన్ని గ్రామాల్లో పాడుతుంటే ప్రజల్లో హర్షధ్వానాలద్వారా ప్రకటితమైన ప్రతిస్పందన ఈ కవిలో కొత్త ఉత్సాహాన్ని నింపింది. దాంతో మరొక గీతం ఆ గొంతు నుండి వెలువడింది.

'ఎక్కు బాబా! పడవెక్కు బాబా!
ఆంధ్ర మహాసభయను పడవెక్కు బాబా!
చుక్కాని బట్టె రావి నారాయణరెడ్డి
పెద్ద తెరచాప బట్టె బద్దం ఎల్లారెడ్డి
గడలు పట్టిరి కార్యకర్తలు ప్రాణాలొడ్డి
కదులుతుందీ పడవ గమ్యస్థానముచేర ॥ఎక్కు బాబా॥'

అనే పాట నల్లగొండ జిల్లా అంతటా మారుమ్రోగింది. ఈ పాటల్ని ఎందరెందరో ప్రజాగాయకులు పాడుకోవడం విన్న రామాంజనేయులు కొత్త ఆత్మవిశ్వాసాన్నీ, ఉత్సాహాన్నీ పొంది ఎన్నో పోరాట పాట లల్లారు. ప్రజల్ని ఉత్తేజపరిచారు. ఆంధ్ర మహాసభ ప్రజల్లో 'సంఘం'గా, 'గుత్పల సంఘం'గా ప్రాచుర్యం పొందింది.

'సంగం వచ్చిందిరో రైతన్న మనకు మేలు
చాలా చేశిందిరో కూలన్న మనకు మేలు ॥సంగం॥
సంగం వచ్చింది మనకు చాల బలం తెచ్చింది
దొంగల దోపిడి దొరల దుమ్ము దులిపివేసింది
నంగనాచి నైజాము నడుము విరుగ గొట్టింది ॥సంగం॥'

అని సుద్దాల హనుమంతు రాసిన గీతం 'సంఘం' ఆశయాలను, ఆదర్శాలను ప్రజల్లో ప్రచారం చేసింది.

ఈ పాటనే కొంత మార్చి......

'సంఘం వచ్చిందిరో రైతన్నా మనకు బలం
చాలా తెచ్చిందిరో కూలన్నా - మనకు బలం'[1]

అంటూ పాడుకున్నారు జనం.

'ఆంధ్రమహాసభ నేడు
అన్ని ఇబ్బందులను తొలగించగా నీకు
తోడునీడగా నుండె' అంటూ-
'ప్రజల కష్టముల దీర్చ
పదియు రెండు మజిలీలు దాటి
పల్లెపల్లెలన్ని గడిచి
బయలుదేరి పోవుచుండె'[2] నంటూ

ప్రబోధించారు కవులు. ఆంధ్రమహాసభ సమావేశాల్లో, ఊరేగింపుల్లో, మహాసభల్లో 'సంఘం' ప్రాముఖ్యాన్ని తెలుపుతూ పాటలు పాడి ప్రజల్ని సంఘటిత పరిచారు కవులు.

## జనచైతన్యగీతాలు

1941 నుండే సూర్యాపేట తాలూకాలోని అనేక గ్రామాల్లో ఆంధ్రమహాసభ నాయకత్వాన రైతులు, కూలీలు, సామాన్య ప్రజలు ఉద్యమాలు నిర్వహించసాగారు. 'భువనగిరి'లో జరిగిన 11 వ ఆంధ్రమహాసభ తరువాత గ్రామ గ్రామాన 'సంఘం' పేరుతో ఆంధ్రమహాసభ వృద్ధిచెందసాగింది. జనగామ తాలూకాలో ప్రజాపోరాటాలు మొదలయ్యాయి. హుజూర్‌నగర్ తాలూకా వరకు రైతాంగ పోరాటాలు వ్యాపించసాగాయి. తెలుగు నేలపై కలం పట్టిన కమ్యూనిస్టు రచయితలు, ప్రగతిశీల రచయితలు, ప్రజానాట్యమండలి కళాకారులు ఈ పోరాటాలను ప్రశంసిస్తూ, జనాన్ని చైతన్య పరచడానికి కలాలనూ, గళాలనూ అంకితం చేశారు. తెలుగునేల నలుమూలలనుండీ ప్రజల్ని సమరోన్ముఖుల్ని చేయడానికి జనచైతన్య గీతాలను గానం చేశారు.

'ప్రజలు దళాలుగ కూడాలోయ్
పోలీస్ క్యాంపులు చూడాలోయ్
శత్రుని చంపిన ప్రతిచోట
శత్రుని ఆయుధాల్ మనవేనోయ్

---

1. 'సుద్దాల హన్మంతు పాటలు' - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.
2. 'ఆంధ్రగేయాలు' - వట్టికొండ రామకోటయ్య (1945).

తుపాకి, రైఫిల్, తోటల్ బాంబులు
విరివిగ దొరుకును మనకండోయ్
విజయం మనదే రారండోయ్!'

అని పోరాటానికి పిలుపునిచ్చిన రామాంజనేయులు...

'మోస పోబోకోయి ఆంధ్రుడా!
మ్రోగించు రణభేరి వీరుడా!
సాగించవోయ్, ప్రజాశాంతికై సమరమ్ము
నాజీ జర్మను వలె నైజాము పడిపోవు'

అనే ఆత్మవిశ్వాసాన్ని జనంలో నింపుతూనే...

'ఎవడు ఈ నైజాము
ఎవరు దొరలంత
జవసత్వములను పీల్చి శవములను చేయంగ?
ఈ భూమి నీదెరా, ఈ గనులు నీవెరా
సర్వ సౌఖ్యములు విలసిల్ల పోరాడరా!'

అంటూ మార్గ నిర్దేశం చేశారు. దాదాపు ఇదే భావాన్ని 1946 లోనే వ్యక్తం చేస్తూ ...

'ఈ భూమి నీదిరా
ఈ నిజాం ఎవడురా?
ఈ జులుం - ఈ జబర్దస్తి
నెగురదన్ని వేయరా
లెమ్మ తెలుగు వీరుడా - రణమ్ముచేయ లెమ్మురా'

అని విప్లవాహ్వానం పలికారు సుద్దాల హనుమంతు.

'రణభేరి మ్రోగింది తెలుగోడా
రావోయి ముందుకూ మొనగాడా!
ఆంధ్ర వీరులు బాలచంద్రులై లేవాలి
మగువలందరు రుద్రమాంబలై కదలాలి
నీ జాతి వారంత తెలుగోడ
నిలిచి ఎదిరించాలి మొనగాడా'

అంటూ జనరణ గీతాలు గానం చేశారు హనుమంతు.

1946లోనే తెలుగు జాతికి సమర మార్గం చూపిన మరో ప్రజా కవి సుంకర సత్యనారాయణ.

'తెలుగు బిడ్డా! మేలుకోవోయి
నైజాము తెలుగు బిడ్డా! లేచిరావోయ్ ॥తెలుగు॥
నదులు నగములు గనులు - నల్లనల్ల భూములు
కలవు నీ దేశాన - గంజిసీళ్ళె కరవ?
మాడి చచ్చేవారి - మతములన్నీ ఒకటె
కొంపలార్చేవారి - కుట్రలో పడబోకు
కదిలించి బలగాన్ని - ఎదిరించి వైరులను
శక్తి చూపించగల - సమయమిదె లే! లెమ్మ!' ॥తెలుగు॥[1]

అంటూ మేల్కొలుపు గీతాలు పాడిన సుంకర...

'బిరాన లేచిరండు తెలుగు బిడ్డలార ఒకటిగా
దురాగతాలు చేయు దేశద్రోహి నణచివైవగా
ప్రజావిరోధి యెవ్వడైన బ్రతుకలేడు నిశ్చయం
ప్రజాబలాల ధాటినాప బ్రహ్మతరము గాదుపో'

అనే మార్చింగ్ గీతాన్ని తెలంగాణా యోధులకు అందించారు.

అలాగే తెలంగాణా పోరాట వీరుల్ని కదిలించి, పోరుపాటల పల్లవిగా ప్రతిధ్వనించిన మరో మార్చింగ్ గీతం కొండేపూడి లక్ష్మీనారాయణ గారు రాసింది.

'తెలుగు తల్లి బిడ్డలం
తెలంగాణ వీరులం
మాతృదేశ ముక్తికొరకు
పోరు సల్ప కదిలినాం, కదిలినాం
వెట్టిపనులు కట్టిపెట్టి
జబర్దస్తి నెగురగొట్టి
సాగుతున్న దేశముఖుల
సాగనంప కదిలినాం, కదిలినాం'[2]

అనే అష్టపది ఆనాడు ఊరూరా, వాడవాడా ప్రజల గొంతుల్లో ప్రవహించింది.

'నల్లగొండలో నాజీవృత్తుల
నగ్ననృత్య మింకెన్నాళ్ళు?
దమన నీతితో దౌర్జన్యాలకు
దాగిలి మూత లిదెన్నాళ్ళు?

---

1. 'జయగీతి' - సుంకర (మాభూమి ప్రచురణలు)
2. 'కొండేపూడి లక్ష్మీనారాయణ స్మృతులు - గేయాలు.'

దొంగలు దొంగలు ఊళ్ళు పంచుకొని
దొరలై వెలిగే దెన్నాళ్ళు?
హింసను పాపమనెంచు దేశమున
హిట్లరత్వమింకెన్నాళ్ళు?'

అని కాళోజీ ప్రశ్నించారు.

'కదలండి, కదలండి - కదిలి పోరాడండి
కాకతీయుల శౌర్య పటిమ చూపించండి
తెలగాణ తెలగాణ - ధీరులకు మొగసాల
తెలగాణ తెలగాణ - విప్లవోజ్వల గాథ'

అంటూ కదనకవనం వినిపించిన వజ్రాయుధుడు సోమసుందర్.

'కదలండోయ్ కదలండోయ్
కార్మబ్బుల జీల్చివేసి
అరుణ కిరణ కేలావళి
సంతటవెల్గించు కొరకు - కదలండోయ్'
'ఈ ప్రభుతకు మూలమైన
వీహ్యపు భూస్వామ్య విధిన్
హతమార్చగ కదలండోయ్
అసిరి కూలదా భవనం - కదలండోయ్'1

అని జనాన్ని కదిలించారు కాంచినేపల్లి.

జనం కదిలారు. కదన శంఖాలూదారు. వందలాదిగా నేలకొరిగారు. ఉన్నతాశయాలతో ఉద్యమంలో అమరులయ్యారు. ఈ అమర వీరుల్ని స్మరిస్తూ అనేక స్మృతి గీతాలొచ్చాయి. నిట్టూర్పుల నుండి నిప్పుల ఉప్పెనల్ని పొంగించాయి. విషాదాన్ని కాదు, వీరత్వాన్ని వర్ణించాయి.

## అమరవీరుల స్మృతి

ఏ ఉద్యమంలోనైనా కొందరు ప్రాణార్పణ చేయక తప్పదు. అయితే ఈ తెలంగాణా రైతాంగ పోరాటంలో నాలుగు వేల మంది వీరులు అమరులయ్యారు. విప్లవ వారసత్వాన్ని ప్రజల కందించారు. ఈ వీరులపై ప్రజా కవులు స్మృతి గీతా లల్లారు. తమ ఆవేదనకు, ఆవేశానికి అక్షరాలు కూర్చి ప్రజలకు వినిపించారు. ప్రజల కన్నీళ్ళనుండి కోపాగ్నుల్ని జ్వలింపజేశారు. భారత జాతీయోద్యమ సాహిత్యంలో ప్రసిద్ధులైన దేశభక్తుల మీద, జాతీయ నాయకుల మీద, విప్లవకారుల మీద స్మృతి గీతాలు వెలువడినాయి. అయితే తెలంగాణా సాయుధ

1. 'అరుణ రేఖలు' - కాంచినేపల్లి చిన వెంకట్రామారావు, నల్లగొండ.

రైతాంగ పోరాటంలో వేలాది మంది సామాన్య ప్రజలు నేలకొరిగారు. వారిలో కొందరి పేర్లే మనకు తెలుస్తున్నాయి. అనేకమంది వీరులు అజ్ఞాతంగానే అమరులయ్యారు. ఈ అజ్ఞాత వీరులందర్నీ స్మరిస్తూ, పేర్లు తెలిసిన ప్రముఖ వీరయోధుల్నీ స్మరిస్తూ తెలంగాణా పోరాట కవులు రాసిన గీతాలే 'అమరవీరుల స్మృతిగీతాలు'.

తెలుగు నేలపై గత అయిదారు దశాబ్దాలుగా ఉద్యమాగ్నుల్ని వెదజల్లుతున్న వామపక్ష ఉద్యమం, అందులో భాగంగా నడిచిన తెలంగాణా సాయుధ రైతాంగ ఉద్యమం స్మృతి గీతాలకు ఒక కొత్త ఒరవడిని దిద్దింది. సామాన్య ప్రజానీకాన్ని సంస్మరించే సంస్కారాన్ని అందించింది. భూమికోసం, భుక్తి కోసం, మానవ విముక్తికోసం పోరాడుతూ నేలకొరిగిన వీరయోధుల్ని స్మరిస్తూ, వీర చరితలు గానం చేస్తూ, వారి పోరాట స్ఫూర్తిని స్వీకరించి, 'కొత్త తరం' కదన భూమికి నడిచే నిబద్ధతనీ, నిమగ్నతనీ, సాహసాన్నీ, సమర శ్వాసనీ పొందుతున్న ఆదర్శగీతాలు ఈ స్మృతి గీతాలు ఈ గీతాల అంతర్లయ ఆవేదన కాదు, ఆవేశం; విషాదం కాదు, విప్లవం.

పోరాటంలో అమరులైన వీరులకు జోహార్లర్పిస్తూ...

'జోహార్లు - జోహార్లు - జోహార్లు
అమర వీరులార మీకు జోహార్లు
స్వాతంత్ర్య రథమునెక్కి - సమరవీధులందు తోలి
అతివాద శరముల గురిపి - అసువులపైనాస వదిలి
సైసైరా భళిసై
స్వరక్త ధారలన్ గురిపి - స్వతంత్ర బీజములనాటి
వీరస్వర్గ వాసులైన - విప్లవ యోధులకు నిత్య - జోహార్లు'

అంటూ...దొరతనాన్ని రూపుమాపడానికి, నిరుపేదల గోడుమాన్పడానికి, అన్యాయాలను అరికట్టడానికి అంతిమ శ్వాస విడిచేదాకా సంఘర్షణ సాగించిన, సమరధర్మ నినాదమిచ్చిన అమరయోధులకు జోహార్లర్పిస్తూనే......

'మీ అడుగుల జాడలలో - మీ ఉద్యమ మార్గంలో
కోటి చేతులొకటి చేసి - కొనఊపిరి దనుకపోరి
భరతమాత కనులనీరు - బాపువరకు నిదురబోము'

అని సుద్దాల హనుమంతు ప్రతిజ్ఞ చేశారు.

కామారెడ్డి గూడెంలో షేక్ బందగీని దేశ్‌ముఖ్ కిరాయి గుండాలు హత్య చేశారు. విసునూరి దేశ్‌ముఖ్ గడీముందు కొచ్చిన ప్రజా ఊరేగింపుపై దేశ్‌ముఖ్

కిరాయి గుండాలు కాల్పులు జరిపారు. ఊరేగింపు అగ్రభాగాన ఉన్న దొడ్డి కొమరయ్య నేలకొరిగాడు.

'తెలుగు తల్లి బంధాలు త్రెంచివేయుటలోన
బలమెట్లు చూపించి తొలిబలిగ నీవేగ
శూరత్వమున నీవెరా కామ్రేడ్ జోహారులివిగోరా...
నిను గన్న తల్లిదే ధన్య జీవితమాయె
కొమరయ్య నీ జీవి అమర జీవితమోయి
స్వాతంత్ర హస్తాలరా కామ్రేడ్ సాల్యూటు చేస్తామురా'

అంటూ ప్రజలు తెలంగాణా అమర వీరుడికి జోహార్లర్పించారు.

'కష్ట జీవులపల్లి - కడివెండి గ్రామంలో...'

అంటూ ప్రారంభమయ్యే సుదీర్ఘ స్మృతిగీతంలో కొమరయ్య కథనంతా ప్రజా గాయకులు గానం చేశారు.

తిరునగరి రామాజనేయులుగారి సాంస్కృతిక దళానికి సన్నిహితంగా గొట్టిముక్కల గోపాలరెడ్డి దళం ఉండేది. నూనుగు మీసాల నూత్న యవ్వనంలో ఉన్న గోపాలరెడ్డి ఎప్పుడూ నవ్వుతూ సరదాగా ఉండేవాడు. ఆత్మకూరు నుండి పాతర్లపాడువరకు రక్షణ ఈ దళం బాధ్యత. ఒకరోజు సాయంత్రం గోపాలరెడ్డి వచ్చి, తాము వేరే ప్రాంతానికి తరలిపోతున్నట్లు రామాంజనేయులతో చెప్పి, జాగ్రత్తగా ఉండమని, రేపు భోజనానికి ఇక్కడికే వస్తామని, ఇవ్వాళ రాసేపాట రేపు తనకు నేర్పాలని లాల్ సలామ్ చేసి వెళ్ళిపోయాడు. మరునాడు పది గంటలకు పిడుగుపాటులాంటి వార్త విన్నారు రామాంజనేయులు. శత్రువుల వలయంలో చిక్కి, తుది శ్వాసవరకు పోరాడి తెలంగాణా బాలచంద్రుడు గోపాలరెడ్డి నేలకొరిగాడని ఉబికివచ్చే ఉద్వేగంతో ఆ వీరునిపై స్మృతిగీతం రాశారు.

'సై సై గోపాలరెడ్డి, రెడ్డి, నీవు
నిలిచావు ప్రాణాలొడ్డి
ఔరౌరా నీ పేరు జెప్పితే
హడలు దోపిడీ బడా దొరోళ్ళకు
పౌరుషంబు గల తెలుగు జాతి
గౌరవము నిల్ప నొరిగావు యుద్ధమున' ॥సై సై॥

అనే పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో గోపాలరెడ్డి పరాక్రమాన్ని, శత్రువులతో చేసిన వీరోచితయుద్ధాన్ని కళ్ళకు గట్టినట్టు శ్రీ తిరునగరి రామాంజనేయులు వర్ణించారు.

'ఓ ఎఱ్ఱసైనిక వెంకటరెడ్డీ
విప్లవ జోహారు లివిగోరా!
కామ్రేడ్ 'పసునూరు' నిన్ను
గన్న కాసరగోడు భూమి
కాశీ క్షేత్రమయ్యి వెలుగొందా'

అనే గీతంలో ఎఱ్ఱసైనికునికి ఈ ప్రజాకవి నివాళు లర్పించారు.

'అమర యోధుడు సీమ గురవయ్యా
అందుకో జోహార్లు గురవయ్యా॥
రాబందు మానగాల రాజుతో పోరాడ
రైతులు కూలీలు రణరంగమున నిలువ
ముందుండి పోరాడి గురవయ్యా
మొనగాడ వైనావు గురవయ్యా॥'

అనే మరోగీతం ఆనాడు ప్రజల గుండెల్లో ప్రతిధ్వనించింది. గురవయ్య పోరాట పటిమను కీర్తించింది.

అలాగే 1947లో సూర్యాపేట తాలూకా, అన్నారుగూడెంలో 'పడిశాల పిచ్చయ్య' అనే హరిజన యువకుడిని నిజాం పోలీసులు అరెస్టు చేసి, సంఘం సంగతులు చెప్పమని చిత్రహింసలుబెట్టారు. చింత బరెసెలతో వీపు చిట్లగొట్టారు. రెక్కలుగట్టి నేలపై బరబరా యీడుస్తూ ఊరంతా తిప్పారు. అయినా మేరు పర్వతం వలె చలించక నిలిచిన ఆ యువకిశోరం గుండెల్లో పొడిచి, కసిదీరక పోలీసులు ఘోరంగా కాల్చిచంపారు. ఆ వీరునికి నివాళు లర్పిస్తూ...

'విప్లవపు జోహార్లురా
పడిశాల పిచ్చయ్య గైకొమ్మురా ॥వి॥

సుత్తెకొడవలి జండ నెత్తిపైనుండగా
పార్టి సభ్యుని పేరు పరువు నాకుండగా
ఎదు రేమిటన్నావురా ప్రాణాల
నెదురొడ్డి నిలిచావురా ॥వి॥

అన్నారు గూడెంబు నినుగన్న భాగ్యాన
అమరత్వమే పొంది ఆదర్శమయ్యింది
ఆంధ్ర విప్లవ జ్యోతిరా నీ చరిత
ఆరాధ్య మౌతుందిరా ॥వి॥'

అంటూ రామాంజనేయకవి గానం చేశారు. అమరవీరుని ఆదర్శ చరిత్రను కొనియాడారు.

'వీరమట్టారెడ్డి ... ఉయ్యాలో
ధీర అనంతరెడ్డి ... ఉయ్యాలో
మీ వీర మరణమును ... ఉయ్యాలో
మరువమెన్నటికైన ... ఉయ్యాలో'

అంటూ సాగే ఉయ్యాలపదంలో నల్లగొండ ప్రజల వీరోచిత పోరాటంలో అమరులైన వీరులను శ్రీమతి స్వరాజ్యంగారు స్తుతించారు.

ఆలాగే మరోగీతంలో...

'రోజూ విన్నాం - ప్రతిరోజు కన్నాం
ఎవరో అజ్ఞాత వాసి
ఎవరో ఒక అమరజీవి
విప్లవ ప్రస్థానంలో
విగతుడైన విషాద వార్త ॥రోజూ విన్నాం॥

పవిత్ర పోరాటంలో
ప్రాణ మొడ్డు ప్రతి వీరుని
ప్రత్యక్షంగా నెరుగను
అయినా నాకాప్తుడతడు ॥రోజూ విన్నాం॥

కడవరకూ గొంతుకలో
కొనఊపిరి ఉండుదాక
ప్రజకోసం పలవరించి
కలకాలం కలవరించి
విప్లవ ప్రస్థానంలో
విగతుడైన విషాద వార్త ॥రోజూ విన్నాం॥

నా యోధుడు సమరంలో
నవ్వుతూనె ఒరిగినాడు
నా నెచ్చెలి ఆశించిన
నవ్యజగతి నా లక్ష్యం
నా యోధుడు నడిచినట్టి
బాటలోనె నా యానం
నా యోధుని బలిదానం
నా కొక ఆజ్ఞాపత్రం ॥రోజూ విన్నాం॥

అంటూ శ్రీ టి.వి. కృష్ణ విప్లవ వీరులను స్మరిస్తూ 'విప్లవాంకిత' మైనారు.

## సాయుధ సమరగీతాలు

1947 సెప్టెంబర్ 11న 'ఆంధ్ర మహాసభ', 'కమ్యూనిస్టు పార్టీ'లు సంయుక్తంగా సాయుధ సమరానికి పిలుపునిచ్చాయి. ప్రజా కమిటీలు, సాయుధ గెరిల్లా దళా లేర్పడ్డాయి దాదాపు నాలుగు వేలమంది దళసభ్యులతో గ్రామ రక్షక దళాలు పోరాటం ప్రారంభించాయి. ఈ పోరాటం క్రమంగా విస్తృత రైతాంగ ప్రజా పోరాటంగా పరిణమించింది. రజాకారు గూండాలతో, నైజాం పోలీసు, మిలటరీలతో ప్రత్యక్ష పోరాటానికి పూనుకున్న తెలంగాణా ప్రజానీకాన్ని ప్రశంసిస్తూ, ఉత్సాహపరుస్తూ, ఉత్తేజపరుస్తూ వందలాది సాయుధ సమరగీతాలు వెలువడ్డాయి ప్రజలీ పాటలు పాడుకున్నారు. పాడుతూ పోరాడారు. పాటల్లో నూతనావేశాన్ని చవి చూశారు.

'మన తెలంగాణలో రణభేరి మ్రోగింది
మనిషి మనిషీ నడుము కట్టాలి - కట్టి,
మన శత్రువును కూలగొట్టాలి - యెర్ర
జండాలు యింటింట కట్టాలి - ఆంధ్ర
సంఘాలు వూరూర పెట్టాలి
నలగొండ రణములో తెలుగు తెగువను చూపి
బలియైన వీరులను తలవాలి - నిలిచి
హిందువులు ముస్లిములు కలవాలి - కలిసి
తెలంగాణ సంకెళ్ళు త్రెంచాలి'

అనే పోరాటం పిలుపు వినిపించిన పిడుగు దాశరథి-

'విల్లంబులు చేతబూని
వెడలి రండి కదలి రండి
బాలవీర దళాలెల్ల
ఫౌజుదీరి పదండోయ్ ॥వి॥

తెలుగువాడి కురుభూములు - తెలంగాణ రణభూములు
విజయదశమి వచ్చిందట - అజేయులై నిలిచారట...
తుది సమరం ముగిస్తాను - తొందరగా రారమ్మని
తొడ యదల్చి అరిచాడట - తెలంగాణ భీమబలుడు'

అంటూ తెన్నేటి సూరి విప్లవ విజయదశమిని చిత్రించారు.

'అల్లీ బిల్లీ రామన్నా - అంతా వొకటే భీమన్నా
అలీ అల్లీ రంగప్పా - అంతా ఒకటే వెంగప్పా

పిల్లా జెల్లా లేలెండి - కల్లాకపటం మానండీ
పిల్లీ నల్లీ కాకండీ - భీతి భిక్కూ వీడండి'[1]

అంటూ కయ్యం సాగిన, కత్తులెత్తిన, మీసం దువ్విన, కూసం విడిచిన, బాకులు పట్టిన, బరిసెలు విసిరిన తెలంగాణా వీరుల వెన్ను తట్టారు తెన్నేటిసూరి.

'ఛలో ఛలో నైజాం ప్రభుత్వపు జులుములు నణచంగా
ప్రభుత్వపు జులుముల నణచంగా
స్వతంత్ర భారత రాజ్యాంగమ్మున త్వరితమె కలుపంగా'

చలో ఛలో అని శ్రీ ఆట్లూరి ప్రజల్ని కదిలించారు.

'తెలంగాణ గర్జించింది - తెలుగు బిడ్డలను పిలిచిందీ
పేదలరక్తం పిండుకుతాగే - నాజీ నరహంతకులపై
కత్తిదూసి లంఘించింది - నదిమి గదమిమరి తంతోంది'

అని 'తెలంగాణా గర్జన'ను ఆంధ్రప్రాంత ప్రజలకు సుంకర సత్య నారాయణ వినిపించారు.

'తెలగాణ ప్రజలంత కలవాలోయ్
తెగువతో పోరాడి గెలువాలోయ్
నైజాము ప్రభువన్న - నరకాసురుని అన్న
హిట్లరుకు సోదరుండీ మీర్జయిస్మాయిల్
తొత్తులే దేశముఖు లున్నారోయ్
పెత్తనము వెలిగించ దలచారోయ్'

అంటూ తెలుగు ప్రజల 'రణ గర్జన' వినిపించిన కోగంటి గోపాల కృష్ణయ్య...

'దోపిడి దొంగకు - తొత్తుర నైజాం
కక్కిన కూటిని - మెక్కుచు బ్రతికే
భోగలాలసుడు - జాగీర్దార్
నానా హింసలు - దారుణ హత్యల్
నిలువున దోచెడి - నీచులందరి
అబ్బ వచ్చినా దెబ్బకుదెబ్బ తరిమితరిమి కొడతాం'

అనే సంకల్పాన్ని ఉద్ఘాటించారు.

'కదిలింది కదిలింది - కదిలింది తెలంగాణ
కడలి పొంగినరీతి - కదనాని కురికింది ॥కదిలింది॥

1. 'విజయదశమి' (గీతం) - తెన్నేటి సూరి, - 'నవయుగ' పక్షపత్రిక, మే 1948.

ప్రజల రక్తము పీల్చు - పాపిష్ఠి దొరలంత
ప్రాణాలు చేబట్టి - పారిపోతున్నారు ॥కదిలింది॥
ఒడలెరుంగని పొగరు - నడమంత్ర సుల్తాను
మిడిసిపడు సైన్యాలు - గూండాలు గిండాలు
పడి భస్మమౌతారు ప్రజల క్రోధానలజ్వాలలో'

అని తెలంగాణా తిరుగుబాటుకు నివాళులర్పించిన కొండేపూడి లక్ష్మీ నారాయణ......

'తెలంగాణ గెరిల్లాలు - కదనభూమి కురికినారు
తొలగిపోవు దాస్యమింక - తప్పదోయి నేటితో'

అనే చారిత్రక ఆశావాదాన్ని గానం చేశారు.

'భవ్యోజ్వల యుగపురుషుడు
నవ్యోజ్వల యుగనారీ
మృత్యువు నెదిరించే శక్తులతో
రక్తాన్నుడికించే గీతాలతో
నైజాం రాక్షసి నణిచేసేందుకు
నడవండి నవజ్యోత్స్నల్లారా!'[1]

అని శ్రీ నారపరెడ్డి చంద్రారెడ్డి ఉద్బోధించారు.

'వెలిగిందోయ్ తెలంగాణ
కదిలెన్ విప్లవ పథాన
నవభారత భాగ్యోదయ
నవనంబున కిరణంబై
నరవేదన పరపీడన
పరిమార్చగ జనతేజము ॥వె॥
చెరసాలలు పెనుబాధలు సైన్యాలు తుపాకి బార్లు
మరణానికి వెరపేలని - సెగనెత్తుటి జవముందని
వెలిగిందోయ్ తెలంగాణా'[2]

అంటూ గొంతెత్తి గానం చేసిన ప్రజా గాయకుడు గోపాలం.

'బాలవీరు లెవ్వరురా? బాలచంద్రు లెక్కడరా
నవాలన్న నైజాముకు - సమాధాన మెవ్వడురా?

---

1. 'ప్రజాశక్తి' దినపత్రిక, 18-1-1948.
2. 'నవయుగ' (మాసపత్రిక) సెప్టెంబర్, 1947.

తెలుగు బిడ్డ లెక్కడరా? - వెలుగు కత్తు లెక్కడరా?
సవాలన్న నైజాముకు - సమాధాన మెవ్వడురా?

అన్ని ప్రశ్నించిన తెన్నేటి సూరి...

'తెలంగాణ తమ్ముని పై - చేయెత్తిన కబంధుడ్ని
వధించగల మొగాడుంటె - బయల్దేరు బరిమీదికి
మన తల్లిని చీరలొల్చి - మానభంగమటరా, ఛీ
బ్రతికెందుకు మనమింకా - బయల్దేరు బయల్దేరు'

అంటూ ఆంధ్ర ప్రాంత వీరుల్ని బయల్దేర దీశారు. ఆంధ్ర ప్రాంతం నుండి అనేకమంది వీరులు వచ్చి వీరోచిత తెలంగాణా పోరాటంలో పాల్గొన్నారు. ఆంధ్ర ప్రాంత ప్రజలు ఇక్కడి పోరాటానికి కావలసిన ఆయుధాలు కొనడానికి డబ్బులు వసూలుచేసి పంపారు. నైజాం నవాబు నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా తెలుగుజాతి ఒక్కటై నిలిచింది. ఇక్కడి పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొంటూ, ఇక్కడి నాయకులకు సలహాలివ్వడానికి ఆంధ్ర ప్రాంతం నుండి కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణగారిని పంపింది కమ్యూనిస్టుపార్టీ. అలాగే మరికొందరు పార్టీ నాయకులు ఇక్కడి పోరాటంలో పాల్గొన్నారు. తూటాలకూ, లాఠీలకూ ఎదురు నిలిచారు.

'మన కొంపలార్చిన - మన స్త్రీల చెరచిన
మన పిల్లలను చంపి - మనల బంధించిన
మానవాధములను మండలాధీశులను
మరచిపోకుండగా గురుతుంచుకోవాలె
కసి ఆరిపోకుండ బుసకొట్టు చుండాలె
కాలంబు రాగానె కాటేసి తీరాలె'[1]

అనే ఉద్యమ సందేశాన్నందించిన కవి కాళోజీ.

ఉద్యమం ఊరూ వాడా విస్తరించింది. పిల్లలూ, పెద్దలూ, వయోవృద్ధులూ కర్రలో, కత్తులో, బరిసెలో, బల్లాలో, తుపాకులో, బాంబులో చేబూని నైజాం సైన్యాలనూ, రజాకారు మూకలనూ ఎదుర్కొనసాగారు.

గ్రామాల్లో ఆంధ్ర మహాసభ సమావేశాలు జరుగుతున్నప్పుడు భూస్వాములు పంపే రౌడీలు, రజాకార్లు దాడి చేసేవాళ్ళు. సంఘ సభ్యులు గుత్పలు దీసుకుని ఎదురు దాడిచేసి రౌడీలను తిప్పిగొట్టేవారు. ఒకసారి సుద్దాల హనుమంతు దళం సభా కార్యక్రమంలో మైమరిచి ఉండగా రజాకర్ల, రౌడీలదండు వారిపై అకస్మాత్తుగా పడింది. ఇది చూసిన ఓ తలనెరసిన ముసలమ్మ తన

1. 'నా గొడవ' - కాళోజి నారాయణరావు - (జనవరి, 1953).

జీవితానుభవాన్ని రంగరించి పలికిందా అన్నట్లు కంపిస్తున్న కంఠంతో 'వేయ్ దెబ్బ - దెబ్బకు దెబ్బ' అని ఎలుగెత్తి నినదించింది. ఈ నినాదం దిక్కులు పిక్కటిల్లింది. జనం రౌడీలపై ఎదురు తిరిగి దెబ్బకు దెబ్బ వేశారు. రక్తసిక్త దేహాలతో రౌడీలు పలాయనం చిత్తగించారు. ఆ సన్నివేశం, ఆ ముసలమ్మ గుండె గొంతులోంచి వెలువడిన ఆవేశనాదం సుద్దాల హన్మంతు చేతిలో అద్భుత గేయంగా రూపొందింది. ఉధృత భావావేశం, వేగాత్మక లయతో వెల్వడిన ఈ గేయం 'పోరుపాట'గా ప్రజల్లో ప్రవహించింది.

'వెయ్ వెయ్ వేయర దెబ్బ
దెబ్బకు దెబ్బ - వెయ్ వెయ్
దయ్యపు గుండా గోయలు తుర్కలు
కయ్యమునకు మనపై బడి వచ్చిరి
ఇయ్యర మొయ్యర వేయర బడితను
కుయ్యో మొర్రన కోయర చురికతో
చియ్యలు ప్రయ్యలు మేయగ గద్దలు ॥వెయ్॥
లేరా లేరా! రారా వేగ మె-రైతు! కూలీ! రావూ! రెడ్డీ!
నేతా గీతా కుర్మ గొల్ల - కుమ్మర కమ్మర
హరిజన గిరిజన నడువర ముందుకు నడుం బిగించి
కొడవలి కటారి గొడ్డలి చిల్లబాకు వడిశెల బర్మి తుపాకి
చేకొని రణములో దూకర జైయ్యని
నరకర ఎగబడి పొడవర తెగబడి
పేటుకు ఇద్దరు పోటుకు ముగ్గురు'

అంటూ సాగే ఈ గీతం ప్రజల ఆగ్రహానికి సంకేతం

సాయుధ గెరిల్లా దళాలు శత్రు వలయాలను ఛేదించుకుని ముందుకు సాగి పోతున్నాయి. మిలటరీ క్యాంపులపై దాడులు చేస్తున్నాయి భూస్వాముల బంగళాలను విధ్వంసం చేస్తున్నాయి. వేల సంఖ్యలో ప్రజలు గెరిల్లా దళాలకు తోడ్పడుతున్నారు.

ప్రజాకంటకులైన భూస్వాములందరికీ పెద్దగా పేరెన్నికగన్న జన్నారెడ్డి ప్రతాపరెడ్డిది ఎర్రబాడు గడీ. ఆ గడీలో పోలీస్ క్యాంపు ఉన్నట్లు ప్రజలు గమనించారు. అదివరకే పోలీసు క్యాంపులున్న అనేక దొరల బంగళాలు నేలమట్టమయ్యాయి. ఎర్రబాడు గడీని కూల్చేదాకా ఎర్రజెండా వీరులకు విశ్రాంతి ఉండదు. పథకం సిద్దమయింది. సాయుధ గెరిల్లా దళాల నాయకత్వాన ప్రజలు గడీని చుట్టుముట్టారు. జజ్జాయిలో మందు దట్టించి బంగళా చివరి అంతస్తునున్న

గడిని పేల్చే ప్రయత్నం చేశారు. గడి కూలలేదు. గోడకు రంధ్రం మాత్రం పడింది. ఆ గడిలో ఉన్న నైజాం మిలటరీ సైనికులు కాల్పులు మొదలెట్టారు. ఆనాటి పోరాటంలో గడీ స్వాధీనం కాలేదు. కానీ బంగళాపై ఉన్న ఇద్దరు మిలటరీ వాళ్ళు మాత్రం నేలగూలారు. పదిగంటల హోరాహోరి తర్వాత ప్రజలు వెనక్కి మళ్ళారు. ఆ మరునాడు ప్రభుత్వ ఆశ్వికదళం చిల్పకుంట గ్రామం మీద దాడిచేసి ఎందరో యువకుల్ని కాల్చిచంపింది. ఎర్రబాడు క్యాంపును కూడా ఎత్తివేసింది. కోపోద్రిక్తులైన ప్రజలు ఆ తర్వాత నాలుగు రోజులకే ఎర్రబాడు గడీని, గడీలోని బంగళాని కసిదీరా కూల్చి నేలమట్టం చేశారు. ఆ స్థలంలో అమరవీరుల స్మారకార్థం తొమ్మిది సమాధులను నిర్మించారు. జన్నారెడ్డి ప్రతాపరెడ్డి పరిపాలన అంతమయింది. ఆ ప్రజాద్రోహికి చెందిన వేయి ఎకరాల పండ్ల తోటలను ప్రజలు స్వాధీనం చేసుకున్నారు. అలా దొర చెర నుండి విముక్తమైన బంగారుభూమిని చూసి...

'కళకళలాడే కనకము కురిసే - తెలంగాణ భూమి
మా... తెలంగాణ భూమి
పచ్చపచ్చని పైరుపండి వొరిగింది భూమి
వచ్చింది దున్నేవానికి భూమి
తెలంగాణలోన, మా తెలంగాణలోన'

అంటూ శ్రీ తిరునగరి రామాంజనేయులు ఆనందగీతాలు ఆలపించారు.

## పోరాటసీమకు నివాళి

రైతాంగ సాయుధ పోరాటానికి ఆటపట్టయిన తెలంగాణసీమను ప్రశంసిస్తూ; పోరాటసీమకు నివాళు లర్పించారు కవులు.

'మూగవోయిన కోటి తమ్ముల గళాల
పాట పలికించి కవితా జవమ్ముకూర్చి
నా కలానకు బలమిచ్చి నడిపినట్టి
నా తెలంగాణ కోటి రత్నాల వీణ'

అన్నారు దాశరథి.

'భళిరె తెలంగాణ
వహరె తెలంగాణ
బహద్దూర్ తెలంగాణ
తెలుగుదేశం పేరు చెప్పితే - తేజిక్కాళ్ళం లేదు
తలుపు గొళ్ళెం లేదు - ఈ మెకు బల్లెం లేదు - నీటికి పల్లం లేదు ॥భళిరె॥

తెలుగు వీరుల పేరు వింటే - తెల్లదొరలు తెలివి దప్పిరి
నల్లదొరలు నాట్యమాడిరి - నైజాము నడుము విరిగె ॥భళిరె॥
తెలంగాణం పేరు వింటే - రంతు లణిగె
దొరలు జాగీరుదారులంత - పారిపోయిరి పట్టణాలకు ॥భళిరె॥'

అని సుద్దాల హనుమంతు ప్రశంసించారు.

'అదిగదిగో అదే అదే - తెలంగాణా రణరంగం
అది విలయ ప్రభంజనం - అది ప్రళయ విజృంభణం
అది యుగాంత సంధ్యారాగం - పొడిచికొన్న క్రోధోద్రేకం'

అంటూ విద్వాన్ విశ్వం 'తెలంగాణా జైత్రయాత్ర'లో తెలుగు వీరుల ప్రతాపాగ్నిని, కదన రంగంలో కదలాడిన వీరాంగనల వీర విహారాన్ని కొనియాడారు.

'జోహారు రణవీణా! జోహారు రణవీణా!
జోహారు తెలగాణా! జోహారు తెలగాణా!'

అంటూ తెలగాణ రణవీణకు జోహార్లు పలుకుతూ...

'అగ్ని పద్మమౌ తెలంగాణలో
విచ్చిన తొలిరేకు నల్లగొండరా!
ఆ దెస జోడుము! పల్లె పల్లెకు
జేవురు కొండల గుండెలవే సఖ!'

అని అగ్నిపద్మమౌ తెలంగాణలో విచ్చిన తొలిరేకు నల్లగొండకు నివాళు లర్పించిన అభ్యుదయ కవి నార్ల చిరంజీవి.

'నల్లగొండరా విప్లవపు గుండెరా
కొల్లగొట్టి తిను దోపిడి మూకల
గుండెల్లో పెనుగాలంగా నల
గొండ విప్లవోద్దండ శక్తియై
చండ ప్రచండత చాటించి మన
నల్లగొండరా! తెలంగాణ గుండెరా!'

అంటూ నైజాం పరిపాలన నుండి తెలంగాణా ప్రజలకు విముక్తిని కలిగించి, మూడువేల గ్రామాల్లో ప్రజాపాలనను నెలకొల్పి, దేశానికి దివ్యాశాజ్యోతై, ప్రపంచ పీడిత తాడిత శక్తుల ప్రశంసలందిన విప్లవగుండె నల్లకొండకు కైమోడ్పులందించిన జనరణకవి తిరునగరి రామాంజనేయులు......

'సైసై ఓ నల్లగొండ ధీరుండా
నీ వెత్తెదే ఎర్రజండా ॥సైసై॥

నల్లగొండ నీ పేరు జెప్పితే
ఢిల్లీకోటలో గుండెఝల్లుమను
తెల్లదొరలె మా నల్లగొండకూ
టోపీలెత్తి సలాము చేసిరి ॥సైసై॥
ఎఱ్ఱ బావుటా నీడల క్రిందా
వెచ్చని నెత్తురు ఏరులు బారీ
మూడువేల మృత వీరసమాధుల
పుణ్యక్షేత్రమీ నల్లగొండరా ॥సైసై॥'

అంటూ నల్లగొండ వీరకిశోరాల్నీ, నల్గొండ వీరభూమినీ మనసారా అభినందించారు.

## సైనిక చర్య

హైదరాబాద్ రాష్ట్రం ఇండియన్ యూనియన్‌తో విలీనం కాకుండా 'స్వతంత్ర సంస్థానం'గా నిజాం నవాబు ప్రకటించాడు. మహోధృత ప్రజా యుద్ధం కొనసాగింది. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన దాదాపు 3 వేల గ్రామాలు భూస్వాముల చెరనుండి విముక్తమయ్యాయి. వేలాది ఎకరాల భూమి దున్నే వారికి దక్కింది.

ఈ నేపథ్యంలో హైదరాబాద్ రాష్ట్రాన్ని స్వాధీనం చేసుకోవడానికి 1948 సెప్టెంబర్ మాసంలో యూనియన్ సేనలు సైనిక చర్య ప్రారంభించాయి. కోదాడ, మునగాల దరిదాపుల్లో యూనియన్ సైనికులకు, నైజాం పోలీసులకు ఘర్షణలు జరిగాయి మహారాష్ట్ర, కర్నాటక సరిహద్దుల్లోనూ చెదురుమదురుగా కొన్ని ఘర్షణలు జరిగినా, ఎక్కువ ప్రతిఘటన లేకుండానే నైజాం పోలీసులు యూనియన్ సైనికుల ముందు లొంగిపోయారు సెప్టెంబర్ 18 నాడు సైనికచర్య పూర్తయ్యింది. యూనియన్ మిలటరీ సైన్యాలకు కేంద్రస్థానమైన సికింద్రాబాద్ కంటోన్మెంటుకు వెళ్తామంటూ ...

'లష్కరు పోదాములో! రంగన్నా! రారో
మన ఫౌజును సూద్దాములో! సింగన్నా! రారో
రజాకారు బడాచోరు రాజ్యం పోయిందిరో
నైజాము సర్కారోడు నవ్వులపాలాయెరో'[1]

అంటూ ఆనందంగా పాడుకున్నారు ప్రజలు. యూనియన్ సైనికులు తమను కాపాడడానికే వచ్చారని; ఇండియన్ యూనియన్‌లో విలీనం కాగానే

1. 'తెలంగాణా పోరాటం - సాహిత్యం' (వ్యాసం) - కె. వి. రమణారెడ్డి అరుణతార, 1984.

తమ కష్టాలు గట్టెక్కుతాయని ప్రజలు భావించారు. ప్రజలేకాదు, కొందరు కవులు, కళాకారులు కూడా ఇదే భావాన్ని వ్యక్తం చేశారు.

కుందుర్తి కృతుల్లోని 'తెలంగాణా' వచన కావ్యంలో...

'అందుకే యూనియన్ సైన్యాలకు స్వాగతం
అణచి వేసినందుకు అంతులేని దురాగతం'

అని రాశారు యూనియన్ సైన్యాలకు స్వాగతం పలికారు.

'దూరాననున్న చుట్టము
దూరాననె ఆగె! తెల్ల దొంగ సభస్సం
చారి యయిపొరె, స్వేచ్ఛా
భారత సైన్యమ్ము తలుపు బ్రద్దలు కొట్టెన్'

అని కీర్తించిన దాశరథి...

'రెండు వందల యేండ్ల చరిత్ర పుటల
కప్పు కొనియున్న గాఢాంధకారమెల్ల
కొట్టుకొని పోయె...'[1]

నంటూ సంతోషాన్ని వ్యక్తం చేశారు.

కాంగ్రెస్ నాయకులు, కాంగ్రెస్‌పార్టీ అనుయాయులు పోరాటాన్ని ఆపివేశారు. కాంగ్రెస్ అనుకూల ప్రభుత్వాన్ని తెలంగాణా ప్రాంతంలో ఏర్పాటుచేసే కలలు గనడం ప్రారంభించారు.

వారం, పదిరోజుల్లోనే కేంద్ర ప్రభుత్వం పంపిన యూనియన్ సైన్యం నిజస్వరూపం ప్రజలకు తెలిసిపోయింది. నిజాం వారసులపై, రజాకార్లపై కాదు; భూస్వాములకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజా సైనికులపై యూనియన్ సైనికుల తుపాకులు మ్రోగాయి. గ్రామాల నొదలిన భూస్వాములంతా కుచ్చు టోపీల నొదిలి గాంధి టోపీలు ధరించి, షేర్వానీల స్థానంలో ఖద్దరు దుస్తుల్ని ధరించి మళ్ళీ గ్రామప్రవేశం చేశారు.

కాడి ఎద్దుల డబ్బ తెచ్చారా దొరలు
కాంగ్రేసుతో కలిసి వచ్చారా ॥కాడి॥
కడుపుమండిన ప్రజల కండ్ల నిప్పులు సరిసి
దావానలంబైన ధాటికోర్వక దొరలు
మేడలిడిచి పరుగు దీసారోయ్ - తిరిగి నేడిదే అదనంచు
వచ్చారోయ్ ॥కాడి॥

1. రుద్రవీణ - దాశరథి

న్యాయహక్కుల కొరకు నైజామ్‌తో పోరాడు
నాయకుల పట్టించి జైళ్ళలో పెట్టారు
నాటివేషము దీసివేశారా - రజ్వీనాయకత్వం విడిచిపెట్టారా?
॥కాడి॥

యు.పి.సి.పి నుండి యూన్యనూపోలీసు
తోపు గోలలతోటి తెలంగాణ జేరగనే
తెల్లటోపీల్ పెట్టుకోలేదా? వచ్చి కళ్ళంత బొట్లుబెక్కించపలేదా?
॥కాడి॥

ఏనాటి కక్షలో ఈనాడు సాధించ
ఏమెరుగని మిలటరీకి ఎగబోసి దిగబోసి
కాల్చులే సాగించగా లేదా - చస్తె కమ్యూనిస్టని చెప్పగాలేదా
॥కాడి॥'

అంటూ సుద్దాల హన్మంతు ఆగ్రహగీతాలు పాడారు.

'పోరాట మాపినావు తీరింద నీదు వంతు
వచ్చిందా ప్రజారాజ్యం ఓరన్న కాంగ్రెసన్న
తుచ్చాని కొచ్చినావు తగదోరి కాంగ్రెసన్న
రాకాసి నైజామోడు రగతాన్ని తాగుతుంటె
రాజీకి లొంగినావా ఓరన్న కాంగ్రెసన్నా
నాజీలమించినావా ఓరన్న కాంగ్రెసన్నా
నడుమిరిగి నిజాముంటే సరదారు వల్లభాయి
తన బలము సాయమిచ్చె తగునటర కాంగ్రెసన్నా
ప్రజనోట మన్నుగొట్టే పరువటర కాంగ్రెసన్నా'

అని తిరునగరి రామాంజనేయులు సూటిగా ప్రశ్నించారు.

మరోవైపు కాంగ్రెస్ సానుభూతి పరులైన కవులు, కళాకారులు వచ్చి కమ్యూనిస్టు వ్యతిరేక గీతాలను ప్రజల్లో ప్రచారం చేశారు

కమ్యూనిస్టులపై విచక్షణారహిత దాడులు జరుగుతుంటే తమను తాము రక్షించుకోవడం కోసం గెరిల్లా దళాలు, కమ్యూనిస్టు సానుభూతిపరులు ఆయుధాలు స్వీకరించి, అడవుల్లో దాక్కుంటూ పోరాటం కొనసాగించసాగారు. ఇదే అదనుగా భావించిన కాంగ్రెస్‌వారు...

'ప్రజాసేవ అన్నారు - ప్రజలు కష్టపడుతుంటె
దెబ్బలెన్నో తింటుంటే - పారిపోతూ ఉంటారు-
మోసగాళ్ళను నమ్మవద్దు - అశాంతి లేపవద్దు

శాంతిని కాపాడవలయు - శత్రువులను దునుమాడవలయు
పట్టి బంధించవలయు - అల్లరుల నణచవలయు
హాయిని చేకూర్చవలయు - స్వతంత్ర మనుభవించవలయు'[1]

అంటూ కమ్యూనిస్టు వ్యతిరేక భావాలను ప్రచారం చేశారు.

'జాతీయతను నాశనంచేసి-రష్యా రంగుల మొగాంరుద్ది
రైతుకూలీ మంత్రాల్ చదివి-మాటలు చెప్పే కమ్యూనిస్టుల
పంథాలోని పరమ రహస్యం-కుండ బద్దలుగ కొట్టాలోయ్'[2]

అంటూ విషాన్ని వెలిగక్కారు భూస్వాముల అనుయాయులు.

## ఆరని పోరాట గీతాలు

యూనియన్ సైన్యాలు గ్రామాలపైబడి స్త్రీలను, పిల్లలను, వయోవృద్ధులను కూడా విడువకుండా చిత్రహింసలు బెట్టసాగారు. వందలాది వీరయోధుల్ని కాల్చి చంపసాగారు. పోరుపాటల్ని వినిపించే కవులు, కళాకారులు, రచయితలు, సాంస్కృతిక దళాలు రహస్య జీవితంలోకి వెళ్ళాయి. పార్టీ కార్యకర్తలు అరణ్యాల్లో తలదాచుకుంటూ, ఆత్మ రక్షణకోసం ఆయుధాలు ధరించి తిరుగుతున్నారు. అంత కఠిన నిర్బంధంలోనూ గ్రామాల నొదిలిన కార్యకర్తలు అరణ్యాల్లో జనరణగీతాలు పాడుకున్నారు.

'కాల్చినను నిలబెట్టి మంటల
పేల్చినను ఇసుమంత లొంగక
నిల్చి రాజ్యాన్నేలుకొందాం'

అని ప్రతినలు బూనారు.

'పోయే పోయే పోయే - తెలంగాణ బంధనాలు
నిలిచాము ప్రాణమొడ్డి - బంగారు తెలుగుతల్లి
పటేలంటే పటేలు గాడురా
అడవి పందినీ మించినాడురా
హిట్లరంత వీడయ్యి ఉండగా
ఇరుగదన్ని లేచినాం - పటేలు పల్లబాయె
ఒదిగుండు వల్లభాయి - పరుసాన వల్లభాయి
వచ్చుచున్నది కొత్తనీరురా - ఉరగటానికే వీలులేదురా
నదుల గుట్టల రెగబాకె నీరురా

1. 'దళాల గుట్టు బట్టబయలు' - కె. ఎల్ ఎన్. సింహ, 1949.
2. 'సాధన' - ప్రభాత పుస్తకశాల.

అరణ్య ప్రాంతపు నదీజలాలంతో - కొట్టుక
వచ్చే పీనుగలన్ని లెక్కబెట్టుకోరా
ఓరోరి వల్లభాయి నీకు దిక్కులేదు
పోరోరి తెలంగాణ గడ్డనుండి'

అంటూ గర్జించారు తెలంగాణ వీరులు.

అలాగే జైళ్ళలో నిర్బంధింపబడిన జ్ఞాతకవులు, అజ్ఞాత కవు లెందరో జైలు గీతాలు అల్లుకుని గానం చేశారు

## పోరాట విరమణ

తెలంగాణా వీరుల రక్తతర్పణలతో ఎరుపెక్కిన నేలమీద మరింత రక్త పాతం జరగకుండా, బలమైన యూనియన్ సేనలతో ఇంకా తలపడి విలువైన కార్యకర్తల్ని పోగొట్టుకోకుండా; అనేక తర్జన భర్జనల తరువాత 1951 అక్టోబర్ చివరి వారంలో సాయుధ పోరాటాన్ని విరమిస్తున్నట్లు 'కమ్యూనిస్టు పార్టీ' ప్రకటించింది సాయుధ పోరాటాన్ని విరమించినా, సామ్యవాద వ్యవస్థ నిర్మాణం కోసం అనేక పోరాట రూపాలద్వారా తన సంఘర్షణను కొనసాగిస్తూనే ఉంది. 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' నినాదంతో సమైక్యాంధ్ర రాష్ట్ర నిర్మాణానికి పోరాడింది 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' నినాదంతో ఉద్యమాలు నిర్వహించింది. వేర్పాటువాద ఆందోళనలకు ఎదురొడ్డి నిలిచి తెలుగు జాతి సమైక్యతను పరిరక్షించింది

'ప్రజా ప్రభుత్వం ప్రజాప్రభుత్వం
ప్రజా ప్రభుత్వం సాధిస్తాం
నిజాములో ప్రతి బజారులో - మా,
ధ్వజం ఎర్రనిది ఎగరేస్తాం'

అని ప్రజా కవులచేత ప్రతిజ్ఞలు చేయించింది.

## సాహిత్యంపై ఉద్యమ ప్రభావం

మహోజ్వల తెలంగాణా సాయుధ పోరాటం విరమింపబడినా, ఈనాటికీ ఆధునికాంధ్ర సాహిత్యంపై దాని ముద్రలు కనుమరుగు కాలేదు.

1938 కి పూర్వంనాటి తెలంగాణా గ్రామీణ జీవన వాస్తవికతను శ్రీ వట్టికోట ఆళ్వార్‌స్వామి 'ప్రజల మనిషి' నవలలో చిత్రించారు. 1940 తరువాతి కాలంనాటి తెలంగాణా ప్రజల ప్రతిఘటన చైతన్యాన్ని 'గంగు' నవలలో ప్రతిబింబింపజేశారు. నిజాం ప్రభుత్వ నిర్బంధానికి గురై, జైలు జీవితాన్ని గడిపిన అనుభవంతో 'జైల్లోపల' కథలు రాశారు. సికింద్రాబాద్ సాంస్కృతిక జీవితంతో మమేకమైన ఆ మహా మనిషికి దాశరథి తమ 'అగ్ని

ధార'ను, కేతవరపు రామకోటి శాస్త్రి తమ పిహెచ్.డి సిద్ధాంత గ్రంథాన్ని, దాశరథి రంగాచార్య 'జనపదం' నవలను అంకితమిచ్చారు ఆళ్వార్‌స్వామి సాహిత్యానికి నిజమైన వారసుడైన దాశరథి రంగాచార్య 'చిల్లర దేవుళ్ళు', 'మోదుగు పూలు', 'జనపదం' మొదలైన నవలలు రాశారు. మహీధర రామ్మోహనరావు 'ఓనమాలు', 'రథచక్రాలు', బొల్లిముంత శివరామకృష్ణ 'మృత్యుంజయులు' మొదలైన నవలలు పోరాట ప్రేరితాలే.

పొట్లపల్లి రామారావుగారి 'జైలు' (కథలు), 'చుక్కలు', 'మెరుపులు', 'ఆత్మవేదన' కవితా సంపుటులు తెలంగాణా పోరాటాన్ని, ఇక్కడి ప్రజల సామాజిక జీవితాన్ని చిత్రించాయి.

పోరాటం తరువాతి కాలం నాటి తెలంగాణా జీవితాన్ని చిత్రిస్తూ శ్రీ కాంచినేపల్లి చిన వెంకట్రామారావు 'మన వూళ్ళో కూడానా?' కథల సంపుటి ప్రకటించారు

గూడూరి సీతారాం కథలను 'స్రవంతి' పత్రిక ప్రచురించింది. సురమౌళి కథలు కూడా వివిధ పత్రికల్లో అచ్చయి, ఇక్కడి ప్రజా జీవితాన్ని ప్రదర్శితం చేశాయి.

హైదరాబాద్ సంస్థానం రద్దవుతున్న చివరి రోజుల్లో ఇక్కడి నవాబుల జీవితాలను, హిందూ ముస్లిం సంబంధాలను చిత్రిస్తూ నెల్లూరి కేశవస్వామి రాసిన కథలు 'చార్మినార్' శీర్షికన సంపుటిగా వెలువడ్డాయి.

పోరాట స్మృతులను వివరిస్తూ కె. ప్రతాపరెడ్డి (ప్రజా నాట్యమండలి) గారు 'వీర తెలంగాణా' (జనపదం) రచించారు. సుద్దాల హనుమంతు అసంపూర్తిగా వదలిన యక్షగానాన్ని, అతని కుమారుడు సుద్దాల అశోక్ పూర్తి చేసి ప్రచురించాడు.

ఇలా ఎన్నో సాహిత్య, కళారూపాలు సాయుధ పోరాటానికి సంకేతాలుగా నిలిచాయి. ఉద్యమ సాహిత్యానికి ఒరవడి దిద్దుతున్నాయి.

# 8

# వామపక్ష ఉద్యమాలు

## నేపథ్యం

1920 నాటికి భారత స్వాతంత్ర్యోద్యమం ఒక కొత్త మలుపు తిరిగింది. భారత జాతీయ కాంగ్రెస్ నాగపూర్ మహాసభ (1920) దేశవ్యాపిత సహాయ నిరాకరణ ఉద్యమానికి పిలుపు నిచ్చింది. అప్పటికే జలియన్ వాలాబాగ్‌లో జరిగిన మానవ మారణ హోమంతో చెలరేగిన భారతీయుల ఆవేశాగ్నికి ఈ పిలుపు ఆజ్యం పోసింది. దేశవ్యాప్తంగా ఉద్యమం ఉరకలు వేసింది. అదే సమయంలో భారతదేశాన్ని సందర్శించిన వేల్స్ యువరాజు పర్యటనకు 'నిరసన' తెలపాలన్న నాయకుల 'పిలుపు' అంచనాలకు మించి విజయవంతమయింది. అనేక పట్టణాల్లో బ్రహ్మాండమైన నిరసన ప్రదర్శనలు జరిగాయి. బొంబాయిలో ప్రదర్శనలు హింసారూపాన్ని ధరించి, పోలీసుల కాల్పులదాకా దారి తీసింది. ఈ ఘర్షణల్లో అధికారిక లెక్కల ప్రకారమే యాభై ముగ్గురు మరణించగా, 400 మంది గాయపడ్డారు. 'ఈ రెండు రోజుల ఘటనలతో స్వరాజ్యం నా నాసికాగ్రములను బద్దలు కొట్టింది' అని విచారించారు గాంధీజీ. దానితో 28 నవంబర్ 1920 నాడు గుజరాత్‌లోని బార్డోలీ జిల్లాలో ప్రారంభించాల్సివున్న 'శాసనోల్లంఘన ఉద్యమాన్ని' ఆయన రద్దు చేశారు. ఉవ్వెత్తున ఎగసిపడుతున్న ప్రజా చైతన్యపు పొంగుకు ఈ నిర్ణయం అడ్డు కట్టలు వేసింది. యువతరాన్ని అసంతృప్తికి గురిచేసింది.

1917 అక్టోబర్ 24నాటి అర్ధరాత్రి రష్యన్ కార్మికవర్గం 'బోల్షెవిక్‌పార్టీ' నాయకత్వంలో అక్కడి రాజరికాన్ని, పెట్టుబడిదారీపాలనను కూలదోసి 'కార్మిక వర్గ రాజ్యాన్ని' నెలకొల్పింది. దశాబ్దాల తరబడి సాగిన రష్యన్ కార్మికవర్గ పోరాటం విజయం సాధించిన ఉదంతాలు, అక్కడి కార్మికుల వీరగాథలు అన్ని దేశాల ప్రజల్ని చైతన్య పరిచాయి. విముక్తి ఉద్యమాలకు ఊపిరులూదాయి. 'శాసనోల్లంఘనోద్యమాన్ని' విరమించిన కాంగ్రెస్ మితవాద రాజకీయాలతో విసుగెత్తిన యువతరానికి 'రష్యన్ విప్లవం' కొత్తదారులు చూపింది. 1921 డిసెంబర్‌లో జరిగిన అహమదాబాదు కాంగ్రెస్ మహాసభలో కార్మికవర్గ దృక్పథం

కలిగిన యువకులు 'అహమదాబాద్ కాంగ్రెస్ కమ్యూనిస్టు ప్రణాళిక' శీర్షికతో అచ్చైన కరపత్రాలను ప్రతినిధులకు పంచారు.

## కమ్యూనిస్టు ఉద్యమ ఆవిర్భావం

రష్యన్ అక్టోబర్ విప్లవ ప్రభావంతో అప్పటివరకు అతివాద కాంగ్రెస్ వాదులుగాను, సోషలిస్టు విప్లవకారులుగానూ, ఖిలాఫత్ ఉద్యమకారులుగానూ కొనసాగిన యువకులు 'భారత కమ్యూనిస్టుపార్టీ' నిర్మాణానికి పునాదులు వేయడం మొదలుపెట్టారు. అప్పటికే దేశంలో సాయుధ తిరుగుబాటుకు సన్నాహాలు జరిపిన 'గదర్ పార్టీ' వీరులు రష్యన్ విప్లవ ప్రేరణతో కమ్యూనిస్టులుగా మారారు.

## కమ్యూనిస్టు పార్టీ స్థాపన

పై గ్రూపుల సమాహారమే 26-28 డిసెంబర్ 1925 న కాన్పూర్‌లో 'ప్రారంభ మహాసభ' జరిపి 'భారత కమ్యూనిస్టు పార్టీ'గా ఏర్పడి, స్వాతంత్ర్యోద్యమంలో అత్యంత క్రియాశీలమైన పాత్రను వహించారు. 1921 నాటి అహమ్మదాబాద్ కాంగ్రెస్ మహాసభల్లోనే 'సంపూర్ణ స్వాతంత్ర్యం' లక్ష్యాన్ని ప్రతినిధుల ముందుంచిన కమ్యూనిస్టులు 1927లో మద్రాస్‌లో జరిగిన కాంగ్రెస్ మహాసభల్లో దాన్ని ఆమోదింపజేశారు. ఆ తరువాత జరిగిన జాతీయ స్వాతంత్ర్య పోరాటంలో ఈ లక్ష్యం ప్రధానమైన ఉద్యమ నినాదమయింది.

కమ్యూనిస్టు ఉద్యమం బీజప్రాయంగా ఉండగానే బ్రిటిష్ నిరంకుశ ప్రభుత్వం కమ్యూనిస్టులపై 'పెషావర్ కుట్ర కేసు' (1922), 'కాన్పూరు కుట్ర కేసు' (1924), 'మీరట్ కుట్రకేసు' (1929) లను బనాయించి, అనేకమందికి దీర్ఘకాలిక శిక్షలను విధించింది. అయినప్పటికీ ఈ కేసుల సందర్భంగా కమ్యూనిస్టు విప్లవ కారులు కోర్టుల్లో ఇచ్చిన వాఙ్మూలాల్లో 'కమ్యూనిజం' ఆవశ్యకతను, జాతీయ స్వాతంత్ర్య లక్ష్యాలను వివరించారు. కోర్టుల్లో జరిగిన ఈ వాద - ప్రతివాదాలకు విశేషమైన ప్రచారం లభించడంవల్ల యువజన విద్యార్థులనేకమంది కమ్యూనిస్టు సిద్ధాంతాలతోనూ, కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమాలతోనూ ప్రభావితులై ఈ ఉద్యమంలోకి వచ్చారు.

## ఆంధ్ర రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమం

1934 నాటికి 'కమ్యూనిస్టు ఉద్యమం' ఆంధ్ర ప్రాంతానికి విస్తరించింది. 1930-32 సత్యాగ్రహోద్యమంలో జైళ్ళకు వెళ్ళిన కాంగ్రెస్‌లోని అతివాద భావాలుగల యువకులు బళ్లారి, రాయవెల్లూరు, తిరుచునాపల్లి, రాజమండ్రి జైళ్ళలో నిర్బంధంలో ఉన్న లాహోర్ కుట్రకేసు ఖైదీలతో, బెంగాల్ విప్లవ కారులతో పరిచయమయ్యారు. వీరితో జరిగిన చర్చలవల్ల సోషలిజంవైపు

ఆకర్షితులయ్యారు. సోషలిస్టు సాహిత్యాన్ని చదివారు. జైళ్ళు శిక్షణాలయాలుగా ఉపయోగపడ్డాయి. మద్దుకూరి చంద్రశేఖరరావు, ఉద్దరాజు రామం, అల్లూరి సత్యనారాయణరాజు, జొన్నలగడ్డ రామలింగయ్య, చలసాని జగన్నాథరావు, కానూరు బలరామయ్య, తనికెళ్ళ చలపతి, కొసరాజు శేషయ్య, గద్దె లింగయ్య, గారపాటి సత్యనారాయణ, కృత్తివెంటి కుటుంబరావు మొదలైనవారు జైలు నుండి విడుదల కాగానే కమ్యూనిస్టు పార్టీలో చేరారు.

1930-34 మధ్యకాలంలో ఆంధ్రనుండి బెనారసు విశ్వవిద్యాలయంలోను, కాశీవిద్యాపీఠ్‌లోనూ విద్య నభ్యసించడానికి వెళ్ళిన యువకులు అప్పటికే అక్కడున్న కమ్యూనిస్టులతో పరిచయా లేర్పరుచుకున్నారు. మార్క్సిస్టు సాహిత్యాన్ని చదివారు. క్రమంగా 'యంగ్ కమ్యూనిస్టులీగ్'లో చేరి, తరువాత 'కమ్యూనిస్టు పార్టీ' సభ్యత్వం స్వీకరించారు. చాలాకాలంపాటు భారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శిగా ఉన్న చంద్ర రాజేశ్వరరావు 1931 లో 'యంగ్ కమ్యూనిస్టులీగ్'లో చేరి, 1934లో 'కమ్యూనిస్టుపార్టీ' సభ్యత్వం స్వీకరించారు. పొన్నం వీర రాఘవయ్య, పోలేపెద్ది నరసింహామూర్తి, తుమ్మల వెంకటరామయ్య, నండూరి ప్రసాదరావు మొదలయినవారు ఈ బెనారస్ విశ్వవిద్యాలయం, కాశీవిద్యాపీఠ్ లలో చదువుకుంటూ 1934-35 సంవత్సరాల్లో 'కమ్యూనిస్టుపార్టీ'లో చేరినవారే. వీరంతా కలిసి మిగతా విద్యార్థులను కూడా 'కమ్యూనిజం' ఆశయాల వైపు ఆకర్షించడానికి కృషి చేశారు. బెనారస్ విశ్వవిద్యాలయం, కాశీవిద్యాపీఠ్‌లలో చదువుతున్న ఆర్. ఎస్. ఎస్. (రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్) యువకులకు, కమ్యూనిస్టులకు మధ్య తరచూ ఘర్షణలు జరుగుతుండేవి. ఆర్. ఎస్ ఎస్ వారిని ఎదుర్కోవడంలో చంద్ర రాజేశ్వరరావుగారు ప్రధాన పాత్ర వహించేవారు. ఫలితంగా 1936 లో విశ్వవిద్యాలయాధికారులు ఆయనకు టి. సి. ఇచ్చి పంపి వేశారు.

మీరట్ కుట్రకేసు ముద్దాయిల్లో ఒకరైన 'అమీర్ హైదర్‌ఖాన్' అరెస్టు కాకుండా తప్పించుకుని, పార్టీ ఆదేశంపై మద్రాసు వచ్చారు. అక్కడ కమ్యూనిస్టు ఉద్యమ బీజాలు నాటారు. కార్మికుల్లోనూ, విద్యార్థుల్లోనూ చైతన్యభావాలు రగిలించి, 'యంగ్ వర్కర్స్‌లీగ్'ను స్థాపించి; కమ్యూనిస్టు ప్రణాళిక, తదితర మార్క్సిస్టు గ్రంథాలను చదివించేవారు. కంభంపాటి సత్యనారాయణ, పుచ్చలపల్లి సుందరయ్య వంటివారు 1930-32 మధ్యకాలంలో కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం స్వీకరించి, 1934 నాటికి మద్రాస్‌లో 'కమ్యూనిస్టుపార్టీ' శాఖను స్థాపించారు.

ఈ మూడు ప్రధాన స్రవంతుల ద్వారా 'కమ్యూనిస్టుపార్టీ' సభ్యులుగా మారిన యువకులు ఆంధ్ర ప్రాంత కమ్యూనిస్టు ఉద్యమవ్యాప్తికి పాటుపడ్డారు. 1934 సెప్టెంబర్‌లో విజయవాడలోని పటమటలో కాట్రగడ్డ నారాయణరావుగారి తోటలో కమ్యూనిస్టుపార్టీ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పుచ్చలపల్లి సుందరయ్య కార్యదర్శిగా, 7గురు సభ్యులతో ఒక ఆర్గనైజింగ్ కమిటీ ఏర్పడింది. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ జిల్లాల్లో పార్టీశాఖల్ని నిర్మించాలనీ, అతివాద భావాలు గల యువజన, విద్యార్థుల్ని సమీకరించి, చైతన్యపరచాలనీ, రాష్ట్రవ్యాపితంగా కూలిరక్షణ సమితుల్ని ఏర్పరచి, కార్మికుల్లో పనిచేయాలనీ నిర్ణయించారు.

బ్రిటిష్ ప్రభుత్వం 1934 జూలై 23న 'భారత కమ్యూనిస్టు పార్టీ'ని నిషేధించింది. 1934 సెప్టెంబర్ 20న మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం 'యంగ్ వర్కర్స్ లీగ్'ను నిషేధిస్తూ ఆజ్ఞలు జారీ చేసింది. అందువల్ల ఆంధ్రప్రాంతంలోని కమ్యూనిస్టులు వివిధ పట్టణాల్లో 'కూలి రక్షణ సమితు'ల్ని ఏర్పాటుచేసి వాటి ద్వారా పనిచేయసాగారు. గుంటూరు, బెజవాడ, నెల్లూరు, ఏలూరు, బందరు, తెనాలి, భీమవరం విశాఖపట్నం, రాజమండ్రి మొదలైన పట్టణాల్లో కూలి రక్షణ సమితులు ఏర్పడ్డాయి. ఇవి పార్టీకి బహిరంగ వేదికలుగా ఉపయోగపడ్డాయి.

ఆంధ్రప్రాంతంలో 'కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహాసభ' కాకినాడలోని అన్నదాన సమాజ సత్రంలో 1936 జనవరి 29వ తేదీన, అక్కడ జరుగుతున్న 'ఆంధ్ర రాష్ట్ర యువజన మహాసభ' సందర్భంగా జరిగింది. దీనికి 10 మంది ప్రతినిధులు హాజరయ్యారు. అప్పటికి ఇక్కడి పార్టీ సభ్యుల సంఖ్య 40. ఈ సమావేశానికి కేంద్ర కమిటీ తరఫున శ్రీ ఎస్. వి. ఘాటే హాజరయ్యారు. ఈ సమావేశంలో పుచ్చలపల్లి సుందరయ్య గారు కార్యదర్శిగా ఎన్నికయ్యారు. అయితే 1936 జూన్‌లో ఆయన అరెస్టు కావడంతో, శ్రీ పోతేపెద్ది నరసింహమూర్తి కార్యదర్శి బాధ్యతలు స్వీకరించారు.

అప్పటికే ఆంధ్రరాష్ట్ర 'కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ' ఏర్పడింది. అన్ని కోస్తా జిల్లాల్లో 'సోషలిస్టు పార్టీ' శాఖలేర్పడ్డాయి. ఆంధ్రప్రాంతంలోని కమ్యూనిస్టులు కాకినాడ మహాసభ నిర్ణయానుసారం 'కాంగ్రెస్ పార్టీ' లోనూ 'కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ'లోను చేరి పనిచేశారు.

ఈ కాలంలో కేంద్రపార్టీ పత్రికలుగా 'కమ్యూనిస్టు' (రహస్య పత్రిక), 'న్యూ ఏజ్' (మాసపత్రిక). 'నేషనల్ ఫ్రంట్'తో పాటు తెలుగులో 'నవశక్తి'

(వారపత్రిక) వెలువడ్డాయి. పత్రికల వ్యాప్తికి, మార్క్సిస్టు సాహిత్య ప్రచారానికి కమ్యూనిస్టులు విశేషమైన కృషి చేశారు.

1934 నుండి కమ్యూనిస్టు పార్టీపైనున్న నిషేధం 1942 జూలై 24న తొలగింది. నిర్బంధంలో ఉన్న నాయకులు క్రమంగా విడుదల కాసాగారు. పార్టీ బహిరంగంగా కార్యాలయాలు పెట్టి పనిచేయడం ప్రారంభించింది. దీంతో కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తిలో నూతన శకం ప్రారంభమయింది.

ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ 3 వ రాష్ట్రమహాసభ 1943 జూలై 3 న విజయవాడలోని దుర్గాగ్రహారంలో జరిగింది. అప్పటికి పార్టీ సభ్యుల సంఖ్య 3,250. వివిధ జిల్లాల నుండి 200 మంది ప్రతినిధులు హాజరైన ఈ మహాసభ చండ్ర రాజేశ్వరరావుగారిని రాష్ట్రసమితి కార్యదర్శిగా ఎన్నుకుంది. 1941 జూన్ 22 తర్వాత ప్రపంచయుద్ధ స్వభావంలో వచ్చిన మార్పుల్ని సమీక్షించి, ప్రజాయుద్ధ నినాదంతో ప్రజల్లోకి చొచ్చుకుపోతూ, ప్రజాపార్టీగా రూపొంద సాగింది. అప్పటివరకు 'నవశక్తి' 'స్వతంత్రభారత్' (రహస్యపత్రిక) వంటి పత్రికల ద్వారా వేలాది గ్రామాల ప్రజల్లో తన ఆశయాలను ప్రచారం చేసిన 'కమ్యూనిస్టు పార్టీ' 1942 జూన్ 17 న 'ప్రజాశక్తి' పత్రికను ప్రారంభించింది. జాతీయ నాయకులను విడుదల చేయాలనీ, జాతీయ ప్రభుత్వాన్ని ఏర్పరచాలనీ 1942-45 మధ్యకాలంలో పార్టీ నిర్విరామంగా ఆందోళనలు నిర్వహించింది. ప్రపంచయుద్ధంలో భాగంగా తెలుగునేలపై జరిగే బాంబుదాడుల నుండి ప్రజల్ని కాపాడేందుకు ప్రజారక్షణ దళాలను ఏర్పరచింది. విమాన దాడుల నుండి రక్షణపొందే శిక్షణను ప్రజలకు ఇచ్చింది. మహిళలకు ప్రత్యేక శిక్షణా శిబిరాలు పెట్టి, రాజకీయ - సామాజిక అంశాలపై శిక్షణ నిచ్చింది కమ్యూనిస్టు పార్టీ.

1945 తో రెండవ ప్రపంచయుద్ధం ముగిసింది. ప్రజాస్వామ్య, సోషలిస్టు శక్తులు విజయం సాధించాయి. బ్రిటన్, తదితర సామ్రాజ్యవాద దేశాలు యుద్ధంలో బాగా దెబ్బతిన్నాయి. సోవియట్ యూనియన్ ఫాసిస్టు శక్తుల్ని ఓడించి అజేయశక్తిగా నిలిచి, మరికొన్ని సోషలిస్టు దేశాల ఆవిర్భావానికి అంకురార్పణ చేసింది ఈ పరిణామాల ప్రభావంవల్ల భారతదేశంతో సహా అనేక వలస దేశాల్లో స్వాతంత్ర్య విప్లవోద్యమాలు ఊపందుకున్నాయి.

ఆంధ్రప్రాంతంలో జమీందారీ, భూస్వామ్య వ్యతిరేక పోరాటాలకు 'కమ్యూనిస్టు పార్టీ' నాయకత్వం వహించి నడిపింది. తెలంగాణాలో దేశ్‌ముఖ్ జాగీర్దార్ల గూండాలకు, నైజాం నవాబుకు, రజాకార్లకు వ్యతిరేకంగా ప్రారంభ

మైన చారిత్రాత్మక తెలంగాణా సాయుధ పోరాటానికి పార్టీ నాయకత్వం వహించింది.

1943 - 47 మధ్య కాలంలో ఆంధ్రప్రాంతంలోని అనేక కొత్త ప్రాంతాలకు విస్తరించడమే కాక, 'కమ్యూనిస్టుపార్టీ' వివిధ ప్రజాసంఘాలను నిర్మించి, వేర్వేరు ప్రజాశ్రేణుల్లో తన కార్యక్రమాలను విస్తృతపరిచింది.

## వివిధ ప్రజాసంఘాల నిర్మాణం

బ్రిటిష్ సామ్రాజ్యవాద పాలననుండి విముక్తి తక్షణ కర్తవ్యంగానూ, వర్గరహిత సామ్యవాద సమాజ నిర్మాణం అంతిమ లక్ష్యంగానూ కలిగిన కమ్యూనిస్టుపార్టీ ఈ ద్విముఖ పోరాటాల్లో వివిధ ప్రజాశ్రేణుల్ని సమీకరించడానికి, చైతన్యపరచడానికి అనేక ప్రజా సంఘాలను నిర్మించింది. వాటిద్వారా ప్రజోద్యమాలకు ప్రాణం పోసింది.

## కార్మికోద్యమం

1934 - 35 సంవత్సరాల్లో కమ్యూనిస్టుపార్టీ కార్మికులను సంఘటితపరిచి, కార్మిక సంఘాల్ని ఏర్పరచి, కార్మికోద్యమాన్ని ప్రారంభించింది. 'కూలి రక్షణ సమితుల్ని' స్థాపించి కార్మికుల హక్కుల సాధనకోసం పోరాటాలను నిర్వహించింది.

1935 - 36 మధ్యకాలంలో గుంటూరు, నెల్లూరు, బందరు, మద్రాసు, తెనాలి, బెజవాడ, ఏలూరు, భీమవరం మొదలైన ప్రాంతాల్లో కూలి రక్షణ సమితులు ఏర్పడ్డాయి.

నెల్లూరు కూలి రక్షణ సమితి తన కార్యక్రమంలో ఈ క్రింది అంశాలను సూచించింది. 1. కార్మిక సంఘాలు ప్రారంభించుట, 2. వీధి సభలు, బహిరంగ సభలు, ఊరేగింపులు, సమ్మెలు నిర్వహించుట, 3. కార్మిక క్లబ్బులు ప్రారంభించుట, 4. కార్మికులకు సహకార దుకాణాలను ఏర్పరచుట, 5. కార్మిక దినోత్సవ సందర్భంగా ఊరేగింపులు జరుపుట, 6. కార్మిక పత్రిక నడుపుట, 7. ప్రతి సంవత్సరం కార్మిక మహాసభ జరుపుట.

ఆయా జిల్లాల కూలి రక్షణ సమితులు ప్రెస్ వర్కర్స్ యూనియన్, జట్కా బండివాళ్ళ యూనియన్, జూట్ మిల్ వర్కర్స్ యూనియన్, కల్లుగీత పనివారి సంఘం, రైల్వే ఎంప్లాయీస్ యూనియన్, రైస్‌మిల్ వర్కర్స్ యూనియన్‌వంటి కార్మిక సంఘాలను స్థాపించాయి.

ఈ కార్మికోద్యమ నేపథ్యంలో ప్రధానమైనది ప్రెస్‌వర్కర్స్ కార్మికోద్యమం. 1934 డిసెంబర్‌లో లక్నోలో ఆలిండియా ప్రెస్‌వర్కర్స్ మహాసభ జరిగి, దాని ఫెడరేషన్ ఏర్పడింది. 1935 నవంబర్‌లో దీని ద్వితీయ మహాసభ

1936 జనవరి 5న మద్రాస్‌లో 'అఖిల భారత ప్రెస్ కార్మికుల మహాసభ' జరిగింది. ఆ తరువాత ఆంధ్ర ప్రాంతంలోని అనేక జిల్లాల్లో ప్రెస్ కార్మికుల సమ్మెలు, పోరాటాలు జరిగాయి. 1937 లో చీరాల ఐ.ఎల్.టి.డి. పొగాకు కంపెనీలో కార్మికుల యూనియన్ ఏర్పడింది. 1938 ఫిబ్రవరి మాసంలో కార్మికుల సమస్యల పరిష్కారంకోసం, యూనియన్ గుర్తింపుకోసం సమ్మె ప్రారంభమయింది. పోలీసు కాల్పులు, ముగ్గురు చనిపోవడం, అనేకమంది గాయపడ్డం వరకు దారి తీసింది. 1939 లో చిట్టివలస జూట్ కార్మికుల సమ్మె దీర్ఘకాలం పాటు జరిగి, ఉజ్జ్వల చరిత్ర సృష్టించింది.

అలాగే బెజవాడ రైల్వే కార్మికులు, విశాఖ హార్బర్ కార్మికులు, కాకినాడ రేవు కార్మికులు, కళింగ పట్నం పోర్టు కార్మికులు, కాకినాడ పీచు కార్మికులు, సామర్లకోట పంచదార కార్మికులు, గుడివాడ పారిశుద్ధ్య కార్మికులు, ఏలూరు-రాజమండ్రి వంటి ప్రాంతాల్లో మోటారు-బస్సు డ్రైవర్ కార్మికులు, గుడివాడ రైస్‌మిల్ కార్మికులు, కృష్ణా సిమెంట్ కార్మికులు, నెల్లూరు మైకా గని కార్మికులు తమ హక్కుల సాధన కోసం, సమస్యల పరిష్కారం కోసం సమ్మెలు చేసి, కార్మికోద్యమ వికాసానికి బలమైన పునాదులు వేశారు.

అఖిల భారత కార్మికోద్యమంలో ఆంధ్ర రాష్ట్ర కార్మికోద్యమాన్ని మిళితం చేసి, వివిధ కార్మిక సంఘాల కార్యకలాపాలను సమన్వయం చేయడంలో కమ్యూనిస్టు పార్టీ విశేషమైన కృషి చేసింది. ఇందులో భాగంగానే ఆంధ్ర రాష్ట్రంలోని ప్రధాన కార్మిక సంఘాలన్నీ 'అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్'కు అనుబంధంగానే పనిచేశాయి.

జాతీయ స్వాతంత్ర్యోద్యమంలోనూ, రెండవ ప్రపంచయుద్ధ వ్యతిరేక ప్రచారంలోనూ, ప్రజాయుద్ధ నినాద వ్యాప్తిలోనూ కార్మికోద్యమం అత్యంత క్రియాశీలమైన పాత్రను నిర్వహించింది.

## రైతాంగ ఉద్యమం

ఒకవైపు కార్మికవర్గం చైతన్యవంతమై ఆర్థిక పోరాటాలతోబాటు రాజకీయ పోరాటాల్లోనూ ముందడుగు వేస్తుంటే; మరోవైపు పీడిత రైతాంగం, వ్యవసాయ కార్మికవర్గం కూడా స్థానిక సమస్యలపై పోరాడుతూనే స్వాతంత్ర్యోద్యమంలో చురుకుగా పాల్గొన్నాయి. పంజాబ్, మలబార్, ఆగ్రా, అవధ్ వంటి ప్రాంతాల్లోనూ; ఆంధ్ర ప్రాంతంలోనూ గొప్ప రైతాంగ తిరుగుబాట్లు జరిగాయి. రైతాంగం ఒక చైతన్యయుతమైన 'వర్గం'గా రూపొందసాగింది. హైదరాబాద్, కొచ్చిన్, ఒరిస్సా, తిరువాన్కూర్, జమ్మూ-కాశ్మీర్ మొదలైన ప్రాంతాల్లో

స్వదేశీ సంస్థానాల నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా జరిగిన చారిత్రక పోరాటాల్లో రైతాంగం అగ్రగామి పాత్రను వహించింది.

1936 లో 'అఖిల భారత కిసాన్ సభ' ఏర్పడింది.

ఆంధ్ర ప్రాంతంలో ఈ శతాబ్దారంభం నుండే రైతు సంఘాల నిర్మాణం ప్రారంభమయింది. 1928 ఆగస్టు 1 న 'ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం' ఏర్పడింది. 1929 లోనే జమీందారీ రైతు సంఘాలు ఏర్పడ్డాయి. ఆ తరువాత 'ఆంధ్రరాష్ట్ర జమీందారీ రైతు సంఘం' మహాసభలు 1933 సెప్టెంబర్‌లో ఏలూరులో, 1934 డిసెంబర్‌లో విశాఖపట్నంలో, 1936 మార్చిలో శ్రీకాకుళంలో జరిగాయి. 1930 లో 'జమీన్ రైతు' వారపత్రిక ప్రారంభమయింది. రైతుల స్థితిగతుల్ని వివరిస్తూ శెట్టిపల్లి వెంకటరత్నం రచించిన రైతుగీతాలను ఈ పత్రిక ప్రచురించింది. జమీందార్లకు వ్యతిరేకంగా రైతులను చైతన్యపరచడంలో ఈ గీతాలు ప్రముఖ పాత్రను నిర్వహించాయి.

1933 ఆగస్టులో ఏలూరులో జరిగిన ఒక రైతు మహాసభలో 'ఆంధ్ర రాష్ట్ర ఈనాము రైతుల సంఘం' అనే ప్రత్యేక రాష్ట్రస్థాయి సంఘం ఏర్పడింది. ఈనాము గ్రామాల్లోని రైతుల శాశ్వత పట్టాహక్కులు, తదితర హక్కుల సాధన కోసం పోరాడేందుకు ఈ సంఘం కృషి చేసింది. ఆంధ్రప్రాంతంలోని సాగు భూమిలో 6 నుండి 7 శాతం భూమి ఈనాము పద్ధతిలో ఉంది. కొన్ని ఈనాములు కొందరు ఈనాందార్లకు, మరికొన్ని ఈనాములు మత, ధర్మ సంస్థలకు చెంది ఉన్నాయి. వీనిలో భూస్వామికి కౌలు రేటును వసూలు చేసుకునే హక్కు మాత్రమే ఉంటుంది. భూమిపై అధీనపు హక్కు దున్నుకునే రైతులకే ఉంటుంది. ఈ హక్కును కాపాడుకునేందుకు, ఈనాము ఎస్టేట్‌లను రద్దుచేయించేందుకు 'ఈనాము రైతుల సంఘం' విశేషమైన కృషి చేసింది.

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత, ఆంధ్ర రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లో రైతాంగ పోరాటాలు పెల్లుబికాయి. 1946 లో శాసనసభ ఎన్నికలు జరిగాయి. భారత జాతీయ కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో - 'ప్రభుత్వానికి, సాగుదార్లకు మధ్యగల దళారీల నందరినీ తొలగిస్తామని' వాగ్దానం చేసింది. దాంతో త్వరలో తమ ఎస్టేట్లు రద్దు కాబోతున్నాయని భయపడిన జమీందార్లు, తమ భూముల నుండి సాగుచేసే రైతులను బలవంతంగా తొలగించడం వంటి చట్ట విరుద్ధ చర్యలకు; అడవులను, బంజరులను, సాముదాయిక భూములను అన్యాక్రాంతం చేయడానికి పూనుకున్నారు. ఆ పరిస్థితుల్లో కమ్యూనిస్టుల నాయకత్వాన గల 'ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘం' జమీందార్ల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా సాహసోపేతమైన రైతు పోరాటాలను నిర్వహించింది.

1931 మార్చిలో మొట్టమొదటిసారిగా 'రైతు రక్షణ వారం' నిర్వహించి, రైతుల కోర్కెలను ప్రచారం చేశాయి రైతు సంఘాలు. అదేవిధంగా 1933 నవంబర్ 1న అనేక జిల్లాల్లో 'రైతు రక్షణ వారం' నిర్వహించారు. 1933 మార్చిలో గుంటూరు జిల్లా కలెక్టర్ కార్యాలయం ఎదుట మొట్టమొదటి 'రైతు రక్షణ యాత్ర' జరిగింది. 1935 డిసెంబర్‌లో అనేక జిల్లాల్లో రైతు రక్షణ యాత్రలు జరిగాయి. 1937 జూన్‌లో 'రైతు దండు' ఏర్పడింది. కోస్తాంధ్ర అగ్రభాగమైన ఇచ్ఛాపురం నుండి 1937 జులై 3న బయలుదేరిన 'రైతుయాత్ర' విశాఖ, ఉభయ గోదావరులు, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లో మొత్తం 1512 మైళ్ళు కాలినడకన, 542 మైళ్ళు బస్సుల్లో ప్రయాణంచేసి 1938 ఫిబ్రవరి 27న మద్రాసు చేరుకుంది. 525 గ్రామాలు చుట్టివచ్చిన ఈ చరిత్రాత్మక 'రైతు యాత్ర' రైతుల్లో పోరాట చైతన్యాన్ని పదును పెట్టింది.[1]

రెండవ ప్రపంచయుద్ధం తర్వాత, మందసానుండి వెంకటగిరి వరకు రాష్ట్రంలోని అన్ని ఎస్టేట్లలో మరోసారి జమీందారీ వ్యతిరేక పోరాటాలు జరిగాయి. వీటిలో చల్లపల్లి, మందసా, కానూరు, పెండ్యాల లంక, మునగాల, వెంకటగిరి, పోలవరంలోని బుచ్చంపేట రైతు పోరాటాలు చారిత్రాత్మకమైనవి.

1947 నుండి 1951 వరకు తెలంగాణాలో జరిపిన వీరోచిత రైతాంగ సాయుధపోరాటం గురించి ఇదివరకే చర్చించాం. 3 వేల గ్రామాలను విముక్తం చేసి, దాదాపు 10 లక్షల ఎకరాల భూమిని రైతాంగానికి పంచిన ఈ మహత్తర ప్రజాపోరాట ప్రభావం మన జాతి జీవితం మీద, ఆలోచనా విధానం మీద ఈ నాటికీ ప్రబలంగా ఉంది.

1920-23 నాటి సహాయ నిరాకరణోద్యమంలోనూ, 1930-31 నాటి శాసనోల్లంఘనోద్యమంలోనూ, ఆ తరువాత జరిగిన అన్ని ప్రధాన ఉద్యమాల్లోనూ అంతర్భాగంగా 'రైతు ఉద్యమం' ఈ తెలుగు నేలపై విస్తరిస్తూ, విజయాలు సాధిస్తూ ఉంది.

## వ్యవసాయ కార్మికోద్యమం

యావద్భారత దేశంలోనే మొట్టమొదటిసారిగా వ్యవసాయ కార్మికులను వర్గప్రాతిపదికపై సంఘటితం చేసిన ఘనత ఆంధ్రరాష్ట్రంలోని కమ్యూనిస్టులకు దక్కుతుంది. నిరక్షరాస్యత, సాంఘిక దురాచారాలకు లోనై, వెనుకబడిఉన్న వ్యవసాయ కూలీలలో చైతన్యం కల్గించి, వారిని ఒక బలమైన రాజకీయ పోరాట శక్తిగా రూపొందించడానికి కమ్యూనిస్టు పార్టీ ఎనలేని కృషి చేసింది. అనేక

1. ఆంధ్రలో రైతు ఉద్యమం (మొదటి భాగం) - కొండపేటి చిన్నయసూరి.

సందర్భాల్లో భూస్వాముల దాడులకు, పోలీసుల నిర్బంధానికి కమ్యూనిస్టులు గురయ్యారు; అయినా పీడితవర్గంగా ఉన్న వ్యవసాయ కూలీలను సంఘటిత పరచడంలో వెనుకంజ వేయలేదు.

1933 లో గుంటూరు జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం ఏర్పడింది. 1934-35 లో కూలీరక్షణ సంఘా లేర్పడ్డాయి.

1937 లో వెన్నెలకంటి రాఘవయ్య, తదితరులు 'ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కార్మిక సంఘాన్ని' ఏర్పరిచారు. రాఘవయ్య, దువ్వూరి బలరామరెడ్డి గారలు ప్రధాన కార్యదర్శులుగా ఎన్నికయ్యారు. పి సుందరయ్య, కంభంపాటి (సీనియర్), జె. రామలింగయ్య గారలు స్థాయీ సంఘ సభ్యులుగా చేర్చుకోబడ్డారు.[1]

1945 లో 'ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కూలీ సంఘం' ఏర్పడింది 1947 జూన్‌లో తూర్పుగోదావరి జిల్లా జగ్గంపేటలో దీని మొదటి రాష్ట్ర మహాసభ జరిగింది.

కూలి సంఘాల ప్రత్యేకతను, రైతుల పట్ల వారు అనుసరించవలసిన విధానాన్ని వివరిస్తూ 1938 జూలైలో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఆంధ్ర రాష్ట్రంలో అప్పుడప్పుడే నిర్మాణరూపం దాలుస్తున్న వ్యవసాయ కార్మికోద్యమానికి ఈ తీర్మానం కొత్త ఊపునిచ్చింది 'నవశక్తి' పత్రికలో ప్రకటితమైన ఈ తీర్మానంలో - 'వ్యవసాయ సంబంధమగు ప్రతి పనిలోనూ కూలి చేయువారు వ్యవసాయకూలీలు'గా పేర్కొంటూ స్పష్టమైన నిర్వచనం చేసింది. రాజకీయ చైతన్యం విషయంలో వ్యవసాయ కూలీలకు, రైతులకు ఉన్న వ్యత్యాసంవల్లనూ, సాంఘికంగా వ్యవసాయ కూలీలు వెనుకబడి ఉండడం వల్లనూ, రైతులకు - వ్యవసాయ కూలీలకు పరస్పర అవిశ్వాసం ఉండడంవల్లనూ, వ్యవసాయ కూలీలకు ప్రత్యేక సంఘాలను ఏర్పరచాలని తీర్మానం పేర్కొంది. అంతమాత్రంచేత రైతులు, కూలీలు వేర్వేరు వర్గాలని తలచి, వీరిరువురి మధ్య వర్గ తగాదాలు తీసుకురాకూడదని ఆ ఘర్షణలవల్ల భూస్వాములు, జమీందారులు, ప్రభుత్వం మాత్రమే ప్రయోజనం పొందుతాయని తీర్మానం స్పష్టంగా పేర్కొంది. రైతులు, కూలీలు పరస్పర సహకారం వల్లనే అటు రైతు పోరాటాలు, ఇటు కూలీల పోరాటాలు విజయాన్ని సాధించగలవన్న మార్గాన్ని కమ్యూనిస్టు పార్టీ సూచించింది.

'పిచ్చిమంతలు, వెట్టిచాకిరీ, బూతులు తిట్టుట, కొట్టుట, సాంఘిక అసౌకర్యాలు, లంచగొండితనం, పన్నులు, హెచ్చువడ్డీలు రద్దు కావాలనీ; కుల

1. 'జమీన్ రైతు' (వారపత్రిక) 1938 జనవరి 28.

విచక్షణ లేకుండా కూలీల పిల్లలందరికీ ఉచిత విద్య, అటవీ హక్కులు, కట్టెలు తెచ్చుకొనే హక్కు, ఇండ్ల స్థలాలు, ఋణ సౌకర్యాలు, నిరుద్యోగ భృతి, పాలేర్ల ఇబ్బందుల పరిష్కారం వంటివి చేకూరాలని' వ్యవసాయ కార్మిక సంఘం పోరాటాలు నిర్వహించింది. నెల్లూరు, కొవ్వూరు తాలూకాల్లోనూ; ఇతర ప్రాంతాల్లోనూ వ్యవసాయ కార్మికులు సమ్మెలు చేసి, తమ కోర్కెల్లో చాలావాటిని సాధించుకోగలిగారు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో యుద్ధం మూలంగా నిత్యావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగాయి అనేక జిల్లాల్లో వర్షాలు పడకపోవడం వల్ల కరువు పరిస్థితు లేర్పడ్డాయి మెట్ట ప్రాంతాలనుండి పల్లపు ప్రాంతాలకు కూలీలు వలస వెళ్ళడంతో కూలీల పోటీ పెరిగి, కూలిరేట్లు పడిపోసాగాయి. ఈ సమస్య లన్నిటిపై కూలీలను చైతన్యవంతుల్ని చేసి ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చేందుకు 'కమ్యూనిస్టు పార్టీ' 'ఆకలియాత్ర'లను నడిపింది. 'పని కల్పించండి', 'తిండి పెట్టండి' అని డిమాండ్ చేస్తూ ఆంధ్రరాష్ట్రంలో మొట్టమొదటి 'ఆకలియాత్ర' తూర్పుగోదావరి జిల్లా, రాజోలు తాలూకాలో 1940 మే నెలలో నిర్వహించ బడింది.

అలాగే అవనిగడ్డ, గుడివాడ, రేపల్లె, తెనాలి, భీమవరం తాలూకాల్లో వేలాది మంది వ్యవసాయ కార్మికులు పాల్గొన్న 'ఆకలి యాత్రలు' జరిగాయి.

నెల్లూరుజిల్లా వేగూరు గ్రామకూలీలు దాదాపు 3 నెలలపాటు సమ్మె చేశారు. యేటిపొల్లు కట్టలను నామినల్ రేటుకే పశువులను మేపుకునేందుకు బీడలకివ్వాలని, పిచ్చిముంతలను తొలగించాలనే ప్రధానమైన కోర్కెలతో ఈ సమ్మె జరిగింది.

1943 జనవరి నాటికి ఆంధ్ర రాష్ట్రంలోని 210 గ్రామాల్లో 18,607 మంది సభ్యులతో వ్యవసాయ కార్మిక సంఘా లేర్పడ్డాయి. 1943 జూలై నాటికి వ్యవసాయ కూలీ సంఘ నిర్మాణం మరింత పెరిగింది. 347 గ్రామాల్లో 23, 342 మంది సభ్యులుగా చేరిన ఈ సంఘం వర్గప్రాతిపదికపై వ్యవసాయ కార్మికులు ఏకం కావడానికి దోహదం చేసింది.

అప్పటి నుండి ఈనాటిదాకా కేవలం రాష్ట్రస్థాయిలోనేకాక, జాతీయస్థాయి లోనూ వ్యవసాయ కార్మికుల సంఘటిత శక్తిగా రూపొందిన 'అఖిల భారత వ్యవసాయ కార్మిక సంఘం' వ్యవసాయ కూలీలు కూలిరేట్లు పెరగడానికి, వారి జీవన పరిస్థితులు మెరుగుపడడానికి, వారి న్యాయమైన హక్కులను సాధించు కోవడానికి అనేక పోరాటాలను నిర్వహిస్తూ ఉంది.

## యువజనోద్యమం

1928-29 సం॥ల్లోనూ, 1930-31 మధ్యకాలంలోనూ ఆంధ్ర రాష్ట్రంలో అక్కడక్కడా యువజన సంఘాలుండేవి కానీ వాటిని సమన్వయ పరిచి, సంఘటితం చేసే జిల్లా యువజన సంఘాలు కానీ, రాష్ట్ర యువజన సంఘాలు కానీ లేవు

కాంగ్రెస్ నాయకత్వం సహాయ నిరాకరణోద్యమాన్ని, శాసనోల్లంఘనోద్యమాన్ని అర్ధాంతరంగా ఆపివేయడంతో, నిరాశ చెందిన యువతరం 1934 డిసెంబర్ 31న విశాఖపట్నంలో జరుగుతున్న 'ఆంధ్రరాష్ట్ర సోషలిస్టు పార్టీ' మహాసభ సందర్భంగా 'ప్రథమాంధ్ర రాష్ట్ర యువజన మహాసభ'ను కూడా నిర్వహించింది.

1936 జనవరి మాసంలో కాకినాడలో 'ఆంధ్ర రాష్ట్ర యువజన ద్వితీయ మహాసభ' జరిగింది.

1939 నాటికి యువజన సంఘాలు వర్గసంఘాలు కావనీ, అన్ని వర్గాల యువకులను సమీకరించే విశాల వేదికలు కావాలనీ; 1) ఆటలు, 2) అధ్యయన తరగతులు, 3) రాత్రి పాఠశాలలు, 4) గ్రంథాలయాలు, 5) చారిత్రక దినోత్సవాల నిర్వహణ, 6) వలంటీరు దళం, 7) యువకుల విద్యాభివృద్ధికై - నిరుద్యోగ సమస్య పరిష్కారానికై ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడం, 8) ప్రజా సంఘాలకు సహాయం చేయడం వంటి కార్యక్రమాలను చేపట్టాలనీ 'ఆంధ్ర రాష్ట్ర యువజన సంఘం' నిర్ణయించింది.

'స్వాతంత్ర్యం - శాంతి - అభ్యుదయం' యువజనోద్యమ ఆశయాలుగా స్వీకరించి, యువజనుల సమస్యల పరిష్కారంకోసం 'యువజన సమాఖ్య' పేరుతో ఈనాటికీ ఈ సంఘం అనేక పోరాటాలను నిర్వహిస్తోంది. తెలుగునాట తలెత్తిన ప్రతి ఉద్యమంలోనూ తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తోంది.

## విద్యార్థి ఉద్యమం

కమ్యూనిస్టు ఆశయాలకు అంకితమైన విద్యార్థులు, కాంగ్రెస్‌లోని అతివాద భావాలు కల విద్యార్థులు కలిసి, 1936 ఆగస్టు 12న లక్నోలో విద్యార్థుల జాతీయ మహాసభను ఏర్పాటుచేసి 'అఖిల భారత విద్యార్థి సమాఖ్య'ను రూపొందించారు. 1936 నుంచి ఈనాటివరకు అర్ధశతాబ్దానికి పైగా అనేక జాతీయ-అంతర్జాతీయ సమస్యలపై ఈ సంస్థ ప్రతిస్పందిస్తుంది 'ప్రపంచ విద్యార్థి సంఘానికి' అనుబంధంగా పనిచేస్తున్న ఈ విద్యార్థి సమాఖ్య అనేక అంతర్జాతీయ వేదికలపై తన సొంత గొంతును వినిపిస్తోంది.

1920-21 సహాయ నిరాకరణోద్యమంలో విద్యార్థులను, పాశ్చాత్య విద్య నేర్పే పాఠశాలల్ని బహిష్కరించాల్సిందిగా కాంగ్రెస్ ఆదేశించింది. ఈ పిలుపుతో ప్రభావితులైన విద్యార్థులు జాతీయ భావాలతో సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట ఉత్సాహంతో 1924 లో 'ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ'ను నిర్వహించారు. అప్పటినుండి 1936 నాటికి విద్యార్థుల రాష్ట్రస్థాయి మహాసభలు 18 జరిగాయి. జాతీయ భావాల వ్యాప్తికి ఇవి దోహదం చేశాయి.

1937 లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు ఆంధ్రదేశమంతటినుండి కాలేజీ, హైస్కూల్ విద్యార్థులనేకమంది వచ్చి హాజరయ్యారు. వీరిలో చాలా మంది నిషేధాజ్ఞల్ని ధిక్కరించి, జైళ్ళకు వెళ్ళారు. వారు విడుదలైన వెంటనే 1937 ఆగస్టు 28, 29 తేదీల్లో గుంటూరులో 'ఆంధ్ర విద్యార్థి ఫెడరేషన్' 14వ మహాసభ జరిగింది.

విశ్వవిద్యాలయాలపై ప్రభుత్వాధికారాన్ని తొలగించి, సెనేట్‌ను ప్రజాస్వామ్య పద్ధతిలో ఏర్పరచాలనీ, ఛాన్స్‌లర్, వైస్‌ఛాన్స్‌లర్లను ఎన్నికలద్వారా ఎన్నుకోవాలనీ, విద్యార్థులకు సెనెట్‌లో ప్రాతినిధ్యం ఉండాలనీ, నిర్బంధ-ఉచిత-ప్రాథమిక విద్యను ప్రవేశపెట్టాలనీ, విద్యార్థి సంఘాలకు గుర్తింపు కావాలనీ, గుమస్తాగిరి చదువులు కాక వృత్తివిద్య, పారిశ్రామిక విద్య ప్రవేశపెట్టాలనీ; సైనిక విద్య నేర్పాలనీ కోరుతూ, ఒక కోర్కెల ప్రణాళికను ఈ మహాసభ ఆమోదించింది.

ఈ 14 వ మహాసభ ఇచ్చిన కోర్కెల ప్రణాళికలో, స్థానిక సమస్యలను జోడించి రాష్ట్రమంతటా విద్యార్థులు ఆందోళనలు, సమ్మె పోరాటాలు ప్రారంభించారు. ఎక్కడికక్కడ విద్యార్థి సంఘాలను ఏర్పాటు చేసుకొని. బానిస విద్యా విధానానికి, వడపోత పరీక్షల పద్ధతికీ, డిటెన్షన్ విధానానికీ వ్యతిరేకంగా విద్యార్థులు ఉద్యమించారు.

1939 సెప్టెంబర్ 1, 2, 3 తేదీల్లో కాకినాడ పట్టణంలో విద్యార్థిసమాఖ్య 16 వ మహాసభ జరిగింది, ఈ మహాసభ రెండు విధాలుగా చారిత్రక ప్రాధాన్యతను సంతరించుకుంది.

1. నాటి జాతీయోద్యమ ప్రముఖుల్లో ఒకరైన సుభాష్‌చంద్రబోస్ మహాసభను ప్రారంభించారు.

2. మహాసభ జరుగుతున్న రోజుల్లోనే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. సభావేదిక నుండే ఆ వార్తను తొలిసారిగా ప్రకటించారు.

ఈ వార్త విన్న ప్రతినిధులు మహోద్రేకంతో 'ప్రపంచ సామ్రాజ్య వాదం — నశించాలి' అంటూ సభాభవనం దద్దరిల్లేట్లు నినాదాలిచ్చి, యుద్ధం పట్ల తమ వ్యతిరేకతను వెల్లడించారు.[1]

1941 డిసెంబర్ 31 న పాట్నాలో జరిగిన 'అఖిల భారత విద్యార్థి సమాఖ్య' మహాసభ ఫాసిస్టు శక్తులకు వ్యతిరేకంగా జరుగుతున్న ప్రజాయుద్ధంలో భాగస్వాములు కావాలని, దాంతోబాటు బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడాలని నిర్ణయించింది. 1942 మే 15 న ఢిల్లీలో 'జాతీయ రక్షణ మహాసభ'ను నిర్వహించింది. దేశ రక్షణకై విద్యార్థులు అనేక దళాలుగా ఏర్పడాలనీ, సైన్యంలో చేరాలనీ 'సమాఖ్య' పిలుపు నిచ్చింది.

జపాన్ విమాన దాడులకు వ్యతిరేకంగా, ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా 'ప్రపంచశాంతి'ని కాంక్షిస్తూ 'విద్యార్థి సమాఖ్య' ఇతర ప్రజాసంఘాలతో కలిసి విశేషమైన కృషి చేసింది.

ఇటు నైజాం సంస్థానంలో 'వందేమాతరం' ఉద్యమ ప్రభావంతో 1939 అక్టోబర్ 12 న 'ఆల్ హైదరాబాద్ స్టూడెంట్స్ అసోసియేషన్' ఏర్పడింది. 1939 నుండి నిజాం ప్రభువు గద్దె దిగేవరకు, రాజరికానికి వ్యతిరేకంగా విద్యార్థి ఉద్యమాలను నిర్విరామంగా నిర్వహించింది తెలంగాణా సాయుధ పోరాటానికి కావలసిన 'నాయకులను' తయారు చేసింది.

'విశాలాంధ్ర' నిర్మాణం కోసం అటు ఆంధ్రప్రాంతంలోనూ, ఇటు తెలంగాణ ప్రాంతంలోనూ ప్రజలు జరిపిన ఆందోళనలో అటు విద్యార్థిసమాఖ్య, ఇటు 'ఆల్ హైదరాబాద్ స్టూడెంట్స్ అసోసియేషన్' విశేషమైన కృషి చేశాయి. 1956 నవంబర్ ఒకటిన "ఆంధ్రప్రదేశ్" రాష్ట్రం అవతరించింది. దాంతో అప్పటివరకు 'ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్'గా ఉన్న సంస్థ, 'ఆల్ హైదరాబాద్ స్టూడెంట్స్ యూనియన్' రెండూ విలీనమై, 'ఆంధ్రప్రదేశ్ విద్యార్థి ఫెడరేషన్'గా రూపొందింది. 1959 లో విజయవాడలో రాష్ట్ర మహాసభను జరుపుకున్నది. అప్పటినుండి, ఈనాటి దాకా 'అఖిల భారత విద్యార్థి సమాఖ్య'కు అనుబంధంగా పనిచేస్తున్న ఈ సంస్థ 'విశాఖ ఉక్కు- ఆంధ్రుల హక్కు', 'రాయలసీమకు నదీ జలాలు' వంటి నినాదాలను విస్తృతంగా ప్రచారం చేసింది. 1969 లో ఇటు 'ప్రత్యేక తెలంగాణా' ఆందోళన సందర్భంగానూ, 1971 లో అటు 'జై ఆంధ్ర' ఆందోళన సందర్భంగానూ 'సమైక్యాంధ్ర పరిరక్షణ' కోసం ఎదిరికి ఎదురీది నిలిచింది. 'శాస్త్రీయ విద్యావిధానం' కోసం, విశ్వవిద్యాలయాల్లో

1. 'ఎ. ఐ. ఎస్. ఎఫ్ చరిత్ర (ఉజ్వల ఘట్టాలు)'
— అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్, ఆం. ప్ర. సమితి.

ప్రజాస్వామ్య విలువల పరిరక్షణ కోసం, విద్యార్థుల స్థానిక సమస్యల పరిష్కారం కోసం నిరంతరం పోరాటాలు నిర్వహిస్తూ ఉంది.

## మహిళా ఉద్యమం

ఈ శతాబ్దారంభం నుండే కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు వంటి వారు తమ రచనల ద్వారా మహిళా లోకంలో చైతన్యం కలిగించే ప్రయత్నాలు మొదలుబెట్టారు. బ్రహ్మసమాజం వంటి సంస్థలు స్త్రీ విద్య, వరకట్న నిర్మూలన, సానిమేళాల నివృత్తి, వేశ్యావృత్తి నిర్మూలన వంటి సంస్కరణోద్యమాలను నడిపాయి. వీని మూలంగా మహిళల్లో కొంత చైతన్యం కలిగినా, అది సాంఘిక చైతన్యం మాత్రమే. జాతీయ స్వాతంత్ర్యోద్యమ ప్రభావంతో క్రమంగా మహిళా లోకంలో 'రాజకీయ చైతన్యం' కూడా నెలకొన సాగింది.

కూలీ రక్షణ సంఘం, కమ్యూనిస్టు పార్టీ, సోషలిస్టు పార్టీలు ఏర్పడిన ప్రారంభంలో పార్టీ ప్రముఖుల కుటుంబాలలోని స్త్రీలు మాత్రమే రాజకీయ కార్యకలాపాల్లో పాల్గొనేవారు. తమ విద్యాస్థాయిని పెంచుకుంటూనే, పార్టీ ప్రచురించే కరపత్రాలు మొదలైనవి అధ్యయనం చేసేవారు. కాంగ్రెస్‌తో ఐక్య సంఘటన ఏర్పడిన తరువాత కాంగ్రెస్‌లోని అతివాద భావాలు కల మహిళలు మహిళా సంఘాల నిర్మాణానికి పూనుకున్నారు. కొత్తపట్నం, మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలలకు, జిల్లాలలో జరిగిన రాజకీయ శిక్షణా తరగతులకు హాజరయిన మహిళా విద్యార్థినులు కూడా మహిళా ఉద్యమ నిర్మాణానికి బీజాలు నాటారు.

1937 నుండే 'కృష్ణాజిల్లా మహిళా సంఘం' పనిచేయ నారంభించింది. కృష్ణాజిల్లా డోకిపర్రు మహిళా సంఘంలో 15 డిసెంబర్ 1937 నాటికి 58 మంది సభ్యులున్నారు. 1938 జనవరి 25 న పామర్రులో జరిగిన 'తూర్పు కృష్ణా జిల్లా మహిళా సంఘం' కార్యవర్గ సమావేశం రాజకీయ ప్రాధాన్యతగల తీర్మానాలు చేసింది. ఇదే సమయంలో తెన్నేరు, మంత్రిపాలెంలలో మహిళా సంఘాలు ఏర్పడ్డాయి. తూర్పుకృష్ణాజిల్లా మహిళా సంఘం ద్వితీయ వార్షిక మహాసభ 1938 ఏప్రిల్ 20, 21 తేదీల్లో జరిగింది. ఈ సందర్భంగా 100 గ్రామాల్లో మహిళా కార్యకర్తలు, తమ సంఘ ఆశయాలను ప్రచారం చేశారు. 35 గ్రామాలకు కాలి నడకన వెళ్ళారు. 62 గ్రామాల్లో మహిళా సంఘాలను ఏర్పాటు చేశారు. 1937 ఫిబ్రవరి మాసంలో జిన్నూరు లో, 1938 ఆగష్టు మాసంలో పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురంలో మహిళా సంఘా లేర్పడ్డాయి.

ఆంధ్ర ప్రాంతంపై జపాన్ దాడిచేసిన సందర్భంగా, ఫాసిజం ప్రమాదం నుండి రాష్ట్రాన్ని రక్షించే బాధ్యతలో కమ్యూనిస్టుపార్టీ స్త్రీలను సమాయత్తం చేసింది. స్త్రీలకు ఆత్మరక్షణ పద్ధతులు నేర్పడానికి పెద్ద ఎత్తున కృషి చేసింది.

1942 నవంబర్ 4 నాటి 'ప్రజాశక్తి'లో 'ఆంధ్ర స్త్రీలకు ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ విజ్ఞప్తి' అనే సుందరయ్యగారి వ్యాసం అచ్చయ్యింది. ఇది మహిళా లోకంలో అపూర్వ సంచలనాన్ని సృష్టించింది. దానికి ప్రతిస్పందనగా డిసెంబర్ 9 నాటి 'ప్రజాశక్తి'లో 'నారీలోకానికి లేఖా పిలుపు' శీర్షికన శ్రీమతి పి. భారతీదేవి వ్రాసిన ఒక లేఖ అచ్చయ్యింది. ఫాసిజం ప్రతిఘటనకు పార్టీ యిచ్చిన పిలుపు మహిళల్లో కల్గించిన ఉత్తేజం గురించి 1942 నవంబర్ 18 నాటి 'ప్రజాశక్తి'లో 'మహిళల త్యాగదీక్ష' శీర్షికతో నండూరి ప్రసాదరావుగారి వ్యాసం ప్రచురితమయింది. వీటి ఫలితంగా ఆనాడు మహిళా సంఘాలు గ్రామ గ్రామాన యుద్ధ వ్యతిరేక భావాలను ప్రచారం చేశాయి.

మహిళా సమస్యలకు సంబంధించిన వ్యాసాలు 'నవశక్తి' పత్రికలో పొట్లూరి వసుమతీదేవి (23 ఫిబ్రవరి 1938, 2 మార్చి 1938), చంద్ర రాజేశ్వర రావు (31 ఆగష్టు 1938), పర్చూరి సూర్యాంబ (19 ఏప్రిల్ 1939), పందిరి జగదాంబ (12 ఏప్రిల్ 1938) మొదలగువారు రాశారు.

## స్త్రీల పాటలకోసం విజ్ఞప్తి

ప్రస్తుత సమాజంలో మన స్త్రీలు అనుభవిస్తున్న కష్టాల గురించి, ఫాసిస్టు దురాక్రమణ నెదుర్కోవడంలో స్త్రీల కర్తవ్యాలను గురించి చక్కని పాటలు వ్రాసి, కృష్ణాజిల్లా మహిళాసంఘం, గవర్నరుపేట, బెజవాడకు పంపవలసిందిగా కోరుతూ జిల్లా మహిళాసంఘం కార్యదర్శి కాట్రగడ్డ హనుమాయమ్మగారు విజ్ఞప్తి చేశారు. మంచి పాటకు పదిరూపాయల బహుమతిని ప్రకటించారు.[1]

దండమూడి సత్యనారాయణగారి గీతానికి ప్రథమ బహుమతి (10 రూపాయలు), పోలంరెడ్డి బుజ్జమ్మగారి గీతానికి ద్వితీయ బహుమతి (5 రూపాయలు) లభించింది.

ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి స్త్రీలు కదలిరావాలని ప్రబోధించిన వట్టికొండ విశాలాక్షిగారి 'ప్రబోధము' గీతం విశేష ప్రచారాన్ని పొందింది.

1943 జనవరి - ఫిబ్రవరి మాసాల్లో బెజవాడలో 30 రోజులపాటు రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యాన మొట్టమొదటి 'రాష్ట్ర మహిళా రాజకీయ పాఠశాల' నిర్వహింపబడింది. 5 జిల్లాలనుండి 22 మంది మహిళా ప్రతినిధులు

1. 'ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర' (1936 - 42).

హాజరయిన ఈ పాఠశాలలో భారతదేశ చరిత్ర, రాజకీయ భూగోళం, జాతీయ-అంతర్జాతీయ రాజకీయాలు, ప్రసూతి, శిశుపోషణ, ఆరోగ్య - పారిశుధ్య విధులు; డ్రిల్లు, కర్రసాము వంటి ఆత్మరక్షణోపాయాలు నేర్పించారు.

ఆ తరువాత జిల్లాస్థాయి 'మహిళా శిక్షణా తరగతులు' అనేక జిల్లాల్లో నిర్వహింపబడ్డాయి.

రాజకీయ సమస్యలపై ఆందోళనను నిర్వహిస్తూనే మహిళా సంఘాలు ఆహార సమస్య, ప్రసూతి వైద్యశాలలు, గ్రామాలలో మరుగుదొడ్ల ఏర్పాటు, బాలికల విద్యాలయాలువంటి సాంఘిక సమస్యలపై సుసంఘటిత పోరాటాలు నిర్వహించాయి.

'అఖిల భారత మహిళా సమాఖ్య'కు అనుబంధంగా పనిచేస్తున్న 'ఆం.ప్ర. మహిళా సమాఖ్య' ఈనాడు స్త్రీల హక్కులకోసం, వరకట్న నిర్మూలన, సతీ సహగమన నిరసన, స్త్రీలకు సమాన ప్రతిపత్తివంటి సమస్యల పరిష్కారంకోసం ఉద్యమిస్తూనే, ఎక్కడికక్కడ స్థానిక సమస్యలపై మహిళలను సమీకరిస్తూ ఆందోళనలు కొనసాగిస్తున్నది. మహిళా ఉద్యమాలకు దర్పణం పడుతున్నది.

## అభ్యుదయ సాహిత్యోద్యమం

1930 దశకంలో ప్రపంచమంతటా వాటిల్లిన ఆర్థిక, సాంస్కృతిక కల్లోల పరిస్థితుల్లో సంస్కృతినీ, మానవతనూ రక్షించాలనే ఆకాంక్ష వివిధ దేశాల రచయితల్లో కలిగింది. 1935 ప్రథమార్ధంలో పారిస్‌లో అంతర్జాతీయ రచయితల సదస్సు జరిగింది. అప్పుడు లండన్‌లో విద్యాభ్యాసం చేస్తున్న భారత విద్యార్థుల ప్రతినిధిగా సజ్జాద్ జహీర్ ఆ సదస్సుకు హాజరయ్యారు. ఆ సదస్సు ప్రేరణతో లండన్‌లోని భారత విద్యార్థులు 'భారత అభ్యుదయ రచయితల సంఘాన్ని' ఏర్పాటుచేసి, 1936 ఫిబ్రవరిలో ఒక ప్రణాళికను రూపొందించారు. అది లండన్‌నుండి వెలువడే 'లెఫ్ట్‌రివ్యూ'లో అచ్చయ్యింది.

ఆ ప్రణాళికలో ఉన్న ముఖ్యాంశాలివి :

'భారతదేశంలో మౌలికమైన మార్పులు వస్తున్నాయి. మార్పులేని భావాల మీద, పాత నమ్మకాలమీద, పూర్వ సామాజిక రాజకీయ వ్యవస్థలమీద జనం తిరగబడుతున్నారు. ప్రస్తుత ఘర్షణలు, గందరగోళాల్లోంచి నవసమాజం ఉద్భవిస్తోంది. శిథిల జీర్ణ జీవచ్ఛవ తిరోగామితత్వం కాయకల్ప చికిత్సకోసం ఆయత్తమౌతుంది.

నేడు భారతీయ జనజీవనంలో వస్తున్న మార్పులను చిత్రించడం రచయితల కర్తవ్యం. దేశాభ్యుదయానికి తోడ్పడ్డం వారి బాధ్యత. పూర్వ సంస్కృతి విచ్ఛిన్నం అయిన తర్వాత పుట్టిన సాహిత్యంలో జీవిత వాస్తవాలకు భీతిల్లే వైఖరి

ప్రబలింది. వాస్తవాల నుంచి వైదొలగి ఆధ్యాత్మిక ఆదర్శవాదాల్లో తలదాచుకోనడానికి అది యత్నిస్తోంది. ఫలితంగా కింసయాపవాదం, వక్రిభావజాలం పుడుతున్నాయి. మన సాహిత్యంలో మార్మికతని, భక్తి పారవశ్యాన్ని పరికించండి. ప్రచ్ఛన్న కామవాంఛను గమనించండి. హేతువిరుద్ధ భావావేశాల్ని చూడండి. గత రెండు శతాబ్దాలుగా పుట్టుకొస్తున్న సాహిత్యం ఇట్లాంటిదే. చరిత్రలో నిజంగా ఇది విషాదయుగం. ఒకవైపు భూస్వామ్య ఫ్యూడల్ వ్యవస్థ శిథిలమౌతూ ఉండే, మరోవైపునుంచి దుర్భర దారిద్ర్యం పెరుగుతూ వచ్చింది భారతీయులందరికీ అదొకదుర్దశ.

మన సాహిత్యమూ, కళలూ ఇంతవరకూ యాజక పండిత భ్రష్ట వర్గాల చేతుల్లోపడి నలుగుతూ వచ్చాయి. వాటిని ఉద్ధరించి, ప్రజలకు సన్నిహితం చేసి జీవిత వాస్తవాలను చిత్రించే సాధనాలుగా, భవిష్యత్తుకు మార్గదర్శకాలుగా మలచడం మన సంఘ ఆశయం.

భారత నాగరికతలోని ఉత్తమ సంప్రదాయాలకు వారసులం మనం. కనుక దేశంలోని తిరోగామి రాజకీయ ఆర్థిక సాంస్కృతిక అంశాలన్నింటినీ నిర్దాక్షిణ్యంగా విమర్శించాలి. మన దేశ నవజీవన సాధనకు తోడ్పడేందుకు అనువుగా దేశ విదేశ వనరులను కూడదీసుకుని సవిమర్శక సృజనాత్మక వ్యవసాయం చేయాలి. ఈనాడు ప్రధానంగా ఉన్న ఆకలి, దారిద్ర్యం, సాంఘిక అసమానతలు, రాజకీయ పరాధీనతల వంటి సమస్యల మీద మనం కొత్త రచనలు చేయాలి. అప్పుడే మనం సమాజ సమస్యలను అవగతం చేసుకొని కార్యాచరణకు ఉగగలుగుతాము.'1 అనే కర్తవ్యాలను నిర్దేశించిన ప్రణాళికపై డా॥ ముల్క్‌రాజ్ ఆనంద్, డా॥ కె. ఎస్. భట్, డా॥ జె సి. ఘోష్, డా॥ ఎస్. సిన్హా, ఎం డి. తాసీర్, సజ్జాద్ జహీర్ సంతకాలు చేశారు.

ఈ ప్రణాళిక రగిలించిన ఉత్సాహంతో 1936 ఏప్రిల్ 9, 10 తేదీల్లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన 'అఖిల భారత అభ్యుదయ రచయితల' ప్రథమ మహాసభ జరిగింది.

'కేవలం మనోరంజనానికి పరిమితమైన సాహిత్య సృష్టిని విడనాడి, సాహిత్యకారులు సృజనాత్మక శక్తిని పెంపొందించుకోవాలి. ఉన్నత భావాలు, స్వతంత్ర ఆలోచనలు, సౌందర్యారాధన, ఆత్మవికాసం, జీవిత యదార్థ ఘటనలు మన సాహిత్యంలో ప్రతిబింబించాలి' అని మహాసభ పిలుపు నిచ్చింది. ఈ మహాసభకు ఆంధ్రప్రాంతం నుండి అబ్బూరి రామకృష్ణారావుగారు హాజరై, 'ఇండియన్ లిటరేచర్' పత్రిక సంపాదకవర్గ సభ్యులుగా నియమితులయ్యారు.

1. 'అభ్యుదయ' (యాభై ఏళ్ళ అభ్యుదయ సాహిత్యోద్యమ పత్రాలు).

## తెలుగు నేలపై అభ్యుదయ సాహిత్యోద్యమ వ్యాప్తి

తెలుగునేలపై అభ్యుదయ సాహిత్యోద్యమం, అభ్యుదయ రచయితల సంఘం ఎలా వ్యాప్తి చెందాయో, సమకాలీన సాహిత్యాన్ని ఎలా ప్రభావితం చేశాయో క్లుప్తంగా పరిశీలిద్దాం.

గత శతాబ్దాంతానికి అజ్ఞాత, పురాణ, ప్రబంధయుగాలు అంతరించసాగాయి. కందుకూరి వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమం, గురజాడ అప్పారావుగారి సాహిత్య సంస్కరణోద్యమం, గిడుగు రామ్మూర్తి పంతులుగారి భాషా సంస్కరణోద్యమం తెలుగు సాహిత్య పరిధిని విస్తృత పరిచి, సాహిత్య దృక్పథంలో మార్పుతేసాగాయి ఆంగ్ల సాహిత్య పరిచయం వల్ల సాహిత్య ప్రక్రియా రూపాలు విస్తరించసాగాయి. వీటి ఫలితంగా ప్రబంధక్షీణ ధోరణులకు వ్యతిరేకంగా, క్షుద్ర మలిన శృంగారాల ధోరణిపై తిరుగుబాటుగా 'కాల్పనికోద్యమం' ప్రారంభమైంది.

## కాల్పనిక సాహిత్యోద్యమం

కాల్పనిక సాహిత్యోద్యమం 1850 నాటికే పాశ్చాత్య దేశాల్లో మరుగుబడిపోయినా, తెలుగు నేలపై ఇది 1900-1930 నడుమ విస్తృతవ్యాప్తి నందింది. దాదాపు ప్రజల ధోరణిగా చెలామణి అయ్యింది. అంతకుముందున్న సాహిత్య ధోరణులపై తిరుగుబాటుగా వచ్చింది కాబట్టి, దీనిని 'నవ్యసాహిత్యం' అన్నారు.

## నవ్యసాహిత్య పరిషత్తు

ఉద్యమరీత్యా ఈ నవ్యసాహిత్య ధోరణిని ప్రచారం చేసిన సంస్థ 'నవ్య సాహిత్య పరిషత్తు'. 1920-30 దశకంలో తెలుగు నాట వెల్లివిరిసిన అనేక సాహిత్య సంఘాలు నవ్యసాహిత్య పరిషత్తులో లీనమయ్యాయి. కాల్పనిక కవిత్వం కేవలం ప్రణయ కవిత్వంగానే కాక దేశభక్తి, ప్రకృతి వర్ణన, సంఘ సంస్కరణ, భక్తి కవిత్వం, స్మృతి కవిత్వం - వంటి వివిధ శాఖలుగా కొనసాగింది. దాదాపు మూడు దశాబ్దాలపాటు తిరుగులేని శక్తిగా రాజ్యమేలిన ఈ కాల్పనిక కవిత్వం 1930 నుండి క్రమంగా క్షీణదశకు చేరడం మొదలుబెట్టింది. అప్పటివరకు కందుకూరి, గురజాడల ఉదాత్త, ఉత్తమాశయాలు నిర్లక్ష్యం చేయబడసాగాయి. బ్రిటిష్ పాలకులపై దేశ ప్రజల్లో నానాటికి అధికమౌతున్న కోపాగ్ని, తిరుగుబాట్లు, స్వాతంత్ర్య పోరాటాలు, కార్మిక సంఘాల సమ్మె వెల్లువలు ఈ నవ్యకవుల్ని కదిలించలేకపోయాయి. చివరకు తెలుగునేలపై పిడికిలెత్తి గర్జించిన 'అల్లూరి సీతారామరాజు' మన్యం తిరుగుబాటుకూడా ఈ నవ్య కవుల్ని స్పందింపజేయలేకపోయింది. గరిమెళ్ళ, ఉన్నవ వంటి అతి కొద్దిమంది కవులు మినహా మిగతా కాల్పనికోద్యమ కవులు జాతీయ స్వాతంత్ర్య ఉద్యమాగ్నికి తమ గీతా

లను సమిధలుగా చేయలేకపోయారు నిర్దిష్టమైన సామాజిక దృక్పథం లేని 'నవ్య సాహిత్య పరిషత్తు' ఇలా క్రమంగా నిర్వీర్యమయ్యింది.

## అభ్యుదయ రచయితల సంఘ నేపథ్యం

1933 నాటికి మన దేశంలో రెండు సత్యాగ్రహోద్యమాలూ జాతీయ స్వాతంత్ర్యాన్ని సాధించలేకపోయాయి. పైగా మితవాద కాంగ్రెస్ నాయకత్వం పిలుపుపై ఉద్యమాలు విరమింపబడ్డాయి. 1933 లో జర్మనీలో హిట్లర్ అధికారంలోకి వచ్చి అనేకమంది రచయితలను, కళాకారులను, మేధావులను నిర్బంధాల పాలు చేశాడు. 1935 లో 'సంస్కృతి పరిరక్షణకు ప్రపంచ రచయితల మహాసభ' పేరుతో పారిస్‌లో అంతర్జాతీయ అభ్యుదయ రచయితల మహాసభ జరిగింది. 1936 ఏప్రిల్‌లో 'అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ' లక్నోలో జరిగింది. 1936 లోనే ఫైజ్‌పూర్‌లో జరిగిన 'కాంగ్రెస్ మహాసభ'ల సందర్భంగా కవయిత్రి సరోజినీనాయుడు ఆధ్వర్యంలో రచయితల ఇష్టాగోష్టి సమావేశం జరిగింది. ఆంధ్రప్రాంతం నుండి ఆ సమావేశానికి తుమ్మల వెంకటరామయ్య, క్రొవ్విడి లింగరాజు హాజరయ్యారు. ఆంధ్ర ప్రాంతంలో అభ్యుదయ రచయితల సంఘాన్ని స్థాపించాల్సిందిగా ఈ ప్రతినిధులకు మిగతా రచయితలు సూచించారు.

## అభ్యుదయ సాహిత్య నేపథ్యం

1934 - 43 మధ్యకాలంలో కార్మికవర్గాన్ని, రైతాంగాన్ని, వ్యవసాయ కార్మికుల్ని ఉత్తేజపరిచి, చైతన్యవంతుల్ని చేసే ప్రబోధ గీతాలనేకం వెలువడ్డాయి. మరోపక్క 'సోషలిజం' గురించి తెలిపే సాహిత్య గ్రంథాలు, గోర్కీ రచనల అనువాదాలు, సోషలిస్టు సాహిత్య ప్రచురణ ఆరంభమయ్యింది. 1934 నాటికే అనేకమంది రచయితలు రైతు జీవన పరిస్థితుల్ని వివరించే గీతాలు రాశారు. 1934లో ఎన్. జి. రంగాగారి సంపాదకత్వంలో 'రైతు భజనావళి' వెలువడింది. ఈ గీతాలద్వారా తెలుగు సాహిత్యంలో హేతువాద దృక్పథానికి, జమీందారీ వ్యతిరేక పోరాటానికి, సోషలిస్టు భావాల వ్యాప్తికి అంకురార్పణ జరిగింది. 'ప్రభ' పత్రిక 20 జూన్ 1935 సంచికలో తెలుగునేలపై తొలి "ఎర్ర జండా" పాట అచ్చయ్యింది తుమ్మల వెంకట్రామయ్యగారు రచించిన ఈ గీతం ఈనాటికీ వామపక్ష ఉద్యమాల 'పల్లవి'గా కొనసాగుతోంది అదే సంచికలో 'యూజినీపాటియర్' రాసిన అంతర్జాతీయ గీతానికి బాలాంత్రపు నళినీ కాంతారావుగారి అనువాదం ప్రచురితమయింది. 1935-38 మధ్యకాలంలో 'ప్రభ' మొదలైన పత్రికల్లో అచ్చయిన కార్మికవర్గ దృక్పథం గల గీతాలు గద్దె

లింగయ్యగారి సంపాదకత్వాన 'క్రాంతి గీతాలు' (సంకలనం)గా వెలువడ్డాయి. 1934 లో శ్రీశ్రీ 'మహాప్రస్థాన గీతం' వెలువడింది.

అలాగే ఈ దశకంలో అనేక తిరుగుబాట్లు జరిగాయి. భావ కవిత్వంపై తిరుగుబాటు, స్త్రీ పురుష సంబంధాల నీతినియమాలపై తిరుగుబాటు, కుల మత వ్యత్యాసాలపై తిరుగుబాటు, అంధ విశ్వాసాలపై తిరుగుబాటు; ఛందోబద్ధ వృత్తాలపై, పాత పద బంధాలపై, రూప చిత్రాలపై, గేయరచనా రీతులపై తిరుగుబాట్లు జరిగాయి.

## ఆంధ్రాభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ

1943 ఫిబ్రవరి 13,14 తేదీల్లో తాపీ ధర్మారావుగారి అధ్యక్షతన 'ఆంధ్రాభ్యుదయ రచయితల ప్రథమ మహాసభ' తెనాలిలో జరిగింది. మహాసభ నాటికి 61 మంది సభ్యులుగా చేరిన ఈ సంఘం మహాసభకు 34 మంది ప్రతినిధులు హాజరయ్యారు.

చదలవాడ పిచ్చయ్య కార్యదర్శిగా; తాపీ ధర్మారావు, తుమ్మల వెంకట రామయ్య, చదలవాడ పిచ్చయ్య సంపాదకవర్గ సభ్యులుగా ఎన్నికయ్యారు. తెనాలి మహాసభ ఆమోదించిన అరసం ప్రణాళికలో ఈ క్రింది అంశాలున్నాయి:

'భారతీయ సామాజిక జీవితంలో తీవ్రమైన మార్పులు జరుగుతున్నవి. అభివృద్ధి నిరోధకత్వం క్షీణించి అవసాన దశలో ఉన్నప్పటికీ పూర్తిగా నశించ లేదు. పైపెచ్చు తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోడానికి విశ్వప్రయత్నాలు చేస్తూ ఉంది. పౌరాణిక సంస్కృతి కాలం గడచిన తర్వాత, భారతీయ సారస్వతం యదార్థ జీవితం నుంచి తప్పించుకుపోయి వినాశకరమైన ధోరణిని అవలంబించింది. తర్వాత సాహిత్యం వాస్తవిక సంఘటనలను విసర్జించి నిరాధారమైన ఆధ్యాత్మికవాదం, ఊహాజనిత ఆదర్శవాదాన్ని పట్టుకుని వ్రేలాడుతుంది. తత్ఫలితంగా భారతీయ సారస్వతం శుష్కించి నీరసించి కరకు వాదస్త్రాలతోను, తప్పుడు ఆదర్శాలతోను నిండిపోయింది.

మన సమాజంలో జరుగుతున్న మార్పుల్ని గుర్తించి, వాటి అభివృద్ధిని ప్రతిబింబింప జేసే సాహిత్యాన్ని సృష్టించడం భారతీయ రచయితల విధి. సారస్వతంలో శాస్త్రీయమైన హేతువాదాన్ని చొప్పించి, దేశంలో ఉన్న అభివృద్ధికర శక్తులకు చేయూత నివ్వాలి. కుటుంబ జీవితం, సమాజము, మతము, సెక్స్, యుద్ధం- మొదలైన సమస్యలమీద వ్రాయబడ్డ అభివృద్ధి నిరోధకతత్వాన్ని అరికట్టాలి. కులమత కక్షలు, జాతి విద్వేషం, వర్గదోపిడి, వీటిని పురిగొల్పే వ్రాతల్ని ప్రతిఘటించాలి. ఈ బాధ్యతను నిర్వర్తించడానికి భారతీయ రచయితలు

సాహిత్య విమర్శనాదృష్టిని అలవరచుకొని పెంపొందించుకొనవలసిన అవసరం ఎంతయినా ఉంది.

నేటివరకు సారస్వతం, తదితర కళలు ఛాందస వర్గాల చేతుల్లో నలిగి మలిన మవుతున్నవి. వాటిని వీరి ఆధిపత్యంనుంచి తప్పించడం, ప్రజాసముదాయానికి సన్నిహిత పరచడం, జీవిత యథార్థాన్ని ఉన్నదున్నట్లుగా కనబరిచే శక్తివంతమైన సాధనాలుగా జేయడం - ఇవి సంఘం యొక్క ప్రధానోద్దేశ్యాలు.

భారతీయ నాగరికతలోని ఉత్తమ సంప్రదాయాలకు వారసుల మని నొక్కిచెబుతూ, మనదేశంలోని అభివృద్ధి నిరోధకత్వాన్ని అన్నివిధాలా విమర్శిస్తాము. మనదేశం ఒక నూతన జీవితాన్ని లక్ష్యంగా పెట్టుకొని పాటుబడుతూ ఉంది. అందుకు తోడ్పడే ప్రతి విషయాన్ని వ్యక్తపరచడం ద్వారాను, నూతన రచనల ద్వారాను ప్రోత్సహిస్తాము. ఇందుకు వలసిన దేశీయ, విదేశీయ విజ్ఞాన సంపదను వినియోగించుకుంటాము. మన భారతీయ సారస్వతం - ఆకలి, దారిద్ర్యం, రాజకీయ బానిసత్వం, సాంఘికంగా వెనుకబడడం మొదలైన జీవిత ప్రధాన సమస్యల్ని చర్చించాలి - అని విశ్వసిస్తున్నాం.

నిస్తబ్దత, కార్య శూన్యత, హేతు వ్యతిరేకతలకు దించే ప్రతి రచనను అభివృద్ధి నిరోధకమైనదనిగా తిరస్కరిస్తున్నాము.

ఆచారాలను, వ్యవస్థలను హేతువాదంతో పరిశీలించడానికిన్నీ; కార్యాచరణకు ప్రోత్సహించి, సంఘటనా శక్తిని అలవరిచి మార్పులు తేవడానికిన్నీ తోడ్పడే విమర్శక భావాన్ని మనలో ఉత్తేజింపజేసే ప్రతి వ్రాత అభివృద్ధికరమైనదిగా భావిస్తూ, దాన్ని స్వీకరిస్తున్నాము.[1]

ఆంధ్ర అభ్యుదయ రచయితల ద్వితీయ మహాసభ బెజవాడలో 1944 డిసెంబర్ 29, 30, 31 తేదీల్లో జరిగింది. అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి సజ్జాద్ జహీర్ ఈ మహాసభల్ని ప్రారంభించారు. ఈ మహాసభల సందర్భంగా చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిని సన్మానించి, వారి 'స్వీయ చరిత్ర'ను సంఘం ప్రచురించింది.

తృతీయ మహాసభలు రాజమహేంద్రవరంలో 1945 డిసెంబర్ 31; 1946 జనవరి 1, 2 తేదీల్లో జరిగాయి. ఈ సభల నాటికి 16 శాఖలతో, 900 మంది సభ్యులతో 'అరసం' పటిష్ఠవంతమయింది.

1944 మే నుండి 1946 మార్చి వరకు 'తెలుగు తల్లి' సాహిత్యపత్రికను అరసం నిర్వహించింది.

---

1. 'అభ్యుదయ' (యాభై ఏళ్ళ పత్రాలు) సంపాదకుడు : ఏటుకూరి ప్రసాద్.

1946 మే 11 నుండి జూన్ 10 వరకు గుంటూరు జిల్లా పెదపూడిలో 'ఆంధ్ర సాహిత్య పాఠశాల' నిర్వహింపబడింది.

1947 లో మద్రాస్‌లో అరసం చతుర్థ మహాసభ జరిగింది. అభ్యుదయ సాహిత్యోద్యమ లక్ష్యాలను, సాధించిన విజయాలను సమీక్షించింది. వ్యావహారిక భాషను విశ్వవిద్యాలయాలు అంగీకరించకుండా తిరస్కరిస్తున్న వైఖరిని ఈ మహాసభ గర్హించింది.

## ప్రభుత్వ దమనకాండ

1948 - 52 సంవత్సరాల మధ్య 'అభ్యుదయ రచయితల సంఘం' తీవ్రమైన ప్రభుత్వ దమనకాండకు గురయ్యింది. తెలంగాణా పోరాటం తీవ్రతరం కావడంతో కమ్యూనిస్టు పార్టీ నిషేధింపబడింది. 'ప్రకాశం ఆర్డినెన్స్' వెలువడింది. అరసంలో ప్రముఖ పాత్రను వహిస్తున్న పార్టీ రచయితలూ, కళాకారులూ జైళ్ళకో, రహస్య జీవితానికో వెళ్ళారు. అలాంటి చారిత్రక సమయంలో అప్పటి అరసం కార్యదర్శి చదలవాడ పిచ్చయ్య మితవాద వైఖరిని ప్రదర్శించి, సంస్థనుండి బహిష్కృతుడయ్యాడు ఆరుద్ర, అనిసెట్టి, గోఖలే వంటివారు సంస్థనుండి తప్పుకున్నారు. వీటి ఫలితంగా అరసం, 'అభ్యుదయ' (పత్రిక)లు తాత్కాలికంగా మూతబడ్డాయి.

1951 లో తెలంగాణా సాయుధపోరాట విరమణ జరిగాక కూడా చాలా కాలంపాటు 'అరసం' కార్యక్రమాలు పుంజుకోలేకపోయాయి.

## అభ్యుదయ సాహిత్య వ్యాప్తి

'అభ్యుదయ రచయితల సంఘం' కార్యక్రమాలు కొంతకాలం పాటు స్తంభించినా, అభ్యుదయ సాహిత్యం మాత్రం స్తంభించలేదు. 'విశాలాంధ్ర', 'నవసాహితి', 'అరుణరేఖ' 'సంధ్య', 'ఉదయిని', 'దండోరా', 'నగారా', 'బృందావనం' మొదలైన పత్రికల ద్వారా అభ్యుదయ రచయితలు తమ సాహిత్యాన్ని ప్రజల్లో ప్రచారం చేయగలిగారు. 1948 నుండి అరసం 5 వ మహాసభ జరిగిన 1955 మధ్యకాలంలో శ్రీశ్రీ 'మహాప్రస్థానం', ఆరుద్ర 'త్వమేవాహమ్', సోమసుందర్ 'వజ్రాయుధం', రమణారెడ్డి 'అడవి', గంగినేని 'ఉదయిని' వంటి అభ్యుదయ కవితా సంపుటులు వెలుగు చూసాయి.

1952 నుండి 'అరసం' కార్యక్రమాలను పునరుద్ధరించాలని జరిగిన ప్రయత్నాల వల్ల 1955 జూలై 30, 31 తేదీల్లో విజయవాడలో 'అరసం' 5 వ మహాసభలు జరిగాయి. అరసం ప్రణాళికలో కొన్ని చేర్పులు ఈ మహాసభలో చేయడం జరిగింది.

'నేటి పరిస్థితులను సమగ్రంగా అవగాహన చేసుకొంటూ, వాస్తవిక దృష్టితో ప్రజల నిత్య జీవితాన్ని అభ్యుదయ రచయిత వివిధ కళా రూపాలలో ప్రతిఫలించాలి'. 'మన రచనలలో నిరర్థకమైన విశృంఖలత కానీ, ప్రయోజన రహితమైన శృంఖలాబద్ధతకు గానీ తావివ్వక, వస్తువుకు - శిల్పానికి చక్కని సమన్వయం సాధించి, ఉత్తమ కళాఖండాలను సృష్టించడానికి ప్రయత్నించాలి వంటి మౌలికాంశాలు కొన్నింటిని అరసం ప్రణాళికకు ఈ మహాసభ చేర్చింది. 'అభ్యుదయ' ప్రత్యేక సంచిక ఈ మహాసభల్లో వెలువడింది. శ్రీశ్రీ అధ్యక్షులుగా, తుమ్మల వెంకటరామయ్య కార్యదర్శిగా ఎన్నికయ్యారు. 1955 నుండి 1959 వరకు అరసం అధికార పత్రిక 'అభ్యుదయ' వెలువడి, అభ్యుదయ సాహిత్యోద్యమ వ్యాప్తికి తన వంతు కృషిని నిర్వహించింది.

తెలంగాణా సాయుధ పోరాటం ఉధృతంగా ఎగిసిపడుతున్న కాలంలో అభ్యుదయ రచయితలు ఆ పోరాటాన్ని చిత్రించే కథలు, కవితలు, గీతాలు వెలయించారు. వీరితోపాటు తెలంగాణా పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న కవులు, ఆ పోరాట స్ఫూర్తితో కవులైనవారు ఎందరో వున్నారు. జానపద రీతులలో పాటలు, బుర్రకథలు, ఒగ్గుకథలు, గీతాలు వందలాదిగా వెలువడ్డాయి. సుద్దాల హనుమంతు, యాదగిరి, తిరునగిరి రామాంజనేయులు మొదలైనవారు ఈ పోరాటంలోంచి పుట్టిన ఉద్యమ కవులు. పోరాట స్ఫూర్తితో వట్టికోట ఆళ్వార్ స్వామి, కాళోజి, పొట్లపల్లి రామారావు, తెన్నేటి సూరి, సుంకర, లక్ష్మీకాంతమోహన్, సి.వి. కృష్ణారావు, తుమ్మల వెంకట రామయ్య మొదలైన రచయితలు అనేక కథలు, గేయాలు రచించారు. ఉద్యమ విరమణ తర్వాత గంగినేని వేంకటేశ్వరావు 'ఎర్రజెండాలు' పేరిట మూడు కథా సంపుటాలను వెలువరించారు. అలాగే, తెలంగాణా సాయుధ పోరాటం నాటి స్థితిగతులను చిత్రించిన నవలలు అనేకం వెలువడ్డాయి.

1955 నుండి కొంతకాలం పాటు అభ్యుదయ రచయితల సంఘ కార్యక్రమాలు కుంటుపడినప్పటికీ, తెలుగునాట ప్రజ్వరిల్లిన ప్రతి ఉద్యమంలోనూ అభ్యుదయ రచయితలు తమ పోరాట వాణిని వినిపించారు. ప్రగతి నిరోధక ఆందోళనలకు ఎదురొడ్డి నిలబడ్డారు. తెలుగు సాహిత్య రంగంపై పడిన తమ బలమైన ముద్రలను కాపాడుకుంటూ వచ్చారు.

## కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక

జాతీయోద్యమంలోనూ, తెలంగాణా సాయుధ పోరాట కాలంలోనూ మహోజ్వలమైన పాత్రను భారత కమ్యూనిస్టు పార్టీ నిర్వహించింది. దేశ వ్యాప్తంగా సంస్థానాధీశులకు వ్యతిరేకంగా మహత్తరమైన పోరాటాలు నిర్వర్తిం

చింది. అయితే, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల నుండి భారతదేశానికి లభించిన రాజకీయ స్వాతంత్ర్యాన్ని అంచనా కట్టడంలో తీసుకున్న ధోరణుల్లోని భేదం వల్ల పార్టీ చీలిపోయింది.

ఆనాటి పార్టీ రాజకీయ పత్రం ఈ విధంగా ప్రకటించింది :

'మౌంట్ బాటన్ అవార్డు భారత ప్రజల కిచ్చింది నకిలీ స్వాతంత్ర్యమే కానీ అసలు స్వాతంత్ర్యం కాదు బ్రిటన్ పెత్తనం ముగియలేదు. పెత్తనం రూపాలు మాత్రం మారాయి ఇప్పుడు జాతీయ ప్రజాతంత్ర విప్లవాన్ని రక్తంతో ముంచెత్తే ఉద్దేశంతో బూర్జువా వర్గానికి రాజ్యాధికారంలో వాటా ఇచ్చారు.'[1]

పార్టీ పొలిట్ బ్యూరో డాక్యుమెంట్లు కూడా ఇదే ధోరణిని ప్రచారం చేశాయి. 'బూర్జువా వర్గాన్ని ఏకాకిని చేసి, దాని ప్రతిఘటనను బలప్రయోగంతో ఎదుర్కోడానికి వ్యవసాయ కార్మికుల్ని, పేద రైతాంగాన్ని, మధ్యతరగతి రైతాంగాన్ని అనుచరులుగా చేసుకుని శ్రామికవర్గం జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని పరిపూర్తి చేయాలి' అనే లక్ష్యాన్ని నిర్దేశించాయి.[2]

బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా ఉప్పొంగిన ప్రజావెల్లువను జాతీయ బూర్జువా వర్గానికి వ్యతిరేకంగా ఉపయోగించుకుని అసంపూర్ణ పోరాటాన్ని విస్తృత ప్రజాపోరాటాలుగా మలిచి 'జనతా ప్రజాతంత్ర విప్లవాన్ని' పూర్తి చేయాలని పార్టీ పిలుపు నిచ్చింది. అయితే బ్రిటిష్ పాలకులపై ప్రజల్లో సర్వత్రా వ్యాపించిన వ్యతిరేకత కాంగ్రెస్ పాలకులపై లేదన్న విషయాన్ని, జాతీయోద్యమంలో ప్రధాన రాజకీయ పక్షంగా జాతీయ కాంగ్రెస్ సంపాదించిన పలుకుబడిని కమ్యూనిస్టుపార్టీ అవగాహన చేసుకోవడంలోనూ, సరిగా అంచనా కట్టడంలోనూ చాలా జాప్యం జరిగింది.

ఫలితంగా భారత విప్లవదశ ప్రజాతంత్ర దశ అని 'ఆంధ్రా డాక్యుమెంట్' సరిగా వాదిస్తూనే చైనాతో పోల్చుకొని మనదేశం కూడా చైనాదేశం వలె అర్ధవలస దేశమనీ, భారత్‌లో విప్లవ పంథా చైనా మార్గంలో ఉండాలనీ, రైతాంగ సాయుధ పోరాటం గెరిల్లా సాయుధ ప్రతిఘటనగా అభివృద్ధి చెంది విముక్తి ప్రాంతాల ఏర్పాటుద్వారా చివరికి పట్టణాలను సాయుధదళాలు విముక్తి చేయాలనే పంథాకు 1950 మేలో జరిగిన కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ సమావేశం ఆమోదం తెలిపింది.[3]

---

1,2. భారత కమ్యూనిస్టు పార్టీ చరిత్ర : మార్గదర్శక సూత్రాలు.
—కేంద్ర పార్టీ అధ్యయన విభాగం, ఆం ప్ర. కమ్యూనిస్టు సమితి ప్రచురణ.

3. 1964 లో భారత కమ్యూనిస్టుపార్టీ ఎందుకు చీలింది? - ఇంద్రదీప్ సిన్హా. ఆం. ప్ర. కమ్యూనిస్టు సమితి ప్రచురణ.

1949 - 50 కమ్యూనిస్టు పార్టీలో ఒక వర్గం 'చైనా మార్గం' అనుసరణీయమైనదనే వాదనను లేవదీయసాగింది. వారి వాదనలకు తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం ప్రాణం పోసింది. నిజాం పాలిత తెలంగాణా జిల్లాల్లో కిరాతక ఫ్యూడల్ దోపిడి, జాతీయ, మత అణచివేతకు వ్యతిరేకంగా ఐక్య రైతుపోరాటం 'ఆంధ్ర మహాసభ' నాయకత్వంలో ప్రారంభమై గెరిల్లా పోరాట దశకు వెళ్ళింది. 4000 గ్రామాలను విముక్తం చేసి 10 లక్షం ఎకరాలకు పైగా భూమిని ఆక్రమించుకుని పేద రైతులకు పంచింది. 1948 సెప్టెంబర్‌లో జరిగిన 'పోలీస్ చర్య' తర్వాత భారత సైన్యంతో ఘర్షణ ప్రారంభమైన తర్వాత తీవ్రమైన ఇబ్బందుల నెదుర్కొన్నది. మొదట్లో ఉన్న విస్తృత ఐక్యత విచ్ఛిన్నమయ్యింది. కాంగ్రెస్ మద్దతుదారులు పోరాటాన్ని వ్యతిరేకించసాగారు. కొత్త పాలకులు ప్రకటించిన వ్యవసాయ సంస్కరణలవల్ల రైతుల్లో చీలిక ఏర్పడింది. సైన్యం అణచివేత చర్యలు తీవ్రతరమయ్యాయి. ఈ పరిణామాల పర్యవసానంగా 1949 మధ్య కాలంలో గెరిల్లా దళాలు కేవలం ప్రాణ రక్షణకోసం అడవుల్లోకి విధిలేక వెళ్ళాల్సి వచ్చింది. పోరాటంపట్ల సానుభూతి ఉన్నప్పటికీ ప్రజలు ప్రతిఘటించకుండా ప్రేక్షకులుగా మారటంతో గెరిల్లా దళాలకూ, భారత ప్రభుత్వ సైన్యానికీ మధ్య పోరాటం అసమ యుద్ధం కాసాగింది.

ఫలితంగా 1951 లో తెలంగాణా సాయుధ పోరాటం ఉపసంహరింపబడింది. కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం ఉపసంహరణ నిర్ణయాన్ని సమష్టిగానే తీసుకున్నప్పటికీ పార్టీలో ఒక వర్గం సాయుధ పోరాటాన్ని కొనసాగించాల్సిందనీ, చైనా మార్గంలో పయనించాల్సిందనీ భావిస్తూ వచ్చింది. 1951 నుండి 1964 వరకు పార్టీలో అంతర్గత వైరుధ్యాలు, తగాదాలు అధికం కాసాగాయి. 1959 లో భారత-చైనా సరిహద్దు వివాదం ప్రారంభమై, వాయువ్యంలో వివాదగ్రస్తమైన కొంకా ప్రాంతంలో 1959 అక్టోబర్ 21న తీవ్ర ఘర్షణ జరిగి భారత సైనికులు చాలామంది చనిపోవడంతోబాటు రెండువైపులా నష్టాలు సంభవించాయి. 1959 సెప్టెంబర్ 9న ఈ ఘటనల్ని ఖండిస్తూ సోవియట్ 'టాస్' ప్రకటన వెలువడింది. 1960లో మాస్కోలో జరిగిన కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల అంతర్జాతీయ మహాసభలో భారత ప్రతినిధివర్గం 'టాస్' ప్రకటనను సమర్థించగా, చైనా కమ్యూనిస్టుపార్టీ ప్రతినిధివర్గం 'టాస్ ప్రకటన శ్రామికవర్గ అంతర్జాతీయత'ను ఉల్లంఘించిందని విమర్శించింది. 1959 మే 3న, మే 6న, ఆగస్టు 20న, సెప్టెంబర్ 8న భారత కమ్యూనిస్టుపార్టీ; చైనా కమ్యూనిస్టు పార్టీకి లేఖలు రాసింది. వాటిలో కొన్నింటికి చైనాపార్టీ సమాధానం రాయలేదు కొన్నింటికి కటువైన సమాధానాలురాస్తూ 'మెక్‌మోహన్‌రేఖ'కు దక్షిణంగా

ఉన్న 90,000 చ.కి మీలు చైనాకు చెందినదని చైనాపార్టీ తెలిపింది. 1962 అక్టోబర్ మధ్యకాలంలో చైనా మెక్‌మోహన్‌రేఖ దాటి భారత్‌పై దురాక్రమణకు పూనుకున్నది. నవంబర్ 2న భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి తీవ్ర వాదోపవాదాల తర్వాత 'చైనీయుల దురాక్రమణకు వ్యతిరేకంగా అన్ని వర్గాలకు చెందిన భారతప్రజలు దేశ రక్షణకు ఐక్యం కావాలనే' తీర్మానాన్ని ఆమోదించింది.

1960 నుండి సోవియట్ కమ్యూనిస్టు పార్టీతో విభేదించిన చైనా, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్ని చీల్చేందుకు అంతర్జాతీయంగానే సన్నాహాలు ప్రారంభించింది. మైనారిటీ గ్రూపులను ప్రోత్సహించడం ద్వారా బెల్జియం, బ్రిటన్, ఆస్ట్రేలియా, సింహళం, పెరు వంటి దేశాల కమ్యూనిస్టు పార్టీల్లో చైనా చొరవతో చీలిక లేర్పడ్డాయి. చైనా పంచన చేరిన ఇండోనేషియా కమ్యూనిస్టు పార్టీ 'భారతదేశంలో నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టుపార్టీని ఏర్పాటు చేయ'మనీ' 'డాంగే ముఠా'తో తెగతెంపులు చేసుకొమ్మని పిలుపు నిచ్చింది [1]

1964 ఏప్రిల్ 11న జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయసమితి సమావేశం నుండి 32 మంది చీలిక వాదులు వాకౌట్ చేసి పోటీ కార్యక్రమాన్ని ప్రకటించి, పోటీ మహాసభకు పిలుపు నిచ్చారు. పార్టీ నుండి విడిపోయింది ఒక చిన్న గ్రూపే అయినప్పటికీ పార్టీ ముఖ్య నాయకుల నాయకత్వాన వెళ్ళిన విభాగమది ఈ విడిపోయిన విభాగం 1963 జూన్ 14న చైనా ప్రతిపాదించిన 'సాధారణ పంథా' ప్రాతిపదికపై ముసాయిదా కార్యక్రమాన్ని రూపొందించుకుని, భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) అనే పోటీ కమ్యూనిస్టు పార్టీని స్థాపించింది అయితే విడిపోయిన 32 మంది జాతీయ సమితి సభ్యుల్లోనూ ఉన్న తీవ్ర సైద్ధాంతిక విభేదాల మూలంగా మార్క్సిస్టు పార్టీ 1967లో మరో మారు చీలి; 1969 మధ్యలో భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు-లెనినిస్టు) ఏర్పడింది. పశ్చిమ బెంగాల్‌లోని 'నక్సల్‌బరీ' అనే ప్రాంతంలో అనేక సంవత్సరాల నుండి రైతులు దున్నుకుంటూ సేద్యం సాగిస్తున్న భూమిని అన్యాయంగా జోతేదార్లు ఆక్రమించబోగా, అక్కడి రైతులు సాయుధ ప్రతిఘటన చేశారు. ఇది క్రమంగా నక్సల్‌బరీ పోరాటంగా పరిణతి చెందింది. 'నక్సలిజం' అనే ఒక కొత్త రాజకీయ సిద్ధాంతంగా రూపొంది, దేశంలోని అనేక ప్రాంతాలకు విస్తరించింది. 'సాయుధ రైతాంగ తిరుగుబాటు', 'గెరిల్లా పోరాట పద్ధతుల' ద్వారా గ్రామాలను విముక్తం చేసి, తర్వాత పట్టణాలను విముక్తి చేయడం ఈ

---

1. '1964లో భారత కమ్యూనిస్టుపార్టీ ఎందుకు చీలింది?'
- ఆం ప్ర. కమ్యూనిస్టు సమితి ప్రచురణ.

సిద్ధాంత లక్ష్యాలు. మావో ఆలోచనా విధానం వీరికి ఊపిరి. పార్లమెంటరీ ప్రజా స్వామ్యంపై అసహనం, తుపాకి గొట్టం ద్వారా రాజ్యాధికారాన్ని సాధించగలమన్న విశ్వాసం వీరి ఆదర్శాలు.

'సాయుధ పోరాటమే ఏకైకమార్గం' అన్నది వీరి నినాదం. అయితే సాయుధ పోరాటానికి అనుకూల - ప్రతికూల పరిస్థితుల మీద, ప్రజల సంసిద్ధత మీద ఏర్పడిన తీవ్ర విభేదాల కారణంగా మార్క్సిస్టు - లెనినిస్టుపార్టీ అనేక నక్సలైట్ గ్రూపులుగా మరికొన్నిసార్లు చీలింది. భారత కమ్యూనిస్టు ఉద్యమంలో తీవ్ర వైరుధ్యాలను సృష్టించింది.

1925 నుండి 1964 వరకు కమ్యూనిస్టు పార్టీ వేర్వేరు ప్రజాశ్రేణుల్ని సంఘటిత పరిచి సమరశీల ఉద్యమాలు నిర్వహించగా, 1964 నుండి ప్రధాన స్రవంతి తన దారిన తాను కార్యక్రమాల్ని, ఉద్యమాల్ని నిర్వహిస్తుండగానే అందులోంచి 1964లో చీలిన ఒక వర్గం, 1969 లో మరిన్ని వర్గాలుగా చీలి, చీలికల సిద్ధాంతానికి బీజాలు వేసింది. ఇవి కేవలం రాజకీయ పార్టీల చీలికల వరకే పరిమితం కాక కార్మిక సంఘాల్లోను, రైతు సంఘాల్లోనూ, విద్యార్థి సంఘాల్లోనూ, యువజన సంఘాల్లోనూ చీలికలను సృష్టించి, భారత వామపక్ష ఉద్యమానికి అపారమైన నష్టాన్ని, అనేక అటుపోట్లను సృష్టించింది. ఒకే గమ్యం వైపు పయనిస్తూ, ఒకే లక్ష్యానికై పోరాడుతున్న ప్రజాశ్రేణుల్లో ఏర్పడిన అంతర్గత సంక్షోభం, వైరుధ్యాలు వామపక్ష ఆశయ సాధనకు అవరోధాలుగా తయారయ్యాయి.

## అరసం కార్యక్రమాలు ఆగినా ఆగని అభ్యుదయ సాహిత్యం

1962 లో అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక ఏర్పడింది. దాని ఫలితంగా 1964 లో భారత కమ్యూనిస్టుపార్టీలో ఏర్పడిన ఒక చీలిక 1967 నుండి మరికొన్ని చీలికలకు దారి తీసింది. ఇలా వామపక్ష ఉద్యమంలో ఏర్పడుతున్న చీలికలు సృష్టించిన సిద్ధాంతపరమైన గందరగోళాల మూలంగా 'అభ్యుదయ రచయితల సంఘం' ఒక సంఘంగా పని చేయలేకపోయింది. రాజకీయ పార్టీలే సాహిత్య సంస్థలు కానప్పటికీ వీటి ప్రభావాలు సాహిత్యంపై అనివార్యంగా పడతాయి. ఆధునిక సమాజం రాజకీయాలకూ, ఇతర సామాజిక చైతన్య రూపాలకూ (సాహిత్యంతో సహా) కల్పించిన అవినాభావ సంబంధం అటువంటిది. రాజకీయాలే సాహిత్యం కానప్పటికీ, అభ్యుదయ సాహిత్యానికి రాజకీయ అవగాహన జీవనాడి అయ్యింది.

దాదాపు ఒక దశాబ్దం పాటు (1959-69) అభ్యుదయ రచయితల సంఘం కార్యక్రమాలు కొనసాగకపోయినా అభ్యుదయ సాహిత్యోద్యమం వేసిన ప్రభావంతో అనేక కవితా సంపుటులూ, గీతికా సంపుటులూ, కథా సంకలనాలు, నవలలూ వెలువడినాయి.

తెన్నేటి సూరి 'అరుణ రేఖలు', కాంచినేపల్లి చిన వెంకట్రామారావు 'అరుణ రేఖలు' కవితా సంపుటులు వెలువడ్డాయి. 1954లో రాంభట్ల కృష్ణమూర్తి గారి 'శశవిషాణం' (గీతాలు), 1961 లో విశాలాంధ్ర ప్రచురణాలయం వారు వెలువరించిన 'స్వేచ్ఛాపథం' (వివిధ రచయితల గేయ సంకలనం) వెలువడ్డాయి. అలాగే అక్టోబరు, 1961లో వెలువడిన 'మల్లారెడ్డి గేయాలు' అభ్యుదయ సాహిత్యానికి కొత్త రక్తాన్ని ఎక్కించాయి. 1962 లో కె. వి. రమణారెడ్డి సంకలనం చేసిన 'అడుగుజాడ గురజాడది' (వివిధ కవులు రాసిన గేయసంకలనం) యుగకవి గురజాడ వారసత్వాన్ని ప్రదర్శించింది. 1963 లో కాళోజి ప్రకటించిన 'తుది విజయం మనది నిజం' (గీతాలు) అభ్యుదయ కవుల దేశభక్తికి నిదర్శనాలు. అలాగే 1965-67 మధ్యకాలంలో కాళోజి వెలువరించిన 'నా గొడవ' కవితలు సమాజ చైతన్య దర్పణాలు. 1964 లో వెలువడిన కమ్మిశెట్టి వెంకటేశ్వరరావుగారి 'అగ్నిశిఖలు-మంచు జడులు', 1965 లో సి. విజయలక్ష్మిగారి 'విషాద భారతం', వివిధ కవులు రాసిన కవితా సంకలనం 'రాత్రి' వంటి కవితా సంపుటులూ తెలుగు కవితా రంగంలో కొంతవరకు స్తబ్దతను తగ్గించాయి.

1960-70 మధ్యకాలంలో ఒకవైపు 'విశాలాంధ్ర', 'నవ్యసాహితి', 'ఉదయిని' వంటి పత్రికలు అభ్యుదయ సాహిత్య వ్యాప్తికి దోహదం చేస్తుంటే; మరోవైపు శ్రీశ్రీ సంపాదకత్వం వహించిన 'నవత' త్రైమాస పత్రిక (1967), రాచమల్లు రామచంద్రారెడ్డి సంపాదకత్వం వహించిన 'సంవేదన' త్రైమాస పత్రిక (1968), ఆవంత్స సోమసుందర్ సంపాదకత్వంలో వెలువడిన 'కళాకేళి' మాసపత్రిక (1969) మొదలగునవి అభ్యుదయ సాహిత్యంలోని తీరుతెన్నులను విశ్లేషిస్తూ, విమర్శిస్తూ, సమీక్షిస్తూ ఉద్యమ వ్యాప్తికి తోడ్పడ్డాయి.

## దిగంబర కవిత్వం

1965లో ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్ నగరంలో ఆరుగురు యువకవులు ఒకచోట చేరి సాహిత్యరంగంలో అవతరించిన స్తబ్ధ ధోరణులపై తమ అలజడిని ప్రకటించాలనుకొన్నారు పూర్వపు కవితా పద్ధతులను విడనాడి కొత్తరకమైన కవిత్వాన్ని రాయాలనుకొన్నారు. అచ్చుల్లో, ఆవిష్కరణలో, కలం పేర్లను ఎన్నుకోవడంలో కొత్తదనం చూపారు. 'మానసిక దిగంబరత్వం కోసం నిత్య సచేతన ఆత్మస్ఫూర్తితో జీవించటమే మా ఆశయం. శ్వాసించే

ప్రతి వ్యక్తితో సారూప్యం చెంది, వ్యక్తి అస్తిత్వ పరిరక్షణ కోసం, అంత రంగంలో అణగిపడివున్న ఆరాటాన్ని, అసంతోషాన్ని, విసుగును అక్షరాల్లో వ్యక్తీకరించి నూతన విశ్వాసాన్నీ; ఆశనూ కలిగించాలని మా తత్పరత'[1] అంటూ తమ ఆశయాన్ని ప్రకటించిన ఈ కవులు పాత ఋతువుల పేర్లు, సంవత్సరాల పేర్లు కూడా పరిత్యజించి కొత్త పేర్లతో తెలుగు కవితారంగంలో అడుగు పెట్టారు. నగ్నముని (ఎమ్. హెచ్. కేశవరావు), నిఖిలేశ్వర్ (యాదవరెడ్డి), చెరబండరాజు (బద్దం భాస్కరరెడ్డి), మహాస్వప్న (కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు), జ్వాలాముఖి (వీర రాఘవాచార్యులు), భైరవయ్య (మన్‌మోహన్ సహాయ్) అనే ఈ ఆరుగురు యువ రచయితలు దిగంబర కవులుగా 1968 వరకు అంటే దాదాపు మూడు ఏండ్లపాటు మూడు కవితా సంపుటాలను వెలువరించి తెలుగు సాహితీ లోకానికి 'షాక్ ట్రీట్‌మెంట్' ఇచ్చారు.

'ఇది దిగంబర శకం మేము దిగంబర కవులం. మాది దిగంబర కవిత. ఇది సాహిత్యంలో దిగంబర కవితోద్యమం. కవితా స్వరూపాన్ని బట్టి, స్వభావాన్ని బట్టి మేము రాస్తున్నదాన్ని వచన కవిత అని మేము అనదలుచుకో లేదు - అననివ్వదలుచుకోలేదు. 'వచన కవిత' అనే పదం మాకు నచ్చదు'[2] అని ప్రకటించిన ఈ కవులు తమ కవితలను 'దిక్‌లు' అని వ్యవహరించారు. 'సిగ్గులేని తెలుగువాడు', 'ఆంధ్రుడు రోజురోజుకీ మరింతగా నపుంసకుడై పోవ టానికి ముఖ్య కారకులు' అను శీర్షికల క్రింద 'నేటి కుష్టు వ్యవస్థపై దిగంబర కవుల కవితా సంపుటి 3' అనే సంపుటి (జూన్ 1968) లో ఈ మొత్తం వ్యవ స్థను కుష్టు వ్యవస్థగా వర్ణించి, యావత్ సంస్కృతిని 'దుర్గంధ సంస్కృతి'గా వర్ణించి తమ ఆగ్రహాన్ని ప్రకటించింది.

## దిగంబర కవులపై ఎదురు దాడి

తెలుగు కవితా రంగంలో సంచలనాన్ని దిగంబర కవులు సృష్టించి నప్పటికీ రాజకీయ సిద్ధాంత అస్పష్టత, సాహిత్య గందరగోళంపై ప్రీతి, సకల సామాజిక శక్తులపై అసహనం, సంస్కృతిపై ఆగ్రహం వంటి కారణాల మూలంగా దిగంబర కవులు తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టబోయిన ధోరణు లను 1968 లోనే 'సంవేదన' (త్రైమాస పత్రిక) ద్వారా ఎదుర్కొన్న సాహిత్య విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి. తెలుగు సాహిత్య రంగమంతా దిగంబర కవుల ధాటికి బిమ్మెర పోయినప్పుడు, వారిపై బలమైన ఎదురుదాడి చేసిన విమర్శకుడు రాచమల్లు రామచంద్రారెడ్డి.

---

1. దిగంబర కవులు (మొదటి సంకలనం).
2. దిగంబర కవులు (మూడు కవితా సంకలనాల ఏకైక సంపుటి) - ఎమ్. శేషాచలం & కం., మద్రాసు.

1965-68 మధ్యకాలంలో మొత్తం తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేసిన దిగంబర కవితావేశం ఆ తరువాత చల్లారిపోయింది. ఈ దిగంబర కవులలో కొందరు 1970లో ఏర్పడిన 'విప్లవ రచయితల సంఘం'లో విలీనంకాగా కొందరు కొంతకాలం 'విరసం'లో వుండి బయిటికి రాగా, ఇంకా కొందరు వ్యక్తులుగా మిగిలిపోయారు.

## వచన కవిత

వచన కవిత 1935 ప్రాంతాల్లోనే ఉద్భవించినా దాన్ని ఒక ఉద్యమంగా భావించిన వారు నయాగరా కవులు. అందులో విశిష్టమైన స్థానాన్ని అలంకరించిన కవి కుందుర్తి ఆంజనేయులు. ఆయనతో పాటు శ్రీయుతులు సోమసుందర్, ఆరుద్ర, అనిశెట్టి, గంగినేని, కె. వి రమణారెడ్డి మొదలైనవారు వచన కవితా వికాసానికి తమ రచనల ద్వారా దోహదం చేశారు వచన కవితకు లక్ష్యప్రాయాలైన కవితా సంపుటాలను వెలువరించారు. ఆధునిక తెలుగు కవిత్వంలో ఒక ప్రధానమైన ధోరణిగా వచనకవితను నిలిపి జీవితాంతం కేవలం వచన కవిత్వమే రాసి, వచన కవితాపితామహుడిగా నిలిచినవాడు కుందుర్తి ఆంజనేయులు. శుద్ధ వచన కవితా రూపంలో తెలంగాణా పోరాటాన్ని అనితరసాధ్యంగా చిత్రించిన కవి కుందుర్తి. 1959 ప్రాంతాల్లో వెలువడిన గోపాలచక్రవర్తి గారి 'కలం-కలలు' పుస్తకానికి రాసిన పీఠికలోనే- 'వచన కవిత ఒక ఉద్యమం' అని ప్రకటించారు 1960 నుండి 1982 లో ఆయన తుది శ్వాస విడిచేదాకా అనేక వ్యాసాల ద్వారా కవితా సంపుటాలకు ఆయన రాసిన పీఠికల ద్వారా వచనకవితా తత్వాన్ని, దాని లక్ష్యాలను, దాని సర్వతోముఖ వికాసాన్ని చాటిచెప్పారు. 1936 లో కుందుర్తిగారు నెలకొల్పిన 'ఫ్రీవర్స్ ఫ్రంట్' వచన కవితా వికాసానికి అనేక విధాలుగా కృషి చేస్తున్నది. ఈ సంస్థ ద్వారా కొందరు యువ రచయితల కవితా సంపుటులు వెలుగు చూసాయి 1967 నుండి ఈనాటి వరకు ప్రతి యేడు ఉత్తమ వచన కవితా సంపుటికి ఈ సంస్థ ప్రకటిస్తున్న బహుమతులు యువ వచన కవులకు ప్రోత్సాహ పారిజాతాలు.

1960 నుండి ఈనాటి దాకా వందలాది వచన కవితా సంపుటులు, సంకలనాలు వెలువడ్డాయి. సామాజిక చైతన్య వికాసానికి తమ వంతు బాధ్యత నిర్వహించాయి. వాటన్నింటినీ సవివరంగా వివరించడం ఈ వ్యాస పరిధికి మించిన పని. కావున ఈ క్లుప్త పరిచయం.

## విప్లవ సాహిత్యోద్యమం

**రాజకీయ నేపథ్యం :** 1964 లో భారత కమ్యూనిస్టుపార్టీ నుండి విడిపోయిన ఒక వర్గం 'భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు)'గా అవతరించింది.

ఈ పార్టీలోని అతివాదులు చైనా రైతాంగ పోరాటాన్ని ఆదర్శంగా తీసుకుని, సాయుధ పోరాటంద్వారా మనదేశంలో రాజ్యాధికారాన్ని సంపాదించాలనే నినాదంతో మరో చీలికను సృష్టించి 1969 లో 'భారత కమ్యూనిస్టు (మార్క్సిస్టు-లెనినిస్టు) పార్టీ'ని స్థాపించుకున్నారు 1967లో పశ్చిమ బెంగాల్‌లో సి.పి యం. భాగస్వామ్యంతో ఐక్య సంఘటన ప్రభుత్వం ఏర్పడిన తర్వాత చారు మజుందార్, కానూ సన్యాల్‌ల నాయకత్వంలో ఆ రాష్ట్రంలోని 'నక్సల్‌బరీ' ప్రాంతంలో సాయుధ తిరుగుబాటు జరిగింది ఈ ఉద్యమమే క్రమంగా నక్సలైట్ ఉద్యమంగా పేరుకెక్కి దేశంలోని వివిధ ప్రాంతాలకు విస్తరించింది.[1]

'తుపాకి గొట్టంద్వారా రాజ్యాధికారం' అన్న మావో సూక్తిని ఆదర్శంగా తీసుకొని భారతదేశంలో సాయుధ పోరాటం ద్వారా ప్రభుత్వాన్ని పడగొట్టి విప్లవ ప్రభుత్వాన్ని స్థాపించాలన్నది నక్సలైట్ల ఆశయం. 'వర్గ శత్రువుల రక్తంలో చేతులు ముంచనివాడు తాను కమ్యూనిస్టునని చెప్పుకోడానికి వీలులేదు' అని చారు మజుందార్ బహిరంగంగా పిలుపు నిచ్చారు.

1960 ప్రాంతం నుండి సాంఘికంగా వెనుకబడివున్న శ్రీకాకుళంలోని గిరిజన ప్రాంతాల్లో ఉపాధ్యాయులుగా పనిచేసిన రామం, ఆదిబొట్ల కైలాసం, వెంపటాపు సత్యనారాయణ వంటివారు గిరిజన సంఘాలను ప్రారంభించారు. భూస్వాముల, షావుకార్ల దోపిడినుండి గిరిజనులను కాపాడి వారిని చైతన్యవంతులను చేయడానికి ఈ ఉపాధ్యాయులు ప్రారంభించిన ప్రయత్నాలు క్రమంగా గిరిజనోద్యమానికి పునాదులు వేశాయి. 1948 - 51 మధ్య కాలంలో కమ్యూనిస్టుపార్టీ నిర్వహించిన సాయుధ రైతాంగ పోరాటం ఈ ఉద్యమానికి సిద్ధాంత నేపథ్యాన్ని చేకూర్చింది. దీనికి తోడు 1968 అక్టోబరులో శ్రీకాకుళం జిల్లాకు చెందిన పంచాద్రి కృష్ణమూర్తి, చౌదరి తేజేశ్వరరావు కలకత్తాలో చారు మజుందార్‌తో జరిపిన సంభాషణల ఫలితంగా సాయుధ పోరాటాన్ని ప్రారంభించే నిర్ణయం తీసుకున్నారు. 1969 లో 'గరుడభద్ర' గ్రామంలో ఈ విప్లవకారుల మొదటి దాడి జరిగింది. ఆ తర్వాత అనేక దాడులతో శ్రీకాకుళ గిరిజనోద్యమం ఆంధ్ర ప్రాంత రాజకీయ చరిత్రలో ఒక కొత్త అధ్యాయాన్ని సృష్టించింది.

## విప్లవ రచయితల సంఘం

శ్రీకాకుళ సాయుధపోరాటం ప్రేరణతో 1970 లో 'విప్లవ రచయితల సంఘం' ఏర్పడింది. దిగంబర కవులనుండి బయటపడిన కొందరు, వరంగల్లు 'తిరగబడు కవులు', తిరుపతి 'విప్లవరచయితల సమితి', అభ్యుదయ రచయితల

1. 'నక్సలైట్ ఉద్యమ పయనం ఏ దిశలో ?'
—డా॥ వి. కృష్ణారావు, ఆంధ్రజ్యోతి (దినపత్రిక) 9-3-1988.

సంఘంలోని 'ఒకరిద్దరు' కలిసి ఏర్పడిన ఈ 'విప్లవ రచయితల సంఘం' (విరసం)లో 1972లో గుంటూరు 'పైగంబర కవులు' కొందరు చేరారు.

1970 ఫిబ్రవరి 1, 2 తేదీల్లో మహాకవి శ్రీశ్రీ షష్టిపూర్తి సందర్భంగా విశాఖపట్టణంలో ఆయనకు ఘన సన్మానం జరిగింది. ఆంధ్రదేశంలో లబ్ధ ప్రతిష్ఠులైన అనేకమంది కవులు, రచయితలు ఆ షష్టిపూర్తి సన్మానోత్సవంలో పాల్గొన్నారు. మూడు తరాల ప్రతినిధులు పాల్గొన్న ఈ ఉత్సవం ఒక గొప్ప సాహిత్యోత్సవంగా సాగింది. శ్రీశ్రీని ప్రశంసిస్తూ సాహితీవేత్తల ఉపన్యాసాలు, కవితాగానాలు సాగుతుండగా; సాహిత్యకారుల మధ్య 'బాంబు' లాగా ఒక కరపత్రం పంచబడింది. 'రచయితలకు విశాఖ విద్యార్థుల సవాల్' అంటూ వెలువడిన ఈ కరపత్రం రచయితలను 'మీరు ప్రజల పక్షమా? పాలకుల పక్షమా? అని సూటిగా ప్రశ్నించింది. సామాజిక సంఘర్షణల్లో, రాజకీయ ఉద్యమాల్లో, ప్రజా పోరాటాల్లో సాహిత్యం తటస్థంగా ఉండదనీ, రచయితలు కేవలం సాక్షీభూతులు కారనీ ఈ సవాలు గుర్తు చేసింది. రాజకీయాలకు రచన అతీతంగా ఉండదనే అంశాన్ని ఈ సవాలు చాలా ముందుకు తీసుకువచ్చింది. రచయితల్నీ, మేధావుల్నీ ఆలోచింపజేసింది.

హైదరాబాద్‌లో 1959 నుండి 'సెవెన్‌స్టార్స్ సిండికేట్' అనే సాంస్కృతిక సంస్థను యువకులు నిర్వహించేవారు. ఈ సంస్థ నడిపిన పత్రిక 'నవత'కు శ్రీశ్రీ గౌరవ సంపాదకుడు. ఈ సంస్థ నిర్వాహకులు తమ 'నవత' గౌరవ సంపాదకులైన శ్రీశ్రీని సన్మానించాలనుకున్నారు. కొంతమంది అభ్యుదయ రచయితలతో చర్చించాక ఆ సన్మాన సభను 'అభ్యుదయ సాహిత్య సదస్సు'గా 1970 జూలై మొదటివారంలో జరపాలని నిర్ణయించారు. శ్రీశ్రీ ఈ సదస్సుకు హాజరై, సంస్థ బహూకరించే వెయ్యినూటపదహార్ల పర్సును స్వీకరించడానికి అంగీకరించారు. శ్రీ కొడవటిగంటి కుటుంబరావు సదస్సు జయప్రదం కావాలని సందేశం పంపారు. శ్రీ కె వి రమణారెడ్డి సదస్సులో పాల్గొనేందుకు హైదరాబాద్ వచ్చారు. సదస్సులో చదవడానికి ఒక వ్యాసాన్ని ముందే పంపించారు. సదస్సు నిర్వాహకుల ఖర్చుతోనే 3-7-1970 నాడు శ్రీ శ్రీ హైదరాబాద్‌కు వచ్చారు.[1] జూలై 3, 1970 సాయంత్రం వరకు అభ్యుదయ రచయితలతో ఉత్సాహపూరితంగానే చర్చించిన శ్రీశ్రీని ఆనాటిరాత్రి 'ఇంపీరియల్ హోటల్'లో కొందరు దిగంబర కవులు, ఇతర సాహితీవేత్తలు కలిసి, సుదీర్ఘమైన చర్చలు జరిపారు. ఫలితంగా సదస్సుకు హాజరు కారాదని శ్రీశ్రీ నిర్ణయించుకున్నారు.

1. 'అభ్యుదయ రచయితల పునర్నిర్మాణ కార్యకలాపాల నివేదిక' (వ్యాసం) —గజ్జెల మల్లారెడ్డి; 'అభ్యుదయ' (యాభై ఏళ్ళ పత్రాలు)

అప్పటికే దిగంబరకవులు, తిరుగబడు కవులు, రావిశాస్త్రి, కాశీపట్నం రామారావు ఈ సదస్సును బహిష్కరించే నిర్ణయం తీసుకున్నారు. వీరందరి కలయికగా 4 జూలై 1970 నాడు 'విప్లవ రచయితల సంఘం' ఆవిర్భవించింది. ఈ సంఘానికి శ్రీశ్రీ అధ్యక్షుడైనాడు.

శ్రీశ్రీ తదితరులు హాజరు కాకపోయినా, అనేకమంది అభ్యుదయ కవులతో 'అభ్యుదయ సాహిత్య సదస్సు' జరిగింది. ఆ సదస్సును బహిష్కరించాలంటూ 'విప్లవ సాహిత్యాభిలాషులు' కరపత్రం పంచిపెట్టారు.

విరసం పుట్టి వారం తిరక్కుండానే శ్రీకాకుళం గిరిజన నాయకుడు వెంపటాపు సత్యంని 10 జులై 1970 నాడు పోలీసులు కాల్చిచంపారు.

'సాయుధ విప్లవ బీభత్సాని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తాను
మంటల చేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపాన చేయిస్తాను'

అంటూ శ్రీశ్రీ విరసం అధ్యక్షునిగా తన దీక్షను ప్రకటించారు.

1970 అక్టోబర్‌లో 'విరసం' ప్రథమ మహాసభలు ఖమ్మంలో జరిగాయి. శ్రీశ్రీ, కొడవటిగంటి, రావిశాస్త్రి, కాశీపట్నం వంటి ప్రముఖులతో సహా రచయితలంతా ఊరేగింపులో పాల్గొన్నారు. కేవలం సంస్కరణ వాదానికి కాలం చెల్లిపోయిందంటూ ఈ మహా సభల్లో 13 అంశాలతో కూడిన ప్రణాళికను ప్రతినిధులు చర్చించారు. 'సాహిత్యం ఒక ఆయుధం. సమగ్రమైన మానవ స్వాతంత్ర్యం వైపే విప్లవ సాహిత్యం జరిపే మహాప్రస్థానం తమ పోరాట మార్గం'గా నిర్దేశించుకున్నారు. 'విశ్వ మానవతావాదాన్ని మార్క్సిజం-లెనినిజం క్రాంతిమార్గంలో ఎలుగెత్తి చాటడం' తమ ప్రధాన ఆశయంగానూ, దాంతోబాటు మరో పది ఆశయాలను విప్లవ రచయితలు ప్రకటించారు.

ఈ మొదటి మహాసభల్లో 'ఝంఝ' కవితా సంకలనం వెలువడింది. ప్రభుత్వం దానిని నిషేధించింది. అక్టోబర్ 1971 లో జరిగిన 'విరసం' రెండో మహాసభనాటికి 'ఇప్పుడు వీస్తున్న గాలి' (కథాసంకలనం), 'లే', 'విప్లవం వర్ధిల్లాలి' కవితాసంకనాలు కూడా నిషేధించబడ్డాయి. 'మార్చ్' (కవితా సంకలనం) ప్రచురణ కర్త పెండ్యాల కిషన్‌రావును (మార్చి, 1971) పోలీసులు అరెస్ట్ చేశారు. 2 ఆగష్టు 1971 నాడు జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, చెరబండరాజులను పోలీసులు అరెస్టుచేసి, రెండునెళ్ళపాటు జైళ్ళో పెట్టారు.

ఆ తరువాత సికింద్రాబాద్ కుట్రకేసు (మే 1974)లో రాజకీయ కార్యకర్తలతోపాటు కె.వి. రమణారెడ్డి, వరవరరావు, త్రిపురనేని మధుసూదనరావు, చెరబండరాజు మొ॥వారిని కూడా ఇరికించారు.

విరసం కార్యవర్గసభ్యుడు పరిటాల శ్రీరాములుని జూన్ 2, 1975 నాడు అనంతపురంలో భూస్వాములు కాల్చి చంపారు. వరంగల్‌లో జ్ఞానేశ్వర్ కీర్తిని సంఘ విద్రోహ శక్తులు మంటల్లో కాల్చి చంపారు. 1975 నాటి ఎమర్జెన్సీ కాలంలో విరసం సభ్యులు దాదాపు 40 మంది జైళ్ళ పాలయ్యారు. అక్కడ సంక్రమించిన 'బ్రెయిన్ ట్యూమర్' వ్యాధితోనే 'చెరబండరాజు' 2-7-1982 నాడు కన్ను మూశాడు. విరసం సభ్యుల్లో, మిగతావారికన్నా ఎక్కువ కాలం జైళ్ళలో గడిపినవారు వరవరరావు.

ఇన్ని నిర్బంధాల మధ్య, ప్రభుత్వ దమనకాండ మధ్యకూడా 'విప్లవ రచయితల సంఘం' యువకుల్ని ఆకర్షించగలిగింది. యువ సాహితీవేత్తలపై ఒక దశాబ్ద కాలంపాటు (1970-80) ప్రగాఢమైన ముద్రను వేయగలిగింది.

## విప్లవ సాహిత్యం

1970 లో విప్లవ రచయితల సంఘం ఏర్పడడానికి ముందు నుండే 'విప్లవ సాహిత్యోద్యమం' ప్రారంభమయింది. దీనికి 'విరసం' ఒక కొత్త ఒరవడి దిద్ది తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేసింది.

1968 అక్టోబర్ నుండే విప్లవ గీతాలను గానం చేసిన ప్రజాకవి సుబ్బారావు పాణిగ్రాహి.

ఆధునిక లిఖిత కవిత్వం ఒక వైపు 'వచన కవితా ఉధృతి'లో కొట్టుకుపోతూ ఉంటే, 1968-69 సంవత్సరాల్లో తెలంగాణా సాయుధ పోరాట కవుల వారసుడిగా, శ్రీకాకుళం సాయుధ పోరాట సైనికుడిగా, పెన్నూ, గన్నూ పట్టి ప్రజా గీతాలను గానం చేసిన విప్లవ కవి పాణిగ్రాహి.

1968 అక్టోబర్ 31 నాడు 'ఏజెన్సీ రైతు మహాసభ' కోసం పల్లెసీమల నుండి కదలి తరంగాలుగా వస్తున్న గిరిజనుల్ని చూసి బెదిరిపోయిన భూస్వాములు దారి కాచి, దాడి చేశారు. ఇద్దరు గిరిజనుల్ని పొట్టన పెట్టుకున్నారు. ఈ ఉదంతంతో గుండె ద్రవించిన పాణిగ్రాహి 'అక్టోబర్ 31'(గీతం)రాశాడు. శ్రీకాకుళంలోని 'సోంపేట'ను తన ఉద్యమ స్థావరంగా నిర్ణయించుకుని, అక్కడి జనం మధ్య బతికాడు. జనం బతుకులు చూశాడు 'యువజన సంఘం' పెట్టాడు. తనూ అక్కడి ప్రజలతో కలిసి మట్టిమోసి, గోడలు గట్టి పాఠశాల భవనం నిర్మించాడు. పగలంతా రెక్కలు ముక్కలు చేసుకుని కష్టపడే పేద ప్రజలకు రాత్రిపూట 'తిరుగుబాటు' పాఠాలు చెప్పాడు. పాటలు కట్టాడు. ప్రజలకు వినిపించాడు.

ప్రజలు వాటిని సొంతం చేసుకుని పాడుతూ ఉంటే, నూతనో త్తేజంతో 'అగ్ని కణాలు' గీతాలు అల్లాడు. రాజకీయమే తన జీవితంగా, జీవితమే రాజకీయంగా బతుకుతున్న ఈ ప్రజాకవిని 1969 డిసెంబర్ 20 నాడు సింగారి కొండల్లో పోలీసులు అరెస్టు చేశారు. డిసెంబర్ 22 న ఒరిస్సా - ఆంధ్ర ప్రాంతాలనడుమ ఉన్న 'రంగమెటియా' కొండల్లో పోలీసులు దారుణంగా అతన్ని కాల్చిచంపారు. 'మమ్మల్ని కాల్చడం ద్వారా మరింత మంది విప్లవకారులు ప్రజల నుండి ఉద్భవిస్తారు' అని నినదిస్తూ ఆ వీరుడు నేలకొరిగాడు.

తెలంగాణా సాయుధపోరాటం, 'అభ్యుదయ' పత్రిక కలిగించిన ప్రేరణతో, నైజాం నవాబును గురించి 'కరకు కత్తులనీడ సిరిసంపదలతోడ' అంటూ ప్రారంభించి గీతాలు రాసుకున్న కె. జి. సత్యమూర్తి గుంటూరులో చదువుకుంటున్నప్పుడు 'విద్యార్థి ఫెడరేషన్' లో పనిచేశారు. శ్రీశ్రీని చూశారు. ఆయన్ని విన్నారు. 'కవితా! ఓ కవితా!' శ్రీశ్రీ చదవడాన్ని ప్రత్యక్షంగా విని ప్రభావితులయ్యారు. 1952 ఎన్నికల్లో ఎన్నికల పాటలు రాశారు. 1960-62 సం॥ల మధ్యకాలంలో కె. జి. సత్యమూర్తి, శ్రీయుతులు ఏటుకూరి ప్రసాద్, వాసిరెడ్డి సత్యనారాయణ, జి. వి. నారాయణరావులతో కలిసి 'యువజన' (విద్యార్థి యువజన మాస పత్రిక) సంపాదకవర్గ బాధ్యతలు నిర్వహించారు. 1967-68 నాటి 'నక్సల్బరీ' రైతాంగ తిరుగుబాటుతో ప్రేరేపితులై 'ప్రజలను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేడు కవి' అని నిర్వచించారు. నక్సల్‌బరీ నుండి శ్రీకాకుళం వరకు వ్యాపిస్తున్న సాయుధ పోరాట ప్రభంజనానికి నివాళులర్పిస్తూ 'తూర్పు పవనం వీచెనోయ్' గీతం రాశారు. విప్లవ నాయకుడు చాగంటి భాస్కర్‌రావు మరణవార్తవిని 'నరుడో! భాస్కరుడా!' గీతం రాశారు. ఖమ్మంలో జరిగిన (1970నాటి) విరసం మహాసభల నాటికే 'శివసాగర్' పేరుతో సత్యమూర్తి రాసిన ఈ గీతాన్ని శ్రీశ్రీ పాడుకుంటూ, ఆనాటి సభాస్థలికి చేరడంతో విప్లవ కవిత్వానికే ఈ గీతం ఒరవడి పెట్టిందని చెప్పవచ్చు.

ఇలా విరసం ఏర్పడేనాటికే సుబ్బారావు పాణిగ్రహి, శివసాగర్ (సత్యమూర్తి) ప్రారంభించిన విప్లవ గీతాలాపన విరసం, జననాట్యమండలి (1978) ఏర్పడింతర్వాత చెరబండరాజు, గద్దర్, వంగపండు ప్రసాద్, జి. అంజయ్య మొదలయిన అనేకమంది విప్లవ కవుల్ని ప్రభావితం చేసింది. బలమైన విప్లవ గీతాలను పలికించింది.

'వచన కవిత్వం' ద్వారా మధ్యతరగతి ప్రజలకు పరిమితం కాబోతున్న ప్రజాకవిత్వాన్ని 'గీతికా కవిత్వం' ద్వారా ఉద్యమాలకు ఊపిరులూదింది విప్లవ సాహిత్యం.

## విరసంలో చీలికలు

తెలంగాణా సాయుధ పోరాటకాలంనాటి పరిస్థితులు వేరు, శ్రీకాకుళం రైతాంగ పోరాటం నాటి పరిస్థితులు వేరు. 'తుపాకి గొట్టం ద్వారా రాజ్యాధికారం' అన్న ఉద్రేకాత్మక నినాదం తొలిదశలో కవుల్ని, రచయితల్ని, మేధావుల్ని, విద్యార్థుల్ని ప్రభావితం చేసిన మాట నిజమే అనేకమంది విద్యావేత్తలు ఆత్మహత్యా సదృశమైన ఆత్మార్పణలు కావించిన మాటకూడా నిజమే. కాని రాను రానూ విప్లవకారుల మధ్య సిద్ధాంతవిభేదాలు తలెత్తడం మొదలయింది. 28 రాష్ట్రాలుగల విశాల భారతవనిలో, ఒకానొక రాష్ట్రంలో 28 జిల్లాలుంటే; వాటిలో ఒకటి రెండు జిల్లాల్లో ఉన్న మూడో, నాలుగో పల్లెటూళ్ళలో 'వర్గ శత్రు నిర్మూలన' చేయగానే విప్లవం జయిస్తుందా? 'రాజ్యాధికారం సిద్ధిస్తుందా? 'గ్రామాలు విముక్తమయి పోతాయా?' 'గ్రామాలు విముక్తమవుతుంటే వర్గశత్రువు చూస్తూ ఊరుకుంటాడా?' మొదలైన ప్రశ్నలు, చర్చలు, సిద్ధాంత - రాద్ధాంతాలు ప్రారంభమయ్యాయి. 'సాయుధ పోరాటమే ఏకైకమార్గం' అయినప్పటికీ, మన సమాజంలో సాయుధపోరాటానికి కావాలసిన భౌతిక పరిస్థితులు (Objective conditions) ఉన్నాయా? వాటికి ప్రతిస్పందించగలిగే ప్రజల సంసిద్ధత (Subjective preparedness) స్థాయి ఏమిటి? ఈ రెండింటినీ సమన్వయం చేసి, పోరాటాన్ని నడపగలిగే విప్లవకర పార్టీ (Revolutionary party) ఏది? - అనే అంశాల మీద చర్చలు ప్రారంభమయ్యాయి. వీటి ఫలితంగా సి.పి.ఐ. (ఎం.ఎల్) నుండి కొందరు విప్లవకారులు చీలిపోయారు.

'సి.పి.ఐ. (ఎం.ఎల్) నుండి 'వర్గ శత్రు నిర్మూలనా కార్యక్రమాన్ని' ఖండిస్తూ బయటికొచ్చినవారు సమైక్యమై, 1975 లో UCCRI (ML) [భారత కమ్యూనిస్టు విప్లవకారుల ఐక్యతా కేంద్రం (మార్క్సిస్టు - లెనినిస్టు) అనే పార్టీని ఏర్పరిచారు. ఆ ఐక్యతా కేంద్రం అతికొద్దికాలంలోనే చీలికల కేంద్రమై, UCCRI లో ఐదక్షరాలుంటే, అది ఐదు కేంద్రాలుగా చీలిపోయింది.1

ఇవ్వాళ సరిగ్గా ఎన్ని విప్లవకారుల వర్గాలున్నాయో, ఎన్ని ఉపవర్గాలున్నాయో? ఇందులో ఏ వర్గం ద్వారా విప్లవం నడుస్తున్నదో ప్రత్యేకంగా పరిశోధన చేయాల్సిన అంశం.

ఇలా రాజకీయ సిద్ధాంతాల్లో, కార్యాచరణలో వచ్చిన చీలికల ప్రభావం 1975 నుండి 'విప్లవ రచయితల సంఘం'పై పడుతూ ఉంది. అనంతపురం (జనవరి,

---

1. ఎజెండాని ప్రక్కదారి పట్టించి ఎర్రజెండాని ముందుకు తీసుకెళ్ళగలరా?
   - ఉ. సాంబశివరావు, హైదరాబాద్. (పుట : 81)

1975)లో జరిగిన 'విరసం' మహాసభలో జ్వాలాముఖి ఎం.వి. రమణారెడ్డి తదితరులు విరసం నుండి బయటపడ్డారు. రంగనాయకమ్మగారి నేతృత్వంలో ఒక యువకబృందం 'ప్రజాసాహితి' సంస్థను ఏర్పాటు చేసింది. 1985 అక్టోబర్‌లో 'విరసం' నుండి విముక్తమైన మరో రచయితల బృందం 'ప్రజా రచయితల సమాఖ్య'ను ఏర్పాటు చేసింది. 'జనసాహితి' అనే మరో విప్లవకారుల సాహిత్య సంస్థ కూడా తన సొంత కార్యక్రమాలు కొనసాగిస్తోంది.

ఏదేమైనా దాదాపు ఒక దశాబ్దానికి పైగా తెలుగు సాహిత్య రంగంపై బలమైన ప్రభావాన్ని వేసిన 'విప్లవ రచయితల సంఘం' కార్యక్రమాలు క్రమంగా సన్నగిల్లినప్పటికీ, విప్లవ సాహిత్యం మాత్రం నిరంతరాయంగా వెలువడుతూనే ఉంది. వామపక్ష ఉద్యమ భావాలతో ప్రజల మెదళ్ళను పదును పెడుతూనే ఉంది.

## అభ్యుదయ సాహిత్య పునర్వికాసం

ఒకవైపు విప్లవ సాహిత్యం తెలుగు సాంస్కృతిక రంగంలో విజృంభిస్తూ ఉంటే, మరోవైపు 1970 నుండి అభ్యుదయ సాహిత్యం పునరుద్ధరణ ప్రారంభించింది.

ప్రజా కవులు సుంకర, కోగంటి, తెన్నేటి సూరి, సుద్దాల హన్మంతు, తిరునగరి రామాంజనేయులు, మురారి, మొ॥వారు నిరంతరాయంగా అభ్యుదయ గీతాలను వ్రాస్తూ, వామపక్ష ఉద్యమాల వ్యాప్తికి దోహదం చేస్తున్నప్పటికీ, 1970 నుండి ప్రారంభమై 1973 నాటికి ఒక రూపాన్ని సంతరించుకున్న 'అభ్యుదయ రచయితల సంఘం పునర్నిర్మాణం'తో ఒక కొత్తగాలి వామపక్ష సాహిత్యంలో వీయడం ప్రారంభమయింది. కొత్త నెత్తురునూ, జవాన్నీ, జీవాన్నీ నింపుకున్న 'అభ్యుదయ రచయితల సంఘం' (అరసం) 1973 నుండి ఈనాటి దాకా చీలికల స్వభావాన్ని వొదిలి, సమైక్యమౌతూ, యువతరాన్ని ప్రభావితం చేస్తూ 'వామపక్ష ఉద్యమ సాహిత్య వికాసానికి' ఊపిరులూదుతూ ఉంది.

## అరసం పునర్నిర్మాణం

ఒకవైపు 'విప్లవ రచయితల సంఘం' (విరసం) తన కార్యక్రమాలను విస్తరిస్తూ ఉంటే, మరోవైపు 'అభ్యుదయ రచయితల సంఘాన్ని' పునర్నిర్మించే ప్రయత్నాలు అభ్యుదయ రచయితలు ప్రారంభించారు. 1969లో ఇటు తెలంగాణా ప్రాంతంలోనూ, 1971 లో అటు ఆంధ్ర ప్రాంతంలోనూ చెలరేగిన వేర్పాటు వాద ఆందోళనలకు వ్యతిరేకంగా అభ్యుదయ రచయితలు 'సమైక్యతావాణి'ని వినిపించారు. 1970 - 71 లో పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధంలో 'దేశభక్తి'ని

నినదించారు. 'బంగ్లా విముక్తి పోరాటానికి' నివాళులర్పించారు. 1971 - 72 సం॥ల్లో అనేక జిల్లాల్లో యువరచయితల గోష్ఠుల ద్వారా రచయితల్ని సమీకరించారు. మారిన పరిస్థితులకు అనుకూలంగా రూపొందించుకున్న 'ప్రణాళిక'ను జిల్లా శాఖలన్నీ కూలంకషంగా చర్చించాయి 1972లో హైదరాబాదులో జరిగిన 'నగర అరసం మహాసభ' వామపక్ష ప్రజాతంత్ర శక్తుల ఐక్యతకు పిలుపునిచ్చింది. 1973 ఆగష్టు 10, 11, 12 తేదీల్లో 'ఆంధ్రరాష్ట్ర అరసం' పునర్నిర్మాణ మహాసభను జరుపుకుని 'ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం' అవతరించింది. రాష్ట్రం నలుమూలల్నుండి అనేకమంది అభ్యుదయ రచయితలు పాల్గొన్న ఈ మహాసభలు సుదీర్ఘ చర్చల తరువాత నూతన ప్రణాళికను ఆమోదించాయి.

'ప్రజల కార్యాచరణ నుంచి, వారి జీవిత వాస్తవాల నుంచి సాహిత్య రచనకు ప్రేరణను, ప్రోత్సాహాన్ని అరసం సంతరించుకుంటుంది. వాస్తవికత-సౌందర్యాత్మకత - తాత్వికతల సముచిత సమాహారాన్ని అభ్యుదయరచనగా భావిస్తుంది. వస్తు-రీతి సమైక్యతను సాధించే సాహిత్య వ్యాసంగం చేస్తుంది. శ్రామిక జన పక్షపాతం వహించి, వారికి ఉత్తేజం కలిగించగల సాహిత్య కళారూపాలను, భాషను, భావాలను తన రచనకు ప్రధాన సాధనాలుగా ఎన్నుకుంటుంది. సవిమర్శక వాస్తవికతను స్వీకరించి; కందుకూరి, గురజాడల వారసత్వాన్ని అరసం స్వీకరిస్తుంది. మానవజాతి పరిణతికి పరిపూర్తిని కల్పించే ప్రజాతంత్ర, సోషలిస్టు విప్లవాలకు అవసరమైన చైతన్యాన్ని సృష్టించేందుకు అభ్యుదయ రచయితలు తమ కలాలను, గళాలను అంకితం చేస్తారు. సోషలిస్టు వాస్తవికతను సంఘం తన పరమ లక్ష్యంగా ఎన్నుకుంటుంది'[1] వంటి మార్గదర్శక సూత్రాలతో రూపొందించుకున్న ప్రణాళిక కల్పించిన సైద్ధాంతిక స్పష్టతతో అభ్యుదయ రచయితల సంఘం హైదరాబాద్‌లో జరిగిన రాష్ట్ర మహాసభల (14, 15 ఫిబ్రవరి 1976) నాటికి 11 జిల్లాశాఖలను, కొన్ని పట్టణశాఖలను ఏర్పాటు చేసుకుని, సుమారు 300 మందితో పురోగమించడం మొదలుపెట్టింది.

కొంతకాలం అరసానికి దూరమైన చాసో, ఆరుద్ర, అనిసెట్టి, సోమసుందర్, కుందుర్తి మొదలైనవారు 'ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం' పేరుతో ఒకటి, రెండు సభల్ని జరిపారు. అయితే 1978 డిసెంబర్ 24, 25 తేదీల్లో కాకినాడలో జరిగిన అరసం 8వ రాష్ట్ర మహాసభల నాటికి కేవలం ఆరుద్ర, అనిసెట్టి మినహా మిగతా అభ్యుదయ రచయితలంతా 'అం.ప్ర. అరసం'లో విలీనమయ్యారు.

1. 'అరసం' ప్రణాళిక, 'అభ్యుదయ' (యాభై ఏళ్ళ పత్రాలు).

1980-82 మధ్యకాలంలో ఖమ్మంలో 'నవల' మీద, విశాఖపట్నంలో 'వాడుక భాష' మీద, కడపలో 'సాహిత్య విమర్శ' మీద అరసం సదస్సులు నిర్వహించింది. అన్ని విశ్వ విద్యాలయాల పరిధుల్లో ఉన్న సాహితీవేత్తలు, రచయితలు, విమర్శకులు వీటిలో పాల్గొన్నారు, ఆ సదస్సుల్లో చర్చించిన వ్యాసాలను 'అభ్యుదయ' విశేష సంచికలుగా అరసం ప్రచురించింది. ఈ సంచికలకు సాహిత్య లోకంలో మంచి ఆదరణ లభించింది 1981లో హైదరాబాద్‌లో 'సాహితీ సంస్కృతుల పరిరక్షణా సదస్సు'ను, 1982లో 'ఆధునిక కవిత్వం తీరు తెన్నులు'మీద సదస్సును అరసం నిర్వహించింది. ఆర్థికపరమైన ఆటుపోట్లనెదుర్కొంటూనే 'అభ్యుదయ'ను నిర్వహిస్తుంది 1983లో శ్రీశ్రీ మరణానంతరం 'శ్రీశ్రీ స్మారక సంస్థ'ను ఏర్పాటుచేసి, అరసం సంయుక్తంగా 'సాహిత్యాభ్యుదయం' (వ్యాస సంపుటి) 'మాచిరాజు దేవీప్రసాద్ పారడీలు', 'సాహిత్యం-వాస్తవికత' (వ్యాసాలు), 'కొండపెల్లి జనార్దనరావు జీవితం-సాహిత్యం' వంటి అరుదైన పుస్తకాలను వెలువరించింది. 1988 అక్టోబర్‌లో భీమవరంలో జరిగిన అరసం 10వ మహాసభలు యువ అభ్యుదయ రచయితలకు నూతన ఉత్సాహాన్ని, ఉత్తేజాన్ని ఇవ్వడమేకాక, మూడు తరాల రచయితలకు ప్రాతినిధ్యం కల్పించాయి.

1973 నుండి ఈనాటి వరకూ కొన్ని వందల కవితా, కథా, వ్యాస సంపుటాలను, సంకలనాలను 'అరసం' వెలువరించింది తెలుగు నేలపై తలెత్తుతున్న ప్రతి ఉద్యమంలోనూ తన ప్రతిస్పందనల్ని కనబరుస్తుంది.

## సాంస్కృతికోద్యమం

ఈ శతాబ్దం మూడవ దశాబ్దంలో ప్రపంచ వ్యాపితంగా అలుముకున్న ఆర్థిక సంక్షోభం, దేశంలో స్వాతంత్ర్యోద్యమ వ్యాప్తి, బెంగాల్ కరువు, కమ్యూనిస్టు ఉద్యమ విజృంభణ వంటి అంశాల నేపథ్యంలో 'అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం' ఏర్పడింది. ఈ విషయాన్ని ఇదివరకే చర్చించాం. రచయితలు, కళాకారులు ఒకే నాణానికి బొమ్మ, బొరుసు వంటివారు. కొందరు రచయితలు కళాకారులుగానూ, కళాకారులు రచయితలుగానూ ద్విముఖపాత్రను వహించడం కూడా చరిత్రలో కనబడుతుంది. అభ్యుదయ సాహిత్యోద్యమ ఆవిర్భావానికి దారితీసిన పరిస్థితుల్లోనే ప్రజా సాంస్కృతికోద్యమం ప్రాణం పోసుకుంది.

'కళ కళకోసమే' నన్న శుద్ధకళావాదాన్ని ఖండిస్తూ, కళ ప్రజలకోసం, ప్రజల ప్రయోజనాలను కాపాడుతూ, వారిని చైతన్యపరచడంకోసం - అనే నూతన దృక్పథంతో ఈ ఉద్యమం ప్రారంభమయింది.

'కళ ప్రజలది. ప్రజల జీవితపు లోతుల్లోనికి దాని వేళ్ళు విస్తరింప జేయాలి. ప్రజల మనోభావాలకు, ఆకాంక్షలకు సమన్వయాన్ని సాధించి, సమైక్యపరిచి, వారిని సముద్ధరించాలి' అంటాడు లెనిన్.

ఈ వెలుగులో దేశంలోని అనేక ప్రాంతాల ప్రజాకళాకారులు కొత్త కళారూపాలను సృష్టించి, సాంస్కృతిక రంగంలో నూతన పరిణామాలను తెచ్చే ప్రయత్నాలు 1942 - 43 మధ్యకాలం నుండి ప్రారంభించారు.

## ఎర్రజెండా మేళ

1943 మే 23 నుండి జూన్ 1 వరకు బొంబాయిలో భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ జరిగింది. ఈ సందర్భంగా బొంబాయిలో 'జాతీయ సాంస్కృతికోత్సవం' జరిగింది. దీనినే 'ఎర్రజెండా మేళా'గా పత్రికలు అభివర్ణించాయి. పార్టీ మహాసభకు హాజరయిన ప్రతినిధులు, సందర్శకులతో బాటు 150 మంది కళాకారులు, నటీనటులు, గాయనీగాయకులు, నాట్యకారులు పాల్గొని, సాంస్కృతిక ప్రదర్శన లిచ్చారు. అక్కడే 'ఇండియన్ పీపుల్స్ థియేటర్ అసోసియేషన్ (ఇప్టా)' ప్రథమ మహాసభ జరిగింది. దీనిని గురించి అప్పటి 'పీపుల్స్ వార్' పత్రిక ప్రచురించిన వార్త గమనించదగింది.

'అభ్యుదయ రచయితల (నాల్గవ) మహాసభ తో బాటు ఇండియన్ పీపుల్స్ థియేటర్ మహాసభ కూడా మే 26న జరిగింది. మన దేశంలో ఇటువంటి మహాసభ జరగడం ఇదే ప్రథమం దేశంలో ప్రస్తుతమున్న ప్రజారంజక రంగస్థల గ్రూపులను సమన్వయ పరచడం, భారతావని నాలుగు చెరుగులా ప్రజా నాట్యమండలి అభివృద్ధికి సహాయ పడడం దీని కర్తవ్యం. ఈ మహాసభ ఆమోదించిన తీర్మానంలో మన ప్రజలు బాహ్యంగా, అంతర్గతంగా ఎదుర్కొంటున్న వినాశాలను ఉల్లేఖిస్తూనే, ఇప్టా ముందున్న కర్తవ్యాలను నిర్దేశించింది.

మన ప్రజల జీవితానికి సంబంధించిన ముఖ్యమైన సత్యాల గూర్చిన మానవతా అంశాల వివరణలను రంగస్థలం, ఇతర సాంప్రదాయక కళల మాధ్యమం ద్వారా సుస్పష్టంగా, చిరస్మరణీయంగా ప్రదర్శించడం; తద్వారా ప్రజల హక్కుల గూర్చి వారిని చైతన్యపరచడం ఇప్టా ముందున్న కర్తవ్యం. దేశ ప్రజల మధ్య ఐక్యతను పెంపొందించడం, ప్రజా వ్యతిరేక శక్తులపై సాహసంతో వజ్ర సంకల్పంతో పోరాడే చైతన్యం కలిగించడం, ప్రపంచ వ్యాపిత ప్రగతి శీల శక్తులతో మమేకమయ్యే స్పృహను పెంపొందించడం ఇప్టా కర్తవ్యం.

ఈ లక్ష్యాల సాధనకుగాను ఇప్టా కళాకారులు పాటలు, బుర్ర కథలు, నాటిక, నాటకాలు వగైరాలలోని వస్తువును మన దృష్టిలో వున్న ప్రయోజనానికి అనుగుణంగా తీర్చిదిద్దడమేకాక, మన ప్రదర్శనలు ఆర్భాటరహితంగా

సూటిగా వుండటం కూడా అవసరం. అలాంటప్పుడే ప్రజలు వాటిని మెచ్చుకుంటారు. అవగాహన చేసుకుంటారు. వాటి తయారీలో, ప్రదర్శనల్లో పాల్గొంటారు. జానపద కళల పునరుద్ధరణ. సామూహిక గానం. ఆరుబయలు రంగస్థలం ఈ ప్రయోజనానికి ప్రత్యేకించి వాంఛనీయం'.[1]

ఈ సందర్భంగా 'ఇప్టా' బెంగాల్, పంజాబ్, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, మలబార్, కర్నాటక, హైదరాబాద్, ఆంధ్ర, తమిళనాడు కమిటీలు ఏర్పడ్డాయి. కేంద్ర కార్యాలయం బొంబాయిలో ఏర్పడింది.

ఈ మహాసభల్లో 'ఇప్టా' కళాకారులు నాలుగు నాటికలు ప్రదర్శించారు. ఫాసిస్టు వ్యతిరేక బెంగాలీ రచయితలు, కళాకారుల బృందం దేశభక్తి గీతాలు పాడింది. వంగ్ పింగ్ రాసిన జపాన్ వ్యతిరేక చైనా నాటికను ఇంగ్లీషు భాషలో ప్రదర్శించారు. కె. ఎ. అబ్బాస్ హిందీలో రాసిన 'అప్రిజాత్', హిందూ-ముస్లిం ఐక్యతపై ఓ నేటర్ రాసిన నాటిక, ఫాసిజానికి వ్యతిరేకంగా రాసిన బెంగాలీ నాటిక ప్రదర్శితమయ్యాయి. ప్రజా నాట్యమండలి పయనించాల్సిన దిశను ప్రదర్శనలు నిర్దేశించాయి.

## ఆంధ్ర వైజ్ఞానిక దళం

ఈ బొంబాయి మహాసభల్లో ఆంధ్ర వైజ్ఞానిక దళం ఆంధ్రజానపద కళారూపాలను ప్రదర్శించి, అందరి ప్రశంసలను పొందింది. అంతేకాక, జాతీయ స్థాయి ప్రదర్శనల్లో ప్రథమ బహుమతిని పొందింది. బొంబాయి ఆంధ్రులు ఈ సందర్భంగా ఆంధ్ర వైజ్ఞానిక దళాన్ని ఘనంగా సన్మానించి, రజత పాత్రలను బహూకరించారు. కోగంటి గోపాలకృష్ణయ్య కోయ వేషంతో అందర్నీ ఆకర్షించారు. బొంబాయి క్రానికల్, పీపుల్స్‌వార్ వంటి పత్రికలన్నీ కోగంటి కోయ వేషాన్ని ప్రముఖంగా చిత్రించాయి.

## ఆంధ్ర ప్రజానాట్యమండలి

1943 జూన్ మాసంలో విజయవాడలో ఒక వైజ్ఞానిక శిక్షణా శిబిరం జరిగింది. కొంతమంది కళాకారులను తయారు చేసింది. ఆ మరుసటి నెలలో విజయవాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మహాసభల్లో కృష్ణా, గుంటూరు జిల్లాల కళాకారులు ప్రదర్శనలిచ్చారు. నాజర్ కోలాట దళం మహా

2. Peoples war, 6 the June 1943, Quoted by IPTA IX National Conference (1956) Hyderabad Souvenir (Page : 32).

సభ ప్రతినిధుల గుండెలను ద్రవింపజేసింది. అక్కడ సమీకృతమైన కళాకారులతో 'ఆంధ్ర ప్రజా నాట్యమండలి' ఏర్పడింది. హిట్లర్ ఫాసిజానికి వ్యతిరేకంగా, ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా పాటలద్వారా, బుర్రకథల ద్వారా ఊరురా విశేషమైన ప్రచారం చేసింది.

వెట్టి చాకిరి, భూస్వాముల దోపిడి, పరాయి పాలకుల అరాచకాలు వంటి వాటిని ఖండిస్తూ; సమసమాజ నిర్మాణం, ప్రపంచశాంతి పరిరక్షణ, జాతీయ స్వాతంత్ర్యం వంటి అంశాలను ప్రచారం చేస్తూ ప్రజా నాట్యమండలి విస్తరించింది. కోయవేషం, బుర్రకథ, జముకుల కథ, పిచ్చగుంటు కథ, హరికథ, చెంచులు, ఫకీర్లు, జంతర్ పెట్టె, సమష్టి గానాలు, వ్యష్టి గానాలు, కోలాటం, డప్పుల కోలాటం, దేవర పెట్టె, సైసై నృత్యం, పంటసిరి నృత్యం, క్వారీ పాటలు, పడవ పాటలు, జేగంట భజన, హరిహరి పదాలు, గొల్లసుద్దులు, శాంతి మూకాభినయం, షాడోప్లే, చక్కాభజన, కనకతప్పెట్లు, నాటకాలు, నాటికలు వంటి కళారూపాలను పునరుద్ధరించి, వీటిద్వారా కొత్త ఇతివృత్తాలను ప్రజల్లో ప్రజా నాట్యమండలి ప్రచారం చేసింది.

సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావులు రచించిన 'మా భూమి', 'ముందడుగు' నాటకాలు డా॥ గరికపాటి రాజారావు దర్శకత్వంలో ప్రజానాట్యమండలి ప్రదర్శనలుగా ఆంధ్ర ప్రాంతమంతటా మారుమ్రోగాయి. సుంకర రచించిన 'అల్లూరి సీతారామరాజు' బుర్రకథ ఊరూరా ప్రజల అభిమానాన్ని పొందింది. ఆ రోజుల్లోనే 'మా భూమి' నాటకాన్ని 150 దళాలు ప్రదర్శించేవి.[1]

తెలంగాణా సాయుధ పోరాటకాలంలో ఆంధ్ర ప్రజానాట్య మండలి రచయితలు, కళాకారులు పోరాటానికి ప్రతిబింబాలైన కళారూపాలను తయారు చేశారు. ఆంధ్రప్రాంతంలో ప్రదర్శించారు. విరాళాలు సేకరించి, పోరాటగడ్డకు పంపారు. తెలంగాణా సరిహద్దు గ్రామాల్లో 'మా భూమి' నాటకాన్ని ప్రదర్శించారు

అఖిల భారత ప్రజానాట్యమండలి (ఇప్టా) జాతీయ మహాసభలు ఏ రాష్ట్రంలో జరిగినా ఆంధ్ర ప్రజానాట్యమండలి కళాకారులు హాజరై, తమ ప్రజా కళారూపాలను ప్రదర్శించారు. ఇతర ప్రాంతాల ప్రదర్శనల కంటే అగ్రశ్రేణిలో నిలిచారు.

---

1. 'ఆంధ్ర దేశంలో ఉజ్వల చరిత్ర కలిగిన ప్రజానాట్యమండలి' (వ్యాసం) —తాపీ రాజమ్మ, విశాలాంధ్ర (దినపత్రిక) 20-11-86.

## ప్రభుత్వ దమనకాండ

1947-48 సం॥ల మధ్య ప్రభుత్వ దమనకాండ ఫలితంగా ప్రజానాట్య మండలి కార్యక్రమాలు కుంటుబడ్డాయి. అనేక మంది కళాకారులను అనాటి ప్రభుత్వం కమ్యూనిస్టులుగా చిత్రించి, చిత్రహింసలు పెట్టింది. కొందర్ని జైళ్ళలో నిర్బంధించింది. కళాకారులు ఎక్కడి వారక్కడ చెల్లాచెదురైనారు. కొందరు మద్రాసుకు వెళ్ళి సినీరంగంలో ప్రవేశించారు. మరికొందరు విజయవాడలోని వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ వైజ్ఞానిక శాఖగా 'ఆంధ్ర ఆర్ట్సు థియేటరు'ను స్థాపించి, ప్రజానాట్య మండలి ఆశయాలను ప్రచారం చేశారు.

ప్రజానాట్య మండలి మీద ప్రభుత్వ ఆంక్షల మూలంగా 1958 లో 'అభ్యుదయ కళాసమితి' ఏర్పడి, వైజ్ఞానిక ప్రదర్శనలిచ్చింది. 1795 ఎన్నికల సందర్భంగా మద్రాసు ప్రజానాట్యమండలి రెండు దళాలుగా ఏర్పడి, అనేక కేంద్రాల్లో ప్రదర్శనలిచ్చింది.

ఆయా సందర్భాలను పురస్కరించుకుని ప్రజానాట్యమండలి కళాకారులు కొన్ని ప్రదర్శనలను రూపొందించినప్పటికీ, ఇదొక సాంస్కృతికోద్యమంగా 1974 నుండి పునరుద్ధరించబడింది.

## ప్రజానాట్యమండలి పునరుద్ధరణ

1972-74 మధ్య కాలంలో రాష్ట్రంలోని అనేక ప్రాంతాల్లో ప్రజానాట్య మండలి పునరుద్ధరణ ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. 1974 అక్టోబర్ 7 నుండి 18 వ తేదీ వరకు విజయవాడలో సాంస్కృతికోత్సవాలు జరిగాయి. పాత - కొత్త కళాకారుల మేలుకలయికగా 'ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి' రూపొందింది.

'కళ కళకోసం కాదు. కళ కేవలం వినోదం కోసం కాదు. కళ వ్యాపారం కోసం అసలే కాదు. కళ ప్రజల కోసం. ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయడం కోసం.

అందుకే ఈనాడు సమాజంలో జరుగుతున్న అన్నిరకాల దోపిడులకు వ్యతిరేకంగా పోరాడే శ్రామిక ప్రజానీకాన్ని చైతన్యవంతుల్నిచేసి, అభ్యుదయ ప్రజాతంత్రశక్తులన్నిటినీ సమీకరించి, సోషలిస్టు సమాజ నిర్మాణ ఆశయాన్ని సాధించడానికి పూనుకోవడం ప్రజానాట్యమండలి ప్రధాన కర్తవ్యం'[1] అనే విధాన ప్రకటనను ఆం. ప్ర. ప్రజానాట్యమండలి పునర్నిర్మాణ మహాసభ

1. ఆం. ప్ర. ప్రజానాట్యమండలి సాంస్కృతికోత్సవాల ప్రత్యేక సంచిక (1974).

(1974 అక్టోబరు) ఆమోదించి, చాలా తక్కువ కాలంలోనే అనేక జిల్లా శాఖలను ఏర్పాటు చేసుకుంటూ విస్తరిస్తున్నది.

జానపద కళారూపాలను పునరుద్ధరించాలనీ, వివిధ జిల్లాల్లో పాటల దళాలను రూపొందించాలనీ, కొత్త కళారూపాలను తయారు చేయాలనే సంకల్పంతో 1975 సెప్టెంబరు 8-17 తేదీల్లో ఖమ్మంలో రాష్ట్రస్థాయి కళాకారుల, రచయితల శిక్షణా శిబిరం జరిగింది. 160 మంది కళాకారులు, రచయితలు పాల్గొన్నారు, 9 గొల్లసుద్దుల దళాలు, 5 జంతరపెట్టె దళాలు, 15 బుర్రకథ దళాలు ఈ శిబిరంలో ప్రాథమిక శిక్షణ పొందాయి ఈనాడు రాష్ట్ర వ్యాపితంగా ప్రజానాట్యమండలి గాయనీ గాయకులు పాడుతున్న అనేక గీతాలు ఈ శిబిరంలో తయారయినాయి.

ఈనాడు ఆంధ్రదేశంలోని అన్ని జిల్లాల్లోనూ దాదాపు 200 కు పైగా శాఖలతో, పదివేలమంది సభ్యులతో ఆం. ప్ర. ప్రజానాట్యమండలి వామపక్ష భావాలను ప్రచారం చేసే సాంస్కృతిక వేదికగా పురోగమిస్తోంది.[1]

## జననాట్యమండలి

విరసం ప్రేరణతో, హైదరాబాదు 'ఆర్ట్ లవర్స్' చొరవతో 1972-73 లో 'జననాట్యమండలి' ఏర్పడింది. సుబ్బారావు పాణిగ్రహి ఒరవడిలో ప్రజాకళారూపాలను పునరుజ్జీవింపజేసే ప్రయత్నాలు చేసింది ప్రజానాట్యమండలి మాదిరిగానే జననాట్యమండలి కూడా ప్రజల సమస్యలను, మనోభావాలను, పోరాటాలను ఇతి వృత్తాలుగా తీసుకుని స్థానిక జానపద కళారూపాల ద్వారా ప్రజల మధ్య ప్రచారం చేస్తున్నది. 1973 అక్టోబర్‌లో వరంగల్‌లో జరిగిన విరసం సాహిత్య పాఠశాల సందర్భంగా జననాట్యమండలి ప్రదర్శనలు ప్రజలను బాగా ఆకర్షించాయి. ఈ సమావేశాలకు హాజరయి వెళ్ళిన కొద్దిరోజులకే వరవరరావు, చెరబండరాజు, ఎం టి ఖాన్‌లను ప్రభుత్వం అరెస్ట్ చేసింది. కొన్ని నెలల కారాగారవాసం తర్వాత వాళ్ళను విడుదల చేస్తూ హైకోర్టు తీర్పు యిచ్చింది. ఆ తరువాత సికింద్రాబాద్ కుట్రకేసు (మే 1974)లో విప్లవరచయితలను, జననాట్యమండలి కళాకారులను, రాజకీయ కార్యకర్తలను ప్రభుత్వం ఇరికించింది. జననాట్యమండలిలోకి గద్దర్ ప్రవేశించిన తరువాత ఈ సంస్థ కార్యక్రమాలు తీవ్రమయ్యాయి రానురానూ గద్దర్ జననాట్యమండలికి పర్యాయపదమయ్యాడు.

ఇలా తీవ్ర నిర్బంధాల నడుమ, పోలీసుల నిరంతర నిఘాల నడుమ కూడా 'జననాట్యమండలి' సాయుధపోరాట ఆవశ్యకతను ప్రజా కళారూపాల

1. ఆం. ప్ర. ప్రజానాట్యమండలి ప్రధాన కార్యదర్శి కె. ప్రతాపరెడ్డి గారితో ఇంటర్వ్యూ (21. 3. 1989).

ద్వారా ప్రచారం చేస్తున్నది. సిద్ధాంత విభేదాల మూలంగా కొందరు రచయితలు, కళాకారులు ఈ సంఘం నుంచి విడిపోయి 'జనసాహితి సాంస్కృతిక సమాఖ్య (ఆంధ్రప్రదేశ్)'ను ఏర్పాటు చేశారు. 'ప్రజాసాహితి' పత్రికద్వారా తమ భావాలను ప్రచారం చేస్తున్నారు. అలాగే మరో వర్గం విడిపోయి, 'అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య (ఆం.ప్ర.)'గా ఏర్పడింది. 'అరుణ కిరణాలు' పాటల పుస్తకం ప్రచురించింది.

## వామపక్ష సాహిత్యం

ఈనాడు రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుని ఉన్న పెట్టుబడిదారీ పాలక వర్గాలకు వ్యతిరేకంగా వెలువడుతున్న సాహిత్యాన్ని 'వామపక్ష సాహిత్యం' అంటున్నాం. కేవలం అధికార వర్గాన్ని ఆక్షేపించడమే కాక, నిర్దిష్టమైన తాత్విక ప్రాతిపదికతో ఏ వర్గానికి అధికారం సంక్రమించాలో, ఎలాంటి వర్గరహిత సమసమాజం ఏర్పడాలో, ఏ జెండా నీడకింద ప్రజలు పోరాటాలు కొనసాగించాలో - అనే అంశాలను స్పష్టంగా నిర్దేశించగలుగుతున్నదానిని 'వామపక్ష సాహిత్యం'గా పరిగణిస్తున్నాం. ఈ అంశాలన్నింటినీ తరువాతి ప్రకరణంలో గీతాలను అన్వయించి పరిశీలించే ప్రయత్నం జరుగుతుంది.

# 9

# వామపక్ష గీతాలు

ఈ శతాబ్దం మూడవ దశాబ్దం నుండే తెలుగులో వామపక్ష సాహిత్యం కనబడుతుంది. దానిలో భాగంగానే వామపక్షగీతాలు అనేక ప్రజాసంఘాల ఆశయాలను, ఆదర్శాలను ప్రజల్లో ప్రచారం చేస్తున్నాయి.

ఈనాడు తెలుగు నేలపై 'అభ్యుదయ రచయితల సంఘం' 'విప్లవ రచయితల సంఘం', 'ప్రజా నాట్యమండలి', 'జన నాట్యమండలి', 'ప్రజా రచయితల సమాఖ్య', 'సాంస్కృతీ సమాఖ్య', 'జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య', 'అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య' వంటి రాష్ట్ర స్థాయి సాహితీ సాంస్కృతిక సంఘాలు; కొన్ని జిల్లా స్థాయి సాహితీ సాంస్కృతిక సంఘాలు, ప్రచురణ సంస్థలు, పత్రికలు ప్రజలను చైతన్యపరిచి, పోరాట మార్గాన్ని నిర్దేశించే వామపక్ష గీతాల వ్యాప్తికి కృషి చేస్తున్నాయి ఈ సంస్థలకు సోదర సంస్థలైన విద్యార్థి, యువజన, కార్మిక, కర్షక సంఘాలు ఈ గీతాలను తమ వేదికల ద్వారా ప్రచారం చేస్తున్నాయి ఈ ప్రజా సంఘాలకు, సాంస్కృతిక సంఘాలకు అనుబంధ సంబంధాలున్నాయి. ఒకదాని కార్యక్రమాలతో వేరొక సంస్థ ప్రభావితమౌతూ, తమ కృషిని ముమ్మరం చేస్తున్నాయి

పై సంస్థలన్నింటి ఆశయం ఒక్కటే-సమ సమాజ నిర్మాణం. ఇవి ఎగరేసే జెండా ఒక్కటే- ఎర్రజెండా. ఇవి ప్రబోధించే పోరాటం కూడా ఒక్కటే-వర్గపోరాటం

అయితే ఈ పోరాట మార్గం, ఎత్తుగడల గురించిన అభిప్రాయాలనుబట్టి వీటిమధ్య కొన్ని విభేదాలున్నాయి కొన్ని సంస్థలు 'సాయుధ పోరాటమే తక్షణ కర్తవ్యం' అంటున్నాయి. మరికొన్ని సంస్థలు 'సాయుధ పోరాటమే ఏకైక మార్గమని, అయితే దానికావలసిన విప్లవ పరిస్థితులను ఇప్పుడు అంచనా వేయాల్సి ఉంది' అంటున్నాయి. ఇంకా కొన్ని సంస్థలు 'పోరాట మార్గాన్ని నిర్ణయించేవి మన భౌతిక పరిస్థితులు, ప్రజల పోరాట సంసిద్ధతే కాని కేవలం మేధావి వర్గం కాదు' అంటున్నాయి 'భౌతిక పరిస్థితులకు అనుగుణంగా ప్రతిస్పందించగలిగే చైతన్య స్థాయిని ప్రజల్లో కలిగించడం తక్షణ కర్తవ్యం' అని కూడా చెప్తున్నాయి.

అయితే ఈ సంస్థలన్నీ 'సకల మానవాళి విముక్తికోసం; శాంతి, సుఖ, సౌందర్యమయ జీవితం కోసం శ్రామిక జనులు సాగించే విప్లవ సమరాల్లో సహ యోధులుగా కలంపట్టి, గళం ఎత్తి కదలిరావలసిందిగా ఉత్సాహశక్తి, క్రియాశీల శక్తిగల నవయువరచయితలను, కళాకారులను' ఆహ్వానిస్తున్నాయి. జన జీవన సమరాలకు తమ గీతాలను అంకితం చేస్తున్నాయి.

రూపంలో జాతీయతను, వస్తువులో నవ్యతను ప్రదర్శిస్తున్న ఈ అన్ని సంస్థల రచనల్లోనూ సాధారణంగా (కామన్‌గా) కనబడుతున్న అంశాలను పరిశీలించవలసిఉంది

వామపక్ష భావాలను ప్రచారం చేస్తున్న ఈ గీతాల శీర్షికలు, ఎత్తుగడలు, వస్తువు, రూపం అన్నీ ఒకే విధంగా ఉంటున్నాయి. పాటతో బాటు రచయిత పేరుగానీ, అతను పనిచేసే సంస్థపేరు గానీ ప్రకటించకపోతే......అది ఎవరి రచనో, ఏ సంస్థ సభ్యుడు రాశాడో తెలుసుకోవడం కష్టం. ఈ విషయాన్ని నిర్ధారించడానికి కొన్ని పాటలను పరిశీలిద్దాం—

'ప్రజా కళాకారులం - ఎర్రజెండా బిడ్డలం
మేం ప్రజా కళాకారులం - ఎర్రజెండా బిడ్డలం
పోరే మా పేరు - ఈ ప్రజలే మా వూరు
మా బాటే ఎర్రబాట - ఎర్రబాటే మా పాట[1] ॥మేం ప్రజా॥'

అనే గీతంలో ఒక కవి కళలే ఆయుధంగా, కవితే సాధనంగా ప్రజల కదనాలను గానం చేస్తున్న ప్రజా కళాకారుల ప్రతినిధిగా ప్రత్యక్షమవుతున్నాడు.

'ఎర్రజెండేరా తమ్ముడ ఎర్రజెండేరా
మనది ఎర్రజెండేరో తమ్ముడ ఎర్రజెండేరా'[2]

అంటూ మరోకవి ఈ పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో 'ఎర్రజెండా' ఆవిర్భావ, వికాసాలను వర్ణించారు.

'కొండలు పగలేసినం - బండలనూ పిండినం
మా నెత్తురె కంకరగా - ప్రాజెక్టులు గట్టినం
శ్రమ ఎవడిదిరో - సిరి ఎవడిదిరా'[3]

---

1. 'ప్రజా కళాకారులం' (గీతం) — ఎస్. కె. మీరా.
'ప్రతిధ్వని' ఆం.ప్ర. ప్రజానాట్యమండలి ప్రచురణ (1986) (పుట. 2).
2. 'ఎర్రజెండా' (గీతం) — ఏటుకూరి ప్రసాద్
'ఎర్రజెండా' (పాటల సంపుటి) - ఆం.ప్ర యువజన సమాఖ్య ప్రచురణ, 1973 (పుట. 1).
3. 'కొండలు పగలేసినం' (గీతం) — చెరబండరాజు.
'జననాట్యమండలి పాటలు' - క్రాంతి ప్రచురణలు (1979) (పుట. 17)

అనే గీతంలో సంపదలు సృష్టిస్తున్న కార్మిక వర్గానికి ఆ సంపదలపై అధికారం లేదుగాని, తేరగా కూచున్న పెట్టుబడిదారీ వర్గం ఈ సంపదలను అనుభవిస్తున్నదన్న ఆగ్రహం ప్రకటితమయింది.

'ఏం బతుకులు మనయిరో
అన్నలార సెల్లెలార!
ఎముల రాజ్యమ్మురో
అన్నలార సెల్లెలార'1

అంటూ ప్రారంభమయ్యే గీతంలో ఉండటానికి గుడిసె తినడానికి తిండి లేని కోట్లాది పీడిత ప్రజల దయనీయ బతుకు బాధలు ప్రతిధ్వనిస్తున్నాయి.

ఈ గీతాల్లో మొదటి గీతాన్ని 'ప్రజానాట్య మండలి' క్రియాశీల కార్యకర్త ఎస్.కె. మీరా రాశారు. రెండో గీతాన్ని 'అభ్యుదయ రచయితల సంఘం' రాష్ట్ర నాయకులు ఏటుకూరి ప్రసాద్ రాశారు. మూడో గీతం 'విప్లవ రచయితల సంఘం' సంస్థాపక సభ్యుల్లో ఒకరైన చెరబండరాజుది. నాలుగోగీతం 'జననాట్య మండలి'కి పర్యాయ పదంగా నిలిచిన గద్దర్‌ది. భావంలో ఈ నాలుగు పాటల రచనా సంవిధానం ఒక్కటే. వైరుధ్యం లేదు. వస్తువులో తేడా లేదు.

పూర్వపు ప్రజానాట్యమండలి కవులు రాసిన పాటలు పై అన్ని సంస్థల సంకలనాల్లో కనబడుతున్నాయి. ప్రజానాట్యమండలి పాటలే ఆంధ్రప్రజానాట్య మండలి సంకలనాల్లో కనబడుతున్నాయి. జననాట్యమండలి పాటలు జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్యలు సంకలనం జేసిన పుస్తకాల్లో చోటు చేసుకున్నాయి, వీరందరి పాటలు 'సాంస్కృతీ సమాఖ్య' (యువసాహితీ వికాసవేదిక) సంకలనాల్లో ప్రత్యక్ష మవుతున్నాయి.

ప్రజా కళాకారులు, ప్రజా గాయనీ గాయకులు అనేక వేదికలమీద, పై అన్ని సంస్థలకు ప్రాతినిధ్యం వహిస్తున్న రచయితలు రాసిన గీతాలను గానం చేస్తున్నారు సమ సమాజ నిర్మాణాకాంక్షతో జన సమరాలకు గళాలను అంకితం చేస్తున్నారు.

ఈ దృష్టితో ఆయా సంస్థల పేర్లతో గాక, అన్నింటినీ వామపక్ష గీతాలుగా పరిగణించడం సమంజసంగా ఉంటుందని భావిస్తున్నాను కార్మికులు, రైతులు, విద్యార్థులు, యువజనులు వంటి వివిధ ప్రజాశ్రేణులు జరుపుతున్న పోరాటాలకు ఊపిరులూదుతున్న గీతాలను కార్మిక గీతాలు, రైతుగీతాలు, విద్యార్థి గీతాలు, యువజన గీతాలు అనే శీర్షికల కింద విశ్లేషించడం జరుగు

1. 'ఏం బతుకులు మనయిరో' (గీతం)- గద్దర్
-'గద్దర్ పాటలు' - జననాట్య మండలి ప్రచురణ (పుట: 32).

తున్నది. మొత్తం వామపక్ష గీతాలను ఇలా విభాగాలు చేయవచ్చు: 1) క్రాంతి గీతాలు, 2) ఫాసిస్టు వ్యతిరేక గీతాలు, 3) శాంతిగీతాలు, 4) ఎర్రజెండా పాటలు, 5) అమరవీరుల స్మృతిగీతాలు 6) పార్టీ ప్రచార గీతాలు, 7) దేశ భక్తి, 8) అంతర్జాతీయతాదృష్టి, 9) కార్మిక గీతాలు, 10) రైతుకూలీ గీతాలు, 11) యువజన విద్యార్థి గీతాలు, 12) మహిళాగీతాలు, 13) కుల నిరసన, 14) పాలక వర్గంపై ఆగ్రహం, అధిక్షేపం, 15) గిరిజన విముక్తి గీతాలు, 16) సమసమాజ నిర్మాణాకాంక్ష

## క్రాంతి గీతాలు

తెలుగులో ఇప్పటికి లభ్యమవుతున్న వాటిలో 'కార్మిక భజనావళి' (1935) తరువాత వామపక్ష గీతాలను సమగ్ర సంకలనంగా కూర్చిన ఘనత గద్దె లింగయ్యకు దక్కుతుంది. ఆయన సంపాదకత్వంలో వెలువడిన 'క్రాంతి గీతాల'ను తొలి సమగ్ర వామపక్ష గీతికా సంకలనంగా భావించవచ్చు.[1]

ఈ సంకలనం వెలువడటానికి నాలుగు సంవత్సరాలకు (ఏప్రిల్ 1934) ముందే ఆచార్య రంగా సంపాదకత్వంలో 'రైతు భజనావళి' ప్రచురితమయింది. వామపక్ష భావాల ప్రభావం ఈ సంకలనంలోని గీతాలపై ఉన్నప్పటికీ, ఇతర భావాలుకూడా కొన్ని పాటల్లో కనపడుతున్నాయి.

1938 అక్టోబర్‌లో ఆదర్శ గ్రంథమండలి ప్రచురణగా ఈ సంకలనం వెలువడింది. తెలుగులో తొలి ఎర్రజెండాపాట, అంతర్జాతీయ గీతం, కూలి పాట, రైతుపాట, కుల నిరసన, జన జాగృతి, సామ్యవాద సమాజ నిర్మాణాకాంక్ష వంటి పలు అంశాలను ప్రబోధించే గీతాల సంచయమిది. ఈనాడు విశేష ప్రచారాన్ని పొందిన గీతాలకు, అనేక గీతాల్లోని భావాలకు మాతృకలవంటి అంశాలు ఈ సంకలనంలో ఉన్నాయి.

---

1. ఈ సంకలనాన్ని కూర్చిన సంపాదకుడు గద్దె లింగయ్య తన ముందు మాటలో రాసిన మాటలు గమనార్హం:
'ఈ మాదిరి క్రాంతిగీతాలను ఒక సంపుటంగా కూర్చాలనే భావన నేను "ప్రభ"ను నడిపే రోజుల్లోనే కలిగింది. విప్లవ గీతికలు అనేకమందిచే ఈలోగా ప్రకటింపబడ్డాయి. కాని అన్నీ చాలా తక్కువ గీతాలతోనే కూర్చబడినవి. ఇందులో కూడా చేర్చబడనివి చాలా ఉండొచ్చు. కాని నాకు లభించినంతవరకు సంగ్రహించి చేర్చాను. నేనీ గీతికలను చాలా వరకు ప్రభ, చిత్రగుప్త, వాహిని, నవశక్తి, జమీన్‌రైతు మొదలగు పత్రికలనుండి ఏరితిని. ఆ పత్రికా సంపాదకులకు కృతజ్ఞుడను. ఇంక రచించిన కవులకు మరీ మరీ కృతజ్ఞుడనై ఉంటాను.'

ఈ సంకలనం కవర్ పేజీ తీయగానే, మొదటి పేజీలోనే...

'మేడ మిద్దియల
పాడి పంటలలో
బలిసెడు వారల
తలపేలా?—
సీడలేక, తిన
కూడులేక
హతమయ్యేడు వారల
గతి గానక—'[1]

వనవిహారి, చిత్రగుప్త రాసిన చిన్నపాట ప్రత్యక్షమవుతుంది. రెండు విభిన్న వర్గాలను గురించిన మౌలిక స్పృహ; అంతేకాక పేదలను పట్టించుకోవాలనే ఉశా దినిలో వ్యక్తమవుతున్నాయి.

## (అ) తొలి ఎర్రజెండా గీతం

తెలుగులో తొలి ఎర్రజెండా గీతాన్ని ఆంధ్రా కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలో ఒకరైన తుమ్మల వెంకట రామయ్య రచించారు. 1936 జూన్ 20 న తుమ్మల రాయగా 'ప్రభ'లో అచ్చయిన ఈ గీతం క్రాంతి గీతాల్లో చేర్చబడింది.

1933 లోనే శ్రీరంగం శ్రీనివాసరావు 'నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను' అనే గేయం రాశారు.

'నేను సైతం భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను' అని అన్నారు.

'అన్నప్పటికీ, ఈ బావుటా ఏ పతాకం? ఈ జెండా స్వభావం ఏమిటి? వీటిని కవి వాచ్యం చేయలేదు' అని ఆరుద్ర అన్నారు[2]

ఈ బావుటా రంగేమిటో కూడా కవి సూచించలేదు.

అయితే...కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో నిమగ్నులై ఉన్న కవులకు, కార్యకర్తలకు తమ జెండా 'ఎర్రజెండా' అని తెలుసు కార్మిక సంఘాల నిర్మాణంలో ఆ జెండాను ఎగరేయాలని కూడా తెలుసు. అందుకే...

'ఎగరాలి ఎగరాలి - మన ఎర్రజెండా
అదురు బెదురూ లేక - అడ్డేదియును లేక ॥ఎగరాలి॥

---

1. 'క్రాంతి గీతాలు'- సం: గద్దె లింగయ్య, ఆదర్శ గ్రంథమండలి ప్రచురణ (1988).
2. 'అభ్యుదయ సాహిత్య ఉద్యమ చరిత్ర - తొలిరోజులు' (వ్యాసం) -ఆరుద్ర; విశాలాంధ్ర (దినపత్రిక) 7-8-1988.

సామ్రాజ్యవాదంబు - సమసి పోవంగా
ధనికవాదం బింక - దగ్ధమైపోవ ॥ఎగరాలి॥
కార్మికుల్ కర్షకుల్ - కరము కరమూ గల్పి
జై మనకు జైయంచు - జేజేలు కొట్టంగ ॥ఎగరాలి॥
కూలోళ్ళ గొంతులో - కొనవూపిరుండేను
పేదరైతూమేన - వేడి రక్తాముండె ॥ఎగరాలి॥[1]

అని గానం చేసిన తొలి ఎర్రజెండా కవి తుమ్మల వెంకట్రామయ్య. బ్రిటిష సామ్రాజ్యవాదం సమసిపోవాలనీ, దానితోపాటుగా స్వదేశ ధనికవాదం కూడా దగ్ధమై పోవాలని ఈ గీతంలో తుమ్మల ఆశించారు.

## (ఆ) అంతర్జాతీయ గీతం

1871 నాటి పారిస్ కమ్యూన్ పతనానంతరం పారిస్ విప్లవ యోధుడు, కవి 'యూజినీ పాటియర్' లండన్‌లో ప్రవాస జీవితం గడపడానికి ముందు ఫ్రెంచి భాషలో ఒక 'అంతర్జాతీయ గీతం' (ఇంటర్నేషనేల్) రాశారు. అన్ని దేశాల కమ్యూనిస్టు పార్టీలకు అది ప్రార్థనా గీతమయింది. దీని ఆంగ్లానువాదాన్ని చదివిన బాలాంత్రపు నళినీకాంతారావు, సుందరయ్యగారి ప్రేరణతో తెలుగులోకి అనువాదం చేశారు. తెలుగులో ఇది తొలి అనువాదం.

'ఆకలి మంటచె మలమల మాడే
 అనాథులందరు లేవండోయ్
హింసారతిని సహించగలేక
 ఈ పడించినది ధర్మంబెల్ల
మంచి దినాలూ రానున్నాయీ
 మన కందరకును లేవండోయ్'

అని ప్రారంభించిన 'అంతర్జాతీయ గీతం'లో తరతరాల దాస్యాన్ని అంతం జేయడానికి దాసులందరూ కదలాలనీ, ప్రపంచ ప్రజానీకమంతా ఒకే కులమై, మానవకులమై అంతిమ పోరాటానికి నడుం బిగించాలని నిర్దేశించారు.

## (ఇ) తొలి కార్మిక కవి పెండ్యాల లోకనాథం

**1936-37 మధ్య కాలంలో గుంటూరులోని పేటల్లో, మిల్లుల్లో, బజార్లలో** తిరిగి కార్మికులకు వారి కష్టసుఖాలను వివరిస్తూ 'కార్మిక సంఘాలను నిర్మించే' అవసరాన్ని గురించి పెండ్యాల లోకనాథం ప్రబోధించేవారు. ఆయన చెప్పిం

1. 'క్రాంతిగీతాలు'-సం: గద్దె లింగయ్య,
 ఆదర్శ గ్రంథమండలి ప్రచురణ (1938).

దంతా విని, 'సంఘమంటే సమ్మె చేయమనేగా?', 'మా కొద్దు బాబాయ్ సంఘాలు' అని చెప్పి ఎవరి దారిన వారు వెళ్ళిపోయేవారు. అప్పుడు బాగా ఆలోచించి, ఒక మంచి పాట రాస్తే కార్మికులు వింటారని భావించిన లోకనాథం...

'కూలీలందరు ఏకమైతే - కూటికి తరుగేమిరా
కూలివాండ్లలోనె బలమీ - కాలమందున నుండెరా
కూలి వాండ్లమైన మనకు - కులము లెందుకు తెలుపరా
కూలివాండ్లమైన మనము - కలిసి యుందము సోదరా
అన్నా కూలీలేకము కావలెరా॥'

అనే ఎనిమిది చరణాల 'కూలిపాట'ను రచించారు. కార్మికవాడల్లో పాడేవారు. క్రమంగా అది అందరిని ఆకర్షించింది.

'కష్టపడి యీ మేడలన్నీ
కట్టినది మనమే కదా
కష్టపడి ఈ ఫ్యాక్టరీలు
కట్టి వారల కిస్తిమి
కష్టజీవులమైన మనకు - గుడిసెలే గతియాయెరా
కష్టపడి పనిచేయుచున్నను - కడుపు నిండుట లేదురా
అన్నా! కూలీలేకము కావలెరా'

అని ఆనాడు లోకనాథం చేసిన ప్రబోధం ఈనాటికీ కార్మిక గీతాలు రాస్తున్న కవులకు ఒరవడిగా వుంది.

1937-38లో చీరాలలో పొగాకు కార్మికులు సమ్మె చేసినప్పుడు ప్రభుత్వం కాల్పులు జరిపింది. అప్పుడు మద్రాస్ అసెంబ్లీ గద్దెపై కాంగ్రెస్ మంత్రి వర్గం ఉంది. కాల్పుల్లో కొందరు కార్మికులు మరణించారు. అప్పుడు లోకనాథం అహింసా మార్గాన్ని వ్యతిరేకిస్తూ, విప్లవాన్ని ఆవాహన చేస్తూ...

'విప్లవము రావాలి - విప్లవము రావాలి
విప్లవ జ్వాలలతో విశ్వమే నిండాలి'

అని ఎలుగెత్తి చాటారు. కేవలం కవిత్వం ద్వారా కార్మికులను కదిలించడమే కాదు, బాపట్ల తాలూకాలో కమ్యూనిస్టు పార్టీ 'హోల్ టైమర్'గా కూడా ఆయన పనిచేశారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో జైలు జీవితం గడిపారు. 1947 లో స్వదేశీయ దొరతనాన్ని వ్యతిరేకించినందుకు మళ్ళీ కారాగారం పాలయ్యారు. ఇలా తొలితరం కమ్యూనిస్టు కవుల్లో కార్మికుల కోసం కలాన్ని ఆయుధంగా వాడుకున్న పెండ్యాల లోకనాథం సిద్ధాంతానికీ, ఆచరణకూ అభేదంగా పని చేశాను.

## (ఈ) తొలితరం విప్లవకవులు

'వద్దురా! మనకొద్దురా
యిక - భాగ్యవంతుల పెత్తనంబు'[1]

అంటూ......కష్టపడకుండా కడుపునిండా తినడమేకాక, కష్టజీవుల మధ్య కలహాలు సృష్టిస్తున్న భాగ్యవంతుల పెత్తనం మనకొద్దని చాటిచెప్పిన క్రాంతి గీతికా కర్తలు......

'విప్లవము కావాలి - విప్లవము రావాలి
విప్లవ జ్వాలలతో - విశ్వమే నిండాలి'[2]

అనే మార్గ నిర్దేశం కూడా ఆనాడే చేశారు.

'మేడాలు గట్టేము - మిద్దేలు వేసేము
కూర్చుందుకైనాను - గుడిసైన లేదండి
మిల్లాలు గట్టేము - సెల్లాలు నేసేము
గోచీకైనా బాబు - గుడ్డింత లేదండి
చేనూలు దున్నేము - చెట్లాను నాటేము
గంజినీళ్ళైనాను - కరువయ్యెమనకండి
చదువూ కోసము - పాఠశాలాలు కట్టేము
చదువులేక మనము - చవటలై పోయాము'

'కూలీల రాజ్యం' గీతంలో మద్దూరి అన్నపూర్ణయ్య రగిలించిన ఈ భావాలు...

'చీని చీనాంబరముల్ - చిత్రముగ నేస్తావు
వాటి నన్నిటి దారల - వశము జేసే నీవు
జానెడైన లేక కూలోడా!
చలిలోనె చస్తావు కూలోడా!'

అంటూ గద్దె లింగయ్య, వాసిరెడ్డి నాగేశ్వరరావు కార్మికుల్లో జాగృతం చేసిన ఆలోచనా ధోరణులు......తరువాతి తరం కవులపై బలమైన ముద్రలు వేశాయి.

---

1. 'వద్దురా మనకొద్దురా యిక భాగ్యవంతుల పెత్తనంబు' (గీతం) —చదలవాడ పిచ్చయ్య; 'క్రాంతి గీతాలు' (1938).
2. 'విప్లవ గీతము' శీర్షికతో అచ్చయిన ఈ గీతంకింద కవిపేరు లేదు.

'దారమంత సిక్కుదీసి - వారమంత మగ్గమేసి
సీరనేసి అమ్ముకుంటె - కూరకరుసు రాకపాయె'[1]

అంటూ గద్దర్ గానం చేస్తున్నప్పటి ఆక్రోశం-

'మగ్గాలను పెట్టినం - పోగు పోగు వడికినం
మా నరాలె దారాలుగ - గుడ్డలెన్నొ నేసినం
ఉడుకెవడిదిరో - వణుకెవడిదిరో'[2]

అని చెరబండరాజు ప్రజల మెదళ్ళను పదును పెడుతున్నప్పటి భావ తీవ్రతా ఆనాటికే క్రాంతిగీతాల్లో స్ఫురణ కొస్తున్నవి.

పై కవులతోబాటు తొలితరం విప్లవకవులైన తుమ్మల వెంకటరామయ్య, మద్దూరి అన్నపూర్ణయ్య, చదలవాడ పిచ్చయ్య, శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావు, కాశీ విశ్వనాథ చౌదరి, వాసిరెడ్డి నాగేశ్వరరావు, మల్లిపెద్ది కృష్ణమూర్తి, నారపరెడ్డి రామిరెడ్డి, ముత్తేవి మాధవాచార్య, పోలుకొండ భద్రయ్య మొదలైనవారి గీతాలు ఈ సంకలనంలో ఉన్నాయి.

## (ఉ) క్రాంతిగీతాలపై నిషేధం

వామపక్ష సాహిత్యం ప్రారంభమైనప్పటి నుండి అటు ఆంధ్ర ప్రాంతంలో బ్రిటిష ప్రభుత్వం నుండి, ఇటు తెలంగాణ ప్రాంతంలో నిజామ్ ప్రభుత్వం నుండి తీవ్రమైన నిర్బంధాలు, నిషేధాలు ఎదుర్కోవలసి వచ్చింది.

1935 జూలైలోనే క్రొవ్విడి లింగరాజు అనువదించిన గోర్కీ నవల 'అమ్మ'ను బ్రిటిష ప్రభుత్వం నిషేధించింది. సుంకర రాసిన 'అల్లూరి సీతారామరాజు' బుర్రకథకూడా నిషేధం తప్పలేదు.

ఇదే వరుసలో తెలంగాణా సాయుధ పోరాటకాలంలో (21 సెప్టెంబర్ 1941 నాడు) నిజామ్ ప్రభుత్వం క్రాంతిగీతాలను నిషేధించింది.[3]

తుమ్మల వెంకటరామయ్యగారి 'ఎర్రజెండా పాట', పెండ్యాల లోకనాథం 'కూలీపాట', మద్దూరి అన్నపూర్ణయ్యగారి 'కూలీల రాజ్యం', కవి పేరు లేకుండా ప్రచురించిన 'విప్లవగీతం' ఈ నిషేధానికి కారణంగా ప్రభుత్వం చూపింది. మద్దూరి అన్నపూర్ణయ్య పాట దగ్గర ఒక నోట్‌లో-'మద్రాస్ ప్రావిన్స్‌లో ఇతనొక దుష్ట

---

1. 'ఏం బతుకులు మనయిరో' (గీతం) - గద్దర్; 'గద్దర్ పాటలు', జననాట్య మండలి ప్రచురణ (పుట: 82) తృ. ము. (1981).
2. 'కొండలు పగలేసినం' (గీతం) - చెరబండరాజు; 'చెరబండరాజు కవితలు, పాటలు', పీపుల్స్ బుక్స్, విజయవాడ (1982) (పుట: 57).
3. ఫైల్ నెంబర్ 54/పి.యు.ఎస్/50 ఎఫ్.

కమ్యూనిస్టుగా పేరుమోశాడు. ఇండియా డిఫెన్స్ ఆక్ట్ చట్టం కింద మొదటి సారిగా అరెస్టయ్యాడు' అని ప్రత్యేకంగా పోలీస్ అధికారులు పేర్కొన్నారు.

ఈ విధంగా బ్రిటీషు ప్రభుత్వాన్ని, నిజాం ప్రభుత్వాన్ని కంపరమెత్తించి నిషేధానికి గురైన గీతాల సంకలనం 'క్రాంతిగీతాలు.'

## ఫాసిస్టు వ్యతిరేక గీతాలు

పాలకవర్గంలో ఆవరించిన జాతీయ దురహంకారాన్ని, అన్య జాతులపై అసహనాన్ని 'ఫాసిజం' అనవచ్చు పెట్టుబడిదారీవర్గంపై ప్రజల అసంతృప్తి పెరుగుతూ ఉన్నప్పుడు, ప్రకంపనాలకు గురైన ఆ వర్గం ప్రజలను పక్కదారి పట్టించడానికి వారిలో జాతీయ దురహంకారాన్ని, ఇతర జాతులపై ఆగ్రహాన్ని ప్రేరేపిస్తుంది. తద్వారా జాతుల మధ్య కలహాలను సృష్టించి రక్తపాతాన్ని రగిలిస్తుంది. కార్మిక వర్గంలో పెరుగుతున్న వర్గచైతన్యాన్ని దెబ్బకొట్టడానికి కూడా పాలకవర్గం, వారిలో జాతిచైతన్యాన్ని కలిగిస్తుంది. వర్గపోరాటాలకు ప్రత్యామ్నాయంగా వర్ణపోరాటాలను ప్రేరేపిస్తుంది.

ఫాసిజం అనే పదానికి మార్క్సిస్టు మేధావులిస్తున్న వివరణను పరిశీలిద్దాం.

'Fascism, overt terroristic dictatorship of the most reactionary, chauvinistic elements of finance capital. The establishment of Fascism reflects the inability of the ruling bourgeoisie to maintain its Power by usual "democratic" methods. Fascism heads the forces of anti - Communism and strikes its main blow against the Communist and workers parties and other progressive organisations. The Ideology of Fascism is irretionalism; extreme chauvinism and racism, obscurantism, and inhumanity'.[1]

అభ్యుదయ వ్యతిరేక, కమ్యూనిస్టు వ్యతిరేక జాతిదురహంకార శక్తిని 'ఫాసిజం' అని వ్యవహరిస్తున్నట్లు పై వివరణనుబట్టి తెలుస్తున్నది. ఇది ప్రజాస్వామ్యానికి శత్రువు. హేతువాదానికి విరుద్ధం మానవత్వానికి బహుదూరం. కరడుగట్టిన జాతీయ ఉన్మాదం.

---

1. 'Dictionary of Philosophy' Ed. by : I. Frolov Progress publishers Mocow (1984) Page No. 142.

ఇది 1922 లో ఇటలీలోనూ, 1933 లో జర్మనీలోనూ ప్రారంభమై ప్రపంచయుద్ధానికే కారణమైంది. ఇటలీలో ముస్సోలినీ, జర్మనీలో హిట్లర్ ఫాసిస్టు భావ జాలానికి ప్రతీకలయ్యారు.

1939 నాటికి ప్రపంచమంతా ఫాసిస్టుల ప్రళయార్భాటాలతో మారు మ్రోగింది. యూరప్‌లోని చిన్నచిన్న రాజ్యాలను హిట్లర్, ఆఫ్రికన్ భూభాగాన్ని ముస్సోలినీ ఆక్రమించారు. 1939 సెప్టెంబర్ 3 న రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. 1941 జూన్ 22 న సోవియట్ యూనియన్‌పై యుద్ధ ప్రకటన చేయకుండానే జర్మనీ దాడి మొదలుపెట్టింది. టూజో నాయకత్వంలో జపాన్ యుద్ధ రంగంలోకి దిగింది. ఆసియా దేశాలను కబళించడం మొదలు పెట్టింది.

1933 నుండి ఫాసిజానికి వ్యతిరేకంగా తెలుగు రచయితలు వ్యాసాలద్వారా, కరపత్రాలద్వారా, పత్రికల్లో లేఖలద్వారా ప్రచారం ప్రారంభించారు. 1939 నుండి ప్రపంచ యుద్ధానికి వ్యతిరేకంగా, హిట్లర్ యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా అభ్యుదయ రచయితలు, ప్రజా నాట్యమండలి కళాకారులు నిరంతర ప్రచారం కొనసాగించారు.

రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో ఆంధ్రరాజకీయ రంగంలో అభ్యుదయ శకం ఆరంభమయిందని చెప్పవచ్చు.

ప్రజాబంధు, చిత్రగుప్త, నవశక్తి పత్రికల్లో 1937-39 నడుమ ఫాసిస్టు వ్యతిరేక వ్యాసాలు అచ్చయినాయి.

'అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం' ఏర్పడినప్పుడు (1936)' ఆ తరువాత మున్షీ ప్రేంచంద్, ముల్క్‌రాజ్ ఆనంద్, కె. ఎ. అబ్బాస్, సజ్జాద్ జహీర్ మొదలైన రచయితల ప్రభావంతో తెలుగునాట యువ రచయితలు ఫాసిస్టు వ్యతిరేక రచనలను ప్రారంభించారు.

1942-45 మధ్య కాలంలో 'ప్రజాశక్తి' వారపత్రిక అనేక ఫాసిస్టు వ్యతిరేక గీతాలను ప్రచురించింది.

1942 ఆగస్టులో బెజవాడలోని 'ప్రజాశక్తి కార్యాలయం' 'ఫాసిస్టు ప్రతికూల గీతాలు' (సంకలనం) ప్రచురించింది. రచయితల పేర్లపక్కన 'కామ్రేడ్' అని ఉండడాన్నిబట్టి ఈ రచయితలందరూ కమ్యూనిస్టు పార్టీ సభ్యులు గానీ, సన్నిహితులుకానీ అయి ఉంటారని తెలుస్తున్నది.

సోవియట్ యూనియన్‌పై జర్మనీ దాడి (1941 జూన్ 22) ప్రారంభించిన తర్వాత యుద్ధ స్వభావంలో మార్పు వచ్చింది. కమ్యూనిస్టు పార్టీ

సోవియట్ విజయాన్ని కాంక్షిస్తూ 'ప్రజాయుద్ధం' నినాదమిచ్చింది. 'కమ్యూనిస్టుల పాలసీ' శీర్షికతో 'ప్రజాశక్తి' వారపత్రికలో ఈ క్రింది ప్రకటన వెలువడింది:

'నేడు జరుగుతున్న ప్రపంచ యుద్ధం ప్రపంచ ప్రజలందరి యుద్ధం. అందుచే అన్ని జాతుల ప్రజలు తమ బలాన్నంతటినీ వినియోగించి, తమ సర్వస్వం ధారబోసి యీ యుద్ధాన్ని జయించాలి. తమ స్వాతంత్ర్యాన్ని స్థాపించుకోవాలి.

ప్రజా హక్కులను, స్వాతంత్ర్యాన్ని హరించి, వారిని బానిసలుగా చేయడానికి జర్మనీ, జపాన్, ఇటలీలు పోరాడుతున్నాయి... గాన అది ప్రజా యుద్ధమయ్యింది. అందుచేతనే ప్రజలు తమ దేశాలను రక్షించుకోవాలి. ఈ సంగతి గుర్తించనివారు ప్రజల పక్షాన చేర నిరాకరించినట్లే అవుతుంది.

ప్రపంచంలో స్వాతంత్ర్యాన్ని కోరే ప్రజలంతా ఒకే సంయుక్త జాతుల సంఘటనగా ఏర్పడి, అందరికీ శత్రువైన ఆక్సిస్ రాజ్యాలతో పోరాడుతున్నారు. అందుచే ఇది ప్రజాయుద్ధం. ఈ సంగతి గుర్తించలేకపోవడం కండ్లుండియు చూడలేక పోవడమే అవుతుంది.'[1]

ఈ ప్రకటనతో ప్రజా కళాకారులంతా 'ప్రజాయుద్ధం' నినాదాన్ని ప్రజల్లో ప్రచారం చేయడం మొదలుబెట్టారు.

'ముందునడూ, వేగనడూ, మృత్యుభీతి వదలవోయ్
క్రూర ఫాసిస్టు మూక వురికి వచ్చుచున్నదోయి'

అనే పల్లవితో పదిమంది కదిలి ముందుకు సాగితే, విజయ నాదములతో స్వేచ్ఛ లభిస్తుందని మహీధర రామమోహన్ మార్చింగ్ గీతం రచించారు.

'బొబ్బిలి పాట' వరుసలో కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) 'ప్రజాయుద్ధం' శీర్షికన ముప్పై నాలుగు చరణాల గీతం రాశారు.

'జయము జయము మన భారత భూమికి జయము దిగ్విజయము
జయము జయము మన ప్రజా శక్తులకె జయము దిగ్విజయము'

పల్లవితో ప్రారంభమయ్యే ఈ సుదీర్ఘ గీతంలో యుద్ధం ఎలా ప్రారంభమయిందో మొదలుకొని ప్రజాయుద్ధంగా పరిణామం చెందడం వరకు వర్ణించబడింది.

'అన్యాయ కాలంబు దాపురించిందిపుడు' అనే గీతం నడకను అనుసరించి కామ్రేడ్ జి. కోటయ్య 'ఫాసిస్టు ప్రళయాగ్ని' శీర్షికతో...

'ఫాసిస్టు ప్రళయాగ్ని ప్రజ్వరిల్లినదండి
ప్రజలందరము మేలుకోవాలి॥

---

1. 'ప్రజాశక్తి' (వారపత్రిక) 15-7-1942.

తూర్పుదీవుల మధ్య తలయెత్తిన జ్వాల
కాలాగ్ని కీలలై నాలుకలు జాపినది
కనుమూసితే మోసమోయి మనమిపుడు
కలిసి పనిజేయవలెనోయి॥

.....................

వీర రక్తము మనది వుడుకెత్తడము లేద?
ఫాసిస్టు భూతమును పరిమార్చ రారండి
పచ్చి రక్తము పీల్చునోయీ - యీ
ఫాసిస్టు భూతము ప్రాణముల బలిగోరునోయీ॥'1

అంటూ 'ఫాసిస్టు రాక్షసులను ప్రజలందరు కలిసి ప్రతిఘటించాలని' ప్రబోధించారు.

'జపాను హంతకు లొస్తున్నారోయ్
తుపాకి పట్టుక రారండోయ్
జపానుద్రోహుల పరిమార్చండోయ్
స్వతంత్రమును సాధించండోయ్'

గీతంలో పెండ్యాల లోకనాథం దేశగౌరవం కాపాడడానికి, జాతి పౌరుషం నిలపడానికి జపాన్ హంతకులను తరిమికొట్టండని పిలుపునిచ్చారు.

యుద్ధంలో సోవియట్ వీరులు విజయాన్ని సాధిస్తారనే విశ్వాసాన్ని ఆనాడే (1942) తెలుగుకవులు ప్రకటించారు.

'సామ్యవాదమున్న దేశమదిరా
స్వతంత్ర సమరం చేస్తున్నదిరా
త్వరలో రష్యన్ యుద్ధము గెలిచీ
విజయపతాకము నెత్తునురా'

అనే ఆత్మవిశ్వాసాన్ని ప్రకటించిన పొన్నాడ కామేశ్వరి (కాకినాడ విజ్ఞాన సమితి)......

'స్వతంత్ర భారత జీవిత నౌకకు
రష్యా మార్గమురా
సోవియటు రష్యా పద్ధతి వినగా
హృదయం హర్షం పొందునుగా'

1. 'ఫేసిస్టు ప్రతికూల గీతాలు'
- ప్రజాశక్తి కార్యాలయం, గవర్నరు పేట, బెజవాడ.

అనడంలో......దేశానికి కేవలం స్వాతంత్ర్యం లభిస్తే సరిపోదు, అది ఏ దిశగా పయనించాలో అది ముఖ్యం. అది రష్యా మార్గం. సామ్యవాదమార్గం. దాని తీరం సామ్యవాదం.

ఇంకా నార్ల చిరంజీవి, కె జి కృష్ణ, వట్టికొండ రంగయ్య, అట్లూరి పురుషోత్తం, కొగంటి గోపాలకృష్ణయ్య, బొల్లిముంత శివరామ్ మొదలైన కవుల గీతాలు కూడా ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రజల్ని చైతన్యపరిచాయి.

1942 నవంబర్‌లో వట్టికొండ రంగయ్య (రంగకవి) 'విప్లవ జ్వాల' (ANTI-FASCIST SONGS) వెలువరించారు రచయితకు ప్రియమిత్రుడైన కామ్రేడ్ చదలవాడ పిచ్చయ్యకు అంకితం చేసిన ఈ గీతికా సంపుటికి తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి 'పీఠిక' రాశారు.

దీనిలో మొత్తం 16 గీతాలున్నాయి. ప్రపంచయుద్ధ స్వభావాన్ని వివరించే గీతాలు కొన్నయితే, ఫాసిజాన్ని ఆక్షేపించే గీతాలు మరికొన్ని. కాంగ్రెస్ పార్టీ తత్వాన్ని విమర్శించే గీతమొకటయితే, కమ్యూనిస్టుపార్టీ పిలుపిచ్చిన ప్రజా యుద్ధానికి జనాన్ని చైతన్య పరిచే గీతం మరొకటి.

'ప్రపంచయుద్ధం ప్రపంచయుద్ధం
తుఫానువలె చెలరేగిందోయ్
ఇటలీ జర్మని అటువైపుననూ
బ్రిటిష్ ప్రభుత్వం ఇటువైపుననూ
ప్రపంచయుద్ధం బ్రహ్మాండముగా
సామ్రాజ్యాశతొ సాగిందోయ్!
సామ్రాజ్యాలకు సాగిందోయ్'

అనే గీతంలో జర్మనీ, ఇటలీ, జపాన్ దేశాలు యూరప్, ఆఫ్రికా, ఆసియా ఖండాలను కబళించే ప్రయత్నాలు ఎలా ప్రారంభించాయో రంగకవి వివరించారు.

'స్వదేశ రక్షణ సాధనకొరకై
శత్రువు నెదిరించుమురా
ఫాసిజశక్తికి భారతవర్షమె
బలివేదికగా నగురా!'

అనే ప్రబోధ గీతంతో ఈ సంకలనం ముగుస్తుంది. ప్రజలను చైతన్య పరచడంలో ఈ గీతాలు తమ వంతు బాధ్యతను నెరవేర్చాయి.

ఇక ప్రజానాట్యమండలి గాయనీ గాయకులు వివిధ కళారూపాల ద్వారా ఫాసిస్టు వ్యతిరేక భావాలను ప్రతిభావంతంగా ప్రచారం చేశారు. ఫాసిస్టు వ్యతి

రేక శిబిరాలను నెలకొల్పారు. దళాలు దళాలుగా బయలుదేరి ప్రజలను చైతన్యపరిచారు. సుంకర సత్యనారాయణ రాసిన 'మిట్టిపడే హిట్లరయ్యా!' గీతం ఊరూరా మారుమోగింది.

'ఓ మిట్టిపడే హిట్లరయ్యా
ఏటికి ఎదురీదుచుంటివా ॥ఓ॥
కూలి రాజ్యం కూలద్రోసి
నీదు రాజ్యం నిలుపబోతే
మంచివీరులు మట్టిగలిశారా ॥ఓ॥
స్టాలినోగ్రాడ్ కాలదన్ని
యూరల్ కొండెక్కబోతే
సేనలన్నీ చెదరిపోయ్యేనా ॥ఓ॥
శీతకాలం రాకముందే
బాకు గనులూ పట్టుకుంటే
నాకె జయమని కలలు గంటివా ॥ఓ॥
కూలిరైతుల పాలి స్వర్గం
నేలమట్టం చేయబోయి
కాలు జారి నేల బడితివా ॥ఓ॥[1]

ఈ గీతంలో స్టాలిన్‌గ్రాడ్‌ను వశపరుచుకున్న హిట్లర్ సేనలు యూరల్ కొండలు ఎక్కబోతే, సోవియట్ సేనలు తిప్పికొట్టిన దృశ్యాన్ని సుంకర ప్రతిబింబింపజేశారు.

అలాగే మరో గీతంలో...

'స్టాలినోగ్రాడ్ దాక - సాగరానిచ్చి నిన్ను
యెర్రసేన చుట్టుముట్టి - గొర్రెకోత కోయుచుండ - హిట్లరూ!
అబ్బ నా కళ్ళు చల్లబడ్డవోయి హిట్లరూ!'[2]

అంటూ ఎర్రసేన పరాక్రమానికి ఎదురు నిలవలేని హిట్లర్ సేనల పరాభవాన్ని చూసి సుంకర తన ఆనందాన్ని ప్రకటించారు.

అదే కాలంలో బాగా ప్రజాదరణ పొందిన మరో గీతాన్ని వేములపల్లి శ్రీకృష్ణ రచించారు. 'రెడార్మీ' శీర్షికతో రాసిన ఈ గీతం ఒక కోలాటం పాట.

'మాస్కో పొలిమేరలోనా మారణ యంత్రాలు నిలిపి
మాడ్చేవేసెరా, రెడార్మీ పూడ్చేవేసెరా

---

1. 'ప్రజాశక్తి' - 10-2-1948.
2. 'ప్రజాశక్తి' - 2-6-1948.

లేసిను గ్రాడులోన శత్రువలయాము చించి
చీల్చివేసెరా, రెడార్మీ కూల్చివేసెరా'[1]

అంటూ కొంతకాలంపాటు జర్మన్ ముట్టడిలో ఉన్న సోవియట్ భూభాగం నుండి జర్మనీ సేనలను సోవియట్ ఎర్ర సైనికులు తరిమికొడుతూ తమ మాతృ దేశాన్ని ఎలా విముక్తం చేశారో వేములపల్లి వర్ణించారు.

అలాగే హిట్లర్‌పై ఆగ్రహాన్నీ, ఎర్రసేనపై గౌరవాన్నీ అనేక జానపద కళారూపాల్లో ప్రదర్శించి; ఆంధ్ర ప్రాంతంలోనూ, జాతీయ స్థాయిలోనూ ప్రత్యేకమైన గుర్తింపు పొందిన ప్రజానాట్యమండలి కళాకారుడు కోగంటి గోపాలకృష్ణయ్య-

'ఓయ్ - హోయ్ - హోయ్ - జపాన్ - హోయ్
ఓయ్ - హోయ్ - హోయ్ - జపానోయి
ఓయ్ హోయ్, జపానోయి.

మలయా బర్మా మ్రింగిన రాక్షసి - భారతభువిపై గలిసెనురా
మత భేదంబులు మాపివేసి - అందరు కలిసి ముందుకు సాగి
హిందూ ముస్లిం సోదరులారా! - ఏకబాట నడుడోయ్
భారతీయుల బానిసజేసే - పక్కలో బల్లేల్ రక్కసి ముక్కల

కత్తుక తరిగి - నెత్తురు త్రాగ
కొడవలి గొడ్డలి - కొంకి కర్రా
కండ్లకు గంతా - కారపుముంతా
కత్తీసుత్తీ - కాడీమేడి
అలుగు అంబూ - పలుగూ పార

పట్టిలేవరా పగతుర నరకర
లేరా అబ్బాస్, రారా సుబ్బాయి
కలవర మోహన్, కదలర యోహన్
శారద సుమతీ, బేగం బీబీ
చిందర వందర శత్రుల దునుమగ
అందరు రావలెగా'

అనే గీతంలో... వందలు, వేలు, లక్షల సంఖ్యలో ప్రజలు గెరిల్లాలుగా మారి జపాన్ సైనికులను తుదముట్టించాలనీ, స్వతంత్ర యుద్ధం సాగించాలనీ, 'గెరిల్లా కేక'ను గళమెత్తి ధ్వనించారు కోగంటి.

---

1. 'రైతుకూలీ పాటలు' — ప్రజాశక్తి ప్రచురణ, మార్చి 1944.

దీంతోబాటు కోగంటి రూపొందించిన 'హిట్లర్ వీధి నాటకం' అనేక ప్రదర్శనలు పొందింది. హిట్లరు, ముసోలినీ, టూజో పాత్రధారుల ఆర్భాటాలను వివరిస్తూ, ఇద్దరు సూత్రధారులు వారిని రంగప్రవేశం చేయిస్తారు. ఆ తరువాత సోవియట్ సేనల చేతిలో వారు పరాజయాన్ని పొందుతూ క్రుంగిపోవడం ప్రదర్శిస్తారు. నాటకాంతంలో ఒక ఎర్ర సైనికుడు హిట్లరును వెంటాడి రంగస్థలమంతా తిప్పితిప్పి కొట్టి భూస్థాపితం చేస్తాడు.

ఇది ఆ వీధి నాటకం ఇతివృత్తం. ఇంత పెద్ద ఇతివృత్తాన్ని హంగులూ, ఆర్భాటాలూ లేకుండా వీథుల్లో ప్రదర్శించడానికి అనువుగా కోగంటి తీర్చిదిద్దారు. ప్రజా నాట్యమండలి కళాకారులు దీనిని అనేక ప్రాంతాల్లో ప్రదర్శించారు.

ఇంకా గొల్లసుద్దులు, కోయవేషం, ఫకీరువేషం, సోదెవేషాల ద్వారా ఫాసిస్టు ప్రమాదాన్ని కోగంటి ప్రజలకు వివరించారు.

'హిట్లర్ పరాభవం' (వీధి భాగవతం-పాటలు) అనే పుస్తకాన్ని ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ ప్రచురించింది.

అలాగే ముక్కామల నాగభూషణంగారి 'కదనభూమి కేగుదాం' మార్చింగ్ గీతం ప్రజా నాట్యమండలి గాయనీగాయకులు పాడుతుంటే ప్రజలు ఉర్రూతలూగిపోయేవారు.[1]

శ్రీశ్రీ 1941 జూన్‌లో సోవియట్ వైమానిక దళం ఎదురుదాడి ప్రారంభించిన వార్తలు విని కదిలిపోయి......

'గర్జించు రష్యా!
గాండ్రించు రష్యా!
పర్జన్య శంఖం పలికించు రష్యా!
దౌర్జన్య రాజ్యం ధ్వంసించు రష్యా!'[2]

అనే గీతంలో...... పుష్కిన్, గొగోల్, షెకోవ్, టాల్‌స్టాయ్, డోస్టోవ్‌స్కీ, గోర్కీ, కూప్రిన్ వంటి రచయితల మాతృభూమి; లెనిన్ తపఃఫలమూఅయిన యునైటెడ్ సోవియట్ సోషలిస్టు రాజ్య విజయాన్ని శ్రీశ్రీ కాంక్షించాడు. కెరటాలుగా పొంగి తిరగబడుతున్న కార్మికులు, కర్షకులు, పీడితులు, తాడితుల్ని అభినందించాడు.

---

1. 'ప్రజానాట్య మండలి రూపొందించిన ఫాసిస్టు వ్యతిరేక కళారూపాలు' (వ్యాసం) —డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, 'విశాలాంధ్ర' (దినపత్రిక) 12-5-1985
2. 'మహాప్రస్థానం' —శ్రీశ్రీ; విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజయవాడ.

1945 మే మాసంలో సోవియట్ వీరసైనికులు జర్మన్ సేనల్ని బెర్లిన్ వరకు తరిమికొట్టడమే కాక, బెర్లిన్ పార్లమెంట్ భవనం (రీచ్‌స్టాగ్ భవనం)పై ఎర్రజెండాను ప్రతిష్టించారు.

దేశదేశాల కవులూ, కళాకారులూ ఈ విజయాన్ని తమ గీతాల్లో గానం చేశారు. కుందుర్తి ఆంజనేయులు 'బెర్లిన్ పతనం' అనే కవిత రాశారు.[1] దాశరథి కృష్ణమాచార్య 'తుదిపరీక్ష' గీతంలో బెర్లిన్‌పై ఎగిరిన అరుణపతాకం ప్రపంచమంతటా ఎర్రని కాంతులను ప్రసరిస్తుందన్నారు.[2]

## శాంతి గీతాలు

రెండవ ప్రపంచ యుద్ధం ముగిసింది. ఫాసిజం ఓడిపోయింది. జర్మనీ నియంత హిట్లర్ దిక్కు మొక్కు లేని చావు చచ్చాడు. తొలి కమ్యూనిస్టు దేశమైన 'సోవియట్ సోషలిస్టు యూనియన్' 2 కోట్ల మంది దేశ ప్రజల్ని బలి యిచ్చి, తన స్వాతంత్ర్యాన్నీ, సోషలిజాన్నీ కాపాడుకుంది. విజయాన్ని సాధించడమేగాక, మరికొన్ని సోషలిస్టు దేశాల ఆవిర్భావానికి దారి చూపింది.

యుద్ధం ముగుస్తున్న కాలంలో అమెరికన్ యుద్ధ విమానాలు జపాన్‌పై బాంబు దాడులు జరిపాయి. హిరోషిమా, నాగసాకి పట్టణాలు ధ్వంసమయ్యాయి. మానవ మారణ హోమంతో చరిత్రలో ఇది మాయని మచ్చగా మిగిలింది.

ప్రపంచ వ్యాప్తంగా రచయితలు, కళాకారులు ఈ విధ్వంసంపట్ల దిగ్భ్రాంతిని వ్యక్తం చేశారు. మరో ప్రపంచ యుద్ధం వద్దంటూ 'విశ్వశాంతి' గీతాలు ఆలపించారు.

తెలుగులో అనిసెట్టి రచించిన 'శాంతి' మూకీ నాటిక విశేష ప్రజాదరణ పొందింది. దేశ, విదేశాల కళాకారుల మన్ననలు పొందింది.

1952 ఫిబ్రవరి 8 న మద్రాస్‌లో అంతర్జాతీయ ఫిలిం ప్రదర్శనోత్సవం జరిగింది. ఆ సందర్భంగా అక్కడి వాణీ మహల్‌లో ఫిబ్రవరి 11 వ తేదీ రాత్రి హరీంద్రనాథ్ చటోపాధ్యాయ అధ్యక్షతన వైజ్ఞానిక ప్రదర్శనలు జరిగాయి. ఆంధ్ర ప్రజా నాట్యమండలి, మద్రాస్ శాఖవారు తమ కళారూపాలను ప్రదర్శించారు. అనిసెట్టి రాసిన 'శాంతి' మూకీ నాటిక, గోపాలస్వామి నృత్యం; కోగంటి రచించిన కష్టజీవి (బుర్రకథ), హిట్లర్ పతనం (వీథి భాగవతం); సుంకర రచించిన సైసై (వీర నృత్యం) ప్రదర్శితమైనాయి. ఈ ప్రదర్శనలకు టి. చలపతిరావు, సి. మోహన్ దాస్ సంగీతాన్ని సమకూర్చారు. తుమ్మల వెంకటరామయ్య కార్యక్రమాన్ని నిర్వహించారు.

1,2. 'ప్రజాశక్తి' 28-5-1945.

ఈ ప్రదర్శనను చూసి ముగ్ధులైన సోవియట్ ప్రతినిధులు, దీనిలోని కొంత భాగాన్ని మరుసటి రోజు వర్ణచిత్రంగా తీశారు.

'నిజమైన భారత దేశాన్ని ఇక్కడ చూస్తున్నాం. ఇలాంటి ఉత్తమ ప్రదర్శనలను ఇంతవరకు చూడలేదు' అని వారు ప్రశంసించారు.[1]

ఈ ప్రదర్శనలను వాడుకుని స్టాలిన్ బహుమతి గ్రహీత లియోనిద్ వార్లమోవ్ నాయకత్వాన 'ఎక్రాస్ ఇండియా' అనే డాక్యుమెంటరీ చిత్రాన్ని సోవియట్ కళాకారులు రూపొందించారు.[2]

ఫాసిస్టు వ్యతిరేక భావాలను విస్తృతంగా ప్రచారం చేసిన 'ప్రజానాట్య మండలి' ప్రపంచ శాంతిని కళారూపాల ద్వారా ప్రజలకు ప్రబోధించింది.

ఆంధ్ర శాంతి సంఘం, విజయవాడ వారు 'శాంతి గీతాలు' సంకలనం వెలువరించారు. దీనిలోని చాలా గీతాలు విశేష ప్రాచుర్యం పొందాయి.

'ఎంత చల్లని కన్నులమ్మా
ఎంత ఎర్రని పెదవులమ్మా
వంతలను మరిపించు నీ దర
హాస చంద్రికలేవి శాంతీ!'

సోమసుందర్ రాసిన 'శర్వరీగీతం'లో శాంతిని వర్ణిస్తూ స్వేచ్ఛారుణ కాంతులతో స్వచ్ఛమైన వెన్నెలలు కురిపించే గగనతలంలో యుద్ధ మేఘాలు ఆవరించవద్దని ఆశించారు.

యుద్ధకాలంలో యుద్ధానికి వ్యతిరేకంగా కలాన్ని పదునుబెట్టిన అనిసెట్టి సుబ్బారావు...

'సంగ్రామం మన శత్రువు
లోకశాంతి మన గమ్యం
జగదేక మహోద్యమం
జయిస్తుంది నిశ్చయం'

సమరాగ్నిలో కాలుతున్న మానవాత్మకు సుస్థిర ప్రశాంతి దొరుకుతుందనే 'శాంతి సంగీతం' ఆలపించారు.

జీవన సౌందర్యాన్ని ప్రేమించే కవులనూ, కళాకారులనూ సంబోధించిన నార్ల చిరంజీవి...

---

1. 'ఫాసిస్టు పైశాచిక నైజాన్ని బహిర్గతం చేసిన తెలుగు రచయితలూ జర్నలిస్టులు' - తుమ్మల వెంకట రామయ్య; విశాలాంధ్ర 11-5-1985.
2. 'UNITY FOR CULTURE' (Journal of I P T A) August, 1952.

'శాంతి మనకు లక్ష్యమంచు
కంఠమెత్తి పాడండీ
పుడమి నుదుట రక్తరేఖ
చెరపండీ, చెరపండీ
పుడమి జనుల కన్నులలో
ఆశలు వెలిగించండీ'1

అంటూ... మానవజాతి జీవనానికి బలిపీఠాలుగా మారిన మారణాస్త్ర యుద్ధాలను ఖండిస్తూ, శాంతిగీతాలు పాడమని ప్రబోధించారు.

'విశ్వశాంతి మన లక్ష్యం
యుద్ధభూమి మన శత్రువు
మనుషులంతా బ్రతకాలని
మన కోరిక, మన కోరిక'

అని రెంటాల గోపాలకృష్ణ తన శాంత్యభిలాషను వెలిబుచ్చారు. దేశం, జాతి, భాష ఏదయితేనేం, మనందరి ఆశయం ఒక్కటే అని ఆయన చాటారు.

ఇదే లక్ష్యాన్ని పునరుద్ఘాటిస్తూ కొడాలి గోపాలరావు, ఆరుద్ర, గుడిమెట్ల భాస్కరరెడ్డి, ముసునూరు శివరామకృష్ణరావు, వరదా బ్రహ్మానందం, సోమరాజు పల్లి చెంచయ్య, కవిరాజమూర్తి, నారపరెడ్డి మొదలైన కవులు శాంతిగీతాలు రచించారు. ప్రపంచ శాంతిని ప్రతిధ్వనింపజేశారు. మరోసారి యుద్ధం ప్రపంచాన్ని దగ్ధం చేయరాదని భావించారు. మానవ భవితవ్యంపై ప్రేమను ప్రకటించారు.

## ఎర్రజెండా పాటలు

తుమ్మల వెంకటరామయ్య రాసిన తొలి ఎర్రజెండా గీతాన్ని గురించి క్రాంతిగీతాల్లో చర్చించాం. తరువాతి కాలంలో కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తితో బాటు అనేక ఎర్రజెండా గీతాలు తెలుగు భాషలో వెలువడ్డాయి. వాటిలో బాగా ప్రఖ్యాతిచెంది, ప్రజల నోళ్ళలో గూడు కట్టుకున్న గీతాలను పరిశీలించవలసి ఉంది.

1954 లో పార్లమెంట్‌లో ఒక సభ్యుడు ఎర్రజెండాను విదేశీయమైనదిగా విమర్శించాడు. అప్పటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ కూడా దాన్ని

1. 'శాంతి గీతాలు' —ఆంధ్ర శాంతి సంఘం, విజయవాడ.

సమర్థించాడన్న వార్తను విని రాంభట్ల కృష్ణమూర్తి, ఒక 'ఎర్రపాట' ను రాశారు.[1]

'ఓట్టీత పండెరుపు - చిలక ముక్కెరుపు
పసిపాప నవ్వెరుపు - పాలబుగ్గెరుపు
...........................
పగడాల దండెరుపు - ప్రత్యూషమెరుపు
రానున్న రేపెరుపు - ప్రాణ కాంతెరుపు
...........................
శ్రమ ఎరుపు క్షమ ఎరుపు - శాంతి సుఖమెరుపు
పాటు పడువారి పోరాటాలు ఎరుపు
...........................
ఎర్రజెండా నాది - ఈ భూమి నాది
నిండు హృదయం నాది - స్నేహితము నాది'[2]

అనే గీతంలో సూర్యోదయం మొదలు సూర్యాస్తమయంవరకు ప్రకృతిలో ప్రత్యక్షమయ్యే 'ఎరుపు'ను, జీవన సౌందర్యానికి ప్రతీకగా నిలిచిన 'ఎరుపు'ను రాంభట్ల వర్ణించారు.

దాదాపు ఇదే పాట చూపిన బాటలో చెరబండరాజు... ...

'కష్టజీవుల నెత్తురెరుపూ
కమ్యూనిస్టు జెండ ఎరుపూ'[3]

అని ప్రారంభమయ్యే గీతం 'ఊపిరి'లో సమాజ సంపదపై శ్రమజీవులకు అధికారం దొరికేదాక, ఎర్రజెండా నీడకింద ఆయుధాలు దించకుండా సాయుధ పోరాటం సాగించమని ప్రబోధించారు.

'ఎరుపు' సూర్యోదయానికి సంకేతం. కానీ కొందరికి ఎరుపంటే భయం. అలాంటి వారిని ఆక్షేపిస్తూ పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి సుబ్బారావు పాణిగ్రాహి రాసిన గీతం గోడలమీద నినాద గీతంగా రూపొందింది.

1. రాంభట్ల కృష్ణమూర్తి గారితో ఇంటర్వ్యూ (1-4-1989)
2. 'శశవిషాణం' గీతాలు—రాంభట్ల కృష్ణమూర్తి (1954) పుట: 46-49 —విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.
3. ఊపిరి (గీతం) - 'చెరబండరాజు కవితలు - పాటలు'. సం: వరవరరావు, పీపుల్స్ బుక్స్, విజయవాడ. (పుట: 79)

'ఎరుపంటే కొందరికి - భయం భయం
పసిపిల్లలు వారికన్న - నయం నయం'[1]

ఈ గీతంలో మన మనసులోనే ఎరుపుందనీ, మన రక్తంలోనూ ఎరుపుందని, ఎరుపులోనే మెరుపుందనీ, పోరాడే శక్తుందనీ ఆ కవి గానం చేశారు.

ఇక 'ఎఱ్ఱజెండా'ను గురించి వెలువడిన కొన్ని ప్రసిద్ధ గీతాలు ఉదహరించడం అవసరం.

ప్రజా నాట్యమండలి కవిగా, కళాకారుడిగా విశేషమైన కృషి చేసిన ముక్కామల నాగభూషణం రాసిన 'ఎఱ్ఱజెండా' గీతంలో......

'వేగరావోయ్ కార్మికా - వేగరావోయ్ కర్షకా
కలిసి మెలిసి పలకవోయ్ - అరుణ పతాకకు జై
జై జై జై - అరుణ పతాకకు జై
కత్తులు దూసుకుపోయినా - నెత్తురుటేరులు పారినా
ఎత్తిన జెండా దించకోయ్ - అరుణ పతాకకు జై ॥అరుణ॥
బాంబుల వర్షం కురిసినా - బారు ఫిరంగులు మ్రోగినా
ఎత్తిన జెండా దించకోయ్ - అరుణ పతాకకు జై ॥అరుణ॥
పీడిత ప్రజల రక్తమున్ - త్రాగెడివారలు బెదరగన్
ఆకసమందున ఎగరెడి - అరుణపతాకకు జై ॥అరుణ॥'[2]

అనే కమ్యూనిస్టు చైతన్యాన్ని వ్యక్తీకరించారు. ఎత్తిన జెండా దించవద్దని ఎలుగెత్తి నినదించారు. 1960 - 70 మధ్యకాలంలో యువజన సమాఖ్య, విద్యార్థి సమాఖ్య ఊరేగింపుల్లో మార్చింగ్ గీతంగా ఈ పాట మారుమ్రోగేది.

'జై యనరా కార్మిక - జై యనరా కర్షకా
జై జైయని జగమంతట జయపతాక నెగరవేస్తూ
జైయనరా జైజైయనరా - జై అరుణపతాకకు జై'[3]

అంటూ సుద్దాల హనుమంతు రాసిన గీతంలో...తరతరాల పీడిత ప్రజల దాస్యబంధాలను తెంచి, మహోన్నత మానవతా సమాజాన్ని నిర్మించే, దారిచూపే జెండాకు జేకొట్టమన్నారు.

---

1. 'పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి పాణిగ్రాహి'
సంకలనం: ఏ. రాంబాబు, విప్లవ రచయితల సంఘం (1982).
2. 'ప్రతిధ్వని' (ఆం. ప్ర. ప్రజానాట్యమండలి పాటలు) చ.ము. 1988
సంకలనం : కె. ప్రతాపరెడ్డి.
3. 'ప్రతిధ్వని' —ఆం. ప్ర. ప్రజానాట్యమండలి పాటలు (పుట 61).

1970 దాకా ముక్కామల, తుమ్మల వెంకటరామయ్యగార్ల ఎర్రజెండా పాటలు అనేక వేదికలపై, జనహృదయ వేదికలపై ప్రతిధ్వనిస్తే, 1970 నుండి ఏటుకూరి ప్రసాద్ రాసిన 'ఎర్రజెండా' పాట ఊరూరా, వాడవాడా మారుమ్రోగుతోంది. ఇప్పటికే అనేక ప్రజాసంఘాల గీతికా సంకలనాల్లో స్థానం సంపాదించుకున్న ఈ గీతంలోని కొన్ని చరణాలు మారి ఇతరుల గీతాల్లో చోటు చేసుకున్నాయి

'ఎర్రజండేరా తమ్ముడ! ఎర్రజండేరా - మనది
ఎర్రజండేరో తమ్ముడ - ఎర్రజెండేరా' ॥ఎర్ర॥[1]

ఈ పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో ప్రపంచవ్యాపితంగా ఎర్రజెండా సాధించిన విజయాలను ఏటుకూరి ప్రసాద్ ప్రజల భాషలో సరళమైన బాణీలో వివరించారు. ఈ కవి రాసిన గీతాలను 'ఎర్రజండా' (పాటలు) పేరుతో ఆం. ప్ర. యువజన సమాఖ్య 1973 మేడేనాడు వెలువరించింది 'ఎర్రబాట' పేరుతో మరో సంపుటి 1975 జనవరిలో వెలుగు చూసింది. ఎర్రజెండా నీడ కింద ఎర్రబాటలో పయనిస్తూ ఎర్రపాటలు స్వయంగా గొంతెత్తి గానం చేసే ఏటుకూరి ప్రసాద్ 'ఎర్రజండా కవి'గా ప్రఖ్యాతి పొందారు

ప్రసాద్ గారిదే మరో గీతం 'ఎర్ర జెండరా, త్యాగాల కండరా' అనే పాట కూడా విశేష ప్రాచుర్యాన్ని పొందింది.

భారత కమ్యూనిస్టు పార్టీ, యువజన సమాఖ్య, విద్యార్థి సమాఖ్య, ఎఐటియుసి కార్మిక సంఘాలు తమ సమావేశాలకు, మహాసభలకు ముందు సభాస్థలిలో ఎర్రజెండాను ఎగరేస్తారు అప్పుడు ప్రజా నాట్యమండలి గాయనీగాయకులు 'ఎత్తరా మన ఎర్ర జెండా' గీతాన్ని ఆలపిస్తారు. ప్రముఖ అభ్యుదయ కవి గజ్జెల మల్లారెడ్డి రాసిన ఈ గీతంలో...

'ఎత్తరా మన ఎర్రజెండా - ఎర్రకాంతులు దిశలు నిండా
ఎత్తరా సంఘర్ష కీలల - అవతరించిన ఎర్రజెండా ॥ఎత్తరా॥
అమరవీరులు వారబోసిన - అరుణ రక్తపుధార సాక్షిగ
సమసమాజము కొరకు పోరే - శ్రామిక విప్లవ దీక్ష సాక్షిగ' ॥ఎత్తరా॥[2]

అంటూ ప్రారంభించి 'గుత్త పెత్తందారి దోపిడి వర్గ దుర్గాల్ దద్దరిల్లగ ఎత్తరా మన ఎర్రజెండా' అని పథనిర్దేశం చేస్తున్నారీకవి.

---

1. 'ఎర్రజండా' (పాటలు) —ఏటుకూరి ప్రసాద్,
ఆం. ప్ర యువజన సమాఖ్య, హైదరాబాద్ ప్రచురణ (1973).
2. 'రణన్నినాదమ్' (విప్లవ గేయ సంపుటి) భారతకమ్యూనిస్టుపార్టీ పదో మహాసభకు కవితా నీరాజనం.
—ఆం. ప్ర. కమ్యూనిస్టు సమితి సాంస్కృతిక ఉపసంఘం ప్రచురణ (జనవరి 1975).

అలాగే మరో గీతంలో...

'ఎవరెన్ని చెప్పినా - ఎవరెంత చెప్పినా
ఎర్రజెండా మనకు అండరా తమ్ముడా
ఎర్రజెండా మనకు అండరా తమ్ముడా!'[1]

అంటున్న మల్లారెడ్డి...'ఉక్కు పిడికిళ్ళెత్తి ఒక్కటై మనమంత గర్జించితే జైలు కటకటా లాగునా? లావా ప్రవాహాన్ని లాఠీలు ఆపునా?' అని సవాల్ జేస్తున్నారు పెట్టుబడిదారీ వర్గంపై తుట్టతుదిపోరు సలపడానికి ఎర్రజెండా మనకు అండగా ఉంటుందంటున్నారు.

1975 జనవరి 27 నుండి ఫిబ్రవరి 2 వరకు విజయవాడ నగరంలో 'భారత కమ్యూనిస్టు పార్టీ' 10 వ జాతీయ మహాసభ జరిగింది. ఈ మహాసభ సందర్భంగా రాష్ట్ర వ్యాపితంగా ఎర్రజెండా జైత్రయాత్ర నిర్వహించబడింది. అప్పుడు ఎర్రజెండా జైత్రయాత్ర గీతాలనేకం వెలువడ్డాయి.

'అదే అదే పతాక జైత్రయాత్ర సాగుతోందిరా
పదే పదే రణానికై నగార మ్రోగుతోందిరా
ధగ ధ్ధగ ధ్ధగ ప్రభన్ - పతాక సాగుతోందిరా
ధిమి ధ్ధిమి ధ్ధిమి ధ్వనిన్ - నగార మ్రోగుతోందిరా'[2]

అంటూ రాంభట్ల కృష్ణమూర్తి రాసిన జైత్రయాత్ర గీతం ఎర్రజెండాతోబాటు ఊరూరా విజయయాత్ర చేసింది. మహారుణ స్రవంతిలా తెలుగు నేల నాలుగు చెరుగులా ప్రవహించింది.

మరో గీతం ఏటుకూరి ప్రసాద్ రాశారు.

'కదిలెనదే ఎర్రజెండ - ప్రజల ఆశయాలు పండ
వాడవాడ జనం ఎదురు రండిరా-అడుగడుగున హారతు
లెత్తండిరా'[3]

ఈ పల్లవితో సాగే 'ఎర్రపాట' అమరవీరుల ఆశయాలను ప్రజలు నెమరేసుకోడానికి తోడ్పడింది.

అలాగే అక్షరాల్లో అగ్ని కురిపించే అభ్యుదయకవి కె. రాజేశ్వరరావు

'నీలి నీలి గగనంలో - నిప్పులు విరబూసెరా
అరుణారుణ కాంతిధార - అవనిపైన కురిసెరా'[4]

---

1. 'రణన్నినాదమ్' (విప్లవ గేయ సంపుటి)
భారత కమ్యూనిస్టుపార్టీ పదో మహాసభకు కవితా నీరాజనం. ఆం. ప్ర. కమ్యూనిస్టుసమితి సాంస్కృతిక ఉప సంఘం ప్రచురణ (జనవరి 1975)

2, 3, 4. 'రణన్నినాదమ్' (విప్లవగేయ సంపుటి).

అంటూ అరుణకాంతి ధారల్ని వర్షించారు. 'గుత్త ధనోన్మత్త శక్తుల' గుండెలదిరేలా గర్జించారు.

ఇకపోతే ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం, రాడికల్ స్టూడెంట్స్ యూనియన్, విప్లవ రచయితల సంఘం, జననాట్యమండలి కార్యక్రమాల్లో ప్రతిధ్వనించే 'ఎర్రజెండా' గీతంలో...

'సుత్తీ కొడవలి గుర్తుగ వున్నా
ఎర్రనిజెండా ఎగురుతున్నదీ
ఆకాశంలో అరుణబింబమై
పీడిత జనాని కండదండగా ॥సుత్తీ॥'1

అనే పల్లవితో ప్రారంభమై, పెట్టుబడులను దోచుకు దాచే ద్రోహుల గుండెల్లో అగ్నికణములను చెరుగుతూ, నిరుపేద జనానికి పెన్నిధిగా పేరెన్నిక గన్న పతాకం వర్ణింపబడింది.

'ఎర్రజెండర్ర జెండన్నియ్యాలో - ఎర్రెర్రనిదీ జెండన్నియ్యాలో
పేదల పాలిటి ఎన్నియ్యాలో - మరి పెన్నిధి ఈ జెండన్నియ్యాలో'2

గీతం విప్లవ విద్యార్థి సంఘాల సమావేశాలకు కొత్త వెలుగులను ప్రసాదిస్తూ ఉంది.

'నక్సల్ బరినుండెన్నియలో - మరి నాలుగు దిక్కూలెన్నియలో
పోరూ సాగంగెన్నియలో - మరి పోరూ మార్గం లెన్నియలో
ఒరిగిన అన్నల కెన్నియలో - మన ఎర్రని దండా లెన్నియలో'

అంటూ సాయుధ పోరాటంలో అసువులు బాసిన అమర వీరులకు ఎర్రని దండాలు పెట్టే గీతమది.

తినడానికి తిండి, కట్టడానికి గుడ్డలేని నిరుపేద జనాన్ని సంబోధిస్తూ సుబ్బారావు పాణిగ్రహి...

'ఎడమచేత పట్టవోయి ఎర్రని జెండా
తుపాకి పట్టవోయి వేరొక చేతా

---

1. 'ఎర్రజండా' (గీతం) — రచయిత పేరు ప్రచురించలేదు.
'జననాట్యమండలి పాటలు', క్రాంతి ప్రచురణలు, సికింద్రాబాద్. మార్చి, 1979.
ఈ పాటను వంగపండు ప్రసాదరావు రాసినట్లు 'విప్లవ గీతాలు' సంకలనంలో ఉంది.
2. 'జననాట్య మండలి పాటలు' - రచయిత పేరు ప్రచురించలేదు.

ఇడుములు రాకుండ ముందు - నడుముకట్టి నిలవవోయ్
చేయి చేయి కలిపి వేగ ముందుకడుగు వేయవోయ్'[1]

అనే గీతంలో మార్క్సు రాసిన సిద్ధాంతాన్ని, లెనిన్ చూపిన ఆశయాన్ని, స్టాలిన్ చూపిన సంకల్పాన్ని ఆదర్శంగా పెట్టుకుని, వర్గరహిత సమాజాన్ని నిర్మించడానికి ఎడమచేత్తో ఎర్రని జెండా, కుడిచేత్తో తుపాకిపట్టి నడవమని పోరాట మార్గాన్ని నిర్దేశించారు. ఆ వీరుడే మరో గీతంలో...

'ఓ అరుణ పతాకమా! చేకొనుము మా రెడ్ శాల్యూట్
శ్రమజీవుల సంకేతమా! నీకిదిగో రెడ్ శాల్యూట్'[2]

అంటూ మృతవీరుల త్యాగాల ప్రతీకగా నిలిచిన అరుణ పతాకానికి అరుణాంజలి ఘటించారు.

ఇంకా ఇక్కడ ప్రస్తావించని ఎన్నో ఎర్రజెండా పాటలు ప్రజల ఎదల్లో పోరాటపు ఊపిర్లు పోస్తున్నాయి. తిరుగుబాటు తత్వాన్ని ప్రబోధిస్తున్నాయి.

## అమర వీరుల స్మృతిగీతాలు

మన దేశంలో 'కమ్యూనిస్టు ఉద్యమం' ప్రారంభమైన నాటి నుండి నేటి వరకు కొన్ని వేలమంది వీరులు అమరులయ్యారు. కొందరు పోరాటంలో నేల కొరిగితే, మరి కొందరు పోలీసుల తుపాకుల గుళ్ళకు బలయ్యారు. ఇంకా కొందరు బూటకపు ఇన్‌కౌంటర్లకు, పోలీసుల చిత్రహింసలకు గురయి, ప్రాణా లొదిలారు. వీరిని స్మరిస్తూ వామపక్ష కవులు వందలాది స్మృతిగీతాలు (Elegies) రాశారు.

కొన్ని గీతాల్లో అమర వీరుల పేర్లు లేకుండా, అమరులందర్నీ స్మరించడం కనిపిస్తుంది. మరి కొన్ని గీతాల్లో అమరవీరుల్లో ప్రముఖంగా కనబడు తున్న వారి పేర్లు ప్రస్తావించబడ్డాయి ఇంకా కొన్ని గీతాలు ఒకే ఒక వీరుడ్ని స్మరిస్తూ, అతని పోరాట నిబద్ధతనీ, త్యాగాన్నీ కొనియాడుతూ అక్షరాంజలి ఘటించినవి కనబడుతున్నాయి

వందలాదిగా వెలువడిన పాటలన్నింటినీ ఇక్కడ పేర్కొనడం సాధ్యం కాదు కాబట్టి బాగా ప్రాచుర్యాన్ని పొందిన కొన్ని గీతాలను తీసుకొని పరిశీలించడం జరుగుతున్నది.

మృతవీరులకు 'లాల్ సలామ్' చెప్పిన రాంభట్ల కృష్ణమూర్తి గారి గీతంలో...

---

1,2. 'విప్లవ గీతాలు' - ప్రొలిటేరియన్ లైన్ ప్రచురణలు, హైదరాబాద్ (మార్చి 1982).

'మృతవీరులారా లాల్ సలాం - ఇదే మా లాల్ సలామ్
లాల్ సలాం - లాల్ సలాం ॥మృత॥
దరిలేని బానిస చాకిరీ - నరహంతకుల గుండాగిరి
ఇక వద్దని ఇవి రద్దని - పోరాడి నేలకు ఒరిగినా
రణధీరులారా లాల్ సలాం - లాల్ సలాం - లాల్ సలాం ॥మృత॥
మతమూఢ విశ్వాసాలను - కులజాతి విద్వేషాలను
నిరసించుతూ ఎదిరించుతూ - పోరాడి నేలకు ఒరిగినా
యువకూరులారా లాల్‌సలాం - లాల్‌సలాం - లాల్‌సలాం ॥మృత॥
శ్రమశక్తి దోపిడీదారుని - సమరాల గుత్తకుబేరుని
అరికట్టుతూ-హతమార్చుతూ-పోరాడి నేలకు ఒరిగినా
శ్రమజీవులారా లాల్‌సలాం - లాల్‌సలాం - లాల్‌సలాం ॥మృత॥
చిరశాంతి భువి నిండాలనీ - నరజాతి కల పండాలనీ
యుగ స్రష్టలై కమినిష్టులై - పోరాడి నేలకు ఒరిగినా
ధృవతారలారా లాల్‌సలాం - లాల్‌సలాం లాల్‌సలాం' ॥మృత॥[1]

బానిస చాకిరీకి, మత మూఢ విశ్వాసాలకు, కుల జాతి విద్వేషాలకు, పెట్టుబడిదారీదోపిడీకి వ్యతిరేకంగా పోరాడుతూ నేలకొరిగిన వీరులకు లాల్‌సలాం సమర్పించడం జరిగింది.

మరొక వామపక్షకవి అమరవీరులకు లాల్‌సలాం చేస్తూ......

'నిదురించే మనజాతిని - కదిలించిన వీరులార!
స్వేచ్ఛకొరకు కదనానికి - నడిపించిన ధీరులార!
కాలం కంటే ముందుకు - నడిచిన యుగతారలార!
ఎర్రెర్రని వందనాలు - అందుకోండి లాల్‌సలాం'[2]

అనే గీతంలో తెల్లపాలనకూ, నిజామ్ రాజరికానికీ, భూస్వామ్య దోపిడికీ, ధనస్వామ్య పీడనకూ వ్యతిరేకంగా పోరాడుతూ నలిగిన జనశ్రేణులకు ఎర్రెర్రని వందనాలు చేశారు.

మరోగీతంలో......

'ఉద్యమాలు ఊపిరిగా - పోరాటం ప్రాణంగా
కమ్యూనిజం సాధనలో - కనుమూసిన వీరులార!
అన్నలారా! మీకూ - మా ఎర్రదండాలు
అమరులారా! మీకూ - ఎర్రెర్ర దండాలు'[3]

---

1. 'విశాలాంధ్ర' (తెలంగాణా సాయుధ పోరాటం 40 వ వార్షికోత్సవం ప్రత్యేక సంచిక) 2-11-1987.

2,3. 'ఎర్రజెండా పాటలు' (భారత కమ్యూనిస్టు పార్టీ 60 వ వార్షికోత్సవం

అంటూ ఉద్యమాల్లోనే తొలి ఊపిరి విడిచిన కామ్రేడ్లందరికీ ఈ కవి ఎర్రెర్ర దండాలు సమర్పించారు.

ఆట, పాట, మాటల విశిష్ట సమ్మేళనం గద్దర్. విప్లవ గీతాలకు ఒరవడి దిద్దిన ఐదుగురు అగ్రశ్రేణి కవిగాయకుల్లో గద్దర్ ఒకరు.

'భూమికోరకు భుక్తికోరకు మనదేశ విముక్తికోరకు
సాగే ప్రతిపోరులోన - సాహసులై పోరాడిన
విద్యార్థి వెలుగులార - వీరులార శూరులార
కోట్లాది శ్రమజీవుల - లాల్ సలామ్ లాల్ సలామ్'[1]

ఈ గీతంలో... ప్రజాయుద్ధ పంథాకు ప్రాణమై వెలుగుతూ సాయుధ పోరాటానికి సమిధలైన వీరులందరికీ గద్దర్ పేరుపేరున లాల్‌సలాం చెప్పారు.

మరోగీతంలో ఒక అజ్ఞాతవాసి కూడులేని కూలోళ్ళకు, గూడులేని పేదోళ్ళకు తిరగబడే దారిని చూపుతూ, ఉసురర్పించిన అమరవీరులకు...

'జోహార్లు జోహార్లురా - ఓ అన్నలార!
మా విప్లవ జోహార్లురా - మా అన్నలార!
ఎర్రెర్రని జోహార్లురా'[2]

అంటూ దాదాపు 81 మందికి పైగా వీరుల పేర్లను స్మరిస్తూ జోహార్లు చెప్పారు.

విప్లవ రచయితల సంఘం రూపొందుతున్న తొలి దశలో విప్లవ కవిత ఎలా ఉండాలి? అనే అంశంపై తర్జన భర్జనలు జరిగాయి. కవితారూపం విషయంలో అప్పటికే శ్రీశ్రీ కొన్ని విచిత్ర వాదాలను లేవదీసి ఉన్నారు.[3]

శ్రీకాకుళ రైతాంగ తిరుగుబాటుకు పాటలు నేర్పుతున్న చాగంటి భాస్కరరావు మరణవార్త వెలువడింది అప్పుడు మెదక్ జిల్లాలోని ఒక

---

సందర్భంగా వెలువడిన సంకలనం - విజయలక్ష్మి స్మారకట్రస్ట్ ప్రచురణ

1. 'గద్దర్ పాటలు' - జననాట్య మండలి ప్రచురణ.
2. అరుణ కిరణాలు (ప్రజల పాటలు) అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ (1989).
3 పద్యం ఫ్యూడలిజానికి, గేయం కాపిటలిజానికి, వచనం సోషలిజానికి సంకేతాలన్నారు శ్రీశ్రీ. గీయమానమైన గేయమే, కొద్ది మార్పులతో గీతమవుతుంది. ఇది విప్లవ సాహిత్య ప్రకటనకు వాడవచ్చునా? లేదా? అనేది అప్పటి చర్చ... అప్పుడు రాజ్యమేలుతున్న వచన కవితా ప్రభావం అటువంటిది.

గ్రామంలో ఉన్న కె. జి. సత్యమూర్తి (శివసాగర్) అక్కడ పీర్లపండుగ సందర్భంగా గ్రామస్తులు 'ధూలా' ఆడుతూ 'నరుడో - నారపరెడ్డి' అనే పాట పాడుతున్నారు. 'ధూలా' ఒక సామూహిక నృత్యవిశేషం. ఆటా, పాటా కలిసిన ఆనాటి ఆవేశగీతాన్ని విన్న సత్యమూర్తి గుండెలో చాగంటి భాస్కరుడు కదలాడాడు. గొంతులో 'నరుడో! భాస్కరుడా!' గీతం మెదిలింది. తర్వాతి కాలంలో అడవిలో ఉంటున్నప్పుడు నర్సిరెడ్డి అనే కామ్రేడ్ ద్వారా అక్కడి చెట్ల పేర్లు, చిలుకల పేర్లు తెలుసుకున్నాడు. అవన్నీ విప్లవానికి సంకేతాలుగా కనబడ్డాయి. ఆ ప్రేరణతో...

'సర్రెంగ సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
కన్నెరసేస్తివయ్య నరుడో! భాస్కరుడా!
కన్నెరసేసి నీవు నరుడో! భాస్కరుడా!
కదనాన దూకితివా నరుడో! భాస్కరుడా!
బర్రెంక సెట్టుకింద నరుడో! భాస్కరుడా!
బందూకు పట్టివయ్య నరుడో! భాస్కరుడా!
బందూకు సేతబట్టి నరుడో! భాస్కరుడా!
బంధాలు తెంచివయ్య నరుడో! భాస్కరుడా!'[1]

అని సాగే గీతం రూపుదిద్దుకున్నది. శివసాగర్ పేరుతో ప్రచారమైన ఈ గీతం విప్లవ రచయితల సంఘానికీ, జననాట్యమండలికీ ఉత్తేజ గీతంగా మారింది. కొత్తబాటను విప్లవకవితా మార్గంగా రూపొందించింది.

దీనిలో వర్ణింపబడిన 'భాస్కరుడు సర్వనామం కాదు. కాలేదు. ఈ దేశంలో వర్తమానాకాశంలో ఉదయిస్తోన్న నూతన మానవునికి మహోజ్వల సంకేతం భాస్కరుడు. భాస్కరుల్ని మింగిన రాహువులు నిజాన్ని దాస్తారు. ప్రజలు భాస్కరుని బాటనే పయనిస్తారు. భాస్కరుడు ఆచంద్రతారార్కం అజరామరం'.[2]

శ్రీకాకుళం గిరిజనోద్యమ నిర్మాతల్లో ఒకరైన వెంపటాపు సత్యం మరణ వార్తను విన్న సత్యమూర్తి 'సత్యం చావదు'(డు) అనే కవిత రాశారు మైదానాలను మేల్కొల్పిన సత్యం చావదు. అది జనమై, ప్రభంజనమై, ఖడ్గ సంగీతమై, యుగసంకేతమై కలకాలం నిలుస్తుందని విషాదానికి వీడ్కోలు పలికి విప్లవశంఖం పూరించారు.

---

1. 'ఉద్యమం నెలబాలుడు' — శివసాగర్.
   సృజన ప్రచురణలు, హనుమకొండ (1983).
2. 'నరుడో భాస్కరుడా!' గీతానికి ముందున్న వివరణ.

దేశవ్యాపితంగా సంచలనం సృష్టించిన ఉదంతం భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరితీత. 1974 లో ఈ ఇద్దరు నక్సలైట్లను ప్రభుత్వం ఉరితీసిన సంఘటనతో చలించిపోయిన చెరబండరాజు 'లాల్ సలామ్' గీతం రాశారు

'కమ్యూనిస్టు కిష్టగౌడ కామ్రేడా భూమయ్యా
అందుకోండి పేదప్రజల
ఆరాటపు లాల్ సలామ్
పోరాటపు లాల్ సలామ్
గుండె గుండె లాల్ సలామ్-కొండ కొండ లాల్ సలామ్'1

ఈ గీతంలో... చారు మంజుదార్ చూపిన పోరు మార్గంలో వీర గెరిల్లాలుగా సాయుధ సమరాన్ని సాగించిన ఈ విప్లవ యోధులకు యువకులు, రైతులు, అన్నయ్యలు, చెల్లెమ్మలు లాల్ సలామ్‌ను అందించారు.

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు - లెనినిస్టు) ప్రధాన కార్యదర్శి కా॥ చంద్ర పుల్లారెడ్డి మరణించినప్పుడు, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, ఆం. ప్ర. వారు. 'చంద్ర పుల్లారెడ్డి స్మారక పాటలు, కవితలు' వెలువరించారు. ఈ కమ్యూనిస్టు నాయకునిపై ప్రజాకవులు రాసిన 24 పాటలను దానిలో పొందుపర్చారు.

'ఎవ్వరయ్యా అన్నదీ - నీవు మరణించావనీ
ఎరుగరయ్యా వారలూ - చిరంజీవివి నీవనీ...
విప్లవమ్ము చిరంజీవి - ప్రజాపోరు చిరంజీవి
ప్రజాపోరుకు మరోపేరు - చంద్ర పుల్లారెడ్డి...'2

అంటున్న వై. కాశీపతి గీతం ఈ పుస్తకానికే తలమానికం ప్రతిఘటన పోరాటం, వ్యావసాయిక విప్లవం, వర్గ పోరాట స్వభావం వంటి అంశాలపై చంద్ర పుల్లారెడ్డి దృక్కోణాలను ఈ స్మృతి గీతాల్లో కవులు వర్ణించారు.

పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి పాణిగ్రాహి గీతాలతో బాటు, అతని ఉద్యమ జీవితాన్ని పరిచయం చేస్తూ విరసం విజయనగరం యూనిట్ ఒక స్మృతి సంచికను వెలువరించింది.

1975 నవంబర్ 5 వ తేదీనాడు నక్సలైట్ నాయకుడు నీలం రామచంద్రయ్యను, ఉస్మానియా యూనివర్సిటీ విద్యార్థి నాయకుడు (పి. డి. యస్. యు.

---

1. 'చెరబండరాజు కవితలు - పాటలు.'
2. 'కా॥ చంద్ర పుల్లారెడ్డి స్మారక పాటలు, కవితలు'.
అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, ఆం. ప్ర. ప్రచురణ.

విద్యార్థి సంఘ స్థాపకుల్లో ముఖ్యుడు) జంపాల ప్రసాద్‌ను విజయవాడలో పోలీసులు అరెస్టు చేశారు. ప్రాణాలు ఇల్లెందు అడవుల్లో కాల్చి చంపారు 1

ఇలా చంపబడిన నీలం రామచంద్రయ్య జీవితచరిత్రను బుర్రకథ + హరికథలను కలిపి ఒక కొత్త కళారూపంలో 'విప్లవయోధుడు' పేరుతో కానూరి వెంకటేశ్వరరావు రచించారు. 1980 మే మాసంలో ఈ కళారూపాన్ని 'అరుణోదయ సాంస్కృతిక సంస్థ' ప్రచురించింది.

1980 ఫిబ్రవరి 8వ తేదీన అర్ధరాత్రి సంఘ వ్యతిరేక శక్తులు సజీవంగా దహనం చేసిన విప్లవ రచయిత 'జ్ఞానేశ్వర్ కీర్తి' రాసిన పాటలతోబాటు ఆ అమరవీరుని స్మృతిలో ఇతర కవులు రాసిన ఎలిజీలు కలిపి 'విప్లవాల జ్ఞాని' పాటల సంకలనాన్ని విరసం వరంగల్ యూనిట్ ప్రచురించింది. 1981 ఫిబ్రవరి 9న విడుదలైన ఈ పుస్తకం జ్ఞానేశ్వర్ కీర్తి విప్లవాశయాలకు నివాళు లర్పించింది.

విప్లవ కవి చెరబండరాజు బ్రెయిన్ ట్యూమర్ వ్యాధితో బాధపడుతూ మృత్యువుతో పోరాడుతూ ఓడిపోయాడు. ఆ నిబద్ధకవి స్మృతి గీతాలనూ, స్మృతి వ్యాసాలనూ కలిపి 'ఎక్స్‌రే' పత్రిక 'చెరబండరాజు సంస్మరణ సంచిక'(సెప్టెంబర్, అక్టోబర్ 1982)ను వెలువరించింది.

మాటల్లో మంటల్నీ, పాటల్లో ఈటెల్నీ, కవితల్లో సలసలకాగే చమురునే కాదు- ఉష్ణ రక్తకాసారాన్ని ప్రసరింప జేసిన ప్రజాకవి శ్రీశ్రీ 1983 జూన్ 15న తుది శ్వాస విడిచారు. అప్పుడు దిగ్భ్రాంతులైన తెలుగు కవులు శ్రీశ్రీపై రాసిన స్మృతి గీతాలను 'ఆంధ్రజ్యోతి' వారపత్రిక (8-7-1983), 'ఎక్స్‌రే' ప్రత్యేక సంచిక (మే, జూన్ 84). భిలాయ్‌లోని 'చేతన' సాహితీ సంస్థ 'చేతన' (శ్రీశ్రీ సంస్మరణ సంచిక, ఆగష్టు 83), ఇంకా అనేకానేక దిన, వార, మాస పత్రికలు ప్రచురించాయి. ప్రతి యేడూ శ్రీశ్రీ వర్ధంతి సందర్భంగా ప్రత్యేక సంచికలు వెలువడుతున్నాయి. జనహిత సాహిత్య సమితి, కరీంనగర్‌వారు శ్రీశ్రీ స్మృతిలో 'జన హిత' కవితా సంకలనం (డిసెంబర్ '83) వెలువరించారు.

ప్రగతిశీల విద్యార్థి ఉద్యమ చరిత్రలో నెత్తుటి చేవ్రాలు రాసిన 'దస్సా చేరాలు' అనే విద్యార్థి నాయకుని పై సిద్ధాంత విభేదాల మూలంగా రాడికల్ విద్యార్థి సంస్థవారు 1985 ఆగష్టు 24 నాడు దాడిచేసి కొట్టారు. దానితో మరునాడు 11-45 కు అతడు మరణించాడు. అతని ప్రథమ వర్ధంతి సందర్భంగా

1. 'విప్లవయోధుడు' (నీలం రామచంద్రయ్య జీవిత చరిత్ర) రచన: కానూరి వెంకటేశ్వరరావు(అరుణోదయ సాంస్కృతికసంస్థ ప్రచురణ, పుట: 22)

1986 ఆగష్టులో 'ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం' వరంగల్ జిల్లా కమిటీ ఒక పుస్తకాన్ని ప్రచురించింది దానిలో...

'సూరీడు ఏనాడూ సీకటి అయ్యేనా?
పున్నమి సెంద్రుడూ ఎన్నెల మానేనా?
నింగిలో సుక్కలూ నేలను రాలేనా?
గుండెల్లో చేరాలూ గురుతులు మానేనా?'[1]

అంటూ విద్యార్థి రచయితలు రాసిన స్మృతులను పదిలం చేశారు

'చితిలోన నుసి చేసినా
చావు మాకు లేదంటూ
అగ్నుల కెరటాలు చాచి
నిప్పుల పిడికిళ్ళు ఎత్తి
ఎదఎదలో ప్రమోగుతున్న విప్లవ జేగంటలై
దోపిడి రక్కసిని కాల్చే చితి మంటలై
మండుతున్న వీరులకు
అమరులైన అన్నలకు
అంకితం'[2]

చేస్తూ ... ఆం. ప్ర. ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం 'అమర వీరుల స్మారక సంచిక' (14 ఏప్రిల్ 1985)ను ప్రచురించింది.

వరంగల్ జిల్లాలోని హసన్‌పర్తిలో కమ్యూనిస్టు ఉద్యమవ్యాప్తికి పాటుపడుతున్న పాడి మల్లారెడ్డిని పాలకవర్గానికి చెందిన గూండాలు హత్య చేశారు. ఆ నాయకుడిని స్మరిస్తూ వరంగల్ ప్రజానాట్యమండలి గాయకులు ..

'జగమెరిగినవాడా! ఓ అన్న మల్లారెడ్డన్నా
జగమిడిసీ ఎల్లినవన్నో ఓ మల్లారెడ్డి
జగమిడిసీ ఎల్లినవన్నో ఓ మల్లారెడ్డి'[3]

అనే గీతాన్ని గానం చేశారు. ఈ పాట ఈనాటికీ వరంగల్ జిల్లా అంతటా ప్రతిధ్వనించడమే గాక...

---

1. 'విద్యార్థి ఉద్యమచరిత్రలో నెత్తుటి చేత్రాలు కా॥ చేరాలు'
—ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం ప్రచురణ.
2. 'అమరవీరుల స్మారక సంచిక'
—ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం ప్రచురణ.
3. వరంగల్ ప్రజానాట్యమండలి దళం పాడుతున్న ఈ గీతాన్ని రాసిన రచయిత పేరు తెలియలేదు.

'కాలేజీ కుర్రవాడ! కులాసాగ తిరిగెటోడ'

అనే గీతాన్ని గుండవరపు సుబ్బారావు రాయడానికి కావలసిన బాణీని సమకూర్చింది.

భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్యపై వామపక్ష కవులు రాసిన స్మృతిగీతాలు 'ఆంధ్ర ప్రజానాట్యమండలి' వారి 'మనపాటలు' (సంకలనం)లో పొందుపరిచారు.

ప్రజానాట్యమండలి వారి 'ప్రతిధ్వని'లోనూ, విజయలక్ష్మి స్మారక ట్రస్టు వారి 'ఎర్రజెండా పాటలు' (సంకలనం)లోనూ ఆరుట్ల రామచంద్రారెడ్డి మొదలైన కమ్యూనిస్టు వీరయోధులపై; డా॥ రాజారావు, సుంకర, సి. మోహనదాస్ మొదలైన ప్రజా కళాకారులపై రాసిన స్మృతిగీతాలు ప్రచురితమయ్యాయి.

విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవయుగ, యువజన, అభ్యుదయ, సృజన, అరుణతార, ప్రజాసాహితి, మిలిటెంట్ మొదలైన పత్రికల్లో వందలాది అమర వీరుల స్మృతి గీతాలు అచ్చయ్యాయి.

ప్రజోద్యమాలలో క్రియాశీలంగా పాల్గొంటూ, ఉద్యమాలకే ఊపిరులూదిన అమర వీరులను స్మరించడం; విషాదాన్ని ప్రకటించడమే కాక విప్లవాశయాలకు పునరంకితం కావాలన్న ప్రతిజ్ఞ చేయడం ఈ స్మృతిగీతాల్లో ప్రధానంగా కనబడుతుంది. ప్రజల కళ్ళల్లో కన్నీళ్ళనూ, గుండెల్లో పోరాట నిబద్ధతనూ నింపగలుగుతున్న ఈ గీతాలు వామపక్ష భావాల వ్యాప్తికి దోహదం చేస్తున్నాయి.

## పార్టీ ప్రచార గీతాలు

వామపక్ష పార్టీలు నడుపుతున్న పోరాటాల్లో వాటి ఆశయాలను, ఆదర్శాలను వ్యక్తీకరించే పాటలు వెలువడుతూనే ఉంటాయి. అయినప్పటికీ ఈ పార్టీలను గురించి, పార్టీల సిద్ధాంతాలను గురించి ప్రజలకు పరిచయం చేయడానికి ప్రగతిశీల కవులు 'పార్టీ ప్రచారగీతాలను' కూడా రాస్తుంటారు. సమావేశాల్లో, సభల్లో, ఊరేగింపుల్లో ఈ ప్రచారగీతాలు ఊపందుకుంటూ ఉంటాయి.

'పదండి పీడిత మానవులారా!
పదండి శ్రామిక సైనికులారా!
కార్మిక వర్గపు అగ్రదళం మన
కమ్యూనిస్టు పార్టీ పిలిచింది
ప్రభంజనంలా మహోధృతంగా
ప్రజానీకమే కదిలింది ॥పదండి'॥[1]

1. 'రణన్నినాదమ్' (విప్లవగేయ సంపుటి).

అనే 'పిలుపు'లో...సమ్మెలు, హర్తాళ్ళు, బంద్, ఘెరావో వంటి సమస్త రీతుల పోరాటాల్లో కాకలు తీరిన కార్మిక యోధులను కమ్యూనిస్టు పార్టీ ఆహ్వానిస్తున్నదని గజ్జెల మల్లారెడ్డి వివరిస్తున్నారు

వామపక్ష ప్రజాతంత్ర శక్తులు జరుపుతున్న పోరాటాల మలుపులన్నింటిలో ప్రతిస్పందిస్తూ కనిపించే అభ్యుదయకవి మల్లిక్.

'కమ్యూనిస్టుపార్టీ అంటె - కష్టజీవి పార్టిరా
విప్లవాన్ని తెచ్చితీరు - ఎర్రజెండ పార్టిరా'[1]

అంటూ ... చీలిక వాదాలు ఉద్యమానికి ఎన్ని చికాకులు కల్పించినా, శ్రామికవర్గ కవచమైన ఐక్యతను నిలబెట్టమని ఉద్బోధిస్తున్నారు.

'కూలినాలి జనుల - కూటమిగ నిలబెట్టి
జాలిబతుకుల్లోన - జ్వాలలను రగిలించి
కదిలినడిపే పార్టిరా - మన పార్టి
కమ్యునిస్టూ పార్టిరా'[2]

అనే గీతంలో యువకవి చైతన్య ప్రసాద్ కుల, మత, ప్రాంతీయ దురహంకారాలకు వ్యతిరేకంగా పార్టీ నడిపిన పోరాటాలను వర్ణించారు.

భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడి 60 సంవత్సరాలు పూర్తయ్యాయి. 1985 డిసెంబర్ 26 న దేశమంతటా పార్టీ వజ్రోత్సవాలు జరిగాయి. ఈ సందర్భాన్ని పురస్కరించుకుని ప్రముఖకవి సోమసుందర్...

'అగ్నిగుండంలోన పడి నడిచి వచ్చింది
అరువదేడుల చరితరా - మన పార్టీ
అమరవీరుల సాక్షిరా'

అనే గీతంలో 'అరవయ్యేళ్ళ చరిత్ర'ను అద్దంలో కొండలా 6 చరణాల్లో ప్రదర్శించారు.

ఇదే సందర్భాన్ని పురస్కరించుకుని యువ కమ్యూనిస్టు కవి కె. రాజేశ్వరరావు...

'పుడమితల్లి పొత్తిటిలో - పుష్పించిన మందారం
అంధ తమో వారాసిని - ప్రభవించిన అంగారం!

1. 'ప్రతిధ్వని' (ప్రజానాట్యమండలి పాటలు).

జనించింది నా పార్టీ - శ్రమజీవుల కాయుధమై
అగణిత పీడిత జనగణ - ఆశయ ప్రతిరూపమై'1

అంటూ ప్రారంభించి 115 పాదాల దీర్ఘ గీతాన్ని రాశారు. సైనిక బలగాలు, పాలకుల శాసనాలు, చెరసాలలు, ఉరికొయ్యలు పార్టీ పురోగమనాన్ని ఆపలేవనే దృఢ సంకల్పాన్ని చాటి చెప్పారు

ఇప్పుడు రాష్ట్రమంతటా యువజన విద్యార్థులు, కార్మిక కర్షకులు ఉత్సాహంగా పాడుకుంటున్న పార్టీ ప్రచార గీతం 'ప్రజోద్యమాలనేత' శీర్షికన 1985 డిసెంబర్‌లో 'విశాలాంధ్ర' పత్రికలో ప్రచురితమయింది.

'శ్రమజీవుల పోరులోన - ఉద్యమాల హోరులోన
ఎర్రజెండ నీడకింద - ఎదురు తిరుగు జాడలోన
పుట్టిన పులిబిడ్డరో - భారత కమినిస్టు పార్టి
ప్రజల జీవగడ్డరో - భారత కమినిస్టు పార్టి' ॥శ్రమ॥

ఈ పల్లవితో ప్రారంభమై - తెల్ల దొరలను తరిమికొట్టిన ఉక్రోషంగా, నిజామ్ నవాబుకు గద్దె దింపిన తిరుగుబాటుగా, ధన స్వాములపై ధ్వజమెత్తే ఉద్రేకంగా, భూస్వాముల పీడనపై బుసకొట్టే ఉద్వేగంగా 'పార్టీ' వర్ణింపబడింది.

'దిక్కుమొక్కులేని జనం - ఒక్కొక్కరు అగ్నికణం'

అనే విప్లవ తీవ్ర నినాదాన్నందించిన ప్రజాకవి పాణిగ్రహి...

'కష్టజీవులం మేము కమ్యూనిస్టులం
ఔనన్నా కాదన్నా అదే యిష్టులం'

అనే గీతాన్ని రచించారు. ఊరూరా వాడవాడా విశేష ప్రచారాన్ని పొందిన ఈ గీతంలోనే...

'అరెస్టులను సాగించి - ప్రజాశక్తి నడ్డలేరు
అరచేతిని అడ్డుపెట్టి - సూర్యకాంతి నాపలేరు'

అని ఎలుగెత్తి నినదించారు. పాలక వర్గాలను, పోలీసు అధికారులనూ హెచ్చరిస్తూ ఈ నినాదంలో కవితానాదాన్ని ప్రతిధ్వనింపజేశారు.

నక్సలైట్ ఉద్యమంతో మమేకమై, సాయుధ పోరాట వాణిగా తన గళాన్ని పలికించిన కవి చెరబండరాజు. 1974 లో 'సికింద్రాబాదు కుట్రకేసు'లో అండర్ ట్రెయిల్‌గా జైళ్ళో ఉన్నప్పుడు...

1. 'విశాలాంధ్ర' (భారత కమ్యూనిస్టుపార్టీ వజ్రోత్సవ సంచిక 26-12-1985).

బోల్షివిక్కు వారసులం - నక్సల్‌బరి బిడ్డలం
జనచైనా వెలుగులలో - నడుస్తున్న వారలం
పీడిత జనముక్తి కొరకు పోరుతున్న పేదలం
శ్రీకాకుళ రైతాంగం - చేతిలోని కత్తులం
అమరజీవి పాణిగ్రహి - అన్నయ్యకు తమ్ములం
ప్రజాయుద్ధ పల్లవిని - పాడుతున్న రచయితలం
పాలక వర్గాల బట్టి - సాయుధంగ గూల్చెదం
విప్లవాన్ని రుద్ర అనే - శత్రుగోత కట్టెదం'

అంటూ ప్రజాయుద్ధ నినాదంతో సాయుధ పోరాటాన్ని కొనసాగిస్తున్న నక్సల్‌బరి బిడ్డల ఆశయాన్ని అక్షరాల్లో పొదిగారు

ఇదే భావాన్ని మరో అజ్ఞాత కవి...

'నక్సల్ బరి పుత్రులం - శ్రీకాకుళం వీరులం
తెలంగాణ వారసులం - కమ్యూనిస్టు పౌరులం'

అనే పల్లవితో ప్రారంభించి 'రైతుకూలీల చేతుల్లో పనిముట్లమయి మ్రోగుతామనీ, ప్రజాతంత్ర విప్లవాన్ని తుదికంటా కొనసాగిస్తా'మనీ ప్రతిజ్ఞ చేస్తున్నాడు.

ఇలా ఎందరో కవులు తమ పార్టీ ఆశయాలను గీతాలుగా మలచడమేగాక, చెమటోడ్చి బ్రతుకీడ్చు శ్రమజీవులందరికి వెన్నుదన్నుగ నిలిచి ఉన్న తమ పార్టీని కనుపాపలా కాపాడుకోవాలని ప్రబోధించారు. పార్లమెంట్, అసెంబ్లీ ఎన్నికల సందర్భాల్లో కూడా పార్టీ ప్రచారగీతాలు వెలువడుతూ ఉంటాయి.

## వామపక్ష గీతాల్లో 'దేశభక్తి'

మాతృదేశం మీద అపారమైన అభిమానం, దేశ ప్రజల జీవితాలు బాగుపడాలన్న ఆకాంక్ష; దేశంలోని మట్టినుండి మాణిక్యాలను సృష్టిస్తున్న కార్మికులపై, కర్షకులపై పక్షపాతదృష్టి వామపక్ష గీతాల్లో ప్రధానాంశాలుగా కనబడుతున్నాయి. విశాలమైన దేశంపై అభిమానంతోబాటు దేశంలోని విభిన్న ప్రాంతాలపై, రాష్ట్రాలపై గౌరవం కూడా ఈ గీతాల్లో ప్రస్ఫుటమౌతుంది.

గురజాడ 'దేశభక్తి గీతం' భావకవిత్వ ఉధృతిలో కనుమరుగవుతున్న పరిస్థితుల్లో దానికి పునర్జన్మనిచ్చి, విశేష ప్రాచుర్యాన్ని కల్పించింది వామపక్ష ప్రజా సంఘాలే. కందుకూరి వీరేశలింగం రచనలను, చిలకమర్తి స్వీయ చరిత్రను ప్రచురించిందీ; గిడుగు భాషా ఉద్యమాన్ని, గురజాడ సాహిత్యోద్యమాన్ని ముందుకు నడిపించిందీ వామపక్ష సంఘాలే. శ్రీశ్రీ సాహిత్యానికి ప్రాచుర్యాన్ని కల్పించి ఊపునిచ్చింది కూడా ఈ సంఘాలే.

స్వాతంత్ర్యోద్యమ కాలంలోనూ, ఆంధ్రోద్యమంలోనూ, నిజాం వ్యతిరేక సాయుధ పోరాట కాలంలోనూ, వేర్పాటు ఆందోళనలకు ఎదురొడ్డి నిలవడం లోనూ, సరిహద్దు దేశాలు మనదేశంపై యుద్ధం ప్రకటించిన సందర్భాల్లోనూ వామపక్ష రచయితల గీతాల్లో 'దేశభక్తి' వెల్లివిరిసింది.

దేశంలోని అన్ని భాషల్లోనూ నేడు బహుళ ప్రచారం పొందిన 'దేశభక్తి గీతాల్లో' చాలా గీతాలను వామపక్ష రచయితలు రాశారు. యువతరం ఆవేశానికి ప్రతీకలుగా నిలిచిన భగత్సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, అల్లూరి సీతారామరాజు వంటి దేశభక్తులకు తమ గీతాల ద్వారా ఈ రచయితలు నివాళు లర్పించారు, అర్పిస్తున్నారు. ఆ వీరుల ఆశయాలను, ఆదర్శాలను నేటికీ ప్రజల్లో ప్రచారం చేస్తున్నారు.

'మాదీ స్వతంత్ర దేశం - మాదీ స్వతంత్ర జాతి
భారత దేశమే మా దేశం - భారతీయులం మా ప్రజలం'1

గీతంలో నిత్యనూతనేతిహాసంగా నిలిచిన భారతీయుల శిల్పకళావికాసాన్ని, చారిత్రక కట్టడాలనూ శ్రీ రజని కొనియాడారు.

'పాడవోయి భారతీయుడా! ఆడి
పాడవోయి విజయగీతికా'2

అనే ప్రసిద్ధ గీతంలో అమరవీరుల త్యాగఫలంగా లభించిన స్వాతంత్ర్య దినోత్సవంనాడు దేశ పరిస్థితులను వాస్తవిక దృష్టితో అంచనా వేసుకుని, లోకానికి మన భారతదేశం శుభసందేశాన్ని అందించాలని శ్రీశ్రీ ఆకాంక్షించారు

'తెలుగు పూలు' గీతాలతో తెలుగు బాలల హృదయాలను జాగృతం చేసిన నవనీత హృదయుడు నార్ల చిరంజీవి...

'కారుమబ్బు చీల్చవోయ్ - క్రాంతిరేఖ చూపవోయ్
మాతృదేశ ముక్తికై - మరణమైన సరియెనోయ్'3

అనే కవాతు పాట రాశారు. నివసించే నేలపై, తాగే నీటిపై సర్వ హక్కులూ ప్రజలవేనని చాటిచెప్పారు.

'ధరితోర్విలో నేడు నిరుపేదలూ, క్షామ
పరితప్తులూ, దాస్యబాధితులు, బంధితులు
గొలుసులను తెంచుకొన, అలుగులను తీర్చుకొన

---

1, 2, 3. 'స్వేచ్ఛాపథం' (గేయ సంకలనం)
-విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ-2. (1961)

నిలిచి యున్నారరుగోరా, దేశాన్ని
పీల్చుచున్నారరుగోరా!'[1]

అంటూ విముక్త భారతావని విప్లవానికి సన్నద్ధమవుతుందని సుంకర సత్యనారాయణ విప్లవాహ్వానం పలికారు.

వామపక్ష రచయితలకు 'జాతీయ భక్తి' ఉండదనే నిరాధార ఆరోపణలకు ఒక అభ్యుదయ కవి సమాధానమిస్తూ...

'ఈ దేశ పీడితులు ఒక్కటై - పెట్టుబడి
వ్యవస్థనే కూల్చి - శ్రమకు విలువను పెంచి
నిరుపేద ప్రజలంత సుఖపడే రాజ్యాన్ని
స్థాపించు జాతీయభక్తి మాకుందిరా'[2]

అని స్పష్టపరిచారు. కులాలకూ, మతాలకూ అతీతమైన నిజమైన లౌకిక భారతాన్ని ఆవాహన చేశారు.

'జై భారత జననీ' అనే గీతంలో......

'జై భారత జననీ - నమో పతితపావనీ
అతులితహిమ శిఖరాలే - నీదు రత్నకిరీటం
మా భారతజాతికెల్ల - తగు రక్షణకవాటం'[3]

అంటూ సుబ్బారావు పాణిగ్రాహి దేశమాతకు నివాళులర్పించారు. దేశ గౌరవాన్ని నిలబెడతామని ప్రతిజ్ఞ చేశారు.

జన సాహితీ సాంస్కృతిక సమాఖ్య సభ్యుడైన మరో ప్రగతిశీలకవి...

'భారతదేశం నాదను భావం - ప్రతి ఎదలో ఉదయించాలి
అన్నదమ్ములై అందరు ఒకటై - ఐకమత్యముతో మెలగాలి'[4]

అనే గీతంలో పీడిత ప్రజలకు పెన్నిధిగా నిలిచే నూతన రాజ్యం రావాలనీ; ధనికుల దౌష్ట్యం, పేదల దైన్యంలేని సమసమాజం నిర్మాణం కావాలనీ ఆకాంక్షించారు.

---

1. 'కల్పన' (ఆధునిక కవితా సంపుటి) సం : అనిసెట్టి, అవసరాల, బెల్లంకొండ & రెంటాల - చేతన సాహితి, విజయవాడ. (1958).
2. 'పోరాటగీతం' - విశాలాంధ్ర (దినపత్రిక) 7-5-1989.
3. 'పెన్నూగన్నూ పట్టిన ప్రజాకవి పాణిగ్రాహి'.
4. 'జనం పాటలు' - జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ, (రచయిత పేరు లేదు) (పంచమ ముద్రణ : 1986).

మరో విప్లవకవి...—
'మాతృదేశము కొరకు మరణించు వీరుల
పూలతో పూజింపరారా ॥మాతృ॥
బానిసలైయిల బ్రతికేకన్నా - ప్రజలకు నరకం వేరేలేదని
ప్రజారాజ్య స్థాపనయే - మా పరమావధియని పోరుసల్పుతూ ॥మాతృ॥

దోపిడి పాలన కూల్చే కొరకు - అమర వీరుల మార్గంలోనే
పట్టువదలని విప్లవదీక్షతో - పోరాడెదమని ప్రతినబూనుచూ ॥మాతృ॥'[1]

అనే గీతంలో మాతృదేశం కోసం, దీని అభ్యుదయం కోసం ప్రాణార్పణ చేస్తున్న వీరులను పూలతో పూజించడానికి రమ్మని దేశ ప్రజలకు పిలుపు నిస్తున్నారు.

ఈ వీరులకు నివాళు లర్పించడంతో తమ బాధ్యత తీరిపోదనీ, చెమట రక్తాలను ధారపోసి దేశ సంపదలను పెంచడానికి ప్రతి ఒక్కరూ అంకితం కావాలని మరో కవి ఉద్బోధిస్తూ......

'చెమట చమురుగ పోసి - నెత్తురొత్తిగ మార్చి
దీపాన్ని వెలిగించరా - దేశాన
వెలుతురులు కురిపించరా'[2]

అంటూ...దేశ సహజ సంపదలైన హిమవత్పర్వత శ్రేణులు; గంగా, యమునా, కృష్ణా, గోదావరి నదులు; సమస్త ప్రకృతీ - ప్రజల సమిష్టి సంపద అని చాటి చెప్పారు.

ఇలా ఎందరో కవులు తమ మాతృదేశంపై భక్తినీ, ఉదాత్త సమాజ నిర్మాణం కోసం అంకిత భావాన్నీ తమ గీతాల్లో వ్యక్తీకరించారు.

పాకిస్తాన్, చైనా వంటి పొరుగు దేశాలు మన దేశంపై యుద్ధాన్ని ప్రకటించినప్పుడు; ప్రగతిశీల కవులు ఈ దాడులను ప్రతిఘటిస్తూ గీతాలు రాశారు.

'తుదివిజయం - మనదినిజం' శీర్షికతో పుస్తకరూపాన్ని దాల్చిన కాళోజీ నారాయణరావుగారి గీతాలు (1938) ప్రజల నాలుకలపై నాట్యం చేస్తున్న నిత్య చైతన్యరూపాలు.

---

1. 'జనం పాటలు' - జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ రచయిత పేరు లేదు. (పంచమ ముద్రణ : 1986)
2. 'ఉద్యమం' పాటలు - ఆం. ప్ర. ప్రజానాట్యమండలి, హైదరాబాద్ నగర శాఖ (1982).

## అంతర్జాతీయతా దృష్టి

వామపక్ష కవులు మాతృదేశాన్ని ఎంత గాఢంగా ప్రేమిస్తారో, మొత్తం ప్రపంచాన్ని అంతే గాఢంగా అభిమానిస్తారు. ప్రపంచంలో ఏ మూల ఏ ఉద్యమం లేచినా ప్రతిస్పందిస్తారు ఎక్కడివారయినా విముక్తికోసం, సుఖమయ జీవితం కోసం పోరాడుతున్న యోధులకు తమ సంఘీభావాన్ని ప్రకటిస్తారు.

అంతర్జాతీయ ప్రాధాన్యత గల వ్యక్తులనూ, సంస్థలనూ, సంఘటనలనూ కీర్తిస్తూ తెలుగులో అనేక గీతాలు వెలువడ్డాయి. వాటిలో ప్రజాదరణ పొందిన కొన్ని ప్రసిద్ధ గీతాలను పరామర్శించ వలసి ఉంది.

## కార్ల్ మార్క్స్ ప్రశంస

మానవజాతి చరిత్రకు నూతన భాష్యం చెప్పి, కమ్యూనిస్టు ప్రణాళికను ప్రపంచానికి అందించిన మేధావి కార్ల్‌మార్క్స్. 'సకల దేశ కార్మికులారా! ఏకంకండి' అన్న చారిత్రిక నినాదాన్ని అందించిన విప్లవకారుడు మార్క్స్. ఆ మహనీయున్ని స్మరిస్తూ...

'ఎర్రెర్రని సూరీడుదయించాకూ
తరతరాల చీకటి తొలగించాడు
శ్రమజీవుల వెలుగై కనుమరుగయ్యాడు
విప్లవ పర్యాయపదం మార్క్సయ్యాడు'[1]

అనే గీతంలో విప్లవ తాత్విక శాస్త్రాన్ని రూపొందించి, గతి తార్కిక నేత్రాన్ని తెరిపించిన మార్క్స్ ప్రపంచ విప్లవాల పర్యాయపదమయ్యాడని ఏటుకూరి ప్రసాద్ ప్రశంసించాడు.

మరో అభ్యుదయ కవి...

'ఆకలిపై చీకటిపై దోపిడిపై రాపిడిపై
స్థిరమైన సమాధి కట్టే సిద్ధాంతం సృష్టికర్త
మానవాళి నవజీవన నిర్మాణపు మహావక్త'[2]గా,

సుత్తికత్తి పెన్ను గన్ను పట్టిన మొనగాడుగా కామ్రేడ్ మార్క్సును వర్ణించాడు.

## లెనిన్ ప్రశంస

మార్క్స్ చూపిన సామ్యవాద సిద్ధాంతాన్ని ఆచరణలో ఋజువు చేసిన నాయకుడు లెనిన్. రష్యన్ అక్టోబర్ విప్లవానికి నాయకత్వం వహించి, ప్రపం

1. 'ప్రతిధ్వని' ప్రజానాట్యమండలి పాటలు; చతుర్థ ముద్రణ : 1988.
2. 'మన కామ్రేడ్ మార్క్స్' (గీతం)
-'ప్రతిధ్వని' ప్రజా నాట్యమండలి పాటలు.

చంలో తొలి సోషలిస్టు దేశాన్ని నిర్మించిన విప్లవనేత లెనిన్. ఆ మహానాయ కుడ్ని స్మరిస్తూ...

'ఇదే అడను లెనిన్ కథను
రచించెదను నేను
లెనిన్ బ్రదుకు జనం కొరకు
ధ్వనించెదను నేడు'[1]

అంటూ సోవియట్ మహాకవి 'మయకోవ్‌స్కీ' రాసిన 'లెనిన్' కావ్యాన్ని తెలుగులోకి అనువదించిన శ్రీశ్రీ......

'ప్రపంచమనే కావ్యానికి
ప్రతిపదార్థం లెనిన్
బ్రతుకనే చిక్కుసమస్యకు
పరిష్కారం లెనిన్
మానవ మహాసముద్రంలో
ప్రవాళద్వీపం లెనిన్
మానవ ప్రవాళంలో
మండే ఎర్రదనం లెనిన్'[2]

లెనినిజం, కమ్యూనిజం, హ్యూమనిజం అనే పదాలకు నిజమైన అర్థం లెనిన్ అంటూ నివాళులర్పించారు.

మానవజాతి చరిత్రలో నూతన అధ్యాయాన్ని సృష్టించిన ఆ యుగ కర్తను ప్రశంసిస్తూ...

'నీది ఒక్కదేశమే కాదు, నీది ఒక్క
జాతియే గాదు, సర్వ విశ్వంబు నీదె
నిఖిల మానవ కోటియు నీదె; నీవు
దీన బాంధవుడవు లెనిన్'[3]

అంటూ ప్రజలు స్వర్ణాక్షరాలతో ప్రీతిగా లెనిన్‌ను గురించి రాసుకుంటా రని కూరెళ్ళ రామనరసింగరావు వర్ణించారు.

మనిషిని మనిషి, జాతిని వేరొక జాతి దోచుకోవడానికి ఆస్కారం లేని ఉదాత్త సమాజాన్ని నిర్మించిన మానవతా మూర్తిని వర్ణిస్తూ రాంభట్ల కృష్ణ మూర్తి...

1. లెనిన్ (కావ్యం) - మయకోవ్‌స్కీ. అనువాదం: శ్రీశ్రీ.
ప్రగతి ప్రచురణాలయం, మాస్కో (1979).
2, 3. 'సోవియట్ భూమి' (సోవియట్-భారత స్నేహ పక్షపత్రిక) ఏప్రిల్ 1985.

'జీవనగంగా సరితను
భూమికి
దింపిన భాగీరథుడు లెనిన్
మానవతా పరమావధి
కిలపై
ప్రాణం పోసినవాడు లెనిన్'1

అని కీర్తించారు. మానవ జాతికి కొత్త జీవితపు దారులు చూపిన పథ నిర్దేశకుడిగా లెనిన్‌ను ప్రశంసించారు. మానవత్వానికి పరమావధియైన కమ్యూనిజానికి ప్రాణం పోసినవాడుగా వర్ణించారు.

## మేడే గీతాలు

అమెరికా దేశంలోని చికాగో నగరంలో 1886 మే ఒకటిన, పనిగంటల తగ్గింపును కోరుతూ కార్మికులు తిరుగుబాటు చేశారు. రోజుకు పన్నెండు నుండి పద్నాలుగు గంటల వరకు పని చేయించుకుంటున్న అక్కడి పెట్టుబడిదారులకు ఎదురు తిరిగారు. '8 గంటల పని' నినాదంతో చికాగోనగరంలో సార్వత్రిక సమ్మె జరిగింది. కర్మాగారాలు మూతపడ్డాయి. 3½ లక్షల మంది కార్మికులు సమ్మెలో పాల్గొన్నారు మే 3 న అమెరికన్ సైనికులు సమ్మె చేస్తున్న కార్మికులపై కాల్పులు జరిపారు. ఆరుగురి ప్రాణాలు బలిగొన్నారు. ఆ మరునాడు నిరసన ప్రదర్శన. మళ్ళీ కాల్పులు. ఇలా రక్తపాతాన్ని సృష్టించిన మే దినం కార్మికుల పోరాటానికి ప్రతీకగా నిలిచింది. 1889 జూలై 14 న పారిస్‌లో జరిగిన 2 వ ఇంటర్నేషనల్ ప్రథమ మహాసభ మే ఒకటవ తేదీని అంతర్జాతీయ కార్మికవర్గ సంఘీభావ దినంగా ప్రకటించింది. 1900 సంవత్సరంలో పారిస్‌లో జరిగిన అంతర్జాతీయ కార్మిక మహాసభ 'మేడే'కు సంబంధించిన తీర్మానాన్ని ఆమోదించింది. మేడే కార్మిక దినోత్సవంగా రూపొందింది.

ప్రపంచ వ్యాపితంగా అన్ని భాషల్లో వెలువడినట్లే 'మేడే' గురించి తెలుగులోనూ చాలా గీతాలు వెలువడ్డాయి.

'పీడితులారా! తాడితులారా!
ప్రపంచ కార్మిక కర్షకులారా!
ఏకం కండోయ్! ఏకం కండోయ్!
మే దినోత్సవం మేలుకొల్పున
మానవ శక్తులు మహాగ్నిశిఖలై
దాస్యం దోపిడి దుఃఖపూరితము

1. 'సోవియట్ భూమి' ఏప్రిల్ 1985.

యుద్ధ పూరితము యూరప్ నలమిన
కాళరాత్రిని కబళించినవీ!'

అంటున్న పులుపుల వెంకటశివయ్య మే దినోత్సవం అరుణచ్ఛాయతో విజృంభించిన విప్లవ శక్తుల్ని, ప్రజారాజ్య స్థాపన కోసం ఎగరవేసిన ఎర్ర పతాకాన్ని వర్ణించారు.

'పీడిత లోకం - తాడిత లోకం
నూతన మానవ - భూతల స్వర్గం
నెలకొల్పుటకై - నిజరక్తంలో
స్నానం చేసినదీనాడే - శంకుస్థాపన ఈనాడే'1

అన్న 'మేడే' గీతంలో కార్మిక కర్షక సింహాలు కత్తిని దూసిన, సుత్తిని జూపిన మేడేను జ్ఞప్తికి తెచ్చుకొమ్మంటున్నారు ప్రజాకవి సుంకర.

అలాగే ప్రజల్లో బాగా ప్రచారాన్ని పొందిన మరో 'మేడే' గీతాన్ని రెంటాల రచించారు.

'లేలెండోయ్ - రారండోయ్
కార్మిక కర్షక యోధుల్లారా!
కదం దొక్కుతూ సాగండోయ్
నేడేనోయ్ మన మేడే పండుగ
పదండి ముందుకు కదలండోయ్!'2

ఈ గీతంలో కేవలం మేడేను స్మరించడమేకాదు, జలగలవలె ప్రజల రక్తం పీలుస్తున్న పరాన్న భుక్కులను పూడ్చే ప్రతిజ్ఞ చేయండని రెంటాల పిలుపు నిస్తున్నారు.

ఒక చేత్తో వ్యంగ్య గేయాలను, మరోచేత్తో విప్లవ గీతాలను వెలువరించిన అభ్యుదయ సాహిత్య సవ్యసాచి గజ్జెల మల్లారెడ్డి వామపక్ష గీతాలు తిరిగిన ప్రతి మలుపులోనూ మల్లారెడ్డి గీతాలు కనబడుతుంటాయి.

'మేడే పండుగ వచ్చింది
ఎర్రని జెండా ఎగిరింది
కార్మికులంతా ఏకము కండని
కదన శంఖమును ఊదింది'

అని ప్రారంభమయ్యే మల్లారెడ్డి గారి 'మేడే' గీతం...

---

1. 'జనం పాటలు' - జనసాహితి ప్రచురణ.
2. 'మేడే విప్లవ గీతాలు'—సంకలనం : రెబ్బా రామచంద్రయ్య, ప్రజా బుక్‌స్టాల్, కోదాడ ప్రచురణ (1982).

'ఐక్యతయే మన వజ్రాయుధము
ఐక్యతయే మన అభేద్య కవచం
ఐక్యశక్తితో ముందుకురికితే
అంతిమ విజయం మనదేనంటూ
మేడే పండుగ వచ్చింది'

అంటూ శ్రామికవర్గ సమైక్యతను ప్రబోధించింది. వామపక్ష కార్మికోద్యమంలో ఏర్పడుతున్న చీలికలను నిరసించింది.

ఇటీవలి కాలంలో భాషా అనే కవి రాసిన 'ఆయారే మేడే' గీతం ఊరూరా ప్రజల గొంతుల్లో ప్రతిధ్వనిస్తూ, కొత్త ఊపిర్లు పోస్తోంది.

'మేడే' చరిత్రను తెలిపే సంగీత రూపకం ఎస్వీ రూపొందించగా 1938 మేడే నాడు హైదరాబాద్ దూరదర్శన్ ద్వారా ప్రసారమయింది. ఈ రూపకమే 1-5-1986 నాటి 'విశాలాంధ్ర'లో అచ్చయ్యింది.

1986 నాటికి 100 సంవత్సరాలు పూర్తి చేసుకున్న మేడే చరిత్రను తెలిపే పాటల రూపకాన్ని '100 సంవత్సరాల మేడే చరిత్ర' పేరుతో కె. ప్రతాప రెడ్డి సంకలనంగా రూపొందించారు. విజయలక్ష్మి స్మారక ట్రస్టు ప్రచురణ (1986) గా వెలువడిన ఈ రూపకం 1987, 88 మేడే దినోత్సవాల సందర్భంగా దూరదర్శన్‌లో ప్రసారమయింది. మేడే సందేశాన్ని ప్రజలకు అందించింది.

## అక్టోబర్ విప్లవదినం

1917 అక్టోబర్ 24 (నవంబర్ 7)నాటి అర్ధరాత్రి రష్యన్ కార్మికవర్గం అక్కడి పెట్టుబడిదారీవర్గ పరిపాలనను కూలదోసి, కార్మికవర్గ రాజ్యాన్ని నెలకొల్పింది. తొలిసామ్యవాద దేశంగా దేశదేశాల ఉద్యమాలకు ఊపిరిపోసింది. విముక్తి పోరాటాలకు కొత్త ఉత్సాహాన్ని అందించింది.

'విప్లవం...అక్టోబర్ విప్లవం
సోషలిస్టు విప్లవం...తొలిసామ్యవాద విప్లవం ॥విప్లవం॥

ఆకలిపై చీకటిపై - దోపిడిపై రాపిడిపై
తరతరాల నరజాతి - సాగించిన సమరాగ్ని
సుత్తి కత్తి పెన్ను గన్ను - ఆయుధాలు చేతబూని
పీడిత శ్రామిక లోకం - తిరగబడిన తొలివిజయం ॥విప్లవం॥

లక్షలాది వత్సరాల - మానవ ప్రస్థానంలో
నవలోకం నిర్మించిన - శ్రమజీవుల జనసమరం

సమసమాజ నిర్మాణం - సాధించే లక్ష్యంగా
మనిషిని మనిషిగ మలచిన-మానవతా మహార్ణవం ॥విప్లవం॥'[1]

అంటూ అక్టోబర్ విప్లవాశయాలను అభ్యుదయ కవులు వివరించారు. కన్నీళ్ళను కత్తుల కెరటాలుగా మలచిన విప్లవానికి హారతులెత్తారు.

ఉద్యమగీతాలకు ఉరవడిదిద్దిన ఎర్రజెండాకవి ఏటుకూరి రాసినగీతం...

'నవంబరేడీ నాడే - జారులకు కీడుమూడే
శ్రమజీవులందరేకంగ నాడు - పరవళ్ళు తొక్కేసీనాడె'[2]

అనేక వేదికలపై గానం చేయబడింది. 13 చరణాల ఈ సుదీర్ఘ గీతం నవంబరేడు విప్లవ చరిత్రను వివరించింది.

## అంతర్జాతీయ గీతం

పారిస్ కమ్యూన్ పతనానంతరం పారిస్ విప్లవయోధుడు 'యూజినీ పాటియర్' ఫ్రెంచి భాషలో రాసిన 'అంతర్జాతీయ గీతం' తొలి తెలుగు అనువాదాన్ని క్రాంతి గీతాల్లో చూశాం.

ఈ గీతానికి ఒక నిర్దిష్టమైన బాణీ ఉంది. ఆ బాణీలో ప్రపంచంలోని అనేక భాషల్లోకి అనువదించబడి; కార్మికుల, కష్టజీవుల గీతంగా ఇది గానం చేయబడుతున్నది. అనేక అంతర్జాతీయ కార్మికవర్గ వేదికలపై ప్రార్థనాగీతంగా పాడబడుతున్న ఈ గీతం దేశదేశాల కమ్యూనిస్టుల మధ్య ఐక్యతకు ప్రతీకగా నిలిచింది.

పుడమితల్లికి పురిటి నొప్పులను స్ఫురింపజేసే నూతన సృష్టినీ, మరో ప్రపంచ ప్రాదుర్భావ సంచలనాన్ని ప్రపంచానికి వినిపిస్తుంది గీతం. ఫ్రెంచి మూల గీతానికి ఆంగ్లానువాదం ఇలా ప్రారంభమవుతుంది:

'Arise ye prisoners of starvation
Arise ye wratched of the earth
For justice thunders condemnation
A better world's in birth
No more traditions' chains shall bind us
Arise ye slaves no more in thrall'[3]

---

1. 'అక్టోబర్ విప్లవం' (గీతం) - ఎస్వీ; విశాలాంధ్ర 7-11-1988.
2. 'ఎర్రజండా' (పాటలు) - ఏటుకూరి ప్రసాద్.
3. 'అభ్యుదయ' (మాసపత్రిక) మే, 1988 - సం; ఏటుకూరి ప్రసాద్.

మరో ప్రపంచం కోసం పోరాడే కార్మికుల్ని ఏ ఇతర శృంఖలాలు బంధించలేవని ప్రబోధిస్తున్న ఈ గీతానికి 'పిఎరీడేజిటర్' స్వరకల్పనచేసి బాణీని సమకూర్చారు.

ఈ గీతానికి మొట్టమొదటి భారతీయ భాషానువాదం 1922 లో ఉర్దూ భాషలో 'రహ్మత్ అలీఖాన్' చేశారు. ఆ తరువాత ఉర్దూలోనే 'సోహన్‌సింగ్ జోష్' అనువదించారు. 1927లో బెంగాలీ విప్లవకవి 'నజ్రుల్ ఇస్లాం' బెంగాలీ అనువాదం చేశారు. అయితే ఈ అనువాదం మూలగీతం బాణీలో లేనందువల్ల 1942 లో 'మొహిత్ బెనర్జీ' మరో బెంగాలీ అనువాదం చేశారు. 1930 లో ప్రముఖ హిందీకవి 'హరీంద్రనాథ్ చటోపాధ్యాయ' హిందీ భాషలోకి ఈ గీతాన్ని అనువదించారు.

1935 లో బాలాంత్రపు నళినీకాంతరావు, మహీధర రామమోహన్‌రావు 'అంతర్జాతీయ గీతాన్ని' తెలుగులోకి అనువదించారు.

ఆ తరువాత ఫ్రెంచి అంతర్జాతీయ గీతం బాణీలో, ఈ గీతం ఆంగ్లాను వాదాన్ని దగ్గరపెట్టుకుని తెలుగు లోనికి రాంభట్ల కృష్ణమూర్తి అనువదించారు.[1]

'లేవండి వంచితులార - పురిటాకలి వరకము నుంచి
ఘోషించె మోచనలావ - గగనాలన్ ముంచెత్తించి
శోకాల సమయము తీరె - పడిపోవును దాసహవేలి
భూలోక నాకమునందు - కరుణించెడు దేవరలేడు
మన భావిభారం మనది - జనముక్తికి సాగుడు నేడు
రోషాతిశయమున పొంగి - పదవో యిది అంతిమసమరం
ఇంటర్నేషనేల్
నరజాతి సమైక్యవరం—
చట్టాలు రాచరికాలు - అవి వంచన మకరముఖాలు
సుంకాల గానుగలోన - కడబారెన్ మా ప్రాణాలు
ఈ లోకసిరులను దోచి - మకుటాలను దాల్చినవారు
మన స్వేదరుధిరము మీద - మనుచేకద వారలతీరు

---

1. 'భారత కమ్యూనిస్టు పార్టీ' 10 వ జాతీయ మహాసభ (27 జనవరి నుండి 2 ఫిబ్రవరి 1975) విజయవాడలో జరిగిన సందర్భంగా రాంభట్లగారు ఈ గీతాన్ని అనువదించారు. ఆనాటి మహాసభలో విదేశ ప్రతినిధులను ఈ గీతం విశేషంగా ఆకర్షించింది. తరువాతి కాలంలో ఈ గీతంతోబాటు మరికొన్ని ప్రసిద్ధగీతాలు కలిపి కమ్యూనిస్టుపార్టీ ఒక ఎల్ పి. రికార్డును రూపొందించింది.

కష్టించి కార్మికులెల్ల - సమకూర్చిన భూరిధనాలు
మింగేటి దొంగలబట్టి - తెరిపింతము వారి కొవ్వులు
రోషాతిశయమున పొంగి - పదవోయి యిది అంతిమసమరం
ఇంటర్నేషనేల్
నరజాతి సమైక్యవరం——
రండోయి సైనికులార - సరదారుల పొగరణగించ
రారండి చేతులుసాచి - పరపీడా గర్వం దించ
కార్ఖాన గనులు పొలాలు - కల్పించిన బంగరు రాసి
రాబందువోలె హరించు - నరహంతల కూలగ నేసి
కష్టించు జీవులమోయి - సకలావని మన కరిగాపు
ఏ వేళ కూకని పొద్దు - వినువీధిని పూచును రేపు
రోషాతిశయమున పొంగి - పదవోయి యిది అంతిమసమరం
ఇంటర్నేషనేల్
నరజాతి సమైక్యవరం.'[1]

ఇదీ అంతర్జాతీయ గీతానికి నిర్దిష్టమైన అనువాదం. భావానికిగానీ, బాణీకిగానీ అంతరాయం కలగకుండా రాంభట్ల చేసిన భావానువాదం. ప్రజానాట్య మండలి గాయనీగాయకులు 'పార్టీ' సమావేశాల్లో ఈ గీతాన్ని పాడుతూ ఉంటారు. ఈ గీతాన్నే జననాట్యమండలి రచయితలు మరోవిధంగా సంక్షిప్త స్వేచ్ఛాను వాదం చేసుకున్నారు. తమ కార్యక్రమాల్లో, సభలు, సమావేశాల్లో విధిగా ఈ పాటను పాడాలని నిర్ణయించారు.[2]

'మేలుకోండి పేద ప్రజలారా - మేలుకోండి నలుదిశలా
శ్రామికులు చూపిరి మార్గం - లేచిందోయ్ విముక్తి పథం
తరతరాల కుటిలాచారం - చెయ్యాలిక పూర్తి హతం
తుడిచెయ్ జన దీనాలాపం - జీవన్మరణమని పోరి

1. 'రణన్నినాదమ్' (విప్లవ గేయసంపుటి).
2 'జననాట్య మండలి పాటలు' సంకలనంలో... ఈ గీతం కింద ఒక నోట్ ఉంది. అందులో... 'మన విప్లవ సాంస్కృతిక దళాలు - కార్య క్రమం చివర ఈ పాటను తప్పనిసరిగా పాడాలి. ఈ అంతర్జాతీయ గీతానికి మొత్తం ప్రపంచ ప్రజలు పాడుకునే ఒకే మాదిరి పల్లవి ఉన్నది. ఆ పల్లవిలో మాత్రమే ఈ పాట పాడాలి. ఈ పాట పల్లవిని మన కామ్రేడ్స్ ఎవరైనా సాంస్కృతిక దళాల నుండి నేర్చుకోవచ్చు' అని సంకలనకర్తలు ప్రకటించారు.

తుపిపోరు ఇది ఓ కామ్రేడ్స్ - కలవండోయ్ ఏకంగ
ఇంటర్నేషనల్ - ఒకటౌదాం మానవులం
కలవండోయ్ యేకంగా
ఇంటర్నేషనల్ - ఒకటౌదాం మానవులం'[1]

అంటూ యూజిన్ పాటియర్ ప్రపంచమానవాళికి ఇచ్చిన సందేశాన్ని జన నాట్యమండలి గాయనీ గాయకులు జనంలో పాడుతున్నారు.

## రెండు విభిన్న దృక్పథాలు

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన చీలిక మూలంగా మన దేశంలోనూ కమ్యూనిస్టు పార్టీ చీలిపోయింది. ఒక చీలిక మరికొన్ని చీలికలకు దారి చూపింది. అంతర్జాతీయ రంగంలో భారత కమ్యూనిస్టు పార్టీ 'సోవియట్ యూనియన్' మార్గాన్ని బలపరుస్తూ ఉంది. భారత కమ్యూనిస్టు (మార్క్సిస్టు-లెనినిస్టు) పార్టీ, భారత కమ్యూనిస్టు ఐక్యతా కేంద్రం (యు.సి.సి.ఆర్.ఐ) వర్గాలు చైనా మార్గాన్ని సమర్థిస్తున్నాయి. సహజంగానే పై పార్టీలను బలపరిచే రచయితల సాహిత్యంలోనూ ఈ రెండు విభిన్న దృక్పథాలు స్పష్టంగా కనబడుతున్నాయి.

సోవియట్ యూనియన్ మార్గాన్ని బలపరిచే రచయితలు...

'సోవియట్ల దేశమా! సమతా సందేశమా!
ఆంధ్రజాతి విప్లవాభి - వందనాలు అందుకో
అందుకో...అందుకో ॥సోవియట్ల దేశమా॥'[2]

అంటూ సోవియట్ దేశానికి, సోవియట్ ప్రజానీకానికి విప్లవాభివందనం సమర్పిస్తున్నారు.

'సోవియట్ల భూమిరా - అన్నా ఓ కూలన్నా!
సోషలిస్టు సీమరా - అన్నా! ఓ కూలన్నా!
సోవియట్ల భూమిరా - సోషలిస్టు సీమరా
ఇది కొత్త జగతి దారిరా - అన్నా ఓ కూలన్నా!
సరికొత్త బతుకు బాటరా - అన్నా ఓ కూలన్నా'[3]

---

1. 'జననాట్య మండలి పాటలు' - క్రాంతి ప్రచురణలు, సికింద్రాబాద్. (ఎనిమిదవ ముద్రణ, 1984)
2. 'సోవియట్ల దేశమా' (గీతం) - గజ్జెల మల్లారెడ్డి. 'ప్రతిధ్వని' ప్రజా నాట్యమండలి పాటలు (ఫిబ్రవరి 1981).
3. 'సోవియట్ల భూమిరా!' (గీతం) - ఎస్వీ., విశాలాంధ్ర 17-8-1984.

అనే గీతంలో జారిజాన్ని తరిమిగొట్టి, సోషలిజం నెలకొల్పుకున్న సోవియట్ వీరచరిత్రను అభ్యుదయ రచయితలు కొనియాడారు.

మరోవైపు సోవియట్ వ్యతిరేక, చైనా అనుకూల విప్లవ కవులు...

'ఓల్గా ఘనీభవించెను
యాంగ్సీ నదిపొంగెను
హోరు హోరు హోరుగా
హొయలు హొయలు హొయలుగా'[1]

అనే 'రుతు సంగీతం' గీతంలో సోవియట్ ప్రజల పవిత్రనది 'ఓల్గా' ఘనీభవించిందని ఎత్తి పొడుస్తూ, చైనానది 'యాంగ్సీ' పొంగిందని ప్రశంసించారు. తియాన్‌మిన్ స్క్వేర్‌లో అరుణారుణ పతాకం ఎగిరిందని కీర్తించారు.

అలాగే 1979 వ సంవత్సరంలో రెండు సోషలిష్టు దేశాలు వియత్నాం, జనచైనాల మధ్య యుద్ధం జరిగింది. కమ్యూనిస్టుల్లో ఒక పక్షం వియత్నామ్‌ను బలపరచగా, మరోపక్షం చైనాను సమర్థించింది.

విప్లవకవి 'శివసాగర్' 'విర్రవీగే వియత్నమోడా!' అనే గీతం రాశారు.

'విషపు కన్నెర్ర జేస్తివిరో - దండెత్తిన వియత్నమోడా!
నువ్వు కుక్కసావే సస్తవురో - కొవ్వెక్కిన వియత్నమోడా!
రష్యావోడి మద్దతుతోనా - మత్తెక్కి మదంబట్టి
కంపూచియా సీమలోన - రైతుకూలీ రాజ్యంమింగి
తైతక్క లాడుతున్నావురో - కైపెక్కి కులుకుతున్నావురో
నువు సావుదెబ్బలు తింటవురో - విర్రవీగే వియత్నమోడా!
నీ మస్తి వదలగొడతార్రో - మదంబట్టిన వియత్నమోడా'[2]

అంటూ వియత్నాంను దుయ్యబడుతూ, విమర్శిస్తూ, హెచ్చరిస్తూ, తిడుతూ ఈ కవి తన ఆగ్రహాన్ని ప్రకటించారు.

ఇక ఇటువైపు కమ్యూనిస్టుకవులు చైనా దురాక్రమణకు వ్యతిరేకంగా ప్రతిస్పందించారు. దశాబ్దాలుగా అమెరికన్ సామ్రాజ్య వాదులతో సుదీర్ఘకాల యుద్ధం చేసి అలసిపోయిన వియత్నాంపై, సాటి సోషలిస్టుదేశం చైనా యుద్ధాన్ని ప్రకటించడం తీవ్రమైన చర్యగా గర్హించారు. 10 ఏప్రిల్ 1979 నాడు వియత్నాం ప్రతినిధి వర్గం భారతదేశాన్ని సందర్శించింది. భారతీయుల సంఘీభావాన్ని అభ్యర్థించింది. అదేరోజు హైదరాబాదు నగరంలోని 'ఆంధ్ర సారస్వత పరిషత్తు'లో వియత్నాం ప్రజల ప్రతినిధులకు స్వాగతం పలుకుతూ ఒక పెద్ద

---

1, 2. ఉద్యమం నెలబాలుడు - శివసాగర్. సృజన ప్రచురణలు, హన్మకొండ

బహిరంగ సభ జరిగింది. అందులో ప్రజానాట్య మండలి సంగీత రథసారథి సి. మోహన్‌దాస్ పర్యవేక్షణలో ప్రజానాట్యమండలి గాయనీగాయకులు రెండు గీతాలు పాడారు.

'ఎంతపని చేసిందురా - చైనోడు
సొంత గొంతులు గోసెరా-చైనోడు - సొంతగొంతులు గోసెరా ॥ఎంత॥
హోరులో వియత్నాము - పోరులో బుట్టింది
పారేటి రక్తాల - ఏరులో పెరిగింది
తిరిగి పోరుకు పిలిచెరా-చైనోడు - తిక్కనంతా జూపెరా ॥ఎంత॥
రక్తాల బట్టల్ని పెట్టెలో బెట్టేసి
శాంతి సంగీతాలు పాడేటి శుభవేళ
విషవాయువులు గురిపెరా-చైనోడు - వెర్రిగంతులు వేసెరా ॥ఎంత॥
వీర బాంగ్లా - చిలీ - వియత్నాము - అంగోల
సూడాను - క్యూబాల - సోషలిస్టు వర్గాల
విప్లవాలను దిట్టెరా-చైనోడు - విద్రోహిగా నిలిచెరా ॥ఎంత॥
అన్నదమ్ముల వలెను మెలిగేటి కామ్రేడ్ల
నెదిరించి అమెరికా - భజన చేస్తున్నాడు
కన్నుగానని ద్రోహిరా-చైనోడు - కల్లుదాగిన కోతిరా ॥ఎంత॥
ఒకవైపు సోవియట్ - సోషలిస్ట్ దేశాలు
విశ్వమంతా శాంతి పూలు పూయాలంటె
యుద్ధమో యుద్ధమనెరా-చైనోడు - యెర్రెత్తి ఆడిందురా ॥ఎంత॥'[1]

అంటూ చైనా యుద్ధ పంథాను కవులు, కళాకారులు నిరసించారు.

'ఇది యేమి సిత్రామొరన్నా - చైనావి
ఇది యేమి సిత్రామొరన్నా
అసలైన కమ్యూనిష్టు దేశామె తనదంటు
కామ్రేడ్ల గొంతుల్నె కరకరా గోసేరు' ॥ఇది॥[2]

అనే మరో గీతంలోనూ చైనా చర్యలను అభ్యుదయరచయితలు ఖండించారు.

ఇలా ఒకటి, రెండు విషయాల్లో వామపక్ష రచయితల మధ్య విభేదాలున్నప్పటికీ అంతిమంగా సమసమాజ నిర్మాణాకాంక్ష, పెట్టుబడిదారీ వర్గ వ్యతిరేకత, వర్గపోరాట ఆవశ్యకత వంటి ఆశయాలు వీరి రచనల్లో భావ సారూప్యం కలిగి ఉన్నాయి.

---

1,2. వియత్నాం ప్రతినిధి వర్గానికి స్వాగతం చెబుతూ 10-4-1979 నాడు ప్రజానాట్యమండలి గాయనీగాయకులు పాడిన గీతాలు.

## అంతర్జాతీయ సంఘీభావం

1970 నవంబర్ 16-20 తేదీల్లో న్యూఢిల్లీలో ఆఫ్రో-ఆసియా రచయితల మహాసభ జరిగింది. దీనికి నాందిగా అక్టోబర్ 28 న విజయవాడలో అభ్యుదయ రచయితల సంఘం (అరసం), ఆఫ్రో-ఆసియా సంఘీభావ సమితి సంయుక్త ఆధ్వర్యాన రాష్ట్ర రచయితల సదస్సు జరిగింది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని పై రెండు సంస్థలు సంయుక్తంగా 'ఉదయతార' కవితా సంకలనం వెలువరించాయి. తెలుగునాట ప్రసిద్ధులైన అభ్యుదయ రచయితలు, వర్ధమాన యువ రచయితలు ఆఫ్రో-ఆసియా విముక్తి పోరాటాలకు సంఘీభావం ప్రకటించారు.

1971 లో బంగ్లాదేశ్ విముక్తి పోరాటానికి సంఘీభావం తెలుపుతూ వికాస సాహితి, మద్రాసువారు 'బంగ్లాదేశ్ గీతాంజలి' (గీతాల సంకలనం) వెలువరించారు. తెలుగు కవులు, ఆంధ్రేతర భారతీయ కవులు, బంగ్లాదేశ్ కవులు రాసిన విముక్తి గీతాల సంకలనం అది.

బంగ్లాదేశ్ పోరాటానికి మద్దతుగా హనుమకొండ సాహితీ మిత్రులు 'బంగ్లాదేశ్' కవితా స్పందన ప్రకటించారు. కవితల సమీకర్తగా ఎన్. కె. వ్యవహరించారు. ప్రముఖ కవుల కవితలు, గీతాలూ ఇందులో ఉన్నాయి.

1973 లో ఆం.ప్ర. అరసం, కృష్ణా జిల్లా శాఖ 'శిక్షించాలంటున్నా!' పుస్తకాన్ని ప్రచురించింది. పాబ్లో నెరూడా రాసిన దీర్ఘ గీతానికి కె రాజేశ్వరరావు చేసిన అనువాద కావ్యమిది.

1979 లో ఇండో-జీడీఆర్ మిత్రమండలి, జర్మన్ మహాకవి బ్రెహ్ట్ కవితలను తెలుగులోకి అనువదింపజేసి, 'రేపటికోసం' కవితా సంకలనం వెలువరించింది. ఏటుకూరి ప్రసాద్ ఈ సంకలనానికి సంపాదకులు.

సోవియట్ కవయిత్రులు రాసిన కవితలను డా॥ పి. చిరంజీవినీకుమారి అనువదించి, 'లేతమందారాలు - రక్తసిందూరాలు' పేరుతో పుస్తకంగా ప్రచురింపజేశారు.

ఇంకా సోవియట్ యూనియన్, బల్గేరియా, చైనా వంటి సోషలిస్టు దేశాల రచయితలు; లాటిన్ అమెరికా, ఆఫ్రికా విముక్తి పోరాటాల్లో పెన్నూ, గన్నులన్నీ పట్టుకుని పోరాడుతున్న వీర యోధులు రాసిన రచనల్నీ, గీతాల్నీ పలువురు వామపక్ష రచయితలు తెలుగులోకి అనువదిస్తున్నారు.

అలాగే ప్రపంచ వ్యాపితంగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా, యుద్ధోన్మాదానికి వ్యతిరేకంగా, వలస పాలకులకు వ్యతిరేకంగా ఆయాదేశాల ప్రజలు జరుపుతున్న పోరాటాలకు ఇక్కడి వామపక్ష రచయితలు తమ సంఘీభావాన్ని ప్రకటిస్తున్నారు. కవితల ద్వారా, గీతాల ద్వారా తమ ప్రతిస్పందనను వ్యక్తీకరిస్తున్నారు.

## కార్మిక గీతాలు

శ్రమ అంటే పని. శ్రమచేసే వర్గాన్ని శ్రామిక వర్గం అంటున్నాం. అలాగే కర్మ అంటే కూడా పని అనే అర్థం. పనిచేసే వర్గమే కార్మిక వర్గం. ఇందులో వస్తువులను ఉత్పత్తిచేసే వస్తూత్పాదక కార్మికులు, గని కార్మికులు, వేర్వేరు వృత్తి కార్మికులుంటారు. శ్రామికవర్గ పక్షపాతం వామపక్ష రచయితల రచనల్లో ప్రధానాంశం. వర్గ సమాజంలో ఉంటున్న రచయితలు ఏదో ఒక వర్గ ప్రయోజనాలను కాపాడడానికి తమ రచనలను ఉపయోగిస్తారు. అభ్యుదయ, విప్లవ రచయితలు శ్రామికవర్గ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని సాహిత్యాన్ని సృజిస్తారు. దీనికి భిన్నంగా, సైద్ధాంతిక అవగాహనలేని రచయితలు పెట్టుబడి వర్గానికి ఉపయోగపడే రచనలు చేస్తారు. ఏ వర్గ ప్రయోజనమూ మాకు అక్కర లేదనే వాదన కొందరు అప్పుడప్పుడూ లేవదీస్తుంటారు. వీరిని గురించి లెనిన్ ఇలా అంటాడు...

'వర్గ సమాజంలో ఉంటూ నిష్పక్షపాతం అని నీతులు చెప్పేవాళ్ళు నిజానికి దొడ్డిదారిన బూర్జువా కామందుల పల్లకీలు మోసే బోయీలు మాత్రమే.'[1]

దీనినిబట్టి తెలిసో, తెలియకో, ప్రతి రచయితా ఏదో ఒక వర్గ ప్రయోజనాలను పరిరక్షిస్తున్నట్లు స్పష్టమౌతుంది. అందులో వామపక్ష రచయితలు చైతన్యయుతంగా శ్రామికవర్గ పక్షపాతాన్ని వహిస్తూ శ్రామిక సాహిత్యాన్నీ, కార్మిక గీతాలను రచిస్తున్నారు. శ్రామికవర్గ పోరాటాల నుండి తమ రచనలకు ప్రేరణ పొందుతున్నారు. అలాగే తమ రచనల ద్వారా శ్రామిక వర్గాన్ని చైతన్యపరిచి, పోరాటాల దిశగా పయనింపజేస్తున్నారు. శ్రామికుల కష్టనష్టాలను, జీవన స్థితిగతులను శ్రామికేతర ప్రజలకు వివరించి, వారి మద్దతు కూడా కార్మికులకు లభించడానికి దోహదం చేస్తున్నారు. వీటన్నింటినీ శ్రామిక రచనలుగానే వ్యవహరించవచ్చు.

ఇక గీతాల విషయానికి వస్తే రెండు ప్రధాన ధోరణులు కనబడుతున్నాయి. ఒకటి - శ్రామికేతర మధ్యతరగతి మేధావులు, రచయితలు శ్రామికుల కోసం రాస్తున్న గీతాలు. రెండు - శ్రామికుల కోసం శ్రామికులే రాసుకుంటున్న శ్రామిక గీతాలు. ఈ రెండింటి ఆశయమూ ఒక్కటే కాబట్టి వీటిని ఒకే శీర్షిక (కార్మిక గీతాలు) కింద పరిశీలించడం జరుగుతున్నది.

తెలుగులో తొలి కార్మిక గీతాల సంకలనం 'కార్మిక భజనావళి.' ఇది 1937 లో వెలువడింది.

---

1. 'సాహిత్యాభ్యుదయం' (వ్యాస సంకలనం)-శ్రీశ్రీ స్మారకసంస్థ, ఆం.ప్ర. అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ (1985) (పుట : 18)

ఈ 'కార్మిక భజనావళి' సంకలనంలోని గీతాలతోబాటు మరి కొన్నింటిని కలిపి రూపొందించిన తొలితరం కార్మిక గీతాలు 'క్రాంతి గీతాల్లో' (1938) కనబడుతున్నాయి. పెండ్యాల లోకనాథం వంటి తొలి తరం కార్మిక కవుల గీతాలు అందులో ఉన్నాయి.

క్రాంతి గీతాలు (1938), చేనేత భజనావళి (1939) వంటి సంకలనాల్లో అచ్చయిన కార్మిక గీతాలను ఇదివరకే చర్చించాం.

విప్లవ చోదక శక్తులైన ప్రొలిటేరియట్ కార్మికవర్గంపై సరియైన అవగాహనలేని కాలంలోనే (1937) శ్రీశ్రీ రాసిన 'ప్రతిజ్ఞ' మొదలైన గీతాలు 'కార్మిక గీతాలకు' ఒక నూతన స్ఫూర్తిని కలిగించాయి.

'శ్రమైక జీవన సౌందర్యానికి
సమానమైనది లేనేలేద'ని

ప్రకటించిన శ్రీశ్రీ కష్ట జీవులకు, కర్మవీరులకు నిత్యమంగళం నిర్దేశిస్తూ వ్యధార్తజీవిత యదార్థదృశ్యాల పునాదిగా భావివేదముల జీవనాదాలను జగత్తుకు వినిపించారు.

'కమ్మరి కొలిమి, కుమ్మరి చక్రం
జాలరి పగ్గం, సాలెల మగ్గం
శరీర కష్టం స్ఫురింపజేసే
గొడ్డలి, రంపం, కొడవలి, నాగలి
సహస్రవృత్తుల సమస్త చిహ్నాలూ'

తను విరచించే నవీన గీతికి, నవీన రీతికి భావంగా, భాగ్యంగా, ప్రాణంగా, ప్రణవంగా నినదించాడు శ్రీశ్రీ.

చేతన సాహితి వారి 'కల్పన' (1953), విశాలాంధ్ర ప్రచురణాలయం వారి 'స్వేచ్ఛా పథం' (1961), ప్రజానాట్యమండలివారి 'ప్రతిధ్వని' (1981), జననాట్యమండలివారి 'జననాట్యమండలి గీతాలు' (1979), జన సాహితివారి 'జనం పాటలు' (1981), అరుణోదయ సాంస్కృతిక సమాఖ్యవారి 'అరుణ కిరణాలు' మొదలైన సంకలనాలలోనూ; అభ్యుదయ, విప్లవ కవుల గీతికా సంపుటాలలోనూ వందలాది కార్మిక గీతాలు ప్రచురితమయ్యాయి.

ఏటుకూరి ప్రసాద్, గద్దర్, వంగపండు ప్రసాద్, చెరబండరాజు, జి. అంజయ్య, రాంభట్ల కృష్ణమూర్తి మొదలైన వామపక్ష రచయితల కృషి ఈ రంగంలో ప్రత్యేకంగా పేర్కొనదగింది.

'ఓరోరి కార్మికన్నా! - ఓరయ్యో కార్మికన్నా!
ఎన్నాళ్ళు కష్టపడ్డా! - అన్నామె కరువురన్నా!
ఓరోరి కార్మికన్నా!'[1]

అనే పల్లవితో సాగే ఏటుకూరిప్రసాద్ గీతం కార్మికవాడల్లో ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. రక్తాన్ని చెమటజేసి, శక్తంతా ధారవోసే కార్మికులను ఆలోచింపజేస్తూ ఉంటుంది.

అలాగే గద్దర్ రాసిన 'గ్యాంగోల్ల పాట', 'సిరిమల్లె సెట్టుకింద లచ్చుమమ్మా', 'నా కూలి నాలన్నాలు', 'వొడ్డెరోల్లపాట', 'ఏం బతుకులు మనయిరో', 'రిక్షా దొక్కే రహీమన్నా', 'కంపిని కూలోడా' 'రిక్షావాల' మొదలైన గీతాలు కార్మిక గీతాల్లో శక్తిమంతమైనవి.[2]

అసంఘటిత కార్మికులను గురించి ఆవేశభరిత గీతాలు రాసిన గద్దర్ గళం నుండి వెలువడిన 'గ్యాంగోల్ల పాట' చూడండి...

'గ్యాంగోల్లమండి మేము బాబు
అయ్యో గరీబోల్లమండి మేము బాబు
మా రక్తమంత ధారపోసి
రైలుపట్ట లేస్తాము ॥గ్యాం॥
గోసిలేదు గుడిసెలేదు - కుంటకింద గుంటలేదు
అవ్వ అయ్య కూడబెట్టిన - ఆస్తిలేదు పాస్తిలేదు
సద్ది కట్టుకపోదమంటే - సద్దిపేల్కలేదు మాకు ॥గ్యాం॥
పొద్దూ పొద్దున మేములేసి - సల్ది బొల్డి సద్ది గట్టుకొని
గడ్డపార అడ్డపార - భుజంమీద పెట్టుకోని
బీటుపంజి ఇనుపతట్ట - నెత్తిమీద ఎత్తుకోని
ఇరవై కిలోల బరువు - మొత్తుకుంట మోసుకొస్తె
లాడిస్‌మీద దొరవచ్చే - లైనుమీద లేవాని
గైరాజరేసి - మా గంజిలో మన్నేసినాడు ॥గ్యాం॥'[3]

అంటూ సాగే ఈ గీతంలోని ఏడు చరణాల్లో గ్యాంగోల్ల జీవిత స్థితిగతులను ప్రతిభావంతంగా ఈ కవి ప్రదర్శించారు.

---

1. 'ప్రతిధ్వని' - ప్రజా నాట్యమండలి పాటలు
2,3. 'గద్దర్ పాటలు' - జన నాట్యమండలి ప్రచురణ

'మట్టి తట్టలెత్తినాము - మంటలై లేస్తాము
బీటు పలుగులెత్తినాము - బాకులై మెరుస్తాము
కూలిరాజ్య మొచ్చేదాక - రైతురాజ్య మొచ్చేదాక
గ్యాంగోల్ల మందరాము - గన్నులై మోగుతాము'

అనే పోరాట నిబద్ధతను పాట ముగింపులో పలికించారీ కవి. జీవిత విషాదాన్ని గానం చేయడానికి భిన్నంగా గద్దర్ సామాజిక విప్లవానికి సాహిత్యా యుధాన్ని ఉపయోగిస్తున్నాడు అలాగే జి అంజయ్య రాసిన 'ఊరు మనదిరా'. 'బద్రం కొడుకో - కొడుకో కొమురన్న' గీతాలు గద్దర్ గొంతులో నిత్యం ధ్వనించే ప్రజాహృదయ నాదాలు.

చెరబండ రాజు రాసిన 'కొండలు పగలేసినం', 'పేదవాళ్ళు', 'అన్న లారా!', 'హమాలన్నా-కూలన్నా' మొదలైనవాటిలో ప్రతి గీతం ఒక నెత్తుటిదీపం.

జన నాట్యమండలి గీతాల్లో బాగా ప్రచారాన్ని పొందిన పాటలు రాసిన కవి వంగపండు ప్రసాదరావు విశాఖపట్టణం గ్రామికుల భాషను సొంతం చేసుకుని, శ్రమజీవుల ప్రఖ్యాత బాణీలను కైవసం చేసుకుని, వినికిడి మాత్రంగా గుర్తుండిపోయే పాటలల్లడం ఈ కవి ప్రత్యేకత.

'రండిరో... లెండిరో... కూలన్నా!
సంఘం బెడదాము - వీళ్ళ సంగతేందొ చూద్దాము ॥రండిరో॥
కూలన్నల సంఘమూ - కూడుతున్న సంఘమూ
రైతన్నల సంఘమూ - రగులుతున్న సంఘమూ
పేదోళ్ళమంత కలిసి - పెడదామిక సంఘమూ ॥రండిరో॥'[1]

అంటూ వంగపండు వేసిన కేక ఆంధ్రదేశమంతటా మార్మోగుతున్నది. ప్రజానాట్యమండలి, జననాట్యమండలి అనే తేడా లేకుండా ప్రజాకళాకారులంతా ఈ గీతాన్ని ప్రచారం చేస్తున్నారు.

ఇక **గని కార్మిక గీతాలను** పరిశీలిస్తే......గని కార్మికులైన వేల్పుల నారాయణ, స్వామి, బానూరి సత్యనారాయణ, జాకబ్, లక్ష్మీనారాయణ, కృష్ణ మురళి, బల్లెం సామ్యూయేల్, ఆర్. వెంకటయ్య మొదలైన కార్మికకవుల గీతాలే ఎక్కువగా కనబడుతున్నాయి.

గని కార్మికులు రాసిన తొలి గీతికా సంకలనం 'ఊపిరి.' 1978లో ఎ.పి.టి.యు.సి. 6 వ మహాసభలకు కవితా నీరాజనంగా, ప్రజానాట్యమండలి గోదావరిఖని శాఖ ఈ పుస్తకాన్ని ప్రచురించింది.

1981 లో సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్, ఇల్లెందు బ్రాంచి 'సింగరేణి పాటలు' ప్రచురించింది. 'సింగరేణి బొగ్గు గని కార్మికుల అభ్యు

1. 'జనం పాటలు'-జనసాహితీ సాంస్కృతిక సమాఖ్య ప్రచురణ (1986).

న్నతి కోసం పోరాట పాటాలు నేర్పుతూ, ప్రాణాలు ధారబోసిన అమరవీరులకు' అంకితం చేయబడిన ఈ పాటలను 'జాతశ్రీ' సంకలనం చేశారు.

అదే సంవత్సరం 'ప్రజానాట్యమండలి' గోదావరిఖని శాఖ 'జనరాగం' పాటల సంకలనాన్ని ప్రచురించింది. ప్రజానాట్యమండలి గీతాలకు స్వర కల్పన చేస్తూ, నిర్విరామ కృషిసల్పి కనుమూసిన రాష్ట్రస్థ సి మోహన్‌దాస్‌కు ఈ పుస్తకాన్ని అంకితం చేశారు.

ఆ తరువాత ప్రజానాట్యమండలి, ఆదిలాబాద్ జిల్లా శాఖ 'ఎర్రకిరణం'' 'విప్లవశంఖం', 'సమరశంఖం', 'జనరాగాలు' పాటల సంకలనాలను వెలువరించింది.

1984 ఆగష్టులో ప్రజానాట్యమండలి గోదావరిఖని శాఖ 'ఎదనాదాలు పాటల సంకలనం ప్రచురించింది. వేల్పుల నారాయణ సంకలనం చేసిన ఈ పాటలను ప్రజాకళాకారుడు సుద్దాల హనుమంతుకు అంకితం చేశారు.

'సింగరేణి బావులందు
బొగ్గుమోసే లాడీసన్న
బండకింది కమానన్న
బాంచెబతుకు మజ్దూరన్నా
కన్ను దెరిచి చూడరో - ఓ కార్మికన్న
పన్నుకౌరికి నిలవరో - ఓ కార్మికన్నా'1

అంటూ గని కార్మికులను చైతన్యపరిచిన ఈ కార్మికకవులు 'అక్కో అక్కో అక్కా', 'నేను రానుబిడ్డో సర్కారి దవాఖానకు', 'భగ్గు భగ్గున మండవే-భారతీ నా చెల్లెల', 'ఏమీ రాజ్యం ఏమీ రాజ్యం ఎన్నియాలో' మొదలైన విశేష జనాదరణ పొందిన గీతాలు రచించారు. వీరిలో చాలామంది కవులు స్వయంగా గొంతెత్తి గానం చేస్తూ, తమ పాటలద్వారా కార్మికుల చైతన్యాన్ని పదునుబెట్టే కృషి కొనసాగిస్తున్నారు.

ఇటీవలి కాలంలో కొత్తగూడెం గనికార్మిక జంటకవులు బల్లెం సామ్యూయేల్, ఆర్. వెంకటయ్య 'శ్రమజ్వాలలు' కవితా సంకలనం (1989) వెలువరించారు. అరసం, విశాలాంధ్ర పాఠకుల సంఘం, కొత్తగూడెం మండలశాఖలు సంయుక్తంగా ప్రచురించిన ఈ సంకలనం 'సింగరేణి వర్కర్స్ యూనియన్' ప్రధానకార్యదర్శి ఎం. కొమరయ్యకు అంకితం చేయబడింది.

---

1. 'సింగరేణి పాటలు' - సం: జాతశ్రీ, సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్, ఇల్లెందు బ్రాంచి ప్రచురణ (1981).

1987 ఆగష్టులో వేముల ప్రభాకర గౌడ్ 'కార్మికగీత' శీర్షికన గీత కార్మిక సంక్షేమోద్యమ కవితా సంకలనం రచించి, ప్రచురించారు.

'కులము వారి బలముకూర్చుకొనక గౌడు
బయట రాజ్యమేల ఫలితమేమి?
ముందు ఇంట గెలిచి ముందుకు సాగరా!'1

అంటూ గౌడగీతాలు ఈ కవి గానం చేస్తున్నారు.

అలాగే అనేక వృత్తులు చేస్తూ, తమ జీవితాలను గడుపుతున్న వేర్వేరు వృత్తుల కవులు, కళాకారులు తమ కష్టసుఖాలను, సమకాలీన సామాజిక స్థితి గతులను తమ గీతాల్లో ప్రతిధ్వనింప జేస్తున్నారు. దోపిడికి తావులేని ఉదాత్త సమాజం రావాలని, మనుషులంతా సుఖపడే సోషలిస్టు వ్యవస్థ ఏర్పడాలని ఆకాంక్షిస్తున్నారు.

## రైతుకూలీ గీతాలు

రైతుకూలీ ప్రజల సమస్యలను చిత్రించిన తొలి కవితా సంకలనం 'రైతు భజనావళి.' 1934 ఏప్రిల్‌లో ఆచార్య గోగినేని రంగనాయకులు సంపాద కత్వం వహించి, యాభై పేజీల సంకలనాన్ని వెలువరించారు. ఇందులో ఉన్నవ వారి 'మాలపల్లి' లోని తక్కెళ్ళ జగ్గడి ధర్మబోధనలు, హరిజన నాటకంలోని పాటలు, నెల్లూరి వెంకట్రామా నాయుడుగారి చిలకపదాలు, తుమ్మెద పదాలు, కుసుమ ధర్మన్నగారి 'నల్లదొరతనం' పాటలు; వనవిహారి, చిత్రగుప్త, బసవ రాజు అప్పారావు, శెట్టిపల్లి వెంకట్రత్నం, గిరిరాజు రామారావు మొదలైనవారి గీతాలూ ఉన్నాయి 1935 నుండి ఈ సంకలనం, కొన్ని గీతాల మార్పులు చేర్పులతో, పేజీల సంఖ్యను కూడా పెంచుకుంటూ 1949 నాటికి డజన్ ముద్ర ణలు పొందింది.

ఈ పుస్తకానికి 'ఉపోద్ఘాతం' రాస్తూ ఆచార్య రంగా 'రష్యాలో వచ్చిన విప్లవమే మనకు ఆదర్శం' అని చాటిచెప్పారు.

'ప్రపంచమందొకచోట రైతులు రాజ్యానికి వచ్చినారు. కూలీలు పెత్తనము చేస్తున్నారు. కోటీశ్వరుల కచ్చట తావులేదు తినడానికి తిండి, పరుండడానికి పడక అచ్చట యెల్లరికి కరువులేకున్నవి ప్రజాసామాన్యమునకు పరువు ప్రతిష్ట లచ్చట లభ్యమగుచున్నవి. ఆంధ్ర ప్రజలు కూడ అలాంటి స్వారాజ్యమునే కాంక్షించుచున్నారు' 2

---

2. 'కార్మికగీత' - వేముల ప్రభాకర్ గౌడ్, 1987.
1. 'రైతు భజనావళి' కి ఆచార్య రంగనాయకులు 'ఉపోద్ఘాతము' (22-4-1934).

అంటూ సంకలనకర్త ప్రకటించడాన్నిబట్టి ఈ గీతాల ఆదర్శం విదిత మౌతుంది.

## తొలి కర్షక కవి శెట్టిపల్లి వెంకటరత్నం

1934 నాటికే రైతుకూలీ ప్రజల సమస్యలపై నిర్దిష్టమైన అవగాహనతో గీతాలు రాసిన 'తెలుగులో తొలి కర్షక కవి శెట్టిపల్లి వెంకటరత్నం.' గిరిరాజు రామారావుతో కలిసి శెట్టిపల్లి రాసిన 'రైతు జూడకపోతే!' గీతం ఈనాటికీ జవ, జీవాలతో రైతుజన చైతన్యానికి ఆజ్యం పోస్తూవుంది.

'ఆసనా జీవాలు - సాగునా లోకాలు
రాజుగా మనమెంచి - రైతు జూడకపోతే
దేశాలు తలలెత్తునా? - దాస్యపున్
పాశాలు తాపిడునా?'1

అనే గీతంలో పగలు, రాత్రిలేక పాటుపడే రైతుల సమస్యలను పరిష్కరించలేని రాజ్యాలు నిలవవని పూదేవి భగ్నమైపోతుందని హెచ్చరించారు. రైతుకూలీ ప్రజల సౌభాగ్యం చూడని రాజ్యాల్లో సిరిసంపదలుండవని ఈ జంట కవులు చాటి చెప్పారు

'కాలమొక్కటిగ - కలకాలముండగబోదు
కాదు చీకటి కడల - హోరూరకుంతుగా
కాంతిపుంజం బల్లదే కర్షకా !
శాంతి సౌఖ్యము సీకగున్'2

అనే ఆత్మ విశ్వాసాన్ని, భవిష్యత్తుపై నమ్మకాన్ని 'రైతు భజనావళి' గీతాల్లో తొలితరం కర్షక కవులు ఎలుగెత్తి చాటారు. చిన్నకారు రైతులు, వ్యవసాయ కార్మికులు సంఘటితమై, సమస్యల పరిష్కారానికి బలమైన ఉద్యమాలు నిర్మించాలని ప్రబోధించారు.

## రైతు పోరాట గీతాలు

1935 లో యడ్లపల్లి దేవయ్యచౌదరి 'కష్టజీవి' అనే దీర్ఘ గీతాన్ని రచించారు. మంజరి ద్విపదలో సాగే ఈ దీర్ఘ గీతంలో...

'మలమల యెండలో మాడుచునుండి
వడవడ జలిలోన వణుకుచునుండి
మూగ పసులతోడ ముచ్చటల్ సలిపి
అంటుడొక్కల తోడ నాకలిమంట
నారుగాలంబును దీరికలేక

---

1, 2. 'రైతు భజనావళి' (1934)

దుస్థితిం దలచుచ దున్నుచునుండ
పదనారగా మేడిపైకి దన్నంగ
సుడికొని యట్టిట్టు గ్రుక్కుచునుండి
మతి పండ్ల బిగువుతో మాటాడలేక
దున్నుచుండెడి మాదు దుర్గతిజూడ'1

అంటూ 'ఇస్సిరో మాకష్టమేమి చెప్పెదము' అంటూనే రైతుల దయనీయమైన జీవన స్థితిగతులను రైతుబిడ్డయైన కవి వర్ణించారు.

1979 జూన్ 7,10 తేదీల్లో విజయవాడలో 22వ అఖిల భారత రైతు మహాసభ జరిగింది. ఈ మహాసభను పురస్కరించుకుని కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం, తుమ్మల వెంకటరామయ్యగారి సంపాదకత్వంలో 'రైతు పోరాట గీతాలు' (సంకలనం) వెలువరించింది.

శ్రీశ్రీ 'ప్రతిజ్ఞ' గీతంతో ప్రారంభమయ్యే ఈ సంకలనంలో మొత్తం మూడు పదుల గీతాలున్నాయి.

'అన్నదాత ఓ రైతా - అయోమయం నీ బ్రతుకు
అగాధం పాలైతివా రైతన్నా - చింతలతో చితికిపోతివా రైతన్నా'2

అనే గీతంలో భూమాతను నమ్ముకుని, గోమాతను చేతబట్టి అరుగాలం కష్టించే రైతన్న స్థితిగతులను వర్ణించిన జి. వై. గిరి...

'దిక్కుమొక్కు లేక నీవు - ఒక్కనిగా బ్రతికేకన్నా
రయమున ముందుకు రారో రైతన్నా - రైతుసంఘంలో చేరరో'

అనే సంఘ చైతన్యాన్ని ప్రబోధించారు.

'ఎన్నాళ్ళు ఎన్నేళ్ళు ఈ పాట్లు పడతావు
ఇకనైన మేలుకో రైతన్నా! - నీ రాజ్యమేలుకో రైతన్నా!
వోటుతోనో, తిరుగుబాటుతోనో నీవు
పీడకుల పాలనకు వీడ్కోలు చెప్పాలి
కార్మికులు కర్షకులు కలిసికట్టుగ కదలి
అవినీతి రాజ్యాన్ని అంతమొందించాలి'3

అంటూ అదృష్టదీపక్ పోరాట సందేశాన్ని అందించారు బ్యాలెట్‌తోనో బుల్లెట్‌తోనో దోపిడిదారుల పరిపాలనకు చరమగీతం పాడాలన్నారు.

---

1. 'కష్టజీవి' —యడ్లపల్లి దేవయ్యచౌదరి.
2,3. 'రైతు పోరాట గీతాలు' —సం : తుమ్మల వెంకటరామయ్య
కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ (1979).

1979 ఏప్రిల్‌లో జన నాట్యమండలి కళాకారుల 'రైతుకూలీ విజయం' వొగ్గుకథ వెలువడింది. కథాంతంలో భూస్వామి భుజంగరావును, అతని అనుచరుడు నాగేంద్రంను, వారు నమ్ముకొన్నబంటు మీసాల మైసిని జనం పొడిచి చంపడం చిత్రింపబడింది.

'ప్రజలంత కత్తులెత్తి
జనులంత బర్షిలెత్తి
బీదబిక్కి బర్మాలెత్తి
కూలినాలి కొడవల్లెత్తి
కంట్రోల్ జేసిరా - కసితోని లేసిరా ॥భాయిరె బాయి॥
భుజంగరావును - నాగేంద్రంను
నాగేంద్రంను - మైసిగాన్ని
కసితోని ప్రజలంతా
కత్తులు ఉంచిరా - నెత్తురు జూపిరా'[1]

అనే ముగింపు ద్వారా ప్రజా కంటకులను ప్రజలు అంతం చేస్తారనే మరణ శాసనాన్ని ఈ వొగ్గుకథ ప్రబోధిస్తుంది.

గ్రామీణ పేద రైతుల జీవితాన్ని, కరణం - మునసబుల అరాచకాలను వర్ణించిన నృత్య రూపకం - 'భూమి భాగోతం.' జానపద భాష, జానపద బాణీల సముచిత సమ్మేళనంగా రూపొందిన ఈ రూపక రచయిత వంగపండు ప్రసాదరావు ప్రజానాట్యమండలి, జన నాట్యమండలి కళాకారులు గ్రామగ్రామాన కొన్ని వందల ప్రదర్శనలివ్వడం ద్వారా ఈ రూపకంలోని పాటలన్నీ గ్రామీణుల నోళ్ళలో కదలాడుతున్నాయి.[2]

ఇదే సమస్యపై వెలువడిన మరో నృత్య రూపకం 'నా భూమిని దొంగలెత్తుకు పోయారు'. ఎస్వీ రాసిన ఈ రూపకంలో 'ప్రభుత్వం ప్రకటిస్తున్న భూమి పంపకం ఎంత హాస్యాస్పదంగా మారిందో' చిత్రింపబడింది. ప్రజానాట్యమండలి కళాకారులు అనేక వేదికలపై ఈ రూపకాన్ని ప్రదర్శించారు. ఈ నాటికి ప్రదర్శిస్తూ ఉన్నారు.

## యువజన విద్యార్థి గీతాలు

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అవలంబిస్తున్న విద్యావిధానాలను నిరసిస్తూ; సమకాలీన విద్యావ్యవస్థను విమర్శిస్తూ; నిరుద్యోగ సమస్య పరిష్కారాన్ని కోరుతున్న గీతాలు అసంఖ్యాకంగా వెలువడ్డాయి; వెలువడుతున్నాయి.

---

1 'రైతుకూలీ విజయం' ఒగ్గుకథ - జననాట్యమండలి.

2. 'భూమి భాగోతం' (నృత్యరూపకం)
మిత్ర సాహితి, విశాఖపట్నం ప్రచురణ (1978).

ఎ ఐ.ఎస్.ఎఫ్, ఎస్.ఎఫ్ ఐ, పి డి.యస్.యు, ఆర్ ఎస్.యు, డి.ఎస్ ఒ. వంటి విద్యార్థి సంస్థలు; ఎ ఐ వై యఫ్, డి.వై.ఎఫ్(ఐ), ఆర్.ఎల్.వై. వంటి యువజన సంఘాలు తమతమ సంస్థల పేర్లను, ఆశయాలను, ప్రణాళికలను ప్రచారం చేసుకునే గీతాలను వెలువరించాయి. వీటితోపాటు యువజన విద్యార్థులు తమ న్యాయమైన కోర్కెల సాధన కోసం, సమస్యల పరిష్కారం కోసం పోరాటం చేయాలన్న విప్లవ సందేశాన్ని పై సంస్థలన్నీ తమ గీతాల్లో ప్రచారం చేస్తున్నాయి.

'కాలేజీ కుర్రవాడ! కులాసాగ తిరిగెటోడ!
విలాసాల మాట మరువరో - ఓ విద్యార్థి
విప్లవాల బాట నడువరో - ఓ విద్యార్థి'[1]

అంటూ గుండవరపు సుబ్బారావు రాసిన గీతం దాదాపు అన్ని విద్యార్థి సంఘాల సభ్యుల ఆదరణ పొందింది. ఆంగ్లేయుల కాలంలో గుమస్తాల తయారీకోసం ప్రారంభించబడిన విద్యావిధానం, స్వతంత్ర భారతంలో ఈనాటికీ కొనసాగడంపై ఈ గీతంలో ఆగ్రహం ప్రకటించబడింది. శాస్త్రీయ విద్య కోసం సమరం సాగించమనే పోరాట మార్గాన్ని ఈ గీతం నిర్దేశిస్తున్నది.

ఇక యువజనులను చైతన్యపరుస్తూ నార్ల చిరంజీవి రాసిన గీతం 'యువతరం శివమెత్తితే.'

'యువతరం శిరమెత్తితే
నవతరం గళమెత్తితే
లోకమే మారిపోదా?
చీకటే మాసిపోదా?'

అనే పల్లవితో ప్రారంభమై, 'విడని గొలుసు లంకెలముడి మడతపేచి రాజ్యాంగం మారిపోతుందనీ, నవమానవుడు రూపొందుతాడనీ' చారిత్రిక ఆశావాదాన్ని ప్రకటించింది.

ఈ పాటలోని మొదటిపంక్తి 'యువతరం శిరమెత్తితే'. ఈ శీర్షికతో శ్రీమతి పరిమళా సోమేశ్వర్ ఒక నవలను రాయడాన్ని బట్టి, ఇదెంత ప్రాచుర్యాన్ని పొందిందో స్పష్టమౌతుంది.

1. 'మన పాటలు' (పాటల సంకలనం)
—ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్ర కమిటి ప్రచురణ (1998).

'పిడికిలెత్తి రండిరో - యువజన విద్యార్థులారా!
పిడుగులై పోరండిరో - యువజన విద్యార్థులారా!'[1]

అనే 'విప్లవాహ్వానం' పలుకుతున్న వామపక్ష రచయితలు...

'యువతరమా! నవతరమా!
అదను ఇదే కదలిరమ్మ
బడులనుండి - గనులనుండి
నిరుద్యోగ జడతనుండి
దుక్కినుండి - ధూళినుండి
భిక్షాటన శిక్షనుండి
యువతరమా! నవతరమా!
ఇదే అదను కదలి రమ్మ'[2]

అంటూ వర్తమాన సమాజంలో శ్రామికులు జరుపుతున్న పోరాటాల్లో కలిసిరావలసిందిగా, సోషలిజం నిర్మాణానికి తమ చారిత్రక కర్తవ్యాన్ని నిర్వర్తించాల్సిందిగా నిర్దేశిస్తున్నారు.

ఇంకా అనేక మంది అభ్యుదయ, విప్లవ కవులు యువజన విద్యార్థి ఉద్యమాలకు దర్పణం పడుతున్న గీతాలు వెలువరిస్తున్నారు. కొత్త జగతి నిర్మాణానికి యువతరాన్ని సన్నద్ధం చేస్తున్నారు

## మహిళా గీతాలు

1942 లో ఫాసిస్టు వ్యతిరేక పోరాటానికి స్త్రీలు కదలిరావాలనే పిలుపుతో ప్రారంభమయిన 'మహిళా గీతాలు' మహిళల్లో సామాజిక చైతన్యాన్ని రగిలిస్తూ సమాజంలో మహిళల స్థానాన్ని వర్ణిస్తూ, తమ హక్కుల సాధనకోసం మహిళా సంఘాల ద్వారా పోరాటాలు నిర్వహించాల్సిందిగా ప్రబోధిస్తున్నాయి.

మహిళా సమాఖ్య నాయకురాలు గజ్జల సరళాదేవి మహిళలను చైతన్య పరిచే గీతాలు కొన్ని రాశారు.

'మేలుకో మేలుకో చెల్లెలా - మేలుకోవే చిట్టిచెల్లెలా'[3]

అనే గీతంలో మగవారి ఆధిపత్యానికి, శత్రువర్గదోపిడికి ద్విముఖాలుగా బలైపోతున్న స్త్రీ జాతిని సరళాదేవి మేల్కొమ్మని ప్రబోధించారు.

---

1. 'విశాలాంధ్ర' (దినపత్రిక) 21-7-1985.
2. 'చెరబండరాజు కవితలు - పాటలు.'
3. 'అగ్గి చిపుళ్ళు' (కవితా సంకలనం) - అరసం ప్రచురణ (1973).

మల్లారెడ్డి రాసిన......

'మనది భారతదేశమే చెల్లీ!
మనువు పుట్టిన దేశమే చెల్లీ'[1]

గీతంలో... ధర్మశాస్త్రాలు, కర్మ సిద్ధాంతాలు స్త్రీలను జీవచ్ఛవాలుగా మార్చిన వైనాన్ని వర్ణించారు. ఆయనే మరోగీతంలో...

'వంటయిల్లే ఖైదుకొట్టయి
పడకటిల్లే పంజరమ్మై
అందరికి తలవంచి బతికే
అబల సబలగ మారినపుడే
మారిపోతుందోయ్ - కాలం
మారిపోతుంది'[2]

అనే కాలజ్ఞానాన్ని వివరించారు. అబల సబలగా మారి పరిస్థితులపై ఎదురు తిరగాలని పిలుపు నిచ్చారు.

శివసాగర్ రాసిన 'చెల్లీ చెంద్రమ్మా!' గీతం సాయుధ పోరాటంలో స్త్రీల సాహసాన్ని చిత్రించింది. కృంగిపోవడం కాదు, పగబూనమని ప్రకటించింది.

అలాగే గద్దర్ రాసిన మరోగీతంలో...

'అమవాస చీకటి అర్ధరాతిరి - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా
ఇల్లు దాటితివి పల్లె దాటితివి - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా
ఎక్కడికమ్మా బయలుదేరితివి - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా
బావిలో పడితె బాధలు తీరవు - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా'[3]

అంటూ...

'నిర్మలమ్మవై కదలాలమ్మా - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా
నీలాంటోళ్ళను ఎంతోమందిని - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా
కూడగట్టుకొని కదలాలమ్మా - చెల్లెమ్మా ఓ చెల్లెమ్మా

అంటూ ఆత్మహత్యలు సమస్యలకు పరిష్కారం కావనీ, సాటి మహిళలను సంఘటితపరుచుకుని ఎదురుతిరగమని గద్దర్ పిలుపు నిచ్చారు.

బాసూరి సత్యనారాయణ రాసిన...

'భగ్గు భగ్గున మండవే - భారతీ నా సెల్లెలా
ఉగ్రమై నువు లేవవే - భారతీ నా సెల్లెలా'[4]

---

1,2 'ప్రతిధ్వని' - ప్రజానాట్యమండలి పాటలు.
3. 'జనం పాటలు' - జనసాహితి ప్రచురణ.
4. 'ఎదనాదాలు' (పాటలు) - ప్రజా నాట్యమండలి గోదావరిఖని శాఖ.

అనే గీతం ఈ వ్యవస్థలో స్త్రీ స్థానాన్ని చిత్రిస్తూ, దీనిపై ప్రతిఘటించ డానికి ఉగ్రరూపాన్ని ధరించమని ప్రబోధిస్తున్నది.

మహిళల దయనీయమైన జీవితాలను చిత్రించిన గీతాలన్నింటిలోనూ, వారు వ్యవస్థపై తిరుగుబాటు చేయాలన్న విప్లవ సందేశం అంతర్లీనంగా ప్రతి ధ్వనించడం గమనించవలసిన విషయం.

## కుల నిరసన

కుల తత్వాన్ని, అగ్రవర్ణాల దౌర్జన్యాలను వామపక్ష రచయితలు తీవ్రంగా నిరసించారు.

తెలుగు నేలపై దళిత ఉద్యమం ఉధృతం కావడానికి ఒక దశాబ్దానికి ముందే 'అభ్యుదయ రచయితలు' ఈ సమస్యపై కవితాస్త్రాలను సంధించారు.

1977 సెప్టెంబర్ మాసంలో హైదరాబాద్ నగరంలో 'హరిజన గిరిజన బలహీన వర్గాలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా రాష్ట్ర మహాసభ' జరిగింది. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం 'ఉప్పెన' కవితా సంకలనం వెలువరించింది.

'అగిన మీ గుండెలలో అగ్నిజ్వాలలున్నవిలే
మూసిన మీ కన్నులలో మూగబాధలున్నవిలే'1

అనే ఆత్మవిశ్వాసాన్ని వై. విజయకుమార్ వీరిలో కలిగించే ప్రయత్నం చేస్తూనే...

'పూరి గుడిసెలకు అగ్గి పెట్టితే - మేడలు మిద్దెలు మిగలవురా
కష్టజీవి ముక్కంటి మంటలో - కాలి బూడిదై పోవునురా'2

అంటూ అగ్రవర్ణ దురహంకారులను గజ్జెల మల్లారెడ్డి హెచ్చరించారు. 'నిప్పుతో చెలగాటమాడితే ముప్పులు తిప్పలు తప్పవురా' అని గర్జించారు.

కుల తత్వాన్ని నిశితంగా నిరసించడంలోనూ, దళితులను చైతన్యపరచ డంలోనూ 'గద్దర్' అద్వితీయమైన కృషి చేశారు.

'యాలరో ఈ మాదిగ బతుకు
మొత్తుకుంటే దొరకదురా మెతుకు
నీకు మొత్తుకుంటే దొరకదురా మెతుకు'3

అనే గీతంలో...

---

1,2 'ఉప్పెన' (కవితా నీరాజనం) - ఆం. ప్ర. వ్యవసాయ కార్మిక సంఘం ప్రచురణ (1977).

3. 'గద్దర్ పాటలు' - జన నాట్యమండలి ప్రచురణ.

'మాలన్న మాదిగన్న
సీరుడన్న బేగరన్న
మేదరన్న మ్యాతరన్న
లంబాడన్న చెంచన్న' అను సంబోధిస్తూ...

గ్రామీణ జీవితంలోని వీరంతా అగ్రవర్ణాల దౌర్జన్యాలకు, కుల కలహాలకు బలైపోతున్న విధానాన్ని వర్ణించారు.

'తప్పుడు కొడుకులను తన్న
ఉప్పెనవలె ఉరికిరార'

అనే తిరుగుబాటు పాఠాలు పాటలల్లి ప్రచారం చేశారు.

ఇంకా కుల నిరసన గీతాలు రాసిన వామపక్ష కవుల్లో ఏటుకూరి ప్రసాద్, కాంచనపల్లి చిన వెంకట్రామారావు, మల్లిక్, విజయలక్ష్మి, లలితానంద్ మొదలైన రచయితలను పేర్కొనవచ్చు. విజయలక్ష్మి రాసిన 'కులం కులం అని కుత్సితాలు పెంచుకోకోయి - కూటికి లేనివాడా!' గీతం ఎంతో ప్రాచుర్యం పొందింది. బతుకులే వ్యాకులమైనప్పుడు కులాలేమిటని ప్రశ్నించింది.

వామపక్ష రచయితల సంఘాలతోబాటు 'కుల నిర్మూలన సంఘం' రచయితలు, కార్యకర్తలు కూడా కుల తత్వాన్ని నిరసిస్తూ కవితలను, గీతాలను ప్రచారం చేస్తున్నారు.

1954 లోనే 'జాతిభేద నిర్మూలక మండలి' ఎడ్లపల్లి, గుంటూరుజిల్లా వారు 'నవ్యగేయాలు' వెలువరించారు సు.భా. సుబ్బారావు రచించిన ఈ నవ్య గేయాల్లో 'హిందూ జీవన స్రవంతి'లో గొప్ప కళంకంగా నిలిచిన కులతత్వాన్ని నిరసించడం, జాతి భేదాలను నిర్మూలించే పిలుపు నివ్వడం కనబడుతుంది.

## పాలకవర్గంపై ఆగ్రహం, అధిక్షేపం

తెల్ల దొరతనం దోపిడినుండి విముక్తి పొందిన 'భరతావని' నల్లదొరల కైవసమయింది రోజు రోజుకూ సమస్యలు పరిష్కారం కాకపోగా, కొత్త సమస్యలు తలెత్తుతున్నాయి. ఆకలి, నిరుద్యోగం, నిరక్షరాస్యత వంటి సమస్యలు దేశ ప్రజలను నిర్వీర్యం చేస్తున్నాయి.

వామపక్ష కవులు ఈ పెట్టుబడిదారీ వ్యవస్థపై తమ ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నారు. పాలకవర్గాన్ని అధిక్షేపిస్తున్నారు.

'దోపిడిదారుల గుప్పిట్లోనా
దేశం చిక్కిందో నాయన - దేశం చిక్కిందో

ఖద్దరు టోపి గాంధీవాదులు
గద్దెలు ఎక్కింద్రో నాయన - గరీబు చేసింద్రో' ॥దోపిడి॥[1]

అనే గీతంలో వేల్పుల నారాయణ, గత నాలుగు దశాబ్దాలుగా దేశాన్ని పరిపాలిస్తున్న పాలకవర్గంపట్ల అసహనాన్ని వ్యక్తం చేస్తున్నారు.

ప్రజానాట్యమండలి గాయకుడు ఆర్. ప్రభు రాసి, పాడిన 'నాంపల్లి జేసనుకాడి' గీతంలో...

'లంచాలేమో ఎక్కువాయె
దొంగలదేమో రాజ్యామాయె
బుద్ధీలేని పెద్దా మనుషులు
గద్దెల మీదా కులకాబట్రి... నాంపల్లి'[2]

అంటూ తిందామంటే తిండీలేని, ఉందామంటే ఇల్లూలేని రామరాజ్యం తీరుతెన్నుల్ని బహిర్గతం చేశాడు. బీదాబిక్కి పొట్టలు గొట్టి మేదలు గడుతున్న సీకటిదొరల్ని ఆక్షేపించాడు.

'సూడు మల్లేశా! సూడు మల్లేశా
దేశమెటు పోతుందో కనరా మల్లేశా'

గీతంలో కె. లక్ష్మీనారాయణ సమకాలీన సమాజంలో రైతులు, కూలీలు మహిళలు పడుతున్న బాధలను వివరిస్తూ పొద్దుపొడస్తే ఒక పార్టీలో, పొద్దు మూకితే మరో పార్టీలో ప్రత్యక్షమవుతున్న రాజకీయ ఊసరవెల్లుల్ని తూర్పార పట్టాడు

ఇటీవలి కాలంలో తిరునగిరి రామాంజనేయులు రాస్తున్న అనేక గీతాల్లో కేంద్ర, రాష్ట్ర పరిపాలకులపై ఆగ్రహం ప్రస్ఫుటమౌతున్నది.

కొందరు కవులు మొత్తం పాలక వర్గాన్ని అధిక్షేపిస్తే, మరికొందరు కవులు ప్రధానమంత్రినో, ముఖ్యమంత్రినో వారి పేర్లతో సంబోధిస్తూ, వారి పాలనలో జరిగిన నిర్వాకాలను నిందిస్తున్నారు. ఇలా పేర్లను సంబోధించిన గీతాలు కొన్ని ప్రజల్లో విపరీతమైన ప్రచారాన్ని పొందాయి. అధికార పార్టీ మినహా, అన్ని ప్రతిపక్ష పార్టీలవారి మన్ననలు పొందాయి. అనేక అనుకరణ గీతాలు రావడానికి దారి చూపెట్టాయి.

వాటిలో బాగా ప్రఖ్యాతమైన కొన్ని గీతాలు పరామర్శించవచ్చు.

శ్రీమతి ఇందిరాగాంధి ప్రధానమంత్రిగా ఉన్న కాలంలో, ఆమె పాలనా విధానాన్ని నిరసిస్తూ వరంగల్ కళాకారుడు జి. వై. గిరి రాసిన గీతంలో...

---

1. 'ఎవనాదాలు' (పాటలు) - ప్రజా నాట్యమండలి, గోదావరి ఖని.
2. 'అగ్గి చిగుళ్ళు' (కవితలు) - అరసం ప్రచురణ (1978).

'కల్లబొల్లి కతలు జెప్పి - నంగనాచి మాటలాడి
గరీబోళ్ళ అమ్మనంటివే - ఓ ఇందిరమ్మ
గంజినీళ్ళు దొరకవాయెనే
మొండి చెయ్యి చూపినావు - దండిగ ఓట్లేసినాము
ఛండాలపు రాజ్యమాయెనే - ఓ ఇందిరమ్మ
లంచగొండి రాజ్యమాయెనే ॥కల్లబొల్లి॥'1

అంటూ... అసమర్థులను అందాలా లెక్కిస్తూ, ముఖ్యమంత్రులను కీలు బొమ్మలుగా వ్యవహరిస్తూ, తోలుబొమ్మలాట లాడుతున్న తీరు తెన్నులను వర్ణించాడు.

అదే కాలంలో రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉంటూ, అవినీతికి పర్యాయపదంగా మారిన చెన్నారెడ్డిని విమర్శిస్తూ...

'తెలుగుతల్లి కడుపులోన - కురుపులాగ బుట్టినావు
తెలివిలేని అజ్ఞానపు - పురుగులాగ బెరిగినావు
తెలివిదప్పి గెంతినావురో - చెన్రెడ్డి మామ !
తిక్కగంతులేసినావురో'2

అంటూ ప్రజానాట్యమండలి గాయనీగాయకులు పాడిన 'చెన్నరెడ్డిమామ' గీతం ఆంధ్రదేశమంతా మార్మోగింది. బుర్రకథ బెనర్జీ స్వరకల్పన చేసిన ఈ గీతాన్ని శ్రీమతి శారదారెడ్డి, శ్రీయుతులు శ్రీనివాస్, సాంబశివరావు, గని వంటి గాయకులు ఊరూరా గానం చేశారు.

అలాగే అంజయ్యగారు ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో...

'మాకు యాడదొరికినావురో - అంజయ్య
మా కొంపలు ముంచినావురో - అంజయ్య
ఇందిరమ్మ దీవెనతో ఓ అంజయ్య
అందరాని సీటు దొరికెరో అంజయ్య!'3

అనే గీతంలో... ఎయిర్ బస్‌వంటి మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసి; తన మాటలతో, చేష్టలతో తెలుగు కార్టూనిస్టులకు చేతినిండా పని కల్పించిన రాష్ట్ర నేతను రచయితలు అధిక్షేపించారు.

---

1 'ఎర్రకిరణం' - బెల్లంపల్లి ప్రజానాట్యమండలి ప్రచురణ.
2. 'విశాలాంధ్ర' (దినపత్రిక) 12-12-1979.
3. 'ఉద్యమం' (పాటలు) - ఆం. ప్ర ప్రజానాట్య మండలి, హైదరాబాద్ శాఖ ప్రచురణ (1982).

ఈ గీతాల ఆయుష్షు తక్కువే. ఫలానామంత్రి మారగానే ఆ పాటల జీవితం ముగుస్తుంది. అయితే వీటి బాణీలు ప్రతిభావంతంగా ఉంటే, తరువాతి పాలకుల పేర్లను జోడించి, వారి ఘనకార్యాలను వీటిలో చేర్చి రచయితలు, కళాకారులు కొత్తపాటలు కూరుస్తారు.

జి. వై. గిరి. రాసిన 'కల్లబొల్లికథలంచెప్పి' బాణీలో, తరువాతి ముఖ్యమంత్రి రామారావును విమర్శిస్తూ కర్నాటి వెంకటరామిరెడ్డి 'కాషాయ కసాయి తనం' గీతం రాశారు. అందులో...

'కల్లబొల్లి కథలు చెప్పి - నంగనాచి మాటలాడి
ఆడపడుచులన్న నంటివే - ఓ రామారావు
గరీబోళ్ళ అన్ననంటివే - ఓ రామారావు'[1]

అని రాస్తూ... టంగుటూరు రైతులపై కాల్పులు, వికారాబాద్ పోలీసుల వికారాలు, సమ్మెచేసిన వేర్వేరు ప్రజాశ్రేణుల ప్రజాతంత్ర హక్కుల హరింపు, ప్రజావ్యతిరేక ఆర్డినెన్సుల విజృంభణ వంటి అంశాల ప్రగతిని వర్ణించారు.

అలాగే... 'చెన్నారెడ్డి మామ' గీతానికి ప్రజానాట్య మండలి కళాకారులు అనుకరణ గీతమల్లారు.

'తెలుగు తల్లి కడుపులోన - కురుపులాగ బుట్టినావు
తెలివి లేని అజ్ఞానపు పురుగులాగ బెరిగినావు
ముఖ్యమంత్రి పదవి దొరికెరో - ఓ ఎన్టీఆర్
ముందు వెనుక లేకపాయెరో'

అనే గీతంలో బంధుప్రీతి, ఆశ్రితజనపక్షపాతం, ముఖ్యమంత్రి ఏకపక్ష ఆలోచన నిర్ణయాలు మొదలైన అంశాలు విమర్శింపబడ్డాయి.

జన నాట్యమండలి గాయకులు పాడుతున్న మరో గీతం...

'అన్నా వొచ్చిండే...రామన్నా వొచ్చిండే' అని సాగుతుంది.

గద్దర్ రాసిన ఈ గీతంలో రామారావు అధికారంలోకి రావడానికి ముందు చేసిన వాగ్దానాలు, అధికారంలోకి రాగానే చేసిన వాగ్దాన భంగాలు నిశిత విమర్శకు గురయ్యాయి.

ఇలా పాలక వర్గాలను అధిక్షేపిస్తున్న వామపక్ష రచయితలు, వీరి స్థానంలో వామపక్ష ప్రజాతంత్ర పరిపాలనను ఆకాంక్షిస్తున్నారు దేశ పురోభివృద్ధిని ఆశిస్తున్నారు. పీడిత ప్రజల సుఖమయ జీవితాన్ని కోరుకుంటున్నారు.

---

1. 'జనం పాటలు' - జనసాహితి ప్రచురణ.

## గిరిజన విముక్తి గీతాలు

1967 - 68 నాటి 'నక్సల్‌బరి' సాయుధ పోరాటం వెలుగులో 1969 నుండి ఆంధ్ర రాష్ట్రంలో 'నక్సలైట్ పోరాటం' మొదలయింది. శ్రీకాకుళం గిరిజన విముక్తి పోరాటంగా ప్రారంభమైన ఈ ఆందోళన అరణ్యాలను స్థావరాలుగా చేసుకుని 'గ్రామాల విముక్తి' నినాదంతో వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలకు విస్తరించింది. ఒక దశాబ్ద కాలం పాటు మేధావులను, రచయితలను, యువజన విద్యార్థులను, పీడిత రైతాంగాన్ని ప్రభావితం చేసిన ఈ సాయుధ పోరాటం వందలాది పోరాటగీతాల ఆవిర్భావానికి ప్రేరణనిచ్చింది.

సుబ్బారావు పాణిగ్రాహి, శివసాగర్, గద్దర్, వంగపండు ప్రసాద్, చెరబండరాజు మొదలైన వామపక్ష కవులు ఈ పోరాటానికి దర్పణం పట్టే గీతాలు రాశారు. జన నాట్యమండలి కళాకారులు పోరాట ఇతివృత్తాన్ని తమ కళారూపాల ద్వారా ప్రదర్శితం చేశారు.

పై రచయితల రచనలతోబాటు మరికొన్ని గీతికా సంకలనాలు 'సాయుధ పోరాట' ఆశయాలను జనంలోకి తీసుకెళ్ళాయి.

ఇంద్రవెల్లి ఘటనపై విప్లవ రచయితల సంఘం 'తుడుం' కవితా సంకలనం వెలువరించింది. జి. ఆంజయ్య 'ఉద్యమం' (పాటలు) 1978 లో ప్రచురించారు. అదే సంవత్సరం సూర్యాపేటలోని 'అరుణారుణ ప్రచురణల' వారు వివిధ కవులు రాసిన గేయాలతో 'క్రాంతి కిరణాలు' సంకలనం ప్రచురించారు. 1979 జనవరిలో ఉదయసాహితి (సాహితీ సాంస్కృతిక సంస్థ) కె. హనుమంతరెడ్డి రాసిన 'గుండెదండోరా' గీతాలను ప్రకటించింది. యుగ ప్రచురణలు, హైదరాబాద్‌వారు 'భూపాల్ పాటలు' (మార్చి 1979) వెలువరించారు అదే సంస్థ వారు 1981 సెప్టెంబర్‌లో 'వర్గీస్ పాటలు' ప్రచురించారు.

1980 మె మాసంలో శ్రీశ్రీ 'మరో ప్రస్థానం' వెలుగు చూసింది.

1983 జనవరిలో 'అరుణతార' సేకరించిన ప్రజల పాటలు 'ఎర్రపూలు' సంకలనాన్ని అరుణారుణ ప్రచురణలు, సూర్యాపేట వారు వెలువరించారు.

'శక్తి' రాసిన 'యుద్ధభేరి' పాటల సంకనం (డిసెంబర్' 84) ప్రభాత సాహితి, ఖమ్మం ప్రచురణగా వెలువడింది.

శ్రీకాకుళ గిరిజన రైతాంగ సాయుధ పోరాటం ఇతివృత్తంగా 'కానూరి' రచించిన 'జనగానం' నృత్యకళారూపాన్ని అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య 1985 ఫిబ్రవరిలో ప్రచురించింది.

ప్రజా రచయితల సమాఖ్య, ఖమ్మం జిల్లా యూనిట్ 1987 జనవరి మాసంలో తిర్మల్ కవిత 'ధిక్కార స్వరం' వెలువరించింది.

ఈ గీతాలన్నీ గిరిజన విముక్తి పోరాటాన్ని, గ్రామీణ సాయుధ రైతాంగ తిరుగుబాటును ప్రతిధ్వనిస్తున్నాయి.

'మోసపోబోకోయి - రైతన్నా - నీవు
మ్రోగించు రణభేరి - కూలన్నా...
నక్సల్‌బరి మార్గమే మన మార్గంర
శ్రీకాకుళ మంటలే మన పంటలుర
పండించు పంటలను మన యింట - పొల్లు
బోకుంట దంచాలి దారంట'[1]

అనే మార్గాన్ని రైతాంగానికి 'వర్గీస్' చూపెడుతున్నారు.

'విప్లవాల యుగం మనది
విప్లవిస్తె జయం మనది'[2]

అనే విప్లవాత్మక నినాదాన్ని తెలుగు ప్రజలకు అందించిన విప్లవకవి చెరబండరాజు...

'ఈ మట్టిని తొలుచుకొని విప్లవాలు లేస్తున్నై
ఎరుపెక్కిన ఈ మట్టికి మా నెత్తుటి స్వాగతాలు'[3]

అంటూ విప్లవాన్ని ఆపడం ఎవరి తరమూ కాదని ఎలుగెత్తి నినదించారు.

శ్రీకాకుళం గిరిజన పోరాటాకాశంలో ఉదయించిన 'ఉద్యమం నెలబాలుడు' శివసాగర్. విప్లవానికీ, కవిత్వానికీ విడదీయరాని అనుబంధాన్ని తన గీతాల ద్వారా ఋజువు చేసిన విప్లవకవి శివసాగర్. శ్రీకాకుళ పోరాటం తిరిగిన ప్రతి మలుపులోనూ ఈ కవి గీతాలు మనకు ప్రత్యక్షమవుతాయి. అక్కడి నుండి తెలంగాణా జిల్లాలకు వ్యాపించిన నక్సలైట్ ఆందోళనతోబాటు ఈ కవి గీతాలూ, కవితలూ కూడా సర్వవ్యాప్తమయ్యాయి.

'గ్రామాల విముక్తి చేసి
పట్టణాల చుట్టుముట్టి
కార్మిక కర్షక రాజ్యం
స్థాపించుట నిజమేనోయ్
....................

1. వర్గీస్ పాటలు - యుగ ప్రచురణలు (1981).
2, 3. చెరబండరాజు కవితలు - పాటలు.

రండోయ్! రండోయ్
ప్రజా విముక్తి సమరంలో
చేరగ వేగమె రండోయ్
రండోయ్! రండోయ్
..................
ఒంటరిగా లేం మనం
కోటి కోట్ల సేన మనం'

అంటున్న శివసాగర్ - చైనాలోని ఎర్రసేన, వియత్నాం గెరిల్లాలు, పాలస్తీనా కమాండోలు, అమెరికాలోని నల్లపులులు తమ వెంట ఉన్నాయని విప్లవకారులకు ధైర్యం చెబుతున్నాడు.

'తుది సమరం జరుగుతోంది
జగమంతా కదులుతోంది'

అంటూ...

'ప్రపంచ కార్మికులంతా
ఒకే కొమ్మ పువ్వులురా'1

అనే చారిత్రిక సత్యాన్ని కవితాత్మకంగా చాటి చెప్పారు.

'అదిగదిగో! నక్సల్‌బరి - రగిలించిన అగ్నికణం
ఇదిగిదిగో! శ్రీకాకుళం - పలికించిన రణశంఖం
తెలంగాణ, పంజాబ్‌లో - పోరాడే గెరిల్లాలు
బెంగాల్ మైదానాల్లో - ప్రభవించిన ప్రజాసేన
నీ ధర్మం సూచించును - నీ మార్గం చూపించును'

అనే 'కార్మికగీతం'లో పట్టణాల్లో పనిచేసే కార్మికులను పల్లెలవైపు చూడమని, రైతన్నలతో చేతులు గలిపి రణరంగంలో దూకమని 'శివసాగర్' విప్లవాహ్వానాన్ని అందించారు.

1972 డిసెంబర్‌లో పోలీసులకు చిక్కినప్పుడు 'ఖైదీగీతం' ఆలపించారు. భూమయ్య, కిష్టాగౌడ్‌లను ప్రభుత్వం ఉరితీసినప్పుడు ప్రతిస్పందించారు. సాయుధ సమరంలో ఒక్కొక్క వీరుడు నేలకొరుగుతున్నప్పుడు కవితాశ్రువులు రాల్చారు. స్మృతి గీతికలు అల్లారు.

అయినా ధైర్యాన్ని కోల్పోలేదు. ఆందోళన అప్పుడప్పుడూ అపజయం పొందినా, ప్రజల అండదండలతో మళ్ళీ పుంజుకుంటుందని విశ్వసించారు. అందుకే...

---

1. 'ఉద్యమం నెలబాలుడు' —శివసాగర్

'ఎల్లెంబు సారించరా ఓ చెలికాడా!
ఒల్లెంబు చేపట్టరా ఓ విలుకాడా!
మన చెలిమి నిలబెట్టరా!'

అంటూ విప్లవ సందేశాన్ని సాయుధ సమర యోధులకు శివసాగర్ అందిస్తున్నారు. విప్లవ విజయంపట్ల నిబద్ధతను ప్రకటిస్తున్నారు.

శ్రీకాకుళం సాయుధపోరాట సందేశాన్ని ప్రజల్లో ప్రచారం చేసిన మరో బలమైన కలం గద్దర్‌ది. పాట రాయడం, పాడడం, కాళ్ళకు గజ్జెకట్టి ఆడడం, పాటకు నేపథ్యాన్ని మాటల్లో ప్రతిధ్వనింపజేయడం గద్దర్ ప్రత్యేకత. ప్రజల బాణీలు ఆకళింపు చేసుకుని ప్రళయాగ్నులు కురిపించడం వల్ల ప్రజలు ఈ కవి పాటలను సొంతంచేసుకుంటున్నారు. గద్దర్ ప్రదర్శించే 'రగెల్ జండా' నృత్య రూపకం ఆదివాసీ ప్రజలను వ్యాపారులు చేస్తున్న నిలువుదోపిడికి ప్రతిరూపం.

'వోలీ వోలీల రంగవోలీ - శెమ్మకేలిల వోలీ'

అనే గీతంలో విప్లవ విద్యార్థులు సాయుధ పోరాట సందేశాన్ని ఊరూరా ప్రచారం చేయడం, వీరిని పోలీసులు పట్టుకుని కాల్చి చంపడాన్ని గుండెలు కదిలేలా గద్దర్ వర్ణించారు.

గద్దర్‌తోబాటు జన నాట్యమండలికి ఆయువు పట్టువంటి మరో కవి వంగ పండు ప్రసాదరావు. 'జజ్జనకరి జనారే', 'రండిరో రండన్నా', 'సుత్తికొడవలి గుర్తుగ ఉన్నా' వంటి ప్రజాదరణ పొందిన పెక్కు గీతాలతోబాటు 'కంపెనీ కూలోడు'వంటి నృత్య గీతాలెన్నో ఈ కవి రచించారు. జన నాట్యమండలి గీతాలుగా ప్రఖ్యాతమైన గీతాల్లో వంగపండు రాసినవి చాలా ప్రసిద్ధికెక్కాయి.

1970 లో శ్రీశ్రీ 'మరో ప్రస్థానం' వెలువడింది.

కల్లోల/నక్సల్బరీ/విరసం దశాబ్దంలో... విప్లవ రచయితల సంఘం ప్రచురణగా ఈ పుస్తకం వెలువడినట్లు ప్రకటించినప్పటికీ శ్రీకాకుళం గిరిజనోద్యమ ప్రభావం ఈ గీతాలమీద కానీ, ఈ గీతాల ప్రభావం శ్రీకాకుళం పోరాటం మీద కానీ ఏమాత్రం పడినట్లు కనబడదు.

పోరాటం జరుగుతున్న కాలంలో శ్రీకాకుళం పరిసర ప్రాంతాలకు చాలా దూరంగా, మద్రాస్‌లో ఉంటూ, పరోక్షానుభవంతో కేవలం 'ఊహ' ప్రాతిపదికగా శ్రీ శ్రీ ఈ గీతాలను రచించినట్లు, వీటిని చదవగానే అర్థమైపోతుంది.

'యిప్లవం యాడుందిరా
ఆడనే నీ కూడుందిరా
నీ గూడుందిరా

గోడు గోడున యేడ స్తవుంటే-యాడు నీహొంక రాడింకరా'[1]

అనే సుదీర్ఘ గీతంలో మరో ప్రస్థాన సందేశాన్ని అందించాడు శ్రీ శ్రీ

జననాట్యమండలి నుండి కొందరు విడిపోయి జనసాహితి, అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య వంటి సంస్థలను నెలకొల్పుకొనడం, ఒక సంస్థపై మరో సంస్థ కన్నెర్రజేయడం, ప్రభుత్వ దమనకాండ; పోరాటయోధుల్లో కొందరి భ్రమలు తొలగిపోవడం వంటి అనేక కారణాల వల్ల దీని ప్రభావం తెలుగు సాహిత్యంపై క్రమంగా తగ్గుముఖం పట్టింది. దానికితోడు వచనకవితా రూపమే సర్వస్వమనుకొనే తెగ ఒకటి బయలుదేరి; కవిత్వాన్ని అస్పష్టం, అయోమయం ఊబిలోకి నడిపిస్తూ ఉండడం కూడా వామపక్ష ప్రజా సాహిత్యానికి తీరని నష్టాన్ని కలిగిస్తూ ఉంది. కవితారంగంలో వామపక్షేతర ధోరణులకు దారులు చూపుతూ ఉంది.

## సమసమాజ నిర్మాణాకాంక్ష

ఇంతవరకు మనం చర్చించిన వామపక్ష గీతాలన్నింటిలోనూ అంతర్లయగా 'సమసమాజ నిర్మాణాకాంక్ష' కనబడుతోంది. వాస్తవిక సమాజాన్ని సౌందర్యాత్మక భావాలతో తమ గీతాల్లో ప్రతిబింబింపజేసిన వామపక్ష రచయితల 'తాత్త్వికత' సమసమాజ నిర్మాణం.

'రైతు భజనావళి' (1984) లో రష్యా విప్లవ మార్గం ఆంధ్రప్రజలకు ఆదర్శప్రాయంగా సంకలనకర్త ప్రకటించారు.

'ముందుకాలము రైతుదేనన్నా! నిదురించకను నీ - వందు
పాల్గొనసిద్ధపడుమన్నా!'[2]

అంటున్న రైతు భజనావళి కవులు వర్ణించిన 'ముందు కాలం' సామ్యవాదమే.

'కార్మిక భజనావళి' (1987); 'క్రాంతి గీతాలు' (1988) వెలుగుచూసే నాటికి ఈ భావం మరింత బలపడింది. ఈ సంకలనంలోని వద్దూరి అన్నపూర్ణయ్యగారి 'కూలీల రాజ్యం' గీతంలో...

'అమరా రాజ్యమద్ది - అనుమాన మదియేల
సామ్యవాదమునకు - సామ్యమెచ్చట బాబు
సమ్మెయే సరియైన - సాధన మందోయి
కూలీల రాజ్యము - కులుకుతూ వస్తుంది'[3]

అంటూ రాబోయే కూలీల రాజ్యానికి రహదారులు చూపార

---

1. 'మరో ప్రస్థానం' - శ్రీశ్రీ. —విప్లవ రచయితల సంఘం (1930).
2. 'రైతుభజనావళి' (పుట : 33)
3. 'క్రాంతి గీతాలు' (1988)

క్రాంతిగీతాల్లోని సీలపు తాతారావు రెడ్డిగారి 'స్వర్గస్థాపన' గీతంలో...

'దినకరుని ప్రభవోలె - దివ్యముగ వెలయుచును
భువినెల్ల వ్యాపించి - భూజనుల బ్రోచేటి
సోషలిజమును నమ్మరా - సోదరా
సామ్యవాదము నమ్మరా'

అంటూ ధనిక వర్గం, దరిద్ర వర్గమనే హెచ్చుతగ్గులను రూపుమాపే సామ్యవాదానికి స్వాగతం పలికారు.

శ్రీశ్రీ 'మరోప్రస్థానం' గీతంలో...

'మరో ప్రపంచం, మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచిందు'

అంటూ అగ్ని కిరీటపు నిగనిగల నడుమ, ఎర్రబావుటా ధగ ధగల నడుమ వర్ణించిన 'మరో ప్రపంచం' ఈ సమసమాజమే.

'ఇదెర్ర యేరువాకరా - మరోజగత్తు కేకరా'1

అని రాంభట్ల వినిపించిన మరో జగత్తుకేక ఈ నూతన సమాజానిదే.

"పదకాశ్మేడ్ ఈ దేశం - పురిటి బాధ పడుతున్నది
'కొత్తజగతి' ప్రసవానికి - పొలికేకలు పెడుతున్నది
ఓటుతోనో గోటితోనో - సమ్మె - బులెట్ షాటుతోనో
చీకటి ఉదరాన్ని చీల్చి - వేకువ తపియిస్తున్నది"2

అంటూ అభ్యుదయ రచయితలు వర్ణించిన 'కొత్తజగతి' సమసమాజమే.

వామపక్ష రచయితలు ఫాసిజానికి వ్యతిరేకంగా గొంతెత్తి గానం చేశారు. ప్రజాయుద్ధంలో సోషలిస్టు శక్తుల విజయాన్ని ఆకాంక్షించారు. మరో ప్రపంచ యుద్ధం వద్దని నినదించారు.

కార్మిక, కర్షక, యువజన, విద్యార్థి దళాలను కదలించారు. మహిళా చైతన్యానికి మార్గనిర్దేశం చేశారు.

పాలకవర్గంపై ఆగ్రహంతో నిప్పులు కురిపించారు. అధిక్షేప గీతాలద్వారా ఆక్షేపణ ప్రకటించారు.

---

1. 'ఎర్రపూలు' (కవితా సంకలనం) సం : గజ్జెల మల్లారెడ్డి; కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ.
2. 'ప్రతిధ్వని' - ప్రజానాట్యమండలి గీతాలు.

సాయుధ పోరాటాలకు సాహిత్య సమిధల్ని సమకూర్చారు. ఉరికంబం మీద నిలిచి, 'మరోజగతి' ఊసులు విన్నారు.

ఈ అన్ని గీతాల అంతిమ లక్ష్యం - సమసమాజ నిర్మాణమే.

'ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తి
ఒక జాతిని వేరొక జాతీ
పీడించే సాంఘిక ధర్మం'

సమాధి చేయబడే సామ్యవాద వ్యవస్థను స్థాపించడమే.

పై పాటలన్నింటినీ గమనించిన తరువాత ఒక ఆసక్తికరమైన అంశం కనబడుతున్నది. స్థూలంగా పైవి అన్నీ వామపక్ష భావజాలంతో వెలువడిన గీతాలే. కానీ ఆయా సంస్థల ఎత్తుగడలు, పోరాట తీవ్రతను బట్టి విభేదాలు ఏర్పడుతున్నాయి. సంస్థల పేర్లు చెప్పకుండా, ఆయా సంస్థలకు చెందిన రచయితల గీతాలను పరిశీలిస్తే, వారి సిద్ధాంత విభేదాలను ఎంతవరకు గుర్తించగలమనేది ప్రశ్న. ఆయా సంస్థల సభ్యులకు, మరియు అనేక విధాలుగా ఆ సంస్థలకు నిబద్ధులైన వారికి ఈ భేదాలను, లేదా ఛాయలను గుర్తించడం సాధ్యం కావచ్చు. కానీ ఇవేవీ తెలియక, వామపక్ష భావజాలంతో ఉత్తేజితులయ్యే సగటు శ్రోతలకు ఈ భేదం తెలుస్తుందా? ఫలానా సంస్థ సభ్యుడు రాసిన గీతమయినంత మాత్రాన, ఇతర సంస్థలవారు స్పందించడం జరుగదా?- ఇటువంటి ప్రశ్నలకు సమాధానాలు పొందడం మరికొంత పరిశీలనవల్లనే సాధ్యమవుతుంది.

# 10
# దళిత గీతాలు

తెలుగులో దళితుల సమస్యలను చిత్రిస్తూ చాలా కాలం నుండి సాహిత్యం వెలువడుతుంది. అయితే దళితులే దళిత సాహిత్యాన్ని సృష్టించుకోవడం ఇటీవలి కాలంలో కనబడుతుంది. దళితేతరులు దళితుల పక్షాన్ని వహించి రాయడం 'ఉదారవాదం'. దళితులే దళితుల సమస్యలపై ప్రతిఘటిస్తూ రాయడం 'ఆత్మాభిమానవాదం'.

ఇంతకూ దళితులంటే ఎవరు?

సాంఘిక దోపిడికి గురువుతున్నవారు, అస్పృశ్యులుగా పరిగణింపబడుతున్నవారు, నీచ వృత్తులుగా చూడబడుతున్న వృత్తులు చేసుకుంటున్నవారు, శారీరిక శ్రమపై ఆధారపడి బతుకులు గడుపుతున్నవారు దళితులు. శతాబ్దాలుగా విద్యకు, విజ్ఞానానికి, వికాసానికి దూరం చేయబడిన దళితులు ఇవ్వాళ విద్యావంతులౌతున్నారు. ఉద్యమిస్తున్నారు. సాటి దళిత సోదరులను చైతన్యపరచడానికి సాహిత్యాన్ని ఆయుధంగా ప్రయోగిస్తున్నారు. వీరి సాహిత్యాన్ని 'దళిత సాహిత్యం' అంటున్నాం. వీరి ఉద్యమాన్ని 'దళిత ఉద్యమం'గా పరిగణిస్తున్నాం.

## దళిత ఉద్యమం

జాతీయోద్యమ కాలంలో అస్పృశ్యతకు వ్యతిరేకంగా విస్తృత ప్రచారం జరిగింది. వామపక్ష ఉద్యమంలో భాగంగా కూడా కులతత్వంపై నిరసన ప్రకటితమయింది. వర్ణదురహంకారాన్ని తీవ్రంగా నిరసించడం జరిగింది.

అయితే ఈ ఉద్యమాలు వర్ణవ్యవస్థపై ప్రత్యక్ష పోరాటాన్ని నిర్వహించలేదు. బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జాతీయోద్యమ యోధులు పోరాడారు. పెట్టుబడిదారీ వ్యవస్థకు వ్యతిరేకంగా వామపక్షాలు వర్గపోరాటాన్ని ప్రచారం చేస్తున్నాయి.

వీటికి భిన్నంగా డా॥ బి. ఆర్. అంబేద్కర్ - 'వర్ణపోరాటానికి' పిలుపునిచ్చారు.

'చాతుర్వర్ణ వ్యవస్థలాంటి భ్రష్టవ్యవస్థ ప్రపంచంలో మరెక్కడా కానరాదు. ప్రజలను జీవచ్ఛవాలుగా, నిర్వీర్యులుగా, పక్షపాత రోగులుగా, ఎందుకూ

పరికిరాని చవటలుగా తయారుచేసిన నికృష్ట నీచవ్యవస్థ. ప్రపంచంలోని అన్ని రాజ్యాలలోనూ సాంఘిక విప్లవాలు జరిగి, సమాజంలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చాయి. కాని భారతదేశంలో మాత్రం సాంఘిక విప్లవం ఆవిర్భవించలేదు. దీనికి కారణం చాతుర్వర్ణ వ్యవస్థయే

పీడిత వర్గాలు సమైక్యమై మానవత్వం కోసం, ఆర్థిక సమానత్వంకోసం నిర్విరామమైన పోరాటం నడపాలి. భూనభోంతరాళాలు ప్రతిధ్వనించేలా సాంఘిక విప్లవశంఖాన్ని పూరించాలి.'[1]

అని ప్రబోధించిన అంబేద్కర్ - 'సాంఘిక విప్లవం' ద్వారా సర్వమానవ సమానత్వం, 'ఆర్థిక విప్లవం' ద్వారా సుఖమయ జీవనం, 'రాజకీయ చైతన్యం' ద్వారా మానవ విలువల పరిరక్షణ సాధించుకోవాలి' అన్నాడు. జీవితాంతం అస్పృశ్యతకు వ్యతిరేకంగా, కులవ్యవస్థకు వ్యతిరేకంగా అవిశ్రాంత పోరాటం కొనసాగించాడు. 'విద్యావంతులు కండి', 'సంఘటితం కండి', 'ఎదురు తిరగండి' అనే నినాద త్రయాన్ని దళిత ప్రజానీకానికి అందించిన సాంఘిక విప్లవకారుడు ఆయన.

డా॥ బి. ఆర్. అంబేద్కర్ సిద్ధాంతాల ప్రాతిపదికన ప్రారంభమైన ఉద్యమాన్ని 'దళిత ఉద్యమం' అంటున్నాం. ఇది త్రిముఖాలుగా కొనసాగుతుంది.

వాటిలో ఒకటి - రాజకీయ పోరాటం. పార్లమెంటు, శాసనసభల్లో ఉన్న రిజర్వ్ స్థానాల కోసం నిమ్న వర్గాల ప్రజలు జరుపుతున్న ఎన్నికలపరమైన పోరాటం ఇందులో ప్రధానమైనది. దళితులకు రాజ్యాంగ పరమైన రక్షణలు, సౌకర్యాలు కల్పించడం, పార్లమెంట్‌లోనూ, అసెంబ్లీలోనూ కొన్ని స్థానాలను గెలిచి, ఆ అధికారంతో మారుమూల గ్రామాల్లో అన్యాయాలకు, దౌర్జన్యాలకు బలైపోతున్న సోదర ప్రజలకు సాంఘిక న్యాయం చేకూర్చడం; దళిత ప్రజలు స్వాభిమానంతో జీవించడానికి కావలసిన సౌకర్యాలు సమకూర్చడం - దీని ప్రధాన ఆశయాలు.

ఇక రెండవది - ఆర్థిక పోరాటం. నిమ్నవర్గాల వారికి కావలసిన కనీస సౌకర్యాలను సమకూర్చడంలో, రిజర్వేషన్‌లను అమలు జరపడంలో జరిగే మోసాలను బహిర్గతం చేయడం, ఆర్థిక దోపిడి నుండి దళితులను విముక్తులను జేసి ఆర్థిక సమానత్వం కోసం పాటుపడటం దీని లక్ష్యం. మార్క్సిస్టు సిద్ధాంతాల వల్ల ప్రభావితులైన యువకులు ఈ పోరాటంలో అగ్రశేణిలో ఉంటున్నారు.

1. 'అంబేద్కర్ సూక్తులు' - సంకలనం: డి. ఆర్. కుసుమ.
డా॥ అంబేద్కర్ మెమోరియల్ సొసైటీ, హైదరాబాద్ ప్రచురణ

మూడవది - సాంఘిక పోరాటం. ఇదే ప్రధానమైనది. దళితుల పట్ల సవర్ణ హిందువులు అవలంబిస్తున్న అమానుష వైఖరికి వ్యతిరేకంగా, భౌతిక దాడులకు వ్యతిరేకంగా సాంఘిక అస్తిత్వం కోసం, సమాన గుర్తింపు కోసం దళితులు జరుపుతున్న నిరంతర పోరాటమిది.

డా॥ అంబేద్కర్‌కు ముందే చాలామంది సాంఘిక విప్లవకారులు సాగించిన పోరాటాలు ఈ దళిత ఉద్యమానికి కావలసిన నేపథ్యాన్ని సమకూర్చి పెట్టాయి.

నిమ్నవర్గాల ఉద్ధరణ కోసం మహారాష్ట్రలో మొదటిసారిగా జ్యోతిబా పూలే (1827 - 1890) తిరుగుబాటుకు పిలుపు నిచ్చాడు. సవర్ణుల యుక్తితో కూడిన ఆధిపత్యం, నిమ్నవర్గాల అజ్ఞానం ఇక్కడి సాంఘిక వికృతాలకు మూలమని ఆయన భావించాడు. 1874 లో 'సత్యశోధక్ సమాజ్' అనే సంస్థను స్థాపించాడు. కొల్హాపూర్ మహారాజు రాజర్షి షాహూమహరాజ్ శ్రీ పూలే అభిప్రాయాలకు అన్నివిధాలుగా సహాయాన్ని ప్రకటించాడు. దళితులను జాగృతం చేయడంలోనూ, ఆలోచింపజేయడంలోనూ, అగ్రవర్ణాలహంకారంపై ఎదురు తిరగడంలోనూ వీరి 'సత్యశోధక్ సమాజ్' విశేషమైన కృషిచేసింది.[1]

ఆ తరువాత మహారాష్ట్ర, ఉత్తర భారతం, కేరళ, కర్ణాటక వంటి ప్రాంతాల్లో అనేక మంది దళిత నాయకులు సాంఘిక అసమానతలకు వ్యతిరేకంగా పోరాటాలు నిర్వహించారు.

1910 నాటికి దళితుల సమస్య ఒక ఆందోళన రూపం దాల్చింది. శివరామ్ కాంబ్లే అనే మహారాష్ట్రుడు భారత దేశంలో మొట్ట మొదటిసారి 'నిమ్న జాతులవారి మహాసభ'ను ఏర్పాటు చేశాడు. పూనానుండి 'సోమవంశీయ మిత్ర' అనే మాసపత్రికను వెలువరించాడు. అదే కాలంలో మరాటా వంశంలో 'కర్మవీర్ షిందే' అనే మరొక నాయకుడు ఆవిర్భవించాడు.

ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో 'సోషియాలజీ' అభిమాన విషయంగా చదువుతున్న 'షిందే' అక్కడి సామాజిక పరిస్థితులను అవగాహన చేసుకున్నాడు. స్వదేశానికి తిరిగి రాగానే ఇక్కడి స్థితిగతులను అంచనా కట్టాడు. దేశం నలుమూలలా పర్యటించి, నారాయణ్ గణేశ్ చందావర్కర్ సహకారంతో 1906 లో 'దళిత జాతుల సేవా సంఘా'న్ని స్థాపించాడు. చాలా తక్కువ కాలంలోనే ఈ సంఘ శాఖలు దేశం నలుమూలలా విస్తరించాయి.

---

1. 'దళిత సాహిత్యం - పూర్వరంగం' - డా॥ సూర్యనారాయణ రణసుభే, డా॥ కమలాకర్ గంగావణే. 'దళిత కథలు' (సంకలనం) - హైదరాబాద్ బుక్‌ట్రస్ట్.

స్వాతంత్ర్య పోరాటంలోకి దళితుల్ని కలుపుకొని రావాలన్న అభిప్రాయం కొందరు జాతీయ కాంగ్రెస్ నాయకులకు కలిగింది. వారి ప్రోత్సాహంతో దళిత జాతుల సమావేశాలు రెండు జరిగాయి. మొదటి సమావేశానికి నారాయణ్ గణేశ్ చందావర్కర్ అధ్యక్షత వహించారు. 'దళిత జాతుల ప్రతినిధులకు అసెంబ్లీలో స్థానం ఉండాలని' కోరుతూ సమావేశం తీర్మానించింది. రెండవ సమావేశంలో 'సవర్ణ హిందువులతో ఏర్పడబోయే ప్రభుత్వాన్ని దళితులు ఆమోదించరని' తీర్మానించారు. దళితుల ప్రతినిధులకు అసెంబ్లీలో స్థానం కల్పించాలనీ, వారిని దళితులే ఎన్నుకునే హక్కును కల్పించాలనీ ఈ సమావేశం ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది. డా॥ అంబేద్కర్ ఈ రెండు సమావేశాలకూ హాజరు కాలేదు.

కలకత్తా కాంగ్రెస్ సమావేశం (1917) దళితజాతుల అభివృద్ధిని కోరుతూ, కులవ్యవస్థను నిరసిస్తూ తీర్మానాలు చేసింది. అదే సంవత్సరం దేశంలోని వివిధ రాజకీయవర్గాల ప్రతినిధులను కలుసుకుని, వారి అభిప్రాయాలు సేకరించడానికి 'మాంటేగ్' భారతదేశం వచ్చాడు. భారతదేశ రాజకీయ చరిత్రలో మొదటిసారిగా 'అస్పృశ్యుల' అభిప్రాయాలనుకూడా సేకరించారు. దీనితో దళిత జాతుల ప్రతినిధులు దేశ రాజకీయ రంగంలోకి రాగలిగారు.

1918 మార్చి 23, 24 తేదీల్లో బొంబాయిలో మొదటిసారిగా 'అఖిల భారత దళిత జాతుల సమావేశాలు' జరిగాయి. బరోడా మహారాజు షయాజీరావు గాయక్వాడ్ పీఠికి అధ్యక్షత వహించాడు. విఠల్‌బాయి పటేల్, జయకర్, తిలక్, బిపిన్ చంద్రపాల్‌వంటి రాజకీయ నాయకులు ఈ సమావేశాలకు హాజరయ్యారు. 'సవర్ణ హిందువులు నిమ్నజాతులవారిని సానుభూతితో చూడాలని' నారాయణ్ గణేశ్ చందావర్కర్ విజ్ఞప్తి చేశాడు. సమావేశం ముగింపులో 'అఖిల భారత అస్పృశ్యతా నివారణోద్యమం' ప్రణాళిక ప్రకారం 'తాము తమ దైనందిన జీవితంలో అస్పృశ్యత పాటించబోమనే' ప్రకటనపై ప్రతినిధులు సంతకాలు చేశారు. సమావేశంలో గంభీరోపన్యాసం చేసిన తిలక్ మాత్రం ఈ ప్రకటనపై సంతకం చేయలేదు.

1919 నాటి బ్రిటీష్ చట్టం ద్వారా పరిపాలనా వ్యవస్థలో మొట్టమొదటిసారిగా దళితుల ఉనికి కానవచ్చింది. కేంద్ర అసెంబ్లీలోని 14 మంది అనధికార సభ్యుల్లో ఒక దళితజాతి ప్రతినిధికి ప్రభుత్వం అవకాశం కల్పించింది. ఆనాటికి దళితులు సాధించిన గొప్ప విజయంగానే దానిని భావించవచ్చును.

దేశానికి రాజకీయ స్వాతంత్ర్యం లభించగానే సమస్యలన్నీ పరిష్కారమైపోతాయన్న ఆశ ఆనాడు చాలామందికి ఉండేది. అఖిల భారత కాంగ్రెస్ సమా

వేళాల్లో సామాజిక అసమానతలు, మూఢనమ్మకాలు, దురాచారాలు వంటి అంశాలు విమర్శింపబడేవి. కుల, మత వివక్ష పాటించరాదని నాయకులు పదే పదే ప్రబోధించేవారు; కానీ ఆచరణలో అమలు జరిగేవి కాదు. దానితో అల్ప సంఖ్యాక వర్గాల నాయకులు తమ సమస్యలను తామే పరిష్కరించుకోక తప్ప దన్న నిర్ణయానికి వచ్చారు. మహమ్మదీయులకు 'మహమ్మదాలీ జిన్నా', నిమ్న జాతులకు 'అంబేద్కర్', ఆంగ్లో ఇండియన్‌లకు 'ఫ్రాంక్ ఆంథోని' ప్రతినిధు లుగా నిలిచారు.

దళిత జాతుల జనాభాను అనుసరించి వారికి కేంద్ర అసెంబ్లీలోనూ, శాసనసభల్లోనూ కొన్ని సీట్లు కేటాయించాలనీ, సవర్ణ హిందువులు దళితజాతుల పట్ల తమ వైఖరిని మార్చుకోవాలనీ, స్వపరిపాలన సిద్ధించడానికి ముందు సాంఘిక సమానత్వం రావాలనీ డా॥ అంబేద్కర్ వాదించారు. తన అభి ప్రాయాలు అటు ప్రభుత్వానికీ, ఇటు ప్రజలకూ తెలియజేయడానికి నిమ్న జాతుల్లో చైతన్యం కలిగించడానికి 'మూక్ నాయక్' అనే పత్రికను ఉపయోగించు కున్నాడు.

1924 మార్చిలో అంబేద్కర్ అస్పృశ్యతా నివారణోద్యమాన్ని చేపట్టాడు. మార్చి 9 న బొంబాయి లోని దామోదర్ హాల్‌లో 'దళితుల సమా వేశం' జరిగింది. అక్కడ ఒక కమిటీని రూపొందించారు. దానిపేరు 'బహి ష్కృత హితకారిణీ సభ'. నిమ్నజాతులను అట్టడుగు స్థితినుంచి పైకి తెచ్చి, సమాజంలో వారికి సమానస్థాయిని కల్పించడం ఈ సభ ఆశయం.

'దళితులు తమ స్థితిని తాము గుర్తెరిగి తమను తామే ఉద్ధరించుకోవాలి. తమ సమస్యలను తామే పరిష్కరించుకోగలగాలి. సవర్ణుల కన్నా తాము ఎందులోనూ తక్కువ కాదని గ్రహించాలి. స్వయంసేవ మన కర్తవ్యం. దానికి మించినది వేరొకటిలేదు' అనే చైతన్యయుతమైన ప్రబోధాన్ని డా॥ అంబే ద్కర్ దళిత జాతులకు అందించారు[1] 'శూద్రులంటే ఎవరు?' 'అస్పృశ్యు లెవరు?' 'కుల నిర్మూలన', 'భారతదేశంలో కులాలు' వంటి పుస్తకాలెన్నింటినో రాశారు. అనేక వ్యాసాల ద్వారా దళితప్రజల చైతన్యస్థాయిని పెంచారు.

డా॥ అంబేద్కర్ నాయకత్వంలో దళితులు సంఘటితమయ్యారు. తమ హక్కులను సాధించడానికి పోరాటాలు నిర్వహించారు. అతని సిద్ధాంతాల వెలుగులో 'దళిత ఉద్యమం' దేశంలోని అన్ని ప్రాంతాలకూ విస్తరిస్తున్నది.

ఇటు దక్షిణ భారతదేశంలో దళిత ఉద్యమం పేరుతో కాకపోయినా, దళితుల సమస్యను స్పృశించిన ఆందోళనలు కొన్ని తలెత్తాయి. అలాగే

1. 'బాబాసాహెబ్ అంబేద్కర్' - డా॥ జి విజయభారతి.

1909 లో మద్రాస్‌లో 'అస్పృశ్యతా నివారణ సంఘం' ప్రారంభమయింది. తమిళనాడులో బ్రాహ్మణాధిక్యతకు వ్యతిరేకంగా ప్రారంభమైన పోరాటం నుండి 1916 లో 'దక్షిణభారత విముక్తి సమాఖ్య' మరియు 'జస్టిస్ పార్టీ'లు ఏర్పడ్డాయి. 1920 లో తమిళనాడులో ఈ పార్టీ అధికారంలోకి వచ్చాక బ్రాహ్మణాధిక్యతను తగ్గిస్తూ వచ్చింది. బ్రాహ్మణ కులాధిక్యతకు వ్యతిరేకంగా; అలాగే గాంధీగారు అనుసరించే వర్ణాశ్రమ ధర్మసిద్ధాంతాలకు వ్యతిరేకంగా శ్రీ ఇ. వి. రామస్వామినాయకర్ కాంగ్రెస్ నుండి బయటపడి, 'ఆత్మగౌరవం' ఉద్యమాన్ని ప్రారంభించారు. 'ప్రత్యేక ద్రవిడస్థాన్' నినాదంతో 'ద్రవిడ కజగం' పార్టీని నిర్మించారు.

ఈ పోరాటాల ఫలితంగా తమిళనాడులో 1927 లో కమ్యూనల్ జీ.వో. వెలువడింది. హరిజన, గిరిజన, ముస్లిం, క్రైస్తవులంతోబాటు వెనుకబడిన కులాల వారికి విద్యలోనూ, ఉద్యోగాలలోనూ రిజర్వేషన్లు కల్పించబడినాయి.

బ్రాహ్మణ కులాధిక్యతకు వ్యతిరేకంగా 1917 లో కర్నాటకలో బ్రాహ్మణేతరులు 'ప్రజామిత్ర మండలి' ని స్థాపించుకున్నారు. తమ హక్కులను సాధించుకోవడానికి పోరాటాలు సాగించారు ఫలితంగా 1921 లో వెనుకబడిన తరగతులవారికి విద్యలోనూ, ఉద్యోగాలలోనూ రిజర్వేషన్లు అప్పటి కర్నాటక ప్రభుత్వం కల్పించింది.

ఇలాగే మహారాష్ట్ర, తదితర రాష్ట్రాల్లో కూడా హరిజన, గిరిజన, వెనుకబడిన కులాలవారు అనేక పోరాటాలద్వారా కొన్ని రిజర్వేషన్‌లను సాధించుకోగలిగారు. ఆయా ప్రాంతాల్లో దళితుల ఉద్ధరణకోసం నెలకొన్న సంస్థల్లో ప్రధానంగా పేర్కొనదగినవి:

'సర్వెంట్స్ ఆఫ్ పీపుల్స్ సొసైటీ' సభ్యులు అయిదుగురు 1924 లో 'అమాతోద్దార్' (అస్పృశ్యుల ఉద్ధరణ) సంఘాన్ని నెలకొల్పారు. అస్పృశ్యత నివారణ కోసం ఈ సంఘం కృషి చేసింది. 1932 లో మదన్‌మోహన్ మాలవీయ 'ఆల్ ఇండియా అన్‌టచబిలిటీ లీగ్' స్థాపించారు ఈ సంస్థ తరువాతి కాలంలో 'అఖిల భారత సేవక సంఘం'గా రూపాంతరం చెందింది. 1935 లో పంజాబ్‌లో 'జాత్ పాత్ తోడక్ మండల్'ని డా॥ గోకుల్‌చంద్, సంత్‌రాం, ఇంద్రసింగ్ మొదలగువారు కులనిర్మూలన ధ్యేయంతో నెలకొల్పారు. 1942లో డా॥ బి ఆర్. అంబేద్కర్ 'ఆల్ ఇండియా షెడ్యూల్డు క్యాస్టు ఫెడరేషన్' ప్రారంభించారు. 1946 లో బాబూ జగ్జీవన్‌రాం 'దళితజాతుల సంఘాన్ని' స్థాపించి, హరిజనుల అభివృద్ధికి కృషిచేశారు.

ఆంధ్రప్రాంతంలో 19వ శతాబ్దాంతం నాటికి ఏలూరులో 'ఆదిఆంధ్ర మహాసభ' స్థాపితమయింది. హైదరాబాదులో శ్రీ భాగ్యరెడ్డివర్మ 'ఆది హిందూ సేవాసంఘం' స్థాపించారు. 1932 లో శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు అధ్యక్షులుగా 'ఆంధ్ర రాష్ట్ర హరిజన సేవాసంఘం' నెలకొన్నది.

ఈ సంస్థలన్నీ దళితుల ప్రయోజనాలను కాపాడడానికి, అంటరానితనం నిర్మూలనకు, అస్పృశ్యులు దేవాలయాల్లో ప్రవేశించడానికి, సాంఘిక సమానత్వాన్ని ప్రచారం చేయడానికి విశేషమైన కృషి చేశాయి.

1930లో నాసిక్ దేవాలయ ప్రవేశోద్యమం జరిగింది. దీనికి ప్రతిస్పందనగా తిరుపతి దేవాలయంలోకి ఎత్తిరాజులు దాసు అనే దళితుడు ప్రవేశించి, సంచలనం సృష్టించాడు దేవస్థాన సంబంధమైన చట్టాల ప్రకారం నేరారోపణ నెదుర్కొని కోర్టులో చట్టబద్ధ పోరాటం సాగించాడు. గురువాయూరు దేవాలయ ప్రవేశం కోసం 1932 సెప్టెంబర్ 20 న 'దేవాలయ సత్యాగ్రహం' జరిగింది. ఫలితంగా ఆనాటి రాజ ప్రతినిధి, హరిజనుల ఆలయ ప్రవేశంపై ఉన్న నిషేధాన్ని తొలగించే శాసనం చేయగలమని ప్రకటించాడు ఆ శాసనం రూపొందక ముందే ఆంధ్ర ప్రాంతంలో కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి నాయకత్వంలో హరిజనుల ఆలయ ప్రవేశం జరిగింది. 1932లో గాంధీజీ 21 రోజులు ప్రాయోపవేశం చేసినప్పుడు హరిజనుల ఆలయ ప్రవేశాలు విరివిగా జరిగాయి. వీటిలో 1939 నాటి 'మీనాక్షి దేవాలయ ప్రవేశం' విశేషమైనది.

అస్పృశ్యత వెనుక ఉన్న సాంస్కృతిక కారణాలను తెలుసుకున్న సంస్కర్తలు దళితుల విద్యాభివృద్ధికోసం తమకు తోచిన పద్ధతుల్లో ప్రయత్నించారు. 1852లో మహాత్మా జ్యోతిబా పూలే అస్పృశ్యులకోసం మొట్టమొదటి పాఠశాలను స్థాపించారు. సంఘబహిష్కారాన్ని కూడా లక్ష్యపెట్టక పాఠశాలను కొనసాగించారు. 1912 లో లాలారాం ప్రసాద్‌గారు పంజాబ్‌లో 'నిమ్నజాతుల విద్యాసంఘం' నెలకొల్పి, దళితుల విద్యావికాసానికి కృషి చేశారు. ఆంధ్ర ప్రాంతంలో 1909 లో చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులు అస్పృశ్యులకోసం పాఠశాలను ప్రారంభించారు. ఇందులో ఆదిఆంధ్ర విద్యార్థులకోసం భోజన వసతి సదుపాయాలుకూడా కల్పించారు. పిఠాపురం మహారాజు, రఘుపతి వేంకటరత్నం నాయుడు కూడా దళితుల విద్య కోసం పాటుపడ్డారు. 1922 లో హరిజనుల కోసం 'శాంతి కుటీరము' వసతిగృహాన్ని నెలకొల్పారు. 1918 జనవరి 10 న తెనాలి తాలూకా పెదపాలెంలో నల్లపాటి హనుమంతరావుగారు హరిజనులకు విద్య, చేతి వృత్తులు నేర్పడానికి 'శ్రీకృష్ణాశ్రమం' స్థాపించారు.

హైదరాబాద్‌లో భాగ్యరెడ్డి వర్మగారు దాదాపు 30 విద్యాలయాలు నెలకొల్పి హరిజనుల విద్యాభివృద్ధికోసం ప్రయత్నించారు గాంధీగారి రాజకీయ రంగప్రవేశానికి ముందే 1920 నాటికి ఆంధ్రప్రాంతంలో హరిజనుల విద్యకోసం దాదాపు 6,183 పాఠశాలలు స్థాపింపబడినాయి.

హరిజనుల జీవితాల్లో మౌలిక మార్పులకోసం కృషి చేయనప్పటికీ; పై వ్యక్తులు, సంస్థలు వాటి వాటి పరిమితుల్లో కొన్ని సంస్కరణలు సాధించడానికి; కొంతవరకు హరిజనుల్లో విద్యావశ్యకతను ప్రచారం చేయడానికి తమ వంతు కృషి చేశాయి.

స్వాతంత్ర్యానంతరం డా॥ అంబేద్కర్ అధ్యక్షతన రూపొందిన భారత రాజ్యాంగంలోని 17వ ఆర్టికల్ 'అస్పృశ్యతా నిర్మూలన'ను నిర్దేశిస్తుంది. 46 వ ఆర్టికల్ 'ప్రభుత్వం బలహీనవర్గాల యొక్క; ప్రత్యేకించి షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగలయొక్క విద్య, ఆర్థిక ప్రయోజనాలను వృద్ధిపరచుటకు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలి. అన్నిరకాల దోపిడీల నుండి, సాంఘిక అన్యాయాల నుండి వారిని సంరక్షించాలి' అంటూ నిర్దేశిస్తుంది. రాజ్యాంగచట్టం ఆర్టికల్ 15 (4), 16 (4)ల ప్రకారం హరిజనులకు (షెడ్యూల్డ్ కులాలు), గిరిజనులకు (షెడ్యూల్డ్ తెగలు) సాంఘికంగా, విద్యావిషయకంగా రిజర్వేషన్లు, ఇతర ఆర్థిక, రాజకీయ సదుపాయాలు కలుగజేయాలని సూచిస్తుంది.

సంవత్సరాల తరబడిగా దళితులు పోరాడి సంపాదించుకున్న హక్కులను పరిరక్షించుకోడానికి దళిత ఉద్యమం పాటుపడుతున్నది. రిపబ్లికన్ పార్టీ, దళిత్ పాంథర్, దళిత్ మహాసభ వంటి సంస్థలు ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకు పోతున్నాయి.

1984లో 'ఖాన్‌సీరామ్' దళితుల రాజకీయ హక్కులను సాధించుకోవడానికి 'బహుజన సమాజ్ పార్టీ' అనే రాజకీయ పార్టీని స్థాపించారు దేశంలోని అనేక ప్రాంతాలు పర్యటిస్తూ, ఆ పార్టీ శాఖలను ఆయన నెలకొల్పుతున్నారు. 1989 మే మాసంలో ఆ పార్టీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రశాఖ ఏర్పడింది.

ఆంధ్రప్రదేశ్‌లో అనేక రాజకీయ పార్టీలు, సాంఘిక సంస్థలు దళితుల ప్రయోజనాలను కాపాడడానికి కృషి చేసినప్పటికీ ఒకొక ఉద్యమ రూపాన్ని ధరించింది మాత్రం 1985 నుండే చీరాల సమీపంలో ఉన్న కారంచేడులో దళితులపై అగ్రవర్ణాల దాడి జరిగింది. ప్రాణనష్టం, ఆస్తినష్టం సంభవించాయి. దీనికి ప్రతిస్పందనగా దళిత ఉద్యమం క్రమంగా రాష్ట్రవ్యాపిత ఉద్యమంగా రూపొందుతుంది. 1983 జూలై మాసంలో విశాఖపట్టణంలో 'దళిత మహాసభ' జరిగింది. ఈ మహాసభలో దళిత విద్యార్థి సంఘం, దళిత యువజన సంఘం,

దళిత మహిళా సంఘం, దళిత సాహిత్య-సాంస్కృతిక సంఘం వంటి ప్రజా సంఘాలు ఏర్పడ్డాయి. దళిత ప్రజల్లోని వేర్వేరు శ్రేణుల్లో పనిచేస్తూ, వారిలో 'దళిత చైతన్యాన్ని' పురిగొల్పడానికి ఇవి పాటుపడుతున్నాయి.

## దళిత సాహిత్యోద్యమం

దళితులనుండి రచయితలు ఉద్భవించి, దళితులకోసం రచనలు చేయడం ఈ ఉద్యమానికి గీటురాయి. దళితుల్లో క్రియాశీల శక్తిని పెంపొందించడం ఈ ఉద్యమ లక్ష్యం.

దళితులకోసం దళితేతర రచయితలు రచనలు చేయడం అన్ని భాష ల్లోనూ చాలా కాలంనుండి ఉన్నది.

అయితే... వేలాది సంవత్సరాలుగా విద్యకు, విజ్ఞానానికీ, కనీస అక్షర జ్ఞానానికి నోచుకోని దళితపుత్రులు, ఇప్పుడు విద్యావంతులై. రచనాశక్తిని అలవరుచుకుని, దళిత సాహిత్య సృష్టికి నడుం బిగిస్తున్నారు ఇదొక గొప్ప పరిణామం.

వర్ణవ్యవస్థ వేలయేళ్ళుగా దళితులకు విద్యను నిషేధించింది. అందుకే దాని నిర్మూలనకు దళితులు పోరాడుతున్నారు. బ్రాహ్మణ్యం దళితుల హక్కు లను కాలరాచిందనే భావం ప్రబలింది. అందుకే వాళ్ళు దాన్ని వ్యతిరేకిస్తున్నారు.

దళితుల సమస్యను చిత్రించిన తొలి భారతీయ నవల 'అన్‌టచబుల్'. ముల్కురాజ్ ఆనంద్ ఈ నవలను రచించారు.

మున్షి ప్రేంచంద్, రవీంద్రనాథ్ టాగోర్ వంటి రచయితలు అస్పృశ్య తను తమ రచనల్లో నిరసించారు.

తెలుగులో దళితుల సమస్యలను; ముఖ్యంగా అస్పృశ్యత సమస్యను వేర్వేరు కోణాల్లో చిత్రించిన ప్రముఖ నవలలుగా ఈ క్రింది వానిని పేర్కొన వచ్చు:

తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారి 'హేలావతి' (1913), వేంకట పార్వతీశ్వర కవులు రాసిన 'మాతృమందిరము' (1919), ఉన్నవ లక్ష్మీనారా యణ గారి 'మాలపల్లి' (1922), ఆచార్య రంగనాయకులు గారి 'హరిజన నాయకుడు' (1932), అడవి బాపిరాజు గారు రాసిన 'నరుడు' (1946), ఇలింద్ర రంగనాయకులు గారి 'వల్లిక' ( 950) వట్టికోట ఆళ్వార్‌స్వామిగారి 'ప్రజల మనిషి' (1955), ముప్పాళ రంగనాయకమ్మగారి 'బలిపీఠం' (1962), మహీ ధర రామ్మోహనరావు గారు రాసిన 'కొల్లాయి గట్టితేనేమిః' (1965), వల్లావి వసుంధరగారి 'త్రివర్ణ పతాక', వాచస్పతిగారి 'అంతస్తులు - అంతఃకరణాలు' (1965), దాశరథి రంగాచార్య గారి 'చిల్లర దేవుళ్ళు' (1970), డా॥ కేశవరెడ్డి

గారి 'బానిసలు' ( 971), 'శ్మశానం దున్నేరు' ( 979), 'ఇన్‌క్రెడిబుల్ గాడెస్' (1979), జిల్లిందల సరస్వతిగారి 'సీ బాంచను కాల్మొక్కుతా' (1976) మొదలైన నవలలు. అలాగే హరిజనుల సమస్యలను చిత్రించిన నవలల్లో 'ఆదర్శం' (1946), 'అంటరాని జంట' (1973), 'విరిగిన కెరటాలు' (1977), 'మిసెస్ కోకిల' (1978), 'చివరి మజిలీ' (1978), 'వేర్లు' (1979), 'మోహన రాగం' (1979), 'కోడిగాడు' (1980), 'చీకటి చెదరింది' (1931), 'తపో భంగం' (1981), 'చీకట్లో కాంతిరేఖలు' (1983), 'నైమిశారణ్యం' (1984), 'కులకన్య' (1984), 'అంతులేని అమావాస్య' మొదలైనవి విధిగా పేర్కొనదగినవి.

ఇక జాతీయ స్థాయిలో పరిశీలించినప్పుడు దళితుల కోసం రచనలు చేసిన తొలి దళితవర్గ రచయిత జ్యోతిబా పూలే. 'బానిసత్వం', 'పూజారి తత్వం బయట పడింది' వంటి పుస్తకాలను ఆయన రాశారు. ఒక చేత్తో క్రియాశీల రచన, మరో చేత్తో ప్రత్యక్ష పోరాటం వంటి ద్విముఖ పోరాటాన్ని నిర్వహించిన రచనా యోధుల్లోనూ జ్యోతిబా పూలే మొదటివారు.

'దళితుల పెళ్ళిళ్ళకు బ్రాహ్మణ పౌరోహిత్యం అక్కరలేదనీ, దళిత పురోహితులే పెళ్ళిళ్ళు నిర్వహించాలని' ప్రబోధించారాయన. ఈ అంశంపై బ్రాహ్మణులు కోర్టుకెక్కారు. వారితో చట్టబద్ధ పోరాటాన్ని సాగించిన 'పూలే' తన రచనల ద్వారా దళితుల్లో 'దళిత చైతన్యాన్ని' మేల్కొల్పినవారిలో మొదటివాడుగా పరిగణించబడుతున్నారు [1]

దళిత చైతన్యాన్ని పదునుపెట్టిన ప్రతిభావంతుడైన రచయిత డా॥ బి.ఆర్. అంబేద్కర్. నిరంతర అధ్యయనంతో తాను సంపాదించిన విజ్ఞాన సంచయాన్ని 'దళిత జాగృతి' కోసం అంకితం చేసిన మేధావి ఆయన. అనేక పుస్తకాలు, వందలాది వ్యాసాలు వెలువరించిన ఆయన కలం 'దళిత సాహిత్యానికి' కావలసిన సిద్ధాంత పునాదిని సమకూర్చింది.

వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ప్రబంధాలు దళితులను ఉపేక్షించాయి. వీరిని గురించి నీచంగా చిత్రించాయి దీనికి తిరుగుబాటుగా దళిత రచయితలు కొత్త వేదాలను సృష్టించుకోవలసిన అవసరాన్ని 'దళిత ఉద్యమం' గుర్తించింది.

'జీవితంలోని ప్రతిరంగంలోనూ ఉపేక్షితులైనట్లే సాహితీ రంగంలో కూడా దళితులు తిరస్కృతులయ్యారు. గత వేలాది సంవత్సరాలుగా వెలువడు

1. ఆంధ్రప్రదేశ్‌లో పౌరహక్కుల, దళిత ఉద్యమ కార్యకర్త శ్రీ కె ఐలయ్యతో ఇంటర్వ్యూ (27-6-1989)

తున్న సాహిత్యంలో 'శూద్రుల్ని' బానిసలుగా, బెస్తవాళ్ళుగా, ఉరితీసే తలారులుగా, నీచులుగా చిత్రించడం జరిగింది. శూద్రస్త్రీలను దాసీలుగా, లేదా భోగించబడే జీవవస్తువులుగా వర్ణించడం జరిగింది. వీళ్ళను మనుషులుగా స్వీకరించలేదు, రచనల్లో చిత్రించలేదు. సవర్ణులను మాత్రమే శక్తివంతంగా చిత్రించడం జరిగింది. అందువల్ల ఇలాంటి దళిత వ్యతిరేక సాహిత్యాన్ని తిరస్కరించి; ఉపేక్షితులైన వర్గాల యాతనలను, సంవేదనలను, బాధలను, వారిపై జరిగే అత్యాచారాలను శక్తివంతంగా అభివ్యక్తం చేసే అవసరం ఏర్పడింది.[1]

ఇలాంటి చారిత్రక అవసరంగా ప్రారంభమైన దళితసాహిత్యఉద్యమం సాంఘికపోరాటాల నుండి ఉద్భవించడంవల్ల, ఆ పోరాటాలలోని అంతర్గత వైరుధ్యాలన్నీ ఈ సాహిత్య ఉద్యమంలో కూడా ప్రస్ఫుటమౌతున్నాయి.

దేశంలోని ఇతర ప్రాంతాలకన్నా మహారాష్ట్రలో జరుగుతున్న దళిత ఉద్యమాల దిశ కొంత భిన్నమైనది. ఇతర ప్రాంతాల్లో అంటరానివారి పట్ల దయ, సానుభూతి, హృదయపరివర్తన వంటి సిద్ధాంతాల ఆధారంగా సంస్కరణోద్యమాలు నడుస్తున్నాయి. మహారాష్ట్రలో ఇలాంటి సంస్కరణోద్యమాలతో బాటు, అతి కింది స్థాయిలోని నిమ్న వర్ణాలను సంఘటితపరిచి, చాతుర్వర్ణాలలోని మిగతా మూడు వర్ణాలకు వ్యతిరేకంగా పోరాటాలు సాగించడం జరుగుతున్నది. ఇది ఇక్కడి ప్రత్యేకాంశం. దీని ప్రభావమే మహారాష్ట్ర దళిత సాహిత్యంపై స్పష్టంగా కనబడుతుంది.

డా॥ అంబేద్కర్ మరణించిన (౧౯౫౬ డిసెంబర్ 6) తరువాత దళిత రచయితల మొదటి మహాసభ బొంబాయిలో జరిగింది. అప్పటి దళితుల పత్రిక 'ప్రబుద్ధ భారత్' తన సంపాదకీయంలో ఇలా రాసింది- 'ఇక్కడి విచిత్రమైన సామాజిక వ్యవస్థకు విరుద్ధంగా దళితులు నిరంతరం తిరుగుబాటు చేయవలసి ఉంది. ఈ తిరుగుబాటు చరిత్రే దళిత సాహిత్యం.'[2]

1967 దాకా దళిత సాహిత్యం తన సైద్ధాంతిక బలాన్ని సమకూర్చుకుంటూ వచ్చింది జ్యోతిబా ఫూలే, శాహూమహారాజ్, కారల్‌మార్క్సల సిద్ధాంతాలు; నీగ్రోసాహిత్యంలోని తిరుగుబాటుతత్వం తన సైద్ధాంతిక పూర్వరంగంగా స్వీకరించింది. అదే సంవత్సరం ఔరంగాబాద్‌లో 'మిళింద సాహిత్య పరిషత్తు'

1,2. 'దళిత సాహిత్యం పూర్వరంగం' (వ్యాసం) - డా॥ సూర్యనారాయణ రణసుభే, డా॥ కమలాకర్ గంగావణె అనువాదం; నిఖిలేశ్వర్ 'దళిత కథలు'; హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణ.

స్థాపించబడింది. దళితుల అభివ్యక్తికోసం 'అస్మిత' అనే త్రైమాసిక పత్రిక ప్రారంభమయింది.[1] 1967 నుండి ఈనాటిదాకా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్న ఆ పత్రిక పేరు ప్రస్తుతం 'అస్మితా దర్శ'. దళిత సాహిత్యోద్యమానికి ఈపత్రిక ప్రాతినిధ్యం వహిస్తూ, ఉద్యమానికి దిక్సూచిగా మారింది.

1969 నుండి 'దళిత సాహిత్యం' అనే పదం విస్తృత వ్యవహారంలోకి వచ్చింది.[2]

దళితుల ద్వారా దళితుల కోసం రాయబడే సాహిత్యమే దళిత సాహిత్యమని ఒక వర్గం భావిస్తుంటే... ప్రగాఢమైన సంవేదన, తిరుగుబాటు తత్వం, మార్పుకోసం పోరాట నిర్దేశం చేసేదే దళిత సాహిత్యమని వేరొకవర్గం; దళితుల ప్రయోజనాలకోసం ఎవరు రాసినా, అది దళిత సాహిత్యమేనని మరో వర్గం భావిస్తున్నది.

1920 లోనే బెంగాలీ భాషలో దళిత పత్రిక వెలువడింది. ఆ తరువాత దళిత ఉద్యమ దర్పణాల వంటి పలు పత్రికలు వివిధ భాషల్లో వెలువడ్డాయి. ప్రబుద్ధ భారత్, అస్మిత, అస్మితాదర్శ, మూక్‌నాయక్, భీంపత్రిక, జనతా, ప్రమేయ, నికాయ, బాయజా, సింహహర్జన, శ్రామిక్‌విచార్ మున్నగు పత్రికలు దళిత సాహిత్యవ్యాప్తికి దోహదం చేశాయి. వీటిలో కొన్ని పత్రికలు ఈనాటికీ వెలువడుతున్నాయి.

ఇతర ప్రాంతాలకన్నా మహారాష్ట్ర, గుజరాత్, కర్నాటక రాష్ట్రాల్లో విశేషమైన దళితసాహిత్యాభివృద్ధి జరిగింది. దళిత సాహిత్యాన్ని ప్రతిబింబించే పెద్ద పత్రికలు 1980 కి పూర్వం లేవనే చెప్పవచ్చు.

1981 లో ఢిల్లీలో 'భారతీయ దళిత సమాచార పత్రికా సంపాదకుల సమ్మేళనం' జరిగింది. దాదాపు 100 పత్రికల సంపాదకులు, ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. 'దళిత పత్రికల్లోని ప్రతి పంక్తి, ప్రతి పేజీ దళిత రచయితల రచనలకే కేటాయించాలనీ, దళితేతరుల రచనలకు ఈ పత్రికలు వేదికలుగా మారకూడదనీ' ప్రతినిధులు అభిప్రాయపడ్డారు. అప్పట్నుంచి ఈనాటి దాకా దళిత పత్రికలు దళితులు సృజిస్తున్న సాహిత్యాన్నే ప్రచురిస్తున్నాయి.

1984 ఆగష్టు 18 న ఢిల్లీలో 'భారతీయ దళిత సాహిత్య అకాడమీ' స్థాపన జరిగింది. తరతరాలుగా అన్ని అవకాశాలకు దూరమై అభివృద్ధికి నోచుకోని

---

1. మనోహర్ వాంక్‌డే, గంగాధర పాన్‌తావణే, రా. గ. జాదవ్, ల. వ. రాయమానే, వామన్ నివాసేకర్, సుఖరామ్ హివరాలే 'అస్మిత' పత్రిక ప్రారంభ సంపాదకుల్లో ముఖ్యులు.
2. 'దళితకథలు' - హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ ప్రచురణ.

నిమ్నవర్గ రచయితల సృజనాత్మక శక్తులకు గుర్తింపు కలిగించడం, దళిత రచయితలను ప్రోత్సహించడం ఈ అకాడమీ లక్ష్యం. అదే సంవత్సరం అకాడమీ పక్షాన డా॥ అంబేద్కర్ జాతీయ అవార్డు, డా॥ అంబేద్కర్ అంతర్జాతీయ అవార్డు కమిటీలను ఏర్పాటు చేయడం జరిగింది [1]

మొట్టమొదటి 'అంబేద్కర్ అంతర్జాతీయ అవార్డు' (1985) నేపాల్ రచయిత 'విష్ణువర్మ'కు బహూకరించారు.

రెండవ అంతర్జాతీయ అవార్డు (1986) ఆఫ్రికా నేషనల్ కాంగ్రెస్ నాయకుడు 'నెల్సన్ మండేలా'కు ప్రకటించారు.

అలాగే డా॥ అంబేద్కర్ జాతీయ అవార్డు గ్రహీతల్లో డా॥ శశి, డా॥ చంద్రకుమార్, డా॥ నావల్‌యోగి, బొజ్జాతారకం ప్రభృతులు ముఖ్యులు.

దళితులు రాసిన రచనల ప్రచురణకు, దళిత సాహిత్య అనువాదాల ప్రచురణకు కూడా 'భారతీయ దళిత సాహిత్య అకాడమీ' ప్రోత్సాహాన్ని అందజేస్తున్నది.

ఈ కేంద్ర అకాడమీతోబాటు అనేక రాష్ట్రాల్లో రాష్ట్రస్థాయి 'దళిత సాహిత్య అకాడమీలు' ఏర్పాటయి, దళిత రచయితల వికాసానికి, దళిత సాహిత్య వ్యాప్తికి దోహదం చేస్తున్నాయి. పశ్చిమ బెంగాల్‌లోని 'సంతాలీ సాహిత్య పరిషద్', కర్నాటకలోని 'దళిత సాహిత్య పరిషద్', మద్రాస్‌లోని 'దళిత సాహిత్య అకాడమీ', మహారాష్ట్రలోని 'దళిత సాహిత్య పరిషద్' మొదలయినవి వీటిలో ప్రధానమైనవి.

మహారాష్ట్రలో 'దళిత్ రంగభూమి' పేరుతో ఏర్పాటయిన సాంస్కృతిక సంస్థ దళితుల సమస్యలను చిత్రించే అనేక కళారూపాలను సృష్టిస్తున్నది. ప్రజల్లో ప్రచారం చేస్తున్నది.

కర్నాటక నుండి వీర్ రాజశేఖర్ సంపాదకత్వంలో వెలువడుతున్న 'దళిత్ వాయిస్' దళితుల జాతీయస్థాయి పత్రికగా కృషిచేస్తున్నది.

ఎల్. ఆర్. బాలే సంపాదకత్వంలో వెలువడుతున్న 'భీం పత్రిక' దళిత సాహిత్య వ్యాప్తికి విశేషమైన సేవ చేస్తున్నది.

అలాగే ఆంధ్ర రాష్ట్రంలోని కృష్ణా జిల్లా, విస్సన్నపేట నుండి తెలుగులో 'దళిత్ వాయిస్' పత్రిక వెలువడుతున్నది.

---

1. 1987 అక్టోబర్ 8,9,10 తేదీల్లో హైదరాబాద్‌లోని ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో జరిగిన 'మొదటి అఖిల భారత దళిత రచయితల మహాసభ' ప్రతినిధుల సమావేశంలో జరిగిన చర్చల ఆధారంగా...

ఇవన్నీ దళితుల జీవన వికాసానికి, అగ్రవర్ణాల దాడులను తిప్పికొట్టడానికి, పోరాట మార్గాన్ని ప్రబోధించడానికి, సృజనాత్మక శక్తులను జాగృతం చేయడానికి అంకితమై పని చేస్తున్నాయి.

## అఖిల భారత దళిత రచయితల ప్రథమ మహాసభలు

దేశవ్యాప్తంగా ఉన్న దళిత రచయితలను ఒక చోట సమావేశపరిచి, దళిత రచయితల సమస్యలను చర్చించడానికి; దళిత సాహిత్యం తీరు తెన్నులను సమీక్షించుకోవటానికి; సమన్వయపరచడానికి; నిర్దిష్టమైన ప్రణాళికను, లక్ష్యాలను రూపొందించుకోడానికి ఒక జాతీయస్థాయి మహాసభ జరిగింది. 1987 అక్టోబర్ 8, 9, 10 తేదీల్లో హైదరాబాద్‌లోని ఎగ్జిబిషన్ గ్రౌండ్స్‌లో 'అఖిల భారత దళిత రచయితల ప్రథమ మహాసభలు' జరిగాయి. దాదాపు 17 రాష్ట్రాల నుండి 523 మంది ప్రతినిధులు పాల్గొన్న ఈ మహాసభలు 'అఖిల భారత దళిత రచయితల సంఘాన్ని' ఏర్పాటు చేయాలని నిర్ణయించాయి. దీనికోసం ఒక అడ్‌హాక్ కమిటీని ఎన్నిక చేశాయి. దళిత సాహిత్య ఉద్యమ దిశను సూచించే మార్గదర్శక సూత్రాలను, ప్రణాళికను ఈ మహాసభలో దళిత రచయితలు రూపొందించుకున్నారు.

ఈ ప్రణాళికలోని ముఖ్యాంశాలు కొన్ని పరిశీలించడం అవసరం.

'అఖిల భారత దళితరచయితల ప్రథమ మహాసభ ఆశయం - మానవ విలువలు, స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వంపై ఆధారపడిన వర్ణరహిత సమాజ నిర్మాణం.

సాంఘికంగా, ఆర్థికంగా దోపిడికి గురయిపోతున్న వర్గాలను 'దళితులు'గా మహాసభ నిర్వచించింది.

దళితులకు సమాజంలోనూ, సాహిత్యంలోనూ సముచిత స్థానాన్ని సంపాదించడానికి పోరాటాలు నిర్వహించడం. అంటే ద్విముఖ పోరాటాన్ని కొనసాగించడం.

దళితుల నిజ జీవితాలను చిత్రించే సాహిత్యాన్ని సృజించడం.

దళిత సాహిత్యం కేవలం దళితుల జీవితాలను చిత్రించడంతోనో, దళితులను ప్రేరేపించడంతోనూ దీని కర్తవ్యం పూర్తికాదు. దళితచైతన్యాన్ని వారిలో కలిగించి, పోరాడే ధైర్యాన్ని వారిలో మేల్కొల్పాలి.

దళిత రచయితలు దళితుల విముక్తికోసం సాహిత్యాన్ని సృష్టిస్తూనే సకల మానవాళి విముక్తికోసం కూడా కలాలను అంకితం చేయాలి.[1]

---

1. అఖిల భారత దళిత రచయితల ప్రథమ మహాసభ ముగింపు సమావేశం (10-10-1987)లో మహాసభ కన్వీనర్ బొజ్జాతారకం చదివి, వినిపించిన 'ప్రణాళిక'లోని ముఖ్యాంశాలు ఇవి.

ఇది దళిత రచయితల ప్రణాళిక. దళితులపై, మైనారిటీలపై, మహిళలపై జరుగుతున్న అన్నిరకాల దాడులను తీవ్రంగా ఖండిస్తూ; అస్పృశ్యత ఏ రూపంలో ఉన్నా దాన్ని నిరసిస్తూ, వర్ణవ్యవస్థ ఉన్నంతకాలం రిజర్వేషన్లు అమలు జరగాలని కోరుతూ, ప్రపంచవ్యాపితంగా పీడితులు జరుపుతున్న పోరాటాలకు మద్దతును ప్రకటిస్తూ మహాసభ తీర్మానాలను ఆమోదించింది.

సాంఘిక అసమానతలపై నిరంతర సమరం కొనసాగించాలనీ, ఆర్థిక దోపిడి నుండి దళితులను విముక్తం చేయించాలనీ; రాజకీయ హక్కులను, రాజ్యాంగపరమైన అవకాశాలను పొందడానికి పోరాటాలు సాగించాలనీ; ఈ త్రిముఖ పోరాటాలను దళిత రచయితలు తమ సాహిత్యంలో ప్రతిబింబింపజేస్తూ, దళితుల్ని చైతన్య పరచాలనీ ఈ మహాసభ నిర్దేశించింది.

## తెలుగులో దళితగీతాలు

దళితుల సమస్యలను కవిత్వంలో ప్రతిబింబింపజేసిన గుఱ్ఱం జాషువాను తొలి తెలుగు దళిత కవిగా భావించవచ్చు. 'గబ్బిలము', 'అనాథ' వంటి పద్య కావ్యాల ద్వారా అస్పృశ్యత సమస్యను చిత్రించిన జాషువా ప్రతిఘటన చైతన్యానికి ప్రతీకగా నిలుస్తాడు.

'కలఁడంబేత్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం
జలియై సీమకుపోయి, క్రమ్మరిన విద్వాంసుండు వైస్రాయి మే
ల్కొలువందుం గల దొడ్డవాడతడు నీకుం స్వాగతంబిచ్చి పూ
వుల పూజల్ పొనరించెనే యతని మెప్పుల్ నీ జయారంభముల్'

అనే పద్యంలో అంబేద్కర్ ప్రతిభావ్యుత్పత్తులను జాషువా కొనియాడారు. అంబేద్కర్‌ను ప్రశంసించడమంటే దళితులు తమను తాము ప్రశంసించుకోవడమే నన్నారు.

జాషువా తరువాత పేర్కొనదగిన దళితకవులు జాలా రంగకవి, కుసుమ ధర్మన్న కవి, నక్కా చినవెంకయ్య మొదలగువారు. జాతీయోద్యమకాలంలో అస్పృశ్యతను నిరసిస్తూ ఈ కవులు గీతాలు రాశారు.

ఆ తరువాత అస్పృశ్యతపై ధ్వజమెత్తిన దళితకవి బోయి భీమన్న.

'కూలగొట్టుడు కులమత కుటిలతలను
సమము చేయుడు మానవ సామ్యములను
పీడిత జనమ్ము న్యాయము పీడనేని
మకరకుండలమ్ములు మిమ్ము మనుపగలవే'

అని ప్రశ్నిస్తున్న భీమన్న సాంఘిక సమానత్వాన్ని కాంక్షిస్తూ అనేక కావ్యాలు రాశారు.

అస్పృశ్యుల ప్రతినిధిగా నిలిచిన డా॥ బి. ఆర్. అంబేద్కర్ మేధా సంపత్తిని చూసి మేధావులే ఆశ్చర్యపోయారన్న అభిప్రాయాన్ని వ్యక్తీకరించిన భీమన్న...

'చదువులేనివాడు, సంస్కారహీనుడు
మురికిపేటలందు మురుగువాడు
పొట్టకూటివాడు, వెట్టిచాకిరివాడు
వాయి తెరువ ద్విజు లవాక్కులైరి'

అని వర్ణించారు. తరతరాలుగా సంస్కారహీనుడిగా పరిగణింపబడిన దళితుడు తన తెలివిని ప్రదర్శిస్తే ఎవరికీ తీసిపోడని ప్రకటించారు.

ఆంధ్ర దేశంలో దళిత ఉద్యమ రథ సారథుల్లో ఒకరైన బొజ్జా తారకం కూడా ఈ రంగంలో కృషి చేస్తున్నారు. దళితుల్ని చైతన్యపరిచే వీరి కావ్యం 'నది పుట్టిన గొంతుక' వెలువడింది.

'పుట్టుకనే పెట్టుబడి పెట్టి
బ్రతుకులను విపణివీథిలో పెట్టిన
వ్యాపారారణ్యాన్ని నరుక్కుంటూ
మనిషి మనిషికి తేడా తీసిన
కుల మతాల గోతులు పూడ్చుకుంటూ
నీ కోసం బాటలు వేసుకొస్తున్నాను
తూర్పునుంచి చరచరా పైకి వస్తున్న
సూర్యుడివా నువ్వు...'[1]

అంటున్న తారకం దళితుల్లో ఆత్మవిశ్వాసాన్ని, తిరగబడే చైతన్యాన్ని, పోరాడే స్పృహను తమ రచనల్లో పలికిస్తున్నారు.

వీరందరిదీ కులతత్వానికి వ్యతిరేకంగా జరిపే వర్ణ పోరాట మార్గం. ఇందులో పోరాడే శక్తులు దళితులు మాత్రమే.

కొలకలూరి ఇనాక్‌గారి 'ఊరబావి'కథలు, బోయ జంగయ్యగారి 'జాతర' నవల, హైదరాబాద్ బుక్ ట్రస్ట్‌వారు ప్రచురించిన అనువాద కథల సంకలనం 'దళిత కథలు', ఇనాక్ గారిదే 'మునివాహనుడు' నాటకం దళిత వచన సాహిత్యంలో విధిగా పేర్కొనవలసిన రచనలు.

ఇక వర్ణపోరాటాన్ని వర్గ పోరాటంలో భాగంగా ప్రబోధిస్తున్న మరో రకం దళిత కవులుకూడా సాహిత్య రంగంలో కనబడుతున్నారు. వీరి సాహి

1. 'నది పుట్టిన గొంతుక' - బొజ్జా తారకం.

త్యంలో పోరాడే శక్తులుగా కార్మికులు, కర్షకులు, గిరిజనులు, హరిజనులు, పీడితులు, తాడితులందరూ వర్ణింపబడుతున్నారు. మార్క్స్ చూపిన వర్గపోరాట దృక్పథం వీరి రచనల సిద్ధాంత పునాది.

దళిత జీవుల్ని విప్లవ పోరాటంలోకి నడిపించిన తొలి దళిత 'వర్గ' పోరాటకవిగా సుబ్బారావు పాణిగ్రాహిని పేర్కొనవచ్చు.

'కొండల పక్కన బండలు కొట్టే
గిరిజనుడా ఇటు రావయ్యా
ఓ గిరిజనుడా ఇటు రావయ్యా
పుట్టల పక్కన కట్టెలు కొట్టే
గిరిజనుడా ఇటు రావయ్యా
ఓ గిరిజనుడా ఇటు రావయ్యా!'[1]

అని ఎలుగెత్తి పిలిచిన 'ఏజన్సీలో ఎర్ర జెండా' గీతం, 'జనత మేలుకొన్నది', 'మేలుకో', 'తూర్పు జెండా' మొదలైన గీతాల ద్వారా ఆదివాసీ ప్రజల ఆలోచనలను పదునుబెట్టి, కదనరంగానికి నడిపించిన కవి సుబ్బారావు పాణిగ్రాహి.

పాణిగ్రాహి తరువాత దళితుల్లో 'వర్గ' పోరాట స్పృహను వేడెక్కించిన తిరుగుబాటు కవి శివసాగర్.

'తోటరాముని తొడకు కాటా తగిలిందానీ
చిలుక చీటి తెచ్చెరా! ఓ విలుకాడ
మైనా మతలబు చేసెరా! ఓ చెలికాడ
మైనా మతలబు చేసెరా!'[2]

అని ప్రారంభమయ్యే 'ఓ విలుకాడా!' గీతంలో శివసాగర్ సృష్టించిన వాతావరణం, గ్రహించిన ప్రేరణ, సంకేతించిన పిట్టలు గిరిజనుల జీవితాల నుండి స్వీకరించాడు. గిరిజనులమధ్య జీవించి, వారిని సంఘటితపరిచే పాటల్లాడు. తిరుగుబాటు పాఠాలు చెప్పాడు.

'నరుడో భాస్కరుడా!', 'నా చెల్లి చెంద్రమ్మా!' 'నేల తల్లి చెరను విడిపించగ' వంటి శివసాగర్ గీతాలు, దళిత ఉద్యమ గీతాలకు దిక్సూచులయ్యాయి.

ఈ బాటలో పాటలల్లి, బలమైన గొంతుతో దళితగర్జన విన్పించిన విప్లవ కవి 'గద్దర్'.

---

1. 'పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి పాణిగ్రాహి
2. 'ఉద్యమం నెలబాలుడు' - శివసాగర్.

'యాఁరో ఈ మాదిగ బతుకు'[1]

అంటూ గద్దర్ చేసిన గర్జన తెలుగులో దళిత సాహిత్య ఉద్యమంలో నూతన శకాన్ని ప్రారంభించింది.

'బంగరు పంటలిచ్చే - భారతగడ్డ మనది
గంగమ్మ ప్రవహించే - పుణ్యభూమిరా మనది
గంగ యమునా బ్రహ్మపుత్ర - కృష్ణా పెన్నా కావేరి
ఎన్నెన్నో జీవనదులు - ప్రవహించే జీవగడ్డ
మాల మాదిగన్నలకే...మంచినీళ్ళు కరువాయె...
యాఁరో ఈ మాదిగ బతుకు
మొత్తుకుంటె దొరకదురా మెతుకు'

అనే గీతంలో సకల సంపదలను సృష్టించే శ్రమ జీవులైన దళితులకు ఆ సంపదలపై ఎలాంటి అధికారంలేదనే వర్గ సమాజ చైతన్యాన్ని 'గద్దర్' దళితుల్లో పురిగొల్పారు.

1977 లో దళితులపై జరుగుతున్న దౌర్జన్యాలను ఖండిస్తూ సెప్టెంబర్ ఒకటిన ఆం.ప్ర. వ్యవసాయ కార్మిక సంఘం పక్షాన 'హరిజన, గిరిజన, బలహీన వర్గాలపై అత్యాచారాలకు వ్యతిరేకంగా రాష్ట్ర మహాసభ' జరిగింది. ఆ సందర్భంగా 'అభ్యుదయ రచయితల సంఘం' (అరసం) సభ్యులు రాసిన గీతాల సంకలనం 'ఉప్పెన' అనే శీర్షికతో వెలువడింది. 'నిప్పుతోడ చెలగాట మాడితే', 'ఆగిన మీ గుండెల్లో', 'మమ్మడిగె వారెవరురా ఓరన్నా! మాదేటి బతుకాయెరా', 'ఆకలి మంటల మలమలమాడే', 'కులం కులం అనీ కుత్సితాలు పెంచుకోకోయి కూటికి లేనివాడా' మొదలైన గీతాలు ఆ రోజుల్లో విశేష ప్రచారాన్ని పొందాయి.

ఉ. సాంబశివరావు, క్రాంతి కిరణ్ వంటి యువకవులు కూడా వర్గ పోరాటంలో భాగంగానే వర్ణపోరాటాన్ని కొనసాగించాలన్న ధ్యేయంతో గీతాలు రాస్తున్నారు.

'మన్నెం పితూరిలోన - మరణించిన రామరాజు
తెలంగాణ పోరులోన - తొలి అమరుడు కొమరన్న
శ్రీకాకుళం పోరులోన - కోరన్నా, మంగన్నా
కొండా మొదలు పోరులోన - రాజుల్దొర, లచ్చుందొర
చంపేస్తే భూమిపోరు - చావదని చాటినారు
మళ్ళీ మన గుండెల్లో - పోరు మొక్క నాటినారు'[2]

1. 'గద్దర్ పాటలు' - జననాట్యమండలి ప్రచురణ.
2. 'జనం పాటలు' - జనసాహితి ప్రచురణ, (1986)

అంటున్న సాంబశివరావు 'మొక్కవోని భూమిపోరు'లో భాగంగా సాగిన కొండమొదలు భూపోరాటంలో అమరులైన రాజుల్దొర, లచ్చుందొరలకు నివాళు లర్పించారు.

వర్గ పోరాట ప్రధాన ధ్యేయాన్ని తన కవిత్వంలో వినిపిస్తున్న ఈ దళిత రచయిత గీతాల్లో దళితుల ఆవేశం, ఆక్రందనలు కూడా అంతర్లయలుగా ధ్వని స్తున్నాయి.

ఇక దళిత రచయితల్లో కనబడుతున్న మూడోరకం రచయితలు - అంబేద్కర్ సిద్ధాంతాలు ప్రబోధిస్తున్న సాంఘిక పోరాటాన్ని, మార్క్స్ సిద్ధాంతాలు నిర్దేశిస్తున్న ఆర్థిక పోరాటాన్ని మిళితం చేసి 'సామాజికార్థిక పోరాటం' జరగాలని సూచిస్తున్నారు. తద్వారా సామాజిక న్యాయం, ఆర్థిక సమానత్వం - ఈ రెండూ దళితులకు లభ్యమవుతాయని ఆశిస్తున్నారు. కత్తి పద్మారావు, మాష్టార్జీ ఈ కోవకు చెందుతారు.

కత్తి పద్మారావు రాసిన 'జనగీతం', 'దేశం డైరీ' వంటి కవితా సంపుటులు దళిత చైతన్యాన్ని జాగృతం చేసే దిశలో వెలువడిన రచనలే. అయితే గేయ గుణం, గాన యోగ్యత పుష్కలంగా లేని కారణం చేత వీటిని గీతాలుగా భావించే వీలులేదు. చాలా వరకు 'వచన కవిత'ను తన ఆయుధంగా స్వీకరించిన పద్మారావు రచనలకన్నా, అతని వాగ్ధాటి, క్రియాశీల కార్యకర్తృత్వం దళిత ఉద్యమానికి, దానితోబాటు దళిత సాహిత్యోద్యమానికి కొత్త రకాన్ని ఎక్కిస్తున్నాయి.

దళితగీతాల రచనలో ప్రత్యేకమైన స్థానాన్ని సంపాదించుకున్న యువ రచయిత మాష్టార్జీ. కలం, గళం రెండూ దళితుల పోరాటాలకు అంకితం చేసిన ఈ దళిత రచయిత గీతాలు అప్పుడే మరాఠీ కన్నడ భాషల్లోకి అనువదింపబడ్డాయి.

దళితఉద్యమ చైతన్యంతో పాటలు రాస్తున్న మాష్టార్జీ గీతాలు దళిత ఉద్యమానికి స్ఫూర్తిని కలిగిస్తున్నాయి. అంటే దళిత ఉద్యమంతో మాష్టార్జీ ప్రేరణ పొందుతున్నాడు అతని పాటలతో ఉద్యమం బలాన్ని పుంజుకుంటున్నది.

'దోపిడి కాబడేవారే దళితులు' అంటున్న మాష్టార్జీ రాసిన ముప్పై గీతాలను 'దళిత గీతాలు'గా సాహితీ మిత్రమండలి, హైదరాబాదువారు ప్రచురించారు. వీటిలో ఇప్పటికే చాలా పాటలు దళితుల గుండెల్లో గూళ్ళు కట్టుకున్నాయి.

'అందుకో దండాలు బాబా అంబేద్కరా!' గీతం విశేష ప్రాచుర్యాన్ని పొందింది. దళితుల ఊరేగింపుల్లో, సభల్లో, సమావేశాల్లో ఈ పాట ప్రతిధ్వనిస్తున్నది.

'అందుకో దండాలు - బాబా అంబేద్కరా
అంబరాన ఉన్నట్టి - సుక్కలు గురువంగో
ముందుగా నినుదలచి - పాటలు పాడేము
సీకటి మా బతుకుల్లో - సూర్యుడు పొడవంగో
అందుకో దండాలు'.................[1]

ఈ పల్లవితో ప్రారంభమయ్యే గీతంలో అంబేద్కర్ గుణ గణాలను జీవిత విశేషాలను, ఆదర్శాలను మాష్టార్జీ గానం చేస్తున్నాడు. పాట ముగింపులో-

'దేశభక్తి నీసొత్తు - మానవతే నీ గుండె
కరుణంటే నీ మనను - సమతంటే నీ ధర్మం
ఎన్నో సుగుణాలు ఇమిడున్నా నీవు
పీడితుల బాధ బాప బుద్ధుడవైనావో'

అనే పదాల్లో అంబేద్కర్ వ్యక్తిత్వాన్ని స్పష్టంగా పొందుపరిచాడు.

'మాదికాదు మాదికాదు - ఈ వ్యవస్థ మాదికాదు
దొంగలది దళారులది - దోపిడీ దుర్మార్గులది
దళితుల రక్తంతాగే దగాకోరు - రాయులది'

అనే దళిత స్పృహతో ఈ రచయిత రాసిన 'రండిరో దళితన్నా!' గీతం, ఈ సంపుటికే ఊపిరి.

'కులహీనుడవని నిన్ను - వెలివేసినవాళ్ళనూ
తమ ఈర్ష్యకు మన దళితుల - బలిజేసినవాళ్ళనూ
కండ కండ కాల్చేసి - గుండెల్ల తూటదించ
రండిరో దళితన్నా రైఫిల్ బట్టండి
ఉగ్రరూపమెత్తండి ॥రండి॥

నువ్ బాంచను దొర అంటె - శబ్బాసు బేట అండు
నువ్ ఎట్టిజేసి పెడితే - ఆడు పొట్టనింపుకొండు
నీ రక్తమంత ఉడికి - చెమటోలెగారుతుంటే
ఆడు సీసలల్లబట్టి - సారోలె తాగుతుండు
అరె కులంపేర నీ శ్రమను - దోపిడి జేసేస్తుండు ॥రండి॥

---

1. 'దళిత గీతాలు' - మాష్టార్జి
సాహితీ మిత్రమండలి, హైదరాబాదు ప్రచురణ (1987).

నువ్ పాలు పితికి పెడితే - ఆడు పెరుగు జేసుకుండు
నువ్ పొలం దున్ని పెడితే ఆడు పూట గడుపుకొండు
నువ్ ముట్టలేని చీజు - ఆ నొంబిలోనె లేదు
నువ్ లేకపోతె ఆడు - చిల్లిగవ్వకు గొరగాడు
అరె అన్ని నువ్వు జేస్తున్నా - అనగ ద్రాక్ష సంపుతుండు ॥రండి॥
నువ్ కాదు గాల్వనంటె - వాని పాడెలెవ్వబోదు
నువ్ పోదు దున్నకుంటె - వాని గూడ నిల్వబోదు
వాడలోని ఉన్నా - దళితన్నలంత గలిసీ
కూడ బలుకుకోని - పోరాడ బూనుకుంటె
బలుపెక్కిన దొరకొడుకులు - బక్కసిక్కిపోతారు ॥రండి॥'

అంటున్న ఈ గీతం దళితులకు, తమ శ్రమ విలువను తెలిపి, ప్రత్యక్ష వర్గ సాయుధ పోరాటాన్ని ప్రబోధిస్తున్నది కులహీనులుగా వెలివేస్తున్న వర్గ శత్రువులపై ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నది.

'జో... జోర దళితన్న - జోర దళితన్నా
జోకొట్టకుంటె నువ్ - మేలుకొంటావు
నువ్వు మేలుకొంటే - మా మేడలే కూలు'

అనే పల్లవితో ప్రారంభమయ్యే మాష్టార్జీ గీతం, అగ్రవర్ణాల దళిత వ్యతిరేక స్పృహపై చక్కని అధిక్షేపం.

'నీలి + లాల్' శీర్షికన ఈ రచయిత రాసిన 48 పాదాల సుదీర్ఘగీతంలో నీలం రంగు దళితుల జండా, ఎర్రని రంగు కమ్యూనిస్టుల జండా కలిసి 'నీలి + లాల్' రంగు జండాగా వర్ణింపబడింది.

'నీలి లాలు జండా కింద - ఓ చెల్లెమ్మా
నువ్వు నేను ఒక్కటంటూ - ఓ చెల్లెమ్మా
పోరుజెయ్య బూనుకుంటె - ఓ చెల్లెమ్మా
పీడితులకు విముక్తమ్మో - ఓ చెల్లెమ్మా'

అంటూ ప్రారంభమయ్యే ఈ గీతంలో...

'విప్లవము రావాలంటే
నీలి లాల్ కల్వాలమ్మో'

అనే ఆకాంక్షను మాష్టార్జీ వ్యక్తం చేస్తున్నాడు.

'రానున్న రాజ్యము - నీదోయి దళిత
కానున్న రాజువు - నీవోయి జ్వలిత
ఈ రాజ్యము నీది - మేలు కొనవోయి
ఈ రాజ్యమును నీవు - ఏలుకొనవోయి'

అనే ఆత్మవిశ్వాసాన్ని దళితుల హృదయాల్లో వికసింపజేస్తున్న మాష్టార్జి గీతాల్లో సాయుధ సమర సందేశం, భవిష్యత్తుపై ప్రగాఢ విశ్వాసం, సమకాలీన సామాజిక వ్యవస్థపై అంతులేని ఆగ్రహం ప్రతిధ్వనిస్తున్నాయి.

అలాగే దేశవ్యాప్తంగా దళిత గీతాలు రాసిన, రాస్తున్న దళిత రచయితల్లో ప్రముఖంగా పేర్కొనవలసినవారు: శ్రీయుతులు అమర్‌షేక్, అన్నాభవ్ సాతే, శంకర్రావ్ ఖరాత్, నామ్‌దేవ్ డసాళ్, రాజా ఢాలే, దయా పవార్, నారాయణ్ సుర్వే, శరణకుమార్ లింబాళే, అరుణ్ కాంబ్లే, లక్ష్మణ్ మానే, చంద్రమోహన్ వ్యాగ్, శ్రీమతి పద్మా పవార్ (మహారాష్ట్ర); జతిన్ బాగ్చీ, బి కె బిశ్వాస్, సురేంద్రనాథ్ శిక్దా (పశ్చిమ బెంగాల్); గొమస్తో ప్రసాద్ సోరంగ్ (పశ్చిమ బెంగాల్ సంతాలీ రచయిత); చంద్రకాంత్ పోస్తే, శాంత్‌కుమార్ (కర్నాటక); కె.ఆర్. పటూర్‌కర్(భోపాల్); సీతారాం (రాజస్థాన్); కుమార్ హసన్, తిరువళ్ళువార్, కె కె ఎస్టా (కేరళ); మోహన్ (మద్రాసు) మొదలైనవారు.

అయితే ఈ ఉద్యమం ఇంకా తొలిదశలోనే ఉన్నది; కాబట్టి వెలువడిన సాహిత్యం తక్కువే. ఇది ఒక ఆవేదనలోంచి పుట్టి, ఆవేశంగా మారి, ఆత్మగౌరవంకోసం సాగుతున్న ప్రతిఘటన చైతన్యధార. ముందు ముందు ఇది ఏ రూపాన్ని పొందుతుందో, ఏ దిశగా ముందుకు సాగుతుందో చరిత్ర నిర్ణయించాలి. చారిత్రక పరిణామక్రమంలో దళిత ఉద్యమం, దళిత సాహిత్య ఉద్యమం ఒక ఆహ్వానించదగిన పరిణామం.

# 11

# ఉద్యమగీతం – ఛందస్సు, భాష, కొన్ని పరిశీలనలు

## గీతం - గేయం

'గీయత ఇతి గీతం' అంటున్నది అమరకోశం.[1] అంటే పాడబడేది గీతమని అర్థం. అలాగే 'పాడదగినది గేయం' అని నైఘంటికార్థం.[2] వీటితో బాటు 'గీయమానమైనది గానం' అని కూడా వ్యవహారంలో ఉంది. గీతానికి 'పాట' అని కూడ వాడుక ఏర్పడింది.

గీతం - గేయం - గానం - పాట - ఈ నాలుగు పదాలూ దాదాపు సమానార్థకాలుగా వ్యవహరింపబడుతున్నాయి గేయాన్ని గానం చేసేవాడు గాయకుడుగా పిలువబడుతున్నాడు.

అయితే కవితా పరిణామక్రమంలో...తెలుగు శిష్టకవిత్వంలో గేయం - గీతం రెండూ అతిచిన్న సరిహద్దురేఖగల రెండు వేర్వేరు ప్రక్రియలుగా వృద్ధి చెందుతున్నాయి.

గీతం - గానం - పాట అనేవి సమానార్థకాలుగానే వ్యవహరింపబడుతున్నాయి.

గీతంలో పల్లవి (కొన్ని గీతాల్లో పల్లవితోబాటు అనుపల్లవి), కొన్ని చరణాలు ఉంటాయి. చాలా వరకు గీతాల్లో నాలుగు పాదాల చరణాలు, కొన్ని గీతాల్లో ఆరు పాదాల చరణాలు ఉంటాయి. నాలుగు చరణాల గీతాలు కొన్నైతే అంతకంటే ఎక్కువ చరణాల గీతాలు మరికొన్ని. తీసుకున్న వస్తువును బట్టి ఈ చరణాల సంఖ్య ఆధారపడి ఉంటుంది. ప్రతి చరణం ముగింపులో పల్లవి పునరావృతమవుతూ ఉంటుంది. అంటే గీతాల చరణాలు, పల్లవి పునరాగమనంతో పూర్తవుతుంటాయన్నమాట పల్లవికి కావలసిన 'లీడ్' చరణాల ముగింపులో దొరుకుతూ ఉంటుంది.

---

1. 'గురుబాల ప్రబోధిక' (అమరకోశం) పుట : 140.
2. 'తెలుగు నిఘంటువు' - ఆం. ప్ర. సాహిత్య అకాడమీ

గీతానికి పల్లవి నిత్యమైతే, గేయానికి వైకల్పికం, కొన్నిచోట్ల బహుళం. గేయంలోని చరణాల ముగింపులో పల్లవి విధిగా రావలసిన అవసరం ఉండదు. అలాగే గీతంలోని చరణాల్లో నియత పాదాల సంఖ్య ఉండగా, గేయంలోని చరణాల్లో పాదాల సంఖ్యలో తేడాలుండే అవకాశముంది.

'లయ బద్ధమైన ఒక భావం పూర్తి అయి, వేరొక భావం మొదలయ్యేనప్పటికీ విరుపులు సరిపెణలాగ నడుస్తూఉండే ఛందం గేయ మనబడుతుంది' అంటూ శ్రీ పి. రాజగోపాలనాయుడు గేయాన్ని నిర్వచించారు.[1]

అలాగే గీతాన్ని నిర్వచించిన క్రిస్టఫర్ కాడ్వెల్...

'Poetry is characteristically song, and song is characteristically something which, because of its rythm, is sung in unison, is capable of being the expression of a collective emotion' అన్నాడు.[2]

దీనినిబట్టి సామూహిక ఆవేశాన్ని ప్రకటించే ప్రక్రియగా గీతాన్ని భావించే వీలున్నది.

## గీతం - లక్షణాలు

గీతానికి సంగీతావలంబనం తప్పదు. సంగీతం, కవిత్వం సమపాళ్ళలో ఉన్న గీతాలు నాలుగు కాలాలపాటు బతుకుతున్నాయి.

'పాటకు పల్లవి ప్రాణం' అన్నది అక్షర సత్యం. గీతానికి ఆయువు పట్టు పల్లవి. ప్రతిభావంతమైన పల్లవి సమకూరిన గీతం దానంతటదే సాగిపోతుంది. ఈ పల్లవుల్లో రెండు రకాలు కనబడుతాయి. ఒకటి శబ్దాశ్రయాలు; రెండు-అర్థాశ్రయాలు శబ్దాశ్రయ పల్లవులు అర్థంతో నిమిత్తం లేకపోయినా పాటను నడిపిస్తాయి.

ఉదాహరణకు : 'జజ్జనకరి జనారే - జనకుజనా జనారే'
'లగిజిగి జిగిలగి - జిగిలగి లగిజిగి'
'నాంపల్లి టేసనుకాడి - రాజాలింగో'
'అంబరావే... జగదంబరావే' మొ॥నవి.

వీటిలో ఆధునిక జీవిత విషాదాన్ని చిత్రించిన 'జజ్జనకరి' గీతంలోని చరణాలు ఉదాసీనతను ధ్వనిస్తే, పల్లవి హుషారు కలిగిస్తుంది.

---

1. 'పాటలలో ఛందస్సు' - పి. రాజగోపాలనాయుడు. పుట : 26.
2. 'Illusion and reality' - Christopher Caudwell (page : 16).

'లగిజిగి జిగిలగి' గీతంలోని వృత్త్యానుప్రాసం పల్లవిని ఉడుకెత్తిస్తుంటుంది.

'నాంపల్లి టేసనుకాడి' గీతంలోని 'నాంపల్లి' హైదరాబాద్‌కు చెందినది కాదు. వేములవాడకు నేరుగా బస్సులు లేని రోజుల్లో నాంపల్లి అనే గ్రామానికి వెళ్ళే మలుపు వద్ద దిగి, వేములవాడ వరకు శైవభక్తులు కాలినడకన వెళ్ళే వారు ఈ బస్టేజీకి నాంపల్లి గేట్, నాంపల్లి టేషన్ అని పేర్లు.

'అంబరావే' గీతంలో సామాజిక రుగ్మతలపై పోరాటానికి ప్రజాశక్తుల ఆవాహన చేస్తూ అంబకు ఆహ్వానం పలకడం, పల్లవిని దీర్ఘకాలంపాటు సాగదీసి పలకడం శ్రవణపేయంగా ఉంటుంది.

ఇకపోతే అర్థాశ్రయ పల్లవులు అర్థవంతంగా చరణాలకు ఊపిరి పోస్తుంటాయి.

ఉదాహరణకు : 'దండాలు దండాలు భారతమాత'
'కొల్లాయి గట్టితేనేమీ మా గాంధి'
'మా కొద్దీ తెల్ల దొరతనము'
'చేయెత్తి జైకొట్టు తెలుగోడా!'
'పలనాడు వెలలేని మాగాణిరా'
'సిరిమల్లె చెట్టుకింద లచ్చుమమ్మ
'ఎర్రజెండేరో తమ్ముడ ఎర్రజండేరా మనది' మొ॥నవి.

వీటిలో చరణాల ముగింపులు పల్లవులతో పరిపూర్ణమవుతాయి. రస నిష్పత్తిలో చరణాలు, పల్లవులు సమంగా భాగం పంచుకుంటాయి

అలాగే జానపద బాణీల్లో గీతాలు రాసే రచయితలు, తమకాలం నాటికే బాగా ప్రచారాన్ని పొందిన పల్లవిని గ్రహించి, సమకాలీన ఇతివృత్తాన్ని చరణాల్లో పొందుపరచడం గమనార్హం. ఈ కారణంచేత ఒకే పల్లవితో నాలుగయిదు పాటలు ప్రజల్లో ప్రాచుర్యం పొందడంతో, ఏ పాట ఎవరు రాశారన్న వివాదాలు ఏర్పడుతుంటాయి.

## ఉద్యమం - గీతం

ఉద్యమ లక్షణాలను, స్థాయీ భేదాలను మొదటి అధ్యాయంలో చర్చించాం. ఉద్యమ గీతాలను ఇతర అధ్యాయాల్లో పరిశీలించాం. ఉద్యమానికీ - గీతానికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని ఇప్పుడు చూడవలిసి ఉంది.

ఉద్యమ కాలంలో సాహిత్య ప్రక్రియలన్నీ, ఉద్యమాన్ని ప్రతిబింబిస్తాయి. కొంత వరకు ఉద్యమాన్ని ప్రభావితం కూడా చేస్తాయి. అయితే ప్రజల్లోకి చొచ్చుకు పోగలిగే చొరవ, ఇతర ప్రక్రియలకన్నా గీతానికి కొంత ఎక్కువగా

ఉంటుంది. అవకాశమున్నచోట సామూహిక గానంగా, నిర్బంధ పరిస్థితుల్లో ఏక గాయక గానంగా పాడబడే వెసులుబాటు గీతానికి ఉండడం దీనికి ముఖ్య కారణం కావచ్చు. దీనితోబాటు శ్రవణసుభగత్వం, జనరంజకత్వం కూడా హేతువులుగా కనబడుతున్నాయి. వీటివల్ల గళగ్రహణ సౌలభ్యం, ధారణానుకూల శిల్పం గీతానికి అలవడుతున్నది. తద్వారా గీతం ప్రజా బాహుళ్యంలో ప్రాచుర్యం పొందే అవకాశాలు ఎక్కువౌతున్నాయి.

'కవితను ఉద్యమాలకు విమర్శలకు వాడుకోవడం కామధేనువును కద నాశ్వంగా, పందెపు గుఱ్ఱంగా వాడుకోవడం వంటిది' అనే అభిప్రాయాన్ని కొందరు ప్రచారం చేస్తున్నారు.[1]

'సారస్వత రూపం చాలావరకు సాంఘిక పరిస్థితులపై ఆధారపడి ఉంటుంది. ఒక్కొక్కకాలపు సారస్వతంలో ఆనాటి సాంఘిక పరిస్థితులు, ఆ కాలంలో ప్రబలి ఉన్న భావాలు, అప్పటి యిష్టానిష్టతలు ప్రతిబింబిస్తూ ఉంటాయి' అనే అభిప్రాయాన్ని మరికొందరు వ్యక్తం చేస్తున్నారు.[2]

'వక దేశం సాంఘికంగా గాని, మతవిషయకంగా గాని, రాజకీయంగా గాని అలజడికి పాలైనప్పుడు మనుష్యుల హృదయాలు వకవిధంగా కలతచెందుతై. ఆ కలత చిత్రకారుల చిత్రాలలోనూ, కవుల గ్రంథాలలోనూ ప్రతిబింబిస్తూ ఉంటుంది' అనే అభిప్రాయమూ ఉంది.[3]

దాదాపు ఇదే భావాన్ని ప్రకటించిన C M Bowra ఇలా అంటున్నారు- 'A revolution may provide some enthralling subject for poetry, and we should expect powerful response to it The early years of the Russian revolution certainly released many unsuspected talents and provoked from all angles an abundant and exhilarating poetry'[4]

అంటే సామాజిక వ్యవస్థను కుదిపేసే ఉద్యమాలు, లేదా విప్లవాలు జరుగుతున్నప్పుడు, వాటి ప్రభావం కవిత్వం మీద అనివార్యంగానే పడుతుందనే విషయం స్పష్టమౌతుంది.

---

1. 'భీమన్న సన్మాన సంచిక' —సుభిలానికేతన్, హైదరాబాద్ ముద్రణ, 21-8-1960.
2. 'కృష్ణరాయ సంపాదక వ్యాసావళి' —ముట్నూరు కృష్ణారావు.
3. 'నవ్యాంధ్ర సాహిత్య వీథులు' —కురుగంటి సీతారామయ్య (పుట: 14).
4. 'Poetry and Politics' (1966) —C M. Bowra. -Cambridge university press (page : 102).

ఉద్యమాల ప్రభావం కవిత్వం మీద ఉన్నట్లే, కవిత్వం ప్రభావం ఉద్యమాల మీద కూడా ఉంటుంది. ఇవి పరస్పరాశ్రితాలు.

కవిత్వంలోనూ ఉద్యమకాలంలో అధిక ప్రభావాన్ని చూపే ప్రక్రియ గీతం. ఈ విషయాన్నే ప్రముఖ గ్రీక్ తత్వవేత్త ప్లేటో ఇలా వివరిస్తూ హెచ్చరించారు. 'Any musical innovation is full of danger to the whole state, and ought to be prohibited; because it imperceptively penetrates into manners and customes; whence issuing with greater force, it invades contacts between man and man and goes on to laws and constitutions, in utter recklessness ending at last... by an over throw of all rights private as well as public.'[1]

ప్లేటో వ్యక్తం చేసిన ఈ అభిప్రాయాన్నుబట్టి పాట పాలక వర్గాలను ఎంత కలవరపరచగలదో తెలుస్తున్నది.

ఇలా ఉద్యమం - గీతం మధ్యఉన్న అవినాభావ సంబంధం ఉద్యమ గీతాల విస్తృతిని బట్టి స్పష్టమౌతుంది.

ఉద్యమ కాలంలో మిగతా సాహిత్య ప్రక్రియలకన్నా గీతం పైచేయిని సాధిస్తుందనే అంశం వేర్వేరు ఉద్యమాలలో వెలువడిన గీతాలను బట్టి ఋజువయ్యింది. అలాగే కవిత్వం జనంలోకి వెళ్ళడానికి కూడా గీతం ఒక ఉదాహరణగా నిలుస్తున్నది. అలాగే జానపద కళారూపాలైన బుర్రకథ, ఒగ్గుకథ, హరికథ, కోలాటం మొదలైన వాటిలోనూ, నాటిక - నాటకాలల్లోనూ, సంగీత - నృత్యరూపకాల్లోనూ 'గీతం' అంతర్వాహినిగా ఉంటుంది.

ఈ ఉద్యమగీతాల్లోనూ స్థాయీ భేదాలు కనబడుతున్నాయి. ప్రజలను ఉద్యమోన్ముఖుల్ని చేసే ప్రారంభ దశలో వెలువడే గీతాలు 'మేల్కొలుపు గీతాలు' (Educative songs), మేల్కొంటున్న ప్రజలను సంఘటితపరిచే గీతాలు 'చైతన్య గీతాలు' (Organisirg songs), సుసంఘటితమైన ప్రజలను ఉద్యమాల్లోకి నడిపే గీతాలు 'సమర గీతాలు' (Agitative songs).

మళ్ళీ ఈ మేల్కొలుపు గీతాల్లోనూ 'జనాకట్టు గీతాలు' (mass attra - ctive songs), 'నినాద గీతాలు' (sloganic songs), 'సందర్భ గీతాలు'

---

1. 'The Republic' - PLATO.

(occassional songs), 'భావనాత్మక గీతాలు' (conceptual songs) వంటి విభిన్న దశలను ప్రతిబింబించే గీతాలు కనబడుతున్నాయి.

వీటన్నింటినీ కలిపి ఉద్యమగీతాలు(Movement songs) అంటున్నాం.

ఉద్యమం ముగిసిన తర్వాత కూడా ఉద్యమ గీతాలు ఆగిపోవు. ఉద్యమ జ్ఞాపక చిహ్నాలుగా 'మనన గీతాలు' (Recollecting songs), 'స్మృతి గీతాలు' (Elegy), 'ఉద్యమానుభవ గీతాలు' (songs of Experience), 'చారిత్రక గీతాలు' (Historical songs), 'సైద్ధాంతిక గీతాలు' (Ideological songs) వెలువడుతూ ఉంటాయి. ఉద్యమ భావాలను తరువాతి తరాలకు బట్వాడా చేస్తుంటాయి.

## గాయకుడుగా కవి

ఉద్యమ గీతాలను రాసే కవియే గాయకుడైతే. అతని గీతాలు ప్రజల్లోకి వెళ్ళే అవకాశం ఎక్కువగా ఉంటుంది.

దీనికి రెండు కారణాలు కనబడుతున్నాయి. ఒకటి - గాయకుడైన కవి, గీతం రాసేటప్పుడే ఏదో ఒక బాణీని మననం చేసుకుంటూ, ఆ బాణీకి సరిపడు భావాన్నీ, భాషనీ అందులో పొందుపరుస్తాడు. ఏ పదాన్ని ఎక్కడ విరవాలో, ఏ పదంపై 'ఊనిక' పడాలో - వంటి అంశాలను పాట నల్లేటప్పుడే గొంతులో పలుమార్లు గొణుక్కోవడంవల్ల బాణీకి సరిపడు పదజాలం పాటలో పొదుగుతాడు. ఒకటికి రెండుసార్లు రాస్తున్న గీతాన్ని మననం చేసుకుంటూ, బాణీలో ఇమడని భాషను, పదాలను మారుస్తాడు. గీతం పూర్తయ్యాంతరువాత ప్రజల్లో గానం చేసినప్పుడు కనబడిన ప్రజల ప్రతిస్పందనను గమనించి, పాటలో మరికొన్ని మార్పులు చేస్తాడు. ఇలా క్రమంగా పాటను నిర్దిష్టమైన రాగతాళాలతో, భాషా బాణీలలో పరిపూర్ణంగా రూపొందిస్తాడు.

ఇక రెండవ కారణం - తను రాసిన పాటలను తానే గానం చేసే గాయక కవికి, తన పాటలను తొలిదశలో ప్రచారం చేసే మరో గాయకుడి అవసరం ఉండదు. అందుచేత అవి నేరుగా తన ద్వారానే ప్రజలకు చేరుతాయి. తన పాటల మీద తనకుండే సహజమైన మమకారంవల్ల గాయక కవి, వాటిని ఎప్పుడూ మెరుగులు దిద్దుతూనే ఉంటాడు. సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దుతాడు.

దీనికి భిన్నంగా గాయకుడు కాని కవి రాసిన పాటలను ప్రచారం చేయడానికి ఒక గాయకుడి అవసరం ఉంటుంది. ఆ గాయకుడికి నచ్చిన పాటలు జనంలోకి వెళ్తాయి. అతనికి నచ్చని పాటలు కనీసం బాణీలకు కూడా నోచుకోవు. ఒక్కో సందర్భంలో కవికి బాగా నచ్చిన పాట, గాయకుడికి నచ్చక పోవచ్చు. సాహిత్య విలువలు అపారంగా ఉన్నపాట, సంగీతానికి ఇమడక

పోవచ్చు. దానితో గాయక కవి రాసిన పాటలన్నీ ప్రచారయోగ్యం కాగా, గాయకుడు కాని కవి రాసిన పాటల్లో కొన్ని మాత్రమే ప్రచారమవుతాయి. మిగతావి రాగ, తాళాలకు నోచుకోక అచ్చులోనే ముచ్చటగా పడిఉంటాయి.

భావ కవితా యుగంనాటి బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు, కృష్ణశాస్త్రి మొదలైన వారు తమ గీతాలను గొంతెత్తి గానం చేసేవారు.

కరుణశ్రీ గీతాలకు, అతని తోడల్లుడు ఘంటసాల వెంకటేశ్వరరావు గొంతునిచ్చారు. కృష్ణశాస్త్రి గీతాలను కొంతకాలం కృష్ణశాస్త్రి, ఆ తరువాత ఆయన మేనకోడళ్లు వింజమూరి సీతాదేవి, వింజమూరి అనసూయాదేవి పాడి ప్రచారం చేశారు.

జాతీయోద్యమ కాలంలో పద్దావె సీతారామాంజనేయులు, గరిమెళ్ళ సత్య నారాయణ, దుగ్గిరాల గోపాల కృష్ణయ్య, బసవరాజు అప్పారావు, మంగిపూడి మొదలైనవారు తమ గీతాలను తామే గానం చేసి ప్రాచుర్యం కల్పించారు.

తెలంగాణా సాయుధ పోరాటం సుద్దాల హనుమంతు, యాదగిరి, తిరున గరి రామాంజనేయులు మొదలైన కవి గాయకుల్ని సృష్టించుకున్నది.

వామపక్ష గీతాలు రాస్తున్న వారిలో కోగంటి గోపాలకృష్ణయ్య, మురారి, తిరునగరి రామాంజనేయులు, ఏటుకూరి ప్రసాద్, గద్దర్, వంగపండు ప్రసాద్ మొదలైనవారు కలాలను, గళాలనూ పదును పెడ్తున్నవారే.

దళిత ఉద్యమంలో మాష్టార్జీ గొంతు ఈ కోవకే చెందుతుంది.

## ఉద్యమ గీతాల్లో ఛందస్సు

జాతీయోద్యమం నుంచి దళిత ఉద్యమం దాకా పరిశీలిస్తే ఆయా ఉద్యమాల్లో వందలాది గీతాలు వెలువడుతున్నట్లు స్పష్టమౌతున్నది. అయితే వీటిలో ఏ కొద్ది గీతాలో ఉద్యమ సంకేతాలుగా చిరకాలం నిలుస్తున్నాయి. మిగ తావి కాలగర్భంలో కలిసిపోతున్నాయి.

ఇలా చాలాకాలం నిలవటానికి ఆ గీతాల్లోని వస్తువుతోబాటు, రచించిన కాల ప్రాధాన్యంతోబాటు, వాటి ఛందస్సూ,రాగ తాళాలు కూడా ప్రముఖ పాత్రను వహిస్తున్నాయి.

ఉద్యమగీతాలు చాలా వాటికి జానపద సంగీత రీతులు ఆలంబనగా ఉన్నట్లు కనబడుతున్నది. జాతి సాంస్కృతిక సంపద జనపదంలో ఉంటుంది. జీవద్భాష, జీవత్సంగీతం జానపద గీతంలో ఉంటాయి.

ఉద్యమంలోకి జనబాహుళ్యాన్ని ఆకర్షించటానికి, ఉద్యమ ఆశయాలను జనంలో ప్రచారం చేయడానికి గీతాలు అవసరం. ప్రజలకు అర్థమయ్యే భాష;

ప్రజలకు శ్రవణపేయంగా ఉండి, మననం చేసుకునే బాణీ ఈ గీతాలకు అవసరం.

జానపద వీర కథావాఙ్మయంలో పది, పన్నెండు 'జానపదమట్టు' లుంటాయి. కరుణ, రౌద్ర, వీర,బీభత్స, భయానక రసస్ఫూర్తిని కలిగించడానికి వేర్వేరు మట్టులను జానపద కళాకారులు ఉపయోగిస్తారు. వీటిలోని ఏ ఒక్క 'మట్టు' తీసుకున్నా, ఆ నడకలో ఒక పాట రాయవచ్చు. ఉద్యమగీతాల్లో బాగా ప్రచారాన్ని పొందిన గీతాలు చాలావరకు ఈ జానపద మట్టుల నడకలోనే నడుస్తున్నట్లు పరిశీలనలో తెలుస్తున్నది. పాటలోని చరణాల నడుమ వైవిధ్యం కోసం వాటి నడక, తీరు అప్పుడప్పుడూ మారుతుంటుంది. 5 మాత్రల్లో ఉన్న దాన్ని 6 మాత్రల్లో, కొన్నిచోట్ల 7 మాత్రల్లో పాడుకోడానికి వీటిలో వీలవుతుంది.[1]

గీతంలోని ఛందస్సు దాని గతిని నిర్దేశిస్తుంది. కవిత్వంలో హృదయవేద్యాలైన శ్రుతిలయలు ఛందస్సాధ్యాలు. భాషనూ, భావాన్నీ లయబద్ధం చేసి కొంత ఎత్తుకు తీసుకొనిపోయేది ఛందస్సు.[2] శ్రవ్యత, మనన యోగ్యత దీని సహజ లక్షణాలు.

## ప్రధాన ఛందోరీతులు

ఛందస్సులో మూడు ప్రధాన రీతులు గోచరిస్తున్నాయి వీటిలో 1. అక్షర ఛందస్సు 2. స్వర ఛందస్సు 3. మాత్రా ఛందస్సు.

అక్షరాల సంఖ్యమీద అధారపడి ఉండేది అక్షర ఛందస్సు. గురు లఘువుల క్రమం దీనికి ముఖ్యం. నియమిత అక్షరాల్లో నడిచే పద్య ప్రక్రియలో అక్షర ఛందస్సు ఉంటుంది.

సప్త స్వరాల ఉదాత్త, అనుదాత్త, స్వరితాలమీద ఆధారపడి ఉండేవి స్వర ఛందస్సు. పాటలోని రాగాలు స్వర గతికాలు. కాబట్టి రాగాన్ని నిర్ణయించడానికి స్వర ఛందస్సు తోడ్పడుతుంది.

మాత్రల సంఖ్యమీద ఆధారపడి ఉండేది మాత్రా ఛందస్సు. ఆధునిక కవితా ప్రక్రియలైన గేయం, గీతం ఈ మాత్రా ఛందస్సులో నడుస్తుంటాయి.

---

1. సంగీత విద్వాంసులు శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారితో ఇంటర్వ్యూ (15-7-1989)
2. 'అధునికాంధ్ర గేయ కవిత్వం' (సిద్ధాంత వ్యాసం) - పుట 8.
—డా॥ జి. చెన్నకేశవరెడ్డి

## ఉద్యమగీతాల్లో మాత్రాఛందస్సు

అక్షర ఛందస్సు పద్య ప్రక్రియకు, స్వరఛందస్సు రాగనిర్ణయానికి, మాత్రాఛందస్సు గీత నిర్మాణానికి తోడ్పడుతున్నట్లు తెలుసుకున్నాం.

ప్రస్తుత పరిశీలనాంశం ఉద్యమగీతం, కాబట్టి దీనిలోని మాత్రా ఛందస్సును అధ్యయనం చేయడం అవసరం.

ఉద్యమ గీతంలోని రాగాన్ని గుర్తుపట్టడం సాధ్యంకాదు. భావ తీవ్రతను, వైవిధ్యాన్ని బట్టి ఒకే గీతంలోని కొన్ని చరణాలు ఒక రాగంలోనూ, మరి కొన్ని చరణాలు మరో రాగంలోనూ ఉండొచ్చు. కొన్ని గీతాల్లో రెండుకన్నా ఎక్కువ రాగాలు ఉండే అవకాశాలున్నాయి. ఈ గీతాలకు తాళం ప్రధానం. అందుకే స్వరఛందస్సుతో ఈ గీతాలను కొలవడం సాధ్యం కాదు. అలాగే ఊనిక (Stress) నుబట్టి, ముగింపు (Closing)ను బట్టి హ్రస్వాక్షరాలను దీర్ఘాక్షరాలుగా; దీర్ఘాక్షరాలను హ్రస్వాక్షరాలుగా పలకడం ఉద్యమగీతాల సహజ లక్షణం. లిఖితాక్షరం కన్నా ధ్వని దీనికి ప్రమాణం. కాబట్టి అక్షర ఛందస్సు లోనూ వీటిని గణించడం వీలుకాదు ఇక మిగిలింది మాత్రా ఛందస్సు. ఇదే గీతానికి సరిపోయే కొలమానం.

## 'మాత్ర' అంటే...?

'మాత్ర' అంటే రెప్పపాటు కాలమని అర్థం. 'నిమేష ఉన్మేషాభ్యాం అన్యతరేణ తులితః కాలః మాత్రా' అని మాత్రా నిర్వచనం.[1] చిటికె వేయ డానికి పట్టేకాలాన్ని, రెప్పపాటు కాలంలో ఉచ్చరించే ధ్వనిని 'మాత్ర' అంటారు.

'ఏక మాత్రో భవేద్ధ్రస్వః ద్వి మాత్రో దీర్ఘ ఉచ్యతే
త్రి మాత్రాస్తుప్లుతోజ్ఞేయః వ్యంజనం త్వర్థ మాత్రకం'[2]

అంటే... హ్రస్వాక్షరాలన్నీ ఏకమాత్ర కాలోచ్చారణ కలవి. దీర్ఘాక్ష రాలన్నీ ద్విమాత్రకాలు. ప్లుతాక్షరాలు త్రిమాత్రకాలు. వ్యంజనం అర్ధమాత్రకం- అని తెలుస్తున్నది.

## గతులు

ఉద్యమగీతాలకు మూలం జానపదమట్టులని ఇదివరకే తెలుసుకున్నాం. ఇవి దేశీయచ్ఛందంలో నడుస్తాయి. దేశీయ రచనలు త్రిస్ర - చతురస్ర -

---

1. 'ఛందః పదకోశము' (పుట : 8) —డా॥ కోవెల సంపత్కుమారాచార్య.
2. 'యాజ్ఞవల్క్య శిక్ష-18' - 'ఆంధ్ర మహాభారతము - ఛందఃశిల్పము'లో డా॥ పాటిబండ మాధవశర్మగారు ఉదాహరించినది. (పుట : 64)

ఖండ - మిశ్ర - సంవర్ణ (సంకీర్ణ) గతుల్లో ఉంటాయి. ఇవి వరుసగా మూడు- నాలుగు - అయిదు - ఏడు - తొమ్మిది మాత్రలుగల గణాలుగా కొనసాగుతాయి.

1. త్ర్యస్రగతి (త్రిస్ర గతి) :- మూడు మాత్రల గణములు.
2. చతురస్రగతి :- నాలుగు మాత్రల గణములు.
3. ఖండగతి :- అయిదు మాత్రల గణములు.
4. మిశ్రగతి :- 3 + 4 = 7 మాత్రల గణములు.
5. సంవర్ణ (సంకీర్ణ) గతి :- తొమ్మిది మాత్రల గణములు.

దాదాపు ఉద్యమ గీతాలన్నింటినీ ఈ గతుల్లో గుర్తించడానికి వీలున్నది.

## రగడలు

వివిధ తాళగతులలో పాడదగినవి రగడలు. ఇవి త్ర్యస్ర, చతురస్ర, ఖండ, మిశ్ర గతులను బట్టి ఏర్పడినవి. అనేక గేయచ్ఛందస్సులకు రగడలు మూలంగా కనబడుతున్నాయి. ప్రధానమైన రగడలు నాలుగే. వీటిని రెట్టించడం వల్ల మిగతా రగడలు ఏర్పడుతున్నాయి. వీటికి అద్యంత్య ప్రాసలు, యతి నియతం. అంత్య ప్రాస వీటి విశిష్టలక్షణం. అయితే ఉద్యమ కవులు యతి ప్రాసలను ఐచ్ఛికంగానే పాటించారు.

దేశీయ చ్ఛందస్సుకు జీవధాతువులైన రగడ భేదాలను క్లుప్తంగా పరిశీలించడం అవసరం.

1. హయప్రచార రగడ :- త్ర్యస్ర గతిలో, రూపకతాళంలో నడుస్తుంది. 3 + 3 + 3 + 3 మాత్రలుంటాయి.
2. మధురగతి రగడ :- చతురస్రగతిలో, ఏకతాళంలో నడుస్తుంది. 4 + 4 + 4 + 4 మాత్రలుంటాయి.
3. ద్విరదగతి రగడ :- ఖండగతిలో, జంపెతాళంలో నడుస్తుంది. 5 + 5 + 5 + 5 మాత్రలుంటాయి.
4. హరిణగతి రగడ :- మిశ్ర గతిలో, త్రిపుట తాళంలో నడుస్తుంది. 3 + 4 + 3 + 4 (సప్తమాత్ర గణాలు రెండు) ఉంటాయి.
5. తురగవల్గన రగడ :- హయప్రచార రగడకు రెట్టింపు. ఎనిమిది త్రిమాత్రాగణాలు, రూపకతాళం.
6 విజయమంగళ రగడ :- తురగ వల్గన రగడకు రెట్టింపు. 16 త్రిమాత్రాగణాలు.
7. హరిగతి రగడ :- మధురగతి రగడకు రెట్టింపు. ఎనిమిది చతుర్మాత్రా గణాలు; ఏకతాళం.

8. విజయభద్ర రగడ :- ద్విరదగతి రగడకు రెట్టింపు; ఎనిమిది పంచమాత్రా గణాలు; జంపెతాళం.

9. వృషభగతి రగడ :- హరిణగతి రగడకు రెట్టింపు నాలుగు మిశ్ర గతి గణాలు; త్రిపుట తాళం.

10. హంసగతి రగడ :- 5 + 5 + 3 + 3 గణాలుంటాయి. అంటే ఇందులో ద్విరదగతి రగడ సగపాదం, హయప్రచార రగడ సగపాదం ఉన్నాయన్నమాట. కాబట్టి ఇదొక మిశ్రరగడ. మాత్రల సంఖ్యా మొత్తాన్ని బట్టి ఇది మధురగతి రగడ అవుతుంది; కాబట్టి చతురస్ర గతిలోనూ దీని నడక సాగుతుంది.

11. అర్ధహంసగతి రగడ:- హంసగతి రగడ భేదం ఇది. ఒక పంచ మాత్రాగణం, ఒక త్రిమాత్రా గణం ఉంటాయి. ఉదాహరణ కావ్యాలలో దీని ప్రయోగాలు కనబడుతున్నాయి.

12. మంజుల రగడ :- ఆద్యంత్యప్రాసలు లేని మధురగతి రగడను మంజుల రగడ అంటున్నారు. అయ్యలరాజు నారాయణామాత్యుడు తన 'హంస వింశతి'లో దీనిని ఉపయోగించాడు.

## ముత్యాలసరం లక్షణాలు

గురజాడ అప్పారావు తెలుగు సాహిత్యంలో ఛాందసత్వంపై తిరుగుబాటు చేసి యుగకర్తగా నిలిచారు. భాషలోనూ, భావంలోనూ, ఛందస్సులోనూ నూతన పరిణామానికి మార్గ నిర్దేశం చేశారు.

'గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటలు
క్రొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెఱుంగులు జిమ్మగా'[1]

అంటూ కొత్త పాతల మేలు కలయికగా 'ముత్యాల సరము' అనే నూతన గేయచ్ఛందాన్ని గురజాడ ఆవిష్కరించారు. మిశ్రగతిలో నడిచే తెలుగు దేశీయ చ్ఛందస్సుకు 'ముత్యాలసరము'గా నామకరణం చేశారు.

'ముత్యాల సరము' లక్షణంగా అప్పారావుగారు నియమించుకున్న అంశాలివి- 'మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పద్నాలుగేసి మాత్ర లుండును. నాలుగో చరణమున యేడు మొదలు పద్నాలుగు వరకూ ఉండును. విరామమును అర్థానుసారముగా చెవికింపగునట్లు మార్చ యత్నించితిని'.

1. 'ముత్యాల సరాలు' (తృ. ము.) - గురజాడ అప్పారావు (పుట: 1) -విశాలాంధ్ర ప్రచురణాలయము.

ఈ నూతన ఛందస్సు ప్రకారం చరణంలో నాలుగు పాదాలుంటాయి. మొదటి మూడు పాదాలు సమానమైనవి- 3 + 4 + 3 + 4 = 14 మాత్రల క్రమంలో ఉంటాయి. చివరిది హ్రస్వపాదం సాధారణంగా 9 మాత్రలతో ఉంటుంది. దీనిలో కూడా ఒక సప్తమాత్రాగణం (3 + 4) మీద ఒక గురువు ఉంటుంది. ఇది త్రిపుట తాళంలో నడుస్తుంది. ఈ తాళం తప్పితే, మాత్రల సంఖ్య సరిపోయినా పాదం నడువదు [1]

## తొలి ముత్యాలసరం

తొలినాటి జాతీయోద్యమ గీతాల్లో ఒకటైన 'మేలుకొలుపు' గీతాన్ని ఆధునిక తెలుగు కవితలో తొలి ముత్యాల సరంగా డా॥ సి. నారాయణరెడ్డిగారు నిర్ణయించారు.[2]

'ఆంధ్ర భారతి' మొదటి సంచిక (శా. శ. 1831 మాఘ సంచిక) లో ఈ 'మేలుకొలుపు' గీతం అచ్చయ్యింది.

దీని లక్షణాలను పరిశీలిద్దాం :

7 7 7 7
మేలు కొనుమీ । భరత పుత్రుడ । మేలుకొనుమీ । సుజన మిత్రుడ
7 7 7
మేలు కొనుమీ । సచ్చరిత్రుడ । మేలుకొనవయ్యా! । వత్సా! మేలుకో
7 7 7 7
వేడుకను జా । తీయతాయను । వేగుచుక్క । పొడిచె నదుగో
7 7 7
కూడి వందే । మాతరమ్మను । కుక్కుటము లర । చెన్

దీనిలో 7 + 7 + 7 + 7 సంఖ్యగల సప్తమాత్రాగణాలు నాలుగేసి ప్రతి పాదంలోను కనబడుతున్నాయి. ప్రతి రెండు పాదాలకు ప్రాస నియమం పాటింప

---

1. ముత్యాలసరం, లోక ముత్యాలసరం, తొలి ముత్యాలసరం - వంటి అంశాలపై ఇప్పటికే తెలుగు సాహిత్యంలో విస్తృతమైన పరిశోధనలు జరిగాయి. శ్రీశ్రీ, చేకూరి రామారావు, డా॥ సి. నారాయణరెడ్డి, జి. చెన్న కేశవరెడ్డి మొదలైనవారు తమ వ్యాసాల ద్వారా, సిద్ధాంత వ్యాసాల ద్వారా ముత్యాలసరం ఆవిర్భావ, వికాసాలను చర్చించారు. సవివరంగా విశ్లేషించారు. ఈ అంశంపై ఇక్కడ ఇంకా ఎక్కువ చర్చించడం చర్విత చర్వణమే అవుతుంది.
2. ఆధునికాంధ్ర కవిత్వము : సంప్రదాయములు, ప్రయోగములు (పుట. 166) - డా॥ సి. నారాయణరెడ్డి.

బడింది. ఈ గీతంలోని 'వత్సా! మేలుకో' అనే భాగం మినహా, మిగతా మాత్రలన్నీ గురజాడ వారి ముత్యాల సరంలో వలె ఉన్నాయి. గురజాడ వారి 'లోక చుక్క' (ముత్యాల సరం) వెలువడడానికి (1910) ఒక సంవత్సరానికి ముందే (1909) ఈ గీతం ప్రచురిత మయ్యింది. కాబట్టి దీనినే తొలిముత్యాల సరంగా గుర్తిస్తున్నాం.1

ఈ గీతంలోని 'వేగుచుక్క'లో 6 మాత్రలే ఉన్నాయి దానిని ఉచ్చరించేటప్పుడు 'వేగుచుక్కా' అని అంటే 7 మాత్రలు పడతాయి.

## గురజాడ దేశభక్తి గీతం

గురజాడ అప్పారావుగారి 'దేశభక్తి' గీతం ముత్యాలసరం 'ఛందస్సు'కు చక్కని ఉదాహరణ.

మిశ్రగతిలో నడిచే ఈ గీతంలో 'తకిటతక ధిమి తకిట తకధిమి' అనే జతులు ఆవృత్తమవుతుంటాయి.

| | | | | |
|---|---|---|---|---|
| 3 | 4 | 3 | 4 | |
| దేశ | మునుప్రే | మించు | మన్నా | $= 3 + 4 + 3 + 4 = 14$ |
| 3 | 4 | 3 | 4 | |
| మంచి | అన్నది | పెంచు | మన్నా | $= 3 + 4 + 3 + 4 = 14$ |
| 3 | 4 | 3 | 4 | |
| వొట్టి | మాటలు | కట్టి | పెట్టోయ్ | $= 3 + 4 + 3 + 4 = 14$ |
| 3 | 3 | 5 | 2 | |
| గట్టి | మేల్ | తలపెట్ట | వోయ్ | $= 3 + 3 + 5 + 2 = 13$ |

దీనిలో మొదటి మూడు పాదాల్లో 14 మాత్రలు, చివరి పాదంలో 13 మాత్రలున్నాయి. గురజాడ ముత్యాల సరం గీతాల్లో అన్ని చరణాల్లోనూ మూడు పాదాల్లో 14 మాత్రలుంటే, చివరిదైన నాలుగో పాదంలో తరుచుగా 9 మాత్రలుంటాయి. కొన్ని పాదాల్లో 7 నుండి 13 మాత్రల వరకూ కూడా ఉంటాయి.

---

1. ఈ గీతాన్ని అజ్ఞాత కర్తృకంగా ఇదివరకు ప్రకరణంలో నిర్ణయించుకున్నాం. అయితే హరి ఆదిశేషువు 'మొదటి ముత్యాల సరం రచయిత ఎవరు?' అనే వ్యాసంలో 'మేలుకొలుపు', 'మాలవాంద్ర పాట'-ఈ రెండు గీతాలూ మంగిపూడి వేంకటశర్మ రచించినట్లు నిర్ధారించారు.
- 'తెలుగు' (మాసపత్రిక) - తెలుగు అకాడమీ, ఏప్రిల్, 1987.

## మిశ్రగతిలో శ్రీశ్రీ కవిత

'ముత్యాల సరం' ఛందస్సులోని గేయ పాదంలో 3 + 4 + 3 + 4 = 14 మాత్రలుంటాయని ఇదివరకే తెలుసుకున్నాం. దీనినే 7 + 7 = 14 మాత్రల క్రమంలోను గుర్తించవచ్చు.

కానీ శ్రీశ్రీ 14 మాత్రల మిశ్రగతి పాదంలోనే 6 + 8 = 14 మాత్రలను వాడి, ఈ ఛందస్సులో కొత్త ప్రయోగాలు చేశాడు.

దీనికి కొన్ని ఉదాహరణలు చూపవచ్చు.

'నవకవిత' అనే గీతంలో...

6 + 8
సిందూరం రక్తచందనం = 14
6 + 8
బంధూకం సంధ్యారాగం = 14
6 + 8
పులి చంపిన లేడి నెత్తురు = 14
6 + 8
ఎగరేసిన ఎర్రని జెండా = 14
రుద్రాలిక నయన జ్వాలిక = 6 + 8 = 14
కలకత్తా కాళిక నాలిక = 6 + 8 = 14

ఇక్కడిదాకా 6 + 8 = 14 మాత్రలను ప్రతిపాదంలో వాడిన శ్రీశ్రీ, ఈ ఆరు పాదాల సారాన్ని బలంగా ఏదో పాదంలో చెప్పడానికి...

7 + 8
కావాలోయ్ నవకవనానికి — 7 + 8 = 15 మాత్రలు ఉపయోగించారు. యతి నియతి పాటించలేదు మొదటి రెండు పాదాల్లోనూ, చివరి రెండు పాదాల్లోనూ అంత్యప్రాస ఉన్నది. మధ్య రెండు పాదాల్లో ఈ నియతి లేదు.

ఇలా 6 + 8 = 14 మాత్రల పాదాలు 'మహాప్రస్థానం' సంకలనంలోని 'పేదలు', 'అద్వైతం' మొదలైన గేయాల్లోనూ కనబడుతున్నాయి.

## రాయప్రోలు 'జన్మభూమి' గీతం

జాతీయోద్యమ కాలంనాటి కవులు కొందరు మంజరీ ద్విపదను గీతంగా మలచుకున్నారు. దీనికి ఉదాహరణగా రాయప్రోలు వారి 'జన్మభూమి' గీతాన్ని చూపవచ్చు. మంజరీ ద్విపదలో ప్రాస నియమం ఉండదు. ద్విపదకు వాడ

వలసిన ఇంద్ర గణాలలో చాలావరకు ఐదుమాత్రల గణాలనే వాడటం కనబడు తుంది. పాద నిర్మాణం 5 + 5 + 5 + 3 మాత్రల క్రమంలో ఉంటుంది. చివరి మాత్రల కాలం సాగదీయడానికి దీనిలో వీలుంటుంది.

ఏదేశమేగినా ఎందుకాలిడిన = 5 + 5 + 5 + 3

ఏపీఠ మెక్కినా ఎవ్వరెదురైన = 5 + 5 + 5 + 3

పై రెండు పాదాల్లోనూ 5 + 5 + 5 + 3 మాత్రల క్రమం కనబడు తుంది. ఈ పాదాల్లోని చివరి హ్రస్వాక్షరాలు, పాడేటప్పుడు దీర్ఘాక్షరాలయ్యే అవకాశం ఉంది. ఛందస్సు దృష్ట్యా వీటిని 'లఘువు'లుగా రాసినప్పటికీ, ఉచ్చా రణలో ఇవి 'గురువు' లవుతాయి.

అలాగే...

పొగడరా నీతల్లి భూమి భారతిని = 5 + 5 + 5 + 3

నిలుపరా నీజాతి నిండు గౌరవము = 5 + 5 + 5 + 3

ఈ రెండు పాదాల మాత్రల క్రమంకూడా పైవాటిలాగే ఉంది.

ఈ నాలుగు పాదాల్లో ఉన్న త్రిమాత్రా గణాల్లోని చివరి హ్రస్వాక్ష రాలను మరి రెండు మాత్రల కాలానికి సాగదీస్తే, అవి పంచమాత్రా గణా లవుతాయి. అప్పుడీ గీతం 'చాపుతాళం'లో 'తక తకిట - తక తకిట' అనే జతుల్లో 'ఖండగతి'లో నడుస్తుంది.

## కృష్ణశాస్త్రి 'జాతీయగీతం'

జాతీయోద్యమకాలంలో విశేష ప్రచారాన్ని పొంది, యువజన-విద్యార్థి సంఘాలకు ప్రార్థనాగీతంగా మారినది దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి 'జాతీయగీతం'. దీని లక్షణాలను తెలుసుకుందాం.

జయ జయ జయ ప్రియ భారత = 2 + 2 + 2 + 2 + 2 + 2

జనయిత్రీ దివ్యధాత్రి = 2 + 2 + 2 + 2 + 2 + 2

జయ జయ జయ శతసహస్ర = 2 + 2 + 2 + 2 + 2 + 2

నర నారీ హృదయనేత్రి = 2 + 2 + 2 + 2 + 2 + 2

ఈ గీతంలోని పాదాలన్నీ 'తకతకధిమి - తకతకధిమి' నడకలో 'రూపక తాళం'లో నడుస్తున్నాయి. దీనిలోని రెండేసి మాత్రలను ఒక యూనిట్‌గా తీసు కుంటే, ప్రతి ఆరు యూనిట్లకి ఒక ఆవర్తము పూర్తవుతుంది. ఇది రూపకతాళ లక్షణం. గీతంలోని ప్రతి పాదంలోనూ ఒక ఆవర్తం ఉండడం వల్ల చక్కని గాన యోగ్యత, శ్రవణ సుభగత్వం, మనన శీలత ఈ గీతానికి అలవడ్డాయి.

## త్రిస్రగతి

త్రిస్రగతి గీతాల్లో 3 + 3 + 3 + 3 మాత్రా గణాల క్రమం ఉంటుంది. 'తకిట తధిమి - తకిట తధిమి' అనేది వీటి నడక.

ఉదాహరణకి కొన్ని ఉద్యమగీతాలు చూద్దాం.

1. సుబ్బారావు పాణిగ్రాహి రాసిన 'హెచ్చరిక' అనే గీతంలో...

3 3 3 3 6 3 3
దిక్కు మొక్కు లేని జనం - ఒక్కొక్కరు అగ్ని కణం
3 3 6 6 3 3
సింహ కంఠ నాదంతో వస్తారిక కాచు కోండి

అనేది పల్లవి. దీనిలో మూడు మాత్రల గణాన్ని ఒక 'యూనిట్'గా తీసుకుంటే 8 యూనిట్లతో ఒక ఆవర్తం పూర్తవుతున్నది.

పల్లవితోబాటు ఈ గీతంలోని చరణాలన్నీ ఇదే నడకను అనుసరిస్తాయి.

కోట్ల గొంతులొక్కసారి గర్జిస్తాయ్ గర్జిస్తాయ్ = 3 + 3 + 3 + 3 + 6 + 6

సీట్లమీద కూర్చుండే మంత్రులార ఖబడ్దార్ = 3 + 3 + 6 + 3 + 3 + 6

ప్రజాస్వామ్యమనే ముసుగు తగిలించే మీపాలన = 3 + 3 + 3 + 3 + 3 + 3 + 3 + 3

సజావుగా పరిసమాప్తి జరుగురోజులొస్తున్నాయ్ = 3 + 3 + 3 + 3 + 3 + 3 + 3 + 3

వీటిలో చాలాచోట్ల 3 + 3 + 3 + 3 + 3 + 3 + 3 + 3 అనే మాత్రా గణాల క్రమం ఉంటుంది. కొన్ని చోట్ల పాదంలో 24 మాత్రలు ఉన్నప్పటికీ 3 + 3 + 3 + 3 + 6 + 6 మాత్రల క్రమంలోనూ, మరికొన్నిచోట్ల 3 + 3 + 6 + 6 + 3 + 3 క్రమంలోనూ, ఇంకా కొన్నిచోట్ల 3 + 3 + 6 + 3 + 3 + 6 క్రమంలోనూ ఉంటాయి. కొన్ని పాదాల్లో ప్రాసనియతి కనబడుతున్నది. అక్కడక్కడా మొదటి గణంలోని అక్షరాలకూ, 5వ గణంలోని అక్షరాలకు యతినియతి కనబడుతున్నది.

2. చెరబండరాజు రాసిన ప్రసిద్ధగీతం 'కొండలు పగలేసినం' కూడా త్రిస్రగతిలోనే నడుస్తుంది.

3 3 3 2 + 1
కొండ లుపగ లేసి నం.

3 3 3 2+1
బండ లనూ పిండి నం-
6 3 3
మానెత్తురు కంకరగా
3 3 3 2+1
ప్రాజెక్టులు గట్టి నం-
2(+1) 3 3
శ్రమ ఎవడి దిరో
3 3 2+1
సిరిఎ వడిది రో-

ఇదీ ఆ గీతానికి పల్లవి. దీనిలో 3+3+3 మాత్రాగణాల తరువాత ఉన్న ద్విమాత్రాక్షరాన్ని మరో మాత్రా కాలానికి సాగదీయాలి. అప్పుడు దీని నడక 3+3+3+3 అవుతుంది. 'తక ధిమి తక - తక ధిమి తక' అనే జతులు ఆవృత్తమవుతాయి. ఈ నడకలో నాలుగు పాదాలు పూర్తయిన తరువాత; అయిదు, ఆరు పాదాలు 3+3+3 గా నడుస్తున్నాయి. అంటే 'తక తక ధిమితా- తక తక ధిమితా-' అనే నడకను అనుసరిస్తున్నాయి. ఈ రెండు పాదాల పొడవు తగ్గించి, దీర్ఘాక్షరం ముగింపును ఈ కవి వాడారు. తన భావ తీవ్రతను వ్యక్తీకరించడానికి ఈ పద్ధతిని అవలంబించినట్లు తెలుస్తున్నది.

## చతురస్ర గతి

1. జాతీయోద్యమకాలంలో తన బలమైన కంఠాన్ని వినిపించిన కవి గుర జాడ రాఘవశర్మ. ఆ కవి రాసిన ఈ గీతంలో చతురస్రగతిని గమనిద్దాం.

4 4 4 4
జండా యెత్తర జాతికి ముక్తిర = 4+4+4+4
4 4 4 4
నిండగు శక్తిర నిల్పర కీర్తిర = 4+4+4+4

ఈ గీతంలో నాలుగు మాత్రల గణాన్ని ఒక యూనిట్‌గా తీసుకుంటే, 8 యూనిట్లతో ఒక ఆవర్తం పూర్తవుతున్నది. ఇది ఆదితాళం లక్షణం. 'తక ధిమి తకధిమి తకధిమి తకధిమి' అనే నడక ప్రతిపాదంలోనూ కనబడుతున్నది.

ఈ చతురస్రగతిలోని పాదాలలో ఉన్న గణాల సంఖ్య 16 32, 64 ల్లో ఏదైనా ఉండవచ్చును. పై గీతంలోని ప్రతి పాదంలోనూ 16 గణాలు 4+4+4+4 మాత్రాక్రమంలో ఆవృతమయ్యాయి. కాబట్టి ఈ గీతం చతురస్రగతిలో నడుస్తున్నది.

2. నైజాము వ్యతిరేక తెలంగాణా సాయుధ పోరాట కాలంలో ప్రజాకవి కాళోజీ నారాయణరావు రాసిన గీతం 'ఇంకెన్నాళ్ళు?' లో ఈ చతురస్ర గతిని గమనించవచ్చు.

నల్లగొండలో నాజీవృత్తుల = 8 + 8 = 16
నగ్ననృత్యమింకెన్నాళ్ళు? = 8 + 8 = 16
దమనసీతితో దౌర్జన్యాలకు = 8 + 8 = 16
దాగిలిమూతలింకెన్నాళ్ళు = 8 + 8 = 16

దీనిలో భావం, భాష పెనవేసుకున్నట్లే 4 + 4 మాత్రల యూనిట్లు రూపొందాయి. ఇలాంటి 8 మాత్రల రెండేసి యూనిట్లతో ఒక్కో పాదం పూర్తవుతున్నది.

## ఖండగతి

ఉద్యమ గీతాల్లో విశేష ప్రచారం పొందిన అనేక గీతాలు 'ఖండగతి' లోనే నడుస్తున్నట్లు కనబడుతున్నది. 'తక తకిట - తక తకిట' అనేది దీని నడక. 5 + 5 + 5 + 5 మాత్రా గణాలక్రమం పీటి పాదాల్లో కనబడుతున్నది.

1. బసవరాజు అప్పారావుగారి 'మా గాంధీ' గీతంలో...

కొల్లాయి గట్టితేనేమీ మా గాంధి = 5 + 5 + 5 + 5
కోమటై పుట్టితేనేమీ = 5 + 5 + 5

దీనిలో 'నేమీ' అనే నాలుగు మాత్రల గణాన్ని మరో మత్రా కాలం పాటు సాగదీసి పాడినప్పుడు అది పంచ మాత్రాగణంగా మారి, తాళ నియతిని పొందుతుంది.

ఈ గీతంలోని చరణాలన్నీ... 5 + 5
5 + 5
5 + 5 + 5 + 5

అనే పంచ మాత్రాగణాల క్రమంలో నడుస్తున్నాయి.

ఉదాహరణకి :...

నాల్గుపర కలపింక = 5 + 5
నాట్యమా దేపిలక = 5 + 5
నాలుగూ వేదాల నాణ్యమెరిగిన పింక = 5 + 5 + 5 + 5

2 జాతీయోద్యమ గీతానికి ప్రామాణికమైన ప్రతీకగా నిలిచే గీతం 'మా కొద్దీ తెల్ల దొరతనము'. గరిమెళ్ళ సత్యనారాయణ గారి ఈ గీతం ఖండగతిలో నడుస్తుంది.

5 5
మా కొద్ది తెల్ల దొరతనము దేవ
5 5
మా కొద్ది తెల్ల దొరతనము
5 5 5 5
మా ప్రాణాల పైపొంచి - మానాలు హరియించె
5 5
మా కొద్ది తెల్ల దొరతనము

ఈ పల్లవిలో 'మాకొద్దీ' అన్న యూనిట్‌లోని చివరి దీర్ఘాన్ని పాడేటప్పుడు గాన సౌలభ్యం కోసం 'మాకొద్ది' అనే హ్రస్వాక్షరాంతంగా మార్చడం జరుగుతున్నది. తద్వారా ఇది పంచ మాత్రాగణంగా రూపొందుతున్నది. దీని పక్కనే 'తెల్ల' అనే త్రిమాత్రగణం ఖండగతిలో చేరకపోయినా, తాళానికి అవరోధాన్ని కల్పించడం లేదు. అలాగే 'దేవ' అనే త్రిమాత్రాగణం గేయ పాదానికి కొంత విశ్రాంతిని కల్పిస్తున్నది.

పల్లవిలోని మూడో పాదారంభంలో వున్న 'మా' అని దీర్ఘాక్షరం, దాని పక్కనే ఉన్న పంచ మాత్రాగణానికి కొంత దూరంగా ఉంటున్నది. దీనినే Before the beat అంటారు.

ఈ సుదీర్ఘ గీతంలోని భావాలను బలంగా చెప్పడానికి, పాదాల విన్యాసాల్లో వైవిధ్యాన్ని సాధించడానికి దాదాపు ప్రతి పాదంలోనూ Before the beats గా రెండు, లేదా మూడు మాత్రల యూనిట్లను గరిమెళ్ళ అదనంగా వేశారు.

3 'తక తకిట - తక తకిట' అనే నడకలో నడిచే ఖండగతికి మరి కొన్ని ఉదాహరణలుగా వేములపల్లి శ్రీకృష్ణగారి 'చేయెత్తి జైకొట్టు తెలుగోడా! - గతమెంతొ ఘనకీర్తి గలవోడా!' గీతాన్ని; పులుపుల వెంకట శివయ్యగారి 'పలనాడు వెలలేని మాగాణిరా' గతాన్ని; పసుపులేటి వెంకయ్యగారి 'ఎవడబ్బ సొమ్మురా యీ గడ్డ చీల్చ - త్యాగాల బిడ్డరా మన తెలుగు గడ్డ' మొదలైన గీతాలను చూపవచ్చు.

## మిశ్రగతి

మిశ్రగతిలో $3 + 4 + 3 + 4$ లేదా $7 + 7 = 14$ మాత్రల క్రమం ఉంటుంది.

'తకిట తకధిమి - తకిట తకధిమి' అనేది వీటి నడక.

1. వామపక్ష గీతాల్లో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్న ఉద్యమ కవి ఏటుకూరి ప్రసాద్ గారి 'ఎర్రజండా' గీతంలో...

3 4 2+ 4
ఎర్ర జెండే రో— తమ్ముడ = 3 + 4 + 3 + 4 = 14
3 4 2+ 4
ఎర్ర జెండే రా— మనదీ ॥ఎర్ర॥ = 3 + 4 + 3 + 4 = 14

ఈ పల్లవి లోని 'రో' - 'రా' అన్న ద్విమాత్రాక్షరాలు, మరో మాత్రా కాలం వరకు సాగదీస్తే త్రిమాత్రాగణాలుగా మారుతున్నాయి. ద్విత్వ రేఫం మీద పడుతున్న 'ఊనిక' పాటను పదునెక్కిస్తున్నది.

అలాగే చరణాల్లో......

అమెరికా నడిబొడ్డులోపల = 3 + 4 + 3 + 4 = 14
శ్రామికుల పోరాటమందున = 3 + 4 + 3 + 4 = 14
రక్తధారలో ముంచివేత్తగ = 3 + 4 + 3 + 4 = 14
రాగరంజితమైన దేవిర = 3 + 4 + 3 + 4 = 14

ప్రతి పాదంలోనూ 14 మాత్రలున్నాయి. నాలుగేసి పాదాలతో నడిచే చరణంలోని ముగింపు పల్లవిని లీడ్ చేస్తున్నది. ప్రశ్నార్థకమైన చరణాల ముగింపునకు సమాధానాన్ని పల్లవిలో చెప్పడం 'సామూహిక గానం' విశిష్ట లక్షణం. చరణాలను ఏక గాయకుడు పాడి, పల్లవిని సమూహ గాయకులకు వదలడం ఈ పాటల సంవిధానం.

2. దాదాపు ఇదే నడక గజ్జం మల్లారెడ్డిగారి 'కాలజ్ఞానం' గీతంలో కనబడుతుంది.

మారిపోతుందోయ్ కాలం = 3 + 4 + 3 + 4 = 14
మారిపోతుంది = 8

ఈ పల్లవిలోని మొదటి పాదంలో మిశ్రగతి మాత్రలు సరిగ్గా పడ్డాయి. కానీ రెండవ పాదంలో ఒక మాత్ర అధికంగా పడింది. కాబట్టి గాయకులు గానం చేసేటప్పుడు ఈ అధిక మాత్రను పక్కనున్న మాత్రల్లో కలిపి మొత్తం ఏడు మాత్రల యూనిట్‌గానే వ్యవహరిస్తారు.

ఇకపోతే ఈ గీతంలోని పాదాలన్నింటిలో 3 + 4 + 3 + 4 మాత్రా గణాల నియతి కనబడుతున్నది.

ఉదాహరణకు...

వంటి యిల్లే ఖైదు కొట్టై = 3 + 4 + 3 + 4 = 14
పడకటిల్లే పంజరమ్మై = 3 + 4 + 3 + 4 = 14
అందరికి తల వంచి బతికే = 3 + 4 + 3 + 4 = 14
అబల సబలగ మారినపుడే = 3 + 4 + 3 + 4 = 14

ఈ గీతంలోనూ చరణాల ముగింపు, పల్లవిని ఆశ్రయిస్తుంది. తద్వారా పాటకు పల్లవిని ప్రాణంగా నిలుపుతుంది.

3 విప్లవ గీతాలకు ఒరవడి దిద్దిన జననాట్యమండలి గాయకుడు గద్దర్ రాసిన 'సిరిమల్లె సెట్టుకింద' గీతం 'మిశ్రగతి'లో కొంత విలక్షణమైనది.

అక్షరదృష్టితో 5 + 5 + 7 + 7 మాత్రాగణాల క్రమం ఉన్నట్లు కనబడే ఈ గీతాన్ని పాడుతున్నప్పుడు, సంగీతం దృష్ట్యా 7 + 7 + 7 + 7 మాత్రాగణాల క్రమంలో కొనసాగుతున్నది.

దీనికి కారణం - ఇది పాడుతున్నప్పుడు పడుతున్న 'చాపు తాళం'. ఈ చాపుతాళం రెండు రకాలుగా ఉంటుంది. 5 మాత్రల ఖండ చాపుతాళం, 7 మాత్రల మిశ్రచాపు తాళం. ఒకే తాళంలో 5 మాత్రలను 7 మాత్రలను గానం చేసే సౌలభ్యం ఉన్న కారణంగా ఈ గీతంలోని మాత్రలు 'ఖండగతి' అనే భ్రమను కలిగిస్తున్నాయి. స్వరకల్పనలో 'తకిట తకధిమి - తకిట తకధిమి' అనే నడక ద్వారా 'మిశ్రగతి'లో ప్రయాణం సాగిస్తున్నాయి.

సిరిమల్లె సెట్టుకింద లచ్చుమమ్మో = 5 + 5 + 7
లచ్చు మమ్మో = 3 + 4
సినబోయి కూర్చున్న వెందుకమ్మో = 5 + 5 + 7
ఎందుకమ్మో = 3 + 4

దీనిలో లచ్చుమమ్మో! లచ్చుమమ్మో అనే పదాలు పలికేటప్పుడు గాయకులు గొంతులో ధ్వనింపజేసే విషాదం గీతానికి జీవనాడిగా పనిచేస్తున్నది.

## ఉద్యమగీతాల్లో భాష

జాతీయోద్యమం మొదలు దళిత ఉద్యమందాకా సాగిన ఈ పరిశీలనలో విదితమైన అంశమేమిటంటే... ప్రతి ఉద్యమంలోనూ వేర్వేరు ప్రజాశ్రేణులు పాల్గొంటూ ఉంటాయి. నిరక్షరాస్యులు, అక్షరాస్యులు, విద్యావంతులు, మేధావులు, గ్రామీణులు, నగరవాసులు, గిరిజనులు, కార్మికులు, వ్యవసాయ కార్మికులు, రైతులు మొదలైన శ్రేణులు వీటిలో ప్రధానమైనవి. కార్మికుల్లోనూ నేత కార్మి

కులు, గీత కార్మికులు, గని కార్మికులు, ఫ్యాక్టరీ కార్మికులు మొదలైన ఉప శ్రేణులు కనబడుతున్నాయి. అలాగే ఇతర ప్రజాశ్రేణుల్లోనూ కొన్ని ఉపశ్రేణు లుంటాయి.

ఈ ప్రజా సమూహాలన్నింటి భాష ఒకే విధంగా ఉండదు. సాహిత్య స్థాయి కూడా సమంగా ఉండదు.

అందుకే ప్రజల్లోని వేర్వేరు పొరలను స్పృశించగలిగే వైవిధ్యభరిత మైన భాష, భావ వ్యక్తీకరణ ఈ ఉద్యమగీతాల్లో అనివార్యం.

ఒకే రచయిత పై అన్ని శ్రేణుల ప్రజలను చైతన్యపరిచే భాషను ఉప యోగించడం సాధ్యమయ్యే పనికాదు. భావ వ్యక్తీకరణ విధానమూ ఒక్కడివల్ల అయ్యేపనికాదు. అందుచేత ఉద్యమ కాలంలో వేర్వేరు రచయితలు ఒకే ఆశ యాన్ని వేర్వేరు భాషాభేదాల్లో తమ గీతాలద్వారా వ్యక్తం చేస్తారు. అంటే ఒకే వస్తువు గీతంగా ప్రజల్లోకి వెళ్ళడానికి దాని రూపం, ఛందస్సు, భాష, ఉప మానాలూ మారుతుంటాయన్నమాట.

వీటిలో నగరగీతాల్లో నాగరిక భాష, జానపదగీతాల్లో పల్లెభాష ప్రధానంగా కనబడుతున్నాయి.

ఉద్యమంతో సంబంధమున్న ఏ గీతమైనా సాధారణంగా ప్రజలభాషలోనో, ప్రజల భాషకు సన్నిహితంగా ఉన్న భాషలోనో వెలువడుతూ ఉండడం సహజం. ఉద్యమంలోకి ప్రజలను సమీకరించే ఆశయం గల ఉద్యమ గీతాల్లో ప్రజల భాష తప్పకుండా చోటు చేసుకుంటుంది.

ఉద్యమంలోని స్థాయీ భేదాలను బట్టి, ఆయా ఉద్యమకాలాల శ్రోతలను బట్టి 'గీతం' తన భాషను మలచుకుంటుంది.

ఈ దృష్టితో పరిశీలించినప్పుడు జాతీయోద్యమ తొలిదశ విద్యాధికులను, మేధావులను ప్రధానంగా దృష్టిలో ఉంచుకోవటం వల్ల అప్పటి గీతాలు మేధావుల భాషకు, లేదా కావ్యభాషకు దగ్గరగా ఉన్నట్లు గమనించవచ్చు. వీటిలో గ్రాంథిక భాషా ప్రయోగాలు, బిందు పూర్వక యడాగమాలు ఎక్కువగా కనబడు తున్నాయి.

ఉదాహరణకు...

తెలుగులో తొలి ముత్యాల సరంగా భావింపబడుతున్న మేలుకొలుపు గీతం (ఆంధ్రభారతి - 1909)లో...

'మేలుకొనుమీ భరత పుత్రుడ - మేలుకొనుమీ సుజన మిత్రుడ'

అనే పల్లవిలో 'మేలుకొనుమీ' అంటున్న గ్రాంథిక రూపం కనిపిస్తుంది.

అదే బాణీలో సాగే తరువాతి కాలం (1921) నాటి మంగిపూడి వారి మేలుకొలుపు గీతంలో...

'మేలుకో సుచరిత్ర - మేలుకో భరతపుత్ర'

అనే 'మేలుకో' అంటున్న వ్యావహారిక పద ప్రయోగం కనబడుతుంది.

అలాగే చిలకమర్తి వారి పద్యానికి ప్రేరణగా భావింపబడుతున్న 'క్రై ఆఫ్ మదర్ ఇండియా' (కృష్ణాపత్రిక-1905)లో...

'హిందువులారా! ఎన్నాళ్ళీగతి - మందమతులరై మాటికి జెడెదరా'

అనడంలో...'మందమతులరై' అనే పద ప్రయోగం ఉంది. మంద మతులవలె, మందమతులుగా అనడానికి బదులు రచయిత ఈ గ్రాంథిక స్పర్శ గల పదాన్ని ప్రయోగించారు.

అదే గీతంలో...

'దూడనోరు గొట్టి ద్రోహంబు గొల్లలు' అనడంలో 'ద్రోహంబు' అనే పదం ఉంది. దీనిలో బిందుపూర్వక ప్రయోగంతో బాటు, విభక్తి లోపం కూడా కనబడుతుంది.

అయితే అదేకాలంనాటి 'మాలవాంద్రపాట' (ఆంధ్రభారతి-1909)లో...

'అందారు పుట్టిరి హిందమ్మ తల్లికి - అందారు ఒక్కటై ఉండాలి సక్కంగ'

అనే పల్లవితోబాటు మొత్తం గీతంలోనూ శుద్ధ బడుగు జనుల భాష ప్రతిబింబిస్తుంది. ఈ గీతంలో చెప్పదలుచుకున్న వస్తువునకు, భాషకు సముచిత సమన్వయం పాటింపబడింది.

1921 నాటి ప్రఖ్యాత దేశమాత స్తుతిగీతం 'వందనమిదె గైకొనుమీ భారతజననీ' లో...

'ఉపనిషత్తు లుద్భవించె - యుదర మందున'

అనడంలో యడాగమం వచ్చింది.

మంగిపూడివారి దేశమాత స్తుతిగీతంలో...

'పతిత భారత ఘోర - పరిభవానలవర్చ - వ్రతులము
నవ్య భారత వీర సుతులము - వితత సర్వార్చణోద్యతి మతిని'

అంటూ సాగే దీర్ఘ సమాసాలంకూర్పు కనబడుతుంది. అయితే గీతం వింటున్న శ్రోతలకు ఉద్యమ నేపథ్యం తెలుసు కాబట్టి, ప్రతి పదార్థ తాత్పర్యాలతో ప్రమేయం లేకుండా... గీతం మొత్తంగా అందిస్తున్న స్ఫూర్తి వారిని ఉద్రూతలూగిస్తుంది.

కవికొండల వెంకటరావు, కాటూరి వెంకటేశ్వరరావు వంటి జాతీయోద్యమ కవుల గీతాల్లో...

పుడమిచేడియ, పద డిండీరము, చలితోల్లలితము, వింధ్యవసీంద్రము - వంటి ప్రౌఢ భాషా పదాలు కనబడుతున్నాయి.

కావ్య, ప్రబంధ శైలిలో ఆధునిక కావ్యాలు రాసిన విశ్వనాథ సత్యనారాయణ, పుట్టపర్తి నారాయణాచార్యులు, తుమ్మల సీతారామమూర్తి, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, కరుణశ్రీ మొ॥లైన కవులు రాసిన ఉద్యమ గీతాల్లో ప్రౌఢమైన కావ్యశైలి, గ్రాంథిక భాషాపదఘటనం ఎక్కువగా కనబడుతుంది. వీరి గీతాల్లో విభక్తి లోపం, యడాగమ ప్రయోగం వంటి పద్య సంప్రదాయం కూడా ప్రస్ఫుటమౌతూ ఉంటుంది.

జాతీయోద్యమ తొలిదశనుండి, స్వాతంత్ర్యసమరంగా ఉద్యమం పరిణామం చెందినప్పుడు వెలువడిన గీతాల భాషలోనూ క్రమ పరిణామం గోచరిస్తుంది.

సమర ఉధృతి పెరిగినప్పుడు, అందులో పాల్గొనే ప్రజలు అసంఖ్యాకంగా పెరిగిపోతారు. సమర గీతాల శ్రోతలు సామాన్య ప్రజలే! ఫలితంగా ప్రౌఢ భాషా ప్రయోగాలు తగ్గి, వాడుక భాష విస్తరిస్తుంది.

ఉదాహరణకు...

'స్వతంత్ర సమరం సాగింది', 'కదన భూమిలో కదలితిరా', 'వీర భారత జనని పేరు నిలిపావోయి', 'ఎలుగెత్తి చాటరో', 'లెండోయి లెండోయి తండోపతండాలు' వంటి పాదాలు కనబడుతున్నాయి. సరళమైన పల్లవులు, సులభమైన పదజాలం, గ్రామ్యపద బంధాలు, శ్రవణపేయమైన శబ్దచిత్రాలు ఈ గీతాల్లో కొట్టొచ్చినట్లు కనబడుతున్నాయి.

ఉద్యమం తీవ్ర స్థాయిలో ఉన్నప్పుడు, గీతాలలోని పదాలు పఠన సరళిలో కాక, నోటికెక్కే పద్ధతిలో ఉండడం గమనార్హం. 'కుత్సితము' అనే పదం 'కుచ్చితము' గానూ; 'కేకపెట్టు' అనే పదం 'కేకెట్టు' గానూ ప్రయోగింపబడినాయి.

ఇకపోతే.......ఆంధ్రోద్యమగీతాల్లో....గతవైభవాన్ని ప్రశంసించిన గీతాలన్నింటిలోనూ దాదాపుగా కావ్యభాషా ప్రభావం ఎక్కువగా కనబడుతుంది.

పులుపుల శివయ్యగారి గీతంలో...'శాతవాహన తెలుగు చక్రవర్తుల శౌర్యమిదె బ్రాహ్మ్యమిదె క్షాత్రమన్న గర్జాఘోష పులకలే ఎత్తించెరా' అనే దీర్ఘ సమాస భూయిష్టమైన పాదాలు కనబడుతున్నాయి.

కొండేపూడివారి ప్రఖ్యాత గీతంలోను - 'కదన రంగమునందు మెరిసిన కాకతీయుల ఖడ్గ తేజము - వదరు శత్రువు నెదరి పోరిన వనిత రుద్రమ యుద్ధ పటిమ'ను వర్ణించడంలోనూ కావ్య భాషా స్పర్శ ప్రస్ఫుటమౌతుంది. అయితే యుద్ధ పటిమను వర్ణించడానికి ప్రౌఢ పదాల ప్రయోగం ఉచిత సుందరంగా ఉంది.

శంకరంబాడి సుందరాచారి గారి గీతంలో - 'రుద్రమ్మ భుజశక్తి - మల్లమ్మ పతిభక్తి - తిమ్మరుసు ధీయుక్తి - కృష్ణరాయల కీర్తి' శ్రోతల చెవుల్లో రింగుమని మార్మోగే భాషా సోయగం కనబడుతుంది.

ఆంధ్రోద్యమం తీవ్రస్థాయికి చేరినప్పుడు వెలువడిన గీతాల్లో... త్రిపురనేనివారి...

'బ్రహ్మపురం మందేరా - పర్లాకిమిడి మందేరా
కాదని వాదుకు వస్తే - కటకందాక మందేరా'

ప్రఖ్యాతమైనది. 'మనదేరా' అనే పదం 'మందేరా' అయ్యింది. ప్రజలను ఉత్తేజపరచగల ప్రజల భాషలో ఉండడం ఈ గీతం ప్రత్యేకత.

అలాగే... పైడిపాటి సుబ్బరామశాస్త్రి గారి గీతం...

'అమ్మడు పోతున్నామా - ఆంధ్రుల మమ్మడు పోతున్నామా?" అనేది సూటిగా, సరళంగా, హాయిగా సాగుతుంది.

ఉద్యమకాలంలో వెలువడే అధిక్షేప, ఆక్షేపగీతాల్లోనూ; ఆవేశం ప్రధానంగాగల సమర గీతాల్లోనూ వాడుక భాష అనివార్యమౌతుంది. శ్రోతలను ఉర్రూతలూగించి, ఉద్యమోన్ముఖులను జేస్తుంది.

'ఎవడబ్బసొమ్మురా - ఈ గడ్డ చీల్చ', 'ఎవడురా నా జాతి వీర రక్తమునందు' వంటి గీతాలు ఎలాంటి పూత మెరుగులు లేకుండా జనం ఆగ్రహాన్ని స్వభావోక్తితో వ్యక్తం చేస్తుంటాయి.

ఆంధ్రోద్యమం తరువాతి కాలంనాటి వామపక్ష ఉద్యమగీతాల్లోనూ, తెలంగాణా సాయుధ పోరాటగీతాల్లోనూ, దళిత గీతాల్లోనూ ప్రయోగింపబడిన భాష ప్రజలకు మరింత సన్నిహితమైన భాషగానూ, అచ్చంగా ప్రజల భాషగానూ కనపడుతుంది.

అయితే వామపక్ష కవుల్లోనూ పురాణ ప్రబంధాలతో ప్రగాఢ పరిచయం ఉన్న శ్రీశ్రీ, రాంభట్ల, మల్లారెడ్డి మొదలయిన కవుల గీతాల్లో......యజ్ఞోపవీతాలు, ధర్మజలాలు, స్వస్తివాక్యములు, కంకణ నిక్వాణాలు, అంగారగంగలు పురిటాకలివరకాలు, వైజయంతికలు, పారిజాతవనాలు, శశిమేషాణాలు కనబడుతున్నాయి.

తత్సమపద బాహుళ్యం, దీర్ఘసమాస ఉద్ధృతిగల వీరి గీతాలు వామపక్ష మేధావులను అధికంగా ప్రభావితం చేస్తున్నాయి. వామపక్ష రచయితలకు ఛందస్సు తెలియదు, భాషరాదను అపవాదును పరాస్తం చేస్తున్నాయి.

పోతే... ఏటుకూరి ప్రసాద్, గద్దర్, వంగపండు ప్రసాద్, అదృష్ట దీపక్, మురారి, తిరునగరి రామాంజనేయులు, సుద్దాల హన్మంతు మొ॥ వామ పక్ష రచయితల గీతాలు ప్రజల భాషకు చాలా దగ్గరగా ఉంటున్నాయి.

'ఓరోరి కార్మికన్నా - ఓరయ్యో కార్మికన్నా!', 'యాలరో ఈ మాదిగ బతుకు', 'గోల్డు మెడలు గొట్టినోడ - గోడకు దిగబెట్టినవా' 'కష్టపడితే నేమి ఓరన్నా - పొట్ట కూటికి కరువురోరన్నా', 'సంఘం వచ్చిందరో రైతన్నా' - వంటి గీతాల్లోని భాష ప్రజల నిత్య వ్యవహారంలోని వాడుక భాషే.

ఉద్యమాలు ఊపందుకున్నప్పుడు... 'గోలకొండ ఖిల్లాకింద నీ గోరి - కట్టం కొడుకో!' అనే ఆగ్రహావేశాలు ప్రజల భాషలో ఉన్న పదునుకు నిదర్శనాలు. ఈ గీతాల్లో వామపక్ష భావజాలంతోపాటు వామపక్ష పదజాలం కూడా కొత్తగా సృష్టింపబడినట్లు కనబడుతుంది.

ప్రజ, జనం, పోరు, ఎర్ర జెండా, ఎర్రపాట, ఎర్రబాట, పోరుబాట, అభ్యుదయం, ప్రగతి, విప్లవం, రగెల్‌జెండా, నక్సల్‌బరి, ఎర్ర దండాలు, అరుణ దండాలు, లాల్ సలాం, మండే సూర్యుడు, విప్లవోదయం, విప్ల వాహ్వానం, నరమేధం, ఆకలి సూర్యుడు, యువ రక్తం, నెత్తుటి పాట, అగ్గి చిగుళ్ళు, అగ్నిరేఖలు, మంటలు, కత్తి, సుత్తి, కొడవలి, తుపాకి, అగ్నికణం, నిషా - వంటి వేలాది అపూర్వ పదాలు వామపక్ష ఉద్యమ సంజనితాలుగా తెలుగు భాషలో చేరి, తెలుగులో ఉద్యమ పరిభాషను రూపొందించాయి. పతితులు, దళితులు, పీడితులు, పీడకుడు, భ్రష్టులు, బాధాసర్పదష్టులు, వంచితులు మొదలైన పదాలు వర్గ సమాజంలో ఉన్న వేర్వేరు వర్గాలను ప్రతిబింబించే పారిభాషిక పదాలుగా మారాయి.

ప్రజలతో మమేకమయి, ప్రజా సాహిత్యాన్ని సృజిస్తున్న ఉద్యమ కవులు ప్రజల భాషకు దగ్గరగా రావడంలో సఫలం కాగలుగుతున్నారు. ప్రజలకు దూరంగా ఉంటూ ప్రజల సమస్యలపై ప్రతిస్పందించే కవులు మాత్రం ప్రజల భాషలో రాస్తున్నట్లు భావించి కృతక భాషలో రాస్తున్న ఉదాహరణలు కూడా కనబడుతున్నాయి.

పుట్టపర్తి నారాయణాచార్యులు రాసిన 'బానిస పదము' లో ...

'లేవండోయీ బానిసలాలా - లేవండోయీ పీనుగలాలా'

అనే సంబోధనాత్మక పల్లవిలోనూ ...

'యెముకలు చీకిన హిందువులాలా - యిల్లులేని పసిపిల్లల్లాలా'

వంటి చరణాలన్నింటిలోనూ కృతక భాషాప్రయోగం పాడుతున్నప్పుడూ వింటున్నప్పుడు కూడా గొంతుకు అడ్డుపడుతూ ఉంటుంది.

అలాగే శ్రీశ్రీ మరో ప్రస్థానం గీతంలోనూ ...

'యిప్లవం యాడుందిరా - ఆడనే నీ గూడుందిరా'

అంటున్నప్పుడు వాడిన 'యిప్లవం' కూడా నాగరిక కవి సృష్టించిన కృతక పద ప్రయోగంగానే మిగులుతుంది. పైగా ఈ గీతం యిప్లవంతో ప్రారంభమై, విప్లవంగా ముగుస్తుంది. ఇక్కడ ఏకసూత్రత భంగపడుతున్నది.

ఇలా ఒకరిద్దరి ఒకటి రెండు గీతాలు మినహా, మిగతా ఉద్యమ గీతాలన్నింటిలోనూ ఉద్యమ స్థాయిని, ఉధృతిని, ఒరవడిని సమయోచితంగానూ, సందర్భోచితంగానూ ప్రతిబింబిస్తున్న ప్రజల భాష ప్రయోగింపబడినట్లు ప్రస్ఫుటమౌతున్నది.

## కొన్ని పరిశీలనలు

తెలుగు నేలను కుదిపేసిన ఉద్యమాలన్నింటిలోనూ ఆయా ఉద్యమ కాలాల్లో నివసించిన కవులందరూ ఒకేవిధంగా స్పందించలేదు ఒక ఉద్యమ కాలంలో ఉద్యమానికి ప్రాణభూతమైన గీతాలు రాసిన కవులు కొందరు, ఇదే నేలపై సాగిన మరొక ఉద్యమ కాలంలో మౌనంగా ఉన్నారు. ఒక ఉద్యమంతో బాగా ప్రభావితులైన కవులు కొందరు ఇంకో ఉద్యమంతో పీసమెత్తయినా ప్రభావితులు కాలేకపోయారు. దీనికి ఆయా రచయితల రాజకీయ అవగాహన, సైద్ధాంతిక నిబద్ధత, ఉద్యమ చైతన్యం మొదలైనవి కారణాలుగా కనబడుతున్నాయి. ఈ శతాబ్దకాలంలో తెలుగు నేలను కుదిపేసిన ఉద్యమాలన్నింటిలోనూ తమ గొంతును విధిగా వినిపించిన కవులు ఒక్కరుకూడా లేకపోవడం గమనార్హం ఇటీవలి కాలం వరకు జీవించిన రాయప్రోలు సుబ్బారావుగారు జాతీయోద్యమ కాలం తరువాత తలయెత్తిన ఏ ఇతర ఉద్యమంలోనూ తమ గొంతును పలికించలేదు. క్విట్టిండియా ఉద్యమ సందర్భంగా నిప్పు కణికలు చిమ్మిన 'కరుణశ్రీ', తరువాతి ఉద్యమ కాలాల్లో, వాటికి దూరంగా ఉన్నారు. ఆ రోజుల్లో అజ్ఞాతవాసంలో ఉండి, ఆంధ్రదేశాన్ని సందర్శించిన 'అరుణా అసఫాలి'కి కరుణశ్రీ తమ 'అరుణకిరణాలు' అంకితం చేయడం ఈ తరం సాహిత్యకారులు చాలామందికి తెలియదు. భావకవిగానే ఎక్కువ ప్రాచుర్యం పొందిన కృష్ణశాస్త్రి జాతీయోద్యమంతోనూ ప్రభావితులై కొన్ని ఉత్తేజకరమైన గీతాలు రాశారు.

ఉద్యమం ఉవ్వెత్తున ఎగసిపడుతున్నప్పుడు, దానికి ప్రాణభూతమైన ఒకటి, రెండు గీతాలు రాసిన కవులు; ఆ తరువాతి కాలంలో సాహిత్యేతర రంగాల్లో స్థిరపడినా, వారి గీతాలు సాహిత్య చరిత్రలో సుస్థిరస్థానాన్ని సంపాదించినాయి. వారికి సాహిత్య గౌరవాన్ని చేకూర్చిపెట్టాయి.

ఆయా ఉద్యమాల్లో బలమైన గొంతులు వినిపించిన కవులు, ఉద్యమానంతరం వివిధ కవితారీతులు ప్రదర్శించినా ఆ ఉద్యమ కవులుగానే గుర్తింపు పొందారు.

ఒక ఉద్యమకాలంలో ఎందరో కవులు రాసినప్పటికీ, ప్రజల నాలుకల్లో స్థిరనివాసం చేసుకొన్న గీతికాకర్తలే అప్పటి ఉద్యమ సాహిత్య ప్రతినిధులుగా గౌరవింపబడుతున్నారు.

వడ్డాది సీతారామాంజనేయులు, గరిమెళ్ళ సత్యనారాయణ, మంగిపూడి సోదరులు, గురజాడ రాఘవశర్మ, జాస్తి వెంకటనర్సయ్య, ధూళిపాళ వెంకట సుబ్రహ్మణ్యం, మిక్కిలినేని భగవంతరావు, దామరాజు పుండరీకాక్షుడు, శిష్టా సత్యనారాయణ రాజశేఖరం, కరుణశ్రీ, కాశీ విశ్వనాథం మొదలైన కవులు నిప్పులు కురిసే ఉప్పెనల వంటి స్వాతంత్ర్యోద్యమ గీతాలు రాశారు. జాతీయ, స్వాతంత్ర్యోద్యమ కవులుగా తెలుగు సాహిత్య చరిత్రలో విశిష్టమైన స్థానం సంపాదించుకున్నారు.

ఆంధ్రజ్వాల జంపన చంద్రశేఖరరావు, పులుపుల వెంకట శివయ్య, కొండేపూడి లక్ష్మీనారాయణ, వేములపల్లి శ్రీకృష్ణ, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, శేషాద్రి రమణకవులు, త్రిపురనేని రామస్వామి చౌదరి, గుడిపూడి రాజేశ్వరీ దేవి, పైడిపాటి సుబ్బరామశాస్త్రి, శంకరంబాడి సుందరాచారి మొదలైన కవులను ఆంధ్రోద్యమ కవులుగా పరిగణిస్తున్నాం.

తిరునగరి రామాంజనేయులు, సుద్దాల హనుమంతు, యాదగిరి, మఖ్దూం మొహియుద్దీన్, దాశరథి, వట్టికోట ఆళ్వార్‌స్వామి, కాళోజీ, హీరాలాల్ మోరియా, కాంచినేపల్లి చినవెంకట్రామారావు మొదలైన వారిని తెలంగాణా సాయుధపోరాట రచయితలుగా గుర్తిస్తున్నాం.

కాళోజీ, ఇ. వి. పద్మనాభం, చల్లా నర్సింహులు, అనుముల శ్రీహరి మొదలైనవారు ప్రత్యేకతెలంగాణా వేర్పాటువాదకవులుగానూ; వల్లభుని నాగేశ్వరరావు, యనమదల పుల్లయ్యారావు, అవనిగడ్డ సూర్యప్రకాశ్, ఝాన్సీ దుర్గా మొదలైనవారు జై ఆంధ్ర వేర్పాటువాదకవులుగానూ కనబడుతున్నారు. మరోవైపు సి. నారాయణరెడ్డి, గజ్జెల మల్లారెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తి, ఏటుకూరి ప్రసాద్, పసుపులేటి వెంకయ్య, కె. రాజేశ్వరరావు, మల్లిక్, సుద్దాల హనుమంతు మొదలైన కవులు సమైక్యాంధ్ర పరిరక్షణకవులుగా తమ సాహిత్య కేతనం ఎగురవేశారు.

తుమ్మల వెంకట్రామయ్య, పెండ్యాల లోకనాథం, శెట్టిపల్లి వెంకట రత్నం, మద్దూరి అన్నపూర్ణయ్య, గద్దె లింగయ్య, చదలవాడ పిచ్చయ్య, వాసి

రెడ్డి నాగేశ్వరరావు మొదలైనవారు తొలితరం వామపక్ష కవులుగానూ; తెన్నేటి సూరి, కోగంటి గోపాలకృష్ణయ్య, సుంకర, ముక్కామల తదితరులు రెండవ తరం వామపక్ష కవులు గానూ; ఆ తరువాతి తరానికి ప్రతినిధులుగా గజ్జెల మల్లారెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తి, ఏటుకూరి ప్రసాద్, సుబ్బారావు పాణిగ్రాహి, శివసాగర్, చెరబండరాజు, గద్దర్, వంగపండు ప్రసాద్, సోమసుందర్, కె. రాజేశ్వరరావు, మల్లిక్, వేల్పుల నారాయణ, అదృష్టదీపక్ మొదలైనవారు వామపక్ష సాహిత్యోద్యమకారులుగా సాహిత్యాన్ని సృష్టిస్తున్నారు.

ఇకపోతే ఇటీవలి కాలంలో తెలుగు సాహిత్యంలో కనబడుతున్న ఏనూత్న ధోరణి దళిత సాహిత్యం. గుఱ్ఱం జాషువా, జాలా రంగస్వామి, నక్కా చిన వెంకయ్య, కుసుమ ధర్మన్నవి మొదలైన తొలితరం దళిత రచయితలు కేవలం అస్పృశ్యతకు వ్యతిరేకంగా గొంతులెత్తారు. అయితే వర్ణ పోరాటంతోపాటు వర్గ పోరాటాన్ని దళిత గీతాల్లో ప్రచారం చేస్తున్న సమకాలీన దళిత సాహిత్యకర్తలుగా శివసాగర్, గద్దర్, మాష్టార్జీ, ఉ. సాంబశివరావు, కత్తి పద్మారావు, బొజ్జా తారకం తదితరులు కనబడుతున్నారు.

'1930 దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది. ఆ తరువాత నుంచీ దాన్ని నేను నడిపిస్తున్నాను అప్పటి నుండీ తెలుగు సాహిత్య చరిత్ర శ్రీశ్రీ స్వీయ చరిత్ర' అంటూ ప్రకటించుకున్న శ్రీశ్రీ 1930 తరువాత తెలుగు నేలను కుదిపేసిన జాతీయోద్యమం, ఆంధ్రోద్యమం, తెలంగాణా సాయుధ పోరాటం, వేర్పాటువాద ఆందోళనలు, సమైక్యాంధ్ర పరిరక్షణ, వామపక్ష ఉద్యమాలు వంటి ఏ ఉద్యమంతోనూ స్పందించినట్లుగానీ; ఉద్యమ గీతాలు రాసినట్లు గానీ కనబడక పోవడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. తెలుగు నేలపై సాగిన ప్రతి ఉద్యమంలోనూ తాను పునర్జన్మను పొందినట్లూ, నూత్న యవ్వనాన్ని పొందినట్టు శ్రీశ్రీ అనేక సందర్భాల్లో ప్రకటించాడు. కానీ లోతుగా పరిశీలిస్తే జాతీయ, స్వాతంత్ర్యోద్యమ సాహిత్యాగ్నికి ఈ మహాకవి సమిధ నొక్కటి ఆహుతివ్వలేక పోయాడు. ఫాసిస్టు వ్యతిరేక, ప్రపంచ శాంతి సాహిత్య బావుటాగా పైకి లేవలేక పోయాడు. తెలంగాణా సాయుధ పోరాటజ్జపు తెల్లరేకై శ్రీశ్రీ పల్లవించలేక పోయాడు. వేర్పాటువాద ఆందోళనల్లో కాని, సమైక్యాంధ్ర నినాదంలో కానీ వెర్రి గొంతుక విచ్చి మ్రోయలేకపోయాడు. వామపక్ష ఉద్యమంలో భాగంగా సాగుతున్న కార్మికోద్యమం, వ్యవసాయ కార్మికోద్యమం, రైతు ఉద్యమం, యువజనోద్యమం, విద్యార్థి ఉద్యమం, మహిళా ఉద్యమం, సాంస్కృతికోద్యమం మొదలైన ఏ ఉద్యమ వీణకూ శ్రీశ్రీ తంత్రియై మూర్ఛనలు పొందలేక

పోయాడు. పోనీ 1970 తరువాతి నక్సలైట్ ఉద్యమకాలంలోనైనా, ఆ ఉద్యమానికి ప్రాణభూతమైన గీతాలేమైనా రాశాడా?-అని 'మరో ప్రస్థానం' గీతాలను గమనిస్తే; కృతకమైన భాష, భావప్రచార ధ్యాస, ఊహా జనిత విప్లవశ్వాస తప్ప పోరాటానికి ప్రతీకగా నిలబడగల గీతం ఒక్క-టైనా లేకపోవడం విచిత్రంగా ఉంది. మాటల్లో మంటల్ని, పాటల్లో ఈటెల్ని, అక్షరాల్లో సలసలకాగే చమురునేకాదు-ఉష్ణరక్తకాసారాన్ని ప్రసరింపగల ప్రతిభా వంతుడైన శ్రీశ్రీ తెలుగు నేలపై ఉద్యమాలు ఉవ్వెత్తున లేస్తున్న కాలంలో మద్రాసు మహానగరంలో ప్రశాంతంగా కూచుని సిరిసిరిమువ్వ పద్యాలు, ప్రాస క్రీడలు, లిమరిక్కులు వంటి విదూషక కవితా ప్రయోగాలనూ, సాహిత్య సాము గరిడీలను చేస్తుండడం చారిత్రిక సంభ్రమం.

ఏది ఏమైనా; ఎవరు స్పందించినా, స్పందించకపోయినా ఆయా ఉద్య మాల్లోంచి కొత్త రక్తం పుడుతూనే ఉంది. కొత్త సాహిత్యావిర్భవం జరుగు తూనే ఉంది. సామాజిక, రాజకీయ ఉద్యమాలు తలెత్తినప్పుడల్లా ఉద్యమ ఆశ యాలను ప్రచారం చేయడానికి, ఉద్యమ నినాదాలను ప్రతిధ్వనింపజేయడానికి, ఉద్యమానికే ఊపిరులూదడానికి సాహిత్యకారులు గీతాన్ని ఒక ప్రధాన వాహి కగా ప్రయోగిస్తూనే ఉన్నారు. ఉద్యమానికీ, గీతానికీ అవిభాజ్యమైన నిరంతర సంబంధాన్ని నిలబెడుతూనే ఉన్నారు. తెలుగు నేలపై సాగిన ప్రతి ఉద్యమ గర్భంలోంచి ఒక కొత్తతరం ఉద్యమ కవులు పుడుతున్నారు. ఉద్యమ గీతాలతో సాహిత్యాన్ని ఉగ్రూతలూగిస్తున్నారు. ప్రజల మెదళ్ళను పదును పెడుతూ చైతన్య స్రవంతులు పారిస్తున్నారు. తెలుగు సాహితీక్షేత్రాన్ని సుసంపన్నం చేస్తున్నారు.

# 12

# ఉద్యమగీతాల పట్టిక

1. అంటరాని వారెవరు? - రంగస్వామి, జాలా, ఈశ్వర ముద్రాక్షరశాల, రాజమండ్రి-1960.
2. అగ్గి చిగుళ్ళు (కవితా సంకలనం) - సం: సత్యనారాయణ, ఎస్వీ; అభ్యుదయ రచయితల సంఘం, హైదరాబాద్-1975.
3. అగ్నిగీత (ఫాసిస్టు వ్యతిరేక కవితా సంపుటి) - వివిధ రచయితలు; అభ్యుదయ రచయితల సంఘం, హైదరాబాదు-1975.
4. అగ్నిరేఖలు (కవితా సంకలనం) - వివిధ రచయితలు; ప్రగతి అసోసియేషన్, గౌలీపురా, హైదరాబాద్-1973.
5. అడుగుజాడ గురజాడది (సంకలనం)-సంకలనకర్త: రమణారెడ్డి, కె.వి., సాధన సమితి, కావలి-1962.
6. అనల - సత్యనారాయణ, జలజం, చైతన్య సంస్కృతి, జడ్చర్ల, మహబూబ్‌నగర్ - 1978.
7. అమరగేయాలు - రాజేశ్వరీదేవి, గుడిపూడి; ధనలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్, చిలుకలూరిపేట - 1953.
8. అమరగౌరవము (శ్రీ పొట్టి శ్రీరాములును గూర్చిన కావ్యము) - రామకృష్ణయ్య, మోచర్ల; కవితానికేతనము, నెల్లూరు-1953.
9. అమరవీరుల స్మారక సంచిక - ప్రగతిశీల ప్రజాస్వామ్య విద్యార్థి సంఘం, ఆంధ్రప్రదేశ్-1985.
10. అరాజకీయం (కవితా సంకలనం) సం: లక్ష్మీనారాయణ, పెనుగొండ, అభ్యుదయ రచయితల సంఘం, గుంటూరు జిల్లా శాఖ-1982.
11. అరుణ కిరణాలు - కరుణశ్రీ, రామా పబ్లిషర్, విజయవాడ-1946.
12. అరుణ కిరణాలు(ప్రజలపాటలు) - అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, ఆం. ప్ర.-1981.
13. అరుణ కిరణాలు (గేయసంపుటి) - కమ్యూ్మ బ్రదర్స్, సరస్వతీపురం, రాజంపేట-1982.

14. అరుణ రేఖలు - తెన్నేటి సూరి,
కృష్ణాస్వదేశీ ముద్రాక్షరశాల, మచిలీపట్టణము, (సంవత్సరం లేదు)
15. అరుణరేఖలు - చిన వెంకట్రామారావు, కాంచినేపల్లి, నల్లగొండ-1954.
16. అలజడి (అభ్యుదయ కవితాసంకలనం) - వివిధ రచయితలు,
అభ్యుదయ రచయితల సంఘం, హైద్రాబాద్-1972.
17. అస్పృశ్యుల విజ్ఞప్తి - నాగేశ్వరరావు, కర్ణపీర,
సాహిత్యోద్యానము, చీరాల - 1956.
18. అక్షరం (పాట, జానపద కళారూపాలు) - గిరి, జి. వై.,
ప్రబోధసాహితి, జనగామ-1980.
19. ఆంధ్ర జాతీయ గీతము (కరపత్ర గీతం) - సుబ్బరామశాస్త్రి, పైడిపాటి.
20. ఆంధ్ర జ్వాల - చంద్రశేఖరరావు, జంపన,
నవజీవన సమితి, అన్నామలైనగర్-1944.
21. ఆంధ్ర ప్రజా నాట్యమండలి పాటలు - సం: బసవయ్య, పున్నం,
ఆంధ్ర ప్రజానాట్యమండలి, నెల్లూరు-1985.
22. ఆంధ్ర మహాభ్యుదయం (పద్యకావ్యము) - సుబ్రహ్మణ్యం, బండ్ల-1980
23. ఆంధ్ర రాష్ట్ర గీతారత్నములు- లక్ష్మణరావు, అనుపోజు, విశాఖ-1952
24. ఆంధ్రావతరణము - ఆదర్శ సాహిత్యమాల, హైదరాబాదు-1956
25. ఆంధ్రావళి జడకుచ్చులు - సుబ్బారావు, రాయప్రోలు,
యం. శేషాచలం & కో, మద్రాసు-1972.
26. అగష్టు గేయాలు - విశ్వనాథం,
మోడరన్ రైటర్స్ కాంగ్రెస్, బెజవాడ - 1946
27. ఆత్మగీతం - రంగబాబు,
కళాప్రియ ప్రచురణలు, చిలకలూరిపేట-1981.
28. ఇది కదనం కదలండి (కవిత) - మూలం: మోరియా, హీరాలాల్,
అనువాదం: కవిరాజమూర్తి, ఖమ్మం-1980
29. ఉదయ కిరణాలు (గేయమాల) - కళారవి,
సరసరచనా సమితి, విజయవాడ.
30. ఉదయ ఘంటలు (అఖిలాంధ్ర కవుల గేయసంపుటి)
ప్రకాశకుడు : ఆళ్వారుస్వామి, వట్టికోట, సం: తెలంగాణా రచయితల
సంఘం, ప్రచురణ: దేశోద్ధారక గ్రంథమాల, సికింద్రాబాద్ - 1953.
31. ఉదయతార - ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం &

32. ఉద్యమం (పాటలు) - అంజయ్య, జి, హైదరాబాద్ - 1978.
33. ఉద్యమం (పాటలు) - ఎస్వీ,
ఆం. ప్ర. ప్రజానాట్యమండలి, హైదరాబాద్, 1982.
34. ఉద్యమం నెలబాలుడు (కవితలు, పాటలు) - శివసాగర్
సృజన ప్రచురణలు, హనుమకొండ-1983
35. ఉప్పెన (కవితా నీరాజనం) - సం: సుబ్బారావు, కోండ్రు,
ఆం.ప్ర. వ్యవసాయ కార్మిక సంఘం 1977.
36. ఊపిరి (చైతన్య గీతాలు) - వల్లంపట్ల,
లోకాయత ప్రచురణలు, గుంటూరు, 1984.
37. ఊపిరి (విప్లవగేయ సంపుటి) - ప్రజానాట్య మండలి, గోదావరిఖని శాఖ,
(ఎ.పి.టి.యు.సి. 6వ మహాసభలకు కవితానీరాజనం) 1978.
38. ఎదనాదాలు (పాటలు) - సంకలనకర్త : వేల్పుల,
ఆం. ప్ర. ప్రజానాట్యమండలి, గోదావరిఖని శాఖ, 1984.
39. ఎన్నికల పాటలు - సం: ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ,
ప్రజాశక్తి ప్రచురణాలయం, విజయవాడ.
40. ఎన్నికల పాటలు - ఆం. ప్ర. కమ్యూనిస్టు సమితి, హైదరాబాద్, 1978.
41. ఎన్నికల పాటలు, నాటికలు - సంచాలకుడు : కృష్ణమూర్తి, రాంభట్ల,
ఆం. ప్ర. కమ్యూనిస్టు సమితి, హైదరాబాద్, 1972.
42. ఎరుకల లచ్చిమి (గేయ సంపుటి) - సుబ్బారావు, కొప్పరపు,
ది మోడరన్ పబ్లిషర్స్, తెనాలి, 1947.
43. ఎర్రకిరణం (గీతాలు) - సం: బెల్లంపల్లి ప్రజానాట్యమండలి,
ఆం. ప్ర. ప్రజానాట్య మండలి, ఆదిలాబాద్ జిల్లా శాఖ, 1982.
44. ఎర్ర కెరటం (కవితా సంకలనం) - అఖిల భారత విద్యార్థి సమాఖ్య,
ఆం.ప్ర. వ్యవసాయ విశ్వవిద్యాలయ శాఖ, హైదరాబాద్, 1982.
45. ఎర్రజెండ - ప్రసాద్, ఏటుకూరి,
ఆం. ప్ర. యువజన సమాఖ్య, హైదరాబాద్, 1978.
46. ఎర్రజెండా పాటలు - సంకలనకర్త పేరులేదు
విజయలక్ష్మి స్మారక ట్రస్ట్, హైదరాబాద్, 1986.
47. ఎర్ర పాటలు - సం: రామచంద్రయ్య. రెబ్బా,
ప్రజా బుక్‌స్టాల్ కోదాడ, 1992.
48. ఎర్ర పిడికిళ్ళు (పాటలు) - వివిధ రచయితలు,
ఆం. ప్ర. ప్రజానాట్యమండలి, హుజూర్‌నగర్ పట్టణశాఖ, 1981.

49. ఎర్రపూలు (కవితా సంకలనం) - సం: మల్లారెడ్డి, గజ్జెల,
ఆం. ప్ర. అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ, 1973.
50. ఎర్రపూలు (ప్రజల పాటలు) - సేకరణ: అరుణతార,
అరుణారుణ ప్రచురణలు, సూర్యాపేట, 1983.
51. ఎర్రబాట - ప్రసాద్, ఏటుకూరి,
ఆం.ప్ర. యువజన సమాఖ్య, హైదరాబాద్, 1975.
52. ఏరువాక - ప్రసాదరావు, వంగపండు,
విరసం (విశాఖ యూనిట్), విశాఖపట్టణం 1974
53. ఓరుగళ్ళు నెగళ్ళు (ప్రజల పాటలు) - సంకలనకర్త : జకర్యా, జన్ను,
ఆం. ప్ర. ప్రజానాట్య మండలి, వరంగల్‌జిల్లా శాఖ, 1986.
54. కదలండి ప్రజలార! (గేయాలు) - అర్జున,
స్వేచ్ఛా పబ్లికేషన్స్, మాచవరం 1965.
55. కల్పన (ఆధునిక కవితాసంపుటి) - సం: అనిశెట్టి మొ॥
చేతనసాహితి, విజయవాడ 1953.
56. కవితా కదంబము - విశ్వసుందరమ్మ, తల్లాప్రగడ,
మల్లవరపు ప్రచురణలు, విశాఖపట్నం.
57. కవితా జానపదం - సహదేవు, రాగి & ఉప్పలచారి, చెన్నోజు,
యాదగిరిగుట్ట, 1983.
58. కవిర్నేత (శ్రీశ్రీపై కవితా సంకలనం) - సంకలనకర్త : శ్రీనివాస
గౌడ్, తమటం; చైతన్య సాహితీ సంస్థ, కొల్లాపూర్, 1985.
59. కవుల కలాల్లో (కవితా సంకలనం)
- సాంస్కృతీ సమాఖ్య, గుంటూరు, 1985.
60. కష్టజీవి - దేవయ్య చౌదరి, యడ్లపల్లి, తెనాలి, 1989.
61. కాంగ్రెస్ ప్రచార పాటలు - పార్థసారధి అయ్యంగార్, కొమండూరు,
ఎడ్యుకేషనల్ పబ్లికేషన్స్, నెల్లూరు.
62. కార్మికగీత (గీత కార్మిక సంక్షేమోద్యమ కవితా సంకలనం)
-ప్రభాకర గౌడ్, వేముల, రచయిత స్వంత ప్రచురణ 1981
63. కార్మిక భజనావళి - మే 1937
64. కావ్యద్వయి (అగ్నివీణ & గాంధీజీ మహాప్రస్థానం) - పుట్టపర్తి
ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కడప.
65. కొండేపూడి లక్ష్మీనారాయణగారి స్మృతులు - గేయాలు
సం : రాధ, కొండేపూడి; స్టూకా ప్రింటర్స్, హైదరాబాదు, 1987

66. క్రాంతి కిరణాలు (ఎన్నికల పాటలు)
- సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ 1968.
67. క్రాంతి కిరణాలు (విప్లవ గేయ సంపుటి) - వివిధ రచయితలు,
అరుణారుణ ప్రచురణలు, సూర్యాపేట, 1978
68. క్రాంతి గీతాలు - లింగయ్య, గద్దె,
ఆదర్శ గ్రంథమండలి, బెజవాడ, 1988.
69. క్రాంతిగీతి (అభ్యుదయ గేయ సంకలనం) - సం : శ్రీకాంత్ మొ॥
ఆధునిక రచయితల సమాఖ్య, మద్రాసు 1972
70. ఖడ్గార్ చైనా (గేయాలు) - దాశరథి & బలరామయ్య,
చందా నారాయణ శ్రేష్ఠి, సికింద్రాబాద్ 1968
71. గద్దర్ పాటలు - గద్దర్, జననాట్యమండలి ప్రచురణ, 1981
72. గుంటూరు గొప్ప - వెంకటప్పయ్య, కొండా
73. గుండెదండోరా (గీతాలు) - హనుమంతరెడ్డి, కె ,
ఉదయ సాహితి (సాహితి సాంస్కృతిక సంస్థ), హైదరాబాద్, 1979
74. గురజాడ రచనలు (కవితల సంపుటం)- పరిష్కర్త: ఈశ్వరరావు, సెట్టి,
విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజయవాడ, 1984
75. గురజాడ రచనలు (ముత్యాలసరాలు) - అప్పారావు, గురజాడ,
విశాలాంధ్ర ప్రచురణాలయం,విజయవాడ 1961
76. గేయ సుమ మంజరి - రామకృష్ణమాచార్యులు, అగ్నిహోత్రం,
శ్రీవిఖనస గ్రంథమండలి, పొన్నూరు.
77. గేయాంజలి - సం : ప్రకాశం అభివృద్ధి అధ్యయన సంస్థ, హైదరాబాదు,
ప్రచురణ : సమాచార పౌరసంబంధాలశాఖ, ఆం.ప్ర. ప్రభుత్వం, 1984
78. చంద్ర పుల్లారెడ్డి స్మారక పాటలు, కవితలు
అరుణోదయ సాంస్కృతిక సమాఖ్య, ఆం. ప్ర.
79. చీరాల పేరాల వనవాసము - నారాయణశాస్త్రి, పిసుపాటి,
విజయ ముద్రాక్షరశాల, బాపట్ల, 1922
80. చెరబండరాజు (కవితలు-పాటలు) -సం: వరవరరావు,
పీపుల్స్‌బుక్స్, విజయవాడ, 1982.
81. చెరసాల (గేయసంపుటి) - బాలార్క,
యుగసాహితీ ప్రచురణ, విజయవాడ.
82. చేనేత భజనావళి -సం: కృష్ణారావు, సూర్యనారాయణరావు,
చేనేత గ్రంథమాల, చీరాల, 1929.

83. చైతన్య గీతాలు (హేతువాద గేయసంపుటి) -జయరామరెడ్డి, ఎస్.,
భూప్రజ సాహితీనిలయం, అనంతపురం, 1986
84. చైతన్యనాదాలు (దేశభక్తి గేయాలు) -రవీంద్రబాబు, పస్పులేటి,
పస్పులేటి పబ్లికేషన్స్, నల్లగొండ, 1987.
85. జనం పాటలు - జనసాహితి ప్రచురణ, 1986.
86. జనగీతం-పద్మారావు, కత్తి; లోకాయత ప్రచురణలు, గుంటూరు, 1979.
87. జననాట్యమండలి పాటలు -క్రాంతి ప్రచురణలు, సికింద్రాబాదు, 1979.
88. జనరాగం (నృత్యకళారూపం)
అరుణోదయ సాహితీ సాంస్కృతిక సమాఖ్య, 1985.
89. జనరాగం (పాటలు) -వివిధ రచయితలు, సం : స్వామి, కె ,
ఆం. ప్ర. ప్రజానాట్యమండలి, గోదావరిఖనిశాఖ, 1981.
90. జనరాగాలు (పాటలు) -ఆం. ప్ర. ప్రజానాట్యమండలి,
ఆదిలాబాదు శాఖ, 1986.
91. జనహిత (కవితాసంకలనం) -సంకలనకర్త : పిళ్ళె, యస్. కె.,
జనహిత సాహిత్యసమితి, కరీంనగర్, 1983.
92. జయగీతి (ప్రబోధగేయాలు) - సత్యనారాయణ, సుంకర,
మాభూమి ప్రచురణలు, విజయవాడ, 1967
93. జయభేరి (ఖండకావ్యము) -వెంకటనర్సయ్య, జాస్తి, &
వెంకటసుబ్రహ్మణ్యం, ధూళిపాళ, సరస్వతీ బుక్‌డిపో, బెజవాడ, 1947
94. జయ్‌హింద్ (జాతీయగీతాలు) -సాంబశివరావు బాబ్జీ, సూరిశెట్టి, 1948
95. జాతీయ గీతము - వెంకటరావు, బాలాంత్రపు,
సం : నారాయణమూర్తి, అయ్యగారి,
ఆంధ్ర ప్రచారిణీ ముద్రాక్షరశాల, నిడదవోలు, 1916.
96. జాతీయ గీతములు -రచయిత పేరు లేదు.
కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ ప్రచురణ.
97. జాతీయ గీతములు -వేంకటశర్మ, మంగిపూడి,
రామ ముద్రాక్షరశాల, ఏలూరు, 1921.
98. జాతీయ గీతములు -సత్యనారాయణ రాజశేఖరం, శిష్ట్లా
గ్రామ సేవా సంఘం, గుంటూరు, 1948.
99. జాతీయ గీతాలు (గేయ సంకలనం)
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1966.

100. జాతీయ గీతాలు (సంకలనం) -సం: రాఘవశర్మ, గురజాడ,
ఆం. ప్ర. సాహిత్య అకాడమీ, హైదరాబాద్, 1973.
101. జాతీయ గేయాలు -భగవంతరావు, మిక్కిలినేని,
దేశి కవితా మండలి, బెజవాడ, 1946.
102. జాతీయ చేనేత గీతావళి -నాగేంద్రకవి, దామర్ల,
ఆంధ్రరాష్ట్ర జాతీయ చేనేత కాంగ్రెస్ వైజ్ఞానిక శాఖ, పేరాల, 1947.
103. జాతీయ దసరా గీతములు -వెంకటనరసయ్య, జాస్తి & వేంకట సుబ్రహ్మణ్యం, ధూళిపాళ, హనుమంతరావు & బ్రదర్సు, చిలుకలూరిపేట, 1949.
104. జాతీయ భారతి -సుబ్బరామశాస్త్రి, పైడిపాటి,
భారతి నికేతన్, విజయవాడ, 1960.
105. జై ఆంధ్ర గేయాలు -పుల్లయ్యారావు, యినమదల, నూజివీడు, 1973.
106. జ్వలితజ్వాల-రామాంజనేయులు, టి.,
ఆం ప్ర. అరసం, గుంటూరుజిల్లా శాఖ, 1976
107. జ్వాలాపథం-సం: కౌముది, మంజు,
ఖమ్మంజిల్లా యువ రచయితల సమాఖ్య, ఖమ్మం. (సంవత్సరం లేదు),
108. డమరుధ్వని (కవితా సంపుటి) - సీరపాణి,
ఏరువాక ప్రచురణలు, మద్రాస్. 1979.
109. తుడుం (ఇంద్రవెల్లిపై కవితా సంకలనం)-విరసం ప్రచురణ, 1981.
110. తుది విజయం - మనది నిజం-రాళోజి, 1968.
111. తెలుగు కవితా సంపుటి-సం: సత్యనారాయణ, విశ్వనాథ
& రజనీకాంతరావు, బాలాంత్రపు,
నేషనల్ బుక్ ట్రస్ట్ ఆఫ్ ఇండియా, కొత్తఢిల్లీ, 1974.
112. తెలుగు గడ్డ-ఆనందకవి, చందోలు,
రామా ముద్రాక్షరశాల, గుంటూరు, 1950.
113. తెలుగు తొలకరి (పాటలు)
విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1953.
114. తెలుగు పూలు - చిరంజీవి,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1977
115. తెలుగుసీమ - బలరామకృష్ణయ్య, దుగ్గిరాల,
మానవాదర్శ గ్రంథమండలి, అంగలూరు, 1932.

116. తెలంగాణా పోరాటగేయాలు (వివిధ కవుల గేయ సంకలనం)
సం: ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1973.

117. తెలంగాణా స్వాతంత్ర్య గీతాలు (పాటలు).
ప్రజాశక్తి ప్రచురణాలయం, బెజవాడ, 1946.

118. త్వమేవాహమ్-ఆరుద్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ 1981.

119. త్రిలింగాణము (జానపద గేయ సంపుటి) - ఊశయ్య గౌడ్, చెరకు & హన్మంతు, గుర్రం (సుద్దాల), గౌడశ్రీ సాహిత్య పరిషత్, నల్గొండ, 1973.

120. దసరాగాంధీ అను కోలాటకీర్తన - సుబ్బారావు గుప్తా, నూకల,

121. దళితగీతాలు - మాష్టారీ, సాహితీ మిత్రమండలి, హైదరాబాద్, 1987.

122. దాశరథి కవిత - దాశరథి, మహాంధ్ర ప్రచురణలు, మద్రాసు, 1977.

123. ధిక్కారస్వరం - ప్రజారచయితల సంఘం, ఖమ్మం, 1987.

124. దేశీయ కీర్తనలు-సుబ్బారావు, టి.వి., విద్యానిలయం, రాజమండ్రి, 1908.

125. దేశం పిలుపు - సం: సరోజిని రేగాని; రామానుజరావు దేవులపల్లి, ఆం. ప్ర. ప్రభుత్వసాంస్కృతిక వ్యవహారాల మంత్రిత్వశాఖ, హైదరాబాద్, 1972.

126. నయా జమానా (గేయ సంపుటి) - శశాంక, వి, కళాకేళి ప్రచురణాలయం, సామర్లకోట, '954.

127. నల్లదొరతనము - ధర్మన్న కవి, కుసుమ, దుర్గాకళామందిరము, బెజవాడ, 1933.

128. నవగీతాలు - వెంకటనరసయ్య, జాస్తి, రామమోహన గ్రంథమాల, విజయవాడ

129. నవీన కావ్య మంజరి-సం: ముద్దుకృష్ణ, ప్రతిమా బుక్స్, మద్రాసు 1959.

130. నవ్యగేయాలు - సుబ్బారావు, సు.భా, జాతిభేద నిర్మూలక మండలి, గుంటూరు, 1953.

131. నా గొడవ - కాళోజి, యువభారతి ప్రచురణ, 1974.

132. నా గొడవ - 2 'పరాభవ వసంతం' - కాళోజి, మిత్రమండలి, హనుమకొండ, 1966.

133. నా గొడవ - 6 'పరాభవ హేమంతం' - కాళోజి, కాళోజి నారాయణరావు, వరంగల్, 1966.

134. నాయకుడెవడు? (1939-40 బెజవాడ జిల్లా కాంగ్రెస్ వర్ణన) - లక్ష్మీకాంతశాస్త్రి, వేదాంతం, 1940.

135. నారాయణరెడ్డి గేయాలు - దాచేపల్లి ప్రచురణలు, 1955.
136. నిజాము రాష్ట్ర ప్రశంస - శేషాద్రి రమణకవులు, నందిగామ, 1924.
137. పాంచజన్యం (వీరరసాత్మక దృశ్యకావ్యము) - సభా, కె., శ్రీరమణా పబ్లిషర్స్, చిత్తూరు, 1963.
138. పారిజాతం - రెడ్డి, వై. సి. వి., కడప, 1978.
139. పెన్నూ గన్నూ పట్టిన ప్రజాకవి పాణిగ్రాహి - సం : రాంబాబు, ఏ., విప్లవ రచయితల సంఘం, 1982.
140. పెన్నేటి పాట (కావ్యం) - విద్వాన్ విశ్వం, యం. శేషాచలం అండ్ కో, మద్రాసు, 1956.
141. ఫేసిస్టు ప్రతికూల గీతాలు - ప్రజాశక్తి కార్యాలయం, బెజవాడ.
142. ప్రగతి గీతాలు - సమాచార పౌర సంబంధముల శాఖ, ఆం.ప్ర; 1961.
143. ప్రజారాజ్యం - పురుషోత్తం, గుముడవెల్లి, యువసాహితి, వరంగల్, 1978.
144. ప్రతిఘటించు (గేయాలు) - రామకృష్ణ, అంబేద్కర్ విజ్ఞానవాహిని, అనంతపురం, 1979.
145. ప్రతిధ్వని (ఆం.ప్ర. ప్రజానాట్యమండలి పాటలు)-సం: ప్రతాపరెడ్డి, కె, ప్రజానాట్య మండలి, హైదరాబాద్, 1981 & 1983.
146. ప్రత్యేకాంధ్ర పోరాటం (గేయమాలిక)-సం: నాగేశ్వరరావు, వల్లభనేని, ప్రత్యేకాంధ్ర ప్రచార సంఘం, విజయవాడ, 1973.
147. ప్రాణం - అదృష్టదీపక్, ఆం. ప్ర. అరసం, తూర్పుగోదావరి జిల్లా శాఖ, 1978.
148. బంగ్లాదేశ్ (కవితాస్పందన) - సమీకర్త : ఎస్. కె., వరంగల్, 1971.
149. బంగ్లాదేశ్ గీతాంజలి - వికాస సాహితి, మద్రాస్, 1971.
150. బతుకుపాట - బిగుళ్ళ, అభ్యుదయ రచయితల సంఘం, హైదరాబాద్, 1977.
151. బసవరాజు అప్పారావు గీతాలు - అప్పారావు, బసవరాజు, ప్రచురణకర్తలు తెలియలేదు - 1934.
152. భావ తరంగాలు - లక్ష్మీనారాయణ, పున్నవ, సారస్వత నికేతనమ్, వేటపాలెం, 1940.
153. భావన (కవితా సంకలనం) - సాంస్కృతీ సమాఖ్య, బాపట్ల, 1984.
154. భూపాల్ పాటలు - యుగ ప్రచురణలు, హైదరాబాద్, 1979.

155. భూమి భాగోతం (నృత్య నాటకం) - ప్రసాదరావు, వంగపండు,
మిత్రసాహితి, విశాఖపట్నం, 1978.
156. మంచుమంట - విజయలక్ష్మి,
కృష్ణాజిల్లా యువజన సమాఖ్య, విజయవాడ, 1974
157. మఖ్దూం కవిత - విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1970
158. మద్యపాన నిషేధ కీర్తనలు - వెంకయ్య, నీలం,
వాల్మీకాశ్రమము, ఏలూరు, 1930
159. మణిమకుటము (నవ్యాంధ్ర కవితా సంకలనం)
(ప్రథమ భాగము : 1860-1909)
-సం: పూభా, శోభా ప్రచురణలు, విజయనగరం, 1961
160. మన పాటలు (పాటల సంకలనం) - సం: విఠల్, ఎ.పి.,
ఆంధ్ర ప్రజానాట్యమండలి, విజయవాడ, 1983
161. మల్లారెడ్డి గేయాలు - మల్లారెడ్డి, గజ్జెల,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1961
162. మహాకవికి కవితాంజలి - (శ్రీశ్రీపై స్మృతి కవితలు)
ప్రతులకు: రాంబాబు, ఏ; సాహితీ మిత్రులు, విజయనగరం, 19౮౪
173. మహాప్రస్థానం - శ్రీశ్రీ,
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1970
164. మహాసంకల్పం (1940-1975) - సం : రామమోహనరావు, నండూరి,
& శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి; చైతన్యభారతి, విజయవాడ, 1975
165. మహోగ్రతాపం (గీతాలు) (మహాప్రస్థానం గీతాలకు పేరడీలు)
- కాట్రగడ్డ; కవితాజ్వాల పబ్లికేషన్స్, ఏలూరు, 1987
166. 'మా కొద్దు ఈ కల్లు సారా' (కీర్తనలు) - చినవెంకయ్య, నక్కా
167. మాతృదేశ సంకీర్తనము (గీతికలు) - వెంకటరావు, కవికొండల,
అభినవాంధ్ర కార్యస్థానము, 1939
168. మానవతా గీతాలు - నాగేశ్వరరావ్, వల్లంపట్ల,
మానవతా ఆర్ట్స్, వరంగల్ 1982.
169. మేడే విప్లవ గీతాలు - సం: రామచంద్రయ్య, రెబ్బా,
ప్రజా బుక్ స్టాల్, కోదాడ, 1982.
170. మోతీలాల్జీ నిర్యాణము (పద్యకావ్యము) - నాగేశ్వరరావు, కర్ణపీర.
171. యుగ సంగీతం - పైగంబరులు, జి యస్ కె. ప్రెస్, విజయవాడ 1970.

172. యుద్ధభేరి (పాటల సంకలనం) - ప్రభాత సాహితీ ప్రచురణలు, ఖమ్మం, 1984.
173. యువకవిత (అభ్యుదయ గేయ సంకలనం)-సం: అనిసెట్టి, సోమసుందర్; ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం, మద్రాసు, 1974.
174. రణన్నినాదమ్ (విప్లవ గేయ సంపుటి) - సం : ఆం ప్ర. కమ్యూనిస్టు సమితి సాంస్కృతిక ఉపసంఘం, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1975.
175. రాష్ట్రగీత - కోటినరసింహము, చదలవాడ; నిడుబ్రోలు, 1948.
176. రాష్ట్రపతి సుభాస్ చంద్రబోస్‌గారి జీవిత చరిత్ర - సుబ్బారావు గుప్తా, నూకల; శ్రీ పాండురంగ ప్రెస్, చీరాల, 1939.
177. రైతుకూలీ విజయం (ఒగ్గుకథ) - జననాట్యమండలి, క్రాంతి ప్రచురణలు, సికింద్రాబాద్, 1981.
178. రైతు పోరాట గీతాలు - సం: వెంకట్రామయ్య, తుమ్మల, కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం, విజయవాడ, 1979.
179. రైతు భజనావళి - సం: రంగనాయకులు, గోగినేని, 1934.
180. రైతు భజనావళి - సం: రంగనాయకులు, గోగినేని, ఆంధ్ర రాష్ట్ర రైతు కాంగ్రెస్, విజయవాడ 1949.
181. 'వందేమాతరం' స్వాతంత్ర్యోద్యమ చరిత్ర (1860-1906) - వీరభద్రమూర్తి, మువిగొండ, 1977.
182. వజ్రాయుధం - సోమసుందర్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్, 1986.
183. వర్గీస్ పాటలు - యుగ ప్రచురణలు, 1981.
184. విజయ గీతావళి - రేడియో, సమాచార మంత్రిత్వశాఖ, భారత ప్రభుత్వం, 1964.
185. విజయ భారతి - సుబ్బరామశాస్త్రి, పైడిపాటి, భారతీ నికేతన్, విజయవాడ, 1959.
186. విజయాంధ్ర - పుండరీకాక్షుడు, దామరాజు, శ్రీ స్వరాజ్య సోపానం, గుంటూరు, 1954.
187. విద్యార్థి ఉద్యమ చరిత్రలో నెత్తుటి చేవ్రాలు (కా॥ చేరాలు స్మృతిగీతాలు) ప్రగతిశీల విద్యార్థి సంఘం, వరంగల్ జిల్లా కమిటీ, 1986.
188. విద్యార్థుల వీరగేయాలు - భగవంతరావు, మిక్కిలినేని, దేశి కవితామండలి, బెజవాడ, 1947.

189. విప్లవ గీతాలు - ప్రొలిటేరియన్ లైన్ ప్రచురణలు, హైదరాబాదు, 1982.
190. విప్లవ జ్వాల - రంగకవి, జానకీరామ ప్రెస్, తెనాలి, 1948.
191. విప్లవ యోధుడు (నీలం రామచంద్రయ్య జీవిత చరిత్ర)
-వెంకటేశ్వరరావు,కానూరి,అరుణోదయ సాంస్కృతిక సంస్థ ప్రచురణ.
192. విప్లవశంఖం, జై తెలంగాణ గీతాలు - 'ఎవరో',
తెలంగాణ విద్యార్థి ప్రచురణ, హైదరాబాద్, 1969.
193. విప్లవాన్ని ఆహ్వానించు - తాయారు, యలమంచి,
అభ్యుదయ రచయితల సంఘం, కడప.
194. విప్లవాల జ్ఞాని (పాటలు, కవితలు)
- విప్లవ రచయితల సంఘం, వరంగల్, 1981.
195. విముక్తి - గోపాలక్రిష్ణ, రామోజు, 1971
196. విశాల విశ్వము (నూఱు గీతికలు) - వెంకటరావు, కవికొండల
అభినవాంధ్ర కార్యస్థానము, 1952.
197. వీరగీతి-నాగగోపాలరావు. అద్దేపల్లి, పద్మా ప్రచురణలు, ఏలూరు, 1961.
198. వీరపూజ (రక్షణ ప్రచార గీతాలు) - నదీరా,
గౌరీశంకర బుక్‌డిపో, కర్నూల్.
199 వెండి వెన్నెల (ఆం ప్ర. అవతరణ రజతోత్సవ కవితా సంపుటి)
-సేకరణ : రఘురామ్, మద్దాళి; కిన్నెర పబ్లికేషన్స్, హైదరాబాద్, 1980.
200. వెలుగురేఖలు (చైతన్య కవితా సంపుటి) - బల్రాజ్, తక్కెళ్ళ,
చైతన్య సాహితి, వరంగల్, 1974.
201. వెలుగు వెల్లువ (అఖిల భారత యువకవుల తొలి తెలుగు కవితా సంకలనం) - సం : వెంకట కిషన్‌రావు, కంచనపల్లి; అస్సాం, 1974.
202. వేగుచుక్క (జనశక్తి పాటల సంకలనం)
జనశక్తి ప్రచురణలు, గుంటూరు, 1981.
203. వైతాళికులు - సం : ముద్దుకృష్ణ,
విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1973.
204. వ్లదిమిర్ ఇల్యిచ్ లెనిన్ (కావ్యం) - మయకోవ్‌స్కీ, వ్లదీమీర్,
అనువాదం : శ్రీశ్రీ, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో 1979.
205. శంఖారావం - మల్లారెడ్డి, గజ్జెల,
విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్, విజయవాడ, 1968.
206. శంఖారావం (నృత్య నాటిక) - గోపాలకృష్ణయ్య, కోగంటి,
ఆం ప్ర. ప్రజానాట్యమండలి, కృష్ణా జిల్లాశాఖ, 1982.

207. శంఖారావం (విప్లవ గేయాల సంకలనం) - సోషలిస్టు పబ్లికేషన్స్, గుంటూరు, 1972.
208. శశ విషాణం (గీతాలు) - కృష్ణమూర్తి, రాంభట్ల, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1954.
209. శాంతిగీతాలు - ఆంధ్ర శాంతి సంఘం, విజయవాడ, 1950.
210. శివాలయ్య (వీరంగ నృత్య రూపకం) - ప్రసాద్, ఏటుకూరి, ఆం ప్ర. యువజన సమాఖ్య, హైదరాబాద్, 1975.
211. శిక్షించాలంటున్నా - నెరూడా, పాబ్లో; అనువాదం : కె.రా., అం.ప్ర. అభ్యుదయ రచయితల సంఘం. కృష్ణాజిల్లా శాఖ, 1973.
212. శ్రమజ్వాలలు (గేయ సంపుటి) - వెంకటయ్య, ఆర్ & సామ్యూయేల్, జల్లెం, అం. ప్ర అభ్యుదయ రచయితల సంఘం & విశాలాంధ్ర పాఠకుల సంఘం, కొత్తగూడెం, 1959
213. సంపూర్ణ స్వరాజ్య తత్వమ్ (గేయం) - వెంకటరామశర్మ, నెమ్మాని, శ్యామలా ముద్రాక్షరశాల, గుడివాడ, 1941.
214. సమరగీతి (కవితా సంకలనం) - సమీకర్త : నరసింహారెడ్డి, వే, చైతన్య సాహితి, హైదరాబాదు, 1963.
215. సమైక్యవాణి (సమైక్యాంధ్ర గీతాలు) ఆం.ప్ర. అభ్యుదయ తచయితల సంఘం, విజయవాడ, 1973.
216. సర్పయాగం - రెంటాల; సం : అవసరాల, నవోదయ పబ్లిషర్స్, విజయవాడ, 1957.
217. సాహితీ మహోదయం - సూరి, తెన్నేటి, సం : మైత్రేయ, శ్రీ విజయకృష్ణా పబ్లికేషన్స్, విజయవాడ, 1935.
218. సింగరేణి పాటలు - సం. జాతశ్రీ, సింగరేణి కాలరీస్ వర్కర్స్ యూనియన్, ఇల్లెందు బ్రాంచి, 1981.
219. సుద్దాల హనుమంతు పాటలు - సం: తిరుమలరావు, జయధీర్, సాహితీ సర్కిల్, హైదరాబాద్, 1988.
220. సుద్దాల హనుమంతు పాటలు - సం: ప్రతాపరెడ్డి, కె, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1983
221. సూతాశ్రమ గీతాలు - రామస్వామి చౌదరి, త్రిపురనేని, సూతాశ్రమం, తెనాలి, 1930
222. స్త్రీ (కవితా సంకలనం) - సం: జాతశ్రీ, అభ్యుదయ రచయితల సంఘం, ఖమ్మం జిల్లా, 1991.

223. స్నేహగీతి - మురారి, శారద ప్రచురణలు, గుంటూరు 1984.
224. స్పృహ (కవితా సంకలనం)
ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం, 1975.
225. స్వతంత్ర పోరాటము - అబ్బరాజు శర్మ, 1945.
226. స్వరాజ్య కవితా మాధురి (బాలసాహిత్యం)
- స్వరాజ్యలక్ష్మి, అడుసుమిల్లి; గుడివాడ.
227. స్వరాజ్య గీతములు - సత్యనారాయణ, గరిమెళ్ళ,
ఇండియా యేజంసీ బీరో, మదరాసు, 19 1.
228. స్వరాజ్య గీతామృతము - సీతారామాంజనేయులు, వడ్డాది, &
కాశీ విశ్వనాథశాస్త్రి, పూడిపెద్ది; యు.ఎన్. ప్రెస్, రాజమండ్రి, 1921.
229. స్వరాజ్య ఢంక - కోటేశ్వరరావు, బద్దిరెడ్డి,
శ్రీరామ ప్రింటింగు వర్క్సు, బెజవాడ, 1931.
230. స్వరాజ్య తత్వము - రచయిత పేరు లేదు,
కాకినాడ ముద్రాక్షరశాల, కాకినాడ.
231. స్వరాజ్య భజన కీర్తనలు - (రచయితల పేర్లు లేవు),
హితకారి ప్రెస్, ఏలూరు, (సంవత్సరం లేదు. ముప్పయిల్లోనే వచ్చి ఉంటుంది).
232. స్వరాజ్య రథము - కోటేశ్వరరావు, బద్దిరెడ్డి,
(సంవత్సరం దొరకలేదు. పై అట్టలు శిథిలం).
233. స్వేచ్ఛాపథం (గేయ సంకలనం) - సంకలన సహాయకులు : నరసింహారావు, కోగంటి; విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1961.
234. హరిజన కీర్తనలు - చిన వెంకయ్య, నక్కా,
హరిజన సంఘ సేవకుడు, 1935.
235. హరిజనుల పాటలు - సత్యనారాయణ, గరిమెళ్ళ, మైలాపూరు, 1933.
236. హేతువాద గీతాలు - హేతువాద సంఘం, సూర్యాపేట.

